# శ్రీవిద్యా బ్రహ్మసూత్ర భాష్యము

శ్రీవిద్యా సంప్రదాయంలో పరాశక్తియే
పరబ్రహ్మ స్వరూపమని నిరూపణ చేస్తూ
వ్రాసిన మొదటి బ్రహ్మసూత్రభాష్యము



స్వామి పరమానందనాథ


శ్రీ గణపతి సచ్చిదానందప్రశస్తి అవార్డు గ్రహీత
విశిష్ఠ విద్యా శిరోమణి
ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు
అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా
ఆస్థాన విద్వాంసులు, చతుర్వేద భాష్యకారులు
(డా॥ క్రోవి పార్థసారథి)

# శ్రీవిద్యా బ్రహ్మసూత్ర భాష్యము

ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు
**(స్వామి పరమానందనాథ)**

ద్వితీయ ముద్రణ : ఆగష్టు 2017

ప్రతులు : 1000



**వెల : రూ. 350-00**

ప్రతులకు :

1. **క్రోవి పార్థసారథి**
   23-11/1-10/2, ఓగిరాలవీధి,
   సత్యనారాయణపురం, విజయవాడ-11.
   ఫోన్ : 0866-2530672, 9866820574

2. **శివకామేశ్వరి ఆర్ష గ్రంథమాల**
   27-18-59, కాంగ్రెస్ ఆఫీస్ రోడ్డు,
   గవర్నర్‌పేట, విజయవాడ-520 002.
   ఫోన్ : 0866-6661777, 2522824

ముద్రణ :
నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
గాంధీనగర్, విజయవాడ-3.

# శ్రీవిద్యా సంప్రదాయంలో

# పరాశక్తియే

# పరబ్రహ్మ స్వరూపమని

# నిరూపణ చేస్తూ

# వ్రాసిన మొదటి

# బ్రహ్మసూత్రభాష్యము

# ప్రశంస

‘సహజ పాండిత్య’ ‘తర్కకోవిద’ ‘విద్యావిభూషణ’ ‘తత్త్వశాస్త్ర పారంగత’

**శ్రీ గరిమెళ్ళ అచ్యుత సత్యశేషగిరి సోమయాజులు శర్మ,**

యం.ఎ., (సంస్కృతము), యం.ఎ., (తెలుఁగు) యం.ఎ., (దర్శనములు)

పుష్పగిరి మహాసంస్థాన విద్వాంసులు

ఓం

శ్రీరామచంద్రాయ నమః

**అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాలఁబె**
**ద్దమ్మ సురారులమ్మ కడుపాఱడి పుచ్చినయమ్మ తన్నులో**
**నమ్మిన వేల్పుటమ్మల మనంబులనుండెడి యమ్మదుర్గమా**
**యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్.**

శ్రీవిద్యాబ్రహ్మ సూత్ర భాష్యమును రచించినవారు స్వామి పరమానంద నాథులు (డా॥ క్రోవి పార్థసారథి గారు) వీరు నా చిరకాల మిత్రులు. గ్రంథ రచనలో నెక్కువ పట్టుదల గలవారు. శ్రీవిద్యా సంప్రదాయములో మిక్కిలి కృషి చేసినవారు. బహుగ్రంథకర్తలు. వివిధ విషయములలో సుమారు 40 గ్రంథములు రచించి తెలుఁగు పాఠకుల కందించిన మహానుభావులు.

వీరు బ్రహ్మసూత్రముల ననుసరించి యింతకు ముందే రెండు గ్రంథములు వెలువరించిరి. ఇప్పుడు పాఠకుల కరకమలముల నలంకరించినది మూఁడవ గ్రంథము.

**1. బ్రహ్మసూత్రాలు :**

ఈ గ్రంథము 2002లో రచింపఁబడినది. బ్రహ్మసూత్రములకు సంగ్రహ వ్యాఖ్యానము. గురుశిష్య సంవాద రూపము. భాష సరళ వ్యావహారికము. దీనిలో ననవసర చర్చలు లేక విషయమంతయు సంక్షిప్తముగా నిరూపించుటచే నారంభ విద్యార్థులకుపయుక్తమైనది.

**2. బ్రహ్మసూత్ర భాష్యము :**

ఇది 2015లో రచింపఁబడినది. శ్రీశంకర భగవత్పాదుల భాష్యములోని విషయములన్నియు సంగ్రహముగా నిరూపింపఁబడినవి. సులభమైన భాష. మధ్యమాధికారుల కెక్కువగా ఉపయోగపడు గ్రంథము.

దీనిని మణిద్వీప మహాసంస్థానము, పెనుశిలకోన వారు ప్రచురించిరి.

**3. శ్రీవిద్యాబ్రహ్మసూత్ర భాష్యము**

దీనిని ఆధ్యాత్మిక పరిశోధన, శిక్షణ, ప్రయోగాత్మక సేవా సమితి, హైదరాబాద్ వారు ప్రచురించింది.

ఇది యుత్తమాధికారుల నుద్దేశించి వ్రాసిన గ్రంథము. బ్రహ్మసూత్రములపై ఇంతవరకు వెలువడిన భాష్యములను గూర్చి మేళ్ళచెరువు వారి బ్రహ్మసూత్రానుభాష్యానువాదమునకు నేను వ్రాసిన పీఠిక యగు వేదాంత దర్శనములో నిట్లు చెప్పితిని.

బ్రహ్మసూత్ర భాష్యములు

1. శంకర భగవత్పాదులు (క్రీ.పూ. 509-477) – అద్వైతము
2. భాస్కరాచార్యులు (క్రీ.శ. 800) – భేదాభేదము
3. రామానుజాచార్యులు (క్రీ.శ. 1100) – విష్ణు విశిష్టాద్వైతము
4. మధ్వాచార్యులు (క్రీ.శ. 1200) – ద్వైతము
5. నింబార్కాచార్యులు (క్రీ.శ. 1200) – ద్వైతాద్వైతము
6. శ్రీకంఠారాధ్యపాదులు (క్రీ.శ. 1300) – శివవిశిష్టాద్వైతము
7. శ్రీపతి పండితాచార్యులు (క్రీ.శ. 1400) – శక్తివిశిష్టాద్వైతము
8. వల్లభాచార్యులు (క్రీ.శ. 1500) శుద్ధాద్వైతము
9. విజ్ఞానభిక్షువులు (క్రీ.శ. 1600) – అవిభాగాద్వైతము

10. బలదేవవిద్యాభూషణులు (క్రీ.శ. 1725) - అచింత్యభేదాభేదము

11. పంచాననతర్క రత్నాచార్యులు (క్రీ.శ. 1800) శక్త్యద్వైతము

12. రఘువరదాసు (క్రీ.శ.1900)-ఆనంద భాష్యము-శ్రీరామ పారమ్యము.

13. పరమానందనాథులు (క్రీ.శ.2016) శ్రీవిద్యాపరమైన అద్వైతము.

వీరిలో శంకర భగవత్పాదులు, భాస్కరాచార్యులు, విజ్ఞాన భిక్షువులు బ్రహ్మవాదులు, రామానుజులు, మధ్వాచార్యులు - విష్ణువాదులు. నింబార్క, వల్లభ, బలదేవాచార్యులు - కృష్ణవాదులు. రఘువరదాసు - రామవాది. శ్రీకంఠారాధ్యపాదులు, శ్రీపతి పండితాచార్యులు - శివవాదులు. పంచాననతర్క రత్న పండితులు - శక్తివాదులు. ఇవి కాక **లక్ష్మీవిశిష్టాద్వైత భాష్యము** కూడ నున్నట్లు శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గారు చెప్పుచున్నారు. నాకు లభింపలేదు. రాధావల్లభ భాష్యము కూడ నున్నట్లు శ్రీ గోపీనాథ కవిరాజు చెప్పినారు. దీని కర్త **'రేవా' పండితుఁడఁట.** ఇది యింతవఱకు ముద్రింపఁబడలేదు.

వీనిలో శంకర భాష్యమునకున్న ప్రచుర ప్రచారము మరియే భాష్యమునకును లేదు. తక్కిన భాష్యముల నాయా సంప్రదాయస్థులే పఠింతురు. శ్రీశంకర భాష్యమట్టిది కాదు. ప్రపంచము నందలి సర్వ మేధావుల నాకర్షించినది. సకల శాస్త్ర నిష్ణాతులు, సర్వదర్శన పండితులు వేదాంత భాష్యమనగా శ్రీశంకర భాష్యమే యని ముక్తకంఠముతో అంగీకరించు చున్నారు. అధ్యాత్మ రామాయణము, యోగవాసిష్ఠము, పరమార్థసారము వంటి గ్రంథములు అద్వైతమునకే అనుకూలములు. అద్వైత వేదాంతములో వేలకొలది గ్రంథములు వెలసినవి. భాస్కర, శ్రీపతి పండిత, విజ్ఞానభిక్షు, పంచాననతర్క రత్న, రఘువరదాసుల కనుయాయులే లేరు. విష్ణుపారమ్యమును, శివపారమ్యమును నిరూపించిన గ్రంథములనేకములు గలవు. శక్తి పారమ్యమును నిరూపించిన గ్రంథము శక్తి భాష్యమొక్కటి మాత్రమే.

అగస్త్య మహర్షి శక్తిసూత్రములను రచించెనని చెప్పుదురు. ఇది నేడు లభింపదు. దుర్గాసప్తశతి, దేవీ భాగవతము వంటివి పరాశక్తి మహిమనెన్ను సంప్రదాయ గ్రంథములు. మాలినీ విజయము, స్వచ్ఛంద తంత్రము, పరాత్రింశిక, త్రిపురారహస్యము, యోగినీ హృదయము, సేతుబంధము, మాతృకాచక్ర వివేకము, కామకలావిలాసము, వరివస్యా రహస్యము, తంత్రరాజతంత్రము, ప్రపంచసారము మొదలైనవి శాక్తేయమునకు మూల గ్రంథములు. లలితా సహస్ర నామము, సుభగోదయస్తుతి, సౌందర్యలహరి, హృదయామృతము మొదలగునవి స్తోత్ర గ్రంథములు. వీని యందలి విషయమే శక్తి భాష్యములో సిద్ధాంతముగా శ్రీపార్థసారథి గారికి గొట్టిన పిండి, ఆ పాండిత్య శౌండీర్యము తోడనే శ్రీవిద్యాభాష్యమును రచింపఁ గలిగినారు.

## శక్తిభాష్యము-శ్రీవిద్యాభాష్యము

పంచానన పండితుల శక్తి భాష్యమునకు, శ్రీపార్థసారథి గారి శ్రీవిద్యా భాష్యమునకు కొన్ని సామ్యములు, ప్రధానమైన కొన్ని భేదములు గలవు. ఈ రెండు భాష్యములకు శ్రీపరాశక్తి పారమ్యమును నిరూపించుటే ప్రధాన లక్ష్యము. శక్తి ప్రసాదము వల్లనే భోగమోక్షములు లభించునని రెండును చెప్పుచున్నవి.

శ్రీశంకర భగవత్పాదులు పూర్వోత్తర మీమాంసలు భిన్న శాస్త్రములని ప్రతిపాదించినారు. శక్తి భాష్యము రెండు మీమాంసలకు ఏకశాస్త్రత్వము నంగీకరించినది. శ్రీశంకరులు వివర్తవాదమును ప్రతిపాదించినారు. శక్తి భాష్యము వివర్తవాదము నంగీకరింపలేదు. ఈ విధముగా పంచానన భాష్యము విశిష్టాద్వైత సిద్ధాంతములను మరల ప్రవేశపెట్టినది.

శ్రీ పార్థసారథి గారు శక్తి పారమ్యమును ప్రతిపాదించినను శ్రీ శంకరాద్వైతమునే ప్రధానముగా గ్రహించిరి. శ్రీ శంకర భాష్యమునందు

వలెనే శ్రీవిద్యాభాష్యములోఁ గూడ అధికరణములన్నియు సమానముగా ఉన్నవి.

శ్రీశంకరాచార్యులు పరబ్రహ్మమొక్కటి మాత్రమే నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావమని నిర్ణయించిరి. శ్రీ పార్థసారథి గారు పరాశక్తియే పరబ్రహ్మమని నిరూపించిరి. **ఆ పరాశక్తి పోతనగారు చెప్పిన 'ముగురమ్మల మూలపుటమ్మయే.** ముగురమ్మలనగా మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులు, శ్రీచక్రార్చనము, శ్రీవిద్యా పద్ధతులు దీనిలోఁ బుష్కలముగా కలవు. ముక్తి మోక్షముల తారతమ్యము చక్కగా వివరింపఁబడినది.

శ్రీ శంకర భగవత్పాదులు అద్వైతపరంగా బ్రహ్మసూత్రాలు వ్యాఖ్యానించిరి. దీనికి వెనుక శ్రీ గౌడపాదాచార్యుల వారు, శ్రీ గోవింద భగవత్పాదాచార్యుల వారు ఉన్నారు. భగవద్రామానుజులు విశిష్టాద్వైతపరంగా శ్రీభాష్యము రచించిరి. వీరు ప్రతిపాదించిన సిద్ధాంతముల వెనుక శ్రీనాదముని, శ్రీయామునాచార్యులు వేసిన పునాదులు కలవు. శ్రీమధ్వాచార్యులు ద్వైతపరంగా ప్రస్థానత్రయమను భాష్యము రచించిరి. దీని వెనుక ఎవరూ అండగా లేరు. ద్వైత మత స్థాపన శ్రీమధ్వాచార్యులతోనే ఆరంభమయినది. అట్లే పరమానందనాథులు రచించిన శ్రీవిద్యాబ్రహ్మ సూత్ర భాష్యములోని సిద్ధాంతములన్నియు వీరి స్వోపజ్ఞములే కాని ప్రాచీనులు ప్రతిపాదించినవి కావు. వీరే స్వయంకృషితో వేదాంత గ్రంథములను, శ్రీవిద్యా ప్రతిపాదకములగు మంత్రశాస్త్రములను మథించి ఈ భాష్యమును నిర్మించినారు. ఇది ఈ గ్రంథము యొక్క వైశిష్ట్యము. ఈ పద్ధతిలో ఉన్న భాష్యములలో ఇదే మొదటిది.

సాంఖ్యులు, యోగులు 25 తత్త్వములను చెప్పినట్లే వీరు లలితామాత మణిద్వీపమునకు 25 ప్రాకారములు చెప్పినారు. ఉపనిషద్వాక్యములు వచ్చిన చోట వాటికి సంబంధించిన కథలు సుందరశైలిలో వివరించినారు. ఇట్టి విశేషములెన్నియో దీనిలో గలవు. శ్రీపార్థసారథి గారు **'వేదాంత విద్యాసారథి'**

అను ప్రకరణ గ్రంథమును కూడ రచించిన పండితులు. **శ్రీశంకరాద్వైతములో శ్రీవిద్యా సంప్రదాయమును జోడించి పరాశక్తియే పరబ్రహ్మమని నిరూపించిన మొట్టమొదటి సూత్రభాష్యమిదియే.** ఇట్టి ఉత్తమ గ్రంథము సంస్కృత, హిందీ, ఆంగ్లాది భాషలలోని కనువదింపఁబడి ప్రపంచ వ్యాప్తి పొందుఁగాక. ఇట్లే యితోఽధికముగా గ్రంథములను రచింపగల శక్తి సామర్థ్యములను, ఆయురారోగ్యములను శ్రీమాత యనుగ్రహించుఁగాక యని వేడుకొనుచు శ్రీపార్థసారథి గారి నిర్విరామ గ్రంథ రచనాకృషిని సర్వదా సర్వథా ప్రశంసించుచున్నాను.

ఇది శ్రీ పార్థసారథిగారు కృష్ణా పుష్కరముల సందర్భముగా ఆంధ్ర పాఠకులకందించిన దివ్యోపాయనము.

**దుర్గాందేవీగ్ం శరణమహం ప్రపద్యే**

శ్రీ పరమేశ్వరార్పణమస్తు

ఇట్లు

సకల సుకవి బుధజనవిధేయుఁడు

**గరిమెళ్ళ సోమయాజుల శర్మ**

విజయవాడ

శ్రీ దుర్ముఖినామ సంవత్సర

శ్రావణ శుద్ధ షష్ఠి, మంగళవారము

9-8-2016

అవధూత దత్తపీఠాధిపతి జగద్గురు పరమపూజ్య

## శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామిజీ వారి

# ఆశీస్సందేశము

ది. 27-07-2016

మైసూరు

శ్రీమాత్రే నమః

**'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా'**

ఉపాసకుల సౌకర్యం కోసం నిరాకారమైన, నిర్గుణమైన బ్రహ్మతత్త్వము సాకారంగానూ, నిరాకారంగానూ భాసిస్తుంది.

పరాభట్టారిక చిదగ్ని నుండి ఆవిర్భవించి సాకారరూపాన్ని ధరించింది. సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములనే పంచకృత్యాలను నిర్వహిస్తోంది. రాగము, ద్వేషము, క్రోధము, మనస్సులను ఆయుధాలుగా ధరించి ఉంది ధర్మార్థ కామమోక్షాలనే నాలుగు పురుషార్థాలను ప్రసాదిస్తోంది.

అటువంటి తల్లిని **'ప్రథమం సగుణ మాశ్రిత్య తతో నిర్గుణ మాశ్రయేత్'** అని శ్రీశంకర భగవత్పాదాచార్య స్వామివారి వాణి.

మా దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు క్రోవి పార్థసారథి గారు సరిగ్గా ఈ మార్గంలోనే నడుస్తున్నారు. వారికి అమ్మవారే జపము, తపము, ధ్యానము. అమ్మవారే లోకము. జగన్మాతపై పలు పరిశోధనలు, పరిశ్రమలు కావించి, రహస్యాలనెన్నిటినో పుస్తక రూపంలో ప్రకటన చేశారు.

ప్రస్తుతం ఉపనిషత్తులను, బ్రహ్మసూత్ర భాష్యాన్ని ఆధారంగా చేసుకొని, బ్రహ్మవిచారము కావిస్తూ పరమేశ్వరియే పరబ్రహ్మ అని నిరూపణ చేసే సాధన చేశారు. ఆ కృషి ఫలంగానే **'శ్రీవిద్యా బ్రహ్మసూత్రభాష్యము'** అనే గ్రంథం అవతరించింది.

శాక్తేయ గ్రంథాలలోని మూల రహస్యాలతో బ్రహ్మసూత్రాలను పరిశోధిస్తూ సందర్భానుసారంగా అమ్మ నామాలను ఉటంకిస్తూ సత్యాన్వేషణను చేశారు. చాలా సంతోషం. జ్ఞానతత్పరులైన వారందరికీ ఈ గ్రంథం ఎంతో ఉపకరించుగాక !

చిన్మాత్ర స్పందన శక్తితో శివశక్తుల సమైక్యతత్త్వం అవగతమవుతుందని వాశిష్ఠ రామాయణం తెలుపుతోంది. పార్థసారథి గారికి ఆ భాగ్యం కలుగుగాక! అని ఆశీర్వదిస్తూ...

జయగురుదత్త

మీ

**స్వామిజీ**

పరమహంస, పరి(వ్రాజకాచార్య, జగద్గురు

**శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి**

**సిద్ధేశ్వరీ పీఠాధిపతి - కుర్తాళం**

ఆఫీస్ : మౌనస్వామి మఠము, కుర్తాళము - 627 802, తిరునెల్వేలి జిల్లా
తమిళనాడు. ఫోన్ : 04633-283707.
క్యాంప్ ఆఫీస్ : స్వయం సిద్ధకాళీ పీఠము, 4వ లైన్, రవీంద్ర నగర్,
గుంటూరు - 522 006. (ఎ.పి.), ఫోన్ : 9440208103

## ఆశీర్వాద శ్రీముఖము

శ్రీ క్రోవి పార్థసారథి గారు అనేక గ్రంథములు రచించి వాఙ్మయ ప్రపంచములో ఉన్నత స్థానాన్ని సంపాదించిన పండిత వరేణ్యులు. బ్రహ్మ సూత్రములకు ఇదివరకే విశిష్టమైన వ్యాఖ్యానాన్ని రచించి యున్నవారు. ఇప్పుడు వానికే శ్రీవిద్యా సంప్రదాయపరమైన భాష్యం రచించి సరిక్రొత్త రూపకల్పన చేశారు. లలితా సహస్ర నామములకు, సౌందర్యలహరికి అద్వైతపరమైన వ్యాఖ్యలు వచ్చినవి గాని బ్రహ్మసూత్రములకు ఇటువంటి పరమార్థం భావించటం అసామాన్యమైన సంగతి. మహామాయ, పరబ్రహ్మ మహిషి అని శంకరులవారు వర్ణించిన శ్రీదేవి ఇచ్ఛవల్లనే యిటువంటివి జరుగుతూ ఉంటుంది. ఆ లలితా పరబ్రహ్మము పార్థసారథి గారిని మరింతగా అనుగ్రహించును గాక !

నారాయణ స్మరణతో

**సిద్ధేశ్వరానంద భారతీ స్వామి**

*With the Divine Blessings of His Holiness*

## JAGADGURU SANKARACHARYA

## SRI SRI SRI SWAROOPANANDENDRA SARASWATI MAHASWAMY

## VISAKHA SRI SARADA PEETHAM

తేది : 5-7-2016

క్యాంప్, ఋషికేశ్

పరమహంస పరివ్రాజకచార్య జగద్గురు శంకరాచార్య విశాఖ శ్రీ శారదా పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ స్వరూపానందేంద్ర సరస్వతీ మహాస్వామివారి దివ్య మంగళాశీస్సులతో....

తమరు పంపిన గ్రంథమును శ్రీచరణులకు నివేదించినాము వారు ఈ విధంగా మమ్ములను ఆదేశించినారు.

బ్రహ్మసూత్రములు నిజానికి నిర్గుణమైన నామ రూపములు లేని పరబ్రహ్మను ఉపదేశించి తెలుపబడినవి. జగద్గురు ఆది శంకరాచార్యులు వారు కూడా ఈ విషయమునే ప్రతిపాదించి యున్నారు. అయితే "ఉపాసకానాం సౌకర్యార్థం" అని ఋషులు తెలిపినట్లుగా ఆ పరబ్రహ్మమునే శాక్తేయులు పరదేవత అని, శైవులు పరమేశ్వరుడని, వైష్ణవులు పరవాసుదేవుడుని భావన చేస్తారు.

డా॥ క్రోవి పార్థసారథి శ్రీవిద్యా దృష్టితో ఈ బ్రహ్మసూత్రములను భావన చేసి "శ్రీవిద్యా బ్రహ్మసూత్ర భాష్యము" అనే పేరుతో ప్రకటించటం ఆనందకరము వారికి మా పరిపూర్ణ నారాయణ స్మరణ పూర్వక ఆశీస్సులను అందజేయు చున్నాము. అని శ్రీచరణులు మమ్ములను ఆదేశించినారు.

ఇట్లు

**శ్రీకృష్ణశర్మ**

విశాఖ శ్రీ శారదా పీఠ ఆస్థాన పండితులు

# అభినందన నందనమ్

పాదుకాంత పూర్ణదీక్షాపరులు, ధర్మపురుష యాబలూారు లోకనాథశర్మ

టి.టి.డి. హిందూధర్మ ప్రచార పరిషత్ న్యాయసలహాదారు విశ్వహిందూ పరిషత్ ధర్మప్రసాద్ అఖిల భారత ఉపాధ్యక్షులు

**నారాయణ సమారంభాం వ్యాసశంకర మధ్యమామ్ ।**
**శ్రీపూర్ణానంద పర్యంతాం వందే గురు పరంపరామ్ ॥**

'ఆత్మవిద్యా మహావిద్యా శ్రీవిద్యాకామసేవితా' అని వశిన్యాది వాగ్దేవతలచే నిర్వచించబడిన శ్రీవిద్య బ్రహ్మవిద్య. ఆత్మవిద్య అంటే–బ్రహ్మవిద్య.

**శ్రీ శంకర భగవత్పాదులు :**

**శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః ।**
**బ్రహ్మసత్యం జగన్మిథ్య జీవో ఆత్మైవ నాపరః ॥**

ఆత్మవిద్య అంటే బ్రహ్మవిద్య అని నిర్వచించి యున్నారు. శ్రీ శృంగేరీ విరూపాక్ష పీఠాధిపతులు, వ్యాఖ్యాన సింహాసనారూఢులు, అపర శంకరుడుగా కీర్తించబడిన మహోదయులు జగద్గురు శ్రీశ్రీశ్రీ కళ్యాణానంద భారతీ మహాస్వామి – అథాతస్త బ్రహ్మ వ్యాఖ్యా స్యామః

**"ఆయతనం హి పరదేవతాయాః**
**శ్రీచక్రమితి విజ్ఞాయతే"**

అంటూ శ్రీవిద్యా బ్రహ్మ సూత్రములు రచించారు.

జగద్గురు కళ్యాణానంద భారతీ సాంప్రదాయమునకు చెందిన 'శ్రీవిద్యా విశారద' బిరుదాంకితులు, పాదుకాంత శ్రీవిద్యాపూర్ణ దీక్షాపరులు, బహుగ్రంథ రచయిత, పాశ్చాత్య దేశాలలోని ఆధ్యాత్మిక సంస్థలచే ప్రతిష్ఠాకరమైన పెక్కు అవార్డులు పొంది, మైసూర్ దత్త పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద

స్వామి వారిచే దత్తపీఠ ఆస్థాన విద్వాంసునిగా నియమింపబడి, **శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద ప్రశస్తి** అవార్డుచే గౌరవింపబడిన బ్రహ్మశ్రీ డా॥ క్రోవి పార్థసారథి గారు **"శ్రీవిద్యా బ్రహ్మ సూత్రభాష్యము"** అను గొప్ప గ్రంథము రచించి మహర్షుల కోనకు ఎదిగినారు. బ్రహ్మశ్రీ క్రోవి పార్థసారథి గారు తమ జీవిత సర్వస్వమును శ్రీవిద్యకే అంకిత మొసగిన శ్రీవిద్యా దార్శినికుడు.

**"చరమే జన్మని శ్రీవిద్యోపాసకో భవేత్"**

అన్న వాక్యము బ్రహ్మశ్రీ క్రోవి పార్థసారథి మహోదయుల యందు యథార్థము.

ఆ పరాశక్తి వారికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రసాదించాలని, ఇంకా మరిన్ని గ్రంథాలు వ్రాసే శక్తిని ప్రసాదించాలనీ ఆకాంక్షిస్తూ..

సత్యం – శివం – సుందరం

# ప్రణతులు

వేదవిభజన చేసిన తరువాత వ్యాసభగవానుడు బదరికావనంలో తపస్సు చేసి, పరబ్రహ్మ సాక్షాత్కారం పొంది, ఆ పరబ్రహ్మనిరూపణ చేస్తూ వ్రాసినవే బ్రహ్మసూత్రాలు. మానవుడు పుట్టక ముందు ఎక్కడ ఉన్నాడు? మరణానంతరము ఏమవుతాడు? ఇత్యాది ప్రశ్నలకు సమాధానం చెప్పేవే బ్రహ్మసూత్రాలు. పాపకార్యాలు చేసిన వారు పశువులు, పక్షులు, క్రిమికీటకాలుగా జన్మిస్తారు. పుణ్యకార్యాలు చేసిన వారు మాత్రమే మానవులుగా జన్మిస్తారు. కాబట్టి **ఓ మానవులారా! పుణ్యకార్యాలు మాత్రమే చెయ్యండి అని ప్రబోధిస్తాయి బ్రహ్మసూత్రాలు.** జీవితం యొక్క అంతిమ లక్ష్యం మోక్షం. దాన్ని ఎలా పొందాలి అనే విషయాన్ని వివరిస్తాయి బ్రహ్మసూత్రాలు. ఈ రకంగా ప్రజలకు నియమబద్ధమైన జీవితము, మంచి నడవడి ఉండాలి. అప్పుడే మానవుడు తనను తాను ఉద్ధరించుకుంటాడు. తద్వారా ప్రపంచం ఉద్ధరించబడుతుంది.

వ్యాసభగవానుడు వ్రాసిన బ్రహ్మసూత్రాలకు కొంతమంది భాష్యం వ్రాశారు. వీరిలో బోధాయనుడు ఒకడు అంటారు. మనకు లభ్యమయిన భాష్యాలలో మొదటిది శంకర భాష్యం. బ్రహ్మసూత్రాలకు అద్వైతపరంగా భాష్యం వ్రాశాడు శంకరుడు. ఇందులో కేవలము ఉపనిషత్తులను మాత్రమే ఉటంకించాడు. శంకరుడి ప్రకారము నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. జీవాత్మ పరమాత్మతో లీనం కావటమే మోక్షం. ఆ తరువాత కాలంలో రామానుజాచార్యులు, మధ్వాచార్యులు మొదలైన వారు ద్వైతపరంగా బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాశారు. వీరిమతం ప్రకారము పరబ్రహ్మ సాకారుడు. జీవాత్మ పరమాత్మ ఒకటి కాదు. వీరు తమ మనోభావాలను బట్టి పరబ్రహ్మ అంటే విష్ణువని, శివుడని, కృష్ణుడని, రాముడని శక్తి అని వ్రాయటం జరిగింది. లోకంలో ఎక్కువ మంది శ్రీవిద్యోపాసకులే ఉన్నారు. వారందరి మనోభావాలను బట్టి పరబ్రహ్మ స్వరూపము అంటే శ్రీవిద్యలో ప్రతిపాదించబడిన పరాశక్తియే తప్ప వేరెవరూ కాదు. ఈ విషయం ప్రతిపాదిస్తూ శ్రీవిద్యాబ్రహ్మసూత్రభాష్యము వ్రాయటం జరిగింది.

**శ్రీ సుందరీ సేవనతత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్తమేవ.**

ఆ పరమేశ్వరిని సాకారంలో త్రిపుర సుందరిగా ఆరాధించిన వారు ఈ లోకంలో సిరిసంపదలు, భోగభాగ్యాలు కలిగి, మరణానంతరము మణిద్వీపం చేరి మహదైశ్వర్యాన్ని అనుభవిస్తారు ఇదే ముక్తి. నిరాకారాన్ని ఉపాసించిన వారి జీవాత్మ మరణానంతరము పరమాత్మలో లీనమవుతుంది. వీరికి పునర్జన్మ ఉండదు. ఇది మోక్షం. ఈ రకంగా పరమేశ్వరిని అర్చించిన వారు భోగము, మోక్షము రెండూ పొందుతారు అని చెబుతూ ఈ గ్రంథంలో సాకార నిరాకారాలు, ద్వైతాద్వైతాలు, రెండింటినీ వివరించటం జరిగింది.

పరాశక్తియే పరబ్రహ్మ అని నిరూపించటానికి శ్రీవిద్యలోని పంచదశి మహామంత్రము, మహాషోడశి, శ్రీచక్రం, దేవీభాగవతము, లలితా సహస్రము, సౌందర్యలహరి, సుభగోదయస్తుతి ఉపనిషత్తులు ఆధారంగా తీసుకోవటం జరిగింది. ఇవన్నీ శాస్త్రబద్ధమైన గ్రంథాలే. ఇది పూర్తిగా అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన గ్రంథం. ఈ విధంగా **శంకరాద్వైతానికి శ్రీవిద్యను జోడించి, శ్రీవిద్యలో ప్రతిపాదించిన పరాశక్తియే పరబ్రహ్మ అని నిరూపణ చేస్తూ వ్రాసిన మొట్టమొదటి బ్రహ్మసూత్రభాష్యమిది.**

నేనేమీ గొప్ప పండితుణ్ణి కాను. బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాయగల శక్తి సంపన్నుణ్ణి అసలే కాను. రాయితో కూడా రాగాలు పలికించగల శక్తి ఆ పరాశక్తికే ఉన్నది. ఆమె యొక్క కృపాకటాక్ష వీక్షణాల వల్లనే నేను ఈ గ్రంథం వ్రాశాను. అంతేకాని ఇందులో నా గొప్పతనం ఏమీలేదు.

ఈ గ్రంథం శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారికి అంకితం చేయటమైనది.

ఈ గ్రంథానికి శ్రీముఖములు, ప్రశంసలు పంపిన అందరికీ కృతజ్ఞతలు తెలియజేస్తూ

నా యీ గ్రంథాన్ని ఆదరిస్తారని భావిస్తూ ....

స్వర్గస్తురాలైన మా రమాదేవిని స్మరిస్తూ...

బుధజన విధేయుడు

**స్వామి పరమానందనాథ**

హేమళంబి నామ సంవత్సర శ్రావణ పౌర్ణమి
సోమవారం, శ్రవణా నక్షత్రం 07-08-2017

# విషయ సూచిక



## మొదటి అధ్యాయము - మొదటి పాదం



## మొదటి అధ్యాయము - రెండవ పాదం

## మొదటి అధ్యాయము - మూడవ పాదం



## మొదటి అధ్యాయము - నాల్గవ పాదం

## రెండవ అధ్యాయము - మొదటి పాదం

## రెండవ అధ్యాయము - రెండవ పాదం



## రెండవ అధ్యాయము - మూడవ పాదం

## రెండవ అధ్యాయము - నాల్గవ పాదం

## మూడవ అధ్యాయము - మొదటి పాదం

## మూడవ అధ్యాయము - రెండవ పాదం



## మూడవ అధ్యాయము - మూడవ పాదం

## మూడవ అధ్యాయము - నాల్గవ పాదం

## నాల్గవ అధ్యాయము - మొదటి పాదం

## నాల్గవ అధ్యాయము - రెండవ పాదం

## నాల్గవ అధ్యాయము - మూడవ పాదం

## నాల్గవ అధ్యాయము - నాల్గవ పాదం

# CERTIFICATE

## BRAHMA SUTRAS IN SREE VIDYA TRADITON

Dr.KROVI PARTHA SARATHI S/o Krishnamurthy (Born on 13th Dec, 1949) retired Reader in Commerce, Vijayawada, Krishna District, Andhra Pradesh, India has written a comment on "Brahma Sutras" by name "Sree Vidya Brahma Sutra Bhashyam" is the first of its kind in vindicating that in "Sree Vidya tradition" the primordial power (Para Sakthi) is the manifestation of "Para Brahman". This comment is written in Telugu Language. This is the first comment on "Brahma Sutras" in Sree Vidya Tradition. This achievement is entered into Bharat World Record.

Verification code :
BWR/SEP/00135/2016

APPROVED

Dr. Dhanush Jain
Founder President
Authorised Signature

Website : www.kamakoti.org. ఉ ☎: 044-27222115
044-27224305

|| Sri Chandramouleeswaraya Namaha: ||
Sri Sankara Bhaghavadpadacharya Paramparagatha Moolamnaya Sarvajnapeeta

His Holiness Sri Kanchi Kamakoti Peetadhipathi
**JAGADGURU SRI SANKARACHARYA SWAMIGAL**
**Srimatam Samsthanam**
**No. 1, Salai Street, KANCHEEPURAM - 631 502.**

మనుష్య జన్మకి ముఖ్య ఉద్దేశ్యమైనటువంటి మోక్షమును(బ్రహ్మ జ్ఞానము) పొందడానికి, ప్రాధమికముగా వేద శాస్త్ర అధ్యాయనము, కర్మ ఆచరణ మరియు దేవి, దేవత ఉపాసన, తరువాత వేదాంత శాస్త్ర అధ్యాయనము, శ్రవణ, మనన, ధ్యాన, నిదిధ్యాసనం సంప్రదాయ మార్గము. తత్సంబంధమైన శాస్త్రములు(వేదములలో కర్మ భాగము, మరియు అనేక దేవి, దేవత ఉపాసనా మార్గములు, వేదాంతము నందు బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీత) వేద వ్యాసుల వారు అందచేసారు. వీటికి శంకరాచార్యుల వారు భాష్యములు వ్రాసారు. ఈ ఉపాసనలలో శ్రీ విద్య ఉపాసన (పరాశక్తి ఉపాసన) సకల భోగ భాగ్యములు మరియు మోక్షమును కలుగచేసేటటువంటిది. శ్రీ విద్య ఉపాసకులు ఎందరో అమ్మ వారి పరిపూర్ణ కృపకు పాత్రులై అమ్మ వారి సాయుజ్యమును మరియు కొంత మంది జీవన్ముక్త స్థితిని పొందారు. కావున శ్రీ విద్య ఉపాసన బ్రహ్మ విద్యతో సమానముగా పరిగణింపబడుతుంది. శ్రీ విద్యను బ్రహ్మవిద్యను సమన్వయము చేస్తూ డా. క్రోవి పార్థసారధి గారు శ్రీ ఈ గ్రంథము, "శ్రీ విద్యా బ్రహ్మసూత్ర భాష్యము" వ్రాశారు. ఈ గ్రంథములోని విషయాలను ఆసక్తులు చదివి, మనస్సు యందు అమ్మ వారి యందు భక్తి శ్రద్ధలు పొందడానికి, సంప్రదాయానుసారము సద్గురువులను ఆశ్రయించి, గురువుల యొక్క ఉపదేశము పొంది, వాటి ఆచరణ చేస్తూ, భోగ, భాగ్యములు, మనుష్య జన్మకి పరమ లక్ష్యమైనటువంటి ముక్తిని పొందడానికి ప్రయత్నం చేసుకోవాలి.

For. Sri Kanchi Kamakoti Peetam,
Srimatam, Kancheepuram.
Suundaresan
MANAGER

నారాయణ స్మృతిః

దుర్ముఖ భాద్రపద శుక్ల ఏకాదశి

యాత్రా స్థానం : విజయవాడా

అవధూత దత్తపీఠాధిపతి జగద్గురు పరమపూజ్య

# శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వామీజీవారి

## ఆశీస్సందేశము

ది. 27.07.2016,

మైసూరు.

శ్రీమాత్రే నమః

**'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా'**

ఉపాసకుల సౌకర్యం కోసం నిరాకారమైన, నిర్గుణమైన బ్రహ్మతత్త్వము సాకారంగానూ, నిరాకారంగానూ భాసిస్తుంది.

పరాభట్టారిక చిదగ్ని నుండి ఆవిర్భవించి సాకారరూపాన్ని ధరించింది. సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములనే పంచకృత్యాలను నిర్వహిస్తోంది. రాగము, ద్వేషము, క్రోధము, మనస్సులను ఆయుధాలుగా చేసుకొని ధరించి ఉంది. ధర్మార్థకామమోక్షాలనే నాలుగు పురుషార్థాలను ప్రసాదిస్తోంది.

అటువంటి తల్లిని **'ప్రథమం సగుణ మాశ్రిత్య తతో నిర్గుణ మాశ్రయేత్'** అని శ్రీశంకర భగవత్పాదాచార్యస్వామివారి వాణి.

మా దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు క్రోవి పార్థసారథి గారు సరిగ్గా ఈ మార్గంలోనే నడుస్తున్నారు. వారికి అమ్మవారే జపము, తపము, ధ్యానము. అమ్మవారే లోకము. జగన్మాతపై పలు పరిశోధనలు, పరిశ్రమలు కావించి, రహస్యాలనెన్నిటినో పుస్తకరూపంలో ప్రకటం చేశారు.

ప్రస్తుతం ఉపనిషత్తులను, బ్రహ్మసూత్రభాష్యాన్ని ఆధారంగా చేసుకొని, బ్రహ్మవిచారము కావిస్తూ పరమేశ్వరియే పరబ్రహ్మ అని నిరూపణ చేసే సాధన చేశారు. ఆ కృషి ఫలంగానే 'శ్రీవిద్యా సూత్రభాష్యము' అనే గ్రంథం అవతరించింది.

శాక్తేయ గ్రంథాల లోని మూల రహస్యాలతో బ్రహ్మసూత్రాలను పరిశోధిస్తూ, సందర్భానుసారంగా అమ్మ నామాలను ఉటంకిస్తూ సత్యాన్వేషణను చేశారు. చాలా సంతోషం. జ్ఞానతత్పరులైన వారందరికీ ఈ గ్రంథం ఎంతో ఉపకరించుగాక!

చిన్మాత్ర స్పందన శక్తితో శివశక్తుల సమైక్యతత్త్వం అవగతమవుతుందని వాశిష్ఠ రామాయణం తెలుపుతోంది. పార్థసారథిగారికి ఆ భాగ్యం కలుగుగాక! అని ఆశీర్వదిస్తూ................

జయగురుదత్త

మీ

స్వామీజీ




*His Holiness, Courtallam Sankaracharya, Jagadguru*

**SRI SIDDHESWARANANDA BHARATI SWAMY**

*Peetadhipati - Siddheswari Peetam*

**Office :**
**Mounaswamy Mutt**
**Courtallam-627 802.**
Thirunelveli Dist., (T.N.)
TAMILANADU
Ph : 04633 - 283707

పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు
**శ్రీసిద్ధేశ్వరానంద భారతీస్వామి**
సిద్ధేశ్వరీ పీఠాధిపతి - కుర్తాళం

**Camp Office :**
Swayam Siddha Kaali Peetam
4th Line, Ravindra Nagar
Guntur - 522 006. (A.P.)
Ph : 9440208103


వ్యాస పూర్ణిమ
Date : 19.7.2016

## ఆశీర్వాద పత్రము

శ్రీ క్రోవి పార్థసారథి గారు అనేక గ్రంథముల రచించి వాఙ్మయ ప్రపంచములో ఉన్నత స్థానాన్ని సంపాదించిన పండితవరేణ్యులు. బ్రహ్మసూత్రములకు ఇదివరకే విశిష్టమైన వ్యాఖ్యానాన్ని రచించి యున్నారు. ఇప్పుడు వారే శ్రీవిద్యా సంప్రదాయపరమైన భాష్యం రచించి సరికొత్త రూపకల్పన చేశారు. ఉభయ సంప్రదాయములకు, సౌందర్యలహరికి అద్వైతపరమైన వ్యాఖ్యలు వచ్చినవి గాని బ్రహ్మసూత్రములకు ఇటువంటి పరమార్థం భావించటం అసామాన్యమైన సంగతి. మహామాయ, పరబ్రహ్మమహిషి అని శంకరులవారు వర్ణించిన శ్రీదేవి ఇచ్ఛవల్లనే ఇటువంటివి జరుగుతూ ఉంటాయి. ఆ లలిత పరబ్రహ్మము పార్థసారథి గారికి మంగళముగా ప్రసాదించునుగాక!

నారాయణస్మరణలతో
సిద్ధేశ్వరానంద భారతీస్వామి.


Contact : Secretary- Sri P.S. Kantha Rao ✆ 9849110864



*With the Divine Blessings of His Holiness*

JAGADGURU SANKARACHARYA

**SRI SRI SRI SWAROOPANANDENDRA SARASWATI MAHASWAMY**

# VISAKHA SRI SARADA PEETHAM



తేది. 05.07.2016

క్యాంప్. ఋషికేశ్

పరమహంస పరివ్రాజకాచార్య జగద్గురు శంకరాచార్య విశాఖ శ్రీ శారదాపీఠాధిపతులు **శ్రీ శ్రీ శ్రీ స్వరూపానందేంద్ర సరస్వతీ మహాస్వామివారి** దివ్య మంగళాశ్శీసులతో . . . . .

తమరు పంపిన గ్రంథమును శ్రీచరణులకు నివేదించినాము వారు ఈ విధంగా మమ్ములను ఆదేశించినారు.

బ్రహ్మసూత్రములు నిజానికి నిర్గుణమైన నామ రూపములులేని పరబ్రహ్మను ఉద్ధేశించి తెలుపబడినవి. జగద్గురు ఆది శంకరాచార్యులువారు కూడా ఈ విషయమునే ప్రతిపాదించియున్నారు. అయితే "ఉపాసకానాం సౌకర్యార్థం" అని ఋషులు తెలిపినట్లుగా ఉపాసకులు ఆ పరబ్రహ్మమునే శక్తేయులు పరదేవత అని, శైవులు పరమేశ్వరుడని, వైష్ణవులు పరవాసుదేవుడుని భావన చేస్తారు.

డా॥ క్రోవి పార్థసారథి శ్రీవిద్యా దృష్టితో ఈ బ్రహ్మసూత్రములను భావనచేసి "శ్రీవిద్యా సూత్రభాష్యము" అనే పేరుతో ప్రకటించటం ఆనందకరము వారికి మా పరిపూర్ణ నారాయణ స్మరణ పూర్వక ఆశీస్సులను అందజేయుచున్నాము. అని శ్రీచరణులు మములను ఆదేశించినారు.

ఇట్లు

(signature)

శ్రీ కృష్ణ శర్మ

విశాఖ శ్రీ శారదాపీఠ ఆస్థాన పండితులు

Pendurti, Visakhapatnam - 530051, Andhra Pradesh, India. Ph : 0891-2763332
Web Site : www.srisaradapeetham.org E-mail : info@srisaradapeetham.org

श्रीगुरुदत्त

जयगुरुदत्त

# श्रीमदवधूत दत्तपीठम्

## श्रीगणपति सच्चिदानन्दाश्रमः

दत्तनगरम्, नीलगिरि मार्गः मैसूरुः - 570025

इदमत्र प्रमाणीक्रियते यत्

श्रीमदवधूत दत्तपीठाधीश्वर जगद्गुरु परमपूज्य

**श्रीश्रीश्री गणपति सच्चिदानन्द स्वामि**

करकमल सञ्जातानां दत्तपीठोत्तराधिकारिणां

परमहंस परिव्राजकाचार्यवर्याणां

**श्री श्री श्री दत्तविजयानन्द तीर्थ स्वामि**

श्रीपादानां **त्रयोदशतम चातुर्मास्य** दीक्षास्वीकारोत्सवं पुरस्कृत्य

मैसूरु महानगरे अष्टादश शक्तिपीठ क्षेत्रे स्वस्ति श्री दुर्मुखि नामसंवत्सरे

आषाढशुद्धपूर्णिमाप्रयुक्त व्यासपूजामहापर्वणि

**(19 जूलै, 2016 दिनाङ्के)**

वेदान्त श्रीविद्योपासनादि द्वारा चतुर्वेद भष्यानुवाद द्वारा च

निरुपमां वैदिकधर्मसेवां विरचितवन्तः

"श्रीविद्यानिधिः श्रीविद्यारत्नाकरः श्रीविद्या विशारदः दत्तपीठ आस्थान विद्वान्"

इत्यादि बिरुदभाजः

**श्रीमन्तः श्री क्रोवि पार्थसारथि महोदयाः**

## श्री गणपति सच्चिदानन्द प्रशस्ति

प्रदान पुरस्सरं **श्री स्वामिपादद्वयेन** सानुग्रहं सभाजिता इति शम्।

**प्रसादशर्मा,**
कार्यनिर्वाहकः

गुरुपूर्णिमा
मैसुरु नगरम्

**कुप्पावेङ्कट कृष्णमूर्तिः,**
दत्तपीठ विद्याधिकारी



**19-7-2016 గురుపూర్ణిమ సందర్భముగా**
**శ్రీ అవదూత దత్తపీఠం, మైసూర్ నందు**
**శ్రీశ్రీశ్రీ దత్త విజయానంద తీర్థ స్వామి వారి నుండి**
**శ్రీ గణపతి సచ్చిదానంద ప్రశస్తి అవార్డును అందుకుంటున్న**
**గ్రంథకర్త శ్రీ పరమానందనాథ (డా॥ క్రోవి పార్థసారథి)**

# శ్రీవిద్యా బ్రహ్మసూత్ర భాష్యము

## శ్రీవిద్యా సంప్రదాయంలో పరాశక్తియే పరబ్రహ్మ స్వరూపమని నిరూపణ చేస్తూ వ్రాసిన మొదటి బ్రహ్మసూత్రభాష్యము

### I. బ్రహ్మసూత్రాలలో ప్రాచీన ఋషులు

వ్యాసమహర్షి బ్రహ్మసూత్రాలు వ్రాస్తూ తనకు పూర్వకాలంలో ఉన్న ఋషులు కొందరిని చెప్పటం జరిగింది. అంటే వ్యాసుడికన్న ముందు కాలంలోనే కొంతమంది బ్రహ్మసూత్రాలు వ్రాశారనే విషయం మనకి తెలుస్తోంది. వీరిలో మొదటివాడు

**1. ఆత్రేయుడు :** బ్రహ్మసూత్రాలలో 3వ పాదంలోని 4వ అధికరణలోని 44వ సూత్రంలో ఉపాసనకర్మలు యజమానే చెయ్యాలి. అప్పుడే ఆ ఫలితం యజమానికి చెందుతుంది. ఆ కర్మలు ఋత్విక్కులతో చేయించరాదు. అలా చేస్తే ఫలితము యజమానికి రాదు అనిచెప్పాడు ఆత్రేయుడు. ఆత్రేయుని సిద్ధాంతాన్ని ఖండించి ఋత్విక్కుకు దక్షిణఇస్తాం కాబట్టి, ఉపాసనఫలితం యజమానికేదక్కుతుంది. అని తీర్మానించాడు వ్యాసుడు.

**2. అశ్మరధ్యుడు :** మొదటి అధ్యాయం 4వ పాదంలోని 20వ సూత్రంలో జీవాత్మలు నిప్పునుంచివచ్చే రవ్వలవంటివారు అని చెప్పాడు.

**3. ఔఢులోమి :** ఈయన 1.4.21, 3.4.45, 4.4.6 సూత్రాలలో చెప్పబడ్డాడు. వీరి సిద్ధాంతం ప్రకారం సంసార జీవితంలో జీవాత్మ–పరమాత్మలకు భేదమున్నది. కాని ముక్తిపొందే సమయంలో జీవాత్మ పరమాత్మల మధ్య భేదంలేదు.

**4. కార్ష్ణాజిని :** మూడవ అధ్యాయం మొదటి పాదంలోని తొమ్మిదవ సూత్రంలో ఈయన పేరు కనిపిస్తుంది. జీవులు తాముచేసిన కర్మలననుసరించి మరుజన్మ పొందుతారు అనేది వీరి సిద్ధాంతం. దీన్ని వ్యాసుడు కూడా ఒప్పుకున్నాడు.

**5. కాశకృత్స్నుడు :** మొదటి అధ్యాయం నాల్గవ పాదంలోని ఇరవై రెండవ సూత్రంలో ఈయన పేరు కనిపిస్తుంది. జీవాత్మ, పరమాత్మ వేరు కాదు రెండూ ఒకటే. అనేది వీరి సిద్ధాంతం.

**6. జైమిని :** వ్యాసుని శిష్యుడు. పూర్వమీమాంస (కర్మ సిద్ధాంతం) వ్రాసినవాడు. బ్రహ్మసూత్రాలలో ఇతని పేరు 11సార్లు కనిపిస్తుంది. ఒకటి రెండు చోట్ల వ్యాసునితో ఏకీభవించలేదు. సన్యాసం వేదంలో చెప్పలేదనేది వీరి వాదన.

**7. బాదరాయణుడు :** బాదరాయణుడు అంటే వ్యాసుడే. కాని కొన్ని విషయాలు ఖచ్చితంగా చెప్పటానికి 'బాదరాయణుడు ఇలా అంటున్నాడు' అన్నాడు వ్యాసుడు.

**8. బాదరి :** ఇతడు మొత్తం నాలుగుచోట్ల కనిపిస్తాడు. శుద్ధబ్రహ్మవాది అయిన అద్వైతాచార్యుడు. పరమేశ్వరుడు సర్వవ్యాపి. జీవుల హృదయంలో ఉంటాడు కాబట్టి 'ప్రాదేశమాత్రుడే' అనబడతాడు. **శూద్రులకు కర్మాధికారమున్నదనేది వీరి సిద్ధాంతం.**

ఈ రకంగా వ్యాసునికన్న ముందుగా పరబ్రహ్మను గురించి ఆలోచించిన వాళ్ళు, బ్రహ్మసూత్రాలు చెప్పినవారు కొంతమంది ఉన్నారు. కాని వ్యాసుడు చెప్పిన బ్రహ్మసూత్రాలే అత్యంత ప్రామాణికము.

## II. అజ్ఞానము

'అజ్ఞానం' అనే మాట మనం అనేకసార్లు చెబుతుంటాం. అసలు అజ్ఞానం అంటే ఏమిటి? అది ఎందుకు వస్తుంది? జ్ఞానం లేకపోవటమే అజ్ఞానం. జ్ఞానమనేది రెండు రకాలు.

**1. విషయపరిజ్ఞానము :** లోకంలో మనకు కనుపించేవస్తువుల, మనం ఉపయోగించేవస్తువుల విషయపరిజ్ఞానం. దీన్నే సామాన్యజ్ఞానము అంటారు. దైనందిన జీవితంలో దీని అవసరం ఎంతైనా ఉంది.

**2. పరాజ్ఞానము :** పరమేశ్వరుడు, పరబ్రహ్మను గురించినజ్ఞానము. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే ఆ పరమేశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు. అతడే పరబ్రహ్మ. సృష్టి ప్రారంభం కాక ముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది.

ఆ శూన్యాన్ని పరబ్రహ్మ ఆక్రమించి ఉన్నాడు. సృష్టి జరిగిన తరువాత తానే 84 లక్షల రకాలయిన జీవరాసిగా మారాడు. ఈ రకంగా మళ్ళీ జగత్తంతా ఆక్రమించి ఉన్నాడు. మొత్తం మీద **చరాచర జగత్తంతా పరమేశ్వరమయం. జగత్తే పరమేశ్వరుడు, పరమేశ్వరుడే జగత్తు.** వేదాంత పరిభాషలో దీన్నే జ్ఞానము అంటారు. ఈ రకమైన జ్ఞానం లేకపోవటాన్నే అజ్ఞానం అంటారు.

పరమేశ్వరుడు మానవ శరీరాన్ని సృష్టించిన తరువాత ఈ శరీరంలో నేను లేకపోతే ఎలాగ? అనుకుని బ్రహ్మరంధ్రం గుండా మానవ శరీరంలో ప్రవేశించి, దానితో తాదాత్మ్యం చెంది, నవరంధ్రాలతోను అన్ని సుఖాలు అనుభవిస్తూ, వచ్చిన త్రోవ కూడా మరచిపోయి, నేను అంటే దేహము అని భావన చేశాడు. ఈ శరీరంతో అనుభవించే లౌకిక సుఖాలే నిజమైన సుఖాలు అనుకుని పంజరంలో బంధించబడిన పక్షిలాగా ఈ దేహంలోనే ఉండిపోయి, అజ్ఞానాంధకారంలో మునిగిపోయి, దిక్కు తోచక, బయటకు వచ్చే దారి తెలియక, అజ్ఞానాన్ని ఎలా వదిలించుకోవాలో తెలియక, అందులోనే శ్లేష్మంలోపడ్డ ఈగలాగా కొట్టుమిట్టాడుతున్నాడు. అయితే అజ్ఞానం ఎందుకు వస్తుంది? అనేది చాలా పెద్ద ప్రశ్న. అజ్ఞానం రెండు కారణాల వల్ల వస్తుంది. 1. అగ్రాహ్యము 2. అన్యధాగ్రాహ్యము.

**1. అగ్రాహ్యము :** ఏదైనా వస్తువును చూసినప్పుడు దానియొక్క యథార్థ స్థితిని గ్రహించలేకపోవటం, మానవదేహం పాంచభౌతికమైంది. ఇందులో రక్తమాంసాలు, మలమూత్రాలు, ఎముకలు, నరాలు అన్నీ ఉండి, పైనమాత్రం చర్మంచేత కప్పబడి ఉంటుంది. శరీరమంతా ఉండేవి ఇవే. కాని ఈ శరీరంలో ఒక్కొక్క భాగాన్ని చూసినప్పుడు మానవుడు ఒక్కో రకంగా స్పందిస్తాడు. అక్కడ ఏదో ఉన్నది. దాన్ని అందుకోవాలి. అనుభవించాలి. ఆనందించాలి అనుకుంటాడు. ఈ ఆనందానికి తృప్తి ఉండదు. ఎంతగా ఆనందించినా ఇకచాలు అనడు. ఇంకా ఇంకా కావాలి అనుకుంటాడు. ఇది నిజమైనఆనందంకాదు. ఈ ఆనందం తరువాత దుఃఖము ఉంటుంది. లోకంలో విపరీతమైన ఆనందాన్నిచ్చేది రతిసౌఖ్యము అనుకుంటారు. కాని మైధునక్రియ తరువాత స్త్రీ పురుషులిద్దరూ బడలిక పొందుతారు. ఆ బడలిక స్త్రీ విషయంలో ఇంకా ఎక్కువ ఉంటుంది. లౌకికమైన ఆనందాలన్నీ

దుఃఖాన్ని మిగిల్చేవే. మానవుడు అజ్ఞానంవల్ల వీటిని తెలుసుకోలేడు. మసక చీకటిలో త్రాడునుచూసి పాము అనుకుంటాడు, దీన్నే **రజ్జుసర్పభ్రాంతి** అంటారు. అలా స్థాణువును చూసి దొంగవాడని, ముత్యపుచిప్పను చూసి వెండిగిన్నె అని భ్రమిస్తాడు. తన చుట్టూ ఉన్నవాటిలో ఏదిసత్యం, ఏదిఅసత్యం అనే విషయం తెలుసుకోలేడు. ఏది శాశ్వతమైనది? ఏది అశాశ్వతమైనది అనే విషయం గుర్తించలేడు. **దృశ్యమానమైన జగత్తులో కంటికి కనిపించేదంతా నశించేదే** అని గ్రహించలేడు.

అజ్ఞానానికి రెండవ కారణం **అన్యధాగ్రాహ్యము**, వస్తువును చూసినప్పుడు దాని యథార్థ రూపం తెలుసుకోలేడు సరికదా, దాన్ని ఇంకొక రకంగా భావిస్తాడు. త్రాడును చూసి పాము అనుకున్నాడు. అంతేకాని ఎప్పుడూ పామును చూసి త్రాడు అనుకోడు. ఈ రెండు కారణాల వల్లనే అజ్ఞానం వస్తుంది. అయితే ఈ అజ్ఞానం ఈ జన్మలో వచ్చింది కాదు. కొన్ని లక్షలు, కోట్లజన్మలనుంచి మనని అంటి పెట్టుకుని ఉంది. ఈ కారణం చేతనే దీన్ని వదిలించుకోవటం అంతతేలిక కాదు. తెల్లటి వస్త్రాన్ని తెచ్చి ఇల్లు తుడిచాం. ఆ వస్త్రం కాస్తా మట్టి పట్టిపోతుంది. ఎంత ఉతికినా దాని అసలు స్థితికి రాదు. అదే వస్త్రంతో అనేకసార్లు ఇల్లు తుడిచాం. ఆ వస్త్రానికి మట్టి బాగాఅంటింది. దానిలో జీర్ణించుకుపోయింది. ఇప్పుడు ఆ వస్త్రాన్ని శుభ్రం చెయ్యటం పూర్వంలాగా తెల్లగాచెయ్యటం సాధ్యంకాదు. ఇలా జరగాలంటే విపరీతమైన పరిశ్రమ కావాలి. అలాగే ఇన్నిజన్మలనుంచి పేరుకుపోయిన అజ్ఞానాన్ని వదిలించు కోవటం అంతతేలికకాదు. ఈపని జరగాలిఅంటే వేదాంతాన్ని ఆశ్రయించాలి.

ఒకసారి వర్షాకాలం. జోరున వాన కురుస్తోంది. వాగులు, వంకలు పూర్తిగా నిండిపోయినాయి. నదులు పొంగుతున్నాయి. ఒక ఊళ్ళో వర్షానికి నీరంతా కాలవలాగా ప్రవహిస్తోంది. అందులో ఒక పెద్ద తేలు కొట్టుకుపోతోంది. చూశాడు ఒక సన్యాసి. ఆ తేలును జాగ్రత్తగా పట్టుకుని ఒడ్డున వదిలిపెట్టాడు. వదిలి పెట్టగానే ఆ తేలు ఆ సన్యాసిని కుట్టి మళ్ళీ పెరుగెత్తుకుంటూ నీళ్ళలోకి వెళ్ళిపోయింది. ఆ సన్యాసి ఆ తేలును మళ్ళీ వడ్డుకు చేర్చాడు. అది అతణ్ణి మళ్ళీ కుట్టింది. ఇలా కొనసాగుతోంది. దారిన పోయే ఒకరైతు అదంతా చూసి సన్యాసితో "స్వామి! అది తేలు. కుడుతుంది. ఒక దెబ్బవేసి చంపెయ్యచ్చు కదా? నువ్వు రక్షించిన ప్రతిసారి

నిన్ను కుడుతూనే ఉంది. ఎందుకిలా చేస్తున్నావు? అన్నాడు. అప్పుడు ఆ సన్యాసి "నాయినా ! అది తేలు. కుట్టటం దాని నైజం. దాన్నిరక్షించటానికి నేను ప్రయత్నిస్తున్నాను అని తెలుసుకోలేకపోతోంది. నేను సన్యాసిని. ఇతర జీవులకు కష్టం కలగకుండాసహాయపడటం నా కర్తవ్యం. అందుకే ఇలా చేస్తున్నాను" అన్నాడు. ఆ తేలు అజ్ఞానంతో తనను రక్షించటానికి వచ్చిన సన్యాసికి హాని కలిగిస్తోంది. అలాగే అజ్ఞానంలో కూరుకుపోయిన వాడు తనను ఉద్ధరించటానికి వచ్చిన వారిని హేళన చేస్తాడు. అవమానిస్తాడు. అంతేకాని అంది వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోడు.

ఒక పండితుడు బాట వెంబడి పోతున్నాడు. దారి ప్రక్కన పెద్ద మురుగుగుంట భరించలేని దుర్వాసన వస్తోంది. ముక్కు మూసుకుని నడుస్తున్నాడు పండితుడు. ఇంతలో ఒక పెద్ద పంది వచ్చి ఆ మురుగులో కలయతిరిగి హాయిగా అందులో పడుకుంది. దుర్వాసన మరీ ఎక్కువైంది. అప్పుడు ఆ పండితుడు పందితో భరించలేని చెడు వాసన వస్తున్న మురుగులో ఎందుకు దొర్లుతావు? బయటకు రావచ్చు కదా?" అన్నాడు. దానికి ఆ పంది "ఓ పండితోత్తమా! ఈ మురుగులో పడుకుంటే ఎంత హాయిగా ఉంటుందో తెలుసా? నువు కూడా వచ్చి ఇక్కడ పడుకుని చూడు. ఇందులోని సుఖమేమిటో నీకు తెలుస్తుంది." అన్నది.

అజ్ఞానంలో కూరుకుపోయిన వాడు అందులోనే ఆనందం ఉన్నది అనుకుంటాడు. అందులోంచి బయటకు రావటానికి ఇష్టపడడు.

**క్రిమి సంహార సంకులము కేవలనింద్యము పూతిగంధహేయము**
**ఖరాంగు భువంబగు నెమ్ము కుక్క తానమలుచు**
**చెంతనున్న సురరాజును కనుగొని సిగ్గు చెందదది.**

ఒక గాడిద చచ్చి కుళ్ళిపోయింది. శరీరమంతా పురుగులు పడి, భరించలేని దుర్వాసన వస్తోంది. ఇంతలో ఒక కుక్క ఆ గాడిద కాలి ఎముక పట్టుకుపోయి పీక్కు తింటున్నది. ఆకాశమార్గాన వెడుతున్న ఇంద్రుడు అది చూసి క్రిందికి వచ్చి కుక్క దగ్గర ఆగాడు. అయినా సరే. తన ఎదుట దేవరాజైన ఇంద్రుడు ఉన్నాడు అనే జ్ఞానంకూడా లేకుండా, ఆ కుక్క ఆ ఎముకను తింటున్నది. అలాగే అజ్ఞానులు కూడా తాము చేసే పని చాలా గొప్పది అని భావిస్తారు. తామున్న పరిసరాలు

కూడా గమనించరు. యుక్తాయుక్త విచక్షణ ఏ మాత్రం ఉండదు. ఎందుకని అంటే వారు అజ్ఞానులు. అజ్ఞానం కొన్ని కోట్లజన్మలనుంచి జీవిని ఆశ్రయించి ఉంది. దాన్ని వదిలించుకోవటం అంత తేలికకాదు.

ఈ జగత్తంతా పరమేశ్వరుని నుంచే ఆవిర్భవించింది. ఆయన వల్లనే పోషింపబడుతోంది. ఆయనవల్లనే వృద్ధి పొందుతోంది. చివరకు ఆ పరమేశ్వరుని లోనే లయమవుతున్నది. సృష్టి స్థితి లయాలకు కారణం పరమేశ్వరుడే. పరమేశ్వరుడే జగత్తు. జగత్తే పరమేశ్వరుడు. ఈ విషయం మరచిపోయి జగత్సృష్టికి కారణం ఇంకేదో ఉన్నది అని చెబుతుంటాం. ప్రకృతి పురుషులవల్లనే జగత్సృష్టి జరిగింది అంటారు సాంఖ్యులు. మీమాంసకారుల దృష్టిలో జగత్తు ఎవరిచేతా సృష్టించబడలేదు. శాశ్వతంగా అలాగే ఉంటుంది. పరమాణువుల కలయికతో జగత్తు సృష్టించబడింది అంటాడు కణాదుడు. కొన్ని పదార్థాల కలయిక వల్ల క్రొత్త పదార్థం ఏర్పడుతుంది. పసుపు సున్నం కలిస్తే పారాణి అవుతుంది. అలాగే ఈ జగత్తు కూడా అంటారు చార్వాకులు. ఇదంతా అజ్ఞానమే. జగత్తుకు కారణం పరమేశ్వరుడు. ఈ విషయాన్ని గుర్తించలేక పోవటమే అజ్ఞానము.

మనం చెప్పే శాస్త్రాలు, ప్రమాణాలు, సూత్రాలు, ఇవన్నీ అవిద్యతో కూడిన దేహానికేగాని జ్ఞానికిమాత్రం కాదు. అజ్ఞాని అయిన మానవుడు పశుప్రాయుడు. కర్మమార్గం అంటే యజ్ఞాలు, యాగాలు, పూజలు, జపాలు, తపాలు, అర్చన, హోమం. ఇవన్నీ అజ్ఞానులకే. జ్ఞానికి వీటితోపనిలేదు. ఆత్మకు కులం, మతం, జాతిభేదము, లింగభేదము ఏవీ ఉండవు. కష్టము, సుఖము ఉండదు. మానవుడు తాను చేసిన పనులన్నింటికీ తానే కర్త అని, తానే భోక్త అని అనుకుంటాడు. ఇదే అధ్యాస. ఒక దాని లక్షణాలు వేరొక దానిలో ఆరోపించటాన్నే వేదాంత పరిభాషలో **"అధ్యాసము"** అంటారు. దీన్ని పోగొట్టి **జగత్తులో ఆత్మ ఒక్కటే సత్యము, నిత్యము, శాశ్వతమైనది.** అనిచెబుతున్నాయి వేదాంత గ్రంథాలు. ఈ వరుసలో ముందు చెప్పబడేవే బ్రహ్మసూత్రాలు. ఇతర మతాలవాదనలు ఖండిస్తూ పరబ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదించటానికి వ్యాసమహర్షి చేసిన ప్రయత్నమిది.

బ్రహ్మసూత్రాలు మొత్తం నాలుగు అధ్యాయాలుగా ఉంటుంది. ప్రతి అధ్యాయం లోను నాలుగు పాదాలు, ప్రతిపాదంలోను కొన్ని అధికరణలు. ప్రతి అధికరణలోను కొన్ని సూత్రాలు ఉంటాయి.

| అధ్యాయము | పాదము | అధికరణలు | సూత్రాలు |
|---|---|---|---|
| 1 | 1 | 11 | 31 |
| | 2 | 7 | 32 |
| | 3 | 13 | 43 |
| | 4 | 8 | 28 |
| | | 39 | 134 |
| 2 | 1 | 13 | 37 |
| | 2 | 8 | 45 |
| | 3 | 17 | 53 |
| | 4 | 9 | 22 |
| | | 47 | 157 |
| 3 | 1 | 6 | 27 |
| | 2 | 8 | 41 |
| | 3 | 36 | 66 |
| | 4 | 17 | 52 |
| | | 67 | 186 |
| 4 | 1 | 14 | 19 |
| | 2 | 11 | 21 |
| | 3 | 6 | 16 |
| | 4 | 7 | 22 |
| | | 38 | 78 |
| మొత్తం | 16 | 191 | 555 |

ఈ రకంగా బ్రహ్మసూత్రాలు నాలుగు అధ్యాయాలుగా, పదహారు పాదాలుగా, నూటతొంభైఒక్క అధికరణలుగా ఐదు వందల యాభైఐదు సూత్రాలుగా ఉన్నాయి. ముందుగా బ్రహ్మసూత్రాలు వ్రాసిన వ్యాసమహర్షికి నమస్కరించి, వాటికి భాష్యం వ్రాసిన ఆదిశంకరులకు ఇతర భాష్యకారులకు ప్రణమిల్లి, నా గురుదేవులైన విరజానందనాథ, సదానందనాథ, సుకానందనాథులకు, సాష్టాంగదండ ప్రణామాలాచరించి, ధర్మ సంస్థాపన కోసం ఏర్పాటయిన శృంగేరీ, బదరీ, పూరి, ద్వారక పీఠాధిపతులకు నమస్కరించి, అవధూత దత్తపీఠాధిపతులు గణపతి సచ్చిదానందస్వామి వారికి, పెంచలకోన మణిద్వీప మహాసంస్థానాధిపతి మాతా విజయేశ్వరీదేవికి, దేశంలోని ఇతర పీఠాధిపతులకు, మఠాధిపతులకు, ఆధ్యాత్మికవేత్తలకు వందనాలర్పించి బ్రహ్మసూత్రాలు సామాన్యుడికి చేరువకావాలనే ఉద్దేశ్యంతో చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. **ఆ పరబ్రహ్మయే శ్రీవిద్యా సంప్రదాయంలోని పరాశక్తి.** అని నిరూపణ చేస్తూ దేశంలోనే మొదటిసారిగా **'సూత్రభాష్యం'** వ్రాస్తున్నాను. బ్రహ్మసూత్రాలు నాలుగు అధ్యాయాలుగా, ఒక్కొక్క అధ్యాయము నాలుగు పాదాలు (భాగాలు)గా ఉంటుంది. అంత వరకు తెలుస్తోంది. ప్రతిపాదంలోను కొన్ని అధికరణలు ఉంటాయి. అసలు అధికరణ అంటే ఏమిటి?

అధికరణ అంటే గ్రంథభాగము. అయితే కేవలము గ్రంథంలోని ఒక భాగాన్ని అధికరణ అనటానికి వీలులేదు. దానికి కొన్ని లక్షణాలున్నాయి.

**విషయో విశయశ్చైవ పూర్వపక్షస్తథోత్తరమ్ ।**
**ప్రయోజనం సంగతిశ్చ ప్రాంచోధికరణం విదుః ॥**

విషయము, విశయము, పూర్వపక్షము, ప్రయోజనము, సంగతి వీటినే అధికరణ పంచకము అంటారు.

| | | |
|---|---|---|
| విషయము | – | విచారణ చేయదగినది |
| విశయము | – | దానిలో కలిగే సంశయము |
| పూర్వపక్షము | – | కాదని ఖండించుట |
| ప్రయోజనము | – | అవునని నిర్ధారణ చేయుట |
| సంగతి | – | పరస్పరానుకూల్యము చూచుట |

ఈ లక్షణాలుంటేనే అది **'అధికరణ'** అనబడుతుంది.

**విషయః సందేహః సంగతిః పూర్వపక్షః సిద్ధాన్త ।**
**ఇత్యేకైక మధికరణం పంచావయవం జ్ఞేయం ॥**

విషయము, సందేహము (సంశయము), సంగతి, పూర్వపక్షము, సిద్ధాంతము అనేవి అధికరణకు ఐదు అవయవముల వంటివి.

ఏదైనా ఒక విషయాన్ని గురించి చెప్పేటప్పుడు ఇతర గ్రంథాలలో దాన్ని గురించి ఏం చెప్పారు? దానిమీద మనకున్న సందేహాలు ఏవి? వాటికి సమాధానాలు ఏవి? దానిమీద వాద ప్రతివాదనలు; విషయాన్ని అవును అని నిర్ధారణ చెయ్యటము. అలా తీర్మానించటానికి సిద్ధాంతము. ఈ విషయాలను దృష్టిలో పెట్టుకుని చేసే గ్రంథభాగమే అధికరణము.

మరి **'సూత్రము'** అంటే

**అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతో ముఖం ।**
**అస్తోభమనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః ॥**

కొద్ది అక్షరాలు మాత్రమే కలిగి ఉండి, అనుమానానికి తావు లేకుండా అర్థాన్ని వివరిస్తూ, ఆకారంలో చిన్నదై ఏవిధమైన దోషము లేని వాక్యాన్ని సూత్రము అంటారు. సూత్రము అంటే దారము అనికూడా అర్థం. పూలన్నీ కలిపి మాలగా గ్రుచ్చటానికి ఉపయోగపడేది. దండ గ్రుచ్చిన తరువాత దానికి ఉపయోగించిన దారం కనిపించదు. కేవలము పూలు మాత్రమే కనిపిస్తాయి. అలాగే సృష్టిలో మనకు కనిపించే 84 లక్షల జీవరాసి, పర్వతాలు, లోయలు, ఎడారులు, చెట్లుచేమలు, నదీనదాలు, అడవులు, కొండలు ప్రాణమున్నవి, ప్రాణంలేనివి అన్నీ ఒకే సూత్రంతో బంధించబడి ఉన్నాయి. ఇలా జగత్తునంతటినీ ఒకే సూత్రంతో కలిపి ఉంచగలిగినది 'ఆత్మ'. ఈ విషయం వివరించటానికే బ్రహ్మసూత్రాలు వ్రాశాడు వ్యాసమహర్షి. పరబ్రహ్మ స్వరూపం నిరాకారమని కొందరు, సాకారమని కొందరు భాష్యం చెప్పారు. ఈ భాష్యాలన్నీ కేవలము శాస్త్రపండితులకే గాని ఇతరులకు అర్థం కావని లోకంలో ఒక నానుడి ఉంది. అందుకే బ్రహ్మసూత్రాలు పండితులకే కాదు. సామాన్యుడికికూడా అర్థం కావాలనే దృష్టితోనే, అతితేలిక అయిన భాషలో **శ్రీవిద్యా సంప్రదాయంలో పరాశక్తి స్వరూపమైన లలితా త్రిపుర సుందరియే పరబ్రహ్మ** స్వరూపమని నిరూపణ చేస్తూ **'శ్రీవిద్యాబ్రహ్మసూత్రభాష్యం'** అనే పేరుతో **బ్రహ్మసూత్ర భాష్యం** వ్రాస్తున్నాను. ఇందులో సాకారం త్రిపురసుందరి. నిరాకారం పరాశక్తి. సాకారాన్ని అర్చిస్తే మహదైశ్వర్యము, నిరాకారాన్ని ఉపాసన చేస్తే మోక్షము సిద్ధిస్తాయని చెబుతూ, సాకార, నిరాకారాలు, ద్వైతాద్వైతాలు రెండింటినీ ప్రతిపాదించటం జరుగుతోంది. పండితులు, బ్రహ్మవేత్తలు నా ఈ ప్రయత్నాన్ని మన్నించి, నన్ను ఆశీర్వదింతురు గాక.

# III. సూత్రభాష్యాలలో తేడాలు

**'భాష్యం'** అంటే విశేష వివరణ అని అర్థం. ఒకే పదానికి అనేక అర్థాలుంటాయి. వాటిలో ఎవరికి వచ్చిన అర్థం వారు తీసుకుని ఆ పదాన్ని వివరిస్తారు. ఉదా॥కు 'సెల్' అనే పదానికి

కణము అని అర్థం చెబుతారు బయలజీ మాస్టారు

బ్యాటరీ అని అర్థం చెబుతారు ఫిజిక్స్ మాస్టారు

అమ్మకము అని అర్థం చెబుతారు ఎకనామిక్స్ మాస్టారు

జైలు గది అని అర్థం చెబుతారు హిస్టరీ మాస్టారు

**మాల్‌లో అమ్మే చీరలమీద ఇచ్చే డిస్కౌంటు** అంటుంది అమ్మ

ఈ రకంగా ఎవరి మనోభావాలను బట్టి వారు అర్థం చెబుతుంటారు. అందుకే ఒకే గ్రంథానికి వివిధ రకాలైన భాష్యాలు వచ్చినాయి.

వ్యాసమహర్షి వ్రాసిన బ్రహ్మసూత్రాలకు కొంతమంది వ్యాఖ్య వ్రాశారు. వారిలో శంకర భగవత్పాదుల వారు నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ అని ప్రతిపాదించారు. కాగా మిగిలిన వారందరూ సగుణబ్రహ్మను ప్రతిపాదించారు. వీరిలో మొదటివాడు బోధాయనమహర్షి. వీరి ప్రకారం ప్రతి మానవుడు వర్ణాశ్రమ ధర్మాలు నిర్వర్తిస్తూ, తత్త్వజ్ఞానాన్ని సంపాదించి, శ్రోత్రీయుడు, బ్రహ్మజ్ఞాని అయిన ఆచార్యుడిని ఆశ్రయించి, సాధనచతుష్టయాన్ని అనుసరిస్తూ, పరబ్రహ్మను ధ్యానం చెయ్యగా, కొంత కాలానికి పరబ్రహ్మసాక్షాత్కారం పొంది, బ్రహ్మనుప్రేమించి, అతనిచే ప్రేమించబడి, పరస్పరప్రీతి మూలంగా పూర్వజన్మల కర్మననుసరించి, జన్మలు లేనివాడై, స్వస్వరూపావిర్భావము పొంది, మోక్షం సిద్ధించినవాడౌతాడు.

ఈ గ్రంథం చాలా పెద్దది. ఇది అందరికీ తేలికగా అర్థం కావాలనే ఉద్దేశ్యంతో ద్రవిడాచార్యులవారు దీనికి ద్రవిడభాష్యం వ్రాశారు. తరువాత టంకాచార్యుల వారు ఈ సూత్రాలకు కారికలు వ్రాశారు.

అయితే బోధాయనుడు వ్రాసిన **వృత్తి** వ్యాఖ్య లభ్యం కావటంలేదు.

బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాసినవారు, వారుప్రతిపాదించిన దేవత, ఇప్పుడు మనం చూద్దాం.

| వ.సం. | భాష్యకారుడు | ప్రతిపాదించిన దేవత |
|---|---|---|
| 1. | బోధాయన మహర్షి | |
| 2. | శంకరాచార్యులు | నిరాకారుడు, నిర్గుణుడు |
| 3. | రామానుజాచార్యుల | శ్రీమహావిష్ణువు |
| 4. | మధ్వాచార్యులు | శ్రీమహావిష్ణువు |
| 5. | రఘువరదాసు | శ్రీరాముడు |
| 6. | నింబార్కాచార్యులు | శ్రీకృష్ణుడు |
| 7. | వల్లభాచార్యులు | శ్రీకృష్ణుడు |
| 8. | బలదేవాచార్యులు | శ్రీకృష్ణుడు |
| 9. | శ్రీకంఠారాధ్యులు | శివుడు |
| 10. | పంచాననతర్కాచార్యులు | శక్తి |
| 11. | శ్రీపతి పండితాచార్యులు | శివునితో కలిసిన శక్తి |

శంకరాభాష్యంలో 191 అధికరణలు 555 సూత్రాలు ఉంటే, మిగిలిన భాష్యాలలో ఈ సంఖ్యలో తేడా ఉంది. అసలు ఈ తేడా ఎందుకు వచ్చింది? అనే విషయాన్ని చూద్దాం. భాష్యం వ్రాసేటప్పుడు శంకరుడు, వ్యాసభగవానుడు చెప్పిన సూత్రాలను యథాతథంగా తీసుకున్నాడు. బ్రహ్మసూత్రాలకు మొదటిగా భాష్యం వ్రాసింది శంకరుడే. రామానుజుడు వ్రాసింది **శ్రీభాష్యం.**

## తేడాలు

శంకర భాష్యంలో 191 అధికరణలు 555 సూత్రాలు ఉంటే శ్రీభాష్యంలో 156 అధికరణలు 545 సూత్రాలు ఉన్నాయి. ఈతేడా ఎందుకు వచ్చింది? శంకర భాష్యాన్ని ప్రాతిపదికగా తీసుకుని ఈ విషయం చూద్దాం.

బ్రహ్మసూత్రాలకు కొన్ని మార్పులు చేర్పులు జరిగాయి. అవి ఎలాగంటే

1. రెండు సూత్రాలు కలిపి ఒకటిగా వ్రాయటం
2. ఒకే సూత్రాన్ని రెండుగా విడదీయటం

3. కొన్ని సూత్రాలు క్రొత్తగా చేర్చటం

4. కొన్ని సూత్రాలు వదలి వెయ్యటం

ఈ రకమైన తేడా విష్ణుసహస్రంలో కూడా కనిపిస్తుంది. శంకరుల వారు వ్రాసిన నామాలలో కొన్నింటిని కలపటం, కొన్నింటిని విడదీయటం చేశారు భట్టరువారు. అయితే అవి సహస్రనామాలు కాబట్టి సంఖ్యలో మార్పుండదు. దీని మీద వివరణకు నేను వ్రాసిన **విష్ణుసహస్రనామ భాష్యం** శ్రీ కైవల్యసారథి చూడండి.

ఇప్పుడు ఈ మార్పులు చేర్పులు ఎక్కడ? ఎలా? జరిగాయో చూద్దాం. ముందుగా **మొదటి అధ్యాయం**లో

1. **మొదటి పాదంలో** 9వ సూత్రం **'ప్రతిజ్ఞావిరోధాత్'** శ్రీభాష్యంలో క్రొత్తంగా చేర్చటం జరిగింది. దీంతో మొదటి పాదంలో శంకరభాష్యం ప్రకారం 31 సూత్రాలుంటే, శ్రీభాష్యంలో ఇంకొకటి కలిపి 32 సూత్రాలయినాయి.

**రెండవ పాదంలో** 16వ సూత్రం **అతఏవచసబ్రహ్మ** శ్రీభాష్యంలో క్రొత్తగా చేరింది. దీంతో శంకరభాష్యంలోని ఈ పాదంలో 32 సూత్రాలుంటే, శ్రీభాష్యంలో 33 సూత్రాలయినాయి.

శ్రీభాష్యంలో 20, 21 సూత్రాలకు శంకరభాష్యంలోని 19, 20 సూత్రాలకు కొంచెం తేడా ఉంది.

*శ్రీభాష్యం* ***సూత్రం - 20 "న చ స్మార్త మతద్ధర్మాభిలాపాచ్ఛారీరశ్చ"***

***సూత్రం - 21 "ఉభయేపి హి భేదేనైన మధీయతే"***

శం॥ ***సూత్రం - 19"న చ స్మార్త మతద్ధర్మాభిలాపాత్"***

***సూత్రం - 20 "శారీరశ్చోభయేపి హి భేదేనైన మధీయతే"***

ఇక్కడ శంకరభాష్యంలో 20వ సూత్రంలో కొంత భాగాన్ని శ్రీభాష్యంలో 20వ సూత్రంలో కలిపి చెప్పటం జరిగింది. దీనివల్ల సూత్రాల సంఖ్యలో ఏ రకంగానూ తేడారాదు.

**మూడవ పాదంలో**

1. శంకర భాష్యంలోని 3,4 సూత్రాలను కలిపి శ్రీభాష్యంలో ఒకటే సూత్రం 3గా వ్రాశారు.

శం. సూ॥ 3. **నామ మానమతచ్ఛబ్దాత్**

**4. ప్రాణభృశ్చ**

శ్రీభాష్యం సూ. 3. నానుమానమతచ్ఛబ్దాత్ప్రాణభృచ్ఛ

2. శంకరభాష్యంలోని 35వ సూత్రాన్ని శ్రీభాష్యంలో 34, 35 సూత్రాలుగా వ్రాశారు.

శం.సూ. 35 క్షత్రియ త్వావగతే శ్చోత్తరత్ర చైత్రరథేన లింగాత్

శ్రీభాష్యం సూ. 34 క్షత్రియత్వగతేశ్చ

35 ఉత్తరత్రచైత్రరథేనలింగాత్

3. శంకరభాష్యంలోని 38వ సూత్రాన్ని శ్రీభాష్యంలో 38, 39 సూత్రాలుగా వ్రాశారు.

శం॥ సూ. 38 శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధాత్ స్మృతేశ్చ

శ్రీభాష్యం 38 శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధాత్

39 స్మృతేశ్చ

వీటివల్ల శ్రీభాష్యంలో రెండు సూత్రాలు పెరిగి, ఒక సూత్రం తగ్గింది. మొత్తం మీద ఒక సూత్రం పెరిగి శంకర భాష్యంలో 43 సూత్రాలుంటే శ్రీభాష్యంలో 44 సూత్రాలయినాయి.

**నాల్గవ పాదం**

శంకర భాష్యంలోని 26వ సూత్రాన్ని శ్రీభాష్యంలో రెండుగా చేసి 26, 27 సూత్రాలుగా వ్రాశారు.

శం॥ సూత్రం 26 ఆత్మకృతేః పరిణామాత్

శ్రీభాష్యం సూ. 26 ఆత్మకృతేః

27 పరిణామాత్

దీనివల్ల శ్రీభాష్యంలో ఒక సూత్రం పెరిగింది. దాంతో శంకర భాష్యంలో 28 సూత్రాలుంటే శ్రీభాష్యంలో 29 సూత్రాలు ఉన్నాయి.

ఈ రకంగా శ్రీభాష్యం మొదటి అధ్యాయంలోని ప్రతిపాదంలోను ఒక సూత్రం చొప్పున మొత్తం నాలుగు సూత్రాలు పెరిగి శంకర భాష్యం మొదటి అధ్యాయంలో 134 సూత్రాలుంటే శ్రీభాష్యంలో 138 సూత్రాలున్నాయి. అలాగే శంకర భాష్యంలో అధికరణలు 39 కాగా శ్రీభాష్యంలో 35 అధికరణలు ఉన్నాయి.

**రెండవ అధ్యాయం**

**మొదటి పాదం :** ఇందులో

1. శంకరభాష్యంలోని 11వ సూత్రాన్ని శ్రీభాష్యంలో 11, 12 సూత్రాలుగా వ్రాశారు.

శం. సూ. 11 తర్కాప్రతిష్ఠానాదాన్యథానుమేయమితి చేదేవమప్య నిర్మోక్ష ప్రసంగః

శ్రీభాష్యం సూ. 11 తర్కా ప్రతిష్ఠానాదపి

12 అన్యథానుమేయమితి చేదేవమప్య నిర్మోక్ష ప్రసంగః

2. శంకరభాష్యంలోని 17, 18 సూత్రాలను కలిపి శ్రీభాష్యంలో 18వ సూత్రంగా వ్రాశారు.

శంకర. సూ. 17 అసద్వ్యపదేశాన్నేతి ఛేన్న ధర్మాంతరేణ వాక్యశేషాత్

18 యుక్తిః శబ్దాన్తరాచ్చ

శ్రీభాష్యం సూ. 18 అసద్వ్యపదేశాదితి ఛేన్న దర్మాంతరేణ వాక్యశేషాద్యుక్తే శబ్దాన్తరాచ్చ

3. శంకరభాష్యంలోని 35, 36 సూత్రాలను కలిపి శ్రీభాష్యంలో 35వ సూత్రంగా వ్రాశారు.

శంకర సూ 35 నకర్మావిభాగాదితి చేన్నానాదిత్వాత్

36 ఉపపద్యతే చాప్యుపలభ్యతే

శ్రీభాష్యం సూ 35 నకర్మవిభాగాదితి చేన్నానాదిత్వాదుపపద్యతే చాప్యుపలభ్యతే

దీనివల్ల శంకరభాష్యం కన్న శ్రీభాష్యంలోని సూత్రాల సంఖ్య ఒకటి పెరిగి, రెండు తగ్గింది. ఫలితంగా శంకరభాష్యంలో 37 సూత్రాలుంటే, శ్రీ భాష్యంలో 36 అయింది.

**రెండవ పాదం** ఇందులో

1. శంకరభాష్యంలోని 1, 2 సూత్రాలను కలిపి శ్రీభాష్యంలో ఒకే సూత్రంగా చెప్పారు.

శం. సూ 1. రచనానుపపత్తేశ్చనానుమానమ్

2. ప్రవృత్తేశ్చ

శ్రీభాష్యం సూత్రం 1. రచనానుపపత్తేశ్చనానుమానం ప్రవృత్తేశ్చ

2. శంకరభాష్యంలోని 30, 37 సూత్రాలు శ్రీభాష్యంలో లేవు

శంకర. సూ. 30 క్షణికత్వాశ్చ

37 సంబంధానుపపత్తేశ్చ

దీనివల్ల శ్రీభాష్యంలో శంకరభాష్యం కన్న మూడు సూత్రాలు తగ్గి శంకర భాష్యంలో 45 సూత్రాలుంటే శ్రీభాష్యంలో 42 సూత్రాలే ఉన్నాయి.

శంకరభాష్యంలోని 6వ సూత్రం **అభ్యుపగమేప్యర్థాభావాత్** శ్రీభాష్యంలో 8వ సూత్రం అయింది.

శంకరభాష్యంలోని 8వ సూత్రం **అంగిత్వానుపపత్తేశ్చ** శ్రీభాష్యంలో 6వ సూత్రం అయింది. దీనివల్ల సూత్రాల సంఖ్యలో తేడా రాదు.

**మూడవ పాదం :** ఇందులో

1. శంకర భాష్యంలోని 3,4 సూత్రాలను ఒకటిగా కలిపి శ్రీభాష్యంలో 3వ సూత్రంగా వ్రాశారు.

శంకర సూ. 3 గౌణ్యసంభవాత్

4 శబ్దాశ్చ

శ్రీ భాష్యం సూ 3 గౌణ్యసంభవాచ్ఛబ్దాశ్చ

2. శంకరభాష్యంలో 6వ సూత్రాన్ని శ్రీభాష్యంలో 5, 6 సూత్రాలుగా విడదీసి వ్రాశారు.

శంకర. సూ. 6 ప్రతిజ్ఞాహానిరవ్యతిరేకాచ్ఛబ్దేభ్యః

శ్రీభాష్యం సూ 5 ప్రతిజ్ఞాహానిరవ్యతిరేకాత్

6 శబ్దేభ్యః

3. శంకరభాష్యంలోని 12వ సూత్రాన్ని శ్రీభాష్యంలో 12, 13 సూత్రాలుగా విడదీసి వ్రాశారు.

శంకర. సూ. 12 పృథివ్యధికారరూపశబ్దాంతరేభ్యః

శ్రీభాష్యం సూ. 12 పృథివీ

13 అధికారరూప శబ్దాంతరేభ్యః

4. శంకరభాష్యంలోని 26, 27 సూత్రాలను కలిపి శ్రీభాష్యంలో 27వ సూత్రంగా వ్రాశారు.

శంకర. సూ 26 వ్యతిరేకోగంధవత్

27 తథాచదర్శయతి

శ్రీభాష్యం సూ 27 వ్యతిరేకోగంధవత్తథా చ దర్శయతి

5. శంకరభాష్యంలోని 35, 34 సూత్రాలను కలిపి శ్రీభాష్యంలో 34వ సూత్రంగా వ్రాశారు.

శంకర సూ. 35 ఉపాదానాత్

34 విహారోపదేశాత్

శ్రీ భాష్యం సూ 34 ఉపాదానాద్విహారో పదేశాచ్చ

ఈ రకంగా చూస్తే శంకర భాష్యం కన్న శ్రీభాష్యంలో రెండు సూత్రాలు పెరిగి, మూడు సూత్రాలు తగ్గినాయి. దీంతో శంకర భాష్యంలో 53 సూత్రాలు ఉంటే శ్రీ భాష్యంలో 52 సూత్రాలే ఉన్నాయి.

**నాల్గవ పాదం** ఇందులో

1. శంకరభాష్యంలోని 2, 3 సూత్రాలు కలిపి శ్రీభాష్యంలో 2వ సూత్రంగా వ్రాశారు.

శం. సూత్రం 2 గౌణ్యసంభవాత్

3 తత్ప్రాక్ఛ్రుతేచ్ఛ

శ్రీభాష్యం సూ 2 గౌణ్యసంభవా తత్ప్రాక్ఛ్రుతేశ్చ

2 శంకరభాష్యంలోని 14, 15 సూత్రాలు కలిపి శ్రీభాష్యంలో 13వ సూత్రంగా వ్రాశారు.

శం. సూ 14 జ్యోతిరాద్యధిష్ఠానంతు తదా మననాత్

15 ప్రాణవతాశబ్దాత్

శ్రీభాష్యం సూ 13 జ్యోతిరాద్యధిష్ఠానంతు తదా మననాత్ప్రాణావతాశబ్దాత్

3. శంకరభాష్యంలోని 18, 19 సూత్రాలు కలిపి శ్రీభాష్యంలో 16 సూత్రంగా వ్రాశారు.

శం. సూ. 18 భేదశ్రుతేః

19 వై లక్షణ్యాచ్చ

శ్రీభాష్యం సూ 16 భేదశ్రుతేర్వైలక్షణాచ్చ

దీనివల్ల శంకరభాష్యం కన్న శ్రీభాష్యంలో మూడు సూత్రాలు తగ్గి శంకర భాష్యంలోని నాల్గవ పాదంలో 22 సూత్రాలుంటే శ్రీ భాష్యంలో 19 సూత్రాలే ఉన్నాయి. అలాగే రెండవఅధ్యాయంలో శంకరభాష్యంలో 47 అధికరణలు ఉంటే, శ్రీభాష్యంలో 33 అధికరణలు ఉన్నాయి. శంకరభాష్యంలో రెండవ అధ్యాయంలో 157 సూత్రాలుంటే శ్రీభాష్యంలో 8 సూత్రాలు తగ్గి 149 సూత్రాలున్నాయి.

**మూడవ అధ్యాయం - మొదటి పాదం**

ఇందులోని సూత్రాలలో ఏ రకమైన తేడా లేదు. రెండు భాష్యాలలోను 27 సూత్రాలే ఉన్నాయి.

**రెండవపాదం** ఇందులో

1. శంకర భాష్యంలోని 20, 21 సూత్రాలను కలిపి శ్రీభాష్యంలో 20వ సూత్రంగా వ్రాశారు.

శం. సూ. 20 వృద్ధిహ్రాసభాక్త్వమంతర్భావాదుభయసామంజ్ఞస్యాదేవమ్

21 దర్శనాచ్చ

శ్రీభాష్యం సూ 20 వృద్ధిహ్రాసభాక్త్వమంతర్భావాదు భయసామంస్యా దేవం దర్శనాచ్చ

దీనివల్ల శంకరభాష్యంలో కన్న శ్రీభాష్యంలో ఒక సూత్రం తగ్గి శంకర భాష్యంలో 41 సూత్రాలుంటే శ్రీభాష్యంలో 40 సూత్రాలున్నాయి.

2. శంకరభాష్యంలో 5వ సూత్రం **పరాభిధ్యానాత్తు తిరోహితం తతోహస్య బంధ విపర్యయౌ** శ్రీభాష్యంలో 4 సూత్రం అయింది.

3. శంకరభాష్యంలో 4వ సూత్రం **సూచకశ్చహిశ్రుతే రాచక్షతేచ తద్విదః** శ్రీ భాష్యంలో 6వ సూత్రం అయింది.

4. శంకరభాష్యంలోని 6వ సూత్రం **దేహయోగాద్వాసోపి** శ్రీభాష్యంలో 5వ సూత్రం అయింది.

వీటివల్ల సూత్రాల సంఖ్యలో తేడా రాదు.

**మూడవ పాదం** ఇందులో

1. శంకరభాష్యంలోని 35, 36 సూత్రాలను కలిపి శ్రీభాష్యంలో 35వ సూత్రంగా వ్రాశారు.

శం. సూ 35 అంతరాభూత గ్రామవత్స్వాత్మనః

36 అన్యథాభేదానుపపత్తిరితి చేన్నోపదేశాంతరవతు

శ్రీభాష్యం సూ 35 అంతరాభూతగ్రామవత్స్వాత్మనోన్యథా భేదానుపపత్తి రితి చేన్నోపదేశవతు

శంకర భాష్యంలోని 47, 48 సూత్రాలు కలిపి శ్రీభాష్యంలో 46వ సూత్రంగా వ్రాశారు.

శం॥ సూ. 47 విద్యైవతునిర్ధారణాత్

48 దర్శనాచ్చ

శ్రీభాష్యం సూ 46 విద్యైవతునిర్ధారణాద్దర్శనాచ్చ

దీనివల్ల శంకరభాష్యం కన్న శ్రీభాష్యంలో రెండు సూత్రాలు తగ్గి శంకర భాష్యంలో 66 సూత్రాలుంటే శ్రీభాష్యంలో 64 సూత్రాలున్నాయి.

3. శంకరభాష్యంలో 23వ సూత్రం **సంభృతి ద్యువ్యాప్త్యపిచాతః పురుషవిద్యాయామివ** 24వ సూత్రం **చేతరేషామన్మానాత్** ఇందులో 23వ సూత్రంలో సగభాగం 24వ సూత్రంలో కలిపి శ్రీభాష్యంలో 24వ సూత్రంగా **పురుషవిద్యా యామపి చేతరేషామానామ్నానాత్** అని వ్రాశారు.

4. శంకరభాష్యంలోని 31వ సూత్రం **అనియమః సర్వాసామవిరోధః శబ్దానుమానాభ్యామ్.** దీన్ని శ్రీభాష్యంలో 32వ సూత్రంగా వ్రాశారు.

5. శంకరభాష్యంలోని 32వ సూత్రం **యావదధికారమవస్థితి రాధికారికాణామ్** దీన్ని శ్రీభాష్యంలో 31వ సూత్రంగా వ్రాశారు.

వీటివల్ల సూత్రాల సంఖ్యలో తేడా రాదు.

**నాల్గవపాదం** ఇందులో

1. శంకరభాష్యంలోని 46వ సూత్రం **శ్రుతేశ్చ** శ్రీభాష్యంలో లేదు. దీంతో ఒక సూత్రం తగ్గి శంకరభాష్యంలో 52 సూత్రాలుంటే శ్రీభాష్యంలో 51

సూత్రాలున్నాయి. మొత్తం మీద మూడవ అధ్యాయంలో శంకరభాష్యంలో 67 అధికరణలు, 186 సూత్రాలు ఉండగా శ్రీభాష్యంలో 55 అధికరణలు 182 సూత్రాలు ఉన్నాయి.

**నాల్గవ అధ్యాయం – మొదటి పాదం**

ఈ పాదంలోని సూత్రాలలో ఏ రకమైన తేడాలు లేవు. శంకరభాష్యం ప్రకారము 19 సూత్రాలుండగా, శ్రీభాష్యంలో కూడా 19 సూత్రాలే ఉన్నాయి.

**రెండవ పాదం** ఇందులో

1. శంకరభాష్యంలోని 12, 13 సూత్రాలు కలిపి శ్రీభాష్యంలో 12వ సూత్రంగా వ్రాశారు.

శం॥ సూ. 12 ప్రతిషేధాదితిచేన్నశరీరాత్

13 స్పష్టోహ్యేకేషామ్

శ్రీభాష్యం సూ. 12 ప్రతిషేధాదితి చేన్న శరీరాత్స్పష్టోహ్యేకేషామ్

దీనివల్ల శ్రీభాష్యంలో ఒక సూత్రం తగ్గి, శంకరభాష్యంలో 21 సూత్రాలుండగా, శ్రీభాష్యంలో 20 సూత్రాలున్నాయి.

**మూడవపాదం** ఇందులో

1. శంకరభాష్యంలోని 5వ సూత్రం ఉభయవ్యామోహాత్తత్సిద్ధేః శ్రీభాష్యంలో లేదు. ఈ కారణం చేత శ్రీభాష్యంలో ఒక సూత్రం తగ్గి, శంకర భాష్యంలో 16 సూత్రాలుండగా, శ్రీభాష్యంలో 15 సూత్రాలున్నాయి.

**నాల్గవపాదం** ఇందులోని సూత్రాలలో ఏ రకమైన తేడా లేదు. శంకర భాష్యంలో 22 సూత్రాలు ఉండగా, శ్రీభాష్యంలో కూడా 22 సూత్రాలే ఉన్నాయి.

ఇలా చూస్తే నాల్గవ అధ్యాయంలో శంకర భాష్యంలో 38 అధికరణలు, 78 సూత్రాలు ఉండగా శ్రీ భాష్యంలో 33 అధికరణలు 76 సూత్రాలు ఉన్నాయి.

ఇప్పుడు శంకరభాష్యానికి, శ్రీభాష్యానికి నాలుగు అధ్యాయాలలోను అధికరణలు, సూత్రాల మధ్య గల తేడా చూడండి.

| అధ్యాయం | శంకరభాష్యము | | శ్రీభాష్యము | |
|---|---|---|---|---|
| | అధికరణలు | సూత్రాలు | అధికరణలు | సూత్రాలు |
| మొదటి అధ్యాయము | 39 | 134 | 35 | 138 |
| రెండవ అధ్యాయము | 47 | 157 | 33 | 149 |
| మూడవ అధ్యాయము | 67 | 186 | 55 | 182 |
| నాల్గవ అధ్యాయము | 38 | 78 | 33 | 76 |
| మొత్తం | 191 | 555 | 156 | 545 |

ఇలా చూసినట్లైతే శంకరభాష్యం కన్న శ్రీభాష్యంలో క్రొత్తగా చేరినవి రెండు సూత్రాలు అవి

1. అధ్యాయం 1 పాదం 1 సూత్రం 9
2. అధ్యాయం 1 పాదం 2 సూత్రం 16

శంకరభాష్యంలో ఉండి శ్రీభాష్యంలో కనుపించనివి నాలుగు సూత్రాలు అవి

1 అధ్యాయం 2 పాదం 2 సూత్రం 30
2. అధ్యాయం 2 పాదం 2 సూత్రం 37
3. అధ్యాయం 3 పాదం 4 సూత్రం 46
4. అధ్యాయం 4 పాదం 3 సూత్రం 5

మొత్తం మీద శంకరభాష్యం కన్న శ్రీభాష్యంలో రెండు సూత్రాలు క్రొత్తగా రాగా, నాలుగు సూత్రాలు లేవు. అంటే ఈ రెండు భాష్యాల మధ్యన తేడా. కేవలము రెండు సూత్రాలు మాత్రమే. ఈ మిగిలినదదంతా కొన్ని సూత్రాలు కలపటం, కొన్ని సూత్రాలు విడగొట్టటంవల్ల వచ్చినదే. కాబట్టి శంకరభాష్యానికి, శ్రీభాష్యానికి సూత్రాలలో తేడా లేదనే చెప్పవచ్చు. ఇకపోతే అధికరణల సంఖ్యలో తేడా ఉన్నప్పటికీ, అది గుర్తించతగినది ఏమీ కాదు.

ఇదే విధంగా ఇతర భాష్యాలలో కూడా తేడా ఉన్నది.

# మొదటి అధ్యాయం

## మొదటి పాదం

బ్రహ్మసూత్రాలు మొత్తం నాలుగు అధ్యాయాలుగా ఉన్నాయి. ప్రతి అధ్యాయంలోను నాలుగు పాదాలు, ప్రతిపాదంలోను కొన్ని అధికరణలు, ప్రతి అధికరణలోను కొన్ని సూత్రాలు ఉన్నాయి. ఈ రకంగా బ్రహ్మసూత్రాలలో 191 అధికరణలు, 555 సూత్రాలు ఉన్నాయి. ఇప్పుడు మొదటి అధ్యాయంలో మొదటి పాదం చూద్దాం. ఇందులో 11 అధికరణలు, 31 సూత్రాలు ఉన్నాయి.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | జిజ్ఞాసాధికరణము | బ్రహ్మను తెలుసుకోవాలనే కోరిక | 1 |
| 2. | జన్మాద్యధికరణము | పరబ్రహ్మ లక్షణాలు | 1 |
| 3. | శాస్త్రయోనిత్వాధికరణము | సర్వజ్ఞుడు | 1 |
| 4. | సమన్వయాధికరణము | వేదాంతవాక్యాల సమన్వయము | 1 |
| 5. | ఈక్షత్యధికరణము | జగత్కారణము చేతనమా? అచేతనమా? | 7 |
| 6. | ఆనందమయాధికరణము | బ్రహ్మము ఆనందమయము | 8 |
| 7. | అంతరధికరణము | ఆదిత్యుని యందున్న పురుషుడు జీవుడు కాదు | 2 |
| 8. | ఆకాశాధికరణము | ఆకాశము బ్రహ్మ | 1 |
| 9. | ప్రాణాధికరణము | ప్రాణము బ్రహ్మ | 1 |
| 10. | జ్యోతిశ్చాధికరణము | జ్యోతిబ్రహ్మ | 4 |
| 11. | ప్రతర్దనాధికరణము | వాయువు బ్రహ్మ | 4 |

మొత్తం అధికరణలు 11. మొత్తం సూత్రాలు 31.

ఇప్పుడు మొదటి పాదాన్ని చూద్దాం.

# 1. జిజ్ఞాసాధికరణము (బ్రహ్మను గురించి తెలుసుకోవాలనే కోరిక)

బ్రహ్మసూత్రాలు మొత్తం 191 అధికరణలుగా ఉన్నాయి. మొదటి పాదంలో పదకొండు అధికరణలు ముప్పైఒక్క సూత్రాలు ఉన్నాయి. అందులో మొదటి అధికరణను ప్రారంభం చేస్తున్నాము. ఇది **జిజ్ఞాసాధికరణము.** ఇందులో ఒకటే సూత్రం ఉంది.

**సూత్రం – *1* "అథాతోబ్రహ్మజిజ్ఞాసా".**

ఇక బ్రహ్మమును గురించి తెలుసుకోవాలనే కోరిక.

అథ – పిమ్మట, అతః – కాబట్టి, బ్రహ్మజిజ్ఞాసా – బ్రహ్మమును తెలుసుకోవాలనే కోరిక. వివేకాది సాధనసంపత్తి సిద్ధించిన తరువాత కర్మఫలంఅనిత్యము, అశాశ్వతము, మోక్షమునిత్యము, పరబ్రహ్మయేసత్యము అని తెలిసింది కాబట్టి ముముక్షువు బ్రహ్మను గురించి తెలుసుకోవటానికి ప్రయత్నించాలి.

సాధకుడు వేదవేదాంగాలు చదివాడు. బ్రహ్మచర్యం పూర్తయింది. గృహస్తు అయినాడు. శాస్త్రోక్తంగా యజ్ఞయాగాలు నిర్వహించాడు.

**బ్రహ్మచర్యం :**

**బ్రహ్మచర్యం ప్రవక్ష్యామి బ్రహ్మప్రాప్తికరం నృణామ్ ।**
**ఆయురారోగ్యమైశ్వర్యం మన స్స్వాస్థ్యం శివాత్మకమ్ ॥**

బ్రహ్మచర్యం బ్రహ్మప్రాప్తిని అంటే మోక్షాన్ని కలుగచేస్తుంది. ఆయుస్సు, జ్ఞానము, మనోనిశ్చలతలను కలిగిస్తుంది. అది శివస్వరూపం. అంటే మంగళకరమైనది.

అసలు బ్రహ్మచర్యం అంటే ఏమిటి?

**బ్రహ్మణిచరతీతి బ్రహ్మచారీ, తస్యభావః బ్రహ్మచర్యం**

సర్వకాల సర్వావస్థల యందు బ్రహ్మభావంలో చరించేవాడు బ్రహ్మచారి. అతని భావనయే బ్రహ్మచర్యము. ఎవరైతే సదా పరమాత్మ యందే రమిస్తూ తృప్తి చెందుతున్నాడో, అతని స్థితి బ్రహ్మచర్యము.

**ఆత్మరతిః ఆత్మక్రీడ ఆత్మమిథునః ఆత్మానందః**

తన ఆత్మయందే ఆసక్తిగలవాడు. ఆత్మయందే రమించేవాడు, ఆత్మలోనే సంబంధపడి ఉండేవాడు, ఆత్మవిషయంలో ఆనందం పొందేవాడు ఉత్తమ బ్రహ్మచారి. బ్రహ్మచర్యానికి ఇదే పరాకాష్ట.

బ్రహ్మచర్యము మూడు రకాలుగా ఉంటుంది.

1. స్థూలము 2. సూక్ష్మము 3. కారణము.

1. స్థూలబ్రహ్మచర్యం – ఆసనాలు వేయటం
2. సూక్ష్మబ్రహ్మచర్యం – మనోనిర్మలత, ప్రాణాయామం.
3. కారణ బ్రహ్మచర్యం – ఆత్మశుద్ధి

**పునశ్శృణు మహాప్రాజ్ఞ ఆహారః కరుణాదృఢా ।**
**బ్రహ్మాత్మ భావనం చేతి ఋషీణాముత్తమం మతమ్ ॥**

1. ఆహారము 2. కరుణ 3. బ్రహ్మభావన అని బ్రహ్మచర్యం మూడు విధాలు

1. ఆహారము – సత్త్వగుణాన్ని పెంపొందింపచేసే ఆహారాన్ని మాత్రమే తీసుకోవటం.
2. కరుణ – భక్తిని పెంపొందింపచేసే కరుణ కూడా బ్రహ్మచర్యమే.
3. బ్రహ్మభావన – ఎల్లప్పుడు స్వాత్మయందే ఉండటం

**గార్హస్థ్యం నైష్ఠికం చేతి వైధురం చేతితత్రిధా ।**
**ఆజన్మనైష్ఠికం ప్రోక్తం గృహిణా మృతుకాలజమ్ ॥**
**గార్హస్థ్యం ప్రాప్తనాన్యస్తు భార్య యానాశతో యది ।**
**బ్రహ్మచర్య ముపాదత్తే తద్ వైధురమితీరితమ్ ॥**

బ్రహ్మచర్యము 1. నైష్ఠికము 2. గార్హస్థ్యము 3. వైధురము అని మళ్ళీ మూడు రకాలు.

1. నైష్ఠికము – పుట్టిన దగ్గర నుంచీ మరణించేదాకా ఏరకమైన దోషాలు లేకుండా ఆచరించేది.

ఉదా : శుకుడు, ఆంజనేయుడు, భీష్ముడు మొ॥ వారు

2. గార్హస్థ్యము : ఋతుకాలంలో మాత్రమే భార్యతో కలుస్తూ సంసారం చెయ్యటం. ఉదా : రాముడు, జనకుడు

3. వైధురము : భార్య మరణించిన తరువాత లేదా భార్య ఉన్నప్పుడు విరక్తితో బ్రహ్మచర్యం ఆచరించటము. ఉదా : విశ్వామిత్రుడు, యాజ్ఞవల్క్యుడు.

1. మానసిక బ్రహ్మచర్యము 2. వాచిక బ్రహ్మచర్యము 3. కాయకబ్రహ్మచర్యము. అని బ్రహ్మచర్యం మళ్ళీ మూడురకాలు.

1. మానసికము – మనసులో ఎలాంటి చెడు భావనలు లేకుండా ఉండటం.
2. వాచికము – పరుషవాక్యాలు, వ్యర్థసంభాషణలు చెయ్యకుండా ఉండటం.
3. కాయకము – శరీరంతో సంబంధం లేకుండా ఉండటం.

బ్రహ్మచర్యం పాటించే వాడికి ఏ ఆపదలు రావు. వారు ఎటువంటి కష్టాన్నైనా అధిగమించగలుగుతారు. మహాసముద్రం కూడా వారికి గోష్పాదంలాగా కనిపిస్తుంది. మహామేరుపర్వతం చిన్న రాతిగుట్టలాగా, దావానలము చిన్నదీపంలాగా, మహాబలశాలిఅయిన శత్రువు దుర్బలుడుగా కనిపిస్తారు. బ్రహ్మచర్యాన్ని నియమనిష్ఠలతో ఆచరించే వాడికి ఏ ఆహారమైనా జీర్ణమవుతుంది. అతడు వార్ధక్యంలో కూడా యవ్వనవంతుడుగా ఉంటాడు. యోగీశ్వరులందరికీ ఇదే పరమయోగనిష్ఠ. పరమదైవము. బ్రహ్మచర్యాన్ని స్త్రీలు కూడా ఆచరించవచ్చు. గార్గేయి, మైత్రేయి. ఇలాంటివారే.

పూర్తిగా విద్యాభ్యాసానికి ఉపయోగించేది బ్రహ్మచర్యం. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు ఈ మూడు వర్ణాల వారు కూడా తమ పిల్లలకి ఉపనయనం చేసి విద్యాభ్యాసం కోసం గురువుగారి దగ్గరకి పంపుతారు. ఉపనయనము అనేది రెండవ జన్మ. అలా ఉపనయనం చేయబడ్డ వాళ్ళు ద్విజులు అనబడతారు. విద్యార్థులు గురుకులంలో చేరి విద్యాభ్యాసం చేస్తారు. విద్యాభ్యాసం చెయ్యటానికి మూడు పద్ధతులున్నాయి.

**గురుశుశ్రూష యా విద్యా పుష్కలేన ధనేనవా ।**
**అథవావిద్యయా విద్యా చతుర్థోనోప లభ్యతే ॥**

1. గురువు గారికి సేవలు చేసి విద్య నేర్చుకోవటము. 2. గురువు గారికి పుష్కలంగా ధనమిచ్చి విద్య నేర్చుకోవటము. 3. తనకు వచ్చిన విద్యను గురువు గారికి చెప్పి ఆయన దగ్గర తనకు కావలసింది నేర్చుకోవటము. ఇంక నాలుగవ పద్ధతి అనేది లేదు. అయితే ఎక్కువమంది గురువుకు సేవలుచేసి విద్యనేర్చుకునేవారు. విద్యార్థిదశను దీర్ఘసత్రంగా చెబుతోంది శతపథ బ్రాహ్మణం. గురువుగారికి సేవలు చెయ్యటం అంటే ఆశ్రమంలో జరిగే నిత్యాగ్నిహోత్రానికి, హోమాలకు కావలసిన సమిధలు తేవటం, పశువులను మేపటం వంటివి. ఐతరేయ, తైత్తిరీయ బ్రాహ్మణాలలో నాభానేధిష్ఠుడు, భరద్వాజుడు వీరి కథలు గురుకులంలో విద్యాభ్యాసం ఎలా జరిగేదో వివరిస్తాయి. భాగవతంలో కృష్ణుడు, సుదాముడు గురుకులంలో ఎలా గడిపారో వివరించటం జరిగింది.

బ్రహ్మచారి అవలంబించవలసిన పద్ధతులు, ఆచారాలు, నిష్టలు కొన్నిఉన్నాయి. ముందుగా అతడు నిద్రను త్యజించాలి. కృష్ణాజనాన్ని మాత్రమే ధరించాలి. నేలమీదనే పడుకోవాలి. కీర్తిప్రతిష్టల కోసం ఎదురు చూడరాదు. కోపము అనేది అసలు ఉండరాదు. ఇతరులను ఎప్పుడూ బాధించరాదు. మాటలతో కూడా. సౌందర్యపోషణ పనికిరాదు. సుగంధ ద్రవ్యాలు వాడరాదు. తాంబూలం వేసుకోరారు. స్త్రీ నగ్నంగా ఉన్నప్పుడు చూడరాదు. నేలమీద దిగువస్థానంలో మాత్రమే కూచోవాలి. మంచం మీద పడుకోరాదు. జీవహింస చెయ్యరాదు. నడిచేప్పుడు కూడా అతినెమ్మదిగా నడవాలి. సంగీతం వినరాదు. నృత్యం చూడరాదు. నేలమీద ఇష్టం వచ్చినట్లు ఉమ్మివేయరాదు అని **గోపథబ్రాహ్మణం** చెబుతోంది. వీరికి వేదవేదంగాలు చెప్పబడేవి. సంహిత, బ్రాహ్మణము, అరణ్యకము ఉపనిషత్తులు శాస్త్రాలు అన్నీ చెప్పేవారు. ఇవి కాక న్యాయం, తర్కం, ఇతిహాసాలు, పురాణాలు, జ్యోతిష్యం, సర్పవిద్య, సాముద్రికం మొదలైన అన్నివిద్యలు నేర్పబడేవి. అని **శతపథ బ్రాహ్మణం** చెబుతోంది. విద్యవిషయంలోను, యజ్ఞయాగాది కర్మల విషయంలోను చర్చలు జరుగుతుంటాయి. శతపథబ్రాహ్మణంలో ఇలాంటి వాదనలు, చర్చలు అనేకం వివరించబడ్డాయి. యాజ్ఞవల్క్యుడు శాకల్యుడు, ఉద్దాలకుడు ప్రాచీనశీలుడు ఇలా వీరి మధ్య జరిగిన వాదనలు వివరించింది శతపథ బ్రాహ్మణం. బ్రహ్మచారులు రెండు రకాలుగా ఉంటారు అని శతవథ బ్రాహ్మణం చెబుతోంది.

1. నైష్ఠిక బ్రహ్మచారులు 2. ఉపకుర్వాణ బ్రహ్మచారులు

**1. నైష్ఠిక బ్రహ్మచారులు :** విద్యాభ్యాసం పూర్తి చేసి, సమావర్తనము, స్నాతక వ్రతము చేసి ఇంటికి పోకుండా, జిజ్ఞాసువై గురువుగారి దగ్గరే ఉంటూ నియమ నిష్టలతో బ్రహ్మచర్యం పాటిస్తూ, నిరంతరము సత్యాన్వేషణలో కాలం గడిపేవాడు. వీరు వివాహం చేసుకోరు. కాబట్టి మిగిలిన ఆశ్రమాలు గృహస్తాశ్రమము, వానప్రస్తము ఉండవు. ఇలాటి బ్రహ్మచారులను శతపథబ్రాహ్మణం **'వర్చస్వంతులు'** అంటోంది.

**2. ఉపకుర్వాణ బ్రహ్మచారులు :** గురువుగారి దగ్గర విద్యాభ్యాసం పూర్తి చేసి, సమావర్తనమాచరించి ఇంటికి పోయి స్నాతకవ్రతం చేసి తగిన పిల్లను చూసి వివాహం చేసుకుని, గృహస్థాశ్రమంలో అడుగు పెడతారు. గురువుగారి దగ్గర నుండి వచ్చేటప్పుడు గురుదక్షిణ చెల్లించి రావాలి. సామాన్యంగా తనకు ఏంకావాలో గురువే చెప్పాలి. గురుదక్షిణ చెల్లించిన తరువాత మాత్రమే గురుకులం నుంచి బయటపడతారు. ఇక్కడ ఇంకొక ముఖ్యమైన విషయం. గురువుగారి దగ్గర ఆయన యజ్ఞశాల నుంచి గార్హపత్యాగ్నిని తెచ్చుకుని తన గృహంలో అగ్నిహోత్రాన్ని ప్రతిష్టించాలి. ఇక జీవితాంతం ఈ అగ్ని అతని ఇంట్లో ప్రజ్వరిల్లుతూనే ఉండాలి. పూర్వకాలంలో అగ్ని ఎక్కడ పడితే అక్కడ, ఎప్పుడు కావాలంటే అప్పుడు దొరికేది కాదు. అందుకే అగ్నిని ఇంట్లో ఉంచుకునేవారు. ఇవాల్టిరోజున ఆ అవసరం లేదు అంటారు ఆధునికులు.

ఇక గురువులు కూడా రెండు రకాలుగా ఉన్నారు.

**1. స్థిరగురువులు :** ఒకే ప్రాంతంలో ఆశ్రమాన్ని నిర్మించుకుని, తన వద్దకు వచ్చే వారికి విద్యాబోధన చేసేవాడు.

**2. సంచార గురువు :** వీరు దేశాటనం చేస్తుంటారు. ఇలాటి గురువులను (చరకులు) అంటారు. అంటోంది శతపథ బ్రాహ్మణం. ఏ రకమైన ఫలితము ఆశించకుండా ఆవిద్యాభ్యాసం పూర్తి చేసేవారు. విద్యని వీరిని కూడా శతపథ బ్రాహ్మణంలో చెప్పటం జరిగింది.

**ఎన్ని శాస్త్రాలు చదివినా, యజ్ఞయాగాలు చేసినా, దేవతలను అర్చించినా, జీవాత్మ పరమాత్మల ఏకత్వం గురించి తెలియకపోతే ఉపయోగం లేదు. అటువంటి**

**వాడికి ఎన్ని కల్పాలు గడచినా మోక్షం రాదు. ధనంవల్ల మోక్షం లభించదు. కర్మలవల్ల మోక్షం రాదు. కర్మాచరణ వల్ల ఉత్తమలోకాలు మాత్రమే ప్రాప్తిస్తాయి. కేవలము జ్ఞానమే మోక్షానికి మార్గము. జ్ఞానదేవతు కైవల్యం.**

అందుచేత విద్వాంసుడు ఐహిక భోగాలను వదలిపెట్టి, మంచి గురువును శరణుజొచ్చి, ఆయనఉపదేశాలు శ్రద్ధగావింటూ, బ్రహ్మచర్యదీక్ష పాటిస్తూ, మోక్షమార్గం కోసం ప్రయత్నించాలి. సద్వస్తువైన ఆత్మను దర్శించటంలో నిమగ్నుడై, యోగియై సంసారసాగరంలో పడి కొట్టుమిట్టాడుతున్న తన ఆత్మను ఉద్ధరించుకోవాలి.

ఈ విధంగా ఎల్లప్పుడూ ఆత్మదర్శనాభ్యాస తత్పరుడైన విద్వాంసుడు సమస్త కర్మలను వదిలి, ప్రాపంచిక బంధనాల నుండి విముక్తి పొందటానికి ప్రయత్నించాలి. కర్మలు బంధహేతువులు. కాబట్టి కర్మపరిత్యాగం చెయ్యాలి. కర్మలవల్ల చిత్తశుద్ధి జరుగుతుంది. అంతేకాని జ్ఞానంమాత్రంరాదు. గురువు చేసిన బోధలు వినటం వల్ల, వాటిని గురించి ఆలోచించటం వల్ల ఆత్మజ్ఞానం కలుగుతుంది. అంతేకాని ఎన్ని తీర్థాలు సేవించినా, దానధర్మాలు చేసినా, సత్రాలు కట్టించినా, కర్మలు చేసినా జ్ఞానంమాత్రం రాదు.

ఆ ఆత్మనిష్ఠ కలగాలంటే విద్వాంసుడికి నాలుగు లక్షణాలుండాలి. వాటినే సాధనచతుష్టయము, సాధనసంపత్తి అంటారు. ఇవే మోక్షసాధనాలు. సాధన చతుష్టయము అంటే –

**1. నిత్యానిత్యవివేకము :** ఏది సత్యము? ఏది అసత్యము? ఏది నిత్యము? ఏది అనిత్యము? అనే విషయ పరిజ్ఞానం. **బ్రహ్మ సత్యం. జగన్ మిథ్య,** కనిపించే జగత్తంతా అనిత్యమైనది. బ్రహ్మఒక్కటే శాశ్వతమైనది.

**2. వైరాగ్యము :** ఇహలోక సుఖాలపట్ల విముఖత, శరీరం మొదలు బ్రహ్మలోకం వరకు ఉండే భోగ్యపదార్థాలన్నింటిమీద అసహ్యాభావన కలగటం.

**3. షట్సంపత్తి :** ఇవి మొత్తం 6.

1. శమము – అంతరింద్రియ నిగ్రహము
2. దమము – బాహ్యేంద్రియ నిగ్రహము. ఇంద్రియాలను వాటివాటి విషయాల నుండి మళ్ళించి, వాటి స్థానాలలో వాటిని నిలిపి వేయటం.

3. ఉపరతి – కర్మపరిత్యాగం. బాహ్యవిషయాలను చిత్తవృత్తులతో ఆశ్రయించకుండా ఉండటము.

4. తితిక్ష – శీతోష్ణ సుఖదుఃఖాలను సహించే శక్తి. చింత, బాధ మొదలయినవి లేకుండా, సమస్త సుఖదుఃఖాలు కష్టాలు సహించటం. ఎదుర్కో గలిగిన సామర్థ్యం ఉండికూడా అపకారికి ఉపకారం చెయ్యటం.

5. శ్రద్ధ – గురువునందు, ఆయనచెప్పే విషయాల యందు విశ్వాసము.

6. సమాధి – బుద్ధిని ఎప్పుడూ బ్రహ్మమునందే నిలిపి ఉంచటం.

**4. ముముక్షత్వము :** మోక్షం పొందాలనే కోరిక. అహంకారం దగ్గరనుండి బ్రహ్మవరకు శరీరానికి అంతా అజ్ఞానంతో కల్పించబడిన బంధానాలే. ఆత్మజ్ఞానం పొందటం ద్వారా ఈబంధనాలను త్రెంచుకోవచ్చు.

బ్రహ్మసూత్రాలు అనబడే ఈ గ్రంథం 'వేదాంత మీమాంశ' ఉత్తరమీమాంశ అని కూడా చెప్పబడుతుంది. వేదాంతము. అంటే వేదములలో చివరిభాగము ఉపనిషత్తులు. మీమాంశ అంటే పరిశీలన. ఈ గ్రంథాన్ని 'ఉత్తరమీమాంశ' అన్నారు కదా ! మరి 'పూర్వమీమాంశ' అనే గ్రంథం ఏదైనా ఉన్నదా? అంటే జైమిని మహర్షి వ్రాసిన **పూర్వప్రజ్ఞాదర్శనమే** 'పూర్వమీమాంశ' అంటారు. ఇది 12 అధ్యాయాలు గల న్యాయశాస్త్రము. దీనినే జైమిని న్యాయసూత్రాలు అని కూడా అంటారు.

క్రీస్తుపూర్వము 4వ శతాబ్దంలో కృష్ణద్వైపాయనుడి శిష్యుడైన జైమిని ఈ గ్రంథం వ్రాశాడు. దీనికి శబరస్వామి భాష్యం వ్రాశాడు. క్రీస్తుశకము 7వ శతాబ్దంలో కుమారిలభట్టు శబరభాష్యానికి వాఖ్య వ్రాయగా క్రీ॥శ॥ 650కి చెందిన ప్రభాకర మిశ్రుడు కూడా 'బృహతి' అనే వ్యాఖ్య వ్రాశాడు.

వీరి సిద్ధాంతము ప్రకారము వేదాలు నిత్యములు, అపౌరుషేయాలు. ఇందులో అనుమానం లేదు. సర్వజ్ఞుడైన పురుషుడు ఎవరైనా వాటిని చెప్పి ఉండవచ్చు అనే వైశేషికులవాదనను కూడా వీళ్ళు అంగీకరించరు. మీమాంసకుల ప్రకారము సర్వజ్ఞుడైన పురుషుడు ఈ కాలంలో గాని, పూర్వకాలంలో గాని ఎవ్వరూ లేరు. ఏ మానవుడు సర్వజ్ఞుడు కాలేడు. వేదాలు ఈశ్వరనిర్మితాలు కావు. అసలు ఈశ్వరుడున్నాడని వీరు ఒప్పుకోరు. ఈశ్వరుడు లేకుండా ఈ ప్రపంచం ఎలా

ఆవిర్భవించింది? అంటే ఈ ప్రపంచం ఎవరిచేతా సృష్టించబడింది కాదు. ఇది శాశ్వతంగా ఇలాగే ఉంటుంది. ఈశ్వరుడున్నాడనటానికి ప్రమాణం ఏమీలేదు. ఒకవేళ ఈశ్వరుడున్నా అతడు సర్వజ్ఞుడుకాడు. ఆయనకు నోరు లేదు. కాబట్టి మాట్లాడలేడు. మరి నోరు లేనివాడు వేదాలనెలా చెబుతాడు? వేదాలలో కొన్ని విశేషమైన అర్థాలున్నాయి. అవి స్వతస్సిద్ధాలు. అవి ఎవరివల్లా చెప్పబడినవి కావు. అందుకే అవి పరమప్రమాణాలు. వేదాలు ఈశ్వరుడినుంచి వచ్చినాయి. అంతేకాని ఈశ్వరుడు రచించినవి కాదు. మనదేశంలో అన్నింటికీ ప్రమాణం వేదం. మరి ఆ వేదానికి ప్రమాణం ఏముంటుంది? అందుకే **వేదాలు స్వతఃప్రమాణాలు**. ఈ వేదాలను సరిగా అర్థం చేసుకోటానికే షట్శాస్త్రాలు చెప్పబడ్డాయి. ఇవి ఆరు శాస్త్రాలు. 1.శిక్ష 2. వ్యాకరణము 3. జ్యోతిషము 4. అలంకారము 5. ఛందస్సు 6.తర్కము అని కొందరు చెబుతారు. 1. శిక్ష 2. వ్యాకరణము 3. జ్యోతిషము 4. నిరుక్తము 5. అలంకారము 6 ఛందస్సు అని కొందరు చెబుతారు. సాయణాచార్యుడు పూర్వమీమాంసని ఆధారంగా తీసుకుని వేదానికి భాష్యం చెప్పాడు. పూర్వమీమాంస గనక తెలియకపోతే వేదవాక్య నిర్ణయం చెయ్యటం సాధ్యం కాదు. వేదవాక్య నిర్ణయానికి కావలసిన మర్యాదలు, సంప్రదాయాలను మీమాంసశాస్త్రం చెప్పింది. వేదవిద్య గ్రంథస్తం కాదు. అది కంఠస్తము. ఇది గురుశిష్య సంప్రదాయంగానే వచ్చింది. అందుకే ఇది 'శ్రూయమానము' అంటారు. గురుముఖతః అధ్యయనం చేస్తేనే అపూర్వత కలుగుతుంది. విధులు మూడు రకాలు 1. విధి 2. నియమవిధి 3. పరిసంఖ్యావిధి అని వేదవాక్యాలను మూడు రకాలుగా మీమాంసకులు నిర్ణయించారు. కొన్ని వేదవాక్యాలు ఆయా కర్మలను విధిస్తాయి అంటే నియమాలను విధిస్తాయి. వడ్లనుంచి బియ్యం తియ్యాలి అన్నప్పుడు ఎన్నో రకాలుగా బియ్యం తియ్యచ్చు. వడ్లు దంచి, చేత్తోవలిచి, కాళ్ళతో తొక్కి బియ్యం తియ్యవచ్చు కాని వడ్లుదంచి మాత్రమే బియ్యం తియ్యాలని చెబుతోంది వేదం. అలాగే వేదార్థం తెలుసుకుని, మీమాంస చెయ్యాలి.

వేదాన్ని ఎలా అధ్యయనం చెయ్యాలి? గ్రంథాలు చూసి చదువుకోవచ్చు అని కొంతమంది భావిస్తుంటారు. వేదంలో అనుదాత్తము, ఉదాత్తము, స్వరితము, దీర్ఘస్వరితము, ప్లుతము అని ఐదురకాల స్వరాలు ఉన్నాయి. వీటిని బాగా తెలుసుకుని

వేదం గురుముఖతః నేర్చుకోవాలి. సృష్టి ప్రారంభం నుంచి గురుశిష్య పరంపరగా వస్తోంది వేదాధ్యయనం. వేదాలలో చెప్పబడిన ధర్మానికే **'త్రయీధర్మము'** అని పేరు. యజ్ఞయాగాది క్రతువులు ఎప్పుడు చెయ్యాలి? ఎలా చెయ్యాలి? అనే విధానం అంతా బ్రాహ్మణములలో చెప్పబడింది.

ఈ మతంలో ఈశ్వరుడితో సంబంధము లేదు. యజ్ఞఫలం రావాలంటే పరమేశ్వరుడితో సంబంధం లేదు. కర్మే ఫలితాన్నిస్తుంది.

**ద్రవ్యములు :** ఈ మతంలో కుమారిలభట్టు, ప్రభాకరమిశ్రుడు ఇద్దరూకూడా ప్రసిద్ధి చెందినవారే. అయితే వీళ్ళిద్దరి మధ్యా అనేక విషయాలలో భేదమున్నది. కుమారిలభట్టు ప్రకారము పదార్థాలు రెండు రకాలు 1. భావములు 2. అభావములు. ఇందులో భావపదార్థాలు ఆరు అవి.

1. ద్రవ్యము 2. గుణము 3. కర్మ 4. సామాన్యము 5. శక్తి 6. అభావము

అభావములు నాలుగు విధాలు

1. పూర్వము 2. పరము 3. పూర్ణములు 4. అన్యోన్య సంబంధములు.

వీటిలో ద్రవ్యము మళ్ళీ పదకొండు రకాలుగా ఉంటుంది. అవి 1.పృథివి 2.జలము 3. తేజస్సు 4. వాయువు 5. ఆకాశము 6. ఆత్మ 7. మనస్సు 8. దేశము 9. కాలము 10. తమస్సు 11. శబ్దము వీటిలో కొన్నింటిని ప్రభాకరమిశ్రుడు అంగీకరించలేదు.

ఈ రకంగా వ్యాసుని శిష్యుడైన జైమిని పూర్వమీమాంశలో ధర్మసూత్రాలు వ్రాయగా, సర్వజ్ఞుడైన వ్యాసుడు **బ్రహ్మదర్శనం కోసం ఉత్తర మీమాంశ** వ్రాశాడు. వేదానికి అర్థం కేవలము కర్మలు కాదు. జీవబ్రహ్మైక్యం గురించి వేదంలో చెప్పబడలేదు కాని వేదాలకు అంతమందున్న ఉపనిషత్తులలో ఉంది. వేదము యొక్క ప్రమాణము వేదాల చివరన ఉన్న ఉపనిషత్తులకు కూడా ఉన్నది. అందుచేతనే వేదాంతంకూడా వేదమే. కాబట్టి వేదప్రమాణం గల **ఉపనిషత్తులసారాన్ని బ్రహ్మసూత్రాలుగా వ్రాశాడు వ్యాసమహర్షి.**

'జిజ్ఞాస' అంటే కోరిక. బ్రహ్మజిజ్ఞాస అంటే బ్రహ్మను గురించి తెలుసుకోవాలనే కోరిక. ఇది ఎందుకు? తాపత్రయ నివృత్తికోసం. తాపత్రయాలు అంటే మూడు రకాలయిన తాపములు. అవి 1. ఆది భౌతిక 2. ఆది దైవిక 3. ఆధ్యాత్మికములు.

**1. ఆదిభౌతికము :** తనకన్న ఇతరులైన వారివలన వచ్చిన బాధలవల్ల పరితపించుట. భార్యాపుత్రులు, సర్ప వృశ్చికాదులు, అగ్ని, వరద, భూకంపాలవంటివి.

**2. ఆదిదైవికము :** దైవముచే కలుగచేయబడేవి

**3. ఆధ్యాత్మికము :** దేహేంద్రియాలకు గలిగిన అధివ్యాధులచే అనగా అలసత్వము, కపటము, అవిశ్వాసము, అశ్రద్ధ మొ॥వాటితో దుఃఖించుట.

ఈ మూడు రకాలయిన దుఃఖాలు శాశ్వతంగా పోవాలంటే జన్మరాహిత్యం తప్ప ఇంకొక మార్గం ఏదీలేదు. వేదాంతశాస్త్రం చెప్పేది జన్మరాహిత్యం. అదే మోక్షం. ఆ మోక్షం పొందటానికే ఈ బ్రహ్మజిజ్ఞాస. **బ్రహ్మజిజ్ఞాసకు ఫలితం బ్రహ్మప్రాప్తి.** అంటే మోక్షం. **"బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి"** బ్రహ్మ నెరిగినవాడు కూడా బ్రహ్మమే అవుతాడు.

మనం తెలుసుకోవలసినది బ్రహ్మము గురించి. బ్రహ్మము గురించి తెలుసుకున్న వాడు కూడా బ్రహ్మమే. కాబట్టి తెలుసుకోవలసినది, తెలుసుకున్నవాడు ఈ రెండూ పరబ్రహ్మ స్వరూపమే. అందుచేతనే **"అయమాత్మా బ్రహ్మ" "అహం బ్రహ్మాస్మి"** అనే మహావాక్యాలు జీవాత్మా పరమాత్మా రెండూ ఒక్కటే అని చాటి చెబుతున్నాయి. కాబట్టి జీవునికన్న తెలుసుకోవలసిన పదార్ధము ఇంకొకటి లేదు. అదే పరబ్రహ్మ స్వరూపము, ఆత్మస్వరూపము.

కర్మలద్వారా అంటే యజ్ఞయాగాదులవ్ల గాని, ఇష్టాపూర్త కర్మలద్వారా గాని పుణ్యలోకాలు వస్తాయి. సాధకుడు స్వర్గసుఖాలు అనుభవించిన తరువాత కర్మఫలాన్ని అనుభవించటానికి ఉత్తరజన్మలు ఎత్తుతాడు. మళ్ళీ కర్మలుచేస్తాడు. స్వర్గసుఖాలు అనుభవించి మళ్ళీ జన్మిస్తాడు. ఈ రకంగా గానుగకు కట్టిన ఎద్దులాగా సంసారమనే బండిచక్రంలో పడి గిరగిర తిరుగుతూ ఉంటాడు. అయితే ఈ సుఖాలు అన్నీ క్షణికమైనవి. శాశ్వతమైన సుఖము ఆనందము. బ్రహ్మానందము ఒక్కటే. అది మోక్షం ద్వారానే కలుగుతుంది. అందుకే బ్రహ్మజిజ్ఞాస చేయాలి అంటే బ్రహ్మను గురించి తెలుసుకోవాలి.

వేదాధ్యయనం చెయ్యటం వల్ల గాని, కర్మలు చెయ్యటంవల్ల గాని, తర్కమువల్ల గాని, శాస్త్రపాండిత్యము వల్లగాని బ్రహ్మమును గురించి తెలుసుకోలేము. **కేవలము**

**జ్ఞానము వల్ల మాత్రమే బ్రహ్మను గురించి తెలుసుకోవటము జరుగుతుంది.** అందుచేతనే సాధనచతుష్టయము పొందిన తరువాతనే బ్రహ్మజిజ్ఞాస కావాలి.

బ్రహ్మమనేది జ్ఞానప్రమాణాలవల్ల మాత్రమే తెలుసుకోదగ్గది. అంటే వేదాంతము అనగా ఉపనిషత్తుల విచారణద్వారా మాత్రమే బ్రహ్మము తెలుస్తుంది. చతుర్విధ పురుషార్థాలలో నాల్గవదైన మోక్షము బ్రహ్మసాక్షాత్కారమువల్లనే జరుగుతుంది. అందుకనే బ్రహ్మను గురించి తెలుసుకోవటానికి ప్రయత్నించాలి. దీనికి బ్రహ్మజిజ్ఞాస కావాలి.

ఇక్కడ ఒక చిన్న అనుమానం వస్తుంది. బ్రహ్మము మనకు తెలిసినదా? తెలియనిదా? ఒకవేళ తెలిసినదే అయితే దాన్నిగురించి మళ్ళీ విచారణ చెయ్యవలసిన అవసరం లేదు. ఒకవేళ తెలియనిది అయితే దాన్ని విచారించి ప్రయోజనం లేదు. కాబట్టి బ్రహ్మజిజ్ఞాస ఉపయోగం లేనిదిగా కనిపిస్తుంది?" అయితే

"బ్రహ్మము ప్రసిద్ధమే. అది నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావం కలది. సర్వశక్తి సంపన్నమైనది. పైగా అది అందరికీ ఆత్మ. అందుచేత అందరికీ తెలిసినదే. ఆత్మ ఉన్నదని అందరూ నమ్ముతారు కదా! కాబట్టి ఆత్మయొక్క అస్తిత్వము ప్రసిద్ధమే. అదే బ్రహ్మము" అన్నాడు వ్యాసుడు.

ఇప్పుడు మళ్ళీ ఇంకో ప్రశ్న. ఆత్మ అనేదే బ్రహ్మము అన్నారు. దీన్ని గురించి అందరికీ తెలుసును అన్నారు. మరి అందరికీ తెలిసినదాన్ని గురించి మళ్ళీ విచారించాల్సిన అవసరం ఏమిటి?"

దీనికి సమాధానం చూడండి. బ్రహ్మము ప్రసిద్ధమైనదే అంటే అందరూ ఎరిగినదే. బ్రహ్మన్ని గురించిన సామాన్యజ్ఞానము అందరికీ ఉన్నది. కాని దాని విశేషజ్ఞానం మీద అనేక వాదోపవాదాలున్నాయి. అందుచేతనే బ్రహ్మను గురించి తెలుసుకునే ప్రయత్నం చెయ్యాలి. దేహమే ఆత్మ అని నాస్తికులు, చార్వాకులు అంటారు. కాదు చేతనంగా కనుపించే ఇంద్రియాలే ఆత్మ అని కొందరంటారు. ఇంద్రియాలను ప్రేరేపించే మనస్సే ఆత్మ అని, కాదు విజ్ఞానము (బుద్ధి) ఆత్మ అని, కాదు దేహము అని, ఇంద్రియాలకన్న వేరైన వాడొకడున్నాడు. అతడే ఆత్మ అని, ఆత్మ అనేది కేవలము భోక్తయే తప్ప కర్తకాదు అని, ఈ రకంగా అనేకమంది

ఆత్మనుగురించి అనేక విధాలుగా చెబుతుంటారు. ఇవన్నీ నిజంకాదు. వీరి వాదనలన్నీ సవ్యంగానే ఉన్నట్టు అనిపిస్తాయి. కాని ప్రమాణాలు కావు.

ఈ స్థితిలో సామాన్య మానవులు ఎవరికి తోచిన విధంగా వారు ఆత్మను ప్రతిపాదించుకుంటారు.

మనకు వేదశాస్త్రాలే ప్రమాణం. ఈ జగత్తు అంతా మిధ్య. అంటే ఇవాళ్ళ ఉండేది రేపు ఉండనిది. పుట్టిన ప్రతిమనిషి గిట్టక మానడు. జీవితం దుఃఖ భూయిష్టం. సంసారిక దుఃఖాల నుండి నివృత్తి కావాలి. ఇది అందరూ కోరేదే. అంటే మరణము ఉండకూడదు. జననం లేకపోతే మరణం ఉండదు. అందుకే జన్మరాహిత్యం కావాలి. ఇదే మోక్షం. మోక్షము ఒక్కటే ఈ దుఃఖాల నుంచి రక్షించి మానవుడికి శాశ్వత ఆనందాన్ని ఇస్తుంది.

పరబ్రహ్మ సాక్షాత్కారమే మోక్షము. ఇది జ్ఞానంవల్లనే వస్తుంది. **'జ్ఞానాదేవతు కైవల్యం'** కాబట్టి మోక్షసాధనమైన బ్రహ్మాన్ని ఆ పరాశక్తిని గురించి తెలుసుకోవాలి. అందుకే ఈ బ్రహ్మజిజ్ఞాస.

పరబ్రహ్మను గురించి తెలుసుకోవాలనే కోరిక. ఇంతవరకు బాగానే ఉంది. అయితే బ్రహ్మ మూడు రకాలుగా ఉంటుంది.

1. చతుర్ముఖ బ్రహ్మ 2. కర్మబ్రహ్మ 3. పరబ్రహ్మ

**1. చతుర్ముఖబ్రహ్మ :** త్రిమూర్తులలో మొదటివాడు. సృష్టికర్త. నాలుగు తలలు గలవాడు. జగత్తును సృష్టించేది ఇతడే. భారతి ఇతని శక్తి. సత్యలోకంలో ఉంటాడు. కల్పాంతంవరకే ఉంటాడు. ఇతడు మోక్షాన్నిచ్చే దేవత కాదు.

**2. కర్మబ్రహ్మ :** సగుణోపాసన చేసిన వారు మరణానంతరము ఇతన్ని చేరతారు. సాధకులు, భక్తులు ఇతణ్ణి విష్ణువు, శివుడు, కృష్ణుడు, పరాశక్తి అని పిలుస్తారు.

1. విష్ణుమూర్తి – వైకుంఠంలో ఉంటాడు.
2. ఈశ్వరుడు – కైలాసంలో ఉంటాడు
3. కృష్ణుడు – గోలోకంలో ఉంటాడు
4. అమ్మవారు (పరాశక్తి) – మణిద్వీపంలో ఉంటుంది. ఈమెయే లలితా త్రిపుర సుందరి.

ఇతడే అపరబ్రహ్మ, సగుణబ్రహ్మ, సాకారబ్రహ్మ అనబడతాడు.

ఇతడు పరబ్రహ్మకు ప్రతిరూపం. నిరాకారుడైన పరబ్రహ్మ సాకారం పొందితే ఈ పేర్లతో పిలువబడతాడు. సాధకుడు ఏ పేరుతో ఆయన్ని ధ్యానం చేస్తే, మరణానంతరము ఆ లోకాలకు పోతాడు. **ఇక్కడికి చేరిన సాధకులకు కర్మబ్రహ్మతో సమానమైన మహదైశ్వర్యము లభిస్తుంది. అంతేకాని సాయుజ్యం ఉండదు.** ఈ రకమైన బ్రహ్మైశ్వర్యమే ముక్తి అని వారు భావన చేస్తారు. కాని జీవాత్మ పరమాత్మల ఏకీభావం జరగదు. కేవలం బ్రహ్మైశ్వర్యమే బ్రహ్మానందం. జీవాత్మ పరమాత్మల ఏకీకరణమే మోక్షము లేదా సాయుజ్యము. జ్ఞానికి మాత్రమే మోక్షం సిద్ధిస్తుంది. **జ్ఞానాదేవతు కైవల్యం.**

**3. పరబ్రహ్మ :** ఈయన నిరాకారుడు నిర్గుణుడు. సృష్టి చెయ్యటం కోసం ఒక ఆకారాన్ని ధరిస్తాడు. అప్పుడు సాకారబ్రహ్మ, అపరబ్రహ్మ, సగుణబ్రహ్మ అనబడతాడు. సృష్టి స్థితి లయాలకు ఇతడే కారకుడు. ఇతడే మోక్షాన్నిచ్చే పరమేశ్వరుడు. ఇతడికి స్త్రీ పురుషనపుంసకత్వాది భేదాలు లేవు. ఇతన్ని గురించి తెలుసుకోవటానికే ఈ ప్రయత్నం అందుకే ఈ బ్రహ్మజిజ్ఞాస. అని ఇక్కడ ప్రతిపాదించబడుతోంది.

నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. అయితే నిరాకారము సృష్టి స్థితి లయాలు చెయ్యలేదు. ఆ పని చెయ్యాలంటే తప్పనిసరిగా ఒక ఆకారం ధరించాల్సిందే. ఇంకొక విషయం ఏమంటే కేవలముపురుషుడుగాని కేవలము స్త్రీగాని సృష్టి చెయ్యలేరు. స్త్రీ పురుష సమాగమంతోనే సృష్టి జరుగుతుంది. ఈ విషయాన్ని వైద్యశాస్త్రం కూడా చెబుతోంది.

ఆ స్త్రీ పురుషులే భార్యాభర్తలు. వీరిద్దరూ ఒకేచోట ఉంటారు. కలిసి కాపురం చేస్తారు. వంశాభివృద్ధి చేస్తారు. భార్యాభర్తలు ఒకే ఇంట్లో చెరి ఒక గదిలోను పడుకోరు. ఒకేచోట ఉంటారు. కలిసే ఉంటారు కలిసే తింటారు. అనేది హైందవ సంప్రదాయం.

ఆ పరాశక్తి సృష్టిచెయ్యాలని సంకల్పించి తనలోని ఒక అంశను బయటకు పంపింది. ఆ అంశయే త్రిపురసుందరుడు. అతడే సదాశివుడు. ఆ పరాశక్తి త్రిపురసుందరి. వీరే శివశక్తులు. కామేశ్వరీ కామేశ్వరులు, భువనేశ్వరీ భువనేశ్వరులు. వారి వల్లనే సృష్టి అంతా జరిగింది. వీరిద్దరూ శ్రీచక్రంలోని బిందువు నందు ఉంటారు.

శ్రీవిద్యోపాసకులకు ఆ బిందువే పరబ్రహ్మ స్వరూపం. అక్కడ ఉండేది లలితా త్రిపుర సుందరి. సదాశివుడే **త్రిపుర సుందరుడు** అనబడతాడు. ఆ లలితా త్రిపురసుందరియే సృష్టి స్థితి లయకారిణి. ఆవిడే మోక్షప్రదాత. ఆమెను గురించి తెలుసుకోవటానికే బ్రహ్మజిజ్ఞాస.

**అథాతో శ్రీవిద్యా వ్యాఖ్యాస్యామః** ఇప్పుడు శ్రీవిద్యను వ్యాఖ్యానిస్తున్నారు. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. అతడు గనక ఒకరూపం ధరిస్తే, అదే శ్రీవిద్యలో ప్రతిపాదించిన శివశక్తుల స్వరూపమైన లలితా త్రిపుర సుందరి లేదా రాజరాజేశ్వరి అని స్థాపించటం కోసం శ్రీవిద్యను వివరిస్తున్నారు **స్వామి పరమానందనాథులు.**

## జగసృష్టి, ప్రళయము

సృష్టి ప్రారంభానికి ముందు జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరబ్రహ్మతత్త్వం ఆక్రమించి ఉన్నది. అంటే **జగత్తంతా పరబ్రహ్మతత్త్వమే. అదే పరాశక్తి.**

ఆ పరాశక్తి ఈ జగత్తును సృష్టించాలి అనుకుంది. అసలు జగత్తును ఎందుకు సృష్టించాలి? గతంలో ప్రళయం సంభవించినప్పుడు కర్మక్షయం అయిన జీవరాసి అంతా ఆ పరాశక్తిలో (పరబ్రహ్మ) లీనమయిపోయింది. కర్మక్షయం కాని జీవరాసి మాత్రం, తమ కర్మను తమతో పాటుగా మూట కట్టుకున్నవై, ఆ పరాశక్తిలో లీనమయింది. ప్రళయం జరిగిన సమయంలో భూమి–జలంలో కలిసిపోతుంది. జలం – అగ్నిలో, అగ్ని – వాయువులో, వాయువు – ఆకాశంలో, ఆకాశం – అహంకారంలో, అహంకారం – మహత్తత్త్వంలో, మహత్తత్త్వం – అవ్యక్తంలో, అవ్యక్తం – పరాశక్తిలో లీనమయిపోయింది. ఇది సంపూర్ణప్రళయము. అయితే ప్రతిసారి సంపూర్ణప్రళయమే జరగదు. చాలాసార్లు పాక్షికప్రళయం జరుగుతుంది. పాక్షికప్రళయం అంటే జగత్తులోని ప్రాణికోటి నశిస్తుంది. కాని పంచభూతాలు మాత్రం అలాగే ఉంటాయి. ప్రాణికోటిలో కూడా కొంత భాగం జీవించే ఉంటుంది. పాక్షికప్రళయం అంటే జీవరాసి కొంత వరకు గాని, కొన్ని ప్రాంతాలలోమాత్రమే గాని నాశనమవటం. సామాన్యంగా ఇది జలప్రళయం అంటే ఈ భూమి నీటిలో మునిగిపోతుంది. లేదా పెద్ద పెద్ద భూకంపాలు, యుద్ధాలు వచ్చి జగత్తు చాలావరకు నాశనం అవుతుంది. ఇవన్నీ పాక్షిక ప్రళయాలే. కురుక్షేత్ర సంగ్రామం, రెండవ ప్రపంచ యుద్ధం ఇలాంటివే.

సంపూర్ణప్రళయం అంటే చరాచర జగత్తు పూర్తిగా నాశనమవటం. ఇది సామాన్యంగా జరగదు. సంపూర్ణ ప్రళయం జరిగినప్పుడు, జగత్తంతా పరాశక్తిలో లీనమై పోతుంది. ఆ తరువాత కొంత కాలానికి మళ్ళీ సృష్టి జరుగుతుంది. ముందుగా పరాశక్తిలో నుంచి అవ్యక్తము. అదే మాయ, సత్త్వగుణము ఆవిర్భవిస్తుంది. అవ్యక్తం నుంచి – మహతత్త్వము అదే హిరణ్యగర్భుడు రజోగుణము, మహతత్త్వం నుంచి – అహంకారము అదే విరాడ్రూపము తమోగుణము ఆవిర్భవిస్తాయి. అహంకారం నుంచి పంచభూతాల సూక్ష్మరూపాలయిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు వాటి నుంచి పృథివి, ఆపః, తేజో, వాయు, ఆకాశాలు ఆవిర్భవిస్తాయి. ఆ తరువాత గుణత్రయవిభాగంచేత సృష్టి జరుగుతుంది. ఇది ఏకగుణ సృష్టి, ద్విగుణసృష్టి, త్రిగుణ సృష్టి అని మూడు రకాలుగా జరుగుతుంది.

సృష్టిప్రారంభానికి ముందు నిరాకారంగా ఉన్న పరాశక్తి ముందుగా తాను ఒక రూపాన్ని పొంది, తరువాత తనలోని ఒక అంశను బయటకు పంపింది. అతడే త్రిపురసుందరుడు (సదాశివుడు). ఇప్పుడు సృష్టి స్థితి లయాలు చెయ్యటానికి త్రిమూర్తులను, వారికి సహాయకారులుగా ఉండటానికి త్రిశక్తులను సృష్టించింది. బ్రహ్మదేవుడు పరాశక్తి ఆజ్ఞతో కొంతకాలం మానసిక సృష్టి చేశాడు. మానసికసృష్టి అంటే బ్రహ్మయొక్క సంకల్పమాత్రంచేతనే కొంతమంది మహానుభావులు జన్మించారు. సనకసనందనాదులు, వసిష్ఠాది, మహర్షులు, ప్రజాపతులు అంతా ఇలాంటివారే. అయితే మానసిక సృష్టివల్ల, సృష్టిలో వేగం లేదు. అంటే ఎక్కువగా జగత్తులోని జీవరాసి ఆవిర్భవించలేదు. ఈ కారణం చేత బ్రహ్మదేవుడు. మళ్ళీ ఆ పరమేశ్వరిని ప్రార్థించి ప్రజాపతుల ద్వారా మైథునసృష్టి ప్రారంభించాడు. మిథునము అంటే – దంపతులు. స్త్రీ, పురుషులు. వీరి సంయోగం వల్ల జరిగేది మైథునసృష్టి, దీంతో సృష్టి వేగం పుంజుకున్నది. జగత్తులో ఏ జీవికైనా సరే, గతంలో తాను చేసిన కర్మ ఫలితంగానే ఈ శరీరం వస్తుంది. పుణ్యకర్మలు చేసినవారు ఉత్తమయోనులందు జన్మిస్తారు. వీరు మహాజ్ఞానులుగా, ధనవంతులుగా, అధికారులుగా, నాయకులుగా జన్మిస్తారు. పాపకర్మలు చేసినవారు పశువులు, పక్షులుగా జన్మిస్తారు. నీచమైన కర్మలు చేసినవారు క్రిమికీటకాలుగా జన్మించి పుడుతూ, చస్తూ ఉంటారు. క్రిమికీటకాలు పుట్టిన కొద్దికాలానికే పెద్దవై పోతాయి. వీటిని జీవించి ఉండగానే

ఇతర జీవులు కొరికి తినేస్తుంటాయి. సముద్రంలోని చేపలను వాటి ప్రమేయం లేకుండానే పట్టుకుని, నరికి చంపి తినేస్తుంటారు. అడవిలో కొన్ని జంతువులను జీవించి ఉండగానే క్రూరజంతువులు పీక్కుతినేస్తాయి. ఆ సమయంలో అవి పడే బాధ, పొందే వ్యధ వర్ణనాతీతం. కొన్ని రకాల జీవులకు కాళ్ళు చేతులు ఉండవు. ఇదంతా ఆ జీవి గతజన్మలో చేసిన పాపం. ఇక్ష్వాకు వంశస్తుడైన నహుషుడు నూరు అశ్వమేధ యాగాలు చేశాడు. దాని ఫలితంగా ఇంద్రపదవి లభించింది. అతడు ఇంద్రుడైనతరువాత ఉచ్ఛనీచాలు మరిచిపోయాడు. చేయకూడని పనులు చేశాడు. దాంతో పెద్ద కొండచిలువై భూమిమీద కొన్ని వేల సంవత్సరాలున్నాడు. అగ్నిచయనం చేసిన యముడు, నరక లోకాధిపతి అయినాడు. జారుడు, చోరుడు, జూదరి అయిన గుణనిధి శివారాధన చేసి కాశీ రాజైనాడు. తరువాత ఉత్తర దిక్కుకు అధిపతి అయినాడు. కాని పార్వతీదేవిని వంకర చూపు చూశాడు కాబట్టి పింగళాక్షుడైనాడు. ఈ రకంగా దేవ గంధర్వ యక్షకిన్నెర కింపురుష సిద్ధ సాధ్య, నాగ, గరుడ మొదలైన వారంతా, వారు గతజన్మలలో చేసిన కర్మఫలితం వల్లనే ఈ శరీరాలు పొందారు. అంతేకాదు. త్రిమూర్తులు కూడా గతంలోచేసిన కర్మఫలితం వల్లనే ఆపదవి పొందారు. ఇంద్రపదవి కూడా అంతే. ఆంజనేయుడే నవమబ్రహ్మ. అశ్వత్థామ 29వ మహాయుగంలో వ్యాసుడు.

కాబట్టి చరాచర జగత్తులో ప్రతిజీవిని దేవతలను, దానవులను కూడా ఆ పరాశక్తియే సృష్టించింది. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. రాక్షసులు దుర్మార్గపు పనులు చేశారు కదా? మరి వాళ్ళు రాజులు ఎలా అయినారు? ఇక్కడ గుర్తుంచుకోవలసిన విషయం ఒకటుంది. రాక్షసులు మంచి పట్టుదల గలవారు. విపరీతమైన తపస్సు చేశారు. దాని ప్రభావంవల్ల పదవులు పొందారు. అనుకున్నది సాధించారు. కాని క్రూర స్వభావం గలవారు. దుర్మార్గపు పనులు చేశారు. అందుకే నీచమైన చావుచచ్చారు. ఈ రకంగా జగత్తును సృష్టించింది పరాశక్తి. జగత్తులోని అన్నిప్రాణులు, అన్నిశక్తులు ఆమెకు లోబడిఉండేవే. త్రిమూర్తులను, త్రిశక్తులను కూడా ఆమే సృష్టించింది. అంతేకాదు సదాశివుణ్ణి సృష్టించింది కూడా ఆమే. ప్రళయకాలంలో త్రిమూర్తులు, త్రిశక్తులు, సదాశివుడితోసహా ఆ పరాశక్తిలో లీనమైపోతారు. అప్పుడు మిగిలేది కేవలము పరాశక్తి మాత్రమే. ఆ పరాశక్తియే పరబ్రహ్మ. ఆమెను గురించి తెలుసుకోటానికే ఈ బ్రహ్మజిజ్ఞాస.

మోక్షాన్నిచ్చేది పరబ్రహ్మమే. ఇందులో సందేహం లేదు. అది ఒక శక్తి ఆ పరబ్రహ్మకు స్త్రీ పురుష నపుంసక భేదాలు లేవు. పరబ్రహ్మ సాకారమా? నిరాకారమా? శంకర భగవత్పాదులవారు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతడు చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. సృష్టి స్థితి లయాల కారణం అతడే. అన్నారు. ఆకారం లేని పరబ్రహ్మ ఏ పని చెయ్యలేదు. సృష్టి స్థితి లయాలు అసలే చెయ్యలేదు. అందుచేత బ్రహ్మము నిరాకారము నిర్గుణము అనటానికి లేదు. బ్రహ్మము సాకారము అని కొంతమంది ప్రతిపాదించారు. వారిలో

రామానుజాచార్యులు - శ్రీమహావిష్ణువే పరబ్రహ్మ అన్నారు

మధ్వాచార్యులు - శ్రీమహావిష్ణువే పరబ్రహ్మ అన్నారు

రఘువరదాసు - శ్రీరాముడే పరబ్రహ్మ అన్నారు

నింబార్కాచార్యులు - శ్రీకృష్ణుడే పరబ్రహ్మ అన్నారు

వల్లభాచార్యులు - శ్రీకృష్ణుడే పరబ్రహ్మ అన్నారు

బలదేవాచార్యులు - శ్రీకృష్ణుడే పరబ్రహ్మ అన్నారు

శ్రీకంఠారాధ్యులు - ఈశ్వరుడే పరబ్రహ్మ అన్నారు

పంచానన తర్కాచార్యులు - శక్తియే పరబ్రహ్మ అన్నారు.

శ్రీపతి పండితాచార్యులు - శివునితో కలిసి శక్తియే పరబ్రహ్మ అన్నారు. కాగా **శ్రీవిద్యలో చెప్పిన లలితాత్రిపురసుందరియే-పరబ్రహ్మ అంటున్నారు పరమానందనాథులు.**

జగనిర్మాణశక్తి పరాశక్తి స్వరూపమైన ఆ పరదేవతకే ఉన్నది. ఆవిడే పరబ్రహ్మ. లలితా త్రిపుర సుందరి, రాజరాజేశ్వరి పరాభట్టారిక మొదలైన పేర్లతో పిలువబడుతుంది. ఇక్కడ పరబ్రహ్మ అంటే మహాశక్తి స్వరూపం. అంతే కాని కేవలము శివుడు, విష్ణువు, కృష్ణుడు, రాముడు మాత్రం కాదు. కేవలము పురుషుడు లేదా స్త్రీ సృష్టి చెయ్యలేరు. స్త్రీ పురుషుల సమాగమం వల్లనే జగత్తు ఆవిర్భవిస్తుంది. భార్యాభర్తలు విడివిడిగా ఉండరు. చెరిఒక గదిలోను పడుకోరు. ఇద్దరూ ఒకేచోట ఉంటారు. కలిసే కాపరంచేస్తారు. శివశక్తుల స్వరూపంగా ఉంటారు. ఇది హైందవ సంప్రదాయం. అందుకే సృష్టిచెయ్యాలి అనుకున్నప్పుడు తాను లలితాత్రిపురసుందరి అయి, తన అంశను సదాశివుడుగా త్రిపురసుందరుడు అనే పేరుతో సృష్టించింది. ఆ లలితాత్రిపురసుందరి వల్లనే జగదుత్పత్తి జరుగుతోంది.

పరాశక్తిగా అర్హులను సాయుజ్యం ప్రసాదిస్తుంది. త్రిపురసుందరిగా మహదైశ్వర్యాన్ని ప్రసాదిస్తుంది. అంతేకాదు మనం వ్రాసే అక్షరాలలో కూడా

**క కారాది క్ష కారాంతా వర్ణాస్తే శివరూపిణః**

**అకారాది విసర్గాంతాః స్వరాః షోడశ శక్తయః**

అ నుంచి అః వరకు అచ్చులు శక్తి రూపాలు, హల్లులు శివరూపాలు.

**శక్తిః ప్రాణశ్చ జీవశ్చ మంత్రోనాదః శివోరవిః**

మంత్రశాస్త్రంలో కూడా శక్తియే ప్రాణము, జీవము అవుతున్నది.

**అందుకే ఈ గ్రంథంలో పరబ్రహ్మ అంటే శ్రీవిద్యలో ప్రతిపాదించబడిన పరాశక్తి స్వరూపమైన లలితాత్రిపురసుందరియే కాని వేరు కాదు అని ప్రతిపాదించటం జరుగుతోంది. నిరాకారము పరాశక్తి. సాకారము లలితా త్రిపుర సుందరి.**

శంకర భగవత్పాదులవారు బ్రహ్మసూత్రాలలో అద్వైతపరంగా నిరాకారుడు, నిర్గుణుడు పరబ్రహ్మ అని ప్రతిపాదించారు. మిగిలినవారు పరబ్రహ్మకు నామరూపాలు ఆపాదించి ద్వైతాన్ని ప్రతిపాదించారు. కాగా ప్రస్తుతము ఈ **గ్రంథంలో ఆ పరబ్రహ్మ సాకారంలో త్రిపురసుందరి, నిరాకారంలో పరాశక్తి. మరణానంతరము భక్తులకు బ్రహ్మలోకంలో మహదైశ్వర్యాన్ని ప్రసాదించేది త్రిపురసుందరి. ఇది ద్వైతము. అర్హులైన జ్ఞానులకు సాయుజ్యాన్ని ప్రసాదించేది పరాశక్తి. ఇక్కడ జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. ఇది అద్వైతము. ఈ రకంగా ఈ గ్రంథంలో పరబ్రహ్మకు సాకార, నిరాకారాలు, ద్వైతాద్వైతాలు రెండూ ప్రతిపాదించబడుతున్నాయి.**

## శ్రీవిద్య అంటే ఏమిటి ?

**సకుంకుమవిలేపనా మళిక చుంబి కస్తూరికాం**
**సమందహసితేక్షణాం సశర చాపపాశాంకుశాం**
**అశేషజనమోహినీం అరుణమాల్య భూషాంబరాం**
**జపాకుసుమభాసురాం జపనిధౌ స్మరేదంబికాం ॥**

నుదుటన కస్తూరి తిలకము ధరించినది, చిరునగవు చిందించునది, పాశము, అంకుశము, ధనుర్బాణములు చేతులయందు ధరించినది, లోకాలన్నింటినీ మోహింపచేయునది, ఎర్రనివస్త్రములు ధరించినది, మంకెన్నపువ్వువలె పాటలవర్ణము గలది అయిన పరమేశ్వరిని ధ్యానించుచున్నాను.

'త్రికోణం' అంటే యోని. అదే జన్మస్థానం. స్థావర జంగమాత్మకమైన జగత్తు అంతా ఈ త్రికోణంనుంచే వచ్చింది. ఆ త్రికోణమే పరమేశ్వరిరూపం. ఆ పరమేశ్వరియే లలితాత్రిపురసుందరి, రాజరాజేశ్వరి, కామకామేశ్వరి అని పిలువ బడుతుంది. ఆవిడే పరాశక్తి. ఆవిడే పరమేశ్వరి. అమ్మలగన్నయమ్మ. జగన్మాత. శ్రీమాత. **ఆమెను గురించి చెప్పే విషయమే శ్రీవిద్య.**

నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతడు గనక ఒకరూపం పొందినట్లైతే, అదే లలిత. సృష్టి ప్రారంభానికి ముందు నిరాకారంగా ఉన్న ఆ పరాశక్తి సృష్టి చేయాలనే సంకల్పంతో తనను తాను రెండుగా విభజించుకున్నది. వారే లలితాత్రిపురసుందరి, త్రిపురసుందరులు శివాశివులు. పరమేశ్వరి, పరమేశ్వరులు. శివశక్తులు. వారి సమాగమప్రదేశమే శ్రీచక్రము. ఒక్కసారి మంత్రశాస్త్రంలోకి గనక చూసినట్లైతే, శివ అంటే నాలుగు, శక్తి అంటే ఐదు. వెరసి తొమ్మిది చక్రాలతో అలరారేదే శ్రీచక్రము. దీనిని 'నవయోన్యాత్మకము' అంటారు. ఇందులో శివచక్రాలు నాలుగు, శక్తి చక్రాలు ఐదు. వెరసి తొమ్మిది చక్రాలుంటాయి. ఇదే చరాచరజగత్తుకు, విశ్వమానవాళికీ ప్రతీక.

శక్తి లేకపోయినట్లైతే సాక్షాత్తు ఈశ్వరుడికి కూడా సృష్టి స్థితి లయాలు చెయ్యటం సాధ్యం కాదు **వామకేశ్వరతంత్రంలో**

**పరోఽపి శక్తిరహితః శక్త్యాయుక్తో భవేద్యపి ।**
**సృష్టి స్థితిలయాన్ కర్తు మశక్తః శక్త ఏవహి ॥**

పరుడు కూడా శక్తిరహితుడైనట్లైతే సృష్టి, స్థితి, లయాలు చెయ్యలేడు. శక్తితో కలిస్తేనే వాటిని చెయ్యగలుగుతాడు. **మానసోల్లాసము** అనే గ్రంథంలో

**యేఽపి బ్రహ్మాదయోదేవా భవంతి వరదాయినః**
**త్వద్రూపం శక్తిమాసాద్యతే భవంతి వరప్రదః**
**తస్మాత్ త్వయేవ సర్వత్ర కర్మణాం ఫలదాయినీ ॥**

శివుడు, శక్తి ఈ ఇద్దరూ వేరు వేరు కాదు. ఇద్దరూ ఒక్కటే. శివుడు లేకుండా శక్తిగాని, శక్తిలేకుండా శివుడుగాని ఉండరు.

**తంతుమాన్ పటః** నూలుపోగులు కలది వస్త్రము. **మృద్వాన్ ఘటః** మట్టితో తయారైనది కుండ. అలాగే శక్తి గలవాడే శివుడు. శివుడేశక్తి. శక్తేశివుడు. ఇద్దరూ ఒక్కటే. ఉపాసకులు కేవలము తమ వాసనాభేదములచేత భేదాలు సృష్టిస్తున్నారు. **'పరిమళ'** అనే గ్రంథంలో చెప్పినట్లుగా

**అలేఖ్యవిశేష ఇవ గజవృషభయోర్ద్వయోః ప్రతిభాసమ్ ।**
**ఏకాస్మిన్నేవార్ధే శివశక్తి విభాగ కల్పనాం కుర్మః ॥**

ఒక బొమ్మను చూసి కొందరు శివుడు అన్నారు. మరి కొందరు శక్తి అన్నారు. ఉన్నది మాత్రం ఒకే బొమ్మ. మీ మీ భావనలను బట్టి దాన్ని పిలుస్తున్నారు అంతే. అదే పరమేశ్వరతత్త్వము. పరాశక్తి. **'మాతృకా హృదయము'** అనే గ్రంథంలో, మనం మాట్లాడే భాషలో కూడా

**కకారాది క్షకారాంతా వర్ణాస్తే శివరూపిణః ।**
**అకారాది విసర్గాంతాః స్వరాః షోడశ శక్తయః ॥**

అ నుంచి అః వరకు ఉండే అచ్చులు శక్తిరూపాలు. క నుంచి క్ష వరకు హల్లులు శివరూపాలు. ఈ రెండూ కలిస్తేనే కాని అక్షరం పూర్తి కాదు. **రుద్రయామళంలో** చెబుతారు చూడండి.

**శక్తిః ప్రాణశ్చ జీవశ్చ మంత్రోనాదః శివోరవిః**

మంత్రశాస్త్రంలో కూడా శక్తియే ప్రాణము, జీవము అవుతున్నది. ఉదాహరణకు బాలామంత్రం చూడండి. ఇందులో మొత్తం మూడుబీజాలున్నాయి. అవి

**వాగ్భవం ప్రథమ బీజం । కామరాజం ద్వితీయకం**
**తృతీయం శక్తికూటాఖ్యం । నిగమత్రితయోద్ధృతమ్**
**ఇత్థం కుమారీ విద్యయా బీజత్రయముదీరితమ్ ॥**

మొదటిది వాగ్భవబీజము – ఐం
రెండవది కామరాజబీజము – క్లీం
మూడవది శక్తిబీజము – సౌః

ఇందులో శక్తిబీజమున్నది కాబట్టే ఆ మంత్రానికి సంపూర్ణత్వము సిద్ధిస్తున్నది.

'స్కాంద పురాణం'లో

**ప్రణవో బీజమాఖ్యాతం నమఃశక్తి రుదీరితా ।**
**ఋషిః స్వాధ్యాయేదేవోఽస్య పంక్తిశ్ఛంద ఉదాహృతమ్**
**పార్వతీవల్లభః సాక్షాదేవతాత్ర సదాశివః ॥**

శివపంచాక్షరి 'ఓం నమశ్శివాయ.' ఇందులో నమః అనేది శక్తి. ఈ శక్తి లేకుండా మంత్రం పూర్తి కాదు. ఆ మంత్రజపం ఫలించదు.

ఈ రకంగా శంకర భగవత్పాదుల వారు శివశక్తుల స్వరూపమైన పరమేశ్వర తత్త్వాన్ని కీర్తించారు. గౌడపాదుల వారు తమ **'సుభగోదయస్తుతి'**లోని మొదటి శ్లోకంలో

**భవాని త్వం వందే భవమహిషి సచ్చిత్సుఖ వపుః**
**పరాకారాం దేవీ మమృతలహరీ మైందవ కళామ్ ।**
**మహాకాలాతీతాం కలితసరణీ కల్పితతనుం**
**సుధాసింధోరంతర్వసతిమనిశం వాసరమయీమ్ ॥**

భవానీ ! శివుని అర్ధాంగి అయిన ఓ పార్వతీ ! నీవు సచ్చిదానంద స్వరూపిణివి. పరాకారమైన దేవివి. అమృతలహరివి. అఖండమైన కాలానికి అతీతురాలవు. నిరాకారవు. అయినప్పటికీ మాయాశక్తి వలన కల్పించబడిన ఆకారముతో ప్రకాశిస్తున్నావు. అటువంటి బిందు స్వరూపిణివైన నీకు నమస్కరిస్తున్నాను అని అంటారు. **'దేవీ మహిమ్నాస్తుతి'** అనే గ్రంథంలో దుర్వాసులవారు

**శ్రీమాత స్త్రిపురే ! పరాత్పరతరే ! దేవీ ! త్రిలోకీ ! మహా**
**సౌందర్యార్ణవ మందనోద్భవసుధా ప్రాచుర్యవర్ణోజ్జ్వలం**
**ఉద్యద్భాను సహస్ర నూతన జపాపుష్ప ప్రభం తే వపుః**
**స్వాన్తేమే స్ఫురతు త్రిలోక నిలయం జ్యోతిర్మయం వాఙ్మయం ॥**

'ఓ తల్లీ ! త్రిపురా ! పరాత్పరీ ! ముల్లోకములందు సౌందర్యమైనదానా; అమృతము వంటిదానా, బాలభానుని అరుణారుణచ్ఛాయతో ప్రకాశించే ఓ దేవీ ! త్రిలోకమయము, జ్యోతిర్మయము, వాఙ్మయము అయిన రూపము గలదానా ! నా ఉపాసనలో నిరంతరము నీ రూపము దర్శనమిచ్చును గాక.' అని ప్రార్థిస్తున్నారు.

అలాగే **సౌందర్యలహరి**లోని మొదటి శ్లోకంలో శంకర భగవత్పాదులవారు

**శివ శక్త్యాయుక్తోయది భవతి శక్తః ప్రభవితుం**

**న చే దేవం దేవో నఖలు కుశలః స్పన్దితు మపి ।**

**అతస్త్వా మారాధ్యాం హరిహర విరఞ్చాదిభిరపి**

**ప్రణన్తుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి ॥**

అమ్మా ! ఓ పరమేశ్వరీ ! సర్వమంగళకారకుడైన శివుడు కూడా జగన్నిర్మాణ శక్తివైన నీతో కూడితేనే కాని ఈ జగత్తులను నిర్మించలేడు. నీతో కలువకపోయినట్లైతే అతడు కదలటానికి కూడా శక్తి లేనివాడవుతాడు. కాబట్టి త్రిమూర్తులచేత కూడా పూజింపబడే నీకు నమస్కరించాలన్నా, నిన్ను పూజించాలన్నా, నిన్ను స్తుతించాలన్నా, కనీసం నీ పేరు తలచాలన్నప్పటికీ కూడా, గత జన్మలలో పుణ్యం చెయ్యనివాడు సమర్థుడు కాదు. అంటే పూర్వజన్మ సుకృతం లేనిదే నిన్ను అర్చించటం కాదు కదా, కనీసం నీ పేరు తలచటానికి కూడా అర్హత ఉండదు. అంటారు. **ఆవిడ పరమేశ్వరి.** లలితాత్రిపురసుందరి పరానికి ఈశ్వరి కాబట్టి పరమేశ్వరి– అనబడుతుంది. ఆవిడే బ్రహ్మరూపంలో ఈ జగత్తును సృష్టిస్తోంది. విష్ణువు రూపంలో జగత్తును రక్షిస్తున్నది. రుద్రునిరూపంలో జగత్తును సంహారంచేస్తున్నది. ఈశ్వరుని రూపంలో తిరోదానము అంటే సంపూర్ణనాశనము చేస్తుంది. దీన్నే 'లయము' అంటారు. సదాశివునిరూపంలో, ఏమీ మిగలకుండా పూర్తిగా పరమాణువులతో సహా నాశనమయిపోయినజగత్తును మళ్ళీసృష్టించటానికి సుముఖంగా ఉంటుంది. ఈ ఐదు రకాల పనులు చేస్తుంది. కాబట్టే ఆవిడ **'పంచకృత్యపరాయణ'** అనబడుతుంది. అర్హులైన వారికి ముక్తిని ప్రసాదిస్తుంది. ఆవిడ **సగుణరూపంలో లలితాత్రిపురసుందరి. నిర్గుణం పరాశక్తి.** ఆమెను గురించి తెలుసుకోటానికే ఈ బ్రహ్మ జిజ్ఞాస.

## దేవీ సప్తశతి

ఒకసారి ప్రళయం సంభవించి జగత్తంతా జలమయం అయిపోయింది. శ్రీమహావిష్ణువు శేషశాయియై యోగనిద్రలో ఉన్నాడు. విష్ణువు నాభి నుంచి వచ్చిన కమలంలో బ్రహ్మకూర్చుని వేదపారాయణ చేస్తున్నాడు. ఆ సమయంలో విష్ణుమూర్తి

చెవిగుబిలిలోంచి ఇద్దరు రాక్షసులు జన్మించారు. వారే మధుకైటభులు. వారు నీరంతా కలయతిరిగారు. వారుతప్ప వేరేజీవి కనుపించలేదు. నిశతంగా చూశారు బ్రహ్మ వేదపారాయణ చేస్తున్నాడు. చూశారు రాక్షసులు. వెంటనే "మాతో యుద్ధానికి రా"! అన్నారు. బెదిరించారు. భయపెట్టారు. బ్రహ్మ తామరతూడు గుండా విష్ణువు దగ్గరకు వచ్చి, అతన్ని నిద్ర లేపటానికి ప్రయత్నించాడు. విష్ణువు యోగనిద్రలో ఉన్నాడు. ఎంత పిలిచినా లేవలేదు. అప్పుడుబ్రహ్మ పరాశక్తిని ప్రార్థిస్తాడు.

త్వం స్వాహాత్వం స్వధా త్వం హి వషట్కారః స్వరాత్మికా ॥
సుధా త్వమక్షరే నిత్యే త్రిధా మాత్రాత్మికా స్థితా ।
అర్థమాత్రాస్థితా నిత్యా యానుచ్చార్యా విశేషతః ॥
త్వమేవ సంధ్యా త్వం సావిత్రీ త్వం దేవి జననీ పరా ।
త్వయైతద్ధార్యతే విశ్వం త్వయైతత్సృజ్యతే జగత్ ॥
త్వయైతత్పాల్యతే దేవి త్వమత్స్యంతే చ సర్వదా ।
విసృష్టౌ సృష్టిరూపా త్వం స్థితిరూపా చ పాలనే ॥
తథా సంహృతిరూపాన్తే జగతోఽస్య జగన్మయే ।
మహావిద్యా మహామాయా మహామేధా మహాస్మృతిః ॥
మహామోహా చ భవతీ మహాదేవీ మహాసురీ ।
ప్రకృతిస్త్వం చ సర్వస్య గుణత్రయవిభావినీ ॥
కాలరాత్రిర్మహారాత్రిర్మోహరాత్రిశ్చ దారుణా ।
త్వం శ్రీస్త్వమీశ్వరీ త్వం హ్రీస్త్వం బుద్ధిర్బోధలక్షణా ॥
లజ్జా పుష్టిస్తథా తుష్టిస్త్వం శాంతిః క్షాంతిరేవ చ ।
ఖడ్గినీ శూలినీ ఘోరా గదినీ చక్రిణీ తథా ॥
శజ్ఖినీ చాపినీ బాణభుశుండీపరిఘాయుధా ।
సౌమ్యా సౌమ్యతరాశేషసౌమ్యేభ్యస్త్వతిసుందరీ ॥

పరాపరాణాం పరమా త్వమేవ పరమేశ్వరీ ।
యచ్చ కించిత్క్వచిద్వస్తు సదసద్వాఖిలాత్మికే ॥
తస్య సర్వస్య యా శక్తిః సా త్వం కిం స్తూయసే తదా ।
యయా త్వయా జగత్స్రష్టా జగత్పాత్యత్తి యో జగత్ ॥
సోఽపి నిద్రావశం నీతః కస్త్వాం స్తోతుమహేశ్వరః ।
విష్ణుః శరీరగ్రహణమహమీశాన ఏవ చ ॥
కారితాస్తే యతోఽతస్త్వాం కః స్తోతుం శక్తిమాన్భవేత్ ।
సా త్వమిత్థం ప్రభావైః స్వైరుదారైర్దేవి సంస్తుతా ॥
మోహయైతౌ దురాధర్షావసురౌ మధుకైటభౌ ।
ప్రబోధం చ జగత్స్వామీ నీయతామచ్యుతో లఘు ॥
బోధశ్చ క్రియతామస్య హంతుమేతౌ మహాసురౌ ॥

"ఓ తల్లీ! దేవతలకు ఆహుతులందించే స్వాహాకారానివి, పితృదేవతలకు తర్పణలుఇచ్చే స్వధాకారానివి, యజ్ఞములయందు ఉపయోగించే వషట్కారానివి నువ్వే. నువ్వు త్రిమాత్రాత్మికవు. ఓంకారస్వరూపిణివి. ఓంకారము ఉచ్చరించిన తరువాత, అది లయమయ్యేటప్పుడు వచ్చేశబ్దము అర్ధమాత్ర. దీన్నే నాదము అంటారు. ఆ నాదము, నాదాంతము నువ్వే. ఓ తల్లీ ! నువ్వే గాయత్రివి, సావిత్రివి.

ఓ అమ్మా! జగత్తంతా నువ్వే సృష్టిస్తున్నావు. పోషిస్తున్నావు. లయం చేస్తున్నావు. సృష్టి సమయంలో బ్రహ్మగా, స్థితి సమయంలో విష్ణువుగా, లయ సమయంలో రుద్రుడుగా ఉంటావు. సృష్టి, స్థితి, లయకారిణివి. జ్ఞానమయివినీవే. అజ్ఞానమయివి నీవే. విద్య, అవిద్య రెండూ నీవే. నీవే మహాబుద్ధివి. మహాస్మరణశక్తివి. భ్రాంతిని కలిగించేది నీవే. మహాదేవివి నీవే. మహాఅసురివి నీవే. అంటే అన్ని శక్తులు ఆమే. సంపదలు ఇచ్చే లక్ష్మీదేవి ఆమే. దరిద్రాన్నిచ్చే జ్యేష్ఠాదేవి ఆమే. ఆమెయే శుభశక్తి, అశుభశక్తి కూడా.

చరాచర జగత్తుకు మూలమైన ప్రకృతివి నీవే. త్రిగుణాలను ప్రవర్తిల్ల చేసేదానవు నీవే. కల్పాంతాన ప్రళయకాలపు కాళరాత్రి నీవే. అంతిమ ప్రళయకాలపు మహారాత్రి

నీవే. భయంకరమైన మోహరాత్రి నీవే. లక్ష్మీదేవివి నీవే. ఈశ్వరివి, హ్రీంకార రూపానివి నీవే. జ్ఞానచిహ్నామైన బుద్ధివి నీవే. లజ్జ, తుష్టి, పుష్టి, శాంతి, ఓరిమి గలదానవు నీవే. ఖడ్గము, శూలము, గద మొదలైన రకరకాల ఆయుధాలు ధరించి భయంకరంగా శత్రుసంహారము చేస్తావు. లోకాలకు క్షేమాన్ని కలిగించే క్షేమంకరివి. శుభంకరివి. దుర్మార్గులకు భయంకరివి. శుభాలన్నింటిలోను అత్యంత శుంభంకరివి. అత్యంత సౌందర్యవతివి. పరాపరములు రెండింటికీ అతీతమైనదానవు. సత్తునీవే. అసత్తునీవే. సృష్టి స్థితి లయాలు చేసేవారు కూడా నీ దాసానుదాసులు" అని ప్రార్థించాడు. సప్తశతి ఐదవఅధ్యాయంలో దేవతలంతా ఆ పరాశక్తిని ప్రార్థిస్తున్నారు.

**నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః ।**
**నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాః స్మృతామ్ ॥** **9**

**రౌద్రాయై నమో నిత్యాయై గౌర్యై ధాత్ర్యై నమోనమః ।**
**జ్యోత్స్నాయై చేందురూపిణ్యై సుఖాయై సతతం నమః ॥** **10**

**కళ్యాణ్యై ప్రణతాం వృద్ధ్యై సిద్ధ్యై కుర్మో నమోనమః ।**
**నైర్ఋుత్యై భూభృతాం లక్ష్మ్యై శర్వాణ్యై తే నమోనమః ॥** **11**

**దుర్గాయై దుర్గపారాయై సారాయై సర్వకారిణ్యై ।**
**ఖ్యాత్యై తథైవ కృష్ణాయై ధూమ్రాయై సతతం నమః ॥** **12**

**అతిసౌమ్యాతిరౌద్రాయై నతాస్తస్యై నమో నమః ।**
**నమో జగత్ప్రతిష్ఠాయై దేవ్యై కృత్యై నమో నమః ॥** **13**

ఓ మహాదేవీ సర్వశుభంకరివైన నీకు నమస్కారము. సమస్తజగత్తులకు మూలప్రకృతివి నీవే. జగత్తులను రక్షించేది నీవే. నీవు శాశ్వతమైన దానవు. దుర్మార్గుల పాలిట భయంకరమైన దానవు. జగత్తును పోషించేదానవు. వెన్నెల రూపంలో చల్లదనాన్నిచ్చేదానవు. శుభస్వరూపిణివి. భాగ్యదేవత, అభాగ్యదేవత నువ్వే. నువ్వు సాధుస్వరూపిణివి. రౌద్రరూపిణివి.

**యా దేవి సర్వభూతేషు విష్ణుమాయేతి శబ్దితా ।**
**నమస్తస్యై ॥ నమస్తస్యై ॥ నమస్తస్యై నమోనమః ॥**

యా దేవీ సర్వభూతేషు చేతనేత్యభిధీయతే ।

సమస్తస్యై ॥ సమస్తస్యై ॥ సమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా ।

సమస్తస్యై ॥ సమస్తస్యై ॥ సమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు నిద్రారూపేణ సంస్థితా ।

సమస్తస్యై ॥ సమస్తస్యై ॥ సమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు క్షుధారూపేణ సంస్థితా ।

సమస్తస్యై ॥ సమస్తస్యై ॥ సమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు చ్ఛాయారూపేణ సంస్థితా ।

సమస్తస్యై ॥ సమస్తస్యై ॥ సమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా ।

సమస్తస్యై ॥ సమస్తస్యై ॥ సమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు తృష్ణారూపేణ సంస్థితా ।

సమస్తస్యై ॥ సమస్తస్యై ॥ సమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు క్షాంతిరూపేణా సంస్థితా ।

సమస్తస్యై ॥ సమస్తస్యై ॥ సమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు జాతిరూపేణ సంస్థితా ।

సమస్తస్యై ॥ సమస్తస్యై ॥ సమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు లజ్జారూపేణ సంస్థితా ।

సమస్తస్యై ॥ సమస్తస్యై ॥ సమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు శాంతిరూపేణ సంస్థితా ।

సమస్తస్యై ॥ సమస్తస్యై ॥ సమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు శ్రద్ధారూపేణ సంస్థితా ।

నమస్తస్యై ॥ నమస్తస్యై ॥ నమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు కాంతిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై ॥ నమస్తస్యై ॥ నమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు లక్ష్మీరూపేణ సంస్థితా ।

నమస్తస్యై ॥ నమస్తస్యై ॥ నమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు వృత్తిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై ॥ నమస్తస్యై ॥ నమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు స్మృతిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై ॥ నమస్తస్యై ॥ నమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు దయారూపేణ సంస్థితా ।

నమస్తస్యై ॥ నమస్తస్యై ॥ నమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు తుష్టిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై ॥ నమస్తస్యై ॥ నమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా ।

నమస్తస్యై ॥ నమస్తస్యై ॥ నమస్తస్యై నమోనమః ॥

యా దేవీ సర్వభూతేషు భ్రాంతిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై ॥ నమస్తస్యై ॥ నమస్తస్యై నమోనమః ॥

ఇంద్రియాణామధిష్ఠాత్రీ భూతానాం చాఖిలేషు యా ।

భూతేషు సతతం తస్యై వ్యాప్తిదేవ్యై నమో నమః ॥

చితిరూపేణ యా కృత్స్నమేతద్ వ్యాప్య స్థితా జగత్ ।

నమస్తస్యై ॥ నమస్తస్యై ॥ నమస్తస్యై నమోనమః ॥

అన్ని భూతముల యందు విష్ణుమాయ రూపంలో ఉన్నావు. అన్ని ప్రాణులందు చేతనారూపంలో ఉన్నావు. అన్ని జీవుల యందు బుద్ధిరూపంలో ఉన్నావు. నిద్రా రూపంలో ఉన్నావు. ఆకలి రూపంలో ఉన్నావు. ప్రాణాల రూపంలో, శక్తి రూపంలో, తృష్ణ (కోరిక) రూపంలో, ఓర్పు రూపంలో, లజ్జ (వినమ్రత) రూపంలో, శాంతి రూపంలో, శ్రద్ధ రూపంలో, కాంతి రూపంలో, లక్ష్మి రూపంలో, వృత్తి రూపంలో, స్మృతి రూపంలో, దయ రూపంలో, తుష్టి (తృప్తి) రూపంలో, తల్లి రూపంలో ఉన్నావు అంటారు. అంటే **జగత్తులోని అన్ని జీవుల యందు అన్ని భూతములయందు అంతర్యామిగా ఉండేది ఆ పరాశక్తియే. ఆమెయే పరబ్రహ్మ.**

ఆ పరాశక్తిని గురించి తెలుసుకోవటానికే ఈ జిజ్ఞాస.

## పంచదశీ మహామంత్రం

శ్రీవిద్యలో పంచదశి మహామంత్రం చాలా ముఖ్యమైనది. ఇది శ్రీవిద్యకు గాయత్రి వంటిది. అసలు ఆ మంత్రం ఎలా ఆవిర్భవించిందో చూద్దాం.

ప్రళయం సంభవించినప్పుడు సృష్టిఅంతా పరమేశ్వరునిలో లీనమై పోయింది. ఇది ఎలా జరిగింది ? అంటే ప్రళయం సంభవించినప్పుడు కర్మక్షయం అయిన జీవరాశి అంతా ముక్తినిపొందగా, కర్మక్షయంకాని జీవరాశి ఆ కర్మను తమతో మూటకట్టుకున్నదై, తనకర్మతో సహా మాయలో లీనమైపోయింది. ఆ తరువాత భూమి జలమునందు, జలముఅగ్నియందు, అగ్ని వాయువునందు, వాయువు ఆకాశమునందు, ఆకాశము మాయయందు లీనమవగా, వీటన్నింటినీ తనలో లీనం చేసుకున్న మాయ, పరాశక్తిలో లీనమైపోయింది. ఈ విధంగా సృష్టి అంతా పరాశక్తిలో లీనమవగా, ఇప్పుడు వికారాలు లేనిది, సత్యజ్ఞానానంద మయమైనది, పరిపూర్ణమైనది, సనాతనముగాఉన్నది, ఏకముగాఉన్నది, రెండవది లేనిది పరబ్రహ్మస్వరూపము ఒక్కటేఉన్నది. నిరాకారమైన ఆ పరబ్రహ్మ స్వరూపంలో ఎడారులందు ఎండమావిలాగా, స్థాణువునందు దొంగవాడిలాగా, స్ఫటికంలోని రేఖలులాగా అనిపిస్తూ, తెలుపు, ఎరుపు, నలుపు గల సమాన త్రిగుణాలు కలిగి, అనిర్వచనీయమైన మూలప్రకృతి ఉన్నది. ఆ మూలప్రకృతిలో ప్రతిబింబించిన పరబ్రహ్మయే సాక్షిచైతన్యము.

ఈ పరమేశ్వరతత్త్వానికి రూపంలేదు. గుణంలేదు, లింగభేదం అసలే లేదు. ఇది తేజోమయమైన కాంతిపుంజము. **బ్రహ్మావాదులు దీన్నే 'పరమేశ్వరుడు' అంటారు. శ్రీవిద్యాపరులు పరాశక్తి అంటారు.**

ఈ రకంగా సృష్టినంతటినీ తనలోనిక్షిప్తం చేసుకున్న ఆ పరాశక్తి ఇప్పుడు సృష్టిచెయ్యాలి అని సంకల్పించింది. సృష్టి ఎందుకుచెయ్యాలి ? ప్రళయం జరిగినప్పుడు కర్మక్షయం కాకుండా తనలోలీనమైపోయిన జీవకోటికి కర్మక్షయంచేసి, దానికి ముక్తికలిగించాలనే ఉద్దేశ్యంతో సృష్టిచెయ్యాలని సంకల్పించింది పరాశక్తి. ఇప్పుడు సృష్టి ప్రారంభమైంది. ముందుగా ఆ పరాశక్తి నుంచి సత్వగుణ ప్రధానమైన అవ్యక్తం వచ్చింది. అదేమాయ. ఈ మాయ పరమేశ్వరి అధీనంలోనే ఉంటుంది. మాయవల్లనే సృష్టిస్థితిలయాలు అన్నీ జరుగుతున్నాయి. ఇప్పుడు అవ్యక్తము నుంచి రజోగుణప్రధానమైన మహత్తత్త్వము పుట్టింది. అదే హిరణ్యగర్భుడు. మహత్తత్త్వము నుంచి తమోగుణప్రధానమైన అహంకారము పుట్టింది. అదే దేవి విరాడ్రూపము. ఈ రకంగా పరమేశ్వరి నుంచి అవ్యక్తము (మాయ) మహత్తత్త్వము (హిరణ్యగర్భుడు) అహంకారము (విరాడ్రూపము) ఆవిర్భవించినాయి.

ఈ అహంకారము నుంచే నామరూపాత్మకమైనజగత్తు ఆవిర్భవించింది. ముందుగా అహంకారం నుంచి పంచభూతాల సూక్ష్మరూపాలయిన తన్మాత్రలు ఆవిర్భవించాయి. అవే శబ్ద స్పర్శ రూప రసగంధాలు. ఆ తరువాత తన్మాత్రల స్థూలరూపాలయిన పంచభూతాలు ఆవిర్భవించినాయి. పంచభూతాలలో ముందుగాపుట్టింది ఆకాశము. ఆకాశము నుంచి వాయువు, వాయువు నుంచి అగ్ని, అగ్ని నుంచి జలము, జలము నుంచి భూమి, భూమి నుంచి ఓషధులు, ఓషధుల నుంచి  వనస్పతులు, వనస్పతుల నుంచి అన్నము వచ్చింది. ఈ రకంగా రూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. ఇక నామాత్మకమైన జగత్తు. అవ్యక్తము నుంచి ముందుగా ఓంకారము పుట్టింది. ఓంకారము నుంచి అకార ఉకార మకారాలు వచ్చినాయి. వాటినుంచి అక్షరసమామ్నాయము వచ్చింది. అక్షరాల నుంచి పదాలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, సంగీతము, సాహిత్యము వచ్చాయి. ఈ రకంగా పరాశక్తి నుంచి నామరూపాత్మకమైనజగత్తు ఏర్పడింది.

ఇప్పుడు పంచభూతాల పంచీకరణ జరిగింది. పంచభూతాలలో ముందుగా ఆకాశం పుట్టింది. ఆకాశంలో దానియొక్కలక్షణం శబ్దముమాత్రమే ఉన్నది. ఆకాశం నుంచి వాయువు వచ్చింది. వాయువు లక్షణం స్పర్శ. అందుచేత వాయువులో ఆకాశలక్షణమైన శబ్దము, వాయులక్షణమైన స్పర్శ ఉన్నాయి. వాయువు నుంచి అగ్ని వచ్చింది. అగ్నిలో ఆకాశలక్షణమైనశబ్దము, వాయులక్షణమైనస్పర్శ, అగ్ని లక్షణమైనరూపము ఉన్నాయి. అగ్ని నుంచి జలము వచ్చింది. జలమునందు ఆకాశలక్షణమైనశబ్దము, వాయులక్షణమైనస్పర్శ, అగ్నిలక్షణమైనరూపము, జలలక్షణమైన రసము ఉన్నాయి. జలము నుంచి భూమి వచ్చింది. భూమియందు పంచభూతాల యొక్క లక్షణాలన్నీ అంటే ఆకాశ లక్షణమైనశబ్దము, వాయులక్షణమైన స్పర్శ, అగ్నిలక్షణమైనరూపము, జలలక్షణమైనరసము, భూలక్షణమైనగంధము ఉన్నాయి. ఈ రకంగా

| | | |
|---|---|---|
| ఆకాశమునందు | - | శబ్దము |
| వాయువునందు | - | శబ్దము, స్పర్శ |
| అగ్నియందు | - | శబ్దము, స్పర్శ, రూపము |
| జలమునందు | - | శబ్దము, స్పర్శ, రూపము, రసము |

భూమియందు - శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము ఉన్నాయి. ఇదే పంచీకరణ. ఈ పంచీకరణలో మొత్తం పదిహేను భాగాలున్నాయి. **ఈ రకంగా పంచభూతాల పంచీకరణతో వచ్చిన పదిహేను భాగాలే, పంచదశి మహామంత్రంలోని పదిహేను బీజాక్షరాలు.** కాబట్టి పంచదశి మహామంత్రము అంటే పంచభూతాలు అని అర్థం. ఈ సృష్టి అనిఅర్థం. ఈ జగత్తు అనిఅర్థం. **సాక్షాత్తూ చరాచరజగత్తే పంచదశీమహామంత్రంగా ఆవిర్భవించింది.**

ఈ విధంగా పంచదశీ మహామంత్రము పంచభూతాల నుంచే ఆవిర్భవించింది. పంచభూతాలు అంటే జగత్తే. జగత్తు అంటే పరబ్రహ్మ. అదే పరమేశ్వరి. పరాశక్తి కాబట్టి పంచదశీ మహామంత్రము అంటే చరాచరజగత్తే కాని ఇంకొకటికాదు. పంచదశి మహామంత్రం లలితా సహస్రంలోని 85-89 నామాలలో చెప్పబడింది.

# గాయత్రీ మహామంత్రము

పంచదశి మహామంత్రార్థం, గాయత్రీ మంత్రార్థం రెండూ ఒక్కటే.

మన దేశంలో శైవము, వైష్ణవము, గాణాపత్యము, సౌరము మొదలైన అనేక మతాలున్నాయి. వీరందరూ భిన్నమైన దేవతా స్వరూపాలను అర్చిస్తున్నారు. ఆ దేవతే పరమేశ్వర స్వరూపము అంటారు. కాని ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులందరికీ ఉపనయన సంస్కారం జరుగుతుంది. ఆ ఉపనయనంలో గాయత్రీ మంత్రాన్ని ఉపదేశం చేస్తారు. గాయత్రీ మంత్రాన్ని కొంత కాలం జపం చేసిన తరువాతనే అష్టాక్షరి **(ఓం నమో నారాయణాయ)** పంచాక్షరి **(ఓం నమశ్శివాయ),** గణపతి, సౌరం మొదలైన మంత్రాలను ఉపదేశించటం జరుగుతుంది. ఉపనయనం చేసి, గాయత్రీ మంత్రం ఉపదేశించిన తరువాతనే విద్యాభ్యాసానికి పంపుతారు. అంటే గాయత్రీ మంత్రోపదేశం లేకపోతే, మిగిలిన మంత్రాలను జపించటానికే కాదు, విద్యాభ్యాసం చెయ్యటానికి కూడా అర్హత ఉండదు. కాబట్టి ప్రతివారు తప్పనిసరిగా గాయత్రీ మంత్రాన్ని అనుష్టానం చేస్తారు. గాయత్రి అంటే ప్రత్యేకమైన దేవత కాదు. పరబ్రహ్మ స్వరూపమే. గాయత్రీ మహామంత్రము అంటే పరమేశ్వరిని ధ్యానం చేసే మహామంత్రమే. పంచదశి మహామంత్రానికీ, గాయత్రీ మహామంత్రానికి అర్థం ఒకటే. కాబట్టి **శైవులు, వైష్ణవులు అందరూ శ్రీవిద్యాపరులే.** ముందుగా గాయత్రీ మంత్రాన్ని చూద్దాం.

**గయాన్ ప్రాణాన్ త్రాయత ఇతి గాయత్రీ**

ప్రాణములను రక్షించునది గాయత్రి అని ఐతరేయ బ్రాహ్మణంలో చెప్పబడింది. గయలు అంటే ప్రాణాలు అని అర్థం.

**'త ద్యత్ప్రాణా న్త్రాయతే తద్గాయత్రీ'** ప్రాణరక్షణ చేయునది గాయత్రి అని బృహదారణ్యకోపనిషత్తు వివరించింది. **'తస్మాద్గాయంతం త్రాయతే యతః'** గానము చేయువానిని రక్షించునది. **'గీయతే తత్త్వమనయా గాయత్రీతి'** అని శంకర భాష్యం. ఈ మంత్రంలో దైవత్వం గానం చెయ్యబడింది. అందుచేత గాయత్రి అనబడుతుంది.

గాయత్రీ మంత్రం రెండు రకాలుగా ఉన్నది.

1. బ్రాహ్మణులకు ఉపనయనకాలంలో ఉపదేశించేది.
2. వేదాలలో నిగూఢమైనది. ఇదే పంచదశీ మహామంత్రము.

అందుచేతనే **గాయత్రీమంత్రం బ్రాహ్మణులకోసం ఏర్పడగా పంచదశీ మహామంత్రం అన్ని వర్ణాలవారికోసం ఏర్పడింది** అన్నాడు అగస్త్యమహర్షి. ఇంకా చెప్పాలి అంటే గాయత్రీమంత్రము, పంచదశీ మహామంత్రము రెండూ ఒక్కటే.

ఈ రెండింటి అర్థం కూడా ఒక్కటే.

శరీరాదులను రక్షించటంచేత గాయత్రి అని, తేజస్వరూపమవటంచేత సావిత్రి అని, వాగ్రూపం కావటంచేత సరస్వతి అని చెప్పబడుతోంది. **సవితృ ద్యోతనా త్సైవ సావిత్రీ పరికీర్తితా।** ప్రపంచాన్ని సృజించి ప్రకాశింపచేస్తుంది కాబట్టి సావిత్రి అనబడుతోంది. **జాతః ప్రసవితృత్వాన్ వాగ్రూపత్వా త్సరస్వతీ** వాగ్రూపము గలది కాబట్టి సరస్వతి. ఇరవైనాలుగు అక్షరాలతో ఏర్పడ్డ ఛందస్సే గాయత్రి. ఛందస్సులు అనేకరకాలున్నాయి. కాని బ్రహ్మజ్ఞానానికి ద్వారం గాయత్రీ ఛందస్సు, ఆ గాయత్రియే సోమరసాన్ని తెచ్చి దేవతల కిచ్చింది ఛాందోగ్యోపనిషత్తులో.

ఒకసారి దేవతలంతా గాయత్రి, త్రిష్టుప్, జగతి ఛందస్సులను సోమాన్ని తీసుకురమ్మని పంపారు. వీటిలో త్రిష్టుప్, జగతి ఛందస్సులు సోమాన్ని తేలేక తిరిగి వచ్చేశాయి. అంతేకాకుండా తిరిగివస్తూ త్రోవలో అలసట కారణంగా తమలోని కొన్ని అక్షరాలను వదలివేశాయి. గాయత్రీ మంత్రం సోమం దగ్గరకు వెళ్ళి, దాన్ని రక్షించే వారందరినీ ఓడించి సోమాన్ని తెచ్చి దేవతలకిచ్చింది. తిరిగి వచ్చేటప్పుడు త్రోవలో త్రిష్టుప్, జగతి, ఛందస్సులు వదలివేసిన అక్షరాలను కూడా తీసుకువచ్చింది. ఆ కారణంగా గాయత్రీ ఛందస్సు అన్నింటికన్నా గొప్పది అయింది. అంతేకాకుండా ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము మూడింటిలోనూ వ్యాప్తమై ఉన్నది. బ్రాహ్మణునికి అత్యంతావశ్యకమవటంచేత దాని గౌరవము ఇనుమడించింది. అందుచేతనే గాయత్రిని ఉపేక్షించినవాడు దేన్నీ పొందలేడు.

గాయత్రీ ఛందస్సులో 24 అక్షరాలు ఒక్కొక్క పాదానికి ఆరు చొప్పున నాలుగు పాదాలుగా ఉన్నాయి. ఇతర ఛందస్సులలో ఇంకా ఎక్కువ అక్షరాలున్నాయి. కాని వాటన్నింటిలోకి గాయత్రియే శ్రేష్టమైనది. స్థావరజంగమాత్మకమైన ప్రాణిసమూహ మంతా గాయత్రియే. వాక్కు – గాయత్రి, సమస్తప్రాణాలు – గాయత్రి, వాగ్రూపమైన గాయత్రి అందరి పేర్లనూ ఉచ్చరిస్తోంది. కాబట్టి గాయత్రి అందరి పేర్లలోనూ ఉన్నది.

ఈరకంగా ప్రాణిజాతి అంతా గాయత్రియే. గాయత్రి అంటే ప్రాణులను రక్షించేది అని అర్థం. ఈ లక్షణాలుగల గాయత్రి ఈపృథివేతప్ప వేరేకాదు. చరాచరాలన్నీ ఈ భూమిలోనే ఉన్నాయి. అందుచేతనే చరాచరజగత్తునంతటనూ గానంచేస్తూ, పాడుతూ, త్రాణంచేస్తూ – కాపాడుతూ ఉండే గాయత్రియే ఈ భూమి.

పృథివీ రూపమైన గాయత్రి శరీరంలో ఉండే పంచభూతాలు, ఇంద్రియాల సమూహాము ఒక్కటే. పురుషుని శరీరరూపమైన గాయత్రి, పురుషుని హృదయ కమలంలో ఉండే పురుషుడు ఇద్దరూ ఒకటే. ఆ పురుషునిలోనే అంటే గాయత్రిలోనే ప్రాణాలు ప్రతిష్టితమై ఉన్నాయి అని చెప్పబడింది.

బృహదారణ్యకోపనిషత్తులో గాయత్ర్యోపాసన వివరిస్తూ "ఉపనిషత్తులో చెప్పిన 'భూమి, అంతరిక్ష్యం, ద్యౌః' ఈ మూడు పదాల్లోనూ మొత్తం ఎనిమిది అక్షరాలున్నాయి. ద్యౌః అనే పదంలో దకార యకారాలను రెండు అక్షరాలుగా లెక్కపెట్టాలి. ఇవి మూడులోకాల పేర్లు. గాయత్రీ మంత్రానికి పాదానికి ఎనిమిది అక్షరాలున్నాయి. మూడుపాదాలున్నాయి. కాబట్టి మూడు లోకాలు మొదటిపాదం. ఈ రకంగా మూడులోకాలను గురించి తెలుసుకున్నవాడు ముల్లోకాలను జయిస్తాడు.

ఉపనిషత్తులో చెప్పిన **'ఋచ యజూంసి సామాని'** అనే మూడుపదాల్లోనూ ఎనిమిది అక్షరాలున్నాయి. ఇవి గాయత్రికి రెండోపాదం. అంటే వేదాలు రెండవపాదమన్నమాట. ఈ విషయం తెలుసుకున్నవాడు త్రయీవిద్య అనగా వేదవిద్యవల్ల వచ్చే ఫలితాన్ని పొందుతాడు.

మంత్రంలో చెప్పిన 'ప్రాణ అపాన వ్యానం' అనే దాంట్లోని ఎనిమిది అక్షరాలు గాయత్రికి మూడవపాదం. ఇక్కడ వ్యా అనే అక్షరంలో వకార యకారాలను రెండు అక్షరాలుగా లెక్కపెట్టాలి. ఈ విషయం తెలుసుకున్నవాడు సమస్తాన్ని పొందుతాడు.

ఉపనిషత్ మంత్రంలో **'తురీయ దర్శితం పదం'** అనేది నాల్గవపాదము. 'దర్శితపదం' అనే పదానికి ఆదిత్యమండలాంతర్గతుడైన పురుషుడు కనిపిస్తున్నాడని అర్థం. అంటే అన్ని లోకాలకు పైన ఆధిపత్యం స్థాపించి ప్రకాశిస్తున్నాడు. ఈ రకంగా గాయత్రిలో నాల్గవపాదం తెలుసుకున్నవాడు కీర్తితో ప్రకాశిస్తాడు.

తురీయపదం సత్యంలో ప్రతిష్టితమై ఉన్నది. నేత్రమే సత్యం. ఏదైనా ఒక విషయాన్ని నేను చూశాను. నేను విన్నాను అని చెప్పినప్పుడు చూసినదాన్నే నమ్మటం జరుగుతుంది. అందుచేతనే నేత్రం సత్యం. తురీయపాదానికి ఆశ్రయమైన సత్యం

బలంలో ప్రతిష్ఠితమై ఉన్నది. అందుకనే సత్యంకన్న బలం ప్రకాశమైనది. ప్రాణమే ఆ బలం. త్రిపదాగాయత్రి ప్రాణాలనురక్షిస్తుంది. గాయత్రి ప్రాణంలో ప్రతిష్టితమైఉన్నది. వాగాదిప్రాణాలను రక్షించేది గాయత్రి. గానము చేసేవాడిని రక్షించేది గాయత్రి. ఉపాసనచేసేవాణ్ణి రక్షించేది గాయత్రి.

ఉపనయన సమయంలో వటువుకు త్రిపదగాయత్రిని ఉపదేశిస్తారు.

**అస్యశ్రీగాయత్రీ మహామంత్రస్య విశ్వామిత్రోఋషిః । గాయత్రీఛందః । శ్రీ సవితాదేవతా। యం బీజం। ఈం శక్తిః । ణం కీలకం । జపే వినియోగః ॥**

**న్యాసము** : **ఓంతత్సవితుర్బ్రహ్మాత్మనే । ధీమహి సత్యాత్మనే ।**
**వరేణ్యం విష్ణ్వాత్మనే । ధియో యోనః జ్ఞానాత్మనే ।**
**భర్గోదేవస్యరుద్రాత్మనే । ప్రచోదయాత్ సర్వాత్మనే ॥**

**ధ్యానము** : **ముక్తావిద్రుమహేమనీల ధవళచ్ఛాయైై ర్ముఖై స్త్రీక్షణైః**
**యుక్తా మిందునిబద్ధరత్న మకుటాం తత్వార్థ వర్ణాత్మికాం ।**
**గాయత్రీం వరదాభయాం కుశకశా శ్శుభ్రం కపాలం గదాం**
**శంఖం చక్ర మథారవిందయుగళం హస్తై ర్వహంతీం భజే ॥**

**మంత్రము** : **ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం । భర్గోదేవస్య ధీమహి ।**
**ధియోయోనః ప్రచోదయాత్ ॥**

ఇది త్రిపదగాయత్రి. అయితే కొన్ని శాఖలవారు అనుష్టుప్ ఛందస్సులో ఉండే గాయత్రిని ఉపాసిస్తారు.

**తత్సవితు ర్వృణీ మహే । వయం దేవస్య భోజనం ।**
**శ్రేష్ఠం వై సర్వధాతమమ్। తురంగ భగస్య ధీమహి ॥**

వాక్కే అనుష్టుప్. వాక్కే శరీరంలో ఉండే సరస్వతి. కాబట్టి వాక్స్వరూపమైన సరస్వతిని వీరికి ఉపదేశిస్తున్నామని వీరికి నమ్మకం.

గాయత్రీ ఉపాసకుడు ఆవులు, గుర్రాలు, భూమి దానంగా తీసుకున్నా దానివల్ల కలిగే దోషం మొదటి పాదాన్ని జపిస్తే పోతుంది.

వేదవిద్యతో సమానంగా దానం తీసుకున్నా ఆ దానం వల్లవచ్చే పాపం మంత్రంలోని రెండవపాదాన్ని జపం చేస్తే పోతుంది.

"లోకంలో ఉన్న ప్రాణాలన్నీ దానం తీసుకున్నా, ఆ పాపం మూడవపాదం జపం చేస్తే పోతుంది. అంటే గాయత్రిమహిమ చాలా గొప్పది" అని చెప్పబడింది.

**శుద్ధ గాయత్రీ ప్రత్యక్షరం బ్రహ్మైక్య బోధితా ।**

శుద్ధగాయత్రిలోని ప్రతి అక్షరము పరబ్రహ్మను గురించే బోధిస్తున్నది. అంటే జీవాత్మ పరమాత్మల ఐక్యాన్ని వివరిస్తుంది.

**మహా మంత్రస్య చాపస్య స్థానే స్థానే పదే పదే ।**
**గూఢో రహస్య గర్భేన స్తో ప దేశ సముచ్ఛయః ॥**

గాయత్రీ మహామంత్రంలోని ప్రతి అక్షరంలోనూ, ప్రతిస్థానమందు మహా రహస్యమున్నది.

గాయత్రీ మంత్రాన్ని ఉపాసన చేసేవారికి ఇహపరసుఖాలు పూర్తిగా లభిస్తాయి. హృదయపద్మమందు అధిష్టించి ఉన్న గాయత్రిని ఉపాసన చేసేవారు ధర్మాధర్మ విముక్తులై ముక్తిని పొందుతారు.

గాయత్రీమంత్రానికి 24 అక్షరాలున్నాయి. ప్రజాపతి సంవత్సర స్వరూపుడు. అతడే కాలస్వరూపుడు. సంవత్సరానికి 12 మాసాలు. మాసానికి రెండు పక్షాలు. ఈ రకంగా 24 పక్షాలుంటాయి. ఆ 24 పక్షాలే గాయత్రీమంత్రంలోని 24 అక్షరాలు. సంవత్సరానికి మూడుకాలాలు. 1. వేసవి కాలము, 2. వర్షాకాలము, 3. శీతాకాలము. వీటి స్వరూపంగానే గాయత్రీ మంత్రము మూడుపాదాలుగా ఉన్నది. మంత్రంలోని మూడుపాదాలు 1. భూలోకం, 2. భువర్లోకం, 3. సువర్లోకాలకు ప్రతీక. అందుచేతనే ఆ పాదాలను లోకాలకు అన్వయించి ధ్యానించాలి.

**1. మొదటిపాదము :** భూలోక సమన్వయము. భౌతికమైన సృష్టిరూపంలో ధ్యానం చెయ్యాలి.

**2. రెండవపాదము :** భువర్లోక సమన్వయము. అంటే శక్తిమయాత్మకరూపంలో ధ్యానం చెయ్యాలి.

**3. మూడవపాదము :** సువర్లోక సమన్వయము. అంటే ప్రజ్ఞామయాత్మక దృష్టితో ధ్యానం చెయ్యాలి.

ఈ విధంగా ధ్యానం చేసేటప్పుడు ముందు ద్రవ్యాత్మక లోకానికి అధిష్టాన దేవతలయిన అష్టవసువుల అనుగ్రహం కలుగుతుంది. ఆ తరువాత శక్తిమయాత్మక లోకానికి అధిష్టానదేవతలయిన ఏకాదశరుద్రుల అనుగ్రహం కలుగుతుంది. అటుపైన ప్రజ్ఞామయాత్మకలోకానికి అధిష్టానదేవతలయిన ద్వాదశాదిత్యుల అనుగ్రహం కలుగుతుంది.

గాయత్రీ మంత్రంలోని ప్రతి అక్షరానికీ ప్రత్యేకమైన అర్థం ఉన్నది. ఇప్పుడా అర్థాన్ని వివరిస్తున్నాం.

| | | |
|---|---|---|
| ఓమ్ | – | బ్రహ్మ |
| భూః | – | ప్రణవస్వరూపము |
| భువః | – | దుఃఖనాశనము |
| స్వః | – | సుఖస్వరూపము |
| తత్ | – | ఆ |
| సవితుః | – | తేజస్సుచే ప్రకాశించు |
| దేవస్య | – | దేవునియొక్క |
| వరేణ్యం | – | శ్రేష్ఠమైన |
| భర్గః | – | పాపనాశనమైన తేజమును |
| ధీమహి | – | ధ్యానింతును |
| యః | – | ఏదైతే |
| నః | – | మా యొక్క |
| ధియః | – | బుద్ధులను |
| ప్రచోదయాత్ | – | ప్రేరేపించునో, ఆ తేజస్సును ధ్యానింతును. |

పంచదశీ మహామంత్రము గాయత్రీమంత్రము రెండూ ఒక్కటే అని చెబుతూ భాస్కరరాయలవారు తమ వరివశ్యా రహస్యంలోని 7,8,9,10 శ్లోకాలలో పంచదశీ మహామంత్రానికి గాయత్రీ మంత్రార్థం నిరూపించారు.

పంచదశీ మహామంత్రంలోని కకారానికి సర్వజగత్తునూ సృష్టించాలనే కోరిక గల బ్రహ్మ అని అర్థం. గాయత్రీ మంత్రంలోని మొదటి మూడుపదాలకు బ్రహ్మ అని అర్థం. పంచదశిలో రెండవఅక్షరమైన ఏ కారానికి గాయత్రీ మంత్రంలోని సవితుః - శ్రేష్టమైన అని అర్థం. మూడవ అక్షరమైన ఈ కారము గాయత్రీ మంత్రంలోని భర్గోదేవస్యధీ అయిన పరమేశ్వరుణ్ణి సూచిస్తుంది.

ఈ రకంగా శ్రీవిద్యలోని ప్రథమకూటమిలోని అక్షరాలు గాయత్రీమంత్రంలోని ప్రథమపాదంచే తెలియబడు జగత్కారణభూతులైన కామేశ్వరీ కామేశ్వరులను చెబుతున్నాయి. వారిద్దరి సామరస్యమే పరమశివుడు. అతని పరిణామమే ఈ జగత్తు. అతడే సమస్త బుద్ధులకు ప్రేరకుడు. త్రిగుణాతీతుడు. ప్రణవస్వరూపుడు.

గాయత్రీమంత్రంలోని మహి అనే శబ్దము శ్రీవిద్యలోని ల కారాన్ని సూచిస్తున్నది. ల కారమనేది పృథివీ బీజం. కాబట్టి దానినుంచి పంచభూతాత్మకమైన జగత్తు తెలుస్తుంది. ఈ జగత్తంతా పరమేశ్వరునివల్ల సృష్టించబడింది. ఆ పరమేశ్వరుని ప్రతిబింబమే మహాత్రిపురసుందరి.

గాయత్రీమంత్రంలోని చివరి రెండుపాదాల అర్థం శ్రీవిద్యలోని హ్రీం కారము ఒక్కటే. ఈ రకంగా గాయత్రి, పంచదశీ మహామంత్రాల అర్థం ఒక్కటే.

దేవీభాగవతంలోని 12వ స్కంధంలో గాయత్రీమంత్రాన్ని వివరించారు. ఈ మంత్రానికి 24 మంది ఋషులు, 24 ఛందస్సులు, 24 మంది దేవతలు, 24 శక్తులు, 24 రంగులు, 24 వర్ణతత్త్వాలు 24 వర్ణముద్రలు చెప్పబడ్డాయి.

ఈ రకంగా గాయత్రీ మహామంత్రం బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులందరిచేత జపించబడుతోంది. శైవము, వైష్ణవము మొదలైన అన్ని మతాలవారిచే జపించబడు తోంది. కాబట్టి వీరంతా శ్రీవిద్యాపరులే. **శ్రీవిద్యలో చెప్పబడిన పరమేశ్వరియే బ్రహ్మసూత్రాలలో ప్రతిపాదించబడిన పరబ్రహ్మము. ఆవిడే మోక్షాన్నిచ్చే దేవత. పరాశక్తి.** ఆమెను గురించి తెలుసుకోవటానికే ఈ జిజ్ఞాస.

**వ్యోమాది జనకహకార సలార్ణైః ఘటనేన పంచభూతమయీ ।**
**పంచచతుస్త్రిద్వ్యేకకశబ్దాది గుణాత్మ పంచదశవర్ణా ॥**

పంచభూతములయొక్క బీజములతో కూర్చబడిన ఈ విద్య పంచభూతాత్మకము అంటున్నారు ఈ శ్లోకంలో. అది ఎలా ? ఇప్పుడు ఈ జగత్తు ఎలా సృష్టించబడిందో చూద్దాం. మొదటగా అవ్యక్తము, అవ్యక్తము నుంచి మహత్తత్త్వము, మహత్తత్త్వము నుంచి అహంకారము, అహంకారము నుంచి పంచభూతాల సూక్ష్మరూపాలయిన తన్మాత్రలు, తన్మాత్రల నుంచి పంచభూతాలు ఆవిర్భవించినాయి. ఇది రూపాత్మకమైన సృష్టి. అలాగే నామాత్మకమైన సృష్టి కూడా జరిగింది. ఇందులో ముందుగా ఓంకారము వచ్చింది. ఓంకారం నుంచి అకార, ఉకార, మకారాలు వచ్చినాయి. వాటి నుంచి పదాలు, మాటలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, వేదాంగాలు, పురాణాలు, ఇతిహాసాలు, శాస్త్రాలు, సంగీతం, సాహిత్యం ఆవిర్భవించినాయి. ఇది నామాత్మకమైన సృష్టి. ఇప్పుడు మనం రూపాత్మకమైన సృష్టిని చూద్దాం. అహంకారం నుంచి ముందుగా పంచతన్మాత్రలు వచ్చినాయి. ఆ తరువాత వాటి స్థూలరూపాలయిన పంచభూతాలు ఆవిర్భవించినాయి. పంచభూతాలలో ముందుగా వచ్చింది ఆకాశము.

**ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నిర్ ఆపః ఆపః పృథివీ**

ఆకాశం నుంచి వాయువు, వాయువు నుంచి అగ్ని, అగ్ని నుంచి జలము, జలము నుంచి భూమి ఆవిర్భవించినాయి. నామాత్మక జగత్తు, రూపాత్మక జగత్తు అన్నప్పుడు ఆ రెండూ విడివిడిగా ఉండవు. కలిసే ఉంటాయి. ఎక్కడైతే నామము ఉంటుందో, అక్కడ ఒక రూపం ఉంటుంది. అలాగే ప్రతిరూపానికి ఒకపేరు అంటూ ఉంటుంది. ఈ రకంగా పేరు లేకపోయినట్లైతే, ఆ రూపాన్ని గుర్తించటం కష్టమవుతుంది. ఇక మంత్రశాస్త్రంలోకి వచ్చినట్లైతే సృష్టికి ఆధారమైన ప్రతిదానికీ ఒక బీజాక్షరం చెప్పబడింది. బీజాక్షరం అంటే ఏదో క్రొత్త అక్షరంకాదు. చదువరులైన మీకు తెలియని అక్షరం అంటూ ఎక్కడా లేదు. భాషకు ఉన్నవి యాభైఅక్షరాలు. మంత్రశాస్త్రంలో అక్షరాలసంఖ్య యాభైఒకటి. ఈ అక్షరాలే తలకట్టు, దీర్ఘము, గుడి, గుడిదీర్ఘము. ద్విత్తము, సంయుక్తాక్షరము వగైరా, వగైరా కావటంచేత

అనేకమవుతున్నాయి. బీజాక్షరాలు అంటే ఈ అక్షరాలేకాని క్రొత్తవి ఏవీలేవు. అని చదువరులు గుర్తించాలి. ఈ జగత్తులో ప్రతిదానికీ ఒక బీజమున్నది అని చెప్పుకున్నాం కదా ! ప్రతిదేవతకూ ఒక బీజమున్నది. ఓంకారము – పరమేశ్వర బీజం, శ్రీం – లక్ష్మీబీజం, ఐం – వాగ్బీజం, క్లీం – మన్మథ బీజం, సౌః – శక్తి బీజం. అలాగే పంచభూతాలకు కూడా ప్రత్యేకమైన బీజాలున్నాయి.

**హకారో వ్యోమ సంభూతం కకారస్తు ప్రభంజనం**
**రేఫాదగ్నిః స్సకారశ్చ జలతత్త్వసముద్భవ**
**లకారత్ పృథివీజాతా తస్మాద్విశ్వమయీచసా ॥**

హకారము – ఆకాశబీజము, కకారము – వాయుబీజము, రకారము – అగ్నిబీజము, సకారము – జలబీజము, లకారము – పృథివీ బీజము.

ఈ రకంగా పంచభూతాల బీజాలయిన హ క ర స ల అక్షరములచేతనే పంచదశీమహామంత్రము ఏర్పడింది. అయితే ఇక్కడ ఒక చిన్న అనుమానం వస్తుంది. పంచభూతముల బీజాలతో ఈ మంత్రం ఏర్పడితే, పంచదశి మహామంత్రంలో ఐదు బీజాలే ఉండాలి. అంతేగాని పదిహేను అక్షరాలు ఎలా వస్తాయి? దీనికి సమాధానం కావాలి అంటే, సృష్టిక్రమంలోకి మళ్ళీ ఒకసారి వెళ్ళాలి. ఇందాక మనం పంచభూతాలు ఏర్పడ్డాయి అన్నాం. అయితే ఆ పంచభూతాలు 'పంచీకరణ' చెందటం వల్ల ఈ జగత్తు ఆవిర్భవించింది. ఈ 'పంచీకరణ'ను చాలా జాగ్రత్తగా చూడండి. ముందుగా పంచభూతాల లక్షణాలను చూద్దాం.

1.ఆకాశ లక్షణము – శబ్దము, 2. వాయు లక్షణము – స్పర్శ, 3. అగ్ని లక్షణము – రూపము, 4. జలం లక్షణము – రసము, 5. పృథివీ లక్షణము – గంధము.

ఈ సృష్టిలో ముందుగా ఆకాశం వచ్చింది. దానిలో ఉన్న లక్షణము శబ్దము ఒక్కటే. ఆ తరువాత ఆకాశం నుంచి వాయువు వచ్చింది. వాయువులో ఆకాశం లక్షణమైన శబ్దము, వాయువు లక్షణమైన స్పర్శ రెండూ ఉన్నాయి. ఆ తరువాత వాయువు నుంచి అగ్ని వచ్చింది. అగ్నిలో తన లక్షణమైన రూపంతోపాటుగా, ఆకాశలక్షణమైన శబ్దము, వాయులక్షణమైన స్పర్శకూడా ఉన్నాయి. అగ్ని నుంచి

జలం వచ్చింది. జలం లక్షణం రసం. జలంలో ఆకాశలక్షణమైన శబ్దము, వాయులక్షణమైన స్పర్శ, అగ్ని లక్షణమైన రూపము ఉన్నాయి. ఆ తరువాత జలం నుంచి భూమి వచ్చింది. ఇప్పుడు భూమిలో ఆకాశ లక్షణమైన శబ్దము, వాయు లక్షణమైన స్పర్శ, అగ్ని లక్షణమైన రూపము, జల లక్షణమైన రసము, భూమి లక్షణమైన గంధము ఉన్నాయి. ఈ రకంగా చూసినట్లైతే ఆకాశం అన్ని భూతాలలోనూ ఉన్నది. కాబట్టి అది ఐదు భాగాలు. వాయువు నాలుగు భాగాలు. అగ్ని మూడు భాగాలు, జలం రెండు భాగాలు. భూమి ఒక భాగమే. ఈ భూమి అనేది భూమిలోనే ఉంది. మిగిలిన నాలుగు భూతాలలోను లేదు. ఇప్పుడు పంచభూతాలు మొత్తం ఎన్ని భాగాలయినాయో చూడండి. ఆకాశం – 5, వాయువు – 4, అగ్ని – 3, జలం – 2, భూమి – 1. వెరసి 15 భాగాలు. పంచభూతాలు పంచీకరణ జరిగినప్పుడు అవి మొత్తం 15 భాగాలయినాయి. ఈ పదిహేను భాగాలే పంచదశీ మహామంత్రంలోని 15 బీజాలు. ఈ విషయాన్ని గనక గ్రహించగలిగినట్లైతే **పంచభూతాల రూపాంతరమే పంచదశీ మహామంత్రము** అదే పరాశక్తి స్వరూపం. అని తెలుస్తుంది.

## పంచదశీ మంత్రానికి భావార్థం

ఇప్పుడు పంచదశీ **మహామంత్రానికి అర్థం. 'త్రిమూర్తి ద్వంద్వమే'** అంటున్నారు. ఎలాగో చూద్దాం. అందులో ....

**కకారో బ్రహ్మ రూపశ్చ ఏకారో భారతీమతమ్**
**ఈకారో విష్ణు రూపశ్చ లకారో పృథివీమతమ్**
**హకారో రుద్రరూపశ్చ రకారో రుద్రాణి ముచ్యతే ॥**

కకారము – బ్రహ్మ, ఏకారము – భారతి, ఈకారము – విష్ణువు, లకారము – పృథివి, హకారము – రుద్రుడు, రకారము – రుద్రాణి.

అంటే ప్రథమకూటమిలో ఉన్న అక్షరాలకు అధిపతులు త్రిమూర్తి ద్వంద్వము. అనగా త్రిమూర్తులు, త్రిశక్తులు. అలాగే రెండు మూడు కూటములయందు కూడా లెక్కపెట్టాలి. రెండవ కూటమిలో రెండు హకారాలున్నాయి. వాటిలో రెండవదాన్ని అక్కడ నుంచి తీసివేసి, మూడవ కూటమికి ముందు చేర్చాలి. అప్పుడు రెండు,

మూడు కూటముల యందుండే అక్షరాలు ఒకటే అవుతాయి హసకల హ్రీం. ఇలా ఏర్పడిన ఈ కూటములలోని అక్షరాలకు దేవతలు ఎవరో చూడండి.

**హకారో బ్రహ్మరూపశ్చ సకారో భారతీ మతమ్**

**కకారో విష్ణురూపశ్చ లకారో పృథివీ మతమ్**

**హకారో రుద్రరూపశ్చ రకారో రుద్రాణి ముచ్యతే ॥**

హకారము – బ్రహ్మ, సకారము – భారతి, కకారము – విష్ణువు, లకారము – పృథివి, హకారము – రుద్రుడు, రకారము – రుద్రాణి.

ఈ రకంగా పంచదశీ మహామంత్రంలోని మూడు కూటములయందు ఉన్న అక్షరాలకు అధిదేవతలు త్రిమూర్తి ద్వంద్వము తప్ప వేరుకాదు. ప్రతికూటమి చివర హ్రీంకారమున్నది. ఇప్పటివరకు ఇందులోని హకార, రకారాలనే చెప్పాం. మరి ఈం కారము ఏమైంది? గతంలో మనం వామ, జ్యేష్ఠ, రౌద్రశక్తులే త్రిమూర్తులనీ సమిష్టిగా వీరిని 'అంబిక' అంటారని అలాగే విమర్శశక్తి భాగాలయిన ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులే త్రిశక్తులనీ, సమిష్టిగా వీరిని 'శాంత' అంటారని చెప్పుకున్నాం. ఇప్పుడు హ్రీంకారంలో ఉన్న ఈం కారమే ఈ మూడు వ్యష్టిరూపముల యొక్క సమిష్టి రూపమైన శాంత, అంబికలు. ఈరకంగా పంచదశీమహామంత్రంలోని ప్రతికూటమి లోని అక్షరాలకు దేవతలు త్రిమూర్తి ద్వంద్వము. కాగా ఈం కారము శాంత అంబికల స్వరూపమైన నాల్గవ మిథునము. అంటే ప్రతికూటమికి దేవత వ్యష్టిగాను, సమిష్టిగాను త్రిమూర్తి ద్వంద్వమే. అవే ప్రకాశాంశ విమర్శాంశలు. శివశక్తులు, కామేశ్వరి కామేశ్వరులు. కాబట్టి పంచదశీమహామంత్రానికి అధిదేవత ఆ పరమేశ్వర స్వరూపమైన పరాశక్తి తప్ప వేరుకాదు.

ఈ రకంగా చరాచర జగత్తంతా పరాశక్తి స్వరూపం. ఆవిడే మోక్షాన్నిచ్చే దేవత. అదే శ్రీవిద్యాస్వరూపం. అదే పరబ్రహ్మ.

## పంచదశీ మహామంత్రానికి మహావాక్యార్థము

**విధి హరి శివ వచనా అపి కకార ఏకార ఈకారః ।**

**సృష్టి స్థితి భఙ్గాత్మక తత్తత్కృత్య జనకత్వ లక్షణకాః ॥**

**ఈశ్వర వాచీకారో వక్తిలకార స్సదాశివం తాభ్యామ్ ।**
**లక్షణయాతత్ర తిరోధానానుగ్రహ కృత్యకారితా గదితా ॥**

ఇక్కడ మహావాక్యార్థాన్ని వివరిస్తున్నారు. అసలు మహావాక్యాలంటే ఏమిటి ? అవి ఏం చెబుతున్నాయి ? అనే విషయాలను ముందుగా చూద్దాం. వేదం నాలుగు భాగాలుగా ఉంటుందని గతంలో చెప్పుకున్నాం. 1. సంహితలు, 2. బ్రాహ్మణాలు, 3. అర్యణ్యకాలు, 4. ఉపనిషత్తులు. వీటిలో నాల్గవ భాగము ఉపనిషత్తు. ఇది వేదము యొక్క అంతమందుంటుంది. కాబట్టి, వీటిలో ఉండేదంతా వేదాంతమే. అదే బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్యా పరిశీలకులైన విద్వాంసులకు కర్మ, జన్మ, మరణాలను లేకుండా చేసేది. ఆజన్మాది మరణాదికమైన దానిని నశింపచేసేది. బ్రహ్మపదార్థ లాభాన్ని కలుగజేసేది. నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులున్నాయి. వాటిలో ముఖ్యమైనవి 108. వీటిలో వేదాంతోపనిషత్తులు 24. మొత్తం ఉపనిషత్తులలో మరీ ముఖ్యమైనవి 10 అని తేల్చారు శంకర భగవత్పాదులవారు. అవి ...

**ఈశ కేన కఠ ప్రశ్న ముండక మాండూక్య తిత్తిరి**
**ఐతరేయంచ ఛాందోగ్యం బృహదారణ్యకం దశః**

ప్రతి ఉపనిషత్తుతోను పరబ్రహ్మతత్త్వాన్నే ప్రతిపాదించారు. నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. ఆదిమధ్యాంతములు లేనివాడు, శాశ్వతమైనవాడు, స్వతంత్రుడు, ధర్మాధర్మాలు, పక్షపాతములేనివాడు, నిమిత్తమాత్రుడు, ఆనంద స్వరూపుడు. సృష్టి స్థితిలయాలకు అతడే కారకుడు. పిపీలికాది బ్రహ్మ పర్యంతము నిండి ఉన్నవాడు. చరాచర జగత్తంతా ఆవరించి ఉన్నవాడు, సర్వవ్యాపి.

ఈ విధంగా ఉపనిషత్తులు పరబ్రహ్మస్వరూపాన్ని ప్రతిపాదించటంలో చాలా వరకు సఫలీకృతం పొందినాయి. ఉపనిషత్తుల సారమంతా మహావాక్యాలలో ఉంది. మహావాక్యాలు నాలుగు. ఈ మహావాక్యాలు నాలుగు వేదాలకు సంబంధించినవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానం బ్రహ్మ | – | ఐతరేయోపనిషత్తు | – | ఋగ్వేదము |
| 2. | అహంబ్రహ్మాస్మి | – | బృహదారణ్యకం | – | శుక్లయజుర్వేదము |
| 3. | తత్త్వమసి | – | ఛాందోగ్యం | – | సామవేదము |
| 4. | అయమాత్మాబ్రహ్మ | – | మాండూక్యోపనిషత్తు | – | అధర్వణవేదము |

ఈ మహావాక్యాలలో చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపం. ఆ పరబ్రహ్మ ఎవరోకాదు నువ్వే. అంటూ ఈ మహావాక్యాలు పరబ్రహ్మను ప్రతిపాదించినాయి.

జీవాత్మ పరమాత్మ రెండూ వేరుకాదు. ఆ రెండూ ఒక్కటే. నువ్వే పరబ్రహ్మ స్వరూపానివి అంటూ అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించటమే మహావాక్యార్థము.

పరమాత్మకు 1. తటస్థ లక్షణము, 2. స్వరూప లక్షణము అని రెండు లక్షణాలున్నాయి. ముందుగా తటస్థ లక్షణాన్ని చూద్దాం. **యతోవా ఇమాని భూతాని జాయంతే యేనజాతాని జీవంతి** ఎవరివల్లనైతే సృష్టి స్థితి సంహారాలు జరుగుతున్నాయో, అతడే పరబ్రహ్మ. ఇది తటస్థ లక్షణము.

కకారము – బ్రహ్మ, ఏకారము – విష్ణువు, అకారము – రుద్రుడు. ఈ మూడూ సృష్టి స్థితి లయాలకు కారణమయిన త్రిమూర్తులను చెబుతున్నాయి. ఈకారము – ఈశ్వరుడు. హకారము – సదాశివుడు. సృష్టి స్థితి లయము, తిరోదానము, అనుగ్రహము అనే ఐదు పంచకృత్యములు. ఈ విషయాలన్నీ లలితా సహస్రంలో 264 నుండి 274 వరకు **సృష్టికర్త్రీ, బ్రహ్మరూపా, గోప్త్రీ, గోవిందరూపిణీ, సంహారిణీ, రుద్రరూపా, తిరోదానకరి, ఈశ్వరి, సదాశివా, అనుగ్రహదా, పంచకృత్య పరాయణా** వరకు గల నామాలలో వివరించారు. ఇదంతా పరమేశ్వరుడి లక్షణము. ఇది మొదటి కూటమి అర్థము.

**సత్యం జ్ఞానమనంతం బ్రహ్మేత్యుక్తం ద్వితీయ కూటేన ।**
**హస ఆనందః సత్యం కం హం అనన్తం చ లం జ్ఞానం ।**
**ఇత్థం బ్రహ్మ తటస్థ స్వరూప లక్షణయుగేన నిర్ణీయ ॥**
**తదభేదో జీవగణే ప్రోక్తశ్శక్తిమయే తృతీయ కూటేన ।**
**జాగ్రత్స్వప్న సుషుప్త్యాఖ్య కలాత్రితయేన సాహిత్యాత్ ॥**
**సకల పదం జీవపరం బ్రహ్మపరం శక్తిబీజం స్యాత్ ।**
**సామానాధికరణ్యాత్ తల్లక్షిత శుద్ధయోః అభేదార్థః ॥**
**అత్యల్పమిదం కథితం యత్సర్వం ఖల్విదం బ్రహ్మ ।**
**ఇత్యేవం బోధయితుం సకలపదం వా తృతీయ కూటగతం ॥**

**ఏవమవాన్తర వాక్యైః జీవబ్రహ్మ స్వరూప మభిధాయ ।**

**తదభేదో వర్ణిత ఇత్యేష మహాపూర్వ వాక్యార్థః ॥**

పరబ్రహ్మ స్వరూపము సత్యము, జ్ఞానము అనంతము అని రెండవ కూటార్ధంగా చెబుతున్నారు.

హస – ఆనందము, కకారానికి – సత్యము, హకారానికి – అనంతము, లకారానికి – జ్ఞానము అని అర్ధం. మొత్తంమీద సత్యము, జ్ఞానము, అనంతము, ఆనందము అయిన పరబ్రహ్మ అని రెండవ కూటార్థం చెప్పబడింది. ఇది బ్రహ్మ స్వరూప లక్షణము. ఈ రకంగా మొదటి రెండు కూటములచేత తటస్థ, స్వరూప లక్షణాలను చెప్పి, మూడవకూటమితో జీవబ్రహ్మైక్యం చెబుతున్నారు.

బ్రహ్మము జగత్స్వరూపము. జగత్తు జీవరూపము 'సకల' అనే పదానికి జగత్తులోని సకల జీవరాసులు ప్రతీక. జీవులకు మూడు కళలు లేదా అవస్థలు ఉన్నాయి. అవే జాగ్రస్వప్న సుషుప్తులు. కాబట్టి **సకలజీవ పరంబ్రహ్మ పరం.** సకల జీవులు బ్రహ్మరూపులు. బ్రహ్మము సకలజీవ రూపము. ఈ రెండింటికీ భేదం లేదు అని భావించటమే మహావాక్యార్థము. మూడవ కూటమిలోని హ్రీంకారము శక్తిని సూచిస్తుంది. ఇక్కడ **స క ల హ్రీం** అంటే సర్వమూ బ్రహ్మమయమని అర్థము. ఈ రకంగా జగత్స్వరూపము, జీవస్వరూపము, బ్రహ్మస్వరూపము, విద్యాస్వరూపము అన్నీ ఒకటే అని భావించటమే మహావాక్యార్థము.

ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యను బోధిస్తూ **తత్త్వమసి** అంటాడు. తత్ అంటే పంచకృత్యములు గల, పరబ్రహ్మ, త్వం అంటే అవస్థాపంచకం గల జీవుడు ఒకటేను అని అర్థం. అవస్థలు ఐదు. వీటినే అవస్థా పంచకము అంటారు. అవే జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయము, తురీయాతీతము. ఈ అవస్థలు గల జీవుడు, పంచకృత్యములు గల బ్రహ్మ ఇద్దరూ ఒక్కటే, వేరుకాదు.

**ఈ రకంగా చరాచర జగత్తంతా పరాశక్తి స్వరూపం. అదే పరబ్రహ్మ. మోక్షాన్నిచ్చే దేవత. సగుణంలో లలితాత్రిపురసుందరి. అదే శ్రీవిద్యాస్వరూపం. ఆమెను గురించి తెలుసుకోవటానికే ఈ బ్రహ్మ జిజ్ఞాస.**

# షోడశి మహామంత్రము

శ్రీవిద్యకు పంచదశి మహామంత్రం గాయత్రివంటిది. కాగా శ్రీవిద్యామంత్రము షోడశి. దీన్నే మహాషోడశి అంటారు ఇది బ్రహ్మవిద్య.

షోడశి అంటే పదహారు అక్షరాలమంత్రం. పంచదశి మహామంత్రానికి శ్రీం బీజం చేర్చినట్లైతే పదహారు అక్షరాలవుతుంది. అదే షోడశి అన్నారు. అయితే కొంతమంది శ్రీం కాదు ఈం అనే బీజం చేర్చాలి అన్నారు. ఏ రకంగా అయినా అది పదహారు అక్షరాల మంత్రమే. కాని అది బ్రహ్మవిద్య మాత్రం కాదు.

**వైదికా ప్రణవై ర్యుతా ప్రణవేన విహీనం తు తాంత్రికా ఏవ ప్రకీర్తితా ॥**

వైదికమంత్రాలు లేదా మోక్షానిచ్చే మంత్రాలకు ప్రణవము తప్పనిసరిగా ఉండాలి అన్నారు. మరి పంచదశి మహామంత్రంలో ప్రణవం లేదు. షోడశిలోనూ ప్రణవం లేదు. కాబట్టి అది బ్రహ్మవిద్య ఎలా అవుతుంది. అన్నదే సందేహము.

ఓంకారాన్ని ప్రణవము అంటారు. ఇది పరమేశ్వర స్వరూపము. అలాగే శక్తి ప్రణవాలు కొన్ని ఉన్నాయి. **శ్రీం హ్రీం క్లీ ఐం సౌః** ఈ ఐదింటినీ శక్తిప్రణవాలు అంటారు.

పంచదశి మహామంత్రానికి ముందు ఎనిమిది తరువాత ఐదు బీజాక్షరాలు చేర్చినట్లైతే అది మహాషోడశి అవుతుంది. అప్పుడు ఈ శక్తిప్రణవాలు పంచదశికి ముందు అనులోమంగాను తరువాత విలోమంగాను ఉండాలి. అప్పుడు

**శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం క ఏ ఈ ల హ్రీం ।**
**హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । సౌః ఐం క్లీం హ్రీం శ్రీం ॥**

ఇది మహాషోడశి. దీనిలో ఇరవై ఎనిమిది అక్షరాలుంటాయి. అయితే పంచదశి మంత్రానికి ముందు ఎనిమిది, తరువాత ఐదు మొత్తం పదమూడు. పంచదశి మంత్రంలో మూడుకూటములు మూడుబీజములుగా లెక్కిస్తే మొత్తం పదహారు అక్షరాలవుతాయి. ఈ మంత్రానికి అధిదేవత పరాశక్తి.

మోక్షాన్నిచ్చే మహామంత్రాలలో ప్రణవం ఒకటే ఉంటుంది. కాని షోడశిలో ఐదు ప్రణవాలు అనులోమ విలోమంగా ఉంటాయి. ఏ మంత్రానికైనా అనులోమ

విలోమంగా ఉంటే శక్తి ఎక్కువ. ఒక ప్రణవం ఉంటేనే బ్రహ్మవిద్య అంటున్నప్పుడు ఐదు ప్రణవాలు అనులోమ విలోమంగా ఉంటే దాన్నింకేమని చెప్పాలి? అందుకే మహాషోడశి బ్రహ్మవిద్య, మోక్ష ప్రదాయిని. ఆ పరాశక్తిని గురించి తెలుసుకోవటానికే ఈ జిజ్ఞాస.

## శ్రీచక్రం

పరమేశ్వరికి ప్రతీకగా శ్రీచక్రాన్ని పూజించటం జరుగుతుంది. శ్రీచక్రము అనేది కేవలము అమ్మవారి యంత్రమే కాదు. దానిలో ఏ దేవతనైనా పూజించవచ్చు. ఏ జపం చేసినా శ్రీచక్రం మీద ధారపోయవచ్చు. అది సర్వదేవతలకు నిలయము. అందుకే దాన్ని 'చక్రరాజము' అంటారు. ఒకసారి పార్వతీదేవి పరమశివుణ్ణి అడుగుతుంది. "ఓ దేవా ! దేవతలందరినీ ఒకేసారి అర్చించే విధానము ఏది? చరాచర జగత్తును, విశ్వమానవాళినీ, మోక్షకారకమైన పరమేశ్వర స్వరూపాన్ని అర్చించే విధానము నాకు తెలుపవలసింది." అని ఆ మాటలు విన్న ఈశ్వరుడు చెబుతున్నాడు. "ఓ పార్వతీ! శ్రీచక్రమనేది చరాచరజగత్తుకు ప్రతీక. విశ్వమానవాళికి ప్రతీక. పరబ్రహ్మస్వరూపానికి ప్రతీక. అందులోనే పంచభూతాలు, తన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, అన్నీ ఉన్నాయి.

**శ్రీచక్రం త్రిపురసుందర్యా బ్రహ్మాండాకారమీశ్వరీ** ఓ పరమేశ్వరీ ! శ్రీచక్రము అంటే సామాన్యమైన యంత్రం కాదు. అది బ్రహ్మాండానికి ప్రతీక. ఎందుచేతనంటే బ్రహ్మాండంలో ఉన్న తత్త్వాలన్నీ శ్రీచక్రంలోనే ఉన్నాయి.

**పంచభూతాత్మకం చైవ తన్మాత్రాత్మక మేవ చ**

సృష్టికి మూలమైనవి పంచభూతాలు, వీటియొక్క లక్షణాలే తన్మాత్రలు. వీటి కలయికతోనే జగత్తు సృష్టించబడుతోంది. అటువంటి పంచభూతాలు, తన్మాత్రలు ఈ శ్రీచక్రంలోనే ఉన్నాయి. అంటే శ్రీచక్రము బ్రహ్మాండానికిప్రతీక. అంతేకాదు.

**ఇంద్రియాత్మక మేవం చ ।**

ఇంద్రియాలు అంటే జ్ఞానేంద్రియాలు - 5. కర్మేంద్రియాలు-5, ఈ పది ఇంద్రియాలు జగత్తులోని ప్రాణికోటికంతటికీ ఉంటాయి. ఈ పదిఇంద్రియాల తత్త్వాలు శ్రీచక్రంలో ఉండటంవల్ల, శ్రీచక్రం సృష్టిలోని ప్రాణికోటికంతటికీ ప్రతీక అవుతోంది.

**మనస్తత్త్వాత్మకం తథా** మనస్సు అనేది మానవులకు మాత్రమే ఉండేది. యుక్తాయుక్తవిచక్షణా జ్ఞానాన్ని, ఆలోచింపచేసే శక్తిని ఇచ్చేది మనస్సు. ఆ మనస్తత్త్వము కూడా శ్రీచక్రంలోనే ఉన్నది. కాబట్టి శ్రీచక్రము విశ్వమానవాళికి ప్రతీక. అందుకే శ్రీచక్రాన్ని గనక అర్చించినట్లైతే చరాచరజగత్తునూ అర్చించినట్లే విశ్వమానవాళిని అర్చించినట్లే. జగత్తులోని జీవకోటినంతటినీ అర్చించినట్లే.

**మాయాదితత్త్వరూపం చ తత్త్వాతీతం చ బైందవమ్ ॥**

ఇవేకాక మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు అనే తత్త్వాలు కూడా శ్రీచక్రంలో ఉన్నాయి. ఈ రకంగా 25 తత్త్వాలున్నాయి. ఈ 25 తత్త్వాలే మణిద్వీపంలోని 25 ఆవరణలు. 26వ తత్త్వమే బిందువు నందున్న సాదాఖ్యకళ. అదే త్రిపురసుందరి. **బైందవే జగదుత్పత్తి స్థితి సంహారకారిణీమ్.** బిందువు నందు సృష్టి స్థితి సంహారాలకు కారణమైన పరమేశ్వరి ఉన్నది. అదే పరబ్రహ్మస్వరూపమైన పరాశక్తి.

పంచదశీ మహామంత్రం నుంచే దానికి ప్రతిరూపమైన శ్రీచక్రం ఉద్భవించింది. జ్ఞానార్ణవ తంత్రంలో

**శ్రీచక్రంతు వరారోహే శ్రీవిద్యార్ణవ సంభవమ్**

శ్రీచక్రము పంచదశీమహామంత్రంలోని బీజాక్షరాలవల్లనే పుట్టింది అని చెప్పారు.

**భూమిశ్చంద్ర శివో మాయాశక్తిః కృష్ణమాదనౌ**

**అర్ధచంద్రశ్చ బిందుశ్చ నవార్ణోమేరురుచ్యతే ॥**

పంచదశీమహామంత్రంలో మొత్తం పదిహేను అక్షరాలున్నాయి. కాని ఒకసారి లెక్కపెట్టిన అక్షరాన్ని మళ్ళీ లెక్కపెట్టకుండా ఉన్నట్లైతే, ఆ సంఖ్య తొమ్మిది అవుతుంది. అవి

1. భూమి – లకారము, 2. చంద్ర – సకారము, 3. శివ – హకారము, 4. మాయ – ఈకారము, 5. శక్తి – ఏకారము, 6. కృష్ణమాద్య – రేఫ, 7. మాదన – కకారము, 8. అర్ధచంద్ర – నాదము, 9. బిందువు – బిందువు

ఈ తొమ్మిది అక్షరాల సముదాయమే పంచదశీమహామంత్రము. వీటివల్లనే శ్రీచక్రము ఆవిర్భవించింది.

1. లకారము పృథివీబీజము. దీనివల్ల భూపురం ఉద్భవించింది.

2. సకారము చంద్రబీజము. దీనివల్ల షోడశదళం ఆవిర్భవించింది.

3. హకారము శివబీజము. దీనివల్ల అష్టమూర్త్యాత్మకమైన అష్టదళం పుట్టింది.

4. ఈకారము మాయాబీజము. దీనివల్ల చతుర్దశభువనాలకు ప్రతీకగా చతుర్దశారము వచ్చింది.

5. ఏకారము శక్తిబీజము. దీనివల్ల దశావతారాలకు ప్రతీకగా బహిర్దశారము పుట్టింది.

6. రకారము అగ్నిబీజము. దీనివల్ల అగ్నికళలతో కూడిన అంతర్దశారం ఏర్పడింది.

7. కకారము మన్మథబీజము. దీనివల్ల అష్టవసువులకు ప్రతీకగా అష్టకోణం ఏర్పడింది.

8. అర్ధచంద్రము త్రిగుణాత్మకము. దీనివల్ల త్రికోణం ఏర్పడింది.

9. బిందువు పరబ్రహ్మాత్మకము. దీనివల్ల బిందువు ఏర్పడింది.

ఈ రకంగా పంచదశీమహామంత్రంలోని బీజాక్షరాలవల్లనే, ఆ మంత్రానికి ప్రతీక అయిన శ్రీచక్రము ఏర్పడింది.

**ఈ రకంగా చూస్తే అమ్మవారిని జపించే మంత్రం, అమ్మవారికి ప్రతీకగా అర్చించే యంత్రం రెండూ చరాచర జగత్తుకు ప్రతీక. విశ్వమానవాళికి ప్రతీక. అదే పరాశక్తి స్వరూపం. అదే పరబ్రహ్మ. కాబట్టి పరబ్రహ్మ అంటే ఆ పరాశక్తియే కాని వేరు కాదు. ఆవిడయే శ్రీవిద్యలో ప్రతిపాదించబడిన దేవత. మోక్షప్రదాయిని.** ఆమెను తెలుసుకోవటానికే ఈ జిజ్ఞాస.

ఋగ్వేదంలోని **బహ్వృచోపనిషత్తులో**

**ఓం దేవీ హ్యేకాఽగ్ర ఆసీత్, సైవ జగదండమసృజత, కామకళేతి విజ్ఞాయతే, శృంగారకళేతి విజ్ఞాయతే, తస్యా ఏవ బ్రహ్మా అజీజనత్, విష్ణు రజీజనత్, రుద్రో అజీజనన్, సర్వే మరుద్గణా ఆజీజనన్, గంధర్వాప్సరస కిన్నరా వాది త్రవాదిన స్సమంతా దజీజనన్, భోగ్యమజీజనన్, సర్వమజీజనత్,**

**సర్వంశాక్తమజీజనత్, అండజం స్వేదజ ముద్భిజ్జం జరాయుజం యత్కించైతత్ ప్రాణి స్థావరజంగమం మనుష్య మజీజనత్, సైషా పరాశక్తిః సైషా శాంభవీ విద్యా, కాదివిద్యేతివా హాదివిద్యేతివా సాదివిద్యేతివా రహస్య మోమోం వాచి ప్రతిష్ఠా, సైవ పుర త్రయం శరీర త్రయం వ్యాప్య బహిరంతరవభాస యంతీ దేశ కాల వస్త్వంతరసంగా న్మహా త్రిపురసుందరీవై ప్రత్యక్చితిః (1)**

సృష్టికి ముందు దేవి ఒక్కతెయే ఉన్నది. ఆమెయే ఈ బ్రహ్మాండాన్ని సృష్టించింది. ఆమెయే కామకళ, శృంగారకళ అని తెలియబడుచున్నది. ఆమె నుంచే బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, సకల మరుద్గణములు, గంధర్వులు, అప్సరసలు, కిన్నరులు, వాద్యములు వాయించువారు, భోగ్యము, సర్వము పుట్టినాయి. సకల శాక్తము అండజాలు, స్వేదజాలు, ఉద్భిజాలు, జరాయుజాలు, స్థావరములు, జంగమములు, మనుష్యులు పుట్టిరి. ఆమెయే పరాశక్తి, శాంభవీవిద్య, కాదివిద్య, హాదివిద్య, సాదివిద్య, ఓం ఓం వాక్కునందున్నది. ఆమెయే పురత్రయము, శరీరత్రయమును వ్యాపించి లోపల వెలుపల భాసించుచు, దేశకాల ఇతర వస్తు సంబంధము వలన మహాత్రిపురసుందరి అనబడుతున్నది.

**సైవాత్మా తతోఽన్యదసత్యమనాత్మా, అత ఏషా బ్రహ్మ సంవిత్తిః, భావాభావకళా వినిర్ముక్తా చిద్విద్యాఽద్వితీయ బ్రహ్మ సంవిత్తిః, సచ్చిదానందలహరీ మహాత్రిపుర సుందరీ బహిరంతర మనుప్రవిశ్య స్వయమేకైవ విభాతి, యదస్తి సన్మాత్రం యద్విభాతి చిన్మాత్రం యత్ప్రియ మానందం తదేత త్సర్వాకారా మహాత్రిపురసుందరీ, త్వంచ చా హం చ సర్వం విశ్వం సర్వదేవతేతర త్సర్వం మహా త్రిపురసుందరీ, సత్యమేకం లలితాఽఽఖ్యం వస్తు తదద్వితీయమ్, అఖండార్థం పరంబ్రహ్మ పంచరూపపరిత్యాగా దస్వరూప ప్రహాణతః, అధిష్ఠానం పరం తత్త్వమేకం సచ్ఛిష్యతే మహదితి, ప్రజ్ఞానం బ్రహ్మేతివా అహం బ్రహ్మాస్మీతి వా భాష్యతే, తత్త్వమసీత్యేవ సంభాషత్యే, అయమాత్మా బ్రహ్మేతివా బ్రహ్మైవాహమస్మీతి వా యోహఽమస్మీతి వా సోఽహమస్మీతి వా యోఽ సౌసోఽహమస్మీతివా యాభాష్యతే సైషా షోడశీ శ్రీవిద్యా పంచదశాక్షరీ శ్రీమహాత్రిపుర సుందరీ బాలాంబికేతి బగళేతి మాతంగీతి స్వయంవరకల్యాణీతి**

**భువనేశ్వరీతి చాముండేతి చండేతి వారాహీతి తిరస్కరిణీతి రాజమాతంగీతి వా శుకశ్యామళేతి వా లఘుశ్యామళేతి వా అశ్వారూఢేతి వా ప్రత్యంగిరా ధూమావతీ సావిత్రీ గాయత్రీ సరస్వతీ బ్రహ్మానందకళేతి, ఋచో అక్షరే పరమే వ్యోమన్, యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః యస్తన్న వేద కిమృచా కరిష్యతి య ఇత్తద్విదు స్తఇమే సమాసతే. ఇత్యుపనిషత్.**

ఆవిడే ఆత్మ. ఆవిడకన్న భిన్నమైనదంతా అనాత్మ, అసత్యము. ఆమెయే బ్రహ్మ సంవిత్తి. భావాభావకళావినుర్ముక్త. అద్వితీయమైన పరబ్రహ్మ. సచ్చిదానందలహరి. మహాత్రిపురసుందరి. ఈ జగత్తంతా లోపలా బయటా ప్రవేశించి ప్రకాశిస్తున్నది. సన్మాత్రము, చిన్మాత్రము, ప్రియము, మోదము, ప్రమోదము, ఆనందము అంతా ఆ మహాత్రిపురసుందరియే. నువ్వు, నేను, చరాచర జగత్తు, సర్వదేవతలు అంతా ఆ మహాత్రిపురసుందరియే. లలితాఖ్యమైన వస్తువు ఒక్కటే సత్యము, నిత్యము, శాశ్వతము అయిఉన్నది. ఆ పరతత్త్వము ఒక్కటే మిగిలి ఉంటుంది. అదే మహత్ అని చెప్పబడుతుంది. అహంబ్రహ్మాస్మి, ప్రజ్ఞానంబ్రహ్మ, తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మ, యోహమస్మి, సోహమస్మి, యో సౌ సోహమస్మి అని ఏ దేవత చెప్పబడుతుందో, ఆవిడ షోడశి, శ్రీవిద్య పంచదశాక్షరి, మహాత్రిపురసుందరి, బాలాంబిక, బగళ మాతంగి, స్వయంవరకల్యాణి, భువనేశ్వరి, చాముండ, వారాహి, తిరస్కరిణి, రాజమాతంగి, శుకశ్యామల, లఘుశ్యామల, అశ్వారూఢ, ప్రత్యంగిర, ధూమావతి, సావిత్రి, గాయత్రి, సరస్వతి, బ్రహ్మానందకళ అని చెప్పబడుతున్నది. ఆవిడ యందే సర్వదేవతలు ఉన్నారు. వేదమంత్రాలు ఉన్నాయి. ఆవిడే పరాశక్తి. పరబ్రహ్మ స్వరూపిణి అని చెప్పబడింది. ఆమెను తెలుసుకోటానికే ఈ జిజ్ఞాస.

అధర్వణ వేదంలోని **దేవీఉపనిషత్తు**లో

**సర్వే వై దేవా దేవీ ముపతస్థుః, కాసి త్వం మహాదేవి, సా బ్రవీదహం బ్రహ్మస్వరూపిణీ, మత్తశ్చసంప్రవర్తతే. ప్రకృతి పురుషాత్మకం జగత్, శూన్యఞ్చాశూన్యఞ్చ, అహమానందా నానందౌ, అహం విజ్ఞానా విజ్ఞానే అహం బ్రహ్మ బ్రహ్మిణీ వేదితవ్యే, ఇత్యా హాథర్వశ్రుతిః (1)**

ఒకసారి దేవతలంతా ఆ పరమేశ్వరి దగ్గరకు వెళ్ళి "ఓ దేవీ నీవెవరవు? అని అడిగారు. దానికి ఆ పరమేశ్వరి "ఓ దేవతలారా! నేను బ్రహ్మస్వరూపిణి. నా వల్లనే

ప్రకృతి పురుషాత్మకమైన ఈ జగత్తు ఆవిర్భవించింది. ఈ జగత్తులోని శూన్యము, అశూన్యము నేనే. ఆనందము, అనానందము నేనే. విజ్ఞానము, అవిజ్ఞానము నేనే. బ్రహ్మము నేనే బ్రహ్మము కానిది నేనే.” అంటుంది.

**అహం పఞ్చభూతా న్యపఞ్చభూతాని, అహమఖిలం జగత్, వేదో౨_హ మవేదో౨_హమ్, విద్యాహ మవిద్యాహమ్, అజాహ మనజాహమ్, అధ శ్చోర్ధ్వఞ్చ తిర్యక్చాహమ్ అహగ్ం రుద్రేభి ర్వసుభిశ్చరా మ్యహ మాదిత్యై రుత విశ్వదేవైః అహం మిత్రావరుణా వుభౌ బిభర్మ్యహ మిన్ద్రాగ్నీ అహమశ్వినా వుభౌ, అహగ్ం సోమం త్వష్టారం పూషణం భగం దధామ్యహమ్, విష్ణు మురుక్రమం బ్రహ్మాణ ముత ప్రజాపతిం దధామి, అహం దధామి ద్రవిణగ్ం హవిష్మతే సుప్రావ్యేయే యజమానాయ సున్వతే, అహగ్ం రాష్ట్రీ సఙ్గమనీ వసూనా మహగ్ంసువే పితర మస్య మూర్ధన్, మమ యోని రప్స్వన్త స్సముద్రే యఏవం వేద స దేవీపదమాప్నోతి, తే దేవా అబ్రువన్, నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః, నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాః స్మృతామ్ (2)**

పంచభూతాలు, అపంచభూతాలు నేనే, అఖిల జగత్తును నేనే, వేదము, అవేదము నేనే, విద్యను అవిద్య నేనే. అజను, అనజను నేనే. క్రింది భాగము, పై ప్రదేశము, అడ్డముగా నున్నది నేనే. నేను రుద్రులతోను, వశువులతోను, ఆదిత్యులతోను, విశ్వేదేవతలతోను సంచరిస్తాను. మిత్రావరుణుల నిద్దరిని నేనే భరిస్తాను. ఇంద్రాగ్నులను, అశ్వినీదేవతల నిద్దరిని భరిస్తాను. సోముని, త్వష్టను, పూషను, భృగుని నేనే ధరిస్తాను. విష్ణువును, వామనుని బ్రహ్మను, ప్రజాపతిని ధరిస్తాను. యాగము చేయుటకై హవిష్మంతుడైన ఫలితము కల యజమానునికై ధనాన్ని ధరిస్తాను. నాకు కారణము నేనే. ఈ విషయం తెలిసిన వాడు దేవీపదవి పొందుతాడు అన్నది. అప్పుడు దేవతలు దేవికి నమస్కారము, మహాదేవికి నమస్కారము. శివకు ఎల్లప్పుడును నమస్కారము. ప్రకృతికి, భద్రకు నమస్కారము. ఆమెను నియమము కలవారమై నమస్కరిస్తున్నాము అంటారు. ఆవిడే పరాశక్తి. జగత్తుకు మూలకారణమైన పరబ్రహ్మ, పరాశక్తి. ఆమెను తెలుసుకోటానికే ఈ జిజ్ఞాస.

ఒకసారి దేవదానవ సంగ్రామం మహాభీకరంగా జరిగింది. అందులో దేవతలు విజయం సాధించారు. ఆ విజయం తమవల్లనే సాధించబడిందని, దానికి కారణం తామేనని దేవతలలో ప్రతివారూ గర్వంతో విర్రవీగిపోయారు. దీనికంతటికీ కారణమైన పరబ్రహ్మను మరచిపోయారు. విజయోత్సాహంతో దేవతలంతా సభ తీర్చారు. అందులో ఎవరి ప్రతాపాన్ని వారు చెప్పుకోవటం మొదలుపెట్టారు. ముందుగా అగ్నిదేవుడు తను అగ్నిజ్వాలలు ప్రజ్వలింపచేస్తే, ఆ అగ్ని శిఖలలో రాక్షసులు మాడిపోతూ దిక్కు తోచక పలాయనం చిత్తగించారు. అంటూ తన శక్తి సామర్థ్యాల గురించి గర్వంగా చెప్పాడు. తరువాత వాయువు లేచి తను చండప్రచండంగా గాలులు వీస్తుంటే వాటి తాకిడికి నిలవలేక రాక్షసులు పలాయనం చిత్తగించారు అన్నాడు. ఈ రకంగా దేవలంతా తమ పరాక్రమాన్ని గొప్పగా చెప్పుకుంటున్నారు.

బ్రహ్మతత్త్వం ఇదంతా గమనిస్తోంది. దేవతల అహంకారం పోగొట్టాలని నిర్ణయించుకుంది. అనుకున్నదే తడవుగా వారి ఎదుట భయంకరమైన యక్షరూపంలో ప్రత్యక్షమైంది. చూశారు దేవతలు. అదేమిటో వారికి అర్థం కాలేదు. ఆ రూపాన్ని చూసి భయపడ్డారు. ఏం చెయ్యాలో పాలుపోలేదు. ఆ రూపం ఏమిటో వారికి తెలియలేదు. దాన్ని గురించి తెలుసుకోవాలనుకున్నారు.

దేవాసుర సంగ్రామంలో రాక్షసులను భయంకరమైన అగ్ని కీలలతో కాల్చివేశానని చెప్పినవాడు అగ్నిదేవుడు. అందుకని దేవతలందరూ అగ్నిదేవుని సమీపించి "ఓ అగ్నిదేవా! ఏదో భయంకరమైన తత్త్వం ఇక్కడ ప్రత్యక్షమైంది. అదేమిటో మాబుద్ధికి అర్థం కావటం లేదు. కాబట్టి నీవు వెళ్ళి దాన్నిగురించి తెలుసుకుని రావలసినది" అన్నారు.

'సరే' అని బయలుదేరాడు అగ్నిదేవుడు. ఆ తత్త్వాన్ని సమీపించాడు. భూతంలాటి ఆ తత్త్వం అగ్నిదేవుని చూసి అడిగింది "ఎవరు నువ్వు"?

"నేను అగ్నిదేవుడను. లోకంలో అందరూ నన్ను 'జాతవేదుడు' అంటారు'

"అయితే నీ శక్తి సామార్థ్యాలేమిటి?"

"లోకంలోని ఏ వస్తువునైనా సరే క్షణంలో కాల్చి బూడిద చేస్తాను".

‘అంత గొప్పవాడివా’? అయితే ఈ గడ్డిపోచను దగ్ధం చెయ్యి’ అంటూ ఒక గడ్డి పరకను అక్కడ ఉంచింది ఆ తత్త్వం.

ఆ గడ్డిపరకను చూచి చాలా తేలిక భావంతో మంటలు సృష్టించాడు అగ్నిదేవుడు. గడ్డిపరక కాలలేదు. భయంకరమైన అగ్నిశిఖలు సృష్టించాడు. లాభం లేకపోయింది. గడ్డిపోచ అలానే ఉంది. అగ్నిదేవుడు వెనుక్కు తిరిగి దేవతల వద్దకు వెళ్ళి “ఆ తత్త్వం ఏమిటో నాకూ పాలుపోలేదు. దాన్ని అర్థం చేసుకోవటానికి నా శక్తి చాలలేదు” అన్నాడు.

అప్పుడు దేవతలంతా వాయుదేవుని సమీపించి “దేవా! నీవు చాలా గొప్పవాడివి కదా! ఆ తత్త్వం ఏమిటో నువ్వైనా కనుక్కో” అన్నారు.

‘సరే’ అని బయలుదేరాడు వాయువు, ఆ తత్త్వాన్ని సమీపించాడు. పూర్వంలో లాగానే ఆ తత్త్వం ప్రశ్నించింది.

“ఎవరు నువ్వు?”

‘నేను వాయుదేవుడను. ఆకాశంలో సంచరిస్తుంటాను. కాబట్టి నన్ను ‘మాతరిశ్వుడు’ అని కూడా అంటారు.’

“నీ శక్తి ఏమిటి?”

“లోకంలో ఏ వస్తువునైనా సరే నా గాలులతో ఎగురగొట్టగలను.”

“అయితే దీన్ని ఎగరగొట్టు” అంటూ ఇదివరకటి లాగానే గడ్డిపోచను అక్కడ ఉంచింది ఆ తత్త్వం. వాయుదేవుడు తన బలాన్ని కూడగట్టుకుని ముందుకు వెళ్ళాడు. భయంకరమైన గాలులు వీచాడు. గడ్డిపోచ కదలలేదు. వచ్చిన దారినే వెనక్కు వెళ్ళి దేవతలతో “ఆ తత్త్వం ఏమిటో నాకు అర్థం కాలేదు” అన్నాడు.

అప్పుడు దేవతలందరూ తమ ప్రభువైన ఇంద్రుని దగ్గరకు వెళ్ళి అతనికి జరిగిన సంగతంతా వివరించి “దేవేంద్రా! ఆ విచిత్రమైన తత్త్వం ఏమిటో నువ్వైనా కనుక్కోవలసినది” అన్నారు.

**స తస్మిన్నే వాకాశేస్త్రి యమాజగామ బహుశోభమానాం ఉమాం**

**హైమవతీం తాం హోవాచ కిమే తద్ యక్షమితి ॥**

'సరే' అంటూ తన వజ్రాయుధం తీసుకుని ఆ తత్త్వం దగ్గరకు వెళ్లాడు దేవేంద్రుడు. వెంటనే ఆ శక్తి మాయమై పోయింది. దాని స్థానంలో మహాసౌందర్యరాశి యైన ఒక స్త్రీమూర్తి కనిపించింది. ఆమె హిమవంతుని కుమార్తె హైమవతి. ఆమెను ఉమాదేవి అనికూడా అంటారు.

ఆశ్చర్యంగా చూసిన ఇంద్రుడు ఉమాదేవిని ప్రశ్నించాడు "అమ్మా! దేవతల నందరినీ భయభ్రాంతులతో ముంచివేసిన ఆయక్షుడెవరు? ఆ తత్త్వము ఏమిటి"?

"ఆశక్తియే బ్రహ్మము" అని ఉమాదేవి సమాధానమిచ్చింది. ఆ తరువాత ఇంద్రునితో "ఓ దేవేంద్రా! బ్రహ్మము వల్లనే కదా మీరు విజయం పొందింది. మీ గొప్పదనానికి కారణము బ్రహ్మము. మీ అల్పబుద్ధివల్ల ఇప్పటివరకు కనుపించిన తత్త్వమే బ్రహ్మమని గుర్తించలేక పోయారు. ఆ బ్రహ్మతత్త్వమే మీ శరీరంలో శక్తిని వ్యాపింప చేస్తోంది. దానివల్లనే మీరంతా అసురులను సంహరించగలిగారు. దానివల్లనే ఈ మహాత్మ్యము మీరు పొందగలిగారు. అంతేగాని అదంతా మీగొప్పదనం అని అహంకరించకండి" అని చెప్పి అదృశ్యమై పోయింది.

ఇక్కడ చూడండి. ముందు కనిపించింది పరబ్రహ్మతత్త్వము. అది నిరాకారము. తరువాత కనిపించింది ఉమాదేవి. అంటే పరబ్రహ్మ నిరాకారము. అది గనక ఒక ఆకారం పొందితే పరాశక్తి. ఆవిడే శ్రీవిద్యాస్వరూపిణి. పరాశక్తి అయిన లలితాంబిక. ఆమెను తెలుసుకోవాలనే ఈ జిజ్ఞాస.

**ఆమెను సగుణ రూపంగా అంటే లలితా పరమేశ్వరి, రాజరాజేశ్వరిగా ఆరాధిస్తే మహదైశ్వర్యము సిద్ధిస్తుంది నిరాకారంగా ధ్యానిస్తే సాయుజ్యం సిద్ధిస్తుంది.**

**శ్రీసుందరీ సేవన తత్పరాణాం । భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ ।**

ఆమెను సగుణ రూపంగా ఆరాధించే వారికి మహదైశ్వర్యము లభిస్తుంది. అంటే జీవించి ఉండగా సుఖశాంతులు, సిరిసంపదలు, భోగభాగ్యాలు అన్నీ లభిస్తాయి. మరణానంతరము మణిద్వీపం చేరి సాధకుడు అక్కడ ఉన్న భోగాలన్నీ అనుభవించి కర్మశేషం అనుభవించటానికి ఈ లోకంలో ఉత్తమ యోనులందు జన్మిస్తాడు. ఆమెను నిరాకారగా ఉపాసించిన వారికి పునర్జన్మఉండదు. ఆమెయే పరమేశ్వరి. పరాశక్తి మోక్షాన్నిచ్చే దేవత. ఆమెను గురించి తెలుసుకోటానికే ఈ ప్రయత్నం అదే బ్రహ్మజిజ్ఞాస.

# కుండలినీశక్తి

ఆధారచక్రంలో స్వయంభూలింగానికి మూడున్నర చుట్లు చుట్టుకుని, అధోముఖంగా నిద్రావస్థలో ఉంటుంది కుండలినీ శక్తి. ఆ శక్తియే సాక్షాత్తూ పరమేశ్వరి స్వరూపము.

**ధ్యాయేత్ కుండలినీం దేవీం ఇష్టదేవస్వరూపిణీం ।**
**సదా షోడశవర్షీయాం పీనోన్నతపయోధరామ్ ॥**

**నవయౌవన సంపన్నాం సర్వాభరణ భూషితాం ।**
**పూర్ణచంద్ర ప్రభాం రక్తాం సదా చంచలలోచనామ్ ॥**

కంకాళమాలినీ తంత్రంలో ఈ కుండలినీ శక్తి పరబ్రహ్మ స్వరూపము అని చెప్పబడింది.

**కోటిచంద్ర ప్రతీకాశం పరబ్రహ్మ స్వరూపిణీం ।**
**చతుర్భుజాం త్రినేత్రాం చ వరదాభయ కరాంతథా ॥**

**తథా పుస్తకవీణాం చ ధారిణీం సింహవాహినీం ।**
**గచ్ఛంతీం స్వాపనాం భీమాం నానారూప ధరాత్మికాం ॥**

రుద్రయామళంలో ఎనిమిది శ్లోకాలతో కుండలినీ స్తవంకూడా ఉన్నది.

**ధ్యాయేత్ కుండలినీం దేవీం స్వయంభూలింగవేష్టితాం**
**శ్యామాం సూక్ష్మాం సృష్టిరూపాం సృష్టి స్థితి లయాత్మికాం**
**విశ్వాతీతాం జ్ఞానరూపాం చింతయే దూర్ధ్వవాహినీమ్ ॥**

మూలాధార చక్రంలో స్వయంభూలింగానికి మూడున్నర చుట్లు చుట్టుకుని అధోముఖంగా సర్పాకారంలో, సదానిద్రావస్థలో ఉంటుంది కుండలినీ శక్తి. నల్లని రూపంలో ఉంటుంది. సృష్టి స్థితి లయాలకు కారణభూతమైనది, విశ్వాతీతమైనది, జ్ఞానరూపమైనది అయిన ఆ కుండలినీశక్తికి నమస్కరిస్తున్నాను.

ఆధారచక్రంలో స్వయంభూలింగానికి మూడున్నర చుట్లుగా చుట్టుకుని, అధోముఖంగా నిద్రావస్థలో సర్పాకారంలో ఉన్న కుండలినీ శక్తిని గనుక జాగృతం

చేసినట్లైతే, అది గ్రంథిత్రయాన్ని భేదించుకుని సహస్రదళపద్మం చేరి శివునితో కలిసి సుఖిస్తుంది. జీవాత్మ పరమాత్మల ఏకీకరణం చెందినప్పుడు సహస్రదళ పద్మం నుంచి అమృతపు బిందువులు జాలువారి యోగిశరీరంలోని 72000 నాడీమండలము తడుస్తుంది. అప్పుడు ఆ యోగి పొందే ఆనందం అనిర్వచనీయము, అనుభవైకవేద్యము. **వామకేశ్వరతంత్రంలో**

**భుజంగాకారరూపేణ మూలాధారం సమాశ్రితా ।**
**శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాఽశుభా ॥ 1**

**మూలకందం ఫణాగ్రేణ దష్ట్వా కమలకందవత్ ।**
**ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమాశ్రితా ॥ 2**

**వజ్రాసనగతో స్వస్థో గుద మాకుంచ్య సాధకః ।**
**వాయుమూర్ధ్వగతిం కుర్వన్ కుంభకావిష్టమానసః ॥ 3**

**వాయ్వాఘాతవశా దగ్నిః స్వాధిష్ఠానగతో జ్వలన్ ।**
**జ్వలనాఘాత పవనాఘాతై రున్నిద్రితో విరాట్ ॥ 4**

**రుద్రగ్రంథిం తతో భిత్త్వా విష్ణుగ్రంథిం భిన త్త్యతః ।**
**బ్రహ్మగ్రంథిం చ భిత్త్వైవ కమలాని భినత్తి షట్ ॥ 5**

**సహస్రకమలే శక్తిః శివేన సహ మోదతే**
**సా చావస్థా పరా జ్ఞేయా సైవ నిర్వృతి కారణమ్ ॥ 6**

1. భుజంగాకారము ధరించి తామరతూడులోని దారమువలె సన్నగా మెరుపు తీగలాగా ప్రకాశిస్తూ ఆ కుండలినీ శక్తి మూలాధారాన్ని ఆశ్రయించి ఉన్నది.

2. ఆ శక్తి ఆధారచక్రము యొక్క మూలకందమును తామరదుద్దువలె నోటితో కరచిపట్టుకుని బ్రహ్మరంధ్రాన్ని ఆశ్రయించి ఉన్నది.

3. సాధకుడు వజ్రాసనంలో కూర్చుని, శ్వాసను పైకివదులుతూ కుంభకము చెయ్యాలి. అంటే గాలిని లోపలికి పీల్చి అట్టిపెట్టాలి.

4. ఆ వాయువు యొక్క తాకిడికి స్వాధిష్టానంలో ఉన్న అగ్నిప్రజ్వరిల్లి కుండలినీ శక్తి మేల్కొంటుంది.

5,6. ఆ తరువాత ఆ శక్తి గ్రంధిత్రయాన్ని భేదించుకుని సహస్రారము చేరి సదాశివునితో సుఖిస్తుంది. అట్టి స్థితిలో ఉన్న ఆమెయే పరాశక్తి. నిత్యసుఖకారిణి.

గ్రంధిత్రయాన్ని భేదించిన తరువాత ఆ కుండలినీ శక్తి కోట్లకొలది సూర్యచంద్రుల కాంతులతో సహస్రారం చేరుతుంది. అప్పుడు తన యొక్క నోటితో అధోముఖంగా ఉన్న సహస్రదళపద్మాన్ని కరచిపట్టుకుంటుంది. సహస్రదళపద్మము చంద్రమండలము ఎప్పుడైతే కుండలినీ శక్తి తననోటితో ఆ పద్మాన్ని కరచిపట్టుకున్నదో, అప్పుడు అక్కడ ఉన్నటువంటి అమృతము, ఆ రంధ్రాల ద్వారా క్రిందికి జాలువారి సాధకుని యొక్క శరీరంలోని 72000 నాడీమండలాన్నీ తడుపుతుంది. అప్పుడు సాధకుడు అవ్యాజమైన, అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందుతాడు.

గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలో కుండలినీశక్తికి మూడు అవస్థలున్నాయన్నారు. అవి 1. నిద్రావస్థ, 2. ప్రయాణావస్థ 3. సుఖావస్థ వీటినే 1. కౌమారావస్థ 2. యోషిదావస్థ 3. పతివ్రతావస్థ అని కూడా అంటారు.

**తత్రా స్తే పరమేశానీ మహాత్రిపురసుందరీ ।**
**శివార్కమండలం భిత్వా ద్రావయం తీందుమండలమ్ ॥**
**తదుద్భూతా మృతస్యంది పరమానందనందితా ।**
**కులయోషి త్కులం త్యక్త్వా పరం వర్షణ మే త్యసౌ ॥**

షట్చక్రాలను దాటి చంద్రమండలం చేరి అక్కడ నుండి అమృతాన్ని స్రవింపచేసి శరీరంలోని 72000 నాడీమండలాన్నీ తడుపుతుంది. ఆ తరువాత మళ్ళీ స్వాధిష్ఠానానికి వచ్చి నిద్రిస్తుంది.

కుండలినీ శక్తికి మూడు దశలున్నాయని చెప్పాము అవి 1. కౌమారావస్థ 2. యోషిదవస్థ 3. పతివ్రతావస్థ గౌడపాదులవారు తమ శ్లోకంలో 'కుమారీ యన్మంద్రం' అన్నారు. ఇక్కడ కుమారి అంటే భూతత్త్వము. మూలాధారము. కుండలిని మంద్రస్వరంతో శబ్దం చేస్తుంది. ఆధారచక్రంలో కుమారిగా ఉంటుంది. ఆ తరువాత అక్కడ నుంచి ప్రయాణమై అనాహతం దాటేసరికి రెండవ అవస్థ అయిన 'తరుణీ' అవుతుంది. అక్కడ నుండి రుద్రగ్రంథిని దాటి సహస్రారంలో తన పతి అయి

పరమేశ్వరునితో కలసి సుఖిస్తుంది. అది మూడవ అవస్థ. అదే పతివ్రతావస్థ. భర్తతో కలసి సుఖించటమనేది కులస్త్రీ లక్షణము. అదే పాతివ్రత్యము. అందుకే దాన్ని పతివ్రతావస్థ అన్నారు.

సాధకుడు ఉఛ్వాసనిశ్వాసలను బంధించేసరికి స్వాధిష్ఠానచక్రంలో అగ్ని రగుల్కొంటుంది. దానికే స్వాధిష్ఠానాగ్ని అని పేరు. సహస్రదళ పద్మము చంద్రమండలము. అక్కడ చంద్రుని చల్లదనంవల్ల అమృతము ఘనీభవించి ఉంటుంది. స్వాధిష్ఠానంలో అగ్ని ప్రజ్వరిల్లినప్పుడు ఆ వేడికి చంద్రమండలంలో ఘనీభవించిన అమృతం ద్రవరూపం దాలుస్తుంది. ఎప్పుడైతే కుండలినీ శక్తి తననోటితో సహస్రదళ పద్మాన్ని కొరికిందో, అప్పుడు దానికి పంటిగాట్లు పడతాయి. ఆ రంధ్రాలద్వారా అక్కడ ద్రవీభవించిన అమృతం క్రిందికి జాలువారి సాధకుని శరీరంలోని 72000 నాడీమండలము తడుస్తుంది.

సనత్కుమార సంహితలో పృశ్నులు అనే మునులు ఈ విధంగా మాట్లాడు కుంటున్నారు. **ఓ శ్రీవిద్యోపాసకులారా! లేవండి. ఆలస్యం చెయ్యకండి. స్వాధిష్ఠానము యొక్క కర్ణికలో అగ్నిని ప్రజ్వలింపచెయ్యండి. సూర్యుని సాయముతో సహస్రారమందలి చంద్రమండలమును ద్రవింపచేసి అమృతాన్ని పొందండి.**

శుక్రసంహిత కూడా ఇదే విషయాన్ని చెబుతున్నది. అగ్నియొక్క వేడిచేత సూర్యుని వెలుగుతో, చంద్రుని ప్రకాశముతో రహస్యముగ సంచరించు కుండలిని అమృతధారలను పిదుకుచు 72000 విధములుగా ప్రవహింపచేయుచు మనలను తృప్తిపరచుచున్నది.

కుండలినీశక్తి మూలాధారంలో కుమారివలె పుట్టిన పసిపిల్లల ఏడుపులాగా బుసకొడుతూ, స్వాధిష్ఠానానికి పోయి అక్కడ ఉండే అగ్నికి ఆ బాలిక యవ్వనవతియై, అక్కడి నుండి సహస్రారము చేరి పరమేశ్వరునితో కలసి అక్కడి నుండి అమృతధారలు కురిపించి శరీరంలోని 72000 నాడీమండలాన్ని తడుపుతుంది. లలితాసహస్రంలో 'కులామృతైకరసికా' అనే 90వ నామం దగ్గరనుంచి 'బిసతంతు తనీయసీ' అనే 111వ నామం వరకు ఈ విషయాన్ని ప్రతిపాదించటం జరిగింది. ఉపనిషత్తులు మంత్రశాస్త్రము, ఆగమాలు, యోగశాస్త్రము అన్నీ ఈ విషయాన్ని ఒప్పుకుంటున్నాయి.

కుండలినీశక్తి జీవాత్మ. ఇది గనక పరమాత్మను చేరగలిగితే అనిర్వచనీయమైన ఆనందం కలుగుతుంది. అదే బ్రహ్మానందము. అటువంటి బ్రహ్మానందాన్నిచ్చే దేవత పరమేశ్వరి ఆవిడే పరబ్రహ్మ లలితాత్రిపురసుందరి. ఆవిడను తెలుసుకోవటానికే ఈ జిజ్ఞాస. అదే బ్రహ్మజిజ్ఞాస. సగుణోపాసన చేసిన వారికి సిద్ధించే మహదైశ్వర్యమే బ్రహ్మానందము.

**దేవీ భాగవతం**లోని సప్తమస్కందములోని ముప్పైఒకటవ అధ్యాయంలో తారకాసురుడి బాధలు పడలేక దేవతలందరూ విష్ణుమూర్తిని శరణు వేడతారు. ఆ తరువాత విష్ణుమూర్తి దేవతలందరినీ వెంట పెట్టుకుని హిమాలయ పర్వతాలకు వెళ్ళి, అక్కడ ఆ పరమేశ్వరిని పరిపరివిధాల ప్రార్థిస్తాడు. ఆ సమయంలో చైత్ర శుద్ధ నవమి శుక్రవారం నాడు ఆ పరంజ్యోతి, ఆ పరాత్పరి దేవతలకు ప్రత్యక్షమవుతుంది. ఆ సమయంలో ఆమె ఎలా ఉన్నది అంటే –

**చతుర్దిక్షు చతుర్వేదైర్మూర్తిమద్భి రభిష్టుతమ్ ।**
**కోటి సూర్య ప్రతీకాశం చంద్రకోటి సుశీతలమ్ ॥**

**విద్యుత్కోటి సమానాభ మరుణం తత్పరం మహః ।**
**నైవ చోర్ధ్వం న తిర్యక్చ న మధ్యే పరిజగ్రభత్ ॥**

**ఆద్యంతరహితం తత్తు న హస్తాద్యంగసంయుతమ్ ।**
**న చ స్త్రీ రూప మథవా న పుంరూప మథోభయమ్ ॥**

**దీప్త్యా పిధానం నేత్రాణాం తేషా మాసీన్మహీ పతే ।**
**పునశ్చ ధైర్య మాలంబ్య యావత్తే దదృశుః సురాః ॥**

ఆ పరమేశ్వరి తేజస్సును నాలుగు వేదాలు రూపాలు ధరించి స్తుతి చేస్తున్నాయి. ఆ తేజస్సు అనేకకోట్ల సూర్యులకాంతితో, అనేకకోట్ల చంద్రుల చల్లదనం కలిగి ఉన్నది. కొన్ని కోట్ల మెరుపుతీగెలు ఒక్కసారి వచ్చినట్లుగా తళుక్కున మెరిసింది. అరుణారుణ కాంతులు వెదజల్లుతున్నది. దానికి పైన, క్రింద, నడుమ, అడ్డము అనే తేడాలు లేకుండా కాంతులు ప్రసరిస్తోంది. దానికి ఆద్యంతాలు లేవు. స్త్రీ పురుష నపుంసక భేదాలు లేవు. ఆ తేజస్సును చూడలేక దేవతలు కళ్ళు

మూసుకున్నారు. అమ్మా నీ దివ్య తేజస్సును చూడలేక పోతున్నాము. ఈ రూపాన్ని ఉపసంహరించి మాకు తెలిసిన రూపంలో కనిపించవలసినది అని ప్రార్థించారు.

తావత్తదేవ స్త్రీరూపేణా భాద్దివ్యం మనోహరమ్ ।
అతీవ రణీయాంగీం కుమారీం నవయౌవనామ్ ॥

ఉద్యత్పీనకుచద్వంద్వ నిందితాంభోజ కుట్మలమ్ ।
రణత్కింకిణికాజాల శింజన్మంజీర మేఖలామ్ ॥

కనకాంగదకేయూరగ్రైవేయక విభూషితామ్ ।
అనర్ఘ్యమణి సంభిన్నగలబంధ విరాజితామ్ ॥

తను కేతక సంరాజ న్నీలభ్రమర కుంతలామ్ ।
నితంబబింబ సుభగాం రోమరాజి విరాజితామ్ ॥

కర్పూరశకలోన్మిశ్ర తాంబూలపూరి తాననామ్ ।
కనత్కనకతాటంక విటంకవదనాంబుజామ్ ॥

అష్టమీ చంద్రబింబాభ లలాటా మాయతభ్రువమ్ ।
రక్తారవిందనయనా మున్నసాం మధురాధరామ్ ॥

కుందకుట్మల దంతాగ్రాం ముక్తా హారవిరాజితామ్ ।
రత్న సంభిన్నముకుటామింద్ర రేఖావతంసినీమ్ ॥

మల్లికామాలతీమాలా కేశపాశవిరాజితామ్ ।
కాశ్మీరబిందునిటలాం నేత్రత్రయ విలాసినీమ్ ॥

పాశాంకుశవరాభీతి చతుర్బాహుం త్రిలోచనామ్ ।
రక్తవస్త్రపరీధానాం దాడిమీకుసుమ ప్రభామ్ ॥

సర్వశృంగారవేషాఢ్యాం సర్వదేవ నమస్కృతామ్ ।
సర్వాశాపూరికాం సర్వమాతరం సర్వమోహినీమ్ ॥

ప్రసాదసుముఖీ మంబాం మందస్మిత ముఖాంబుజామ్ ।
అవ్యాజకరుణామూర్తిం దదృశుః పురతః సురా ॥
దృష్ట్వాతాం కరుణా మూర్తిం ప్రణేముః సకలాః సురాః ।
వక్తుం నా శక్నువ న్కించి ద్బాష్ప సంరుద్ధ నిఃస్వనాః ॥

అంతలో ఆ దివ్యమైన తేజోరాసి ఒక స్త్రీ రూపం దాల్చింది. ఆమె రమణీయమైన అంగములు కలది. కుమారి. నవయవ్వనంతో అలరారుతున్నది. కిణకిణ అనుకింకణుల మంజులరావం చేసే మంజీరాలు ధరించింది. బంగారు కేయూరాలు, గ్రైవేయాలతో అలరారుతున్నది. మెడలో మేలైన జాతిరత్నాలు కూర్చిన హారాలు ధరించింది. తలలో ధరించిన సంపెంగ మొదలైన పూలవాసనకు గండు తుమ్మెదలు ఝుంకారం చేస్తున్నాయి. కర్పూర వీడియము నములుతున్నది. అష్టమినాటి చంద్రుని వంటి ముఖము గలది. వెడల్పైన కనుబొమలు, ఎర్రకమలముల వంటి కళ్ళు, ఎత్తైన నాసిక, మధురాధరములు గలది. ఆమెదంతాల చివరలు మల్లెమొగ్గల లాగా ఉన్నాయి. మంచి ముత్యాల హారాలు, వజ్రాలు పొదిగిన కిరీటము ధరించింది. కేశపాశాలన్నీ మల్లిక, మాలతి కుసుమాల హారాలతో, సువాసనలతో గుబాళిస్తున్నాయి. ముఖాన కస్తూరి తిలకము ధరించింది. ఎర్రని వస్త్రాలు ధరించి దానిమ్మ పూలవలె ఎర్రని కాంతులు విరజిమ్ముతున్నది. చేతులయందు పాశము అంకుశము, అభయ, వరదముద్రలు ధరించి జగన్మోహనాకార రూపంతో ఆ పరమేశ్వరి ప్రకాశిస్తున్నది. **పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణుడు. చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. కాని ఒక రూపం ధరిస్తే స్త్రీమూర్తి అదే పరమేశ్వరి లలితా త్రిపురసుందరి.** నిరాకారం పరాశక్తి. సాకారం త్రిపురసుందరి ఆమెను తెలుసుకోటానికే ఈ జిజ్ఞాస.

పరమేశ్వరి స్థూలరూపం ఎలా ఉంటుంది అనేది లలితాసహస్రంలో 6 నుంచి 54 వరకు **ఉద్యద్భాను సహస్రాభా** నుంచి **స్వాధీనవల్లభా** వరకు. అలాగే 560 **తాంబూల పూరిత ముఖీ** నుంచి 570 **నిఖిలేశ్వరీ** వరకు గల నామాలలో వివరించబడింది.

ఇక్కడ **'పరమేశ్వరి'** కేవలం శక్తిస్వరూపం కాదు. శివునితో కలిసిన శక్తి త్రిపురసుందరి, త్రిపురసుందరుడు **శివశక్త్యైక్యరూపిణి** అంటే ఇది శాక్తేయం కాదు. శ్రీవిద్యాసంప్రదాయం. ఆమెను తెలుసుకోటానికే ఈ జిజ్ఞాస. లలితాసహస్రంలో

## 998. శ్రీశివా

**శ్రీయుక్తా శివా శ్రీశివా**

శ్రీతో అనగా శోభతో కూడినది. శివశక్తులకు భేదంలేదు. వారిద్దరూ ఒకటే. అందు చేతనే పరమేశ్వరి శివా అనబడుతోంది. శివునియొక్క శక్తి కాబట్టి శివా.

## 999. శివశక్త్యైక్యరూపిణీ

శివశక్తుల సామరస్యము గలది. శివతత్త్వముతో ఏకత్వము పొందినది. బ్రహ్మకన్న బ్రహ్మశక్తి వేరు కాదు. శక్తికీ శక్తిగల వానికి భేదము లేదు. ఇక్కడ శక్తిగలవాడు శివుడు. అందుకే పరమేశ్వరి శివశక్త్యైక్యరూపిణీ అనబడుతోంది.

ఇక్కడ శివశక్తులు అంటే త్రిపుర సుందరి, త్రిపుర సుందరుడు. శ్రీచక్రంలో బిందువునందు ఉండేది వీరే. ఇది సగుణారాధన.

పరమేశ్వరునితో ఐక్యముగల రూపము గలది. భైరవ యామళంలో

**చతుర్భి శ్శివచక్రై శ్చ శక్తిచక్రై శ్చ పంచభిః**
**శివశక్త్యాత్మకం జ్ఞేయం శ్రీచక్రం శివయో ర్వపుః**

నాలుగు శివచక్రములతోను, ఐదు శక్తి చక్రములతోను శ్రీచక్రము శివశక్తుల స్వరూపంగా విరాజిల్లుతున్నది. వీటిలో

**త్రికోణమష్టకోణం చ దశకోణద్వయంతథా**
**చతుర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచభిః**

| | |
|---|---|
| 1. త్రికోణము | 3. దశారద్వయము |
| 2. అష్టకోణము | 4. చతుర్దశారము |

ఈ ఐదు శక్తి చక్రాలు

**బిందుశ్చాష్టదళం పద్మం పద్మ షోడశ పత్రకం**
**చతురస్రంచ చత్వారి శివచక్రా ణ్యనుక్రమాత్**

1. బిందువు
2. అష్టదళము
3. షోడశ దళము
4. భూపురము

ఈ నాలుగు శివచక్రాలు

అయితే పరమేశ్వరి శివశక్త్యైక్యరూపిణి. అంటే శివశక్తులు కలిసే ఉంటారు. విడివిడిగా ఉండరు. ఇక్కడ శక్తి లలితా త్రిపుర సుందరి. శివుడు త్రిపుర సుందరుడు. అందుకే శ్రీచక్రంలోకూడా శివచక్రాలకు శక్తి చక్రాలకు అవినాభావ సంబంధమున్నది. అది ఎలా అంటే

**త్రికోణే బైందవంశ్లిష్టం అష్టారేష్టదళాంబుజమ్**
**దశారయే షోడశారం భూగృహం భువనాశ్రకే**

| | | |
|---|---|---|
| త్రికోణంలో | – | బిందువున్నది |
| అష్టకోణంలో | – | అష్టదళ పద్మమున్నది |
| దశారయుగ్మంలో | – | షోడశదళమున్నది |
| చతుర్దశారంలో | – | భూపురమున్నది |

**శైవానామపి శాక్తానాం చక్రాణాంచ పరస్పరమ్**
**అవినాభావ సంబంధం యో జానాతి స చక్రవిత్**

ఈ రకంగా శివ శక్తి చక్రాలయొక్క అవినాభావ సంబంధము నెరిగినవాడే చక్రవిదుడు. అతడే చక్రసంకేతము నెరిగినవాడు.

**న తేషాం సిద్ధిదా విద్యా కల్పకోటిశతై రపి**

ఈ విషయం తెలియకుండా ఎన్ని కోట్ల సంవత్సరాలు జపం చేసినప్పటికీ మంత్రం సిద్ధించదు.

ఈ రకంగా శివశక్తులు కలిసే ఉంటారు. అదే అర్ధనారీశ్వరతత్త్వము. ప్రతి అణువు లోను వారిద్దరూ కలిసే ఉన్నారు. అందుకే పరమేశ్వరి శివశక్త్యైక్యరూపిణీ అనబడుతోంది.

శివశక్తులు ఒకటిగా ఉన్నారు కాబట్టి ఈ సమైక్యతత్త్వానికి జగత్కారణత్వము కలుగుతున్నది. వీరిద్దరూ కలిసే ఉన్నారు కాని ఒకే బొమ్మను చూసి కొందరు ఎద్దు అని కొందరు ఏనుగు అని అనుకుంటున్నారు. అలాగే ఒకే బ్రహ్మను చూసి కొందరు శివుడని కొందరు శక్తి అని అనుకుంటున్నారు. కాబట్టి చైతన్యశక్తియుతమైన పరబ్రహ్మమే శివశక్త్యైక్యరూపిణి అనబడుతోంది.

హకార సంజ్ఞగల పరమేశ్వరుడు సకార సంజ్ఞగల ప్రకృతితో కలిసి శబళ బ్రహ్మమైనాడు. ఇదే హంస మంత్రము. హంసస్వరూపిణి. ముఖ్యప్రాణస్వరూపిణి. ఆ పరమేశ్వరి శివశక్త్యైక్యరూపిణి. ఆమె ఐదు శక్తులుగా మారుతుంది.

1. ధూమవతీ శక్తి – పృథివీ శక్తి
2. హ్లాదశక్తి – జలశక్తి
3. భాస్వచ్ఛక్తి – అగ్నిశక్తి
4. స్పందన శక్తి – వాయుశక్తి
5. వైభవ శక్తి – ఆకాశశక్తి

వీటి సమిష్టిరూపము పరమేశ్వరి. ఆవిడే **లలితాంబికా** అనబడుతుంది. **ఇది శ్రీవిద్యా సంప్రదాయం.** ఆవిడే పరాశక్తి.

**దేవీ భాగవతంలో** ఒక కథ ఉంది.

కృతయుగానికి ముందు, సృష్టి ఆరంభానికి పూర్వం జగత్తు అంతా జలమయంగా ఉండేది. ఆ జలరాశి మధ్యన వటపత్రశాయి శయనించి యోగనిద్రలో ఉన్నాడు. ఆయన నాభికమలం నుంచి పుట్టిన పద్మనుంచి బ్రహ్మదేవుడు ఉద్భవించాడు.

ఈ రకంగా ఉద్భవించిన బ్రహ్మ ఒక్కసారి నాలుగువైపులా చూశాడు. అంతా నీటిమయం అప్పుడు అతడికి అనుమానం వచ్చింది. తనను పుట్టించిన వారెవరు. నీరు నిలిచేది నేలమీద కదా! మరి ఆ నేల ఎక్కడ ఉన్నది? ఈ ప్రశ్నలకు సమాధానం దొరుకుతుందేమోనని తాను పుట్టిన తామరపువ్వు వదలి వేయిసంవత్సరాలు నీరు అంతా కలియ దిరిగాడు. అప్పుడు తప తప (తపస్సు చెయ్యి) అనే వాక్కు వినిపించిందంతడికి. దాని ప్రకారం తాను పుట్టిన పద్మంలోనే కూచుని వేయేళ్ళు

తపస్సు చేశాడు. తరువాత సృజ (సృష్టించు) అనే మాట వినిపించింది. ఏమిటి సృష్టించటం? అంతా నీరే. ఇంకేమీ కనబడటం లేదు. మరి ఎలా సృష్టించటం? ఈ రకంగా ఆలోచిస్తున్న సమయంలో మధుకైటభులు అనే ఇద్దరు రాక్షసులు వచ్చి మాతో యుద్ధం చేస్తావా? లేక ఛస్తావా? అని భయపెట్టసాగారు. దిక్కు తోచని బ్రహ్మదేవుడు చప్పున తామరకాడలోకి దిగి లోపలికి పోయాడు. అక్కడ పీతాంబరుడు, నీలమేఘశ్యాముడు, పుండరీకాక్షుడు అయిన పురుషోత్తముడు నాలుగు చేతులయందు శంఖుచక్రగదా పద్మములు ధరించి యోగనిద్రలో ఉన్నాడు. చేసేది లేక బ్రహ్మదేవుడు అప్పుడు యోగమాయను ప్రార్థించాడు. ఆమె వెంటనే ఆమె విష్ణువును విడిచి పెట్టింది. విష్ణువు మధుకైటభులను సంహరించాడు ఆ సమయంలో రుద్రుడు కూడా అక్కడికి వచ్చాడు. త్రిమూర్తులు ముగ్గురూ కలిసి ఆ దేవిని ప్రార్థించారు. ఆమె వారిని కనికరించి త్రిమూర్తులారా ! మీరు వెళ్ళి మీ స్థావరాలు ఏర్పరచుకుని నాలుగు విధాలుగా సృష్టి కార్యక్రమం ఆరంభించండి అన్నది. అందుకు వారు 'మాతా! ఎటు చూసినా జలమయం, ఎక్కడా భూమి అనేది లేదు. మరి భూమి లేకుండా భూతములు, గణములు, తన్మాత్రలు, ఇంద్రియాలు అనే ఉపకరణాలు లేకుండా సృష్టి చేయటమెలా సాధ్యం? అన్నారు.

ఇంతలో ఆకాశం నుండి దివ్యమైన విమానం ఒకటి వచ్చింది. ఆ విమానం అంతా నవరత్నమయం. ముత్యాలదండలు వేలాడుతున్నాయి. ఒక దివ్యకాంత దానిలో ముందు భాగాన కూర్చుని ఉంది. పరమేశ్వరి ఆజ్ఞపై త్రిమూర్తులు ఆ విమానాన్ని అధిరోహించారు. వాయువేగ మనోవేగాలతో ఆ విమానం బయలుదేరింది నీరులేని చోటికి చేరింది. అక్కడ ఒక మహానగరం. అందమైన పుష్ప, ఫలవృక్షాలు ఆకాశ సౌధాలు యజ్ఞశాలలు, ఆ పట్టణానికి మరింత శోభనిస్తున్నాయి.

ఆ పట్టణానికి దగ్గరలో ఒక అడవి ఉంది. ఆ అడవిలో ఒక రాజు విలాసంగా వేటాడుతున్నాడు. ఆ పట్టణాన్ని ఎవరు నిర్మించారో తెలియలేదు. చూస్తే అది స్వర్గంలా ఉంది. ఎదురుగా ఒక వనం. అందులో కల్పవృక్షం. దాని నీడలో కామధేనువు. అటు ఇటు రాజసంగా తిరుగుతున్న ఐరావతం. కొంచెం దూరంలో అప్సరసలు, అక్కడికి ఇంకొంత దూరంలో శచీపురందరులు కనిపించారు. అనుమానం లేదు. ఇది స్వర్గమే. అనుకున్నారు త్రిమూర్తులు. ఇంతలోనే విమానం బయలుదేరి

బ్రహ్మలోకానికి చేరింది అక్కడ ఒక బ్రహ్మ ఉన్నాడు. శివకేశవులు అతణ్ణి ఆశ్చర్యంగా చూస్తూ తమతో పాటు ఉన్న బ్రహ్మని అడిగారు అతడెవరని? తెలియదన్నాడు చతుర్ముఖుడు. విమానం కైలాసగిరి చేరింది. అక్కడ శివుడు పార్వతీసమేతుడై వృషభవాహనం మీద వస్తున్నాడు. ముందు వెనకల భూతప్రేత గణాలున్నాయి. ఇదంతా ఇంద్రజాలంలా ఉంది అనుకున్నారు, త్రిమూర్తులు. ఇంతలోనే విమానం వైకుంఠం చేరింది. అక్కడ చతుర్భుజుడైన శ్రీమహావిష్ణువు లక్ష్మీసమేతుడై దర్శనిమచ్చాడు. అవాక్కయ్యారు త్రిమూర్తులు. విమానం పాలసముద్రం చేరింది. ఆ మధ్యలో ఒక ద్వీపం. అందులో కల్పవృక్షాలవనం. ఆ వనం మధ్యన చింతామణులతో నిర్మించబడిన భవనం, అక్కడ త్రికోణాకార మంచం మీద ఒక దివ్యమంగళ విగ్రహం. ఎర్రని వస్త్రాలు ధరించి, ఎర్రచందనము శరీరానికి పూసుకుని, సర్వాలంకృతయై కోట్లకొలది సూర్యుల కాంతితో ప్రకాశిస్తున్నావిడ.. ఆమె కూర్చున్నది ఒక యంత్రపీఠము. ఆమె చేతిలో పాశము, అంకుశము, బాణాలు, చెరుకువిల్లు ఉన్నాయి. దేవతలందరూ ఆమెకు పరిచర్యలు చేస్తు హృల్లేఖీ, భువనేశీ అని జపిస్తున్నారు. అక్కడ తిరుగాడే చిలుకలు గోరింకలు కూడా హ్రీంకార జపం చేస్తున్నాయి.

**హ్రీంకారాసన గర్భితానలశిఖాం సౌః క్లీం కళాభిభ్రితీం**
**సౌవర్ణాంబర ధారణీం పరసుఖాం ధౌతాం త్రినేత్రోజ్వలాం**
**వందే పుస్తక పాశ మంకుశ ధరాం స్రగ్భూషితాముజ్వలాం**
**త్వాంగౌరీం త్రిపురాం పరాత్పరకళాం శ్రీచక్రసంచారిణీం**

**సకుంకుమ విలేపనా మళికచుమ్బి కస్తూరికాం**
**సమన్ద హసితేక్షణాం సశర చాప పాశాంకుశాం**
**అశేషజనమోహినీ మరుణ మాల్య భూషామ్బరాం**
**జపాకుసుమ భాసురాం జపవిధౌ స్మరేదమ్బికామ్ ॥**

త్రిమూర్తులు ఆ దేవిని పరిపరివిధాల స్తుతించారు.

**నమో దేవ్యై ప్రకృత్యై చ విద్యాత్ర్యై సతతం నమః ।**
**కల్యాణ్యై కామదాయై చ వృద్ధ్యై సిద్ధ్యై నమో నమః ॥**

**సచ్చిదానందరూపిణ్యై సంసారారణయే నమః ।**

**పంచకృత్య విధాత్ర్యైతే భువనేశ్యై నమోనమః ।**

**సర్వాధిష్ఠానరూపాయై - కూటస్థాయై నమో నమః ॥**

**అర్ధమాత్రార్ధభూతాయై - హృల్లేఖాయై నమో నమః ॥**

**జ్ఞాతం మయా ఖిలమిదం త్వయి సన్నివిష్టం ।**

**త్తత్తో స్య సంభవలయావపి మాత రద్య ।**

**శక్తిశ్చ తే స్య కరణే వితత ప్రభావా**

**జ్ఞాతాధునా సకలలోకమయీతి నూనమ్ ॥**

శ్రీదేవి, ప్రకృతి, విధాత్రి, అమృత స్వరూప, కళ్యాణి, కామద వృద్ధి, సిద్ధి, శ్రీభువనేశ్వరి అగు దేవికి నమస్కారము.

సర్వాధిష్టాన స్వరూప, కూటస్థ, అర్ధమాత్ర, అర్ధరూప హృల్లేఖ అగు దేవికి నమస్కారము. తల్లీ ! ఈ జగత్తంతా నీ నుంచి ఉద్భవించి మరల నీయందే లయ మగుచున్నది. ఇవి అన్నీ నీవే చేయగలవు. నీవు సకలలోకమయివి.

ఆ విధంగా త్రిమూర్తులు దేవిని స్తుతించిన తరువాత బ్రహ్మ జగదంబా ! నీవు స్త్రీవా? పురుషుడవా? ఏకమేవా ద్వితీయంబ్రహ్మ అనే వేదవాక్యానికి అర్థం నీవేనా? వివరించవలసినది అన్నాడు. దానికి ఆ పరాశక్తి.

ఉపాధి భేదం వల్ల రెండు విధాలయినట్లు అద్దంలో కనిపించే ప్రకృతిలాగా క్రియా సమయంలో భిన్నత్వం కనిపించినా పరమావస్థ యందు బ్రహ్మ పదార్థం ఒక్కటే. దానికి వైవిధ్యం లేదు. సృష్టి సమయంలో గాని లయ సమయంలో గాని నాకు స్త్రీ పురుష నపుంసక భేదాలు ఉండవు. ఈ సృష్టిలో నాకు వేరైన పదార్థమేమీ లేదు.

బుద్ధి, శ్రీ, ధృతి, కీర్తి, స్మృతి, శ్రద్ధ, మేధ, దయ, లజ్జ, తృష్ణ, కాంతి, శాంతి, పిపాస, నిద్ర, జర, విద్య అవిద్య, వాంఛ, శక్తి, ఆశక్తి, ఋతము, అమృతము, వాక్కు, పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి, అంతా నేనే.

బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, మాహేంద్రి, చాముండ మొదలైన సప్త మాతృకలు నేనే. నీటిలోని చల్లదనం, అగ్నిలోని వెచ్చదనం, సూర్యునిలో తేజస్సు, చంద్రునిలోని మంచు నేనే. నేను లేని వస్తువు ఏదీలేదు. నేను లేనిదే ఏ శక్తి అయినా అశక్తే అవుతుంది. అంతదాకా ఎందుకు? నేను లేకుండా మీరు ముగ్గురూకూడా ఏ పనీ చెయ్యలేరు. శక్తితో కలిస్తేనే బ్రహ్మ సృష్టి చేస్తాడు. విష్ణువు లోకాలను రక్షిస్తాడు. శివుడు లయం చేస్తాడు. భూమి, అనంతుడు, ఆదివరాహం, ఆదికూర్మములు కూడా శక్తితో కలిసినవి కాబట్టే ఈ బరువును మోయగలుగుతున్నాయి. లేకపోతే అణువును కూడా అవి మోయలేవు. అంతదాకా ఎందుకు? నీరు, నిప్పు, గాలి వీటికి నేను లేకపోతే పేర్లే మిగులుతాయి. గుణాలుండవు. మహత్తు అనేది–

1. క్షణికము 2. శూన్యము 3. నిత్యానిత్యము 4. సకర్తృత్వము 5.అహంకారాగ్ర్యము 6. మహత్తు 7. శాశ్వతము

అని ఏడు రకాలుగా ఉంటుంది. ఆవ్యక్తము నుంచి వ్యక్తమైన మహత్తు, దాని నుంచి అహంకారము పుట్టినాయి. కాబట్టి ఓ బ్రహ్మదేవా! మహత్తు వలన నువు సృష్టి చేయవలసినది. అని శ్వేతాంబరధారి, రజోగుణ ప్రధానురాలు అయిన వీణాపాణిని అతనికి శక్తిగా ఇచ్చి సత్యలోకానికి వెళ్ళి సృష్టి కార్యక్రమం చూడు హరిహరులిద్దరూ నీకు సాయంగా ఉంటారు. దేవతలను సృష్టించు. భూలోకంలో బ్రాహ్మణులు యజ్ఞయాగాదులు చేసి మిమ్మల్ని తృప్తి పరుస్తారు. హరిహరులు రాక్షస సంహారం చేస్తుంటారు. వారికి అసాధ్యులైన వారిని వారాహి మొదలైన నా శక్తులు వచ్చి హతమారుస్తారు. నవాక్షరమైన నా మంత్రాన్ని జపిస్తూ ఉండు అని చెప్పింది. ఆ తరువాత విష్ణువుకు లక్ష్మీదేవిని, శివుడికి మహాకాళినీ శక్తులుగా ఇచ్చి వారిని వైకుంఠానికి, కైలాసానికి వెళ్ళి స్థితి, లయాలు చూడమన్నది. ఆ తరువాత పరమేశ్వరి త్రిమూర్తులతో ఈ విధంగా అన్నది.

సత్వరజస్తమోగుణాలు మూడు ముఖ్యమైనవి. మీరు ముగ్గురూ వాటికి ప్రతీకలు. పరమాత్మ ఒక్కడే వాటికి అతీతుడు. పరమాత్మకు నాకూ భేదం లేదు.

అంతకూ నేనే కారణం. నా వల్లనే మహత్తత్త్వము, దాని వల్ల అహంకారము, దాని నుంచి పంచతన్మాత్రలు, వాటి నుంచి పంచభూతాలు పుట్టాయి.

అన్నిటికీ పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు అనే పదహారు తత్త్వాలే కారణము. పరాశక్తి కారణమునందు కాని, కార్యము నందుకాని ప్రవేశించదు. ఆమె నిర్వికార, నిర్గుణ స్వరూప. అన్నిటికీ కారణము ఆమెయే. ఈ జగత్ సృష్టి అంతా ఆమె అధీనంలోనే ఉంటుంది. అదే పరమేశ్వర తత్త్వం. నేను, ఆ పరమేశ్వరి బింబ ప్రతిబింబాలని గుర్తించి మీ మీ స్థానాలకు వెళ్ళండి అన్నది. త్రిమూర్తులు పరమేశ్వరికి అంజలి ఘటించి ముందుకు నడిచారు. అని చెప్పబడింది.

కాబట్టి పరబ్రహ్మ అంటే త్రిపుర సుందరుడు, త్రిపుర సుందరిల స్వరూపమైన పరాశక్తియే కాని వేరు కాదు. ఆమెయే మోక్షం ఇచ్చేది. పరబ్రహ్మ స్వరూపమైన **ఆ పరమేశ్వరిని పరాశక్తిని గురించి తెలుసుకోవటానికే ఈ బ్రహ్మజిజ్ఞాస.** మరి ఆ పరమేశ్వరి ఎక్కడ ఉంటుంది? అంటే ఆవిడ మణిద్వీపంలో ఉంటుంది. మణిద్వీపం ఎక్కడ ఉన్నది? పాలసముద్రం మధ్యన, కల్పవృక్షాల వనంలో మణిద్వీపం. అందులో చింతామణి గృహంలో, త్రికోణాకారమైన ఆసనం మీద, పరమశివుని పర్యంకం మీద ఆశీనురాలై ఉంటుంది. అటువంటి ఆ పరమేశ్వరిని ఆరాధిస్తే ఇహము, పరము రెండూ సిద్ధిస్తాయి. ఈ లోకంలో కావలసిన సిరిసంపదలు, భోగభాగ్యాలు, అధికారము మొదలైన వాటితోపాటుగా మోక్షం కూడా సిద్ధిస్తుంది.

**యత్రాపి భోగోన చ తత్ర మోక్షః యత్రాపి మోకో నచ తత్ర భోగః**

**శ్రీ సుందరీ సేవన తత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్త ఏవ**

జీవితంలో భోగాలే కావాలంటే, మోక్షం ఉండదు. అలాగే మోక్షం కావాలంటే ఐహికమైన భోగాలు ఉండవు. కాని ఆ పరమేశ్వరిని అర్చిస్తే భోగము, మోక్షము ఏది కావాలంటే అది సిద్ధిస్తుంది. అటువంటి పరమేశ్వరి మణిద్వీపంలో, చింతామణి గృహంలో ఉంటుంది. ఈ విషయాన్ని శంకర భగవత్పాదుల వారు తమ **సౌందర్యలహరి**లోని ఎనిమిదవ శ్లోకంలో వివరిస్తున్నారు.

# మణిద్వీపం

**సుధాసిన్ధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే**

**మణిద్వీపే నీపోపవనవతి చిన్తామణిగృహే ।**

**శివాకారే మఞ్చే పరమశివపర్యఙ్క నిలయామ్**

**భజన్తి త్వాం ధన్యాః కతిచన చిదానన్దలహరీమ్ ॥**

ఓ భగవతీ ! పాలసముద్రము మధ్యన రతనాలదీవి. అందులో కల్పవృక్షాల వనం. ఆ మధ్యన కదంబవృక్షాలు. వాటి మధ్యన చింతామణులగృహము. అందులో త్రికోణాకారమంచమునందు, పరమశివుడు అనే శయ్యమీద ప్రకాశించే ఓ జ్ఞానస్వరూపిణీ ! నిరతిశయ సుఖప్రదాయిని అయిన నిన్ను కొందరు ధన్యులు మాత్రమే సేవించగలుగుతున్నారు.

సుధాసింధువు అంటే పాలసముద్రము. అదే అమృతసముద్రం. ఆ సముద్రంలో రతనాలదీవి. అందులో కల్పవృక్షాలు. చూడండి ఆ పరమేశ్వరి పాలసముద్రంలో ఉన్నదట. పాలు అనేవి పౌష్టికాహారం. ఆయుర్వర్ధకం. చిన్న పిల్లలకు పాలే ఆహారం. పెద్దవాళ్ళకు కూడా ఆయుష్షును పెంచేవి పాలే.

**ఘృతేన వర్ధతే బుద్ధి క్షీరేణాయుష్య వర్ధతే ।**

నెయ్యివలన బుద్ధి, పాలవలన ఆయుష్షు పెరుగుతాయి.

**వృద్ధార్క హోమధూమశ్చ బాలస్త్రీ నిర్మలోదకం ।**

**రాత్రిం క్షీరాన్నభుక్తించ ఆయుర్వృద్ధిర్దినేదినే ॥**

రాత్రిపూట పాలన్నం కనక తింటే ఆయుష్షు పెరుగుతుంది అంటున్నారు. అందుకే పాలు అమృతంతో సమానం. ఆ దేవిని తలచినంత మాత్రం చేతనే ముందు శరీరపుష్టి, దారుఢ్యం కలుగుతాయి. ఇక ఆ పాలసముద్రంలో రతనాలదీవి. అవి వెలలేని రత్నాలు. ఒక్కరత్నం చాలు మనజీవితం సుఖంగా వెళ్ళిపోవటానికి అటువంటివి లెక్కలేనన్ని రతనాలు. ఆ దీవిలో కల్పవృక్షాలు. కల్పవృక్షము అంటే కోరిన కోరికలు తీర్చే వృక్షమన్నమాట. ఇది దేవతావృక్షము. ఇటువంటిది ఒక్కటుంటే చాలు మన కోరికలు తీరిపోతాయి. మనకి అంటే మన ఒక్కళ్ళకే కాదు ప్రపంచంలోని

వారందరి కోరికలు తీర్చగల శక్తి ఒక్కవృక్షానికే ఉంది. అటువంటి కల్పవృక్షాల వనం. అసలు దేవతా వృక్షాలు ఐదు అవి 1. మందారము 2. పారిజాతము 3. సంతానము 4. కల్పవృక్షము 5. హరిచందనము. వీటిలో కోరిన కోరికలు తీర్చేది కల్పవృక్షము. ఈ కల్పవృక్షసముదాయము మధ్యన మణిద్వీపమున్నది. ఆ పరమేశ్వరి నివశించే ప్రదేశాన్నే మణిద్వీపము అంటారు. **సుబాలోపనిషత్తులో** బ్రహ్మలోకముపైన సర్వలోకమున్నది అని చెప్పబడింది. ఆ సర్వలోకంలో ఈ మణిద్వీపమున్నది. అన్ని లోకాలకు పైభాగాన ఉండటం చేత దీనికి సర్వలోకమని పేరు వచ్చింది. ఆ పరమేశ్వరి సంకల్పంచేతనే ఇది ఏర్పడింది.

శివరహస్యపురాణంలో "ఓ పరమేశ్వరా ! అన్నిటికన్నా సుందరము, ఆనందామృతసాగరము, అక్కడ ఉండే వారికి ఆకలిదప్పికలు లేనటువంటిది, కైలాసము కన్న సుందరమైన స్థానము నాకోసం నిర్మించవలసినది అని ఆదేవి అడగగా పరమేశ్వరుడు ఈ లోకాన్ని నిర్మించాడు అని చెప్పబడింది. బ్రహ్మాండ పురాణంలోని లలితోపాఖ్యానంలో దేవియొక్క ఆజ్ఞతో విశ్వకర్మ ఈ నగరాన్ని నిర్మించాడు అని చెప్పబడింది.

**తత్రశ్రీ భువనేశానీ పరాశక్తిర్విరాజితే ।**

**బ్రహ్మలోకాధికాలోకః సర్వలోకాధిభిపరః ॥**

బ్రహ్మలోకము కన్న కూడా అధికమైనది సర్వలోకము. దానితో సమానమైన సుందర నగరము ఇంకొకటి లేదు.

**బ్రహ్మలోకాదూర్ధ్వభాగే సర్వలోకోఽస్తియః శ్రుతి**

**మణిద్వీపః న ఏవాస్తి యత్రదేవీ విరాజితే**

బ్రహ్మలోకానికి పైన సర్వలోకమున్నది. దానినే మణిద్వీపము అంటారు. ఆ దేవి దానిని సంకల్పమాత్రముచేతనే నిర్మించింది.

**కైలాసా దధికోలోకో ! వైకుంఠాదపి చోత్తమః**

**గోలోకాదపి సర్వస్యా సర్వలోకోఽధికస్మృతః**

**నతత్సమం త్రిలోక్యాంతు । సుందరం విద్యతే కచిత్ ।**

అది కైలాసము కన్న మిన్న. వైకుంఠముకన్న ఉత్తమము. గోలోకము కన్న శ్రేష్ఠము. ముల్లోకాలలోను దానిని మించిన నగరము ఇంకొకటి లేదు.

ఆ మణిద్వీపానికి నాలుగు వైపులా అమృతసముద్రమున్నది. అందులో గాలికి ఉవ్వెత్తున లేచే కెరటాలు, రతనాల ఇసుకప్రదేశాలు, దక్షిణావృతశంఖాలు, రంగు రంగుల చేపలు ఉన్నాయి.

**ఛత్రీభూతం త్రిజగతో భవసంతాప నాశకమ్ ।**
**ఛాయాభూతం తదేవాస్తి బ్రహ్మాండానాంతు సత్తమ ॥**

అది ముల్లోకాలకు గొడుగువంటిది. సంసారతాపాన్ని నశింపజేస్తుంది. బ్రహ్మాండాలాన్నంతటికీ చల్లని నీడనిస్తుంది.

ఈ మణిద్వీపానికి 25 ప్రాకారాలున్నాయి. రెండుప్రాకారాల మధ్య ఉన్న ప్రదేశాన్ని ఆవరణ అంటారు. ఈ రకంగా మొత్తం 24 ఆవరణాలున్నాయి. దీనిలోని 24వ ఆవరణలో శృంగారశక్తిసహితుడైన మన్మథుడుంటాడు. ఇక్కడే చింతామణి గృహము ఉన్నది.

లలితాసహస్రంలో 55, 56 నామాలు చూడండి **సుమేరు మధ్య శృంగస్థా, శ్రీమన్నగరనాయికా.**

శ్రీనగరము అంటే ఆ పరమేశ్వరి నివశించే ప్రదేశము. అది రెండు రకాలుగా ఉన్నది.

1. మేరుపర్వతం మధ్యన ఉన్నది. 2. సకలబ్రహ్మాండాలకు బయట, క్షీరసాగరంలో రత్నద్వీపము మధ్యన ఉన్నది. ఇప్పటిదాకా క్షీరసాగరంలో ఉన్న మణిద్వీపాన్ని చూశాము. ఇప్పుడు మేరుపర్వతం మధ్యన ఉన్న మణిద్వీపాన్ని చూద్దాం.

"మేరుపర్వతం అనేది బంగారు పర్వతము. ఈ పర్వతం మీద త్రికోణాకారంలో మూడుశిఖరాలున్నాయి. వాటి మధ్యన ఇంకొక శిఖరమున్నది. ఈ మూడు శిఖరాలు త్రిమూర్తులకు నిలయమై ఉండగా, నాల్గవ శిఖరంమీద ఆ పరమేశ్వరి నివసిస్తుంది. ఈ శిఖరము 400 యోజనాల ఎత్తున్నది" అని లలితాస్తవరత్నములో దుర్వాస మహర్షి వ్రాశాడు.

అలాగే లలితాష్టోత్తరశతనామావళిలో ఆ దేవిని **"రజతాచల శృంగాగ్ర మధ్యస్థాయై నమోనమః"** అంటారు. రజతాచలము అంటే వెండి కొండ. వెండిలాగా తళతళా మెరిసే మంచుకొండ. హిమగిరి.

ఆ హిమాలయపర్వతాల మీద కైలాసశిఖరమున్నది. దానిమీద శివాశివులుంటారు అని చెప్పబడుతోంది.

ఈ శిఖరము దేవతలచే పూజించబడుతున్నది. అందుచేతనే మానవులకు కనిపించదు. మానవశరీరంలో చెప్పబడే సహస్రదళపద్మమే 'మేరుపర్వతము' యోగి ఆజ్ఞానచక్రం దాటిన తరువాత మహానాదాన్ని దర్శిస్తాడు. అతడికి వాక్సిద్ధి కలుగుతుంది. ఈ మహానాదము నాగలి రూపంలో ఉంటుంది. అది శాంతమైనది. వరప్రదాయని. దేదీప్యమాన్యమైన కాంతులతో ప్రకాశిస్తుంటుంది. శూన్యమందు విసర్గకు క్రిందుగా సహస్రదళ పద్మమున్నది. అది పూర్ణచంద్రునిలాగా ఉంటుంది. దాని కిరణాలు సూర్యకిరణాలకన్నా ఎక్కువ కాంతులు ప్రసరింపచేస్తుంటాయి. ఇది కేవలము ఆనందరూపమైనది.

సహస్రదళపద్మంలో కళంకరహితుడైన చంద్రుడున్నాడు అతడు కళంక రహితుడు, వృద్ధిక్షయాలు లేనివాడు. ఆ చంద్రమండలము మధ్యన త్రికోణమున్నది. దానియందు మహాశూన్యమున్నది. ఈ శూన్యప్రదేశము అత్యంత రహస్యమైనది. అతిప్రయత్నం మీద గాని సాధకులు దాన్ని పొందలేరు. అది అపరిమితమైన సంతానరాశి. పరబ్రహ్మ (పరాశక్తి) ఇక్కడే ఉంటాడు.

**తదంతః శూన్యం తత్సకల సురగణైః సేవితంచాతిగుప్తం**

ఆ మహాశూన్యాన్ని దేవతలు రహస్యంగా సేవిస్తుంటారు.

**శివస్థానం శైవాః పరమపురుషం వైష్ణవగణాః**

**లపంతీతి ప్రాయోహరిహర పదం కేచిదపరే**

**పదందేవ్యాదేవీచరణ యుగళాంబోజ రసికా**

**మునీ నామప్యంతే ప్రకృతి పురుషస్థామమలం ॥**

ఈ ప్రదేశాన్ని శివస్థానము అని శైవులు, విష్ణుస్థానమని వైష్ణవులు, దేవీస్థానము అని శాక్తేయులు ఇలా రకరకాలుగా చెబుతుంటారు.

**ఇదం స్థానం జ్ఞాత్వా నియతనిజచిత్తో నరవరో**

**న భూయత్ సంసారే పునరపి నబుద్ధ స్త్రిభువనే ॥**

**సమగ్రాశక్తిః స్యాన్నియమ మనసస్త స్వకృతినః**

**సదాకర్తుం ఖగతిరపి వాణీసువిమలా ॥**

ఈ స్థానాన్ని తెలుసుకున్న సాధకుడికి పునర్జన్మ లేదు. అతడికి ఈ లోకంతో బంధం ఉండదు. పాపపుణ్యాలుండవు. సంసారబంధనాలు ఉండవు. ఇష్టార్థసిద్ధి కలుగుతుంది. అతడికి సాయుజ్యం లభిస్తుంది. పునర్జన్మ ఉండదు. ఈ విషయం అంతా **షట్చక్రనిరూపణం** లో చెప్పబడింది.

ఈ రకంగా పాలసముద్రంలో ఉన్న మణిద్వీపమే మేరుశృంగము. అదే సహస్రదళపద్మము. శ్రీచక్రంలోని ఎనిమిదవఆవరణ 'సర్వసిద్ధిప్రదచక్రము' అదే త్రికోణము. దీనిలో మూడువైపులా మూడుపీఠాలున్నాయి. వీటినే, 1. కామగిరి, 2. పూర్ణగిరి, 3. జాలంధర పీఠాలు అంటారు. ఈ మూడు పీఠాల మధ్యన నాల్గవదైన ఓడ్యాణపీఠమున్నది. అందులోనే పరమేశ్వరి ఉన్నది. **యోగినీహృదయం**లో దీన్ని వివరిస్తూ, నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతడు బిందురూపంలో ఉన్నాడు. ఆ బిందువే కాలవశమున భిన్నమై, వివిధరూపాలు పొందింది. **'రహస్యాగమము'**లో ఈ విషయాన్ని వివరిస్తూ 'కాలవశమున భిన్నమైనటువంటి ఆ బిందువు మూడు భాగాలయింది. అవే 1. స్థూల 2. సూక్ష్మ 3. పరములు. అవి కారణబిందువుతో కలిసి నాలుగుభాగాలవుతున్నాయి. అవే 1. కామగిరి, 2. పూర్ణగిరి, 3. జాలంధర, 4. ఓడ్యాణ పీఠాలు. ఆ పరమేశ్వరి ఈ పీఠాలలో ఉంటుంది. ఈ పీఠాలు మానవదేహంలో ఉన్నాయి. ఇవి శ్రీచక్రంలో కూడా నిరూపించబడ్డాయి. ఈ నిరూపణ ఏమిటో ఒక్కసారి చూద్దాం. గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలోని 10వ శ్లోకంలో మానవశరీరంలో ఉండే షట్చక్రాలకు, శ్రీచక్రంలోని ఆవరణలకు ఐక్యత నిరూపించారు. అంటే ఈ రెండూ ఒక్కటే అన్నారు.

**త్రికోణం చాధారం త్రిపురవినుతే ! ష్టారమనఘే**

**భవేత్స్వాధిష్ఠానం పునరపి దశారం మణిపురం ॥**

**దశారంతే సంవిత్కమల మథమన్వస్రక్రముమే**

**విశుద్ధం స్వాదాజ్ఞా శివ ఇతి తతో బైందవగృహమ్ ॥**

1. ఆధార చక్రానికి – త్రికోణంతో ఐక్యత
2. స్వాధిష్ఠానానికి – అష్టకోణంతో ఐక్యత
3. మణిపూరానికి – అంతర్దశారంతో ఐక్యత
4. అనాహతానికి – బహిర్దశారంతో ఐక్యత
5. విశుద్ధి చక్రానికి – చతుర్దశారంతో ఐక్యత
6. ఆజ్ఞా చక్రానికి – అష్టదళము, షోడశదళములతో ఐక్యత
7. సహస్రారానికి – భూపురంతో ఐక్యత

శ్రీ చక్రంలో ఉండే మూడువృత్తాలు – రుద్రగ్రంథి, విష్ణుగ్రంథి, బ్రహ్మగ్రంథిలతో ఐక్యత పొందుతున్నాయి. ఇందులో బ్రహ్మరంధ్రమే బిందువు. కాబట్టి

| | | | | |
|---|---|---|---|---|
| కామగిరిపీఠం | – | ఆధారచక్రం | – | త్రికోణం |
| పూర్ణగిరి పీఠం | – | అనాహత చక్రం | – | బహిర్దశారం |
| జాలంధర పీఠం | – | ఆజ్ఞాచక్రం | – | అష్టదళ, షోడశదళ పద్మాలు |
| ఓడ్యాణ పీఠం | – | బ్రహ్మరంధ్రం | – | బిందువు |

లలితాసహస్రంలో

| | | |
|---|---|---|
| 375 నామం కామపూజితా | – | కామగిరిపీఠము |
| 376 నామం శృంగారరస సంపూర్ణా | – | పూర్ణగిరి పీఠము |
| 378 నామం జాలంధర స్థితా | – | జాలంధర పీఠము |
| 379 నామం ఓడ్యాణ పీఠనిలయా | – | ఓడ్యాణపీఠము |

ఈ ఓడ్యాణపీఠమే మానవదేహంలోని బ్రహ్మరంధ్రము. శ్రీచక్రంలోని తొమ్మిదవ ఆవరణ బిందువు. అదే సుధాసింధువు. మేరుశృంగము.

అటువంటి సుధాసింధువులో మణిద్వీపమున్నది. ఆ ద్వీపంలో కోరిన కోరికలు తీర్చే కల్పవృక్షాలున్నాయి. మణిద్వీపానికి 25 ప్రాకారాలున్నాయి. ఇరవై ఐదు ప్రాకారాలే, ఇరవై ఐదు తత్త్వాలు. రెండు ప్రాకారాల మధ్య ఉన్న స్థలాన్ని ఆవరణ అంటారు. ఈరకంగా మొత్తం 24 ఆవరణాలున్నాయి.

24వ ఆవరణలోనే చింతామణిగృహమున్నది. చింతలను తీర్చే మణి – చింతామణి. ప్రతిరోజూ 20 బారువుల బంగారం పెడుతుంది. అంటే ఈ చింతామణి దగ్గర ఉన్నవాడికి దరిద్రం అనేది లేదన్నమాట. చింతామణి అనేది ఒక మంత్రం. సర్వకామ్యసిద్ధిప్రదము. అటువంటి చింతామణులతో నిర్మించిన గృహము. పరమేశ్వరిని నమ్మినవాడికి ఏ రకమైన బాధలు, కష్టాలు ఉండవన్నమాట. అతని కోరికలన్నీ ఆమె తీరుస్తుంది. ఈ చింతామణిగృహానికి

ఆగ్నేయ భాగంలో – దేవి ఆవిర్భవించిన చిదగ్నికుండము

నైరుతి దిశలో – శ్రీచక్రరథము

వాయువ్యదిశలో – గేయచక్రరథము

ఈశాన్యదిశలో – కిరిచక్రరథము ఉంటాయి.

చింతామణిగృహానికి నాలుగుద్వారాలున్నాయి. ఆ ద్వారాలలో ఆమ్నాయ దేవతలుంటారు. అందుకే పరమేశ్వరిని అర్చించేటప్పుడు

**ప్రాగామ్నాయమయ ప్రాగ్ద్వారే ద్వారశ్రియై నమః**

**దక్షిణామ్నాయమయ దక్షిణద్వారే ద్వారశ్రియై నమః**

**పశ్చిమామ్నాయమయ పశ్చిద్వారే ద్వారశ్రియై నమః**

**ఉత్తరామ్నాయమయ ఉత్తరద్వారే ద్వారశ్రియై నమః**

**తన్మధ్యే క్షీరసాగరాయ నమః**

**క్షీరసాగరమధ్యే రత్నద్వీపాయ నమః**

**తన్మధ్యేకల్పవృక్ష వాటికాయై నమః**

**తన్మధ్యే రత్న సింహాసనాయై నమః**

**రత్నసింహాసనోపరిస్థితా శ్రీలలితాపరాభట్టారికాయై నమః** ఇతి యోని ముద్రాంపణమేతు అంటాము.

దేవీ భాగవతంలో చింతామణి గృహాన్ని వివరిస్తూ

**నవరత్నమయాదగ్రే చింతామణి గృహం మహత్ ।**

**తత్ర త్యం వస్తు మాత్రంతు చింతామణి నిర్మితం ॥**

**సూర్యోద్గారో ఫలైస్తద్వ చ్ఛంద్రోద్గారోఫలై స్తదా ॥**

**విద్యుత్ ప్రభోఫలైః స్తంభాః కల్పితాస్తు సహస్రశః ।**

**యేషాంప్రభాభిరంతః స్థ వస్తు కించిన్న దృశ్యతే ॥**

నవరత్నాలప్రాకారం దాటిన తరువాత చింతామణిగృహము మహోజ్వలమైన ప్రభలతో ప్రకాశిస్తుంటుంది. దానిలో ప్రతివస్తువు కూడా చింతామణులతో నిర్మించబడింది. సూర్యకాంతిశిలలు, చంద్రకాంతిశిలలు, మెరుపుకాంతుల మణులతో నిర్మించబడిన స్థంభాలు దీపపు స్థంభాలలాగా ప్రకాశిస్తుంటాయి. ఆ కాంతులలో ఏ వస్తువూ కనిపించదు. ఇటువంటివి వేయిస్థంభాలు గల మంటపాలు ఆ చింతామణిగృహంలో నాలుగున్నాయి.

**తదేవ దేవీ సదనం మధ్యభాగే విరాజితే**

**సహస్ర స్తంభ సంయుక్తా, శ్చత్వా రత్వేషు మంటపా**

**శృంగారమంటపశ్చైకో, ముక్తి మంటప ఏవచ**

**జ్ఞానమంటప సంజ్ఞస్తు, తృతీయః పరికీర్తితః ॥**

**ఏకాంత మంటపశ్చైవ, చతుర్థ పరికీర్తితః**

ఆ చింతామణిగృహంలో వేయిస్తంభాలమంటపాలు నాలుగున్నాయి అన్నాం కదా ! అవి

1. శృంగారమంటపము
2. ముక్తిమంటపము
3. జ్ఞానమంటపము
4. ఏకాంతమంటపము

ఈ మంటపాలన్నీ కూడా ధూపములతోను, పరిమళములతోను విరాజిల్లు తుంటాయి.

వీటిలో ప్రతిమంటపము కొన్ని కోట్లసూర్యకాంతులతో ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ మంటపాలకు నాలుగువైపులా కాశ్మీరవనాలున్నాయి. అక్కడ నుండి పరిమళాలు వెదజల్లబడుతుంటాయి. అక్కడ రతనాలమెట్లవరుసలో మహాపద్మాలున్నాయి.

వాటిలోని తేనెను తుమ్మెదలు త్రాగుతుంటాయి. ఆ ప్రాంతంలో హంసలు, కారండవ (కన్నె లేడిపిట్ట) పక్షులు తిరుగాడుతుంటాయి. చింతామణిగృహంలో నాలుగు మంటపాలున్నాయి కదా. వాటిలోని

**శృంగారమంటపే దేవ్యో గాయంతీవివిధై స్స్వరైః ।**
**సభాసదో దేవవరా మధ్యే శ్రీజగదంబికా ॥**

శృంగార మంటపంలో దేవతలు మధురస్వరాలతో గానం చేస్తుంటారు. అక్కడ దేవతలంతా సభ తీర్చి ఉంటారు. వారి మధ్యలో సింహాసనం మీద ఆ దేవి **'జగదంబిక'** ఆసీనురాలై ఉంటుంది.

**ముక్తిమంటప మధ్యేతు యోచయత్వనిశంశివా**

ముక్తిమంటపంలో నుండి ఆ దేవి జగత్తులోని భక్తులకు ముక్తిని ప్రసాదిస్తుంటుంది.

**జ్ఞానోపదేశం కురుతే తృతీయే నృపమంటపే**

మూడవదైన జ్ఞానమంటపంలో ఉండి భక్తులకు జ్ఞానాన్ని ప్రసాదిస్తుంటుంది.

**చతుర్ధే మంటపం చైవ జగద్రక్షా వివించనం ।**
**మంత్రిణీ సహితానిత్యం కరోతు జగదంబికా ॥**

నాల్గవమంటపం అయిన ఏకాంతమంటపంలో దేవి తన మంత్రులతో కొలువు దీరి, జగద్రక్షణ గురించి ఆలోచిస్తుంటుంది. అటువంటి చింతామణి గృహంలో **శివాకారే మంచే పరమశివపర్యంక నిలయాం** శివాకారము అంటే – త్రికోణాకారమైన మంచంమీద పరమశివుని పర్యంముమీద ఆ దేవి ఆసీనురాలై ఉంటుంది. అంటున్నారు శంకర భగవత్పాదులవారు. ఐతే దేవీ భాగవతంలో చూడండి.

**చింతామణిగృహేరాజన్ శక్తితత్త్వాత్మకై పరైః**
**సోపానైర్దశభిర్యుక్తో మంచకోప్యధిరాజితే ॥**

**బ్రహ్మావిష్ణుశ్చరుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివహః**
**ఏతే పంచఖురాః ప్రోక్తాః ఫలకస్తు సదాశివః ॥**

చింతామణి గృహంలో శక్తితత్వాత్మకమైన పదిమెట్లతో, దివ్యకాంతులు ప్రసరించే మంచమున్నది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు ఆ మంచానికి కాళ్ళుకాగా, సదాశివుడు దానిమీద పలకగా ఉంటాడు. లలితా సహస్రంలోని 249వ నామము **'పంచప్రేతాసనాసీనా'.**

సృష్టి ప్రారంభంలో పరమేశ్వరి త్రిమూర్తులకు తన అంశలయిన మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులను వారికి సహాయకులుగా ఇచ్చి సృష్టికార్యక్రమం కొనసాగించమని చెబుతూ, మీరు ఆ శక్తులను ఎప్పుడూ అవమానించకండి. ఒకవేళ ఆ శక్తులు గనక మిమ్ములను వదలి వెళ్ళిపోతే, మీరు శక్తిహీనులై పోతారు. అని చెప్పింది. కాలక్రమంలో త్రిమూర్తులు ఆ శక్తులను అవమానించారు. వారు అలిగి వెళ్ళిపోయారు. అప్పుడు త్రిమూర్తులు శక్తిహీనులై పోయారు. శక్తిహీనుడైనవాడు ప్రేతంతో సమానం అందుకే ఆదేవి ప్రేతములవంటి వీరిచే మోయబడుతూ, పంచప్రేతాసనాసీనా అనబడుతోంది.

షట్చక్రాలలో పరమేశ్వరిని అర్చించే సంప్రదాయమున్నది. ఈ సంప్రదాయంలో ఒక్కొక్క చక్రంలో అర్చించే వారికి ఒక్కొక్క రకమైన ముక్తి లభిస్తుంది. విశుద్ధిచక్రంలో ఆ పరమేశ్వరిని అర్చించే వారికి సామీప్యముక్తి కలుగుతుంది. త్రిమూర్తులు ఆ దేవికి అతిదగ్గరగా ఉండి సేవించాలనే తలంపుతో ఆమెను విశుద్ధిచక్రంలో అర్చించి, ఆమె కూర్చునే సింహాసనానికి కోళ్ళు అయినారు. ఈ విషయం అంతా **గతాస్తే మంచత్వం** అనే సౌందర్యలహరిలోని 92వ శ్లోకంలో వివరించబడింది.

ఆమెయే పరాశక్తి. ఆమెను తెలుసుకోటానికే ఈ జిజ్ఞాస.

ఆ పరమేశ్వరి **పంచకోశాంతర స్థిత.** ఈ పంచకోశాల గురించి **తైత్తిరీయోప నిషత్తు**లోని భృగువల్లిలో చెప్పబడింది.

వరుణమహర్షి కుమారుడు భృగుమహర్షి. విద్యాభ్యాసం పూర్తి చేసి బ్రహ్మజ్ఞానం సంపాదించాలనే కోరికతో తన తండ్రి దగ్గరకు వెళ్ళి పరబ్రహ్మతత్త్వం ఉపదేశం చెయ్యమని అడిగాడు. దానికి అతడి తండ్రి "కుమారా ! అన్నము, ప్రాణము, నేత్రము, శ్రోత్రము, మనస్సు, వాక్కు, ఇవన్నీ పరబ్రహ్మసాధనకు మార్గాలే.

వీటన్నింటిలోనూ బ్రహ్మతత్త్వం ఇమిడి ఉన్నది. అది దేనిలో నుండి ఉత్పన్నమైనదో, దేనితో పోషింపబడుతున్నదో, దేనియందు లయమవుతున్నదో, అన్నిటికీ మూలవస్తువేదో, దాన్ని తెలుసుకోవాలి. దాన్ని తపస్సుద్వారానే సాధించాలి. కాబట్టి వెళ్ళి తపస్సు చెయ్యి" అన్నాడు.

తండ్రి ఆ దేశాన్ననుసరించి దీక్షతీసుకుని నియమనిష్ఠలతో తపస్సు చెయ్యటం ప్రారంభించాడు భృగువు. కొంతకాలం గడిచింది. ఆ తరువాత 'అన్నమే పరబ్రహ్మ స్వరూపము' అని తెలిసింది. అన్నం మూలంగానే ప్రాణులన్నీ ఉత్పత్తి అవుతున్నాయి. ప్రాణులన్నీ పోషింపబడుతున్నాయి. కాబట్టి అన్నమే పరబ్రహ్మస్వరూపము. అని నిశ్చయించుకుని ఈ విషయం తండ్రికి చెప్పాడు. ఆ మాటలు విన్న వరుణ మహర్షి "నాయనా ! తత్త్వసాధనలో మొదటిమెట్టు మీదనే ఉన్నావు. అన్నం పరబ్రహ్మ స్వరూపమే. కాని అన్నమే పరబ్రహ్మస్వరూపం కాదు. వెళ్ళి మళ్ళీ తపస్సు చెయ్యి అన్నాడు. మళ్ళీ తపస్సు చెయ్యటం ప్రారంభించాడు భృగువు. కొంతకాలం గడిచింది. ప్రాణమే బ్రహ్మ అనే విషయాన్ని తెలుసుకున్నాడు. లోకంలోని సమస్తజీవరాసి ప్రాణంవల్లనే జీవిస్తున్నది. ప్రాణం పోయినప్పుడు మృత్యువుతో లయమవుతున్నది. అందుచేత ప్రాణమే సర్వసృష్టికీ మూలాధారం అని భావించాడు. అదే విషయం తండ్రికి చెప్పాడు. ఆ మాటలు విన్న తండ్రి "నాయనా ! ఇదివరకటికన్న కొంచెం ముందుకు వెళ్ళావు. ప్రాణంకూడా పరబ్రహ్మస్వరూపమే. అంతే కాని ప్రాణమే పరబ్రహ్మ స్వరూపంకాదు. మళ్ళీ వెళ్ళి తపస్సు చెయ్యి" అన్నాడు.

మళ్ళీ తపస్సు చెయ్యటం ప్రారంభించాడు భృగువు. కొంతకాలం గడిచింది. మనస్సువల్లనే సంకల్పవికల్పాలు కలుగుతున్నాయి. మనస్సుచేతనే స్త్రీపురుషులు ఆకర్షితులౌతున్నారు. దీనివల్లనే జీవకోటి ఉద్భవిస్తున్నది. జన్మించిన తరువాత కూడా ఇంద్రియాల సాయంతోనే జీవనం సాగుతున్నది. చనిపోయిన తరువాత కూడా ఇంద్రియాలకు జ్ఞానం ప్రసాదించే శక్తి పోతుంది. అప్పుడు ఇంద్రియాలన్నీ మనస్సులో లీనమవుతాయి. కాబట్టి 'మనస్సే పరబ్రహ్మ.' అనుకున్నాడు భృగువు. ఈ విషయం తండ్రికి చెప్పాడు. మనస్సుకూడా పరబ్రహ్మమే కాని మనస్సే పరబ్రహ్మ కాదు. మళ్ళీ వెళ్ళి తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి.

మళ్ళీ కొంతకాలం తపస్సు చేశాడు భృగువు. అప్పుడు అతడికి అర్థమయింది. 'విజ్ఞానమే బ్రహ్మ' అని అదే విషయాన్ని తండ్రికి చెప్పాడు కాదన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చెయ్యమన్నాడు. తండ్రి మాటల ప్రకారం మళ్ళీ తపస్సు చేశాడు భృగువు. అప్పుడు తెలిసింది 'ఆనందమే పరబ్రహ్మ' అని. సర్వమూ ఆనందం నుంచే ఉద్భవిస్తున్నది. ఆనందంలోనే లయమవుతున్నది. ఈ విషయం తండ్రికి తెలియజేశాడు. పరమానందం చెందాడు తండ్రి. అప్పుడు కుమారుడితో "కుమారా! అన్నింటికన్నా ఉత్తమంగా పరమాత్మను వ్యక్తం చేసే తత్త్వం ఆనందం. అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము అన్నీ కూడా పరబ్రహ్మస్వరూపాలే. ఇవన్నీ ఒకదానికన్న మరొకటి సూక్ష్మమైనవి. అన్నింటికీ మించినది ఆనందము. ఈ ఆనందం క్షణికమైనది కాదు శాశ్వతమైనది. పరబ్రహ్మోపాసన క్రమంగా జరగాలి. ఆహారాన్ని వదలకుండా తింటూ ప్రాణాన్ని నిలుపుకుని, మనసును వికసింపచేసుకుని, దానివల్ల విజ్ఞానం పొంది తద్వారా పరబ్రహ్మసాక్షాత్కారం పొందాలి." అంటూ పంచకోశాంతర్గతుడైన పరబ్రహ్మను వివరించాడు వరుణమహర్షి.

కాబట్టి పరబ్రహ్మస్వరూపం పంచకోశములందు ఉంటుంది. కోశము అంటే వర అని అర్థం. మానవ శరీరంలో ఐదు కోశాలున్నాయి.

1. అన్నమయకోశము
2. ప్రాణమయకోశము
3. మనోమయకోశము
4. విజ్ఞానమయకోశము
5. ఆనందమయకోశము

మొదటి నాలుగు కోశముల మధ్యన ఆనందమయకోశంలో పరమేశ్వరి ఉంటుంది. ఈ నాలుగు కోశాలు ఒకదానిలో ఒకటి ఉంటాయి. ఆ లోపల పరమేశ్వరి ఉంటుంది. మానవదేహము 1) స్థూలదేహము 2) సూక్ష్మదేహము 3) కారణదేహము అని మూడు రకాలు.

1. స్థూలదేహము – అన్నమయకోశము
2. సూక్ష్మదేహము – ప్రాణమయ, మనోమయ
3. కారణదేహము – ఆనందమయకోశము

ఈ కోశాలన్నీ ఒకదానిలో ఒకటి ఉంటాయి.

1. అన్నమయకోశంలో – ప్రాణమయకోశము ఉంటుంది
2. ప్రాణమయకోశంలో – మనోమయకోశం ఉంటుంది.
3. మనోమయకోశంలో – విజ్ఞానమయకోశం ఉంటుంది.
4. విజ్ఞానమయకోశంలో – ఆనందమయకోశం ఉంటుంది
5. ఆనందమయకోశంలో – పరమేశ్వరి ఉంటుంది.

కాబట్టి ఆ పరమేశ్వరి ఎక్కడో లేదు. మనలోనే ఉన్నది.

ఇప్పుడు మనం దేవీ భాగవతం చూస్తున్నాం.

**బ్రహ్మా విష్ణుశ్చరుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః ।**
**ఏతే పంచఖురాః ప్రోక్తాః ఫలకస్తు సదాశివః ॥**

పరమేశ్వరి కూర్చున్న త్రికోణాకార సింహాసనానికి బ్రహ్మా, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు కోళ్ళు కాగా, సదాశివుడు దానిమీద పలకగా ఉన్నాడు.

**తస్యోపరి మహాదేవో భువనేశో విరాజితే ।**
**యాదేవీ నిజలీలార్థం ద్విదా భూతా బభూవః ॥**

ఆ సింహాసనం మీద త్రిభువనేశ్వరుడు, మహాదేవుడు అయిన కామేశ్వరుడు ఉంటాడు. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. ఉన్నది ఒక్కటే కదా ! మరి ఈ భువనేశ్వరుడెవరు ? అందుకే చెబుతున్నాడు **యా దేవీ నిజలీలార్థం ద్విదా భూతా బభూవః** ఆ పరమేశ్వరియే తన లీలావినోదం కోసం రెండురూపాలు ధరిస్తున్నది అంటున్నాడు. నిరాకారమైతే ఉన్నది ఒక్కటే కాని నిరాకారుడైన పరబ్రహ్మ సృష్టి చెయ్యాలని సంకల్పించినవాడై తనను తాను రెండుభాగాలుగా విభజించుకున్నాడు. అదే ప్రకృతి, పురుషులు. భువనేశ్వరి, భువనేశ్వరులు. కామేశ్వరి, కామేశ్వరులు.

**వామాంకేషణ్ణి షణ్ణా స్వదేవీ శ్రీభువనేశ్వరీ**
**నవరత్న గణాకీర్ణా కాంచీదామ విరాజితా**
**తప్తకాంచన సన్నద్ధ వైడూర్యాంగద భూషణా ॥**

**కనచ్ఛ్రీచక్ర తాటంక విటంక వదనాంబుజా ।**

**లలాట కాంతి విభవ విజితార్ధ సుధాకరా ॥**

ఆ భువనేశ్వరుడి వామాంకం మీద నవరత్నాలు పొదిగిన మొలనూలుతోను, వైడూర్యములతో చేయబడిన చేతికడియములతోను, ప్రకాశించే భువనేశ్వరి ఉంటుంది. శ్రీచక్రాకారము గల తాటంకములతో ఆ దేవిముఖము ప్రకాశిస్తుంటుంది. దొండపండులాంటి అధరములు, నొసట కస్తూరితిలకముతో ఆ దేవి శోభిల్లుతూ ఉంటుంది. సూర్యచంద్రుల కాంతులను మించిన కాంతిగల చూడామణి ధరించి, నానాభరణములతోనూ భాసిల్లుతూ, దివ్యమైన సౌందర్యరాసియై, దేవతలసేవలు అందుకుంటూ ఉంటుంది. ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తులు ఆమె కన్నుసన్నలలో మెలగుతుంటాయి. లజ్జ, తుష్టి, పుష్టి, కీర్తి, కాంతి, క్షమ, దయ, బుద్ధి, మేధ, స్మృతి, లక్ష్మి అనే వారు ఆమెను సేవిస్తూ ఉంటారు.

**జయాచవిజయాచైవా । ప్యజితా చా పరాజితా ॥**

**నిత్యావిలాసినీ దోగ్ధ్రీ త్యఘోరా మంగళా నవా ।**

**పీఠశక్త య ఏతాస్తు సేవంతే యా పరాంబికామ్ ॥**

జయ, విజయ, అజిత, అపరాజిత, నిత్య, విలాసినీ, దోగ్ధ్రీ, అఘోరా, మంగళా అనే తొమ్మిది పీఠశక్తులు ఆ దేవిని సేవిస్తుంటాయి.

**యస్యాస్తు పార్శ్వభాగేస్తు నిధీతౌశంఖ పద్మకౌ**

**నవరత్న మహానద్యస్త దావై కాంచనస్రవా ॥**

ఆ దేవికి ఇరుప్రక్కలా శంఖ, పద్మనిధులు ఉంటాయి. బంగారము, రతనాలతో కూడిన నదులు ప్రవహిస్తుంటాయి. అక్కడ రతనాల రాసులుంటాయి. నిధులు మొత్తం తొమ్మిది. వీటినే నవనిధులు అంటారు. అవి 1) కాళ, 2) మహాకాళ, 3) పాండుక, 4) మాణవక 5) వైసర్ప 6) సర్వరత్న 7) శంఖ 8) పద్మ 9) పింగళకము

ఇవన్నీ కుబేరుని అధీనంలో ఉంటాయి. వీటిలో శంఖనిధి, పద్మనిధి మరీ శ్రేష్ఠమైనవి. ఆ రెండు నిధులు పరమేశ్వరి దగ్గరే ఉన్నాయి. ఈ రకంగా చింతామణిగృహంలో పరమశివుని పర్యంకమందు ఉంటుంది ఆ దేవి.

ఆ పరమేశ్వరి ఎక్కడో లేదు శ్రీచక్రంలోనే ఉన్నది. శ్రీచక్రము అంటే శివశక్తుల సంగమస్థానమే తప్ప వేరు కాదు. ఇందులో మొత్తం తొమ్మిది ఆవరణలున్నాయి. వీటినే చక్రాలు అని కూడా అంటారు. వీటిలో నాలుగు శివచక్రాలు కాగా ఐదుశక్తి చక్రాలు. బిందువునందే పరమేశ్వరి ఉంటుంది. అందుకే **భైరవయామళం, వామకేశ్వరతంత్రం** మొదలైన గ్రంథాలలో

**బిందుస్థానం సుధాసింధుః పంచయోన్య స్సురద్రుమాః**
**తత్రైవనీప శ్రేణీచ తన్మధ్యే మణిమంటపం ॥**
**తత్ర చింతామణికృతం దేవ్యామందిర ముత్తమమ్**
**శివాత్మకే మహామంచే మహేశానోపబర్హణే ॥**
**అతిరమ్యతరే తత్ర కశిపుశ్చ సదాశివః**
**భృతకాశ్చ చతుష్పాదా మహేంద్రశ్చ పతద్గ్రహః ॥**
**తత్రాస్తే పరమేశానీ మహాత్రిపుర సుందరీ**
**శివార్క మండలం భిత్వా ద్రావయంతేందు మండలం ॥**
**తద్భూతామృతస్యందీ పరమానందనందితా**
**కులయోషికులం త్యక్త్వా పరం వర్షణమేత్యసా ॥**

ఇదంతా యోగమార్గం. ఆధారచక్రంలో నిద్రిస్తున్న కుండలినీశక్తిని గనక జాగృతం చేస్తే అది గ్రంథిత్రయాన్ని భేదించి, సహస్రారం చేరి, అమృతపుధారలు కురిపించి మళ్ళీ ఆధారచక్రం చేరి నిద్రావస్థలోకి వెడుతుంది. ఇదంతా **'మహీం మూలాధారే'** అనే సౌందర్యలహరిలోని తొమ్మిదవ శ్లోకంలో వివరించటం జరుగుతుంది.

పరమేశ్వరి ఎక్కడ ఉంటుంది అని అడిగినప్పుడు పార్వతికి ఈశ్వరుడు చెబుతున్నాడు.

**సుదాబ్ధౌనందనోద్యానే రత్నమంటపమధ్యమాం**
**బాలార్కమండలాభాసాం చతుర్బాహుం త్రిలోచనాం ॥**
**పాశాంకుశ ధనుర్బాణం ధారయంతీం శివాం శ్రియే ॥**

సుధాబ్ధిలో, నందనోద్యానంలో, రత్నమంటపం మధ్యన చేతులయందు ధనుర్బాణాలు, పాశము, అంకుశములతో బాలభానునిలాగా ప్రకాశిస్తున్నది.

లలితాసహస్రంలో 'సుమేరుమధ్యశృంగస్థా' నుంచి 'సుధాసాగరమధ్యస్థా' వరకు గల నామాలు ఆ పరమేశ్వరి నివాసస్థానాన్ని వివరిస్తున్నాయి.

ఆవిడ పరమేశ్వరి పరాశక్తి. పరబ్రహ్మ స్వరూపం. భక్తులకుఏది కావాలంటే అది ఇస్తుంది. **అటువంటి ఆ పరమేశ్వరిని, ఆ పరబ్రహ్మస్వరూపాన్ని తెలుసుకోవాలనే కోరిక. అదే బ్రహ్మజిజ్ఞాస.**

ఆ పరమేశ్వరియే పరబ్రహ్మ. లలితా సహస్రంలో 132-195 నామాలలో ఈ విషయాన్ని వివరించారు.

## పరబ్రహ్మతత్త్వము

పరమేశ్వరియొక్క గుణవిశేషాలను వర్ణించిన తరువాత హయగ్రీవుడు పరమేశ్వరి యొక్క నిర్గుణతత్త్వాన్ని వివరిస్తున్నాడు.

**ప్రధమం సగుణమాశ్రిత్య తతోనిర్గుణ మాశ్రయేత్**

మొదటగా సగుణరూపం చెప్పి ఆ తరువాత దేవియొక్క నిర్గుణతత్త్వాన్ని వివరించి సాధనాక్రమాన్ని బోధిస్తున్నాడు.

సాధనలో ఇది పద్ధతి. ఉపనిషత్తులలోకూడా ఈ పద్ధతే చెప్పబడింది. ప్రశ్నోప నిషత్తులో పిప్పలాద మహర్షి మహాజ్ఞాని బ్రహ్మవేత్త. ఒకరోజున సుకేసుడు, సత్యకాముడు, గార్గ్యుడు, కౌశల్యుడు, వైదర్భి, కబంధి అనే ఆరుగురు పిప్పలాదుడి దగ్గరకు వచ్చారు. వీరందరూ నియమనిష్ఠలతో జీవితం గడుపుతున్నవారు వేదాధ్యయనం చేసినవారు. సగుణబ్రహ్మ ఆరాధనలో శ్రేష్టులు. యజ్ఞయాగాదులు నిర్వహించటంలో తమకు సాటిలేనివారు. ఇప్పుడు నిర్గుణబ్రహ్మను గురించి తెలుసుకోవాలనే తలంపుతో మంచి గురువు కోసం వెదకటం మొదలుపెట్టారు. ఆ కాలంలో పిప్పలాదుడు మహాజ్ఞాని. తత్త్వవేత్త. అందుచేత ఆయన దగ్గర బ్రహ్మజ్ఞాన సముపార్జన చెయ్యాలనే తలంపుతో ఆచార ప్రకారం సమిధలు చేతితో పట్టుకుని పిప్పలాదుణ్ణి దర్శించారు.

కఠోపనిషత్తులో గౌతముడు మహాపండితుడు. వేదవేదాంగవిదుడు. మహాతపస్వి. మరణానంతరము ఉత్తమలోకాలు పొందటం కోసమని 'విశ్వజిత్' అనే యాగాన్ని చెయ్యాలనుకున్నాడు. ఈ యాగంచేసేవారు ముందుగా తమ సర్వస్వాన్ని దానం చెయ్యాలి.

ఆచారం ప్రకారం గౌతముడు అన్ని దానాలు చేశాడు. చివరకు గోదానం వచ్చింది. అందులో వట్టిపోయిన ఆవులు, ముసలి ముతక ఆవులు, ఆఖరి క్షణాలలో ఉన్న ఆవులను కూడా దానం ఇవ్వటానికి సిద్ధపడ్డాడు.

అతని కుమారుడు నచికేతుడు. వేదాధ్యయనం చేసినవాడు. తండ్రితోపాటుగా సమానమైన పండితుడు. ఈ ఆవులను దానం చెయ్యటంవల్ల పుణ్యలోకాలు కలగకపోగా, ఆనందము అనే నరకము ప్రాప్తిస్తుంది అని తెలిసినవాడు. అంటే నచికేతుడు మహా పండితుడు. కర్మలు చేయటంలో ఆరితేరినవాడు. తండ్రి ఆ గోవులను దానం ఇవ్వకుండా ఆపాలని చూశాడు. సాధ్యపడలేదు. చివరకు తనను తానే యముడికి దానం ఇప్పించుకుని యముని దగ్గర బ్రహ్మవిద్య నభ్యసించాడు.

ముండకోపనిషత్తులో పూర్వకాలంలో పాంచాలదేశంలో త్రిగర్త అనే పల్లె ఉంది. అందులో శునకుడు అనే మహాపండితుడు ఉండేవాడు. ఆయన దగ్గర పాండిత్యంతోపాటుగా ధనధాన్యాలు కూడా సమృద్ధిగా ఉండేవి. అందుచేత విద్యార్థులకు తన ఇంట్లోనే వసతికూడా కల్పించి విద్య నేర్పేవాడు. అందుచేత అతని యశశ్చంద్రికలు దశదిశలా వ్యాపించినాయి.

అతని పెద్దకుమారుడు శౌనకుడు. కఠోర నియమాలతో బ్రహ్మచర్యం పాటించి విద్యాభ్యాసం పూర్తిచేశాడు. అంటే వేదవేదాంగాలు, శాస్త్రాలు, కర్మానుష్టానము అన్నీ పూర్తిగా తెలుసుకున్నాడు. వాటిలో నేర్పు సంపాదించాడు. ఇప్పుడు గురువుగారైన అంగిరసుని దగ్గరకు వెళ్ళి "స్వామీ ! దేన్ని గురించి తెలుసుకున్నంత మాత్రంచేత సర్వమూ తెలుస్తాయో, దాన్ని నాకు వివరించండి" అని అడిగాడు. అదే బ్రహ్మవిద్య. పరబ్రహ్మ తత్త్వాన్ని గురించి వివరించమని అడిగాడు శౌనకుడు.

అదేవిధంగా ఛాందోగ్యోపనిషత్తులో శ్వేతకేతువు. విద్యాభ్యాసం పూర్తిచేశాడు. అంటే సగుణబ్రహ్మారాధనలో నిష్ణాతుడైనాడు. ఇప్పుడు తన తండ్రి అయిన ఉద్దాలకుణ్ణి నిర్గుణ బ్రహ్మను గురించి చెప్పమని అడుగుతున్నాడు.

తైత్తిరీయోపనిషత్తులో వరుణమహర్షి కుమారుడు భృగుమహర్షి. విద్యాభ్యాసం పూర్తిచేశాడు. కర్మాచరణలో నిష్ణాతుడు. ఇప్పుడు తండ్రియైన వరుణ మహర్షిని అడుగుతున్నాడు. బ్రహ్మవిద్యను బోధించమని.

ఈ రకంగా ఉపనిషత్తులలో ఎక్కడ చూసినా సగుణ బ్రహ్మారాధనలో నిష్ణాతుడైన వాడే నిర్గుణబ్రహ్మను గురించి ఆలోచిస్తాడు. ఎందుకంటే ముందుగా మనసు నిశ్చలం కావాలి. ఏకాగ్రత ఏర్పడాలి. కర్మానుష్ఠానము చెయ్యాలి. కర్మలవల్ల ఫలితం అనుభవించాలి. ఆ తరువాత కర్మలుచేసినా చెయ్యకపోయినా ఒకటే అనే భావన రావాలి. భగవంతుడి ప్రతిమను ఆరాధించవలసిన అవసరం లేదు. ఆ భగవంతుడు తనలోనే ఉన్నాడు. అనే భావన రావాలి. అప్పుడు భగవంతుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు. సర్వాంతర్యామి. ఎల్లఎడలా వ్యాపించి ఉన్నాడు. సర్వవ్యాపి అనే విషయం తెలుస్తుంది. అప్పుడు నిర్గుణభావంలోకి వెళ్ళినట్లైతే కొంత కాలానికి **'అహంబ్రహ్మాస్మి'** నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అనే విషయం తెలుస్తుంది. ఇప్పుడు భగవదారాధన అంటే తనను తాను పూజించుకోవటమే.

అందుచేత ముందుగా సగుణబ్రహ్మను గురించి చెప్పి ఆ తరువాత నిర్గుణబ్రహ్మను వివరిస్తారు.

పరబ్రహ్మను గురించి తెలుసుకోవాలనే కోరిక. ఈ కోరిక ఎప్పుడు కలిగింది? వ్యాసుడు బ్రహ్మసూత్రాలు ఎప్పుడు వ్రాశాడు? ముందుగా వేదాలను విభజించి వేదవ్యాసుడైనాడు. ఆ తరువాత వేదాలలో చెప్పిన విషయం అందరికీ అందుబాటులోకి రావాలనే తలంపుతో, అష్టాదశ పురాణాలు వ్రాశాడు. ఈ పురాణాలలో అనేక కథలు. ఆ కథలలో ధర్మసూత్రాలు. నీతిసూత్రాలు. భగవంతుడిని గురించిన స్తుతులు, స్తోత్రాలు. యజ్ఞయాగాది క్రతువులు పూజలు, వ్రతాలు వాటివల్ల వచ్చే ఫలితాలు. జ్ఞానబోధ. ఎవరో ఒక మహర్షి వచ్చి రాజుగారికి ఏదో సందర్భంలో బ్రహ్మపదార్థాన్ని వివరిస్తాడు. ఈ రకంగా వేదంలో చెప్పిన పర, అపరావిద్యలు రెండూ పురాణాలలో చెప్పబడ్డాయి. అంతదాకా ఎందుకు? పురాణాలు మానవుని మనుగడకు ఆధారాలు. ఆ రకంగా వేదాలసారాన్ని పురాణాలలో నిక్షిప్తం చేశాడు.

అయితే కొంతకాలానికి పరబ్రహ్మను గురించి అనేక ప్రశ్నలు తలఎత్తినాయి. వైశేషికులు, సాంఖ్యులు, చార్వాకులు వీరంతా తమయొక్క వాదనాపటిమతో

పరమేశ్వరుణ్ణి గురించి ప్రశ్నించారు. అసలు వేదాలేవని కొందరన్నారు. అప్పుడు వ్యాసమహర్షి బ్రహ్మసూత్రాలు వ్రాశాడు.

అంటే ముందుగా సగుణ బ్రహ్మను వివరించి కర్మానుష్ఠానము వల్ల వచ్చే ఫలితాలను చెప్పి, వాటివల్ల వచ్చే ఫలితాలు అశాశ్వతాలు. అని చెప్పి అప్పుడు పరబ్రహ్మ తత్త్వాన్ని బోధించాడు.

ఈ విధంగానే ముందు సగుణ బ్రహ్మను గురించి పూర్తిగా తెలుసుకుని, కర్మలను ఆచరించి, ఆ తరువాత నిర్గుణోపాసనవైపు మళ్ళాలి. ఇది సంప్రదాయం. లలితాసహస్రంలో కూడా ఈ కారణంచేతనే ముందుగా పరమేశ్వరి వైశిష్ట్యము, ఆమె స్థూల సూక్ష్మరూపాలను వర్ణించారు. రాక్షస సంహారం చేసి ఆమె భక్తులను ఏ విధంగా కాపాడుతుందో వివరించారు. తరువాత పరమేశ్వరిని అర్చించాలంటే విధానమేమటి? ఆచారమేమిటి? అంటూ కౌళసమయాచారా లను వివరించారు. అసలు పరమేశ్వరిని ఆరాధించటం ఎలా? ఆరాధిస్తే ఫలితము ఏమిటి? అనే విషయాలను వివరించారు. శాంభవీ ఇక్కడి వరకు సగుణ బ్రహ్మోపాసన పూర్తి అయింది. ఇక నిర్గుణ బ్రహ్మదగ్గరకు వెడుతున్నారు.

**నిరాకారము, నిర్గుణము అయిన పరాశక్తి సృష్టి చెయ్యాలనే సంకల్పంతో తన నుండి ఒక అంశను బయటకు పంపింది. ఆ అంశయే త్రిపురసుందరుడు అతడే సదాశివుడు. తాను త్రిపురసుందరి అయింది. వీరినే శివశక్తులు, కామకామేశ్వరులు, భువనేశ్వరీ భువనేశ్వరులు అంటున్నాం. వీరిద్దరూ శ్రీచక్రంలోని బిందువునందుంటారు.**

విద్యుత్తు ఒక మహాశక్తి. ఉత్పత్తి అయినప్పుడు అది శక్తిగానే ఉంటుంది. దానివల్ల లైట్లు వెలగవు. ఫ్యాన్లు తిరగవు. ఏ పనీ జరగదు. కాని అది ఫేజు, న్యూట్రల్ అని రెండు తీగలద్వారా ప్రవహించినప్పుడు అనంతమైనశక్తిగా పనిచేస్తుంది. ఇక్కడ ప్రధానమైనది ఫేజు. అలాగే పరబ్రహ్మకూడా ఒక దివ్యమైన, అద్భుతమైన శక్తి. కొన్నివేలకోట్ల సూర్యులకాంతి కలిగి ఉంటుంది. అందుకే ఆ పరబ్రహ్మ ముందు

**నతత్రసూర్యోభాతి నతత్రచంద్రతారకం**

సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు ఏవీ ప్రకాశించవు. అయితే పరబ్రహ్మ రెండుగా అయినప్పుడు, వారే శివశక్తులు. వీరివల్లనే జగస్సృష్టి అంతా జరుగుతోంది. వీరిలో ప్రధానమైనది శక్తి.

ఆ పరబ్రహ్మయే పరాశక్తి. సాకారమైతే త్రిపురసుందరి. నిరాకారమైతే పరాశక్తి. ఆమెను గురించి తెలుసుకోటానికే ఈ జిజ్ఞాస.

**ఆవిడే పరబ్రహ్మ స్వరూపిణి. హాదివిద్య, కాదివిద్య, సాదివిద్య, బ్రహ్మవిద్య.** ఈ విషయం లలితా సహస్రంలో 357-365 నామాలలో వివరించటం జరిగింది.

## బ్రహ్మవిద్య

విద్యలు రెండు రకాలు. 1. అపరావిద్య. 2. పరావిద్య. వీటినే లౌకికవిద్య, బ్రహ్మవిద్య అని కూడా అంటారు.

అపరావిద్య దీనివల్ల సంఘంలో ఉన్నతస్థితి పొందటము, ధనధాన్యాలు, భోగభాగ్యాలు, అధికారము, పుత్రపౌత్రాదిసంతతి, సిరిసంపదలు కలుగుతాయి. దీనిని అనుసరించేవారు పూజలు, వ్రతాలు, హోమాలు, అర్చనలు, తర్పణలు, యజ్ఞయాగాదులు చేస్తారు. భక్తుడు భగవంతుడు వేరువేరు అని వీరి భావన. భగవంతుణ్ణి గనక పూజించినట్లైతే భక్తులకు కావలసిన వరాలిస్తాడు అనేది వీరి నమ్మకం. ఆ కోరికల సాధనకోసమే వీరు భగవంతుణ్ణి అర్చిస్తారు. ఇది సగుణారాధన.

కర్మలు ఆచరించటంవల్ల పుణ్యలోకాలు వస్తాయి. ఉత్తమజన్మలు కలుగుతాయి. మరణానంతరము స్వర్గసౌఖ్యాలనుభవించి ఉత్తమజన్మ ఎత్తుతాడు. మళ్ళీ కర్మ చేస్తాడు. ఈ రకంగా కర్మలు చెయ్యటం, జన్మలు ఎత్తటం, మరణించటం చేస్తుంటాడు.

**పునరపి జననం పునరపి మరణం**

అంతేకాని అతడికి కర్మలవల్ల మోక్షం మాత్రంరాదు. మరి మోక్షం రావాలి అంటే పరావిద్యను ఆశ్రయించాలి. అదే బ్రహ్మవిద్య. ఇది నిర్గుణారాధన.

నిర్వికారుడు అయిన పరమేశ్వరుడు చరాచరజగత్తంతా ఆవరించి ఉన్నాడు. ఈ జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. ఛాందోగ్యోపనిషత్తులో సత్యకామజాబాలికి ఒక ముసలి ఆంబోతు చెబుతుంది. సత్యకామా పరబ్రహ్మ నాలుగుపాదాలుగా ఉంటుంది. అందులో మొదటిపాదం. ఈ విశాలవిశ్వంలో నాలుగుదిక్కులూ పరబ్రహ్మలో ఒక పాదం.

భూమి, ఆకాశం, సముద్రాలు, నదులు, పర్వతాలు పరబ్రహ్మలో రెండోభాగం అని అగ్ని చెబుతుంది.

అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు పరబ్రహ్మలో మూడోభాగం అని ఒక హంస చెబుతుంది.

ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రవణం బ్రహ్మ, మనస్సు బ్రహ్మ. ఇది నాల్గవపాదం. అని నీటిపక్షి చెబుతుంది. అలాగే ఉపకోశలుడికి ఆశ్రమంలోని అగ్నులు బ్రహ్మవిద్యను ఉపదేశం చేస్తూ

"ఉపకోశలా ! ప్రాణమే బ్రహ్మ, ఆకాశమే బ్రహ్మ, ఆనందమే బ్రహ్మ, భూమి సూర్యడు, చంద్రుడు, ఆ పరబ్రహ్మరూపాలే. సూర్యునిలో ఉన్న బ్రహ్మతత్త్వం, నీ లోఉన్న బ్రహ్మతత్త్వం నాలో ఉన్నతత్త్వం. అన్నీ ఒకటే. తూర్పు పడమర ఉత్తర దక్షిణాలు, నేల, నీరు, నింగి, నక్షత్రాలు, అన్నీ ఒకటే. ఆకాశంలోని మెరుపులో ఏతత్త్వమైతే ఉన్నదో అదే నీలోనూ నాలోనూ కూడా ఉన్నది" అంటాయి.

తైత్తిరీయోపనిషత్తులో వరుణ మహర్షి కుమారుడు భృగుమహర్షి. అపరావిద్యలో నిష్ణాతుడు. తండ్రి దగ్గరకు వచ్చి బ్రహ్మవిద్యను బోధించమని అడుగుతాడు. తండ్రి ఆజ్ఞమీద కొంతకాలం తపస్సుచేసి ఆ తరువాత తెలుసుకుంటాడు భృగువు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశాలనడుమ ఆనందమయకోశమున్నది అదే పరబ్రహ్మ నివాసస్థానము. ఆనందమే పరబ్రహ్మ స్వరూపము. లోకంలో సిరిసంపదలు, భోగభాగ్యాలు సుఖాలు అన్నీ ఆరోగ్యవంతుడు, ధనవంతుడు, వేదవేదాంగవిదుడు, కర్మిష్టి అయిన పురుషుడు అనుభవించటానికే ఉన్నాయి. అతడు అనుభవించే ఆనందం మానుషానందం.

| | | |
|---|---|---|
| మానుషానందానికి నూరురెట్లు | – | మానవగంధర్వానందం. |
| మానవగంధర్వానందానికి నూరురెట్లు | – | దేవగంధర్వానందం |
| దేవగంధర్వానందానికి నూరురెట్లు | – | పిత్రృదేవానందం |
| పిత్రుదేవానందానికి నూరురెట్లు | – | అజానజదేవానందం |
| అజునజదేవానందానికి నూరురెట్లు | – | కర్మదేవానందం |
| కర్మదేవానందానికి నూరురెట్లు | – | దేవానందం |
| దేవానందానందానికి నూరురెట్లు | – | ఇంద్రానందం |
| ఇంద్రానందానికి నూరురెట్లు | – | బృహస్పతి ఆనందం |

బృహస్పతి ఆనందానికి నూరురెట్లు - ప్రజాపతి ఆనందం

ప్రజాపతి ఆనందానికి నూరురెట్లు - బ్రహ్మానందం

ఇది శాశ్వతమైన ఆనందం.

ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యను బోధిస్తూ "జీవులు ఏరూపంలో ఉన్నప్పటికీ అనంతచైతన్య సముద్రంలో కలిసిపోయిన తరువాత వాటి నామరూపాలు పోగొట్టుకుంటాయి. అవి అన్నీ ఏ ఏతత్వంలో కలిసిపోతాయో. అదే బ్రహ్మ. అది అద్వితీయమైనది. సూక్ష్మమైనది సర్వవ్యాపకమైనది. తత్త్వమసి. అదే నీవు. శ్వేతకేతూ అదే నీవు" అంటాడు.

ముండకోపనిషత్తులో "ఒకే రూపము, పేరుగల పక్షులు రెండు ప్రపంచమనే వృక్షాన్ని ఆశ్రయించి ఉన్నాయి. అందులో ఒకటి జీవాత్మ. రెండవది పరమాత్మ. జీవాత్మ తన కర్మలవల్ల వచ్చిన ఫలితాలను అనుభవిస్తోంది. పరమాత్మ కర్మఫలం ఏమీ లేకుండా కూర్చుంది. శరీరమే ఆ వృక్షం. ఆ పక్షులే క్షేత్రజ్ఞ పరమాత్మలు. వారిద్దరూ వేరుకాదు. మాయలోపడిన జీవుడు తానూ పరబ్రహ్మ వేరనుకుంటాడు. కాని ఎప్పుడైతే ఆ మాయ తొలగిపోయిందో అప్పుడు ఆ జీవుడు పరమాత్మలో లీనమయిపోతాడు. అని చెప్పబడింది.

ఈ రకంగా ఉపనిషత్తులలో అనేకచోట్ల, అనేకసార్లు చెప్పబడింది బ్రహ్మవిద్య. దీని సారాంశం. జగత్తులోని జీవులన్నీ ఒక్కటే. ప్రాణమున్నవి ప్రాణంలేనివి, చలనమున్నవి, చలనములేనివి, కొండలు, బండలు, నదులు, సముద్రాలు, చెట్లు, చేమలు, క్రిమికీటకాలు, పశుపక్ష్యాదులు, జంతువులు, మృగాలు, మానవులు. వీరందరిలోని ఆత్మపదార్థం ఒక్కటే. అదే పరబ్రహ్మ.

కర్మలు ఆచరించటంవల్ల వచ్చే ఫలితం అశాశ్వతం. పుణ్యలోకాలు, స్వర్గసుఖాలు అన్నీ అశాశ్వతం. ఈ లోకంలో మనం పొందే ఆనందం అశాశ్వతం. శాశ్వతమైన ఆనందం ఒక్కటే. అదే బ్రహ్మానందం. అదే పరమేశ్వరుడు పొందే ఆనందం.

సగుణారాధనలో మాత్రమే బ్రహ్మానందం ఉంటుంది. నిర్గుణోపాసనలో ఉండదు. దేహాభిమానం లేని మహాజ్ఞాని కూడా జీవించి ఉండగానే ఈ ఆనందాన్ని పొందుతాడు.

ఈ రకంగా ఈ నామాలలో జీవాత్మ పరమాత్మ ఒకటే వేరుకాదు అనే అద్వైతసిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ మానవులు పొందే ఆనందం, ఆ పరమేశ్వరి పొందే బ్రహ్మానందంలో ఎన్నో వంతో చెబుతూ, శాశ్వతమైన ఆనందం పొందటానికి, ఆ పరమేశ్వరి తన భక్తులకు సాయపడుతుంది. అని చెప్పబడింది. ఆవిడే పరమేశ్వరి. పరాశక్తి, పరబ్రహ్మ.

ఆవిడే ఆత్మవిద్య, మహావిద్య, శ్రీవిద్య, బ్రహ్మవిద్య, మోక్షవిద్య. ఈ విషయం లలితా సహస్రంలోని 584–590 నామాలలో వివరించబడింది. ఆమెను గురించి తెలుసుకోటానికే ఈ జిజ్ఞాస.

## ఆత్మవిద్య

ముడిపదార్థం గురించి మనకు తెలిసినట్లైతే ఆ పదార్థంతో తయారయిన వస్తువుల గురించి తేలికగా తెలుస్తుంది. ఉదాహరణకు మట్టిని గురించి తెలిస్తే, మట్టితో తయారుచేసే కుండలు, బానలు, చట్లు, మొదలైన వస్తువులగురించి తెలుస్తుంది. అలాగే బంగారం గురించి తెలిస్తే దానితో తయారుచేసే నగల పేర్లు వేరయినా, వాటన్నింటిలోఉండేది బంగారమే అని తెలుస్తుంది. అదే విధంగా ఏ విషయం తెలుసుకోవటంవల్ల సర్వమూ తెలుస్తాయో, దాన్ని తెలుసుకోవాలి. ప్రతివిషయంలోనూ అంతర్గతంగా ఉండే తత్త్వాన్ని గనక తెలుసుకుంటే మిగిలిన విషయాలన్నీ తెలుస్తాయి.

నదులు తూర్పునుంచి పడమరకు ప్రవహించినా, పడమర నుంచి తూర్పుకు ప్రవహించినా, చివరకు అవి సముద్రంలోనే కలుస్తాయి. సూర్యరశ్మికి నీరు ఆవిరిగామారి మేఘాలరూపం ధరిస్తుంది. ఆ మేఘాలు మళ్ళీ వర్షించి నదులుగా ప్రవహిస్తాయి. ఆ నదులు మళ్ళీ సముద్రంలో కలుస్తాయి. సముద్రంలో కలిసేవరకు వాటికి గంగ, గోదావరి, కృష్ణ అని వివిధరకాల పేర్లుంటాయి. కాని సముద్రంలో కలిసిన తరువాత ఆ నదీజలాన్ని విడదియ్యలేము. అలాగే జీవించి ఉన్నంతవరకు మనిషి, పులి, సింహము, ఆవు, మేక ఇత్యాదినామాలుంటాయి. కాని మరణించిన తరువాత జీవి తన ఉనికిని కోల్పోతాడు. అన్ని జీవాత్మలూ ఆ పరాశక్తిలోని భాగాలే.

సృష్టి ఆరంభంకాకముందు, కృతయుగారంభంలో పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయి ఇతరులతో సంబంధం లేకుండా, తనకు సమానమైన వారుగాని, తనకన్న అధికులుగాని లేకుండా ఏకాకిగా ఉండేవాడు. ఈ రకంగా ఉన్న పరబ్రహ్మ బిందు స్వరూపుడు. ఆ ఏకత్వం అనేకం కావాలని సంకల్పించింది. రకరకాల వస్తువులుగా, చిత్ర విచిత్ర సమ్మేళనాలతో రూపుదాల్చింది. ఘన ద్రవ, వాయు పదార్థాలుగా మార్పు చెంది భిన్న రూపాలతో ఈ సృష్టి ఆకారం పొందింది. జీవరాశి ఉత్పన్నమయింది. సృష్టిలో భాగంగానే హకార సంజ్ఞ గలిగిన పరమేశ్వరుడు సకార సంజ్ఞ గలిగిన ప్రకృతితో కలిసి శబళబ్రహ్మమై బ్రహ్మరంధ్రం ద్వారా మానవ శరీరంలో ప్రవేశించి, ఇంద్రియాల ద్వారా ప్రాపంచిక సుఖాలననుభవిస్తూ పంజరంలోని పక్షిలాగా, ఈ దేహంలో బంధించబడి, బయటకు పోయే మార్గం తెలియక, కొట్టుమిట్టాడుతున్నాడు. జీవాత్మ అనబడే ఈ హంసకు

| | | |
|---|---|---|
| అగ్ని చంద్రమండలాలే | – | రెక్కలు |
| ఓంకారము | – | శిరస్సు |
| జ్ఞాననేత్రము | – | ముఖము |
| హకారసకారాలే | – | పాదాలు |

ఈ రకంగా పరమాత్మ అన్ని ప్రాణులలోనూ, పాలలో ఉన్న నెయ్యిలాగా ఆవరించి ఉన్నాడు. అన్ని జీవాత్మలూ ఆ పరమాత్మలోని భాగాలే. మర్రిచెట్టు చాలా పెద్ద వృక్షం. కాని దానికి కారణమైన విత్తనంలో చూస్తే ఏమీ కనిపించదు. అంటే విత్తనంలో అంత పెద్ద వృక్షానికి కారణమైనది, మనకంటికి కనిపించనంత సూక్ష్మంగా దాగి ఉన్నది. అదేవిధంగా ఆత్మ బయటకు కనిపించకుండా సూక్ష్మరూపంలో సర్వత్రా వ్యాపించి ఉన్నది. ఆత్మకు నాశం లేదు. ముసలితనం లేదు. ఆత్మకు పాపం అంటదు. శోకం తాకదు. ఆకలి దప్పికలు ఉండవు. స్వప్నప్రపంచంలో ప్రభువులాగా విహరించే చైతన్యమే ఆత్మ సుషుప్తిలో ఆనందాన్ని అనుభవించేదే ఆత్మ.

ప్రకాశబిందువు పరబ్రహ్మస్వరూపమైన చంద్రమండలం. అకారబీజం. విమర్శ బిందువు శక్తి బీజం. అగ్నిమండలం హకార బీజం. ఈ రెండింటి సామరస్యమే అహం. ఇదే పరబ్రహ్మ స్వరూపం. పరమేశ్వరి ప్రతిబింబమే శక్తి. అదే మాయ.

అందుచేతనే శక్తి లేకుండా శివుడుగాని, శివుడు లేకుండా శక్తిగాని ఉండవు. ఇక్కడ శివశక్తులు అంటే త్రిమూర్తి ద్వంద్వంలోని వారు కాదు. పరమేశ్వరీ పరమేశ్వరులు. వీరిద్దరి కలయిక లేనిదే స్వరూపజ్ఞానం కలగదు. అహమనేది ఆత్మరూపం. ఇదే ఆత్మమంత్రం. ఆత్మమంత్రము, హంసమంత్రము రెండూ సమాన ధర్మాలు కలిగి ఉన్నాయి.

శరీరం అశాశ్వతమైనది. శాశ్వతమైన ఆత్మకు అశాశ్వతమైన శరీరం ఆవాసంగా ఉంటుంది. శరీరం ఉన్నంతకాలము ఆత్మకు గుణదోషాలు, సుఖ దుఃఖాలు అంటినట్లు, వాటితో శతమతమవుతున్నట్లూ అనిపిస్తుంది. ఆత్మ శరీరంతో సంబంధం ఏర్పరచుకోవటం వల్ల జీవులకు సుఖ దుఃఖాలతో సంబంధం ఏర్పడుతుంది. మానవుడు మాసిన వస్త్రాన్ని వదిలి నూతనవస్త్రాన్ని ధరించినట్లే ఆత్మజీర్ణమైన ఈ దేహాన్ని వదిలి ఇంకొక దేహాన్ని ఆశ్రయిస్తున్నది. ఆత్మ శరీరంనుంచి విడిపోతే భౌతిక బంధనాల నుండి విముక్తి కలుగుతుంది.

**శ్రీవిద్య అనేది ఆత్మవిద్య. అదే బ్రహ్మవిద్య. అందులో షోడశి మహామంత్రము మోక్షకారకము. ఆ మంత్రాధిదేవత సాక్షాత్తూ పరబ్రహ్మస్వరూపము. ఆవిడే పరాశక్తి.**

ఆత్మవిద్యయే శ్రీవిద్య. అదే మహాషోడశి అని చెప్పి 584 నుంచి 590వ నామం వరకు ఆత్మవిద్యను వివరిస్తున్నారు.

శ్రీవిద్యలో సగుణబ్రహ్మ అంటే లలితాత్రిపురసుందరిని ఆరాధించేవారు పంచదశి మహామంత్రాన్ని, మోక్షవాదులు మహాషోడశిని ఉపాశిస్తారు.

ఆత్మవిద్యా స్వరూపమైన ఆ పరాశక్తిని గురించి తెలుసుకోవాలనేదే ఈ జిజ్ఞాస. సగుణంలో లలితా త్రిపుర సుందరి. నిర్గుణంలో పరాశక్తి. ఆవిడే మోక్షాన్నిచ్చే పరబ్రహ్మ.

ఈ రకంగా హాదివిద్య, కాదివిద్య, సాదివిద్య, శ్రీవిద్య, బ్రహ్మవిద్య, మహావిద్య, ఆత్మవిద్య, కామ్యవిద్య, మోక్షవిద్య, అన్నీ ఆవిడే. ఆ పరాశక్తియే సృష్టిస్థితిలయకారిణి, పంచకృత్య పరాయణ. ఆవిడే పరబ్రహ్మ స్వరూపం. నిరాకారంలో పరాశక్తి. సాకారంలో లలితాత్రిపురసుందరి. ఆమె సాధకుడికి మహదైశ్వర్యము, బ్రహ్మానందము, మోక్షము కూడా ప్రసాదిస్తుంది. ఆమెను తెలుసుకోవాలనే కోరిక అదే బ్రహ్మజిజ్ఞాస.

# 2. జన్మాద్యధికరణము (పరబ్రహ్మ లక్షణాలు)

***సూత్రం - 2 “జన్మాద్యస్య యతః”***

జగత్తు యొక్క సృష్టి స్థితి లయాలు దేనివలన కలుగుతున్నాయో అదే బ్రహ్మము.

మొదటి సూత్రంలో బ్రహ్మజిజ్ఞాస ఎందుకో చెప్పారు. ఇప్పుడు రెండవ అధికరణలో పరబ్రహ్మ లక్షణాలు చెబుతున్నారు దీన్నే **‘జన్మాద్యధికరణము’** అంటారు. ఇందులో కూడా ఒక్క సూత్రమే ఉంది.

చరాచరజగత్తు అంతా ఎవనివల్ల నడపబడుతుందో, ఎవనివల్ల సృష్టిస్థితి లయాలు జరుగుతున్నాయో అతడేపరబ్రహ్మ. ఆ పరబ్రహ్మ యొక్క లక్షణాలు ఏవి? అనే విషయం వివరిస్తున్నాడు వ్యాసుడు ఈ సూత్రంలో

పరబ్రహ్మ లక్షణాలు ఏవి? అనేది అనేకసార్లు ఉపనిషత్తులలోను, పురాణాలలోను కూడా వివరించబడింది. **ఎవ్వనిచే జనించు జగము, ఎవ్వని లోపల నుండు లీనమై.** ఆ పరమేశ్వరియే ఈ జగత్తుకు సృష్టికర్త. సృష్టికి ముందు ఈ జగత్తంతా ఆ పరాశక్తిలోనే లీనమై ఉన్నది. తనలో అంతర్గతంగా ఉన్న సృష్టిని బహిర్గతం చేసింది. అందుకే ఒకపరి జగముల వెలినిడి, ఒకపరి లోపలికి గొనుచు తనలో దాగి ఉన్నటువంటి లోకాలన్నింటిని బయటకు పంపుతున్నది. అంటే సృష్టి చేస్తున్నది అలాగే ఈ లోకాలను తనలోపలికి తీసుకుంటున్నది. అనగా జగత్తును లయం చేస్తున్నది. ఈ రకంగా సృష్టి, లయము రెండూ చేస్తూ, జగములు ప్రవర్తిల్ల చేస్తున్నది. అనగా స్థితికార్యం కూడా చేస్తున్నది. ఇదే విషయాన్ని **తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పటం జరిగింది.

**యతోవా ఇమాని భూతాని జాయంతే ।**

**యేన జాతాని జీవంతి, యత్ప్రయత్యభిసంవిశంతి ॥**

**తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి**

జీవులు దేని నుంచి పుడుతున్నాయో, దేనివల్ల జీవిస్తున్నాయో, చివరకు దేనియందు లీనమవుతున్నాయో, అదే బ్రహ్మము అని తెలుసుకో.

**భృగుర్వై వారుణిః। వరుణం పితర ముపససార। అధీహి భగవో బ్రహ్మేతి। తస్మా ఏతత్ ప్రోవాచ। అన్నం ప్రాణం చక్షుః శ్రోత్రం మనో వాచమితి తగ్ం హోవాచ। యతో వా ఇమాని భూతాని జాయన్తే। యేన జాతాని జీవన్తి। యత్ ప్రయన్త్యభిసం విశన్తి। త ద్విజిజ్ఞాసస్వ। తద్బ్ర హ్మేతి। స తపోతప్యత। సతప స్తప్త్వా॥ 1**

వరుణ మహర్షి కుమారుడు భృగుమహర్షి. విద్యాభ్యాసం పూర్తి చేసి తండ్రి దగ్గరకు వచ్చి బ్రహ్మవిద్యను చెప్పమని అడిగాడు. ఆ మాటలు విన్న వరుణమహర్షి 'నాయనా ! జీవులన్నీ దేని నుంచి పుట్టి, దేనివల్ల జీవించి, దేనియందు లయం చెందుతున్నాయో అదే పరబ్రహ్మ. ఇది ఒకరు చెబితే తెలిసేది కాదు. వెళ్ళి తపస్సు చెయ్యి' అన్నాడు. తండ్రి మాటల ననుసరించి కొంత కాలం తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు

**అన్నం బ్రహ్మేతి వ్యజానాత్। అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే। అన్నేన జాతాని జీవన్తి। అన్నం ప్రయన్త్యభిసంవిశంతీతి। తద్విజ్ఞాయ పునరేవ వరుణం పితరముపససార। అధీహి భగవో బ్రహ్మేతి। తగ్ంహోవాచ। తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ॥ తపో బ్రహ్మేతి। స తపోఽ తప్యత। స తప స్తప్త్వా॥ 2**

అన్నం పరబ్రహ్మ స్వరూపము అని తెలిసింది. అదే మాట తండ్రికి చెప్పాడు. 'అన్నం కూడా పరబ్రహ్మ స్వరూపమే. కాని అన్నమే పరబ్రహ్మ కాదు. మళ్ళీ వెళ్ళి తపస్సు చెయ్యి' అన్నాడు తండ్రి.

**ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్। ప్రాణాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే। ప్రాణేన జాతాని జీవన్తి। ప్రాణం ప్రయన్త్యభిసంవిశ న్తీతి। తద్విజ్ఞాయ। పునరేవ వరుణం పితరముపససార। అధీహి భగవో బ్రహ్మేతి తగ్ం హోవాచ। తపసా బ్రహ్మవిజిజ్ఞా సస్వ। తపో బ్రహ్మేతి। స తపోఽ తప్యత। స తప స్తప్త్వా॥ 3**

కొంత కాలం తపస్సు చేశాడు భృగువు. ప్రాణము పరబ్రహ్మ అని తెలిసింది. అదే మాట తండ్రికి చెప్పాడు. 'ప్రాణం కూడా పరబ్రహ్మమే. కాని ప్రాణమే పరబ్రహ్మ కాదు. మళ్ళీ వెళ్ళి తపస్సు చెయ్యి.' అన్నాడు తండ్రి.

**మనో బ్రహ్మేతి వ్యజానాత్ । మనసో హ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే।**
**మనసా జాతాని జీవన్తి । మనః ప్రయన్త్యభిసంవిశ న్తీతి । తద్విజ్ఞాయ**
**పునరేవ వరుణం పితర ముపససార అధీషి భగవో బ్రహ్మేతి ।**
**తగ్ంహోవాచ తపసా బ్రహ్మవిజిజ్ఞాసస్వ । తపో బ్రహ్మేతి । స తపో౽**
**తప్యత । స తప స్తప్త్వా ॥ 4**

మళ్ళీ కొంత కాలం తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు మనస్సే పరబ్రహ్మ అని తెలిసింది. అదే మాట చెప్పాడు తండ్రికి. 'మనసుకూడా పరబ్రహ్మమే. కాని మనసే పరబ్రహ్మ కాదు. మళ్ళీ వెళ్ళి తపస్సు చెయ్యి' అన్నాడు తండ్రి.

**విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్ । విజ్ఞానాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే।**
**విజ్ఞానేన జాతాని జీవన్తి । విజ్ఞానం ప్రయన్త్యభిసంవిశ న్తీతి । తద్విజ్ఞాయ।**
**పునరేవ వరుణం పితరముపససార । అధీహి భగవో బ్రహ్మేతి ।**
**తగ్ంహోవాచ । తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ తపో బ్రహ్మేతి । స తపో౽**
**తప్యత । స తప స్తప్త్వా ॥ 5**

ఇంకా కొంతకాలం తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు విజ్ఞానమే బ్రహ్మ అని తెలిసింది. అదే మాట చెప్పాడు తండ్రికి. 'విజ్ఞానం కూడా పరబ్రహ్మమే. కాని విజ్ఞానమే పరబ్రహ్మ కాదు. మళ్ళీ వెళ్ళి తపస్సు చెయ్యి' అన్నాడు.

**ఆనందో బ్రహ్మేతి విజానాతు**
**ఆనందాద్ధ్యేన ఖల్విమాని భూతాని జాయంతే**
**ఆనందేనజాతాని జీవంతి**
**ఆనందం ప్రయన్త్యభిసంవిశంతీతి**

ఆనందం నుంచే జీవులన్నీ పుడుతున్నాయి. ఆనందంతోనే బ్రతుకుతున్నాయి. చివరకు ఆనందంలోనే లీనమవుతున్నాయి. కాబట్టి ఆనందమే పరబ్రహ్మ. ఆ మాట

వినగానే సంతోషించాడు తండ్రి. కుమారుడికి బ్రహ్మోపదేశం చేశాడు. సమస్త భూతాలు, సమస్త ప్రాణులు ఎవరివలన పుట్టి, ఎవరివలన జీవించి, ఎవరియందు లయం అవుతాయో అతడే బ్రహ్మ అన్నాడు. ఆ పరబ్రహ్మ ఆదిమధ్యాంత రహితుడు, జన్మమృత్యుజరాదులు లేనివాడు. **సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ.** అతడు సత్యస్వరూపుడు. జ్ఞానరూపుడు. అనంతుడు. దేశకాల వస్తుకృతమైన మార్పులు లేనివాడు. జగత్తుకు ఆధారమైనవాడు.

పరమాత్మ నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు. అనగా దేనియందు ఆసక్తి లేనివాడు కదా ! మరి అలాంటప్పుడు సృష్టిస్థితిలయాలు ఎందుకు చేస్తున్నాడు? వీటితో అతడికి సంబంధం ఏమిటి? అసలు సృష్టి చెయ్యటమనేది అతని లక్షణమా? లేక తన వినోదం కోసం చేస్తున్నాడా? ఇది అనుమానం. దీనికి సమాధానం చూడండి.

భగవంతుడు ఆకారం లేనివాడు. ఇచ్ఛారహితుడు. గుణరహితుడు అనేది నిజమే. అయితే ఈ సృష్టి ఎందుకు చేస్తున్నాడు అన్నదే ప్రశ్న. నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ ఈ సృష్టి చెయ్యాలి అనుకున్నటువంటి వాడై తనలోని కొంతశక్తిని బయటకు పంపాడు. అయితే అసలు సృష్టి చెయ్యాలని ఎందుకు అనుకున్నాడు? గతంలో ప్రళయం సంభవించినప్పుడు కర్మ పరిపక్వం కాకుండా తనలో లీనమై పోయిన జీవరాశుల యొక్క కర్మను క్షయం చేసి, వాటికి మోక్షం కలిగించాలనే ఆలోచనతో సృష్టి చెయ్యాలని సంకల్పించాడు" అయితే కర్మపరిపక్వం కాని జీవరాశులు పరబ్రహ్మలో ఏ విధంగా లీనమైనాయి?

జగత్తంతా లయం అయిపోగానే జీవరాశి అంతా నశించిపోయింది. వస్తుజాలము రూపుమాసిపోయింది. ఈ పరిస్థితిలో కర్మక్షయం చెందిన జీవరాశులు పరమాత్మలో లీనమయిపోయినాయి. అంటే సాయుజ్యం పొందినాయి. మరి కర్మక్షయం కాని జీవుల సంగతి ఏమిటి? కర్మఫలాన్ని అనుభవించటానికి మళ్ళీ జన్మ ఎత్తాలి కదా ! మరి అవి ఏ విధంగా పరబ్రహ్మలో లీనమైపోతాయి? అన్నదే ప్రశ్న. ప్రళయ కాలంలో కర్మక్షయం అయిన జీవరాసితో పాటు కర్మక్షయం చెందని జీవులు తమయొక్క కర్మను తమతోపాటుగా మూటకట్టుకుని పరమేశ్వరునిలో లీనమవుతాయి. ఈ రకంగా కర్మక్షయం కాకుండా తనలో ఉన్న జీవరాశులు కర్మలను క్షయం చేసి వాటికికూడా మోక్షం ప్రసాదించాలనే కోరికతో సృష్టి కార్యక్రమము

చేస్తున్నాడు పరబ్రహ్మ. కాబట్టి చరాచర జగత్తును సృష్టించటము అనేది జీవులకు మోక్షము ప్రసాదించటానికే కాని తన లీలా వినోదం కోసం మాత్రం కాదు. అసలు పరమేశ్వరుడికి లీలావినోదం అనేది ఉండదు. ఈ రకంగా సృష్టిస్థితిలయాలు చెయ్యటం పరమేశ్వరుని యొక్క లక్షణమే కాని వేరు కాదు.

సృష్టి చెయ్యటము పరమేశ్వరుని లక్షణమే. **ఐతరేయోపనిషత్తు**లో ఈ విషయం పూర్తిగా వివరించబడింది. "ఆత్మయే ఆలోచనా పూర్వకంగా ఈ లోకాలను సృష్టించింది. సృష్టి జరగటానికి ముందు జగత్తు అంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏదీ లేదు. దానినే 'ఆత్మ' అంటారు. ఆ ఆత్మయే లోకాలను సృష్టించాలి అనుకున్నది. కొంతకాలానికి అంభస్సు, మరీచి, ఆపః, మర అనే పేర్లు గల లోకాలను సృష్టించింది.

ద్యులోకానికి ఆవల ఉన్నది అంభస్సు. దానికి ఆశ్రయము సువర్లోకము. అదే స్వర్గము. దానిక్రింద భువర్లోకమున్నది. దాని క్రింద భూలోకమున్నది. ఇది మరము. అనగా మరణము గుణముగా గలది. ఇక్కడ పుట్టిన ప్రతిప్రాణీ మరణిస్తుంది. భూలోకానికి క్రిందగా జలలోకమున్నది. అది క్రిందనున్న లోకాలచే పొంద బడుతున్నది. కాబట్టి అపోలోకమనబడుతుంది. ఈ లోకాలన్నీ పంచభూతాలచే నిర్మించబడ్డాయి. ఈ రకంగా లోకాలను సృష్టించిన తరువాత విరాట్ స్వరూపాన్ని, ఇంద్రియాలను, ఇంద్రియాలకు అధిష్టాన దేవతలను సృష్టించింది పరమేశ్వరి. ఆ తరువాత అన్నాన్ని సృష్టించింది. ఇప్పుడు ప్రాణికోటిని సృష్టించింది. ఈ మానవ శరీరంలో నేను లేకపోతే ఎలాగ? అని ఆలోచించి బ్రహ్మరంధ్రం గుండా మానవశరీరంలో ప్రవేశించింది. ఈ రకంగా ఆత్మ లోకాలను, ప్రాణికోటిని సృష్టించి మానవులందరి లోనూ కూడా తాను ప్రవేశించింది. పరబ్రహ్మయే ఈ లోకాలను సృష్టించింది. ఈ రకంగా **సృష్టి చెయ్యటము అనేది బ్రహ్మయొక్క లక్షణము"**

సృష్టిలో మనకు కనుపించే ప్రతివస్తువూ పరిమితమైనది. నాశనమయ్యేది. అశాశ్వతమైనది. బ్రహ్మము దీనికి వ్యతిరేక లక్షణాలుగల శుద్ధ, బుద్ధ ముక్తస్వభావం గలది. ఇట్టి బ్రహ్మస్వరూపం ఎవరికీ అంత తేలికగా తెలిసేది కాదు గదా? ఇలా అంటే బ్రహ్మమనేది అప్రసిద్ధమైనది. ప్రసిద్ధమైన దానికే లక్షణాలుంటాయి. మరిబ్రహ్మ

అప్రసిద్ధమైనది కదా? దానికి లక్షణము ఉండదు కదా?" ఇది అనుమానం. **తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పినట్లుగా నామరూపాత్మకమైన జగత్తు అంతా కూడా పరబ్రహ్మ వల్లనే జరుగుతున్నది. ఈ రకంగా సృష్టించబడిన జగత్తుకు ఉపాదాన కారణము, నిమిత్త కారణము రెండూ కూడా బ్రహ్మమే.

ఉపాదాన కారణము అనగా – ప్రధాన కారణము

నిమిత్త కారణము అనగా – ఉపకారణము

చిత్రకారుడు ముందుగా చిత్రాన్ని మనసులో ఊహించుకుని, తరువాత చిత్రాన్ని గీసినట్లే, పరబ్రహ్మ కూడా నామరూపాత్మకమైన జగత్తును ముందుగానే ఊహించి తరువాతనే సృష్టిస్తున్నాడు. పరబ్రహ్మ సర్వశక్తి సంపన్నుడు. అందుచేతనే అనేక పేర్లు, రూపాలు, కర్తలు, భోక్తలు, క్రియాఫలాలు గల ఈ జగత్తును సృష్టిస్తున్నాడు. కాబట్టి ఈ సృష్టికి కారణము బ్రహ్మ. సృష్టి అనేది అతనిలక్షణం.

**"జాయతే అస్తి పరిణమతే వర్ధతే క్షీయతే వినశ్యతి"**

అని సృష్టి పరిణామము ఆరు విధాలుగా 'నిరుక్తం'లో చెప్పబడింది. నిరుక్తము అంటే వేదానికి నిఘంటువు. అందులో

| | | |
|---|---|---|
| జాయతే | – | పుడుతున్నది |
| అస్థి | – | అస్థిత్వము పొందుతున్నది |
| పరిణమితే | – | పరిణామాన్ని పొందుతున్నది |
| వర్ధతే | – | వర్ధిల్లుచున్నది. పెరుగుచున్నది |
| క్షీయతే | – | క్షీణిస్తున్నది |
| నశ్యతి | – | నశించుచున్నది |

అయితే ఈ ఆరు దశలు ఒకదానితో ఒకటి కలిసి మొత్తం మూడే అవుతాయి.

| | | |
|---|---|---|
| పుట్టుక, అస్థిత్వము | – | సృష్టి |
| పరిణామము పొందటము | | |
| వర్ధిల్లటము | – | స్థితి |
| క్షీణించటము, నశించటము | – | లయము |

ఈ రకంగా ఈ ఆరు దశలూ, రెండు రెండు దశలు కలిసిపోయి మొత్తం మూడు దశలు అవుతున్నాయి. అవే సృష్టి, స్థితి లయాలు. వీటన్నింటికీ కారణం పరబ్రహ్మ."

సృష్టి స్థితి లయాలకు కారణం పరబ్రహ్మ అంటున్నారు. మరి ఇతర మతస్తులు అంటే సాంఖ్యులు, శూన్యవాదులు మొ॥ వారు ఒప్పుకుంటారా?" అనేది అనుమానం.

"**సాంఖ్య మతం**లో సృష్టికి కారణం 'ప్రకృతి'. అయితే ప్రకృతి జడము. కాబట్టి జడంవల్ల ఈ సృష్టి జరగదు. **శూన్యవాదులు** సృష్టి స్థితి లయాలకు కారణం 'శూన్యం' అంటారు. కాని శూన్యమనేది అభావరూపం. జగత్తు భావరూపం. ఇసుక నుండి నూనెరానట్లే అభావంనుంచి భావం ఉత్పత్తి కాదు.

**అణువాదులు** ఈ జగత్తంతా అణువులచేత నిర్మించబడినది అంటారు. అణువులు జడములు. కాబట్టి జడములైన అణువులు తమంత తాము సృష్టి చెయ్యలేవు. **నైయాయికులు** అంటే న్యాయశాస్త్రం తెలిసినవారు సృష్టి స్థితి లయాలకు కారకుడుగా ఈశ్వరుణ్ణి అనుమాన ప్రమాణంతో నిరూపిస్తారు.

ఎవరు ఏం చెప్పినప్పటికీ సృష్టి స్థితి లయాలకు పరమేశ్వరుడే కారణము. సాలెపురుగు తన నోటిలో నుండి వచ్చిన దారంతో గూడుఅల్లి మళ్ళీ దాన్ని తన నోటిలోకి తీసుకున్నట్లు గానే పరమేశ్వరుడు ఈ జగత్తును సృష్టించి మళ్ళీ తనలో లీనం చేసుకుంటాడు. అక్షర స్వరూపుడైన పరబ్రహ్మనుంచే ఈ జగత్తు సృష్టించబడి మళ్ళీ అతనిలో లీనమై పోతున్నది.

అవిద్య ఆవరించటం వల్ల మానవుడు ఈ విషయం తెలుసుకోలేకపోతున్నాడు. అటువంటి అజ్ఞానికి గనక ఎవరైనా ఒక గురువు జ్ఞానోదయం చేసినట్లైతే అతడు ఆత్మస్వరూపాన్ని పొంది దుఃఖము నుంచి విముక్తుడౌతాడు. మరి ఆత్మజ్ఞానం పొందటం ఎలా? ఈ విషయం **ఛాందోగ్యోపనిషత్తు**లో వివరించబడింది.

ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానం పొందే మార్గం వివరిస్తున్నాడు.

"నాయనా ఒక మనిషిని కళ్ళకు గంతలు కట్టి, చేతులు కదలకుండా కట్టేసి దట్టమైన అరణ్యంలో త్రోవ తెలియని చోట వదిలేశామనుకో, అప్పుడు అతడు ఏం

చేస్తాడు? పెద్దగా అరుస్తాడు. త్రోవ కనపడదు. భయపడతాడు. ఏడుస్తాడు. ఇప్పుడు ఎవరైనా వచ్చి కళ్ళగంతలు విప్పేశారనుకో. అప్పుడు అతడు దోవ వెతుక్కుంటూ కనిపించిన వారిని తన ఇంటికి దోవ అడుగుతూ చివరకు ఇల్లు చేరగలుగుతాడు. అదే విధంగా అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతున్న మానవుడు తన లక్ష్యమైన ఆధ్యాత్మిక సాధన కోసమే ప్రయత్నించాలి. మనం వేసే ప్రతి అడుగుకూ గమ్యం ఆత్మే కావాలి. అప్పుడు అతడికి ఆత్మసాక్షాత్కారం జరిగి అతడే పరబ్రహ్మ అవుతాడు."

ఈ రకంగా సృష్టి స్థితి లయాలకు ఉపాదాన, నిమిత్త కారణము పరబ్రహ్మే. అంటే పరాశక్తి అనే విషయం ఈ సూత్రం-2 లో వివరించబడింది"

## పంచకృత్యములు

కృత్యములు అంటే చేయదగినవి. నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ బిందురూపంలో ఉన్నాడు. అతడు బిందురూపంలోనే ఉన్నాడు. ఇంకేరూపంలోనూ లేడు అనే విషయాన్ని మనం మరిచిపోకూడదు. అయితే పరబ్రహ్మ బిందురరూపంలోనే ఎందుకున్నాడు ? అన్నది సందేహము. పరమాత్మ చరాచరజగత్తంతా వ్యాపించి ఉన్నాడు. కంటికి కనపించేదంతా పరబ్రహ్మస్వరూపమే. కంటికి కనిపించేది భూగోళం. భూగోళమంతా పరబ్రహ్మమయం. భూమి గుండ్రంగా ఉన్నది. అందుచేతనే ఈ జగత్తంతా వ్యాపించి ఉన్న పరమేశ్వరుడు కూడా బిందురూపంలోనే ఉన్నాడు.

పరమేశ్వరుడు పూర్ణస్వరూపుడు. ఆ విధంగా పూర్ణస్వరూపంగలది బిందు వొక్కటే. 360 డిగ్రీలు ఉంటే వృత్తం అవుతుంది. అంతకుమించి ఇంకొక డిగ్రీలేదు. అంతకు తక్కువ ఉంటే అది వృత్తం కాదు. అది పూర్ణత్వానికి ప్రతీక. అందుకే పరమేశ్వరుడు బిందురూపంలో ఉన్నాడు. ఈ రెండు కారణాలచేత పరబ్రహ్మ బిందురూపంలో ఉన్నాడని చెప్పటం జరిగింది.

మహాప్రళయంలో ఈ జగత్తంతా నశించిపోయింది. అంటే ఏమీలేదు. అంతా శూన్యంగా ఉంది. అలా కొంతకాలం జరిగిన తరువాత గతంలో ప్రళయం సంభవించి నప్పుడు కర్మక్షయం కాకుండా తనలో కలిసి ఉన్నటువంటి జీవరాశికంతటికీ

కర్మక్షయంచేసి, వారికి మోక్షం కల్పిద్దామనే ఉద్దేశ్యంతో ఆ పరమేశ్వరి సృష్టి చెయ్యాలని సంకల్పించింది. అంతేగాని తన లీలావినోదం కోసంమాత్రం కాదు. ఆ రకంగా సృష్టి చెయ్యాలనుకున్నదై ముందుగా తనలో నుంచి ఒక అంశని బయటకు పంపింది అతడే త్రిపురసుందరుడు సదాశివుడు అనబడతాడు. తాను త్రిపురసుందరి. వారే శివశక్తులు. కామేశ్వరీ కామేశ్వరులు వారి వల్లనే ఈ జగత్తంతా ఆవిర్భవించింది. అందుచేత ఈ జగత్తుకు జన్మస్థానం ఆ శక్తే. ఇప్పుడు సృష్టి ఆరంభమైంది. 'విశ్వరూపా' అనే నామంలో వివరించినట్లుగా ముందు అవ్యక్తము పుట్టింది. దాని నుంచి మహత్తు, దాని నుంచి అహంకారము. అహంకారం నుంచి ముందుగా తన్మాత్రలు వాటి నుంచి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు వచ్చినాయి. తన్మాత్రలనుంచి వాటి స్థూలరూపమైన పంచభూతాలు ఆవిర్భవించినాయి. ఇప్పుడు పంచభూతాలు, తన్మాత్రలతో కారణఉపాధులతో కూడిన చైతన్యము కలిసి నామరూపాత్మకమైనజగత్తు ఏర్పడింది. ముందుగా రూపాత్మకమైన జగత్తు. అంటే అడవులు, కొండలు, పర్వతాలు 84 లక్షల జీవరాసి ఏర్పడ్డాయి. నామాత్మకమైన జగత్తు అంటే ముందుగా పరమేశ్వర స్వరూపమైన ఓంకారము. దాని నుంచి – అక్షరసమామ్నాయము, వాటి నుంచి – పదాలు, మాటలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు, సంగీత సాహిత్యాలు. ఈ రకంగా నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది.

ఈ సృష్టికి ముందుకాలంలో పరమేశ్వరుడు బిందువుగా ఉన్నాడు. అతని నుంచి కొంతశక్తిని బయటకు పంపాడు. ఇప్పుడు చిన్న సందేహం. పరమేశ్వరునిలోంచి కొంతశక్తి బయటకుపోతే, అతని బిందుత్వానికి ఆటంకం ఏర్పడలేదా ? దానికి సమాధానం–లేదు. అలా జరగదు. బిందువులోంచి కొంతభాగం బయటకుపోయినా, లేక మరికొంతభాగం బిందువుకు కలసినా దాని బిందుత్వానికి ఏమాత్రం విఘాతం కలగదు. ఇప్పుడు శూన్యాకారంలో ఈ పరాశక్తి ఒక్కటే ఉంది. అప్పుడు ఆమె సృష్టి చెయ్యటానికి

**సంహారశ్చహరాయత్తః ఉత్పత్తిర్భవనిర్మిత రక్షాతుమృడసంలగ్నా**

సృష్టికారకుడు – బ్రహ్మ, స్థితికారకుడు – విష్ణువు, లయకారకుడు – రుద్రుడు. వీరు ముగ్గిరినీ తానే సృష్టించింది.

దేవీ భాగవతంలో మధుకైటభుల సంహారం తరువాత పరమేశ్వరి బ్రహ్మతో "నువ్వు సృష్టి కార్యం చెయ్యి. శివకేశవులిద్దరూ నీకు సహాయకారులుగా ఉంటారు" అని చెప్పి, మహాకాళి మహాలక్ష్మి, మహాసరస్వతులను సృష్టించి 'వీరు నా ప్రతిరూపాలు. సృష్టి కార్యక్రమంలో మీకు సహాయంగా ఉంటారు. వాళ్ళని మీరెప్పుడూ అవమానించవద్దు. ఇక వెళ్ళి మీ స్థావరాలు ఏర్పాటు చేసుకుని సృష్టి చెయ్యండి అని చెబుతుంది.

ఈ రకంగా తన అంశలే అయిన త్రిమూర్తులద్వారా సృష్టి ప్రారంభించింది. అందుచేతనే సృష్టి చేసేటప్పుడు బ్రహ్మగా, స్థితిలో విష్ణువుగా, లయం చేసేటప్పుడు రుద్రుడుగా, ఆ తరువాత ఈశ్వరుడుగా, సదాశివుడుగా సృష్టి, స్థితి, లయ, తిరోదాన అనుగ్రహములు అనబడే పంచకృత్యాలను ఆ పరాశక్తే చేస్తుంది. **'సౌందర్యలహరి'**లో 24వ శ్లోకంలో

**జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే**

**తిరస్కుర్వ న్నేతత్స్వమసి వపురీశ స్తిరయతి**

**సదాపూర్వ స్సర్వం తదిద మనుగృహ్ణాతి చ శివః**

**తవాజ్ఞా మాలంబ్య క్షణచలితయో ర్భ్రూ లతికయోః ॥**

ఓ తల్లీ ! సృష్టికర్తయైన బ్రహ్మ చరాచర జగత్తును సృష్టి చేస్తున్నాడు. విష్ణువు రక్షిస్తున్నాడు. రుద్రుడు సంహారము చేస్తున్నాడు. ప్రళయకాలమందు వీరు ముగ్గురూ మహేశ్వరునిలో కలిసిపోగా, అతడు సదాశివునిలో అంతర్భూతుడవుతున్నాడు. ఆ తరువాత సదాశివుడు కనులతో నీవుచేసిన సంజ్ఞ ప్రకారము బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరులను మళ్ళీ సృష్టిస్తున్నాడు.

ఈ సృష్టిలో పంచబ్రహ్మలు ఉన్నారు. వారు బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు మహేశ్వరుడు, సదాశివుడు. **దక్షిణామూర్తిసంహిత**లో చెప్పినట్లుగా వీరందరూ పరమేశ్వరి పుత్రులు.

**బ్రహ్మ విష్ణు మహాదేవా అస్యాః పుత్రా వరాననే**

**చతుర్థో౽హం మహేశాని స్తుత స్తస్యా మహేశ్వరః**

**తస్యోపరి బ్రహ్మరూపే స్వయం సాక్షాస్సదాశివః ॥**

ఆ పరమేశ్వరికి బ్రహ్మ జ్యేష్ఠపుత్రుడు. అతడు సృష్టి కార్యక్రమం చేస్తుంటాడు. విష్ణువు రెండవ కుమారుడు. పాలనావిధానం చూస్తుంటాడు. రుద్రుడు మూడవ కుమారుడు. సంహారకృత్యము చూస్తుంటాడు. వీరు ముగ్గురూ కాలపురుషులు. మహేశ్వరుడు అనే పేరు గలవాడు నాల్గవ కుమారుడు వీరిపైన సాక్షాత్తు బ్రహ్మరూపుడు సదాశివుడు.

పరమేశ్వరి **'పంచకృత్య పరాయణ'** లలితా సహస్రంలో 274వ నామం అదే. పంచకృత్యములు అంటే సృష్టి, స్థితి, సంహారము, తిరోదానము, అనుగ్రహము. ఈ పనులు చేయటంకోసం తన అంశలను నియమించింది. లలితాసహస్రంలో 264 నుంచి 273 దాకా ఈ విషయాన్ని వివరించటం జరిగింది. ఆ పరమేశ్వరి

**సృష్టికర్త్రీ బ్రహ్మరూపా** – బ్రహ్మరూపంలో సృష్టి చేస్తుంది

**గోప్త్రీ గోవిందరూపిణి** – విష్ణువు రూపంలో జగత్తును రక్షిస్తుంది

**సంహారిణీ రుద్రరూపా** – రుద్రుని రూపంలో సంహారం చేస్తుంది.

**తిరోదానకరీశ్వరీ** – మహేశ్వరుని రూపంలో తిరోదానము చేస్తుంది. తిరోదానము అంటే సంపూర్ణ నాశనము

**సదాశివా అనుగ్రహదా** – సదాశివుని రూపంలో పునః సృష్టి చేస్తుంది. పూర్తిగా ఏమే మిగలకుండా నాశనమైపోయిన జగత్తును మళ్ళీ సృష్టించటానికి సుముఖంగా ఉండటమే అనుగ్రహము. అంటే మళ్ళీ సృష్టిని ప్రారంభించటమే అనుగ్రహము.

మహాప్రళయం జరిగినప్పుడు జగత్తు పూర్తిగా నాశనమవుతుంది. ఆ సమయంలో రుద్రుడు విష్ణువులోను, విష్ణువు బ్రహ్మలోను, బ్రహ్మ ఈశ్వరునిలోను, ఈశ్వరుడు సదాశివునియందు లీనమవుతారు. ఆ సదాశివుడు పరమేశ్వరిలో ఆ పరాశక్తిలో లీనమైపోతాడు. మళ్ళీ సృష్టికి సంకల్పం జరిగినప్పుడు వీరందరూ బయటకు వచ్చి సృష్టిని ప్రారంభిస్తారు. **'శాంభవదీపిక'** అనే గ్రంథంలో

**సృష్టి స్థిత్యుపసంహార తిరోదానుగ్రహాత్మకమ్ ।**
**కృత్యం పంచవిధం యస్మాత్తం నమః శాశ్వతమ్ శివమ్ ॥**

సృష్టి స్థితి సంహార తిరోదాన అనుగ్రహాలు అనబడే పంచకృత్యాలను పంచబ్రహ్మలు పరమేశ్వరియొక్క కంటినుంచి వచ్చిన ఆజ్ఞలద్వారా చేస్తారు.

ఈ విషయాలను లలితా సహస్రంలోని 264వ నామం సృష్టికర్త్రీ నుంచి 274 పంచకృత్య పరాయణా వరకు వివరించారు.

జగత్తులో పరమేశ్వరిని ఆరాధించిన వారికి కొన్ని శక్తులు వస్తాయి. వారు కూడా పరమేశ్వరి లాగానే కొన్ని గొప్ప పనులు చేస్తారు కాని సృష్టి స్థితి లయాలు మాత్రం చెయ్యలేరు. వాటిని పరమేశ్వరియే చేస్తుంది. అందుకే ఆవిడ **పంచకృత్య పరాయణ** అనబడుతుంది. ఈ విధంగా పంచకృత్యాలు నిర్వహించే పరాశక్తియే పరబ్రహ్మ స్వరూపము. ఆమెను తెలుసుకునేందుకే ఈ బ్రహ్మజిజ్ఞాస.

## 3. శాస్త్రయోనిత్వాధికరణము (సర్వజ్ఞుడు)

ఇంతవరకు సృష్టి స్థితి లయాలకు కారణం పరబ్రహ్మ అని చెప్పుకున్నాం. అయితే ఇప్పుడు ఆ పరబ్రహ్మ 'సర్వజ్ఞుడు' అని చెప్పి దానికి శాస్త్ర ప్రమాణం చూపుతున్నారు మూడవ అధికరణలో దీన్ని **'శాస్త్రయోనిత్వాధికరణము'** అంటారు. ఈ అధికరణలో కూడా ఒక్క సూత్రమే ఉంది.

***సూత్రం - 3 "శాస్త్రయోనిత్వాత్"***

బ్రహ్మము శాస్త్రప్రమాణము చేతనే తెలియదగినది.

పరబ్రహ్మ సర్వజ్ఞుడు. సర్వశాస్త్రములకు కారణమైనవాడు. వేదాలు అపౌరుషేయాలు. సాక్షాత్తూ బ్రహ్మముఖం నుండే వచ్చినాయి. ఈ రకంగా వేదాలకు కారణమైనవాడు బ్రహ్మ. అందుకే అతడు సర్వజ్ఞుడు. అంతేకాదు బ్రహ్మము అనేది శాస్త్రప్రమాణం గలది. అంటే బ్రహ్మయొక్క యధార్ధ స్వరూపానికి, యథార్థ జ్ఞానానికి వేదాలే ప్రమాణము. అందుచేతనే బ్రహ్మకు శాస్త్రప్రమాణమున్నది.

'అసలు శాస్త్రము అంటే ఏమిటి?' "శాసించేదే శాస్త్రము. ఈ రకంగా చెయ్యాలి. ఈ రకంగా చెయ్యకూడదు అని నిర్దేశించేదే శాస్త్రము. అదే వేదము. వేదాలు మహత్తరమైన విషయాలను బోధిస్తాయి. అటువంటి వేదాలకు కారణమైనవాడు బ్రహ్మ. కాబట్టి బ్రహ్మసర్వజ్ఞుడు. అన్ని విషయాలను గురించి వివరించటమనేది ఒక్కపరమేశ్వరుడికి తప్ప సామాన్యుడివల్ల కాదు. అందుచేతనే బ్రహ్మ సర్వజ్ఞుడు.

శాస్త్రాలు రెండు రకాలు 1. పౌరుషేయాలు 2. అపౌరుషేయాలు

1. పౌరుషేయాలు పురుషునిచేత చెప్పబడ్డాయి. అవి పది.

1. పురాణాలు
2. న్యాయశాస్త్రము
3. మీమాంస
4. శిక్ష
5. ధర్మశాస్త్రము
6. కల్పము
7. వ్యాకరణము
8. నిరుక్తము
9. ఛందస్సు
10. జ్యోతిషం

**1. పురాణాలు :** 1. సర్గ 2. ప్రతిసర్గ 3. వంశము 4. మన్వంతరము 5. వంశ చరిత్రము అనబడే ఐదు లక్షణాలు ఉన్న దాన్ని పురాణము అంటారు. వేదాలలో సంక్షిప్తంగా చెప్పిన సృష్టి మొదలైన వర్ణనలను వివరిస్తూ, వేదార్థాన్ని పూర్తిగా వివరిస్తాయి. పురాణాలు 18. వీటన్నింటినీ వ్యాసుడే వ్రాశాడు. ఉపపురాణాలు 18 వీటిని వ్యాసుడి శిష్యులు వ్రాశారు.

**2. న్యాయశాస్త్రము :** ప్రమాణము, ప్రమేయము మొదలైన విషయ పరిజ్ఞానాన్ని వివరించేదే న్యాయశాస్త్రము.

**3. మీమాంస :** వేదాలు స్వతఃప్రమాణాలు. అయినప్పటికీ వాటి అర్థంలో ఎప్పుడైనా అనుమానం వచ్చినట్లైతే, ఆ విషయాన్ని విశదీకరించటానికి ఉపయోగించేది మీమాంస.

**4. శిక్ష :** వేదాలు చదివేటప్పుడు

1. వర్ణము
2. స్వరము
3. మాత్ర
4. బలము
5. సామము
6. సంతానము

అనే విషయాలను జాగ్రత్తగా గమనించి చదవాలి. లేకపోతే వాటి అర్థం మారిపోతుంది.

**1. వర్ణము :** అ నుంచి క్ష వరకు ఉండే అక్షరాలను వర్ణాలు అంటారు. వీటిని చక్కగా ఉచ్చరించాలి.

**2. స్వరము :** వేదానికి ఐదు స్వరాలుంటాయి.

| | | |
|---|---|---|
| 1. | అనుదాత్తము | – క్రింది నొక్కి పలకటము |
| 2. | ఉదాత్తము | – సమానస్థాయిలో పలకటము |
| 3. | స్వరితము | – పై స్థాయిలో పలికేది |
| 4. | దీర్ఘస్వరితము | – పై స్థాయిలో దీర్ఘంగా పలికేది |
| 5. | ప్లుతము | – అక్షరాన్ని క్రిందికీ, పైకి, క్రిందికీ పలికేది |

వీటిని గురుముఖతః మాత్రమే నేర్చుకోవాలి.

**3. మాత్ర :** మాత్ర అంటే 256 లవములు.

తామర పువ్వుల రేకులను కట్టగా చేసి సూదితో గ్రుచ్చినట్లైతే, ఒక్కొక్క దళానికీ గ్రుచ్చుడబడటానికి ఎంతకాలము పడుతుందో దానికి లవము అని పేరు. ఇంతకన్న తక్కువ మానము కాలానికి చెప్పలేదు.

| | |
|---|---|
| హ్రస్వాక్షరముల (అచ్చుల) ఉచ్చారణా కాలము | – ఒక మాత్ర |
| దీర్ఘాక్షరముల ఉచ్చారణ కాలము | – రెండు మాత్రలు |
| హల్లుల ఉచ్చారణ కాలము | – అర్ధమాత్ర |

**4. బలము :** ఆయా అక్షరాలను ఉచ్చరించేటప్పుడు చేయవలసిన ప్రయత్నము. దీనినే ఊతము అంటారు.

**5. సామము :** సమానత్వము. మరీ వేగము, మరీ నెమ్మది కాకుండా ఉచ్చరించటము.

**6. సంతానము :** సంహిత అర్థాన్ని అనుసరించి కలిపి చదవటము.

**5. ధర్మశాస్త్రము :** వేదాలలో చెప్పబడిన ధర్మాలను వివరించేది.

**6. కల్పము :** వైదిక విధులు నిర్ణయించే పద్ధతుల వివరణ.

**7. వ్యాకరణము :** పద విభజన, సంధి, సమాస పరిచ్ఛేదము. వేదార్థ నిర్ణయానికి ఇది ఉపకరిస్తుంది.

**8. నిరుక్తము :** వేదాలలోని పదాలకు అర్థాలుచెప్పే నిఘంటువు.

**9. ఛందస్సు :** పద్యాలు, శ్లోకాలు వ్రాయటానికి ఉపయోగించే తీరు. వేదాలలో గాయత్రి, జగతీ, అనుష్టుప్ మొదలైన ఛందస్సులున్నాయి.

**10. జ్యోతిషము :** రాబోయే కాలం యొక్క ఫలితాలు, తెలియచేస్తూ వైదిక కర్మలకు కాలనిర్ణయం చేస్తుంది.

**2. అపౌరుషేయాలు :** పురుషుని చేత చెప్పబడనివి. బ్రహ్మముఖం నుండి వచ్చినవి. వేదాలు. ఇవి నాలుగు

1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అధర్వణవేదము

| | | |
|---|---|---|
| ఋగ్వేదానికి | – | 21 శాఖలు |
| కృష్ణయజుర్వేదానికి | – | 94 శాఖలు |
| శుక్ల యజుర్వేదానికి | – | 15 శాఖలు |
| సామవేదానికి | – | 1000 శాఖలు |
| అధర్వణవేదానికి | – | 50 శాఖలు |

ఇప్పుడు వీటిలో చాలా వరకు కనిపించటం లేదు.

మొత్తం శాఖలు 1180 వేదాల మీద వివరణ కోసం **చతుర్వేద భాష్యం** చూడండి.

ఈ రకంగా మొత్తం శాస్త్రాలు 14. వీటన్నింటికీ కారకుడు పరమేశ్వరుడు. అందుచేతనే అతడు సర్వజ్ఞుడు.

ఈ విధంగా పురాణాలు, మీమాంస మొదలైన వాటివల్ల వేదాలలో చెప్పబడిన అర్థం తెలుస్తోంది. వేదార్థం తెలియనివాడు, వేదంలో చెప్పబడ్డ మహత్తర విషయాలను తెలుసుకోలేడు. వేదాలు స్వతఃప్రమాణాలు, సూర్యుడు ప్రకాశించటానికి ఇంకొకరి సాయము అవసరం లేదు. అలాగే వేదాలు సర్వార్థాలను ప్రకాశింపచేస్తున్నాయి. అందుకనే అవి పరమేశ్వరునితో సమానమైనాయి.

సర్వార్థాలను ప్రకాశింపచేస్తున్న వేదాలు బ్రహ్మముఖం నుండి వచ్చాయి. ఆ వేదాలకు కారణం బ్రహ్మ. కాబట్టే పరబ్రహ్మ సర్వజ్ఞుడు.

## సర్వజ్ఞత్వము

పరమేశ్వరుడు, పరాశక్తి, పరబ్రహ్మ ఇవన్నీ పర్యాయపదాలు. వీటి మధ్య తేడా లేదు. పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. అన్ని విషయాలు అతనికి తెలుసు. భూతభవిష్యద్వర్తమానాలు అన్నీ అతని అధీనంలోనే ఉన్నాయి. కాబట్టి జరిగినది జరుగుతున్నది జరుగబోయేది అన్నీ అతడికి తెలుసు. అతడు త్రికాలజ్ఞాని. దయామయుడు. తనను

శరణన్న వారిని రక్షించటంలో అతడికి సాటివేరెవరూ లేరు. సృష్టి ప్రారంభంకాక ముందు నుంచి అతడొక్కడే ఉన్నాడు. అతడితో సమానమైనవారు కాని, అతనికన్న అధికులుగాని మరెవరూ లేరు. ఈ విషయం పదేపదే చెప్పబడింది. పరమేశ్వరుడు త్రికాలజ్ఞుడు త్రికాలాతీతుడు కూడా. లలితాసహస్రంలో పరమేశ్వరుని సర్వజ్ఞత్వాన్ని తెలుపుతుంది.

అతడు బిందురూపంలో ఉన్నాడు. ఆ రూపం బిందువే ఎందుకు కావాలి? త్రికోణం గాని, చతుర్భుజంగాని, అష్టకోణంగాని ఎందుకు కాకూడదు ? అనే ప్రశ్నలకు వివరణ 'షట్చక్రాలు' అనే శీర్షికలో ఇవ్వబడింది. ఇప్పుడు పరమేశ్వరి సర్వజ్ఞతని చూద్దాం.

## సర్వజ్ఞా

సర్వమును తెలియునది. అన్నింటినీ ఎరిగినది. **'యస్సర్వజ్ఞః స సర్వవిధి'** ఎవరు సర్వజ్ఞుడో వాడే సర్వవేత్త. సర్వమును ఎరిగినవాడు. దేవీపురాణంలో **సర్వజ్ఞా సర్వవేతృత్వా** సమస్తాన్ని ఎరిగినది కాబట్టే ఆ పరమేశ్వరి సర్వవేత్త అనబడుతోంది.

భగవంతుడు అని చెప్పటానికి కొన్ని లక్షణాలున్నాయి. అవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | సర్వజ్ఞత | 3. | స్వతంత్రత | 5. | సంపూర్ణత |
| 2. | అనాదిబోధ | 4. | నిత్యత | 6. | అనంతత. |

| | | | |
|---|---|---|---|
| 1. | సర్వజ్ఞత | – | అన్ని విషయాలు తెలిసిఉండటము |
| 2. | అనాదిబోధ | – | అనాదిగా జ్ఞానం కలిగి ఉన్నవాడు. |
| 3. | స్వతంత్రత | – | ఎవరి మీద ఆధారపడకుండా స్వతంత్రంగా ఉండటము. |
| 4. | నిత్యత | – | శాశ్వతంగా ఉండటము, నాశనము లేకపోవటము |
| 5. | సంపూర్ణత్వము | – | అన్నింటినీ కలిగి ఉండటము |
| 6. | అనంతత | – | అంతము లేకుండా ఉండటము |

కాబట్టి సర్వజ్ఞత అనేది భగవంతుడి యొక్క లక్షణం. ఇక్కడ సర్వ అంటే ఈ జగత్తులో కంటికి కనిపించే విషయాలన్నీ అని అర్థం. పరమేశ్వరుడు సర్వజ్ఞుడు అంటే అన్ని రూపాలు తానే అయినవాడు. అన్ని రూపాల గురించి, విషయాల గురించి పూర్తిగా తెలిసినవాడు. జీవులు చేసిన పాపపుణ్యాలు ఆధారంగా వారికి ఉత్తర జన్మలు ప్రసాదింపచేసేవాడు. ఈ లక్షణాలన్నీ పరమేశ్వరివే. అదే పరమేశ్వరి నిర్గుణరూపం. అందుచేతనే ఆమె సర్వజ్ఞ అనబడుతున్నది.

# సాంద్రకరుణా

**సాంద్రా ఘనా కరుణాయస్యాః సా**

ఘనమైన దయ గలది. దయా స్వరూపిణి. కరుణా సముద్రురాలు. కరుణరసంలో అఖరిమజిలి సాంద్రకరుణ. అంతకన్న ఇంక పెద్దపదం లేదు. దీని అర్థం పరమేశ్వరి అపారమైన దయాస్వరూపిణి. పిల్లలు తల్లిని ద్వేషించవచ్చుగాని తల్లి మాత్రం పిల్లలను ద్వేషించదు. ఒక వేళ అలా చెయ్యవలసి వచ్చినా అందులో కూడా దయ, కరుణ ఉంటాయి. మన కళ్ళకు కనిపించే సామాన్యులయిన తల్లులే ఈ రకంగా ఉంటే ఆ పరమేశ్వరి, శ్రీమాత ఆవిడను గురించి వేరే చెప్పాలా ? జగత్తులోని జీవరాశి అంతా ఆమె సంతానమే. వారందరి మీద అపారమైన దయను చూపిస్తుంది. అందుకే ఆమె సాంద్రకరుణ.

# సమానాధికవర్జితా

**న తత్సమ శ్చ అభ్యధిక శ్చ దృశ్యతే** దేవితో సమానమైన వారుకాని, ఆమెకన్న అధికులుగాని లేరు.

ప్రపంచంలో కంటికి కనిపించే దృశ్య పదార్థాలు చాలా ఉంటాయి. కాని దృక్పదార్థం మాత్రం ఒక్కటే. అదే పరమేశ్వరతత్త్వము. కంటికి చూసేశక్తి నిచ్చేది ఆత్మ. చెవికి వినే శక్తినిచ్చేది ఆత్మ. కాలుకు నడిచే శక్తినిచ్చేది ఆత్మ. ఈ రకంగా ప్రతి అవయవానికి, ప్రతిజీవికి, ప్రతి వస్తువుకు చైతన్యశక్తిని ప్రసాదించేది ఆత్మ. అటువంటప్పుడు ఆత్మస్వరూపిణి అయిన ఆ దేవితో సమానమైనవారు కాని, ఆమెకన్న అధికులుగాని ఏరకంగా ఉంటారు ? అందుచేతనే ఆమె సమానాధికవర్జితా అనబడుతున్నది.

ఈ రకంగా పరబ్రహ్మ స్వరూపమైన పరమేశ్వరి సర్వజ్ఞత్వము కలిగి ఉన్నది. అంటూ **ఆ పరాశక్తి యొక్క సర్వజ్ఞత్వాన్ని** వివరించారు ఈ అధికరణలో. ఆ పరాశక్తిని గురించి తెలుసుకోవటానికే ఈ జిజ్ఞాస.

# 4. సమన్వయాధికరణము (వేదాంతవాక్యాల సమన్వయం)

"బ్రహ్మకు శాస్త్రప్రమాణకత్వం ఉన్నది. వేదము అనేది క్రియార్థకం. అంటే క్రియలను (కర్మకాండను) వివరిస్తుంది. ఇంకా వివరంగా చెప్పాలంటే విధి, నిషేధము, అర్థవాదము, మంత్రాలతో కూడిన సమస్తవేదము కూడా యజ్ఞయాగాది కర్మలను గురించి చెబుతోంది. ఇందుకు భిన్నమైనటువంటి **సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ, తత్వమసి** లాంటి వేదాంతపరమైన ఉపనిషద్వాక్యాలేవీ క్రియాపరాలు కాదు. కాబట్టి అవి నిష్ప్రయోజనమైనవి. ఈ స్థితిలో మీరు చెప్పే బ్రహ్మము శాస్త్రప్రామాణికము ఎలా అవుతుంది? వేదాంత వాక్యాలలో దేవతను, కర్తను, సాధనను గురించి చెప్పబడింది. అంటే ఉదా॥ 'తత్త్వమసి' ఇక్కడ తత్ అంటే దేవత, త్వం అంటే కర్మచేసే మానవుడు. ఈ విధంగా ఈ రెండు పదాలు దేవతను, కర్తను సూచిస్తున్నాయి. కొన్ని వాక్యాలు ఫలితాన్ని, సాధనను సూచిస్తున్నాయి. కాబట్టి వేదాంతవాక్యాలు కర్మాంగాలు అవుతున్నాయి. అందుచేత బ్రహ్మకు శాస్త్రప్రామాణకత్వం కుదరదు కదా?" ఇది అనుమానం. దీనికి సమాధానంగానే నాల్గవ అధికరణను చెబుతున్నారు. అందులో ఒక్క సూత్రమే ఉంది. ఇది **'సమన్వయాధికరణము'. సూత్రం–4**

***సూత్రం – 4 "తత్తు సమన్వయాత్"***

శాస్త్రాలు బ్రహ్మను ప్రతిపాదిస్తున్నాయి.

శాస్త్రప్రామాణకత్వము సమన్వయమువల్ల మాత్రమే తెలుసుకోవలసినది. సమన్వయం అంటే వేదాంతవాక్యాలకు పరస్పర విరోధం లేకుండా ఏకాభిప్రాయం సాధించటం. వేదాంత వాక్యాలు అన్నీ ఒకచోట లేవు. అవి విడివిడిగా అనేక ప్రకరణలలో ఉన్నాయి. కాబట్టి అవి కర్తృ ప్రతిపాదికములు అంటే కర్తను గురించి చెప్పేవి కాదు. కేవలము బ్రహ్మను గురించి చెప్పేవే. అన్ని వేదాంత వాక్యాలూ ఒకే అర్థంతో బ్రహ్మకు సంబంధించిన జ్ఞానాన్ని కలుగజేస్తాయి. కాబట్టి మహావాక్యాలు కర్మాంగాలు కాదు. వాటి ముఖ్యోద్దేశ్యము బ్రహ్మమే.

**సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ**

అనే వాక్యంలో సత్యము, జ్ఞానము, అనంతము అనే పదాలు బ్రహ్మనుగూర్చి చెప్పినవే. అంతేకాకుండా ఉపక్రమ, ఉపసంహారాది షడ్విధలింగాలను దృష్టిలో

ఉంచుకుని చూసినా మహావాక్యాల అర్థం బ్రహ్మమే. **షడ్విధ లింగాలు** అంటే ఏదైనా ఒక విషయం యొక్క తాత్పర్యాన్ని నిర్ణయించే సాధనాలు. ఇవి ఆరు.

1. ఉపక్రమము – ప్రారంభము
   ఉపసంహారము – సమాప్తి
2. అభ్యాసము – మళ్ళీ మళ్ళీ చెప్పటం
3. అపూర్వత – లోగడ చెప్పినది కాకుండా క్రొత్త విషయం చెప్పటము
4. ఫలము – ప్రయోజనము
5. అర్ధవాదము – అర్థాన్ని విచారించటము
6. ఉపపత్తి – యుక్తి

వీటి ఆధారంగా చూసినట్లైతే మహావాక్యాలకర్థం పరబ్రహ్మ. ప్రతిచోట ఉపనిషత్ ప్రారంభంలోనూ అంతంలోనూ కూడా పరబ్రహ్మను గురించే చెప్పబడింది. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్ధాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మోపదేశం చేస్తూ "నాయనా ! ఆత్మ అంటే ఎక్కడో లేదు. నీలోనే ఉన్నది. నీ తత్త్వమే ఆత్మ.

ఉద్దాలకఅరుణి మహర్షి కుమారుడు శ్వేతకేతువు. కుమారుడికి పన్నెండు సంవత్సరాలు నిండగానే తండ్రి అతణ్ణి పిలిచి "నాయనా శ్వేతకేతూ! గురుకుల ఆశ్రమానికి వెళ్ళి బ్రహ్మచర్య దీక్షతో అక్కడ నివసించు. మన వంశంలో పుట్టిన వారెవరూ బ్రహ్మజ్ఞానం లేనివారు కాదు. కాబట్టి నువుకూడా వెళ్ళి విద్యావంతుడవుకా" అన్నాడు.

తండ్రి మాటమీద పన్నెండు సంవత్సరాలపాటు గురుకులంలో ఉండి వేదాధ్యయనం చేసి, వేదానికి అర్థం తెలుసుకున్నాడు. అయితే సర్వంతనకే తెలుసుననే అహంకారంతో, గర్వంతో, దర్పంతో ఇంటికి తిరిగి వచ్చాడు. ఈ విధంగా దుడుకు స్వభావంతో వచ్చిన కుమారుని అవివేకాన్ని, ఆత్మవంచనను, గుర్తించినవాడై ఉద్దాలకుడు "నాయనా శ్వేతకేతూ! శ్రవణ గోచరం కాని తత్త్వం ఇంద్రియ గోచరమయ్యే విధానము గురించి మీ గురువుగారిని ఎప్పుడైనా అడిగావా?" అన్నాడు.

"ఏమిటా విషయం?" అన్నాడు శ్వేతకేతు. "నాయనా! మట్టిని గురించి తెలిస్తే మట్టితో చేసే వివిధ రకాల వస్తువులకు పేర్లలో తేడా ఉన్నా వాటిని గురించి తెలుస్తుంది. బంగారం గురించి క్షుణ్ణంగా తెలిస్తే దానితో తయారుచేసిన నగలకు ఏ పేరుపెట్టినా వాటిలో ఉన్నది బంగారమే అని తెలుస్తుంది.

అలాగే ఏ విషయం తెలుసుకున్నందువల్ల అన్ని విషయాలు మనకు బోధ పడతాయో దానిని గురించి తెలుసుకోవాలి. ప్రతి విషయంలోనూ అంతర్గతంగా ఉండే తత్త్వం ఏదో తెలుసుకున్నావనుకో అప్పుడు మిగిలినదంతా పదాలగారడీ అని తెలుస్తుంది" అన్నాడు ఉద్దాలకుడు. దానికి శ్వేతకేతువు "నాన్నగారూ! మీరు చెప్పిన విషయాలు మా గురువర్యులకు తెలియదనుకుంటాను. ఒకవేళ వారికి తెలిస్తే తప్పకుండా నాకు చెప్పేవారే. కాబట్టి పరమోత్కృష్టమైన ఆ విద్యను మీరే నాకు బోధించి నన్ను కృతార్థుణ్ణి చెయ్యండి" అన్నాడు.

"సరే! నీకా తత్త్వాన్ని చెబుతాను. వినవలసినది" అంటూ ప్రారంభించాడు ఉద్దాలకుడు.

"శ్వేతకేతూ! సృష్టికి పూర్వం ఈ ప్రపంచం నామరూపాలతో కూడిలేదు. అప్పుడు కేవలం అద్వితీయమైన 'సత్తు' మాత్రమే ఉండేది. నామరూపాలు, పదార్థాలు ఏవీలేవు. సత్తు అంటే–ఉనికి, సత్యం అని అర్థం. అసత్తు అంటే లేనిది, అసత్యం అని అర్థం. అన్నింటికన్నా పూర్వమమైనది, రెండుకానిది, మొదటగా ఉన్నది ఏకైకమై పరబ్రహ్మ. ఆ తత్వం అనేకం కావాలనుకుంది. రకరకాల రూపాలతో వస్తువులుగా, జీవులుగా రూపుదాల్చింది. ద్రవ, ఘన, వాయు పదార్థాలుగా మార్పుచెంది అనేక రూపాలతో సృష్టి ఆకారం పొందింది. ఈ రకంగా మొదటగా ఉన్న పరబ్రహ్మలో నుంచే ఇవన్నీ వచ్చినాయి.

స్థావర జంగమాత్మకమైన జీవులన్నీ పుట్టుకరీత్యా అనేక విధాలుగా ఉన్నాయి.

1. అండజములు – గ్రుడ్డు నుండి పుట్టేవి (పక్షులు, పాములు)
2. జారజాలు – స్త్రీ జనానంగము నుంచి పుట్టేవి (మనుష్యులు, పశువులు)
3. ఉద్భిజములు – విత్తనాల వల్ల భూమి నుంచి పుట్టేవి. (చెట్లు, చేమలు)
4. స్వేదజములు – చెమట వల్ల పుట్టేవి
5. ఊష్మజాలు – వెచ్చదనం వల్ల పుట్టేవి. (క్రిమికీటకాలు)

జీవరాశులను చెప్పేటప్పుడు పై మూడు రకాలు మాత్రమే చెప్పాలి. అవే ముఖ్యమైనవి.

తాను అనేకం కావాలనుకున్న 'సత్తు' ముందుగా అగ్నిని సృష్టించింది. అగ్ని నుండి జలము, జలము నుండి భూమి ఉద్భవించాయి. వీటివల్లనే అన్నం పుట్టింది. అప్పుడు సత్తు అగ్ని జలము అన్నములలో ప్రవేశించాలనుకుంది అంటే ఈ మూడింటిలోనూ వ్యక్తమయి అనేక రూపాలు పొందింది అన్నాడు.

ఆ మాటలు విన్న శ్వేతకేతు "నాన్నగారూ! మీరు చెప్పిన విషయం చాలా బాగుంది. కాని చిన్న అనుమానం. నిద్రపోతున్నప్పుడు మనిషి ఎక్కడికి పోతాడు?" అన్నాడు.

"నాయనా ! నిద్ర పోతున్నప్పుడు మనిషి తాత్కాలికంగా ఆత్మతో తాదాత్మ్యం చెందుతాడు. తేనెటీగలు తోటంతా తిరిగి మకరందాన్ని స్వీకరించి తేనెగా తయారు చేస్తాయి. ఈ తేనె ఆ పువ్వుల నుండి స్వీకరించినదే. కాని ఏ చుక్క ఏ పూవు నుండి తీసిందో మాత్రం చెప్పలేము. అలాగే జీవరాశులు విడివిడిగా ఉన్నప్పటికీ ఆత్మలోనే లీనమై ఉంటాయి. అది నిద్రాసమయం లేదా మరణం ఏదైనా కావచ్చు. గాఢనిద్రలో గతం తెలియదు. వర్తమానం అసలే తెలియదు. అంతా అజ్ఞానం. అందువల్ల యధార్థమనేది తెలియదు. యధార్థాన్ని గుర్తించటం కష్టం.

మానవుడు నిద్రించేటప్పుడు ఆత్మలో తాత్కాలికంగా లీనమౌతాడు. మరణ కాలంలో వాక్కు మనస్సులో లీనమవుతుంది. మనస్సు ప్రాణంలో లీనమవుతుంది. ప్రాణం తేజస్సులో కలిసిపోతుంది. చివరకు అది పరమశక్తిలో కలిసిపోతుంది. ఆశక్తి అతిసూక్ష్మమైనది. కాని విశ్వమంతా వ్యాపించి ఉంది. అదే సత్యం. అదే నిత్యం. అదే ఆత్మ. అదే నీవు 'తత్త్వమసి'.

జీవి అనేది ఏ రూపంలో ఉన్నప్పటికీ అంటే పులి, సింహము, మనిషి, ఏదైనా కాని అనంత చైతన్యసముద్రంలో కలిసిపోయిన తరువాత తనరూపాన్ని పోగొట్టు కుంటుంది. జీవులు వాటిరూపాలు, నామాలు పోగొట్టుకుంటాయి. అవి అన్నీ ఏ తత్త్వంలో కలసిపోతాయో అదే బ్రహ్మ. అది అద్వితీయమైనది. సూక్ష్మమైనది. సర్వవ్యాపకమైనది. అదే నీవు. శ్వేతకేతూ! అదే నీవు.

నదులు తూర్పు నుంచి పడమరకు ప్రవహించినా, పడమర నుంచి తూర్పుకు ప్రవహించినా అన్నీ సముద్రంలోనే కలుస్తాయి. నీరు ఒక సముద్రంలోంచి ఇంకో సముద్రంలోకి చేరుతుంది. సూర్యరశ్మికి నీరు ఆవిరి అయి మేఘంగా మారుతుంది. ఆ మేఘాలు వర్షించి జలాన్నిస్తాయి. ఆ జలం కొండలమీద నుంచి ప్రవహించి నదుల్లో కలుస్తుంది. ఆ నదులన్నీ చాలాదూరం ప్రవహించి సముద్రాల్లో కలుస్తాయి. సముద్రంలో కలిసే వరకూ గంగ, గోదావరి, కృష్ణ అని రకరకాల పేర్లతో ఆ నదులను పిలుస్తారు. కాని అవి సముద్రంలో కలిసిన తరువాత ఏ నీరు ఏ నదిదో తెలియదు కదా! అలాగే విడివిడిగా రకరకాలుగా ఉండే ఈ జీవరాశులు పరబ్రహ్మలో కలిసిపోయినప్పుడు వాటిని విడదీయటం కష్టం. జీవాత్మలన్నీ పరమాత్మలోని భాగాలే.

"నాయనా శ్వేతకేతూ ఒక మర్రి పండును తీసుకునిరా"" అన్నాడు ఉద్దాలకుడు.

మర్రిపండు తెచ్చాడు శ్వేతకేతు.

"దాన్ని పగులకొట్టు" అన్నాడు తండ్రి

పగులకొట్టాడు కుమారుడు.

"అక్కడ ఏం కనిపిస్తోంది?" అడిగాడు తండ్రి.

"చిన్న చిన్న గింజలు కనిపిస్తున్నాయి"

"ఒక గింజను తీసుకుని పగులకొట్టు"

గింజను పగులకొట్టాడు శ్వేతకేతు.

'ఏముందక్కడ?' ప్రశ్నించాడు ఉద్దాలకుడు.

"ఏమీ కనిపించటం లేదు" అన్నాడు శ్వేతకేతు.

ఇంత పెద్ద మర్రిచెట్టు శూన్యంలో నుండిరాదు కదా. ఆ గింజలో ఏమి లేదని చెప్పావు. కాని అందులో ఇంతపెద్ద మ్రాను, కొమ్మలు, రెమ్మలతో ఉన్న ఈ చెట్టుకు కారణమైన, నీకు కనిపించని జీవమున్నదన్నమాట. అదే విధంగా బయటకు కనిపించకుండా సూక్ష్మాతిసూక్ష్మంగా ఉన్న ఆత్మ సర్వత్రా వ్యాపించి ఉంది. అన్నింటికీ ఆధారమైనది ఉండికూడా మనకంటికి కనిపించదు. నీకు ఒక్క విషయం చెబుతా విను. "కాస్త ఉప్పు తీసుకొని దాన్ని నీళ్ళలో కలుపు, రేపు ఉదయం మళ్ళీ రా అన్నాడు ఉద్దాలకుడు. తండ్రి ఆజ్ఞప్రకారం నీళ్ళలో ఉప్పు కలిపాడు శ్వేతకేతు. అది పూర్తిగా కలిసిపోయింది. మర్నాడు ఉద్దాలకుడు అన్నాడు.

"శ్వేతకేతూ! నిన్న నీళ్ళలో కలిపిన ఉప్పును తీసుకునిరా!" ఆ ఉప్పు నీళ్ళలో బాగా కలిసిపోయింది. అందుచేత విడదీయటానికి వీలులేదు. అదే మాట చెప్పాడు శ్వేతకేతు.

"అయితే సరే. ఆ నీళ్ళను ఒకసారి రుచిచూడు" అన్నాడు ఉద్దాలకుడు.

"తండ్రీ! ఆ నీళ్ళు చాలా ఉప్పగా ఉన్నాయి." అన్నాడు శ్వేతకేతువు.

"కుమారా! ఇది విను. ఉప్పునీళ్ళలో కలిసిపోయినట్లు ఆత్మ అన్ని వస్తువులలోనూ కలిసిపోయి ఉంటుంది. ఆ ఆత్మయే నీవు."

ఆత్మని గురించి తండ్రి చెప్పిన మాటలు పూర్తిగా అర్థం చేసుకున్నవాడై కుమారుడు తండ్రిని అడుగుతున్నాడు. "తండ్రీ! ఆత్మానుభవంపొందే మార్గం నాకు వివరించండి" మీరు చెప్పే విషయాలు వినటానికి తేలికగానే ఉన్నాయి. కాని అర్థం చేసుకోవటం, అనుభవంలోని తేవటం మాత్రం చాలా కష్టం. దీని అనుభవం పొందటం ఎలా?" అని అడిగాడు శ్వేతకేతువు.

"శ్వేతకేతూ! ఆత్మజ్ఞానం పొందటం ఎలాగో చెబుతాను విను. ఒక మనిషి కళ్ళకు గంతలు, చేతులుకట్టి గుర్తు తెలియని అరణ్యం మధ్యలో అతన్ని వదలి వేశామనుకో. అప్పుడతడేం చేస్తాడు. అతడికి దారి తెలియదు. దిక్కు తెలియదు. తననెవరో బంధించారు. కళ్ళు కనిపించటం లేదు. ఆ గంతలు విప్పుకోటానికి చేతులు లేవు. అవికూడా కట్టేశారు. ఇప్పుడు అతడు భయపడతాడు. దారి తెన్నూ లేకుండా తిరుగుతాడు. రక్షించండి అని అరుస్తాడు. భయంతో ఏడుస్తాడు. అప్పుడు ఎవరో వచ్చి కట్లు ఊడదీస్తారు. అతడికి కళ్ళు కనిపిస్తాయి. త్రోవ తెలుస్తుంది. కనిపించిన వాళ్ళందరినీ తనింటికి దారి అడుగుతూ, వెతుక్కుంటూ ఇల్లు చేరతాడు. అదే విధంగా అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతున్న మానవుడు తన లక్ష్యమైన ఆధ్యాత్మిక సౌధం కోసం ప్రయత్నించి చేరుకోవాలి. జిజ్ఞాసతో మనం వేసే ప్రతి అడుగుకూ గమ్యం ఆత్మయే. ఆ ఆత్మయే నీవు. శ్వేతకేతూ నీవే ఆత్మ. 'తత్త్వమసి'

ఆత్మ అంటే ఎంతో దూరంలో అందని ఆకాశంలో లేదు. అది నీలోనే ఉంది. నీ తత్త్వమే ఆత్మతత్త్వం. నిన్ను నీవు తెలుసుకోవటమే ఆత్మజ్ఞానం". అంటూ ఉద్దాలకుడు ఆత్మజ్ఞానాన్ని తన కుమారుడైన శ్వేతకేతువుకు వివరించాడు అది అపూర్వత.

**"బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి"** అనే వాక్యంవల్ల బ్రహ్మను తెలుసుకొన్నవాడు కూడా బ్రహ్మమే అని చెప్పబడింది ఇది ఫలము.

ఎవడైతే బ్రహ్మలో నానాత్వాన్ని చూస్తాడో, అంటే బ్రహ్మ ఒకరు కాదు అనేకులున్నారు అని అనుకుంటాడో అతడు గానుగకు కట్టిన ఎద్దులాగా సంసారమనే బండి చక్రంలో పడి తిరుగుతుంటాడు. అని **కఠోపనిషత్తు**లో చెప్పబడింది. ఇది అర్ధవాదము.

కుమ్మరివాడు మట్టితో అనేక రకాల పాత్రలు తయారుచేస్తాడు. వాటి రూపాలు వేరైనా, ఉపయోగాలు వేరైనా వాటిని తయారుచేసేందుకు ఉపయోగించిన మట్టి ఒక్కటే" ఈ విషయం ఉపనిషత్తులో ప్రతిపాదించబడింది. ఇది ఉపపత్తి.

ఈ విధంగా బ్రహ్మము అనేది శాస్త్రప్రామాణికము అని సిద్ధాంతీకరించ బడుతోంది.

వేదము కర్మను గురించి, బ్రహ్మను గురించి కూడా ప్రతిపాదిస్తోంది. ఇందులో కర్మను గురించి చెప్పే ప్రకరణలు వేరు. బ్రహ్మను గురించి చెప్పే ప్రకరణలు వేరు. వేదాంతం యొక్క ఉద్దేశ్యము బ్రహ్మమే, పరమేశ్వరియే పరబ్రహ్మ స్వరూపము అని శాస్త్రాలు ప్రతిపాదిస్తున్నాయి. అంటూ నాల్గవ అధికరణలో బ్రహ్మను తెలుసుకోవటం ఎలాగో వివరించారు. ఆ పరబ్రహ్మమే పరాశక్తి.

## 5. ఈక్షత్యధికరణము (జగత్కారణం చేతనమా? అచేతనమా?)

బ్రహ్మసూత్రాలలోని మొదటి అధ్యాయంలోని మొదటి పాదంలో ఐదవ అధికరణ **'ఈక్షత్వధికరణము'** ఇందులో మొత్తం ఏడు సూత్రాలున్నాయి.

వీటిలో జగత్కారణము చేతనమా, జడమా అనే విషయాన్ని వివరిస్తున్నారు. ఈక్షతి అంటే చూడటం లేదా సంకల్పించటమని అర్థం.

ఈ జగత్తుకు కారణము చేతనమా? అచేతనమా? ఎందుకంటే **సాంఖ్యుల వాదన ప్రకారము** "బ్రహ్మనిర్గుణుడు. వికారాలు లేనివాడు. మరి అటువంటి బ్రహ్మలో వికారము అంటే మార్పు ఎలా కలుగుతుంది? మట్టిలో మార్పు కలగటం వల్ల కుండ తయారవుతుంది. మట్టి జడము. అలాగే జడమైన ప్రకృతిలో మార్పు కలగటం

చేత సృష్టి జరగాలి. కాబట్టి ఈ జగత్తుకు ఉపాదాన కారణము చేతనమైన బ్రహ్మ కాదు. జడమైన ప్రకృతి. ఆత్మకు ప్రకృతితో సంబంధం ఏర్పడితేనే సంసార సంబంధం కలుగుతుంది. ఈ అవివేక జన్యమైన సంసారం, జ్ఞానంవల్ల అంతరిస్తుంది." అదే విధంగా **వైశేషికులు** "ఈ జగత్తుకు ఈశ్వరుడు నిమిత్త కారణము అని, వాయువు, అగ్ని, జలము, భూమి ఉపాదాన కారణము" అంటారు.

**బౌద్ధులు** "జగత్తుకు ఉపాదాన కారణం శూన్యము. ఏ వస్తువైనా సరే శూన్యంలో నుంచి పుట్టి చివరకు శూన్యంలోనే లీనమవుతుంది" అంటారు.

**తార్కికులు** "గొప్ప వస్తువులన్నీ చాలా తక్కువ వాటితోనే తయారవుతున్నాయి. చిన్నచిన్న దారపు పోగులతోనే పట్టువస్త్రం తయారవుతుంది. అలాగే పరమాణువుల వల్లనే జగత్తు సృష్టించబడుతోంది. అంతేకాని చేతనుడైన బ్రహ్మవల్ల మాత్రం కాదు." అంటున్నారు. కాబట్టి ఈ జగత్తుకు కారణము చేతనమా? అచేతనమా? అనే అనుమానం వస్తుంది.

ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానంగా వ్యాసభగవానుడు ఐదవ సూత్రాన్ని చెబుతున్నాడు.

***సూత్రం - 5 "ఈక్షతేర్నాశబ్దమ్"***

సాంఖ్యులు చెప్పేటటువంటి జడమైన ప్రకృతి 'ఈక్షణము' అనే పనికి కర్తగా చెప్పటానికి వీలు లేదు. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకఅరుణి తన కుమారుడైన శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానాన్ని వివరిస్తూ 'ఈ జగత్తంతా సృష్టికి పూర్వం నామరూపాలతో కూడి లేదు. అద్వితీయంగా ఉండేది. కేవలం సత్తు మాత్రమే ఉండేది. ఆ రకంగా ఉన్న పరబ్రహ్మ తాను అనేకం కావాలి అని ఆలోచించింది. అనేక లోకాలను సృష్టించి అనేక రూపాలు పొందాలి అనుకొన్నది" అని చెప్పాడు.

**ఐతరేయోపనిషత్తు**లో 'జీవాత్మ పరమాత్మా రెండూ ఒక్కటే. మరణానంతరము జీవాత్మ పరమాత్మలో లీనమై పోతుంది. ఆత్మయే ఆలోచనా పూర్వకంగా ఈ లోకాలను సృష్టించింది. సృష్టి జరగటానికి ముందు జగత్తు అంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏమీ లేదు. దాన్నే ఆత్మ అంటారు. ఆ ఆత్మయే ఈ లోకాలను సృష్టించింది.

అదే విధంగా **ప్రశ్నోపనిషత్తు**లోని 1వ ప్రశ్నలో ప్రజాపతి సృష్టి చెయ్యాలనే కోరిక గలవాడై రయి, ప్రాణము అనే జంటను సృష్టించాడు. అని మూడవ ప్రశ్నలో ఆత్మనుంచే ప్రాణం పుట్టింది. శరీరాన్ని ఆశ్రయించి నీడ ఉన్నట్లుగా, ఆత్మపైన ప్రాణము విస్తరించి ఉన్నది. నీడకు స్వతంత్రమైన అస్థిత్వం లేనట్లే, ప్రాణానికి కూడా స్వతంత్రమైన అస్థిత్వం లేదు." అని చెప్పబడింది.

**ముండకోపనిషత్తు**లో అంగిరసుడు తన శిష్యుడైన శౌనకునికి బ్రహ్మతత్త్వాన్ని వివరిస్తూ "ప్రజ్వరిల్లిన అగ్నినుండి అదే విధమైన ఆకారము, గుణము గల వేలకొలది నిప్పురవ్వలు బయటకు వచ్చినట్లే, పరబ్రహ్మ నుండి అనేకమైన శరీరాలు, రూపాలు వెలువడి, మళ్ళీ అందులోనే లీనమై పోతున్నాయి. పరబ్రహ్మ స్వయంప్రకాశము గలవాడు. నిరాకారుడు. బాహ్యాభ్యంతరాల్లో ఉండేవాడు. పుట్టుక, ప్రాణము, మనస్సు లేనివాడు. పరిశుద్ధుడు, మాయకు అతీతుడు. అతని నుండే ప్రాణము, మనస్సు, సమస్త ఇంద్రియాలు, పంచభూతాలు పుడుతున్నాయి" అంటాడు.

వీటన్నింటిలోనూ 'ఈక్షణ' అనే దానికి కర్త ఆత్మ అనే చెప్పారు. అంతేకాని ప్రకృతి కాదు. కాబట్టి చేతనధర్మం గల బ్రహ్మమే ఈ జగత్తుకు కారణము.

***సూత్రం - 6 "గౌణశ్చేన్నాత్మశబ్దాత్"***

ఇందాక చెప్పిన 'ఈక్షితి' (చూపు) అనే శబ్దము గౌణము అంటే ప్రధానం కాదు అని, ప్రాముఖ్యత లేనిది అని చెప్పటానికి వీలులేదు. ఎందుకని? అంటే ఇక్కడ ఆత్మ అంటున్నారు. ఆత్మ అనేది ఈ జగత్తుకు కారణము.

**ఐతరేయోపనిషత్తు**లోని ప్రథమాధ్యాయంలో సృష్టి ఏ రకంగా జరిగిందో వివరించబడింది. ఆత్మయే ఆలోచనా పూర్వకంగా ఈ లోకాలను సృష్టించింది. లోకపాలకులను, విరాట్స్వరూపాన్ని, ఇంద్రియాలను, ఇంద్రియాధిదేవతలను, ఇంద్రియాల కోసం అన్నము సృష్టించింది. ఇప్పుడు పరమేశ్వరుడు, ఇంద్రియాలతో కూడిన మానవ శరీరంలో ప్రవేశించాలి అనుకున్నాడు. శిరస్సునందలి బ్రహ్మరంధ్రం ద్వారా మానవ శరీరంలోకి ప్రవేశించాడు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు తనకుమారుడైన శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానాన్ని వివరిస్తూ "మొదటగా ఉన్నది ఏకైక పరబ్రహ్మ. అది అనేకం కావాలనుకుంది.

రకరకాల రూపాలతో వస్తువులుగా, జీవులుగా రూపుదాల్చింది. ద్రవ, ఘన, వాయు పదార్థాలగా మార్పు చెంది అనేక రూపాలతో సృష్టి ఆకారం పొందింది. ఈ రకంగా పరబ్రహ్మలో నుంచే ఇవన్నీ వచ్చినాయి.

తాను అనేకం కావాలనుకున్నప్పుడు సత్తు మొదటగా అగ్నిని సృష్టించింది. అగ్ని నుండి జలము, జలము నుండి భూమి ఏర్పడ్డాయి. అప్పుడు సత్తు, అగ్ని, జలము, అన్నములలో ప్రవేశించాలి అనుకుంది. అంతే ప్రవేశించి వ్యక్తమైన రూపాలు పొందింది."

జీవుడు ఈ శరీరానికి చేతనుడైన యజమాని. బ్రహ్మానికి జీవుడు స్వరూపం. ఉద్ధాలకుడు చెబుతున్నాడు "మానవుడు నిదురించేటప్పుడు తాత్కాలికంగా ఆత్మలో లీనమవుతాడు. మరణకాలంలో వాక్కు మనసులో లీనమవుతుంది. మనసు ప్రాణంలో లీనమవుతుంది. ప్రాణం తేజస్సులో కలిసిపోతుంది. చివరకు అది పరమశక్తిలో కలిసిపోతుంది. ఆ శక్తి చాలా సూక్ష్మమైనది. కాని విశ్వమంతా వ్యాపించి ఉన్నది. అదే సత్యము. అదే నిత్యము అదే ఆత్మ. అదే నీవు. శ్వేతకేతూ ఆ ఆత్మే నీవు."

ఈ రకంగా నువ్వే ఆత్మ అని ఉపదేశం చెయ్యబడ్డది. అంటే ఆత్మ, జీవుడు ఒక్కటే అని చెప్పబడ్డది. అయితే రాజుగారు తనకు అన్నివిధాలా సహాయకారి అయిన మంత్రిని చూపించి 'ఇతడే నా ఆత్మ' అంటాడు. అందుచేత ఆత్మ అన్నంతమాత్రం చేత ఈక్షితి వ్యవహారం గౌణం కాదనటానికి వీలు లేదు కదా" అని అనుమానం వస్తుంది.

ఈ సందేహం నివృత్తి చెయ్యటానికి తరువాత సూత్రం చెబుతున్నారు.

***సూత్రం – 7 "తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్"***

ఆత్మనిష్టుడైన వాడికి మాత్రమే అనగా చేతనుడైన పురుషుడికి మాత్రమే మోక్షోపదేశం చెయ్యటంవల్ల, అచేతనమైన ప్రధానాన్ని (ప్రకృతిని) ఆత్మశబ్దంతో చెప్పటానికి వీలు లేదు. శరీరము జడము అది ఆత్మకాదు.

ప్రకృతి ఆత్మకాదు. అది జడపదార్థం. ఉద్దాలకుడు శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానాన్ని వివరిస్తూ "ఓ శ్వేతకేతూ ! నీవే ఆత్మ" ఆత్మయే నీవు. అని ఉపదేశించాడు. అంతా విన్న శ్వేతకేతువు అడుగుతున్నాడు "తండ్రీ! ఆత్మజ్ఞానాన్ని పొందే ఉపాయమేదో

శెలవివ్వండి" అని. అప్పుడు ఉద్దాలకుడు చెబుతున్నాడు. "శ్వేతకేతూ! ఒక మనిషి చేతులు కట్టివేసి, కళ్ళకు గంతలు కట్టి భయంకరమైన అరణ్యంలో వదలివేశామనుకో. అప్పుడు అతడికి తాను ఎక్కడున్నాడో తెలియదు. దారితెన్నూ కనిపించదు. అసలు అది పగలో రాత్రో కూడా తెలియదు. ఆ స్థితిలో పిచ్చివాడిలాగా తిరుగుతాడు. గొంతెత్తి అరుస్తాడు. ఏడుస్తాడు. ఆ సమయంలో ఎవరైనా వచ్చి కళ్ళగంతలు విప్పేశారనుకో అప్పుడు అతడికి త్రోవ కనిపిస్తుంది. కనిపించిన బాట వెంట వెడతాడు. త్రోవలో ఎదురైన వాళ్ళను తన ఊరికి దారెటో అడిగి తెలుసుకుంటాడు. అటువంటి ఆత్మనిష్టగలవాడికి శరీరపాతం అంటే ఈ శరీరాన్ని వదలటమే ఆలస్యం. మోక్షం సిద్ధిస్తుంది. అతడు బ్రహ్మ అవుతాడు" అన్నాడు.

ఇక్కడ 'శ్వేతకేతూ నీవే ఆత్మ' అంటే శ్వేతకేతువు శరీరం ఆత్మ కాదు. అతనిలో ఉండే జీవాత్మయే పరమాత్మ. ఆ రెండూ ఒక్కటే అని అర్థం. **ముండకోపనిషత్తు**లో పరమాత్మను గురించి వివరిస్తూ ఒకే పేరు, రూపము గల రెండు పక్షులు ఒక చెట్టుమీద కూర్చుని ఉన్నాయి. అందులో ఒకటి జీవాత్మ. తన కర్మవల్ల వచ్చిన ఫలితాలను అనుభవిస్తోంది. రెండవది పరమాత్మ. కర్మఫలం ఏదీ లేకుండా చూస్తూ కూచుంది. శరీరమే ఆ వృక్షం. ఆ పక్షులే క్షేత్రజ్ఞ పరమాత్మలు వారిద్దరూ వేరుకాదు.

పరబ్రహ్మ దివ్యుడు, అచింత్యుడు, సూక్ష్మాతిసూక్ష్మమైనవాడు, అజ్ఞానులకు దూరంగానూ, జ్ఞానులకు దగ్గరగానూ ఉంటాడు. అతడికి రూపం లేదు. కంటికి కనిపించడు.

ఆత్మ అనేది సూక్ష్మరూపంలో మనలోనే ఉంది ఆత్మసాక్షాత్కారానికి చిత్తశుద్ధి అవసరం. శుద్ధమైన అంతఃకరణ గల జ్ఞాని కోరుకున్నవి పొందగలుగుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు. అతడే సాక్షాత్తూ పరబ్రహ్మ అని చెప్పబడింది. ఇక్కడ అతడు సాక్షాత్తూ పరబ్రహ్మ అంటే ఎవరు బ్రహ్మ? సాధకుడి శరీరమా? కాదే. ఆ శరీరం ఇక్కడే మట్టైపోతుంది. మరి బ్రహ్మ ఎవరు? జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే అంటే జడమైన సాధకుని శరీరం బ్రహ్మకాదు. చేతనమైన అతని ఆత్మయే బ్రహ్మము.

ఒకవేళ ఇలా కాకుండా జడమైన ప్రకృతి, లేక సాధకుడి శరీరమే ఆత్మ అనుకుంటే **అంధవృషభ న్యాయం**లా ఉంటుంది. పూర్వకాలంలో ఒక గ్రుడ్డివాడు తన బంధువుల ఇంటికి వెళ్ళటానికి బయలుదేరాడు. దారిలో పెద్ద అడవిగుండా

పోవాలి. ఆ అడవిలో త్రోవ తెలియక పెద్దరాయి తగిలి క్రింద పడిపోయాడు గ్రుడ్డివాడు. అటుగా పోతున్న ఒక తుంటరి గ్రుడ్డివాడిని అడిగి విషయం తెలుసుకుని దూరంగా గడ్డిమేస్తున్న ఒక పొగరుబోతు ఆబోతును తోలుకువచ్చి, దానితోకను అతని చేతిలో ఉంచి, ఎట్టి పరిస్థితిలోనూ దీన్ని వదలకు. ఇది నిన్ను మీ బంధువుల ఇంటికి తీసుకుపోతుంది అన్నాడు. ఆ మాట నిజమే అని నమ్మాడు గ్రుడ్డివాడు. ఆబోతు తోకను గట్టిగా పట్టుకున్నాడు. తోకను గట్టిగా పట్టుకోగానే ఆబోతు బెదిరి పరుగెత్తటం మొదలుపెట్టింది. గ్రుడ్డివాడుకూడా దాని వెనకే పరుగు మొదలుపెట్టాడు. ఆబోతు రాళ్ళు, గోతులు, ముళ్ళు అనే తేడా లేకుండా పరుగెత్తింది. దాంతో గ్రుడ్డివాడు అలసిపోయి, ఒళ్ళంతా దెబ్బలు తగిలి, కదలలేని స్థితిలో క్రింద పడిపోయి ప్రాణాపాయం తెచ్చుకున్నాడు. ఈ శరీరమే ఆత్మ అనుకున్న వారి గతి కూడా అంతే. కాబట్టి జడమైన సాధకుని శరీరం ఆత్మకాదు. అతనిలో ఉన్న జీవాత్మయే పరబ్రహ్మ. ప్రజాపతి చేసిన ఉపదేశాన్ని తప్పుగా అర్థం చేసుకుని, రాక్షసులు ఈ శరీరమే ఆత్మ అనుకుని భ్రష్టులయ్యారు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో పూర్వకాలంలో ప్రజాపతి ఇంద్రుడికి ఆత్మతత్త్వాన్ని వివరించాడు.

పూర్వకాలంలో ఒకసారి ప్రజాపతి ఆత్మతత్త్వాన్ని గురించి ఒక ప్రకటన చేశాడు.

“ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. శోకం తాకదు. దానికి ఆకలి దప్పికలు లేవు. మానవుడు సత్యకామడు, సత్య సంకల్పుడు అయి ఆత్మజిజ్ఞాసను అలవరచుకోవాలి. ఆత్మకోసం అన్వేషించినవాడు, ఆత్మను అనుభవించినవాడు ఆత్మస్వరూపాన్ని పొందుతాడు. పూర్ణస్థితి అతనికి వస్తుందన్నమాట.”

దేవతలు, రాక్షసులుకూడా ఆ మాటలు విన్నారు. “ఆత్మను గురించి మనంకూడా అన్వేషిద్దాం. ఆత్మవల్ల అన్ని కోరికలు తీరతాయని బ్రహ్మ చెప్పాడు కదా!” అని వారు భావించారు.

దేవతలరాజు ఇంద్రుడు, రాక్షసుల రాజు విరోచనుడు ఇద్దరూ ఆత్మజ్ఞానం సంపాదిద్దామని చేతితో దర్భలు పట్టుకుని బ్రహ్మవద్దకు వెళ్ళారు. వీరిద్దరినీ ముప్పైరెండు సంవత్సరాలు, బ్రహ్మచర్యదీక్ష వహించమని చెప్పాడు బ్రహ్మ. దీక్ష పూర్తి చేశారిద్దరూ.

"వత్సలారా ! మీరు నాకోసం దేనికి వచ్చారు?" అన్నాడు బ్రహ్మ.

"భగవాన్ ! ఆత్మ తత్త్వాన్ని గురించి మీరు చెప్పిన విషయాలు విన్నాం. ఆత్మను గురించి ప్రత్యక్షంగా తమ నోటిమీదుగా వినాలని వచ్చాం" అన్నారు. ఇంద్ర విరోచనులు.

"మనుష్యుల కనుపాపలలో మెదలుతూ కనుపించే పురుషుడే ఆత్మ. ఆత్మ అభయం. అమృతమయం. అదే బ్రహ్మం" అన్నాడు బ్రహ్మ.

అదివిన్నవారు "భగవాన్ ! నీటిలో కనుపించే ప్రతిబింబం, అద్దంలో కనిపించే ప్రతిబింబం. ఈ రెంటిలో ఏది ఆత్మరూపం?" అని అడిగారు.

"నేను మొదటగా కళ్ళలో మెరిసే ఏపురుషుని వర్ణన చేశానో వీటన్నింటిలోనూ ప్రతిఫలించేది ఆ పురుషుడే. ఒకసారి నీళ్ళలోను, అద్దంలోను మీ రూపాలు చూసుకుని మీ అనుభవాలు నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ. ఇంద్ర విరోచను లిద్దరూ అలాగే చేసి ప్రజాపతి దగ్గరకు వెళ్ళారు. ప్రజాపతి వీరిని చూసి "మీరు ఏం చూశారు." అన్నాడు.

"నఖశిఖ పర్యంతము కేశపాశాలతో మా శరీరాల ప్రతిరూపమే మాకు నీళ్ళలోనూ, అద్దంలోనూ కూడా కనిపించింది" అన్నారు వారు.

"నాయనలారా ! శరీరాలు శుభ్రపరచుకుని, మంచి వస్త్రాలు ఆభరణాలు ధరించి నీటిలో మీ ముఖాన్ని చూసుకోండి. తరువాత ఏం చేశారో నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ 'అలాగే' అని చెప్పి ఇద్దరూ వెళ్ళిపోయారు. మరునాడు తిరిగి వచ్చి "స్వామీ ! ఈ చక్కని వస్త్రాలతో ఆభరణాలతో అలంకరించిన మా శరీరాలే నీటిలో కనిపించాయి" అన్నారు.

"అభయమూ, అమృతమయమూ అయిన ఆత్మ అదే. అదే బ్రహ్మము" అన్నాడు ప్రజాపతి

అదివిన్న ఇంద్ర విరోచనులు ఆత్మను గురించి తమకు అంతా తెలిసిందనుకుని తిరిగి వెళ్ళిపోయారు. అలా వెళ్ళిపోతున్నవారిని చూసి" అసలు ఆత్మజ్ఞానం లభించకుండానే వారు తెలిసింది అనుకుని వెళ్ళిపోతున్నారు. వారు దేవతలైనా, రాక్షసులైనా **శరీరాన్నే ఆత్మ అని భావించటం పతన హేతువు"** అనుకున్నాడు బ్రహ్మ.

విరోచనుడు ఆత్మని గురించిన ఈ సిద్ధాంతంతోనే తృప్తి చెంది, రాక్షస జాతి కంతటికీ ఈ సిద్ధాంతాన్నే బోధించాడు. అసలైన పరమసత్యం తనకు లభించిందని తృప్తి చెందాడు. దేహమే ఆత్మ అని ప్రచారం చేశాడు. ఈ రకంగా చెయ్యటం వల్ల రాక్షసులు పతనమైనారు.

**సూత్రం - 8 "హేయాత్వావచనాచ్చ"**

'నిరాకరింపబడినది' అనే మాట చెప్పకపోవటంవల్ల ప్రధానం సచ్ఛబ్ద వాచ్యంకాదు. (ప్రకృతి ఆత్మ కాదు)

ప్రకృతి అనేది అనాత్మ. జడము ఒకవేళ ఇది సచ్ఛబ్ద వాచ్యం గనక అయి ఉంటే, తేలికగా అర్థం కావటం కోసం స్థూల అరుంధతీ న్యాయంగా **'తత్త్వమసి'** అని చెప్పినప్పటికీ, ఆ తరువాత యధార్థమైన దానిని గ్రహించేటట్లు చెయ్యటంకోసం ముందు చెప్పిన దాన్ని నిరాకరించాలి. అలా చెయ్యలేదు కాబట్టి జడమైన ప్రకృతి సచ్ఛబ్దవాచ్యం కాదు. అని వాదన.

**'స్థూల అరుంధతీన్యాయం'**

అరుంధతి వసిష్ఠ మహర్షి భార్య. మహాపతివ్రత. నిత్య సౌభాగ్యవతి. వసిష్ఠుడు సప్తర్షులలో ఒకడు. నక్షత్రమండలంలో ఉత్తరదిక్కున ఉంటారు సప్తర్షులు. సప్తర్షి మండలం పైనే ధృవమండలం ఉన్నది.

సప్తర్షి మండలంలో క్రింది వరుసలో ఉన్న మూడు నక్షత్రాలలో మధ్యన ఉండేది వసిష్ఠ నక్షత్రం. వసిష్ఠ నక్షత్రానికి దిగువగా, అతిసమీపంలో ఉండే అతిచిన్న నక్షత్రమే అరుంధతి. చాలా జాగ్రత్తగా చూస్తేగాని కనిపించదు. స్థూల అరుంధతీ న్యాయం అంటే – చాలా చిన్నదైన అరుంధతి నక్షత్రాన్ని చూడటానికి దానికి దగ్గరలో ఉన్న పెద్ద నక్షత్రం అయిన వసిష్ఠ నక్షత్రాన్ని ముందు ఆనవాలుగా చూపిస్తారు. తరువాత అది కాదని దాని ప్రక్కన ఉన్న చిన్న నక్షత్రం చూపుతారు. అలాగే ఏదైనా ఒక సూక్ష్మమైన విషయాన్ని తెలియచేసేటప్పుడు, అది సులభంగా అర్థం గావటానికి, ఇంకొక స్థూలవిషయాన్ని ముందుగా చెప్పి, ఆ తరువాత అది కాదు అని అసలు విషయాన్ని చెప్పటం. ఫలానా సందులో మూడు అంతస్థుల మేడ ప్రక్కన ఉన్న ఇల్లు. ఇక్కడ కావలసింది మేడ కాదు ప్రక్క ఇల్లు.

అయితే ఇక్కడ శ్వేతకేతువుకు 'తత్త్వమసి' నువ్వే ఆత్మ అని చెప్పారు. కాని దాన్ని తరువాత నిరాకరించలేదు. అందుచేత చైతన్యమైనదే ఆత్మ. అంతేకాని జడము ఆత్మకాదు.

***సూత్రం – 9 "స్వాప్యయాత్"***

సుషుప్తి కాలంలో జీవులు స్వరూపంలో లయం చెందుతున్నాయి. కాబట్టి సచ్ఛబ్దవాచ్యం చేతనమైన బ్రహ్మేకాని జడమైన ప్రకృతి కాదు.

నిద్రపోతున్న మానవుడు ఎక్కడికి పోతాడు? అని అడిగిన శ్వేతకేతువుకు తండ్రియైన ఉద్దాలకుడు చెబుతున్నాడు. "నాయనా! నిద్ర పోతున్నప్పుడు మనిషి తాత్కాలికంగా ఆత్మతో తాదాత్మ్యం చెందుతాడు. తేనెటీగలు తోటంతా తిరిగి మకరందాన్ని స్వీకరించి తేనెగా తయారుచేస్తాయి. ఆ తేనె ఆ పూవుల నుంచి స్వీకరించినదే. కాని ఏ చుక్క ఏ పూవు నుంచి తీసిందో చెప్పలేము. అలాగే జీవరాసులు విడివిడిగా ఉన్నప్పటికీ ఆత్మలోనే లీనమై ఉంటాయి. అది నిద్రాసమయం, లేదా మరణ సమయం ఏదైనా కావచ్చు. గాఢనిద్రలో గతం తెలియదు.

మానవుడు నిద్రించేటప్పుడు ఆత్మలో తాత్కాలికంగా లీనమవుతాడు. ఆ ఆత్మయే నీవు"

కుమారా ! మానవుడు గాఢనిద్రలో ఉన్నప్పుడు అతడు సుషుప్తిలో ఉన్నాడంటారు. ఆ సమయంలో జీవుడు పరమసత్తను పొందుతాడు. అంటే తన నిజస్వరూపాన్ని పొందుతాడు. ఆ స్థితిలో ఆత్మను స్వపితి అంటారు. సుషుప్త్యావస్థలో మనస్సు ఇంద్రియాలు పని చెయ్యటం మానివేస్తాయి. అప్పుడు మిగిలేది ఆత్మ మాత్రమే.

**బృహదారణ్యకోపనిషత్తు**లో బాలాకికి కాశీరాజు బ్రహ్మోపదేశం చేస్తాడు. అందులో "జీవి నిద్రిస్తుండగా ఇంద్రియాల యొక్క విషయాలన్నీ, అంటే వాక్కు మొదలైన ప్రాణాల విజ్ఞానాన్ని పూర్తిగా గ్రహించి హృదయాకాశంలో నిద్రిస్తున్నాడు.

ఈ రకంగా సుషుప్తిలో ఇంద్రియాలన్నీ ఆత్మలో లయం చెందుతాయని చెప్పబడింది. కాబట్టి చైతన్యమైన ఆత్మయే సచ్ఛబ్దవాచ్యము. అంతేకాని జడమైన ప్రకృతి కాదు.

*సూత్రం - 10 "గతిసామాన్యాత్"*

వేదాంతములన్నీ చేతనమైన బ్రహ్మయే జగత్కారణము అని చెబుతున్నాయి. కాబట్టి జగత్కారణం ప్రకృతి కాదు. బ్రహ్మమే.

ఉపనిషత్తులలో ఒకసారి జగత్తుకు కారణము బ్రహ్మ అని, ఇంకోసారి కాదు అని చెప్పలేదు. ప్రతిచోట ఉపనిషత్తులు ఈ జగత్తుకు కారణము 'బ్రహ్మమే' అని చెప్పాయి. **ముండకోపనిషత్తు**లో శౌనకుడికి అంగీరసుడు ఈ విషయాన్ని చెబుతూ, "ప్రజ్వరిల్లిన అగ్ని నుండి అదే విధమైన ఆకారము, గుణము గల వేలకొలది నిప్పురవ్వలు వెలువడినట్లే పరబ్రహ్మ నుండి అనేకమైన జీవరాసులు ఉద్భవించి, మళ్ళీ అందులోనే లీనమవుతున్నాయి."

సాలెపురుగు ఏ సహాయం లేకుండానే తన శరీరం నుంచి దారాలను తయారు చేసి వాటిని మళ్ళీ తానే మింగేస్తుంటుంది. భూమి నుండి ఓషధులు పుడుతున్నట్లుగా, మానవ శరీరం మీద రోమాలు పుడుతున్నట్లుగా, అక్షర పరబ్రహ్మ నుంచి ఈ జగత్తు పుడుతున్నది అన్నారు. **తైత్తిరీయోపనిషత్తు**లో "సృష్టికి మూలము ఆత్మ. దానినుంచే ఆకాశం పుట్టింది. పంచభూతాలు పుట్టినాయి. పంచభూతాలవల్లనే శరీరం ఉద్భవించింది" అని చెప్పబడింది.

ఈ రకంగా ప్రతి ఉపనిషత్తు కూడా ఈ జగత్తుకు కారణము బ్రహ్మమే అని చెబుతున్నాయి.

*సూత్రం - 11 "శ్రుతత్వాచ్చ"*

సర్వజ్ఞుడైన పరబ్రహ్మమే ఈ జగత్తుకు కారణము అని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి కాబట్టి ఈ జగత్తుకు కారణము చేతనమైన బ్రహ్మమే కాని, అచేతనమైన, జడమైన ప్రకృతి కాదు. జగత్తులో చేతనమైనది ఆ పరమేశ్వరి ఒక్కతే. కాబట్టి **బ్రహ్మముఅంటే ఆపరాశక్తియేతప్ప వేరెవరూకాదు.** అంటూ ఐదవ అధికరణము పూర్తి చేశారు.

# ౬. ఆనందమయాధికరణము (బ్రహ్మము ఆనందమయము)

ఈశ్వరుడు ఒక్కడే. అయినప్పటికీ సాకారుడు, నిరాకారుడు అని రెండుగా చెప్పబడుతున్నాడు. నామరూపాలున్న వాడు, ఆకారంలో మార్పు చెందేవాడు, ఉపాధి అంటే శరీరము గలవాడు ఉపాస్యుడు. ఉపాసన చేయబడతాడు. జపాలు, పూజలు, అర్చనలు అభిషేకాలు అతనికే జరుగుతాయి. నామరూప వికారాలు లేనివాడు నిరాకారుడు జ్ఞేయుడు తెలుసుకోదగినవాడు అనబడతాడు. ఈ ఇద్దరిలో ఎవరు బ్రహ్మ అనే అనుమానం వస్తుంది. ఇక్కడ మనం గుర్తించవలసిన విషయం ఏమంటే **'వీరిద్దరిలో ఎవరివల్లైతే నీకు ఆనందం కలుగుతుందో అతడే బ్రహ్మ.** ఈ విషయాన్ని ఆరవ అధికరణలో వివరిస్తున్నారు. దీనిపేరు **'ఆనందమయాధికరణము'** ఇందులో ఎనిమిది సూత్రాలున్నాయి.

***సూత్రం - 12 "ఆనన్దమయోఽభ్యాసాత్"***

ఆనందమయుడు అనే శబ్దాన్ని పరబ్రహ్మను సూచించటానికే ఉపనిషత్తులలో పదేపదే వాడారు. అందుచేత ఆనందమయుడంటే పరమాత్మ అంతేకాని జీవికాదు.

**తైత్తిరీయోపనిషత్తు**లో అన్నమయ, ప్రాణము, మనోమయ, విజ్ఞానమయ కోశాలు దాటిన తరువాత ఆనందమయ కోశమున్నది. అదే పరమాత్మ స్థానము. చరాచర జగత్తంతా బ్రహ్మమయమే. సృష్టికి పూర్వం అంతా శూన్యంగానే ఉండేది. ఆ శూన్యంలో పరబ్రహ్మ ఒక్కడే ఉండేవాడు. అతడే నామరూపాత్మకమైన జగత్తును సృష్టించాడు. అతడే ఆనందమయుడైన బ్రహ్మ.

బ్రహ్మను తెలుసుకున్నవాడు మోక్షానికి అర్హుడు. అంటే తానే పరబ్రహ్మ అవుతాడు. దహరాకాశంలో ఉన్న పరబ్రహ్మని తెలుసుకున్న వాడికి జ్ఞానము, ఇష్టకామ్యార్థ సిద్ధి కలుగుతుంది. సాయుజ్యం లభిస్తుంది.

ఆనందమయుడు బ్రహ్మ. అంటే ఆనందాన్ని కలుగజేసేవాడు బ్రహ్మ. ఆనందము అంటే క్షణికమా? శాశ్వతమా?

**తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పినట్లుగా

భీషా౭స్మాద్వాతః। పవతే భీషోదేతి సూర్యః। భీషా౭స్మాదగ్ని శ్చేన్ద్రశ్చ।
మృత్యుర్ధావతి సైషా౭౭నన్దస్య మీ మాగ్ంసా భవతి
యువా స్యాత్సాధు యువాధ్యాయకః ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః।
తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణాస్యాత్।
స ఏకో మానుష ఆనన్దః। శ్రోత్రియస్య చాకామహతస్య।
తేయే శతం మానుషానన్దాః।
స ఏకో మనుష్య గన్ధర్వాణామానన్దః।
శ్రోత్రియస్య చాకామహతస్య।
తే యే శతం మనుష్యగన్ధర్వాణామానన్దః।
స ఏకో దేవగన్ధర్వాణా మానన్దః। శ్రోత్రియస్య చాకామహతస్య।
తే యే శతం దేవగన్ధర్వాణామానన్దః।
స ఏకః పితౄణాం చిర లోకలోకానామానన్దాః।
శ్రోత్రియస్య చాకామహతస్య।
తే యే శతం పితౄణాం చిరలోకలోకానామానన్దః।
స ఏక అజానజానాం దేవానామానన్దః। శ్రోత్రియస్య చాకామహతస్య।
తే యే శతమాజానజానాం దేవానా మానన్దాః।
స ఏకః కర్మ దేవానాం దేవానామానన్దః।
యే కర్మణా దేవానపియన్తి। శ్రోత్రియస్య చాకామహతస్య।
తేయే శతం కర్మదేవానాం దేవానామానన్దాః।
స ఏకో దేవానామానన్దః। శ్రోత్రియస్య చాకామహతస్య।
తేయే శతమిన్ద్రస్యా నన్దాః।
స ఏక ఇన్ద్రస్యానన్దః శ్రోత్రియస్య చాకామహతస్య।
తే యే శతం శతమిన్ద్రస్యానన్దాః।
సఏకోబృహస్పతేరానన్దః। శ్రోత్రియస్య చాకామహతస్య।
తే యే శతం బృహస్పతేరానన్దః।

**స ఏకః ప్రజాపతేరానన్దః । శ్రోత్రియస్య చాకామహతస్య ।**

**తే యే శతం ప్రజాపతే రానన్దాః । స ఏకో బ్రహ్మణ ఆనందః ॥**

కోరికలను అనుభవించటం వల్ల పొందే ఆనందం క్షణికానందం. అనుభవించగానే ఈ ఆనందము తరిగిపోతుంది. రెండవది శాశ్వతమైన ఆనందం. అదే బ్రహ్మానందం. ఈ లోకంలోని సంపదఅంతా యువకుడు, సదాచార సంపన్నుడు, వేదాధ్యాయి, శరీరబలము గలవాడు అనుభవించటానికే ఉన్నది. ఇటువంటి వ్యక్తి అనుభవించే ఆనందాన్ని మానుషానందము అంటారు.

| | | |
|---|---|---|
| మానుషానందానికి నూరు రెట్లు | – | మనుష్యగంధర్వానందం |
| మనుష్య గంధర్వానందానికి నూరురెట్లు | – | దేవగంధర్వానందం |
| దేవగంధర్వానందానికి నూరురెట్లు | – | చిరలోక పితరానందం |
| చిరలోకపితరానందానికి నూరురెట్లు | – | అజానజదేవానందం |
| అజానజదేవానందానికి నూరురెట్లు | – | కర్మదేవానందం |
| కర్మదేవానందానికి నూరురెట్లు | – | దేవానందం |
| దేవానందానికి నూరురెట్లు | – | ఇంద్రానందం |
| ఇంద్రుని ఆనందానికి నూరురెట్లు | – | బృహస్పతి పొందే ఆనందం |
| బృహస్పతి ఆనందానికి నూరురెట్లు | – | ప్రజాపతి ఆనందం |
| ప్రజాపతి ఆనందానికి నూరురెట్లు | – | బ్రహ్మానందం |

బ్రహ్మానందము అనేది ఐదు రకాల ఆనందాల కలయిక. అవి 1. జ్ఞానానందము 2. విషయానందము 3. ఆత్మానందము 4. అద్వైతానందము 5. యోగానందము.

ఇతడే ఆనందస్వరూపుడైన పరబ్రహ్మ.

ఆనందమయుడైన బ్రహ్మ పంచకోశముల లోపల ఉన్నాడు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశముల మధ్య ఆనందమయ కోశమున్నది. అందులో ఉండే ఆనందమయ పురుషుడికి–

| | |
|---|---|
| ప్రియము (తనవారిని చూచినప్పుడు కలిగే సంతోషము) | – శిరస్సు |
| మోదము (కోరుకున్నది లభించినప్పుడు కలిగే సంతోషము) | – దక్షిణ పక్షము |
| ప్రమోదము (మోదము ఎక్కువైనపుడు కలిగేది) | – ఉత్తర పక్షము |
| ఆనందము (అన్నింటినీ మించినది) | – ఆత్మ |

అని చెప్పబడింది. ఇక్కడ చివరలో చెప్పిన ఆనందాన్ని మించినది లేదు. అదే పరమాత్మ. ఈ ఆనందాన్ని కోరికలు లేనివాడు కూడా పొందుతాడు.

***సూత్రం - 13 "వికారశబ్దాన్నేతి చేన్న ప్రాచుర్యాత్"***

బ్రహ్మ విషయంలో 'ఆనందమయుడు' అనే శబ్దం వాడకూడదు. బ్రహ్మ ఆనందము అనే వికారం కలవాడు అని చెబుతున్నారు కాబట్టి ఆనందమయుడు బ్రహ్మకాదు అని కొందరంటారు. కాని అది సరికాదు. ఎందుకంటే మానుషానందం నుంచి వరుసగా బ్రహ్మానందం వరకు చెప్పారు. అంతేకాని ఆనందము అనేది బ్రహ్మకు వికారం కాదు. బ్రహ్మనిర్వికల్పుడు.

***సూత్రం - 14 "తద్ధేతువ్యపదేశాచ్చ"***

అటువంటి ఆనందానికి హేతువు బ్రహ్మ. కాబట్టి ఆనందమయుడంటే పరమాత్మయే కాని వేరు కాదు.

***సూత్రం - 15 "మాన్త్రవర్ణికమేవ చ గీయతే"***

మంత్రాల్లో చెప్పబడినట్టి బ్రహ్మమే బ్రాహ్మణంలో గానం చేయబడుతున్నది.

సత్యము జ్ఞానము అనంతము అయినది బ్రహ్మ. ఆకాశాది పంచభూతాలను ఆ బ్రహ్మమే సృష్టించింది. తరువాత ఆ భూతాలలో ప్రవేశించి బుద్ధిరూపమైన గుహలోనే పరబ్రహ్మ ఉన్నది. వారుణివిద్యలో వరుణమహర్షి కుమారుడు భృగుమహర్షి విద్యాభ్యాసం పూర్తిచేసి బ్రహ్మోపదేశం చెయ్యమని తండ్రిని అడుగుతాడు. బ్రహ్మవిద్య ఉపదేశిస్తే తెలిసేది కాదు. తపస్సు చేసి తెలుసుకోవాలన్నాడు తండ్రి. అలా తపస్సు చేసిన భృగువుకు వరుసగా అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము చివరకు ఆనందమే బ్రహ్మము అని తెలిసింది. కాబట్టి ఆనందమయుడు పరమాత్మే.

***సూత్రం - 16 "నేతరోఽనుపపత్తేః"***

ఆనందమయుడు అనే శబ్దానికి అర్థం పరబ్రహ్మకన్న ఇతరులు ఎవరూ లేరు. సృష్టి ప్రారంభానికి ముందు పరమాత్మ సృష్టి చెయ్యాలని కోరుకున్నాడు. ఈ రకంగా 'కోరటం' అనే ధర్మము జీవుడికి వర్తించదు. అది బ్రహ్మకే వర్తిస్తుంది. ఆ బ్రహ్మయే ఆనందమయుడు.

**సూత్రం - 17 "భేదవ్యపదేశాచ్చ"**

జీవాత్మకు పరమాత్మకు భేదం చెప్పటంవల్ల కూడా జీవుడు ఆనందమయుడు కాడు అని తెలుస్తోంది. వాస్తవంగా చూస్తే జీవాత్మ పరమాత్మలకు భేదం లేదు. కాని యధార్ధం తెలియక, అజ్ఞానంతో ఈ రెండింటి మధ్యనా తేడా ఉందని అనుకుంటారు. ఈ విషయమే **ముండకోపనిషత్తు**లో వివరించటం జరిగింది. ఒకే చెట్టుమీద రెండు పక్షులు కూచుని ఉన్నాయి. వాటిలో ఒకటి కర్మఫలాన్ని అనుభవిస్తోంది. రెండవది చూస్తూ కూచుంది. ఇవే జీవాత్మ, పరమాత్మలు. ఆ రెండూ ఒక్కటే. అజ్ఞానంవల్ల రెండింటికీ తేడా ఉన్నది అనుకుంటున్నారు.

పరమేశ్వరుడు లోకాలను, ప్రాణులను సృష్టించిన తరువాత బ్రహ్మరంధ్రంగుండా ప్రాణులలో ప్రవేశించి నవరంధ్రాలతో కూడిన ఈ పట్టణంలో ఉంటూ ఇంద్రియాలతో అన్ని సుఖాలూ అనుభవిస్తూ బయటకుపోయే మార్గం తెలియక పంజరంలో బంధించబడిన పక్షిలాగా కొట్టుమిట్టాడుతున్నాడు. అతడు శరీరంలో ఉన్నంతవరకు ఈ శరీరానికి ఉన్న బంధనాలన్నీ తనవే అనుకుంటాడు. ఇతడే జీవాత్మ. జీవాత్మ గనక వచ్చిన త్రోవనే అంటే బ్రహ్మరంధ్రం ద్వారానే బయటకు వెళ్ళగలిగినట్లైతే అది పరమాత్మలో లీనమవుతుంది. అంతవరకు అజ్ఞానంతో తాను, పరబ్రహ్మ వేరువేరని తలుస్తుంది. అంతేగాని నిజానికి ఆ రెండూ ఒక్కటే.

**సూత్రం - 18 "కామాచ్చ నానుమానాపేక్షా"**

**'సోఽకామయత'** అంటూ సాంఖ్యులు కోరికను చెప్పినందువల్ల అనుమాన ప్రమాణంతో సాధించిన జడమైన ప్రకృతి ఆనందమయము కాదు.

**సూత్రం - 19 "అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి"**

అజ్ఞాని అయిన వాడికి జ్ఞానసముపార్జన జరిగిన తరువాత, అతని ఆత్మ పరమాత్మలో లీనమై పోతుంది. పరమాత్మ యందు తాదాత్మ్యం గలవాడికి సంసార బంధనాలుండవు. ద్వైదీభావము ఉన్నవాడికి సంసార భయం ఉంటుంది.

సంసార బంధనాలలో చిక్కుకుని, దుఃఖసాగరంలో మునిగిపోయినవాడు, అజ్ఞానం తొలగిపోగానే సంసారబంధనాలు త్రెంచుకుని ఆనందమయుడైన పరమాత్మలో లీనమైపోతాడు.

ఈ రకంగా ఆనందమయుడు చైతన్యమైన బ్రహ్మయేకాని, జడమైన ప్రకృతికాదు. లలితా సహస్రంలోని నామాలలో

## 728. చిత్కలా

చిత్ అంటే – సచ్చిదానందరూపమైనది. పరబ్రహ్మ యొక్క కల.

**చిత్తేషు చిత్కలా నామశక్తిః సర్వశరీరిణామ్**

లోకంలో ఉండే జీవులందరి శరీరాలలోనూ చిత్కల అనే శక్తి ఉంటుంది. అది అఖండాకారుడైన ఆ పరమేశ్వరుని యొక్క కల. ఐతరేయోపనిషత్తులో చెప్పినట్లుగా పరమేశ్వరుడు విరాట్స్వరూపాన్ని పోలిన మానవుణ్ణి సృష్టించాడు. ఆ తరువాత బ్రహ్మరంధ్రం ద్వారా అతనిలో ప్రవేశించాడు. ఈ రకంగా ప్రవేశించిన పరమేశ్వరరూపమే చిత్కల. భగవద్గీతలో

**మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః**

నా అంశయే లోకమందు సనాతనుడైన జీవుడు అని చెప్పబడింది. లోకంలోని సమస్తజీవులు అతని అంశలే. ఈ చిత్కలయే చైతన్యము. దీని స్వరూపమైనది పరమేశ్వరి.

## 729. ఆనందకలికా

పరబ్రహ్మ యొక్క స్వల్పాంశమే ఆనందకళ. జీవిలో చిత్కల లాగానే ఇంకొక విశేషమున్నది. అదే ఆనందకళ. ఇది హింసరూపిణి. ఇది అఖండమైన ఆనందం. అద్వైతానందం, శాశ్వతమైన ఆనందం. అయితే ఈ ఆనందం మనకు మూడు రాకలుగా తెలుస్తుంది.

1. ప్రతిబింబానందం – ఇంద్రియాల ద్వారా అనుభవించబడుతుంది.
2. వాసనానందం – ఇది కారణ ప్రశక్తి లేక భావసామాన్యముగా కలిగేది.
3. నిజానందం – ఇదే బ్రహ్మానందం కేవలము జ్ఞానమువల్లనే కలుగుతుంది.

ఇది నాశనములేనిది. అటువంటి బ్రహ్మానందంలో లేశమాత్రమే ఈ ఆనందకలిక. పరమేశ్వరి అటువంటి రూపం కలిగి ఉంటుంది. ఇటువంటి ఆనందం కలిగి ఉన్నది ఆ పరమేశ్వరియే. కాబట్టి ఆమెయే పరబ్రహ్మ.

# 7. అంతరధికరణము

## (ఆదిత్యుని యందున్న పురుషుడు జీవుడు కాదు)

ఆదిత్యునిలో ఉన్న పురుషుడు జీవాత్మ కాదు. ఆదిత్యుడి కన్న భిన్నమైన వాడు పరమాత్మ. ఈ విషయాన్ని ఏడవదైన **'అంతరధికరణ'**లో వివరించారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

***సూత్రం - 20 "అన్తస్తద్ధర్మోపదేశాత్"***

ఆదిత్యమండలంలోని పురుషుడు, అక్షిలోని పురుషుడు, సంసారియైనట్టి అతిశయమును పొందినట్టి జీవుడు కాడు. అతడు పరమేశ్వరుడే. పరమాత్మ పాపరహితుడు. ఈ ధర్మము అక్షియందున్న పురుషుడికి కూడా చెప్పబడింది కాబట్టి అతడు కూడా పరమాత్మయే అతడే ఋక్కు, అతడే యజస్సు, అతడే సామము. అతడే బ్రహ్మ.

పరమాత్మకు శబ్దస్పర్శ రూపాదులు లేవు. అతడు అవ్యయుడు. **ఛాందోగ్యోప నిషత్తు**లో సనత్కుమారుడు నారదుడికి బ్రహ్మోపదేశం చేస్తూ "ఆత్మ సర్వవ్యాపకమైనది. ఊర్ధ్వలోకాలలో, అధోలోకాలలో కూడా అది వ్యాపించి ఉంది. అని చెప్పాడు.

***సూత్రం - 21 "భేదవ్యపదేశాచ్చాన్యః"***

సూర్యుడు వేరు, పరమాత్మ వేరు, పరమాత్మ సూర్యునిలోనే ఉన్నాడు. కాని అతడు సూర్యుడు కాదు. **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా సూర్యుడు అన్ని భూతాలకూ మధువు అన్ని భూతాలు ఆదిత్యునికి మధువులాంటివి. ఆదిత్యునిలో ఉన్న ప్రకాశవంతమైన పురుషుడే శరీరంలోని కనులలో ఉండే తేజోమయుడైన పురుషుడు. వీరిద్దరూ ఒకటే. అదే ఆత్మ.

పరమాత్మ ఆదిత్యలోకంలో ఉంటాడు. ఆదిత్యలోకం అతన్నెరగదు. ఆదిత్య లోకమే అతని శరీరం. ఆదిత్య లోకంలో ఉంటూ ఆదిత్యలోకాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామియైన ఆత్మ.

కాబట్టి ఆదిత్యున్నికన్న భిన్నమైనవాడు ఆ పరమాత్మ. అదే పరమేశ్వరి.

## 8. ఆకాశాధికరణము (ఆకాశము బ్రహ్మ)

ఆకాశం అంటే భూతాకాశం కాదు. పరమాత్మ. ఈ విషయాన్ని వివరిస్తున్నారు ఎనిమిదవదైన **'ఆకాశాధికరణ'**లో ఇందులో ఒకే సూత్రం ఉంది. సూత్రం 22.

ఆకాశం అంటే ఏది? భూతాకాశమా? లేకపోతే పరమాత్మయా?" ఇది పెద్ద అనుమానం.

ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము, జలము నుండి భూమి ఉద్భవించాయని సృష్టిక్రమంలో చెప్పబడింది. ఇక్కడ ఆకాశము అంటే భూతాకాశమే. కాని సమస్త భూతాలు ఆకాశం నుండే పుడుతున్నాయి. అని శ్రుతులు చెబుతున్నాయి. సమస్త భూతాలు ఆకాశం నుంచే పుట్టి అందులోనే లయమవుతున్నాయి. అంటే ఆకాశము అన్నప్పుడు అది భూతాకాశం కాదు. పరబ్రహ్మయే అని గుర్తించాలి.

***సూత్రం-22 "అకాశస్తల్లిఙ్గాత్"***

ఆకాశము అనే శబ్దం పరమాత్మ శూచకము.

**ఛాందోగ్యోపనిషత్తు**లో 'ఉద్గీథాన్ని' గురించి వివరిస్తున్నారు.

శలావతుని కుమారుడు శిలకుడు, చికితాయనుని కుమారుడు దాల్భ్యుడు, జీవలుని కుమారుడు ప్రవాహణుడు. ఈ ముగ్గురు మిత్రులు ఉద్గీథ విజ్ఞానంలో మంచి నేర్పరులు. ఒకరోజు వారు ఉద్గీథ మీద వాదోపవాదాలు సాగిద్దామనుకున్నారు. అప్పుడు ప్రవాహణుడు మిగిలిన ఇద్దరితోనూ "మీరు బ్రాహ్మణులు, పూజనీయులు. అందుచేత మీరిద్దరు చర్చించండి. నేను వింటాను" అన్నాడు. చర్చ ప్రారంభమైంది. ముందుగా శిలకుడు ప్రశ్న వేస్తున్నాడు.

"ఉద్గీథ రూపంలో ఉండే సామానికి ఆశ్రయం ఏది?

'స్వరమే సామానికి ఆశ్రయం'

'స్వరానికి ఆధారం ఏది?'

'స్వరానికి ప్రాణమే ఆధారం' (ప్రాణంవల్లనే స్వరం పుడుతోంది)

'ప్రాణానికి ఆధారం ఏది?'

'అన్నం'

'అన్నానికి ఆధారం ఏది?'

'జలం'

'జలానికి ఆధారం ఏది?'

'ఆ లోకం (స్వర్గం) ఎందుకంటే అక్కడ నుంచే వర్షం కురుస్తుంది.'

'ఆ లోకానికి ఆధారం ఏది?'

దానికి దాల్భ్యుడు "మనం స్వర్గాన్ని మించి మాట్లాడరాదు. సామమే స్వర్గమని స్తుతించబడింది కదా! మనం సామాన్ని గురించే చర్చిద్దాము అని అనుకున్నాము." అన్నాడు. అప్పుడు శిలకుడు 'నువ్వు చెప్పినట్లుగా సామం అత్యంత శ్రేష్ఠమైనది. సామానికి ఆధారం లేదు. అటువంటప్పుడు సామానికి ఆధారమున్నదని ఎవరైనా అంటే, వాడి తల తెగిపడుతుంది' అన్నాడు. ఇప్పుడు దాల్భ్యుడు అగుతున్నాడు.

"ఆ లోకానికి (స్వర్గలోకానికి) ఆధారం ఏమిటి?"

"ఈ లోకం. ఇక్కడ చేసే యజ్ఞయాగాది కర్మలద్వారానే స్వర్గలోకం పోషింపబడుతున్నది.

"మరి ఈ లోకానికి ఆధారమేది?"

"సమస్త ప్రాణులు ఈ లోకానికి ఆధారం. ప్రత్యక్షంగా కనిపించే ఈ లోకాన్ని సామం అతిక్రమించకూడదు. సామాన్ని ఈ లోకంలోనే చక్కగా ప్రతిష్టిస్తున్నాము" అన్నాడు దాల్భ్యుడు. ఇప్పుడు శిలకుడు అడుగుతున్నాడు.

"ఈ లోకానికి ఆశ్రయం ఏది?"

ప్రవాహణుడు సమాధానం చెబుతున్నాడు.

"స్వరాభిన్నమైన ఆకాశమే ఈ లోకానికి ఆశ్రయం. ఆకాశం అంతటా ఆవరించి ఉంది అంటే పరబ్రహ్మ అని గుర్తించాలి. సమస్త లోకాలు, జీవకోటి అంతాకూడా ఆకాశరూపమైన పరబ్రహ్మనుండే ఉద్భవించి, అందులోనే లీనమవుతున్నాయి. కాబట్టి ఈ లోకానికి ఆకాశమే ఆధారం అటువంటి ఈ ఉద్గీథమే – ఆకాశమే అన్నింటిలోకి శ్రేష్ఠమైనది. కాబట్టి ఉద్గీథాన్ని అనంతమైనదిగా, పరమాత్మ స్వరూపంగా భావించి ఉపాసించేవాడు బ్రహ్మాకాశపర్యంతము ఉన్న లోకాలన్నింటిని జయిస్తాడు.

వాయువు మొదలైన భూతాలన్నీ ఆకాశం నుంచే పుడుతున్నాయి. అంతమాత్రం చేత ఆకాశమంటే భూతాకాశం కాదు. అది పరమాత్మ. కాబట్టి 'ఆకాశం' అనగానే భూతాకాశం అని స్ఫురించినా, దాని అర్థం మాత్రం (పరమాత్మయే) పరాశక్తి.

# 9. ప్రాణాధికరణము (ప్రాణముబ్రహ్మ)

ప్రాణమే బ్రహ్మ అనే విషయాన్ని తొమ్మిదవ అధికరణ అయిన **'ప్రాణాధి కరణము'** లో వివరిస్తున్నారు. ఇందులో ఒకటే సూత్రం ఉంటుంది.

***సూత్రం-23 "అత ఏవ ప్రాణః"***

ప్రాణము అంటే పరమాత్మయా? లేక ప్రాణ, అపానాదులలోని ఒకటా?"

ఈ అనుమానం తీర్చటానికే వ్యాసభగవానుడు ఈ అధికరణాన్ని చెబుతున్నాడు.

ప్రాణమనేది పరబ్రహ్మ స్వరూపమే.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఉషస్తి చాక్రాయణుడు యాగం చేస్తున్న ఋత్విక్కులను పిలిచి చెబుతాడు. మీరు చేసే కార్యకలాపాలకు అధిష్ఠానదైవం ప్రాణం. అన్ని జీవరాశులు ప్రాణంలో ప్రవేశిస్తాయి. ప్రాణంతోనే జీవిస్తాయి" ఇక్కడ ప్రాణము అంటే పరబ్రహ్మ.

**ఛాందోగ్యోపనిషత్తు**లో అరుణుని కుమారుడైన ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు సుషుప్తిని గురించి వివరించాడు.

కుమారా! మానవుడు గాడనిద్రలో ఉన్నప్పుడు అతడు 'సుషుప్తి'లో ఉన్నాడంటారు. ఆ సమయంలో జీవుడు పరమసత్తను పొందుతాడు. అంటే తన నిజస్వరూనాన్ని పొందుతాడు. తన ఆత్మను తాను పొందుతాడు. కాబట్టి అతన్ని గురించి చెప్పేటప్పుడు అతడు నిద్రిస్తున్నాడంటారు.

అద్దంలో చూసినప్పుడు మన రూపం ప్రతిబింబిస్తుంది. కాని అద్దం తియ్యగానే అది మాయమై పోతుంది. మన నిజరూపం మాత్రమే మిగులుతుంది. అదే విధంగా సుషుప్త్యావస్తలో మనస్సు, ఇంద్రియాలు పనిచేయటం మానేస్తాయి. అప్పుడు మిగిలేది ఆత్మ మాత్రమే. ఆ ఆత్మ నిజరూపంలో మిగులుతుంది. ప్రతిబింబం లాంటి జీవభావం పోయి మిగిలేది ఆత్మభావం ఒక్కటే. ఆ స్థితిలో ఆత్మను "స్వపితి" అంటారు. తన ఆత్మ తనలోనే ఉన్నాడని, అతడు నిద్రిస్తున్నాడని అంటారు. ఇంద్రియాలన్నీ అలసట చెంది ఒక్కొక్కటే మనస్సులో లీనమై పోతాయి. మనస్సు ప్రాణంలో లీనమై పోతుంది. అంటే సుషాప్త్యావస్థలో ఒక్క ప్రాణం మాత్రమే మేల్కొని ఉంటుంది. ఆ ప్రాణమే ఇంద్రియాల యొక్క, మనస్సు యొక్క అలసటను తీరుస్తుంది.

ఒక పక్షిని తెచ్చి త్రాడుతో బంధించారనుకో. అది అవకాశమున్నంతవరకూ అన్ని దిక్కులలోనూ పరుగెత్తి ఎక్కడా విశ్రాంతి దొరకక, తనను కట్టివేసిన చోటికే వస్తుంది. అలాగే ఈ మనసుకూడా దిక్కుల చివరవరకూ పోయి ఎక్కడా విశ్రాంతి స్థానం దొరకక చివరకు ప్రాణరూపంలో మనకు వశమయ్యే ఆ పరదేవతనే ఆశ్రయిస్తుంది. దీనికి కారణము ప్రాణమనే బంధనం చేత ఈ మనస్సు బంధించబడి ఉండటమే. మనస్సుకు బంధన స్థానమైన ప్రాణమే పరదేవత. మనస్సే జీవాత్మ. అని చెప్పాడు.

ఇక్కడ ప్రాణం అంటే ప్రాణాపానాదులలోని ప్రాణమే అని ముందు అనిపించినా, ఇంద్రియాలు, మనస్సు అన్నీ ప్రాణంలో లీనమవుతాయి అని చెప్పటంవల్ల ప్రాణం అంటే పరమాత్మే కాని వేరుకాదు.

ఇక్కడ ప్రాణము అంటే ముఖ్యప్రాణము. ఏ ప్రాణము లేకపోతే శరీరం అచేతనమై పోతుందో ఆ ప్రాణము. అదే బ్రహ్మము. **బృహదారణ్యకోపనిషత్తు**లో ఒకసారి శరీరంలోని ఇంద్రియాలన్నీ నేను గొప్ప అంటే నేను గొప్ప అని పోట్లాడుకుని చివరకు బ్రహ్మదేవుడి దగ్గరకు వెడతాయి. అప్పుడు బ్రహ్మ మీలో ఒక్కొక్కరు శరీరాన్ని ఒక సంవత్సరంపాటు విడిచి వెళ్ళండి. మీలో ఎవరు లేకపోతే శరీరం అచేతనమై పోతుందో వారే గొప్ప అని చెప్పాడు. బ్రహ్మదేవుని మాట ప్రకారం ఒక్కొక్క ఇంద్రియమే శరీరాన్ని విడిచి బయటకు వెళ్ళినాయి. శరీరం మాత్రం అచేతనం కాలా. ఆఖరుగా ప్రాణం వంతు వచ్చింది. ప్రాణం బయటకు పోవటానికి సిద్ధమైంది. ఆ స్థితిలో శరీరంలోని అవయవాలన్నీ పని చెయ్యటం మానేశాయి శరీరం అచేతన మవుతోంది. ఈ విషయం గ్రహించి మిగిలిన ఇంద్రియాలన్నీ 'ఓ ప్రాణమా! మా అందరిలోకి నువ్వే గొప్పదానివి అని ఒప్పుకుంటున్నాము' అన్నాయి.

కాబట్టి ఏ ప్రాణం లేకపోతే శరీరం అచేతనమవుతుందో అదే ముఖ్య ప్రాణము. ప్రాణదేవత. ఆ ప్రాణమే బ్రహ్మ. అదే పరమేశ్వరి. పరాశక్తి.

# 10. జ్యోతిశ్చాధికరణము (జ్యోతిబ్రహ్మ)

పదవ అధికరణము **'జ్యోతిశ్చాధికరణము'** ఇందులో నాలుగు సూత్రాలున్నాయి. ఇందులో జ్యోతియే పరబ్రహ్మ అని నిరూపిస్తున్నారు. జ్యోతి అంటే పంచభూతాలలో ఉండే అగ్నికాదు.

***సూత్రం - 24 "జ్యోతిశ్చరణాభిధానాత్"***

ఇక్కడ జ్యోతికి చరణములు అంటే పాదములు చెప్పటంవల్ల, జ్యోతి అంటే పంచభూతాలలోని అగ్నికాదు. సాక్షాత్తు పరమాత్మయే.

**ఛాందోగ్యోపనిషత్తు**లో గాయత్రి అనబడే బ్రహ్మ యొక్క 'మహిమ గొప్పది. ఒకసారి దేవతలంతా గాయత్రి, త్రిష్టుప్, జగతి ఛందస్సులను సోమాన్ని తీసుకురమ్మని పంపారు. వీటిలో త్రిష్టుప్, జగతి ఛందస్సులు సోమాన్ని చేరలేక తిరిగి వచ్చేశాయి. అంతేకాకుండా వస్తూ త్రోవలో అలసట కారనంగా తమలోని కొన్ని అక్షరాలను వదలి వేశాయి. గాయత్రి మాత్రం సోమం దగ్గరకు వెళ్ళి, దాన్ని రక్షించే వారందర్నీ ఓడించి సోమాన్ని తెచ్చి దేవతలకిచ్చింది. తిరిగి వచ్చేటప్పుడు త్రోవలో జగతి ఛందస్సు వదలిన ఒక అక్షరాన్ని, త్రిష్టుప్ ఛందస్సు వదలిన మూడు అక్షరాలను కూడా తనతో కలుపుకుని వచ్చింది. ఆ కారణంగా గాయత్రి అన్నింటికి మించినది అయింది. పైగా ప్రాతః, మధ్యాహ్న, సాయంకాలాలు మూడింటిలోనూ వ్యాప్తమై ఉన్నది. బ్రాహ్మణునికి అత్యంతావశ్యకమవటంతో దాని గౌరవం ఇనుమడించింది. అందుచేతనే గాయత్రిని ఉపేక్షించినవాడు దేన్ని పొందలేడు.

గాయత్రీ ఛందస్సులో 24 అక్షరాలు ఒక్కొక్క పాదానికి ఆరు చొప్పున, నాలుగు పాదాలుగా ఉన్నాయి. ఇతర ఛందస్సులలో ఇంకా ఎక్కువ అక్షరాలుంటాయి. కాని వాటన్నింటిలోకి గాయత్రియే శ్రేష్ఠమైనది. స్థావర జంగమాత్మకమైన ప్రాణిసమూహ మంతా గాయత్రియే. వాక్కే గాయత్రి, సమస్త ప్రాణులూ గాయత్రి, వాగ్రూపమైన గాయత్రి అందరీ పేర్లనూ ఉచ్చరిస్తోంది కాబట్టి గాయత్రి అందరి పేర్లలోనూ ఉన్నది. ఈ రకంగా ప్రాణిజాతమంతా గాయత్రీ స్వరూపమే. గాయత్రి అనే శబ్దానికి ప్రాణులను గురించి పాడుతున్నది. ప్రాణులను రక్షిస్తున్నది అని అర్థం. ఈ లక్షణాలు గల గాయత్రి ఈ పృథ్వి తప్ప వేరుకాదు. చరాచరాలన్నీ భూమిలోనే ఉన్నాయి. అందుచే చరాచర జగత్తునంతటినీ గానం చేస్తూ - పాడుతూ, త్రాణం చేస్తూ

కాపాడుతూ ఉండే గాయత్రియే ఈ భూమి. పృథ్వి రూపమైన గాయత్రి, శరీరంలో ఉండే పంచభూతాలు, ఇంద్రియాలు, అన్నీ ఒకటే. **పురుషుని** శరీర రూపమైన గాయత్రియే పురుషుని హృదయ కమలంలో ఉండే పురుషుడు. ఇద్దరూ ఒక్కటే. అంటే ఆ పురుషునిలోనే, గాయత్రిలోనే ప్రాణాలు ప్రతిష్ఠితమై ఉన్నాయి.

ఈ జగత్తంతా బ్రహ్మయొక్క విభూతే. శుద్ధబ్రహ్మ కార్యబ్రహ్మకన్న గొప్పది. పాంచభౌతికమైన జగత్తంతా శుద్ధబ్రహ్మయొక్క ఒక పాదమే. మిగిలిన మూడు పాదాలు ఆ పరబ్రహ్మలోనే ఉన్నాయి. గాయత్రి ద్వారా ప్రతిపాదించబడిన మూడు పాదములు గల అమృత స్వరూపమైన బ్రహ్మము ఇదే.

***సూత్రం - 25 "ఛన్దోభిధానాన్నేతి చేన్న తథా చేతోర్పణనిగదాత్తథా హి దర్శనమ్"***

గాయత్రీ మంత్రము ఛందస్సును చెబుతోంది కాబట్టి అది బ్రహ్మ కాదు. అని వాదము. అయితే శ్రుతులలో గాయత్రీ ఛందస్సుద్వారా, గాయత్రి యందు ఉన్న బ్రహ్మమందు చిత్తాన్ని ఏకాగ్రం చెయ్యాలి అని చెబుతున్నారు. కాబట్టి బ్రహ్మమే నాలుగు పాదములు గలది అని అర్థం.

"అయితే గాయత్రి నాలుగు పాదాలు గలది. అని చెప్పారు కాని అది బ్రహ్మ అని చెప్పలేదు. అని కొంతమంది అంటారు. కదా?"

***సూత్రం - 26 "భూతాదిపాదవ్యపదేశోపపత్తేశ్చైవమ్"***

గాయత్రి ఛందస్సు ద్వారా గాయత్రిలో ఉన్న బ్రహ్మయందు మనసు నిలిపి, అదే సర్వమూ అని ఉపాసించిన వారికి, ఈ సమస్తమూ గాయత్రే. అంతేకాని అది అక్షరముల కూర్పు కాదు.

పృథివి మొదలైన భూతాలు గాయత్రి పాదాలుగా చెప్పబడ్డాయి. కాబట్టి గాయత్రి అంటే బ్రహ్మమే. ఒకవేళ గాయత్రి గనక బ్రహ్మ కాకపోతే పృథివి మొదలైన భూతాలు దీనికి పాదాలుగా ఉండవు.

***సూత్రం - 27 "ఉపదేశభేదాన్నేతిచేన్నోభయస్మిన్నప్య విరోధాత్"***

ఉపదేశ వాక్యాలు వేరుగా ఉండటం వల్ల వాక్యంలో చెప్పిన వస్తువు భిన్నం కాదు. గాయత్రి మంత్రాన్ని ఎన్ని రకాలుగా ఉపదేశించినా, అందులో చెప్పబడ్డ బ్రహ్మ ఒక్కటే. అంటూ ఈ అధికరణంలో బ్రహ్మ జ్యోతిస్వరూపుడు అని, జ్యోతి అంటే అగ్ని కాదు బ్రహ్మమే అదే పరాశక్తి అని వివరించారు.

# 11. ప్రతర్ధనాధికరణము (వాయువు బ్రహ్మ)

ప్రాణమే బ్రహ్మ అని చెప్పినప్పుడు ఈ ప్రాణము ప్రాణ అపాన వ్యానాదులలోది కాదు అని గతంలో చెప్పుకున్నాం. మళ్ళీ చిన్న అనుమానం ఏమంటే ఈ ప్రాణము వాయురూపమైనదా? కాదు. ఇది ముఖ్యప్రాణము. అన్నింటినీ నియంత్రించేది. ఏ ప్రాణం లేకపోతే శరీరం అచేతనమవుతుందో అది. ఈ విషయాన్నే పదకొండవదయిన **'ప్రతర్దనాధికరము'**లో వివరిస్తున్నారు. ఇందులో నాలుగు సూత్రాలున్నాయి.

***సూత్రం - 28 "ప్రాణస్తథానుగమాత్"***

పూర్వకాలంలో కాశీనగరాన్ని దివోదాసు అనే రాజు పరిపాలిస్తున్నాడు. అతడు చాలా పండితుడు, విద్వాంసుడు, పరాక్రమశాలి, ధర్మపరాయణుడు. అతని పాలనలో ప్రజలంతా సుఖశాంతులతో హాయిగా ఉన్నారు. దివోదాసు కుమారుడు 'ప్రతర్దనుడు' తండ్రికి తగిన తనయుడు.

ఒకసారి దేవదానవులకు భీకరమైన పోరు జరుగుతున్నది. దానవుల ధాటికి తట్టుకోలేక దేవతలు వెనుకంజ వెయ్యవలసి వచ్చింది. ఆ సమయంలో ఇంద్రుడికి గుర్తు వచ్చాడు దివోదాసు. వెంటనే దేవతలకు సహాయం రావలసిందిగా కబురు పంపాడు. విషయం తెలుసుకున్న దివోదాసు తనకుమారుడైన ప్రతర్దనుణ్ణి దేవతలకు సాయంగా పంపాడు. ఆ యుద్ధంలో చివరకు దేవతలే విజయం సాధించారు. విజయోత్సవ వేడుకలు నిర్వహించటానికి సభ ఏర్పాటు చేసి, దానికి ప్రతర్దనుణ్ణి కూడా ఆహ్వానించాడు ఇంద్రుడు. ఆ సభలో ప్రతర్దనుడి శౌర్యపరాక్రమాలను ప్రశంసించి "రాజా! దేవతలకు చాలా సహాయం చేసి విజయానికి కారకుడవైనావు. కాబట్టి నీకు ఏ వరం కావాలో కోరుకో" అన్నాడు ఇంద్రుడు. దానికి "నేను మానవుడను. కాబట్టి నాకు హితమైనది, పరమ పురుషార్ధమైనది ఏదో దాన్ని ప్రసాదించవలసినది" అన్నాడు రాకుమారుడు.

బ్రహ్మజ్ఞానం తప్ప మానవులకు హితమైనది ఏదీ లేదు. పురుషార్ధాలలో కూడా నాల్గవది, ముఖ్యమైనది మోక్షము. పరమాత్మను గురించి తెలుసుకున్న పురుషుడు

జనన మరణాల నుండి విముక్తుడౌతాడు. మోక్షం పొందాలంటే బ్రహ్మజ్ఞానం తప్ప వేరే సాధనము లేదు. పరబ్రహ్మకు సంబంధించిన జ్ఞానం కలిగినంతనే మానవుడి కర్మక్షయం అయిపోతుంది. కర్మక్షయం కావటమే పరమపురుషార్థం.

ఆ మాటలు విన్న ఇంద్రుడు "నేను ప్రాణాన్ని, ప్రజ్ఞాత్మను. అటువంటి నన్ను ఆయువుగాను, అమృతత్త్వంగాను తలచి ఉపాసన చెయ్యి" అంటాడు.

అంటే ఇక్కడ ప్రాణమే పరబ్రహ్మ అని చెప్పాడు ఇంద్రుడు. ఈ విషయం **కౌశీతకీ ఉపనిషత్తు**లో చెప్పబడింది.

***సూత్రం - 29 "న వక్తురాత్మోపదేశాదితి చేద ధ్యాత్మసంబన్ధభూమా హ్యస్మిన్"***

ఇక్కడ ఇంద్రుడు తనను గురించి చెప్పాడు. "నేనే ప్రాణాన్ని, ప్రజ్ఞాత్మను" అన్నాడు. ఇంద్రుడు దేవత. కాబట్టి ఇది దేవాత్మను గురించి చెప్పినది అని భావించరాదు. ఇది పూర్తిగా బ్రహ్మపరము.

"మరి అలా అయితే నేనే బ్రహ్మని" అని ఇంద్రుడు చెప్పాడు కదా! ఇంద్రుడు బ్రహ్మకాదు కదా! మరి తన ఆత్మను గురించి ఎందుకు చెప్పాడు? ఇది ప్రశ్న. దీనికి సమాధానం.

***సూత్రం - 30 "శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్"***

శ్రీకృష్ణుడు గీతలో అర్జునుడికి బ్రహ్మోపదేశం చేస్తూ "అర్జునా! చంపేది నేనే. చచ్చేదీ నేనే. సృష్టి స్థితి లయ కారకుడను నేనే" అంటాడు. అలాగే ఇంద్రుడు కూడా నేనే బ్రహ్మను అని చెప్పాడు. అంతేగాని వేరు కాదు. అందుచేత ప్రాణశబ్దం పరబ్రహ్మే అవుతుంది.

**బ్రహ్మ సాక్షాత్కారం పొందినవాడు కూడా సాక్షాత్తూ పరబ్రహ్మ స్వరూపమే అవుతాడు.**

అలాగే ఇంద్రుడు కూడా బ్రహ్మ సాక్షాత్కారం పొందాడు కాబట్టే అతడు కూడా పరబ్రహ్మ స్వరూపమే.

**కేనోపనిషత్తు**లో చెప్పినట్లుగా "దేవదానవ సంగ్రామం జరిగింది. అందులో దేవతలు విజయం సాధించారు. విజయోత్సాహం జరుపుకుంటున్నారు. ఈ విజయం

తమ శక్తిసామర్థ్యాలవల్లనే లభించింది అని విర్రవీగి పోతున్నారు. ఆ స్థితిలో దేవతలను చూశాడు పరబ్రహ్మ. వీరి గర్వం అణచాలి అనుకున్నాడు. ఒక పెద్ద భూతంగా వారి ముందు ప్రత్యక్షం అయ్యాడు.

ఆ భయంకరమైన భూతాన్ని చూసి భయపడ్డారు దేవతలు. అది ఏమిటో కనుక్కురమ్మని అగ్నిని కోరారు. అతనిచేత కాలేదు. దాన్ని తెలుసుకుందామని వాయువు వెళ్ళాడు. అతనికి కూడా చేతకాలేదు. చివరకు ఇంద్రుడు వెళ్ళాడు. అప్పుడు ఆ భూతం అదృశ్యమై పోయింది. దాని స్థానంలో ఉమాదేవి ప్రత్యక్షమైంది. ఆమెను అడిగాడు ఇంద్రుడు ఆ తత్త్వం ఏమిటి? అని

ఇప్పటిదాకా మీ ఎదురుగా ఉన్న ఆ "భయంకరమైన ఆ తత్త్వమే (భూతమే) పరబ్రహ్మ" అని ఉమాదేవి చెప్పింది. ఇక్కడ పరబ్రహ్మకు ప్రతిరూపం ఉమాదేవి. అంటే నిరాకారం పరాశక్తి. సాకారం త్రిపురసుందరి. ఈ రకంగా పరబ్రహ్మను గురించి తెలుసుకున్నవాడు, దేవతలలో మొదటివాడైన ఇంద్రుడు. కాబట్టి ఇంద్రుడు కూడా పరబ్రహ్మమే అవుతాడు. అంచేత 'నేనే ప్రాణాన్ని' అని చెప్పాడు ఇంద్రుడు.

పూర్వకాలంలో వామదేవుడు అనే ఋషికూడా పరబ్రహ్మ సాక్షాత్కారం పొంది, తానే సర్వస్వము అని తెలుసుకున్నాడు. కాబట్టి ఇంద్రుడు తానే పరబ్రహ్మ స్వరూపము అని చెప్పటంలో తప్పులేదు.

***సూత్రం – 31 "జీవముఖ్య ప్రాణలిఙ్గాన్నేతి చేన్నోపాసాత్రైవిధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్"***

జీవియొక్క ముఖ్యప్రాణం పరబ్రహ్మమే. ఆత్మనుండి ప్రాణం పుడుతోంది. శరీరాన్ని ఆశ్రయించి నీడ ఉన్నట్లుగా ఆత్మపైన ప్రాణము వ్యాపించి ఉన్నది. నీడకు స్వతంత్రమైన అస్థిత్వం లేనట్లే ప్రాణానికి కూడా స్వతంత్రమైన అస్థిత్వం లేదు. మనస్సులో పుట్టిన సంకల్ప వికల్పాలవల్లనే ఇది శరీరంలోకి వస్తుంది. అని **కేనోపనిషత్తు**లో చెప్పబడింది.

కాబట్టి ప్రాణము పరబ్రహ్మ నుంచి పుడుతోంది. ఆ పరబ్రహ్మను ఆశ్రయించి ఉన్న ప్రాణము కూడా పరబ్రహ్మ స్వరూపమే. ఈ ప్రాణమే ప్రజ్ఞాత్మ. ఆనందము, అమృతమయము.

ప్రాణికోటిలో ఏ జీవికూడా ప్రాణంతోనే జీవించదు. అపానంతో అంతకన్నా జీవించదు. ఈ రెండింటికన్న అతీతమైన దానివల్ల, ఈ రెండింటికీ ఆశ్రితమైన దానివల్ల జీవిస్తున్నది. అదే బ్రహ్మ. కాబట్టి ఓ బ్రహ్మజిజ్ఞాసులారా! ప్రాణమే బ్రహ్మ" ప్రాణమే పరాశక్తి. అని వివరించారు.

ఈ రకంగా ఆకాశంబ్రహ్మ, వాయువుబ్రహ్మ, జ్యోతిబ్రహ్మ, జగత్తులో బ్రహ్మముకానిది ఏదీలేదు. అంతాబ్రహ్మమయం. బ్రహ్మముఅంటే పరమేశ్వరి. పరాశక్తి స్వరూపం. కాబట్టి జగత్తంతా శివశక్తుల స్వరూపమైన పరమేశ్వరిమయం. ఇది శ్రీవిద్యాసంప్రదాయం.

***దీంతో బ్రహ్మసూత్రాలలో మొదటి అధ్యాయంలోని***
***మొదటి పాదం పూర్తయింది.***

# మొదటి అధ్యాయం

## రెండవ పాదం

రెండవ పాదంలో అధికరణలు 32 సూత్రాలు ఉన్నాయి.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | సర్వత్రప్రసిద్ధ్యధికరణము | మనోమయ పురుషుడు బ్రహ్మమే | 8 |
| 2. | అత్త్రధికరణము | జగద్రక్షకుడు పరమాత్మ | 2 |
| 3. | గుహాప్రవిష్టాధికరణము | హృదయ గుహలోని ఇద్దరూ జీవాత్మ, పరమాత్మలు | 2 |
| 4. | అంతరాధికరణము | అక్షియందలి పురుషుడు బ్రహ్మమే | 5 |
| 5. | అంతర్యామ్యధికరణము | అధిదేవతల యందున్నవాడు పరమాత్మే | 3 |
| 6. | అదృశ్యత్వాధికరణము | అదృశ్యాదిరూపము గలది బ్రహ్మము | 3 |
| 7. | వైశ్వానరాధికరణము | వైశ్వానరుడు బ్రహ్మమే | 9 |

ఈ రకంగా రెండవ పాదంలో ఏడు అధికరణలు, ముప్పైరెండు సూత్రాలు ఉన్నాయి. ఇందులో ఉపాస్యబ్రహ్మను వివరిస్తున్నారు.

కంటికికనుపించే చరాచరజగత్తంతా పరబ్రహ్మస్వరూపమే. జీవకోటి, వస్తుసముదాయము అంతాకూడా ఆపరబ్రహ్మ నుంచేపుట్టి, మళ్ళీ అందులోనే లయమవుతున్నది. పురుషుడు క్రతుమయుడు. అంటే నిశ్చయజ్ఞానం కలిగినటువంటి వాడు. మానవుడు ఏవిధమైనసంకల్పాలు కలిగిఉంటాడో, చనిపోయిన తరువాత కూడా ఆఫలితాన్నేపొందుతాడు. ఏభావాలుస్మరిస్తూ మానవుడు మరణకాలంలో శరీరంవిడిచిపెడతాడో, ఆయాభావాలకు తగినఫలితాన్నే పొందుతాడు అని అర్థం. దీనికి భాగవతంలోచెప్పిన జడభరతునియొక్కవృత్తాంతమే ఉదాహరణ.

పూర్వకాలంలో 'అజనాభము' అనేదేశాన్ని ఋషభుడు అనేరాజు పరిపాలిస్తున్నాడు. అతనిభార్య జయంతి వీరికి తొమ్మిదిమందికుమారులు. వారిలో పెద్దవాడుభరతుడు ఇతడు వేదవేదాంగవిదుడు. పరాక్రమశాలి. ధర్మపరుడు.

తండ్రితరువాత భరతుడేరాజయ్యాడు. ఇతనిభార్య 'పంచజనని' ఇతడు చాలాసంవత్సరాలు ప్రజారంజకంగారాజ్యపాలనచేసి, తరువాత రాజ్యాన్ని కుమారులకప్పగించి, వానప్రస్తానికివెళ్ళాడు. నదీతీరంలో కుటీరంనిర్మించుకుని నివసిస్తున్నాడు. ఇతనితలఅంతా జడలు కట్టిపోయింది. కాబట్టి ఇతణ్ణి 'జడభరతుడు' అనే వారు.

ఒకరోజున జడభరతుడు నదిలోస్నానంచేస్తుండగా, ఒకగర్భిణి అయిన లేడి నదీతీరానికి వచ్చింది. ఆసమయంలో ఆకాశంమేఘావృతమైఉంది ఉన్నట్టుండి పెద్దఉరుము ఉరిమింది. దానికి ఆ లేడి భయపడి బిడ్డను ప్రసవించి మరణించింది.

తల్లిలేని లేడిపిల్లను తెచ్చి పెంచసాగాడు జడభరతుడు. దానికి తల్లిలేదు కాబట్టి, దానిమీద అమితమైన ప్రేమపెంచుకున్నాడు. దైనందిన కార్యక్రమాలు కూడావదలి, ఎప్పుడూదాన్ని గురించే ఆలోచిస్తుండేవాడు. చివరకు మరణకాలంలో కూడా ఆలేడిపిల్లనుగురించి ఆలోచిస్తూనే ప్రాణాలువదిలాడు. ఆ ఫలితంగానే మరుజన్మలో అతను లేడి అయిపుట్టాడు. కాబట్టి మానవుడు ఏ విషయాలు స్మరిస్తూ ప్రాణాలువదలుతాడో ఆవిషయంపొందుతాడు. అందుకే నేనుబ్రహ్మాన్ని పొందుతాను అనినిశ్చయించుకుని, బ్రహ్మగురించేఆలోచించాలి అయితే "శరీరానికి, ఇంద్రియాలకు అధిపతిజీవాత్మ. జీవాత్మకు మనస్సు, ఇంద్రియాలు మొదలైనవాటితో సంబంధంఉంది. పరమాత్మ ప్రాణరహితుడు. శరీరములేనివాడు. ఇటువంటప్పుడు మనోమయుడు, ప్రాణము, శరీరముగలవాడు అని చెప్పబడ్డ జీవాత్మ ఉపాస్యుడు ఏవిధంగాఅవుతాడు?" అనేది అనుమానం.

**ఛాందోగ్యంలోని సర్వం ఖల్విదంబ్రహ్మ. తజ్జలానితిశాన్త ఉపాసీత** అనే వాక్యం బ్రహ్మోపాసనవిధినిగురించి చెప్పటంలేదు. శమాన్నిగురించి చెబుతున్నది. అంటే శాంతుడవై, పైనచెప్పిన గుణాలుగల బ్రహ్మనుఉపాసించు. శాంతము అంటే రాగద్వేషాలులేకుండా అని. ఈవాక్యంలో బ్రహ్మోపాసన ప్రధానంకాదు. ఇక్కడఉపాసించవలసినది జీవాత్మనే. ఈ విషయానికి సమాధానంగానే తరువాత సూత్రాన్ని చెబుతున్నారు.

## 1. సర్వత్రప్రసిద్ధ్యధికరణము (మనోమయపురుషుడు బ్రహ్మమే)

ఈ విషయాన్ని మొదటి అధికరణలో వివరిస్తున్నారు. దాని పేరు **'సర్వత్ర ప్రసిద్ధ్యధికరణము'** ఇందులో ఎనిమిది సూత్రాలున్నాయి.

***సూత్రం - 32 "సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్"***

వేదాంతవాక్యాలన్నిటిలోనూ ఈజగత్తుకు కారణము బ్రహ్మ అని చెప్పటంవల్ల ఇక్కడ ఉపాస్యము పరమాత్మయేఅవుతున్నది.

**'సర్వం ఖల్విదం బ్రహ్మ'** ఈ జగత్తంతా బ్రహ్మమయమే అని శ్రుతులు చెబుతున్నాయి. అతడు అంటే బ్రహ్మ మనోమయాదిధర్మాలుగలవాడుగా చెప్పటం వలన మూలవస్తువును విడిచిపెట్టటం అనేది ఉండదు. ఇతర వస్తువులను గూర్చి చెప్పటంకూడాఉండదు. ఈ రెండింటిలోను ఏదిచేసినా, అంటే, మూలవస్తువును వదిలిపెట్టినా, ఇతర వస్తువులనుగురించిచెప్పినా అది దోషముఅవుతుంది. కాని ఇక్కడ అలాజరగలేదు. ఇక్కడ ఉపాసించదగినవాడు, ఉపాసించబడేవాడు కూడా బ్రహ్మమే. కేవలము ఉపాసనకోసమే అతనికి మనోమయాదిధర్మాలు చెప్పబడ్డాయి.

***సూత్రం - 33 "వివక్షితగుణోపపత్తేశ్చ"***

ఉపాసనకోసము చెప్పబడినటువంటి సత్యసంకల్పము, బహురూపత్వము అనేగుణాలు బ్రహ్మకుఅన్వయిస్తాయి కాబట్టి మనోమయుడుపరమాత్మయే తప్ప జీవుడుకాదు.

'వివక్ష' అంటే చెప్పదలచుకున్నట్టిమాట. ఏదైనా ఒకవిషయాన్ని గురించి చెప్పదలిస్తే ఆవిషయం వివక్షితం అవుతుంది. వేదాలుఅపౌరుషేయాలు కాబట్టి వాటినిచెప్పాలి అనుకున్నవారు ఎవరూలేరు. వేదాలయొక్క తాత్పర్యం దీనిలో ఉన్నదా? లేదా? అనే విషయం ఆలోచించి, ఆ తాత్పర్యంఉన్నదానినే గ్రహించాలి. ఈవిధంగా గనకచూసినట్లైతే ఉపాసనకుకావలసిన గుణాలన్నీ పరబ్రహ్మలో ఉన్నాయి.

సృష్టి స్థితి సంహారాల్లో అతడు శక్తిసంపన్నుడు. కాబట్టి సత్యకాముడు, సత్యసంకల్పుడు అవుతాడు. ఆత్మ పాపరహితము. ఆకాశమువలెసర్వవ్యాపి. భూమికన్న పెద్దది. సమస్త కర్మలు తానే అయినది. మనోమయము, ప్రాణమయము. ఇవి జీవలక్షణాలుకాదు. ఇవికేవలము పరబ్రహ్మయొక్క లక్షణాలుమాత్రమే.

***సూత్రం - 34 "అనుపపత్తేస్తు న శారీరః"***

ఉపాసనకోసం చెప్పబడ్డ ఈగుణాలు జీవుడికిఉండవు. అందుచేతనే జీవుడు ఉపాస్యుడు కాడు.

జీవుడు భోగానికిఅవసరమైన ఈశరీరంలోనే ఉన్నాడు కాని పరమేశ్వరుడు సర్వాంతర్యామి భూమ్యాకాశాలకన్న పెద్దవాడు. అంతటా వ్యాపించిఉన్నవాడు. నిత్యుడు అందుకనే పరబ్రహ్మాయేఉపాస్యుడు.

***సూత్రం - 35 "కర్మకర్తృవ్యపదేశాచ్చ"***

సాధకుడు ఈ శరీరం నుండి విముక్తి పొందిన తరువాత, ఆ పరమాత్మను పొందుతాడు. ఇక్కడ పొందేవాడుసాధకుడు. పొందబడేదిబ్రహ్మా. అందుచేత ఉపాస్యుడు జీవుడుకాదు. బ్రహ్మమే.

పొందేవాడు, పొందబడేది అంటే కర్త, కర్మ రెండూ ఒకటికాదు. జీవాత్మ పరమాత్మనుచేరుతుంది. అందుచేత ఉపాస్యుడుబ్రహ్మా.

***సూత్రం - 36 "శబ్దవిశేషాత్"***

శబ్దము అంటే ఇక్కడ విభక్తి భేదంవల్ల కూడా బ్రహ్మాయే ఉపాస్యుడు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో శాండిల్యుడు అనే మహర్షి తన శిష్యులకు బ్రహ్మోపదేశం చేస్తూ "ఆత్మ అనేది సూక్షాతిసూక్ష్మమైనది. అలాగే మహత్తరమైనది. హృదయ పద్మంలో గలఆత్మ వరిగింజకన్న, బార్లీగింజకన్న ఆవగింజకన్న కూడా చాలాసూక్ష్మమైనది. అలాగే ఈఆత్మ భూమికన్న, స్వర్గలోకంకన్న, సమస్తలోకాలకన్న కూడా పెద్దది" అనిచెబుతాడు **శతపథబ్రాహ్మణం**లో "ధాన్యపుగింజకాని, యవగింజకాని, చామగింజకాని, ఏవిధంగా తోక ఉంటుందో, అలాగే హిరణ్మయుడైన పురుషుడు అంతరాత్మలో ఉన్నాడు" కాబట్టి హిరణ్మయపురుషుడు, ఆత్మకన్న వేరైనవాడు. ఇక్కడ హిరణ్మయపురుషుడుఅంటే పరమాత్మ. ఆత్మ అంటే జీవుడు.

***సూత్రం - 37 "స్మృతేశ్చ"***

స్మృతులలోకూడా జీవుడికి, బ్రహ్మాకి భేదం చూపబడింది. కాబట్టి ఉపాస్యుడు బ్రహ్మమే.

పరమేశ్వరుడు అన్ని జీవులయందు అంతర్యామిగా ఉండి, వారివారి కర్మల ననుసరించి, వారికి పునర్జన్మకలిగిస్తూ ఉంటాడు. అయితే

ఇక్కడేమో, జీవాత్మ పరమాత్మ వేరు అంటున్నారు. ఛాందోగ్యోపనిషత్తులో యాజ్ఞవల్క్యుడికి మైత్రేయి, కాత్యాయని అని ఇద్దరుభార్యలు. కాత్యాయని సామాన్య గృహిణి. కాగా మైత్రేయి ఆధ్యాత్మిక చర్చలలో పాల్గొనేది. ఒకరోజు యాజ్ఞవల్క్యుడు తనభార్యలతో ''నేను సంసారాన్ని వదిలిపెట్టి సన్యాసాశ్రమం స్వీకరించాలనుకుంటున్నాను. అందుచేత నాఆస్తిని మీఇద్దరికీ సమానంగా పంచి ఇచ్చేస్తాను" అన్నాడు. ఆ మాటలువిన్న మైత్రేయి "స్వామీ ! ప్రపంచంలో ఉన్న ధనధన్యాలన్నీ నా ముందు కుప్పగా పోసినా నాకు ఆనందం లభించదు. అమరత్వం సిద్ధించదు. తమరు ఇస్తాననే సిరిసంపదలు అన్నీ అశాశ్వతాలు. వీటివల్ల జీవితంలో కొంతవరకు సుఖంఅనుభవించవచ్చు. కాని అవేవీ శాశ్వతమైన ఆనందాన్ని ఇవ్వలేవు. మోక్షాన్ని ప్రసాదించలేని ఈధనధాన్యాలవల్ల నాకేమిటి ప్రయోజనం? కాబట్టి మోక్షకారకమైన బ్రహ్మవిద్యను నాకుఉపదేశించండి" అన్నది. ఆ మాటలకు ఆనందభరితుడైన యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి బ్రహ్మోపదేశంచేశాడు. ఆ విషయాన్ని ఇప్పుడు మనం చూద్దాం.

"మైత్రేయా ! ఆత్మప్రయోజనం కోసమే ఒకరికొకరు ప్రియులౌతారు. భార్యభర్తను ప్రేమిస్తోంది అంటే ఈ ప్రేమ భర్తకోసం కాదు. కేవలం భార్య ప్రయోజనం కోసమే. అలాగే భర్తకూడా తన ప్రయోజనం కోసమే భార్యను ప్రేమిస్తాడు. తల్లితండ్రులు పుత్రులను తమప్రయోజనం కోసమే ప్రేమిస్తున్నారు. అంతేకాని పుత్రులప్రయోజనం కోసం కాదు. అదే విధంగా ధనాన్ని మన ప్రయోజనం అంటే ఆత్మ ప్రయోజనం కోసమే ప్రేమిస్తున్నాము. ఈ విధంగా లోకాలను, క్షత్రియులను, పంచభూతాలను ఒకటేమిటి? లోకం దేన్నయినాసరే ఆత్మ ప్రయోజనం కోసమే ప్రేమిస్తున్నాము. కాబట్టి ఈ ఆత్మ ఒక్కటే దర్శనీయమైనది, తెలుసుకోతగినది. ముందుగా దీన్ని గురించి గురువు ద్వారా వినాలి. శాస్త్రాలు చదవాలి. ఇతరులతో తర్కించాలి. ఆత్మతత్త్వాన్ని గూర్చి దర్శనం, శ్రవణం, మననం, విజ్ఞానం ద్వారా అన్నీ తెలుస్తాయి. రజ్జుసర్పభ్రాంతి కలిగినప్పుడు, అది కేవలం త్రాడు అని తెలిస్తే అది సర్పమనే భ్రాంతి తొలగిపోతుంది. విజ్ఞానం కలగగానే ఆత్మస్వరూపం గోచరిస్తుంది.

బ్రాహ్మణజాతిని ఎవరైనా ఆత్మకన్న భిన్నమైనదిగా భావిస్తే వాళ్ళను ఆజాతి నిర్లక్ష్యం చేసి దూరంగా త్రోసివేస్తుంది. పురుషార్థాల నుండి భ్రష్టుల్ని చేస్తుంది.

అదే విధంగా క్షత్రియజాతిని ఎవరైనా ఆత్మకన్న భిన్నమైనదిగా భావిస్తే వాళ్ళని ఆ జాతి త్రోసివేస్తుంది. దేవతలను ఆత్మకన్న భిన్నంగా భావించిన వారిని దేవతలు తృణీకరిస్తారు. ఈ విధంగా బ్రాహ్మణజాతి, క్షత్రియజాతి, లోకాలు, దేవతలు, పంచభూతాలు ఒకటేమిటి? కంటికి కనుపించే ప్రతిదీ ఆత్మస్వరూపమే. ఆత్మకన్న భిన్నమైనది ఏదీలేదు. అన్నీ ఆత్మనుండే పుడుతూ, ఆత్మలోనే లీనం అవుతున్నాయి.

ఏది లేకుండా ఒక వస్తువును మనం గ్రహించలేమో, అది దానియొక్క తత్త్వము, ధర్మము అవుతుంది. ఒక నగారాను కర్రతో కొట్టినప్పుడు దానినుంచి వచ్చే స్వరాలు దాని యొక్క సామాన్య స్వరానికి భిన్నంకావు. ఎన్నిరకాల శబ్దాలు వచ్చినా అవి సామాన్య స్వరంతో కలిసిపోతాయి. వాటికి ప్రత్యేకమైన అస్థిత్త్వం ఉండదు. ముందుగా సామాన్య స్వరం గ్రహిస్తే తరువాత విశేష శబ్దం పట్టుబడుతుంది. అలాగే ముందు చిదాత్మను గ్రహిస్తే, తరువాత దానిలోని కల్పితమైన నామరూపాత్మకమైన జగత్తు పట్టుబడుతుంది. కన్ను ముందుగా వెలుగును గ్రహించిన తరువాతనే నీలము, ఎరుపు, నలుపు రంగులను చూడగలము. అదే విధంగా చిదాత్మను దర్శించిన తరువాతనే నామరూపాత్మకమైన జగత్తును చూడగలము.

శంఖాన్ని ఊదినప్పుడు వెలువడే ప్రత్యేకమైన శబ్దాలను గ్రహించగలిగితే దాని నుండి వెలువడిన శబ్దాలు వాటంతటవే పట్టుబడతాయి. కాబట్టి ముందు సామాన్య శబ్దం పట్టుపడాలి. అగ్నినుంచి వచ్చే రవ్వలు అగ్ని కన్న వేరైనవి కావు. అలాగే వేదాలు, పురాణాలు, ఉపనిషత్తులు, మంత్రాలు, కళలు, సూత్రాలు ఇవన్నీ పరమాత్మ యొక్క స్వరూపాలు. ప్రయత్నం లేకుండానే ఇవన్నీ విజ్ఞానఘనుడైన పరమాత్మ నుంచి ఉత్పన్నమౌనాయి. రవ్వలు, జ్వాలలు రావటానికి ముందు అంతా అగ్నిమయమే. అలాగే నామరూపాత్మక స్థితికి ముందు జగత్తంతా ప్రజ్ఞానఘనుని స్వరూపమే.

అన్ని నదులకు గమ్యస్థానం సముద్రమే. సముద్రంలో చేరగానే నదులు తమ అస్థిత్వాన్ని కోల్పోతాయి. అలాగే

అన్ని రకాల స్పర్శలకు గమ్యస్థానం – చర్మము

అన్ని రకాల వాసనలకు ప్రళయస్థానం – నాసిక

అన్ని రుచులకు ప్రళయ స్థానం - నాలుక

అన్ని శబ్దాలకు ప్రళయ స్థానం - చెవులు

అన్ని ఆలోచనలకు ప్రళయ స్థానం - మనస్సు

అన్ని విద్యలకు ప్రళయ స్థానం - హృదయం

అన్ని కర్మలకు ప్రళయ స్థానం - చేతులు

అన్ని సుఖాలకు ప్రళయ స్థానం - జననేంద్రియము

అన్ని నడకలకు గమ్యస్థానం - కాళ్ళు

అన్ని విషయాలకు గమ్యస్థానం - ఇంద్రియాలు.

ఈ రకంగా కార్యాలన్నీ కారణాలలో కలిసిపోయి ఇవన్నీ ప్రజ్ఞాన ఘనుడిలో చేరిపోతాయి.

నీళ్ళలో ఉప్పు వేస్తే అది కరుగుతుంది. అంటే ఆ ఉప్పు నీరంతా వ్యాపించి ఉంటుంది. అదే విధంగా అద్భుతమైన శక్తిగల పరమాత్మ అనంతుడు, అవ్యయుడు, విజ్ఞానఘనుడు. అతడు దేహాది ఉపాధులతోబాటుగా కలిసిపోయి, అవి నాశనమయి నప్పుడు తానుకూడా నాశనమయినట్లుకనిపిస్తాడు. దేహంనుండి విడివడిన తరువాత విశేషసంజ్ఞలు ఏమీఉండవు.

లోకంలోఉన్నదంతా ఆత్మే. ఈ ఆత్మ అందరిలోనూ సమానంగా ఉన్నది. ఆత్మనుండే అన్నీ పుట్టినాయి. మళ్ళీ అందులోనే లీనమవుతాయి. అందుచేతనే ఆత్మను గురించి తెలుసుకుంటే మిగిలిన విషయాలన్నీ తెలిసినట్లే" అన్నాడు. అలాగే భగవానుడు కూడా గీతలో "అర్జునా క్షేత్రములందు (శరీరములందు) క్షేత్రజ్ఞుడను నేనే" అంటాడు.

ఈ విషయాలు చూస్తే, జీవాత్మ, పరమాత్మ. రెండూ ఒక్కటే అని తెలుస్తుంది. మరి మీరేమో జీవుడికి, బ్రహ్మకి భేదం ఉంది అంటున్నారు కదా?" అని అనుమానం వస్తుంది.

దీనికి సమాధానం. ఆకాశమనేది ఒక్కటే అదే మహదాకాశం. కాని గదిలోని ఆకాశం, కుండలోనిఆకాశం, కమండలంలోనిఆకాశం అని వేరువేరుగా కనిపిస్తుంది.

అలాగే పరమాత్మకూడ ఒక్కడేఅయినప్పటికీ, దేహము, బుద్ధి, ఇంద్రియాల సంబంధంవల్ల జీవుడు అని పిలువబడుతున్నాడు. ఈ భేదంవల్లనే ఉపాసకుడు ఉపాస్యుడు అని భేదం కలుగుతుంది. కాని 'తత్త్వమసి' 'నువ్వే ఆత్మవు' అని తెలిసినప్పుడు ఈ భేదాలు ఉండవు.

***సూత్రం – 38 "అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతి చేన్న నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చ"***

ఆత్మహృదయ స్థానంలో అతిచిన్నదిగా ఉంటుంది. అదే మనం వెతకవలసినది. అందుకనే ఆత్మయే ఉపాస్య.

"మనోమయుడు, ప్రాణమయుడు శరీరంగలవాడు అయినఆత్మ నా హృదయంలో ఉన్నాడుఅని, అతడు ధాన్యపు గింజకన్న సూక్ష్మమైనవాడు అని అన్నారు. సర్వవ్యాపిఅయిన పరమాత్మ, హృదయమనే చిన్నస్థానంలో ఉండటం కుదరదుకదా. కాబట్టి ఇక్కడ చెప్పింది జీవాత్మను గురించే అనవచ్చుకదా?"

మళ్ళీ అనుమానం. బుద్ధికి, విజ్ఞానానికి స్థానం హృదయం భగవంతుణ్ణి తెలుసుకోవటానికి తగినది ఆ హృదయమే. అందుకే పరమాత్మ హృదయంలో ఉన్నాడని చెప్పారు. పరమాత్మ సర్వాంతర్యామి. అయినప్పటికీ ఉపాసన కోసం లింగం చూపించి 'ఇది శివుడు ఉపాసించు' అని ఎలా చెబుతారో, అలాగే ఇక్కడకూడా పరమాత్మ సూక్ష్మరూపంతో హృదయమందున్నాడని చెప్పబడింది. అంతేకాదు పరమాత్మ హృదయంలోఉన్నాడు. ప్రతిశరీరంలోను హృదయముంది. వీటన్నిటితోనూ సంబంధమున్నది. మరి వాటిగుణదోషాలు అతడికి అంటుతాయి కదా? అని కొందరంటారు. దానికి సమాధానంగానే తరువాత సూత్రం చెప్పబడుతోంది.

***సూత్రం – 39 "సంభోగప్రాప్తిరితి చేన్న వైశేష్యాత్"***

జీవుడికి, పరమాత్మకు ఉండే లక్షణాలు వేరు. అందుచేత పరమాత్మకు సుఖ దుఃఖాలు ఉండవు. అతడు భోగాలుఅనుభవించడు.

జీవాత్మ వేరు పరమాత్మ వేరు. జీవి, కర్త, భోక్త కూడా. అతడికి సుఖము, దుఃఖము ఉంటాయి. **ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఒకే పేరు, రూపము గల రెండు పక్షులు ప్రపంచమనే వృక్షాన్ని ఆశ్రయించి ఉన్నాయి. అందులో ఒకటి జీవాత్మ. ఇది తన కర్మవల్ల వచ్చిన ఫలితాలను అనుభవిస్తోంది. రెండవది పరమాత్మ.

కర్మఫలం ఏమీ లేకుండా చూస్తూ కూచుంది. రెండూ ఒకేచోట ఉన్నప్పటికీ జీవుడు మోహానికి వసుడై శోకాన్ని అనుభవిస్తున్నాడు. అజ్ఞానంవల్ల బాధలు పడుతున్నాడు.

కాని అతడే యోగీశ్వరులచే సేవించబడేవాడు అని తెలిసినప్పుడు, అంటే మోహము నశించినప్పుడు శోకం నుండి విముక్తుడౌతాడు. ఇతడికి ఎప్పుడైతే జ్ఞానం కలుగుతుందో, అప్పుడు భేదభావంపోయి అద్వైత భావం పొందుతాడు. సమస్త జీవుల యందు ఉంటూ భిన్నంగా కనిపించేదే పరమాత్మ. అతడు వేరువేరు జీవుల్లో వేరువేరుగా కనిపిస్తాడు"

కాబట్టి 'మనోమయపురుషుడు బ్రహ్మమే" అదే పరాశక్తి.

## ౨. అత్త్రధికరణము (జగద్రక్షకుడు పరమాత్మ)

పరమేశ్వరుడికి బ్రహ్మ క్షత్రియులనే రెండు జాతులూ భక్షించటానికి తతగినవే. అని కఠోపనిషత్తులో చెప్పారు. అలాగే ఈశ్వరుడు ఏమీ తినకుండా చూస్తున్నాడని **ముండకోపనిషత్తు**లో చెప్పారు. ఈ రెండు విరుద్ధ ప్రకటనలుగా కనిపిస్తాయి. వాటిని రెండవదైన **'అత్త్రధికరణ'**లో వివరిస్తున్నారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

***సూత్రం - 40 "అత్తా చరాచరగ్రహణాత్"***

స్థావర జంగమాత్మకమైన ఈ ప్రపంచాన్ని గ్రహించటంవలన భుజించేవాడు పరమాత్మయే.

ఈలోకాలను భుజించేశక్తి ఆ పరమాత్మఒక్కడికే ఉన్నది. బ్రహ్మ క్షత్రియులు అంటే బ్రహ్మ క్షత్రియాదిగా గల మొత్తం మానవులు అని అర్థం. ఇక భుజించటము అంటే తనలోకి తీసుకోవటము. అంటే లయం చేసుకోవటము. ఒక్క మానవులను ఏమిటి? ఈ జగత్తునంతటినీ తనలో లయం చేసుకుంటాడు పరమాత్మ. అయితే ఈశ్వరుడు తినకుండానే చూస్తున్నాడు. అని చెప్పటంలో ఉద్దేశ్యం పరమాత్మకు కర్మఫలం లేదు. జీవుడు కర్మఫలాన్ని అనుభవిస్తున్నాడు. పరమాత్మ ఆ ఫలితము లేక చూస్తూ కూచున్నాడు. అంతేకాని ఈ రెండూ విరుద్ధ ప్రకటనలు కావు.

***సూత్రం - 41 "ప్రకరణాచ్చ"***

**కఠోపనిషత్తు**లో నచికేతుడు యముడి దగ్గరకు వెళ్ళి బ్రహ్మోపదేశం చెయ్యమని అడుగుతున్నాడు. "ఓ యమధర్మరాజా! నువ్వు ధర్మాధర్మాలకు భిన్నంగ, కార్యకారణములకు అతీతముగ, భూతభవిష్యద్వర్త మానములకు అతీతంగా దేనిని చూస్తున్నావో దానిని గురించి నాకు వివరించవలసినది" ఆ మాటలు విన్న యమధర్మరాజు చెబుతున్నాడు. "సమస్త వేదాలు ఎవరిని ప్రశంసిస్తున్నాయో, సమస్త తపస్సులు దేనిని ప్రకటిస్తున్నాయో, దేనిని కోరి యోగిపుంగవులు నియమనిష్ఠలతో, బ్రహ్మచర్యంతో కాలం గడుపుతున్నారో, అటువంటి దాన్ని గూర్చి నీకు వివరిస్తాను. అదే **ఓం** కారము. ఈ అక్షరమే పరబ్రహ్మ.

"ఆర్యా ! దేవతలకు కూడా ఈ విషయం అర్థం కాకపోవచ్చు కాని దాన్ని వివరించి చెప్పగల సమర్థుడవు నీవే. అందుకని నాకు ఆ విషయం వివరించు" అన్నాడు. "నచికేతా!

**శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ ।**
**బహూన్ పశూన్ హస్తి హిరణ్య మశ్వాన్ ।**
**భూమేర్మహదాయతనం వృణీష్వ ।**
**స్వయంచ జీవ శరదో యావదిచ్ఛసి ॥**

నచికేతా ! వంద సంవత్సరాలు జీవించే పూర్ణాయువు గల పుత్రులను కోరుకో. అసంఖ్యాకమైన పశువులు, ఏనుగులు, గుర్రాలు, బంగారము కోరుకో. గొప్ప సామ్రాజ్యం కోరుకో. నీ ఇష్టం వచ్చినంత కాలం జీవించు.

**ఏతత్తుల్యం యదిమన్యసే వరంవృణీష్వ విత్తంచిరజీవికాంచ ।**
**మహాభూమౌ నచికేతస్త్వే మేధి కామానాం త్వా కామభాజం కరోమి ॥**

అపారమైన ఐశ్వర్యము, చక్రవర్తిత్వము, నీకు ఇస్తాను. దీంతో సమానమైన వరం ఇంకేదైనా కోరుకో.

**యేయేకామాదుర్లభామర్త్యలోకే సర్వాన్ కామాన్ శ్ఛందతః ప్రార్థయస్వ ।**
**ఇమా కామాః సతూర్యాన హీదృశాలంబనీయాః మనుష్యైః ।**
**అభిర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ నచికేతో మరణం మాను ప్రాక్షీః ॥**

ఓ నచికేతా! భూలోకంలో దుర్లభమైన విషయాలన్నీ కోరుకో. అవన్నీ ఇస్తాను అనుభవించు. అంతేగాని మరణం తరువాత ఆత్మవిచారము మాత్రము అడగవద్దు.

అన్నాడు యముడు. రాజా! ఈ భోగాలన్నీ నేడు ఉంటాయి. రేపు ఉండవు. ఇవి అనిత్యమైనవి. అశాశ్వతమైన భోగభాగ్యాలు నాకువద్దు ఇలాంటివి ఎన్ని ఉన్నా ఆత్మజ్ఞానానికి సాటియైనది ఏదీలేదు. అందుచేత నాకు ఆత్మజ్ఞానాన్ని గురించి వివరించవలసింది" అన్నాడు నచికేతుడు. నచికేతుని పట్టుదలకు సంతసించినవాడై యముడు అతనికి ఆత్మజ్ఞానాన్ని వివరించటం మొదలుపెట్టాడు.

**అన్యచ్ఛ్రేయోన్యదుతైవ ప్రేయస్తే ఉభేనానార్థే పురుషగ్ం సినీతః ।**

**తయోః శ్రేయ అదదానస్య సాధుభవతి హీయతేఽర్థాద్య ఉప్రేయోవృణీతే॥**

నచికేతా ! శ్రేయస్సు, ప్రేయస్సు అని రెండు మార్గాలున్నాయి. వీటిలో శ్రేయోమార్గాన్ని అనుసరించేవాడు శుభాన్ని పొందుతాడు. ప్రేయస్సు కోరినవాడు గమ్యాన్ని చేరలేడు.

**శ్రేయశ్చప్రేయశ్చ మనుష్యమేతస్తౌ సంపరీత్యవివినక్తి ధీరః ।**

**శ్రేయోహి ధీరోఽభి ప్రేయసోవృణీతే ప్రేయోమన్దో యోగక్షేమా ద్వృణీతే॥**

వివేకవంతుడు ఈ మార్గాలను పరీక్షించి, విమర్శించి చూస్తాడు. ఎందుకంటే అతడు శ్రేయస్సునే కోరతాడు. కాని అజ్ఞాని లోకంలో పొందే ఐహిక సుఖాలు, విషయవాంఛల కోసం ప్రేయోమార్గాన్ని అనుసరిస్తాడు.

"నచికేతా! శ్రేయస్సు, ప్రేయస్సు అని రెండు విషయాలను శ్రుతులు చెబుతున్నాయి. ఇక్కడ శ్రేయస్సు అంటే విద్య. ప్రేయస్సు అంటే అవిద్య. పునరావృత్తి రహితమైన మోక్షమార్గమే శ్రేయస్సు. కాగా ఐహిక సుఖాలలో ఓలలాడించేది ప్రేయోమార్గము. మానవుడు ఈ రెంటిలో ఏదో ఒక మార్గాన్ని అనుసరించి తీరాలి. ఈ రెండు మార్గాలు కలిసి ఉన్నట్టుగానే కనిపిస్తాయి. విజ్ఞుడైనవాడు దీన్ని విభజించి శ్రేయోమార్గాన్నే ఎన్నుకుంటాడు. ఈ రెండూ విరుద్ధ స్వభావాలు గలవి. వీటిలో శ్రేయోమార్గము కాంతి కాగా ప్రేయస్సు చీకటి. అవిద్యలో మునిగినవాడు తనను తాను గొప్పపండితుడుగా భావించుకుంటాడు. ధనధాన్యాలు, భార్యాపుత్రులు ఇవే లోకమనుకుంటాడు. ఇలాంటివాడు జనన మరణాలతో బాధపడుతుంటాడు.

ఆత్మజ్ఞానం అనే పదం వినటానికి కూడా చాలామందికి అర్హత ఉండదు. అందుకే వాళ్ళు దాన్ని ఇష్టపడరు. కొందరికి విన్నా అది అర్థంకాదు. అసలు దీన్ని గురించి చెప్పే గురువు దొరకటం కూడా చాలా విశేషం. 'నేను బ్రహ్మని' అనే జ్ఞానం పొందిన గురువు ద్వారా ఈ విషయాన్ని తెలుసుకోవటం పూర్వజన్మ సుకృతం.

కర్మవల్ల లభించే ఫలితం అనిత్యము. దానివల్ల ఆత్మ తత్త్వం లభించదు. కర్మలు అనిత్యం. ఆత్మనిత్యం. ఈ విషయం తెలిసికూడా నేను అగ్నిచయనం చేశాను. దాని ఫలితంగా మృత్యుదేవతనయ్యాను. నచికేతా! మానవుడు ఆత్మను ఇంద్రియాల నుండి వేరు చేసి శాశ్వత ఆనందాన్నిచ్చే ఆత్మతత్త్వాన్ని పొందుతాడు. నీవు దానికి పూర్తిగా అర్హుడవు.

**సర్వేవేదా యత్పదమామనన్తి తపాగ్ంసి సర్వాణి చ య ద్వదన్తి ।**

**యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదగ్ం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్తేతత్॥**

వేదాలు దేన్ని గురించి చెబుతున్నాయో, దేన్ని పొందటానికి కృచ్ఛకము, చాంద్రాయణము మొ॥ వ్రతాలు చేస్తున్నారో, దేనికోసం బ్రహ్మచర్యం అవలంభించి, నియమనిష్టలు పాటిస్తున్నారో, అటువంటి పరమపదమే ఓంకారము.

**ఏతద్ధేవాక్షరం బ్రహ్మ ఏతద్ధేవాక్షరం పరం ।**

**ఏదద్ధేవాక్షరం జ్ఞాత్వాయోయదిచ్ఛతి తస్యతత్ ॥**

ఓంకారమనే ఆ అక్షరమే పరబ్రహ్మ. దీన్ని తెలుసుకున్న వారికి సర్వకార్యాలు సిద్ధిస్తాయి.

**ఏతదాలంబనగ్ శ్రేష్టం ఏతదాలంబనం పరం ।**

**ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే ॥**

ఆ బ్రహ్మము శ్రేష్ఠమైనది. సర్వోత్కృష్ఠమైనది. దీన్ని తెలుసుకున్నవాడు బ్రహ్మలోకంలో పూజింపబడతాడు.

**అణోరణీయాన్ మహతో మహీయాన్**

**ఆత్మస్య జంతోర్నిహతోగుహాయాం**

అది అణువుకున్న చిన్నది. మహత్తులన్నింటి కన్న పెద్దది. ప్రతిజీవి యొక్క హృదయమనే గుహలో ఉంటుంది. అంటూ ఆత్మతత్త్వాన్ని వివరిస్తాడు.

ఆత్మనిత్యము, సత్యము సర్వవ్యాపకమైనది. భగవద్పాదుల వారు చెప్పినట్లుగా

**యల్లాభాన్నపరోలాభో యత్సుఖాన్నపరం సుఖం ।**
**యద్ జ్ఞానాన్నపరం జ్ఞానం తద్ బ్రహ్మేత్యవధారయేత్ ॥**

**యదృష్ట్వాన్న పరం దృశ్యం యద్ భూత్వా న పునర్భవః ।**
**యద్జ్ఞాత్వాన్నపరం జ్ఞేయం తద్బ్రహ్మేత్యవదారయేత్ ॥**

**తిర్యగూర్ధ్వమధః పూర్ణం సచ్చిదానంద మద్వయమ్ ।**
**అనంతం నిత్యమేకం యత్ తద్ బ్రహ్మేత్యవధారయేత్ ॥**

**అతద్ వ్యావృతిరూపేణ వేదాన్తైర్లక్ష్యతే ద్వయమ్**
**అఖండానేక మేకం యత్ తద్ బ్రహ్మేత్యవదారయేత్ ॥**

**అనణ్వం అస్థూలం అహ్రస్వం అదీర్ఘం అజం అవ్యయమ్ ।**
**అరూపం అగుణ అవర్ణాఖ్యం తద్ బ్రహ్మేత్యవదారయేత్ ॥**

**యద్భాసాభాస్యతేర్కాదిః భాస్యైర్యత్తున భాస్యతే ।**
**యేన సర్వమిదం భాతి తద్ బ్రహ్మేత్యవదారయేత్ ॥**

దేనిని పొందిన తరువాత ఇక పొందవలసినది ఉండదో, ఏ సుఖాన్ని మించిన సుఖం ఇంకొకటి లేదో, ఏ జ్ఞానాన్ని మించిన జ్ఞానం లేదో, దేన్ని చూసిన తరువాత ఇంక చూడవలసినది ఏదీ ఉండదో, దేనిని పొందిన తరువాత పునర్జన్మ ఉండదో, దేనిని తెలుసుకున్న తరువాత ఇంకా తెలుసుకోవలసినది ఉండదో, అదే బ్రహ్మము.

కేనోపనిషత్తులో

**నతత్ర చక్షుర్ గచ్ఛతి, నవాగ్గచ్ఛతినోమనః**
**న విద్మో నవిజానీయో యథైతదనుశిష్యాత్**
**అన్యదేవ తద్విదితా దథో అవిదితాదధి**
**ఇతి సుశ్రుమ పూర్వేషాం యేనస్తద్ వ్యాచ చక్షిరే ॥**

ఆ పరబ్రహ్మను కళ్ళతో చూడటానికి వీలుకాదు. వాక్కుతో చెప్పటానికి, మనసుతో ఊహించటానికి, వీలుకాదు. అది తెలిసిన వాటికి, తెలియని వాటికి కూడా అతీతమైనది.

**యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే ।**
**తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదంయదిదముపాసతే ॥**

ఏది వాగింద్రియము చేత గ్రహించబడదో, దేనివలన వాగింద్రియము పని చేస్తున్నదో అదే పరబ్రహ్మ.

**యన్మనసానమనుతే యేనాహుర్మనో మతమ్ ।**
**తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే ॥**

ఏది మనసుచేత ఊహించటానికి వీలు కాదో, దేనివలన మనసు పనిచేస్తున్నదో అదే పరబ్రహ్మ.

**యచక్షుషానపశ్యతి యేన చక్షూగ్ంషి పశ్యతి ।**
**తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

దేనిని కళ్ళతో చూడటానికి వీలుకాదో, దేనివలన కనులు పని చేస్తున్నాయో అదే పరబ్రహ్మ.

**యత్ శ్రోత్రేణ నశృణోతి యేనశ్రోత్రమిదంశ్రుతమ్ ।**
**తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

దేనిని శ్రవణేంద్రియం వల్ల తెలుసుకోలేమో, శ్రవణేంద్రియం దేనివల్ల పని చేస్తున్నదో అదే పరబ్రహ్మ.

**యత్ ప్రాణేన నప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే ।**
**తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం యదిదముపాసతే ॥**

దేనిని ప్రాణాలవల్ల తెలుసుకోలేమో, దేనివల్ల ప్రాణాలు నిలుస్తున్నాయో అదే పరబ్రహ్మము" అని చెప్పబడింది.

పైన, క్రింద, ప్రక్కల అంతటా వ్యాపించినది సుఖస్వరూపము, అద్వితీయము, అనంతము అయినదే బ్రహ్మము. ఉపనిషత్తులలో మహావాక్యాల ద్వారా చెప్పబడ్డది,

అద్వితీయము, అఖండానంద స్వరూపమైనదే బ్రహ్మము. అది స్థూలము కాదు సూక్ష్మము కాదు. పొడవు కాదు పొట్టి కాదు. జనన మరణాలు లేనిది, రూప, గుణ, వర్ణాదులు లేనిదే బ్రహ్మము. ఆ బ్రహ్మము యొక్క కాంతులవల్లనే సూర్యచంద్రులు, నక్షత్రాలు, గ్రహాలు అన్నీ ప్రకాశిస్తున్నాయి.

అటువంటి ఆత్మను (బ్రహ్మమును) గుర్తించగలిగిన వాడికి దుఃఖం అనేది ఉండదు.

వేదాలు వల్లించటం వల్లగాని, శాస్త్రాలు చదవటం వల్ల గాని, ఉపదేశాలు పొందటం వల్ల గాని ఆత్మసాక్షాత్కారం లభించదు. అది ఆత్మవల్ల మాత్రమే లభ్యమవుతుంది."

కాబట్టి అన్నిటికి బ్రహ్మమే భోక్త. ఆత్మసాక్షాత్కారము కష్టసాధ్యము. జగద్రక్షకుడు పరమాత్మ అంటే ఆ పరాశక్తి తప్ప వేరొకరు కాదు.

## 3. గృహాప్రవిష్టాధికరణము

## (హృదయగుహలోని ఇద్దరూ జీవాత్మ, పరమాత్మలు)

హృదయ స్థానంలో ఇద్దరుంటారు. అయితే వారెవరు? బుద్ధి, జీవుడు నా లేకపోతే జీవాత్మ పరమాత్మనా? ఈ విషయం మూడవదైన **'గుహాప్రవిష్టాధికరణము'** లో వివరించారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

***సూత్రం - 42 "గుహాం ప్రవిష్టావాత్మానౌ హి తద్దర్శనాత్"***

హృదయమనే గుహలో ప్రవేశించి ఉన్నవారు జీవాత్మ, పరమాత్మలు.

ఈ ఇద్దరూ ఒకే రకంగా ఉంటారు. ఒకే స్వభావం కలవారై ఉంటారు. కర్మఫలాన్ని అనుభవించే వాడు జీవుడు. రెండోవాడు కర్మపలం లేనివాడు, పరమాత్మ. అంతేగాని అచేతనమైన బుద్ధికాదు. పరమాత్మకు కర్మఫలానుభవము, పుణ్యలోకప్రాప్తి అనేవి ఉండవు. అయితే ఆ లక్షణాలు హృదయంలో ఉన్న ఇద్దరికీ ఎందుకు చెప్పారు? అంటే – ఇది 'ఛత్రిన్యాయం' కొంతమంది గొడుగులతో పోతున్నారు. కొంతమంది గొడుగులు లేకుండా పోతున్నారు. అప్పుడు వారందరినీ కలిపి 'ఛత్రధారులు వెడుతున్నారు' అంటారు. ఇక్కడ గొడుగు లేనివారిని గురించి చెప్పవలసిన అవసరం

లేదు. గొడుగు ఉన్న వానిని గురించి మాత్రమే చెప్పాలి అందుకని అలా చెబుతారు. అదే విధంగా ఇక్కడ కూడా ఒకరికి కర్మఫలం, భోగం ఉన్నాయి. రెండవ వాడికి అవి లేవు. అయినప్పటికీ, ఈ మాట ఇద్దరికీ సంబంధించే చెబుతారు.

పరమాత్మ హృదయమనే గుహలోనే ఉంటాడు. శరీరంలో పరబ్రహ్మ ఉండేచోట ఇద్దరున్నారు. వారిలో ఒకడు కర్మఫలం అనుభవించేవాడు. రెండవ వాడు సంసార బంధనాలు లేనివాడు. వీరిద్దరే వెలుగు, నీడ.

వీరిద్దరూ ఒకటే. భేదం లేదు. అజ్ఞానంలో ఉన్నప్పుడు జీవుడు. అజ్ఞానం వదిలిపోతే దేవుడు. ఆ జీవుడే పరమేశ్వరునిలో లీనమై పోతాడు.

***సూత్రం - 43 "విశేషణాచ్చ"***

శ్రుతులందలి విశేషణాల వల్ల కూడా వీరిద్దరూ జీవాత్మ, పరమాత్మ అని తెలుస్తోంది. **కఠోపనిషత్తులో**

**ఆత్మానగ్ం రథినంవిద్ధి, శరీరగ్ం రథమేవతు ।**

**బుద్ధింతు సారథింవిద్ధి, మనః ప్రగ్రహమేవచ ॥**

శరీరమే రథము. ఆత్మే యజమాని, బుద్ధిసారథి, మనస్సే కళ్ళెము.

**ఇంద్రియాణి హయనాహుర్ విషయాం స్తేషు గోచరాన్ ।**

**ఆత్మేంద్రియ మనోయుక్తం, భోక్తేత్యాహుర్ మనీషిణః ॥**

ఇంద్రియాలే గుర్రాలు. వాటి మార్గమే విషయాలు. ఆత్మదేహేంద్రియాలతో కలసినప్పుడు దాన్ని భోక్త అంటారు.

**యస్తు విజ్ఞానవాన్భవతి యయుక్తేనమనసా సదా ।**

**తస్యేంద్రియాణి వశ్యాని, దుష్టాశ్వా ఇవసారథేః ॥**

స్థిరమైన మనసు, సరియైన విజ్ఞానము లేని వాని ఇంద్రియాలు సారథి అధీనంలో లేని దుష్టాశ్వాలు లాగా సాధకుని వశంలో ఉండవు.

**యస్తు విజ్ఞానవాన్భవతి యుక్తే న మనసా సదా ।**

**తస్యేంద్రియాణి సర్వాణి సదశ్యా ఇవసారథేః ॥**

పరిణితి చెందిన మనసు, విజ్ఞానము గల నాడి ఇంద్రియాలు సారథి అదుపులో ఉండే మంచి గుర్రాలు లాగా ఉంటాయి.

**యస్తు విజ్ఞానవాన్భవత్ అన్యమస్క సదా౨_శుచిః ।**
**న స తత్పదమాప్నోతి, సంసారం చాధిగచ్ఛతి ॥**

విజ్ఞానము లేనివాడు, అపవిత్రమైన మనసు గలవాడు జనన మరణ రూపమైన సంసారంలో పడి పరిభ్రమిస్తున్నాడు.

**యస్తు విజ్ఞానవాన్ భవతి, స మనస్క సదా౨_శుచిః ।**
**సతు తత్పదమాప్నోతి, యస్మాద్భూయో నజాయతే ॥**

విజ్ఞానము గలవాడు, పవిత్రమైన మనసు, మనోనిగ్రహము గలవాడు పునర్జన్మ లేని ఆత్మ పదాన్ని పొందుతాడు.

**విజ్ఞానసారథి ర్యస్తు మనః ప్రగహవాన్నరః ।**
**సో౨_ధ్వనః పారమాప్నోతి తద్విష్ణో పరమం పదం ॥**

విజ్ఞానమనే సారథి గలవాడు, మనసు అధీనంలో గలవాడు జీవనగమ్యమైన పరమపదం చేరతాడు.

| | | |
|---|---|---|
| ఇంద్రియాలు | – | మనస్సు అధీనంలోనూ |
| మనస్సు | – | బుద్ధి అధీనంలోనూ |
| బుద్ధి | – | యజమాని అధీనంలోనూ ఉంటాయి. |

విజ్ఞానహీనుడు మనసును అదుపులో ఉంచుకోలేడు. తాను చేరవలసిన గమ్యం చేరలేడు. మోక్షాన్ని పొందలేడు. వివేకవంతమైన బుద్ధిని కలిగినవాడు, మనస్సును అదుపులో ఉంచగలిగినవాడు, పరమపదాన్ని చేరతాడు.

| | | |
|---|---|---|
| ఇంద్రియాలకన్న | – | వాటి విషయాలు (లక్షణాలు) శ్రేష్ఠమైనవి |
| విషయాలకన్న | – | మనస్సు శ్రేష్ఠమైనది |
| మనస్సుకన్న | – | బుద్ధి శ్రేష్ఠమైనది |
| బుద్ధికన్న | – | మహత్తత్త్వం శ్రేష్ఠమైనది |
| మహతత్త్వముకన్న | – | అవ్యాకృత ప్రకృతి గొప్పది |
| ప్రకృతికన్న | – | సూక్ష్మరూపి అయిన పురుషుడు గొప్పవాడు |

అంతకు మించినది ఇంకేమీలేదు. ఇదే పరాకాష్ఠ. అతణ్ణి చేరిన తరువాత తిరిగి రావటం లేదు.

ఆత్మ అనేది సూక్ష్మమైన బుద్ధిచేత మాత్రమే గ్రహించబడుతుంది. ఆత్మ సర్వవస్తుజాల మందూ ఉన్నది. కాని పైకి కనపడదు. సూక్ష్మబుద్ధి గలవారు మాత్రమే దాన్ని గుర్తించగలరు. వివేకవంతుడు

| | | |
|---|---|---|
| ఇంద్రియాలను | – | మనస్సులో లీనం చెయ్యాలి |
| మనస్సును | – | బుద్ధిలో లీనం చెయ్యాలి |
| బుద్ధిని | – | మహతత్త్వంలో లీనం చెయ్యాలి |
| మహతత్త్వాన్ని | – | ఆత్మలో లీనం చెయ్యాలి |

శబ్దము, రూపము, రసము, వాసన, నాశనము లేనిది, నిత్యము, అనాది అయినది. ఆత్మ సర్వభూతసాక్షియైన మహత్తత్త్వము కన్న శ్రేష్ఠమైనది. నిశ్చలమైనది; ఆత్మతత్త్వాన్ని తెలుసుకున్నవాడు మృత్యువు వాతపడదు. అతడికి అమరత్త్వం సిద్ధిస్తుంది." అంటూ నచికేతునికి ఆత్మతత్త్వాన్ని వివరించాడు యముడు.

**ముండకోపనిషత్తులో** చెప్పినట్లుగా,

**ద్వాసుపర్ణా సయుజా సఖయా సమానం వృక్షం పరిషస్వజాతే ।**

**తయోరన్యః పిప్పలం సాద్వత్త్వ నశ్నన్నోన్యో అభిచాకశీతి ॥**

ఒకే పేరు, ఒకే రూపము గల పక్షులు రెండు ప్రపంచమనే వృక్షాన్ని ఆశ్రయించి ఉన్నాయి. అందులో ఒకటి జీవాత్మ. ఇది తన కర్మలవల్ల వచ్చిన ఫలితాలను అనుభవిస్తోంది. రెండవది పరమాత్మ. కర్మఫలం ఏమి లేకుండా చూస్తూ కూర్చుంది. శరీరమే ఆ వృక్షము ఆ పక్షులే క్షేత్రజ్ఞ పరమాత్మలు. వారిద్దరూ వేరుకాదు. ఈ రెండూ కలిసి ఒకే చోట ఉన్నప్పటికీ జీవుడు మోహానికి వసుడై శోకాన్ని అనుభవిస్తూ ఉంటాడు. అజ్ఞానం వల్ల అనేక బాధలు పడుతుంటాడు.

కాని అతడే యోగీశ్వరులచేత సేవించబడేవాడు అని తెలిసినప్పుడు అంటే మోహం నశించినప్పుడు శోకం నుండి విముక్తుడౌతాడు. ఈ జీవుడు ఎప్పుడైతే చైతన్య రూపుడు స్వయంప్రకాశి, జగన్నిర్మాత అయిన పరమాత్మను దర్శించ గలుగుతాడో అప్పుడు భేదభావాలు వీడి అద్వైతభావం పొందుతాడు.

సమస్త జీవులయందూ ఉంటూ భిన్నంగా కనిపించేదే పరమాత్మ. అతడు వేరు వేరు జీవుల్లో వేరువేరుగా కనిపిస్తాడు. ఈ విషయం తెలిసిన జ్ఞాని వాదాలకు,

వాదనలకు పోడు ఎందుకంటే జగత్తులోని జీవులన్నీ పరమేశ్వర స్వరూపమే. కాబట్టి ఎవరితో వాదించినా తనతో తాను వాదించుకున్నట్లే, ఈ రకంగా ఆత్మలోనే క్రీడిస్తూ, ఆత్మలో సంతోషిస్తూ, ఆత్మలోనే రమిస్తూ ఉన్నవాడు బ్రహ్మజ్ఞానులలో శ్రేష్ఠుడు. అతడే సర్వోత్తముడు. అజ్ఞానపు ముడులు వీడి తానే పరమాత్మ అని తెలిసినపుడు, అంటే ఆత్మసాక్షాత్కారం జరిగినప్పుడు జీవాత్మ పరమాత్మలో లీనమై పోతుంది.

కాబట్టి హృదయమనే గుహలో ఉండే జీవాత్మే, పరమాత్మ. అదే పరాశక్తి.

## 4. అంతరాధికరణము (అక్షియందలి పురుషుడు బ్రహ్మమే)

ఈ విషయాన్ని నాల్గవ అధికరణలో వివరిస్తున్నారు. దీని పేరు **'అంతరాధి కరణము'**. ఇందులో ఐదు సూత్రాలున్నాయి.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఉపకోశలుడు బ్రహ్మజ్ఞానం కోసం సత్యకామ జాబాలి దగ్గరకు వెళ్ళి శిష్యరికం చేస్తాడు. సత్యకాముడు ఎంత కాలానికి అతడికి బ్రహ్మోపదేశం చెయ్యడు. చివరకు ఆశ్రమంలో ఉండే అగ్నులే ఉపకోశలుడికి బ్రహ్మోపదేశం చేస్తాయి. ఆ విషయం తెలుసుకున్న సత్యకాముడు బ్రహ్మజ్ఞానాన్ని ఉపకోశలుడికి వివరిస్తూ, "కంటియందు కనిపించే పురుషుడు ఆత్మ. అతడు మరణము, భయము లేనివాడు. అతడే బ్రహ్మ" అని చెప్పాడు. మరికంటి యందున్న పురుషుడు జీవుడా? పరమాత్మా? అని సందేహం. ఈ సందేహం నివృత్తి చేస్తున్నారు.

***సూత్రం - 44 "అన్తర ఉపపత్తేః"***

కంటియందున్న పురుషుడు ఉపపత్తి (సంగతి) వలన పరమాత్మ అని అర్థం.

ఆత్మ అనేపదానికిఅర్థం పరమాత్మ. అమృతత్వము, అభయత్వము అనేవి అతని గుణాలు. నేయిగాని, నీరుగాని పోసినప్పుడు అవి అంటకుండా పక్కలకు పోతాయి. అలాగే పరమాత్మకు పాపపుణ్యాలు అంటవు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో "ఆకాశంలో ఉండే సూర్యునిలో ఉండే తత్త్వము, చంద్రునిలో ఉండే తత్త్వము, భూమిమీద ఉండే అగ్నిలో ఉండే తత్త్వము అన్నీ ఒకటే. సూర్యుడు, చంద్రుడు మొదలైన రూపల్లో ఈ అక్షి పురుషుడే లోకాల్లో ప్రకాశిస్తున్నాడు. కాబట్టి అక్షి పురుషుడు పరమాత్మయే కాని వేరు కాదు.

*సూత్రం - 45 "స్థానాదివ్యపదేశాచ్చ"*

పరమాత్మ నిరాకారుడే అయినప్పటికీ, ఉపాసన కోసము అతడికి నామరూపాలు చెప్పబడ్డాయి.

పూర్వకాలంలో విదేహ దేశాన్ని పాలిస్తున్నాడు జనక మహారాజు. ఆయన ఒకసారి గొప్పయాగం చేశాడు. మామూలుగా యజ్ఞయాగాదులలో భూరి దక్షిణలివ్వటం పరిపాటి. ఆ యజ్ఞంలో ఒక భాగంగా ఆధ్యాత్మిక ప్రపంచంలో గొప్పవాడెవరో తెలుసుకోవాలి అనుకున్నాడు జనకుడు. గోశాలలో ఉన్న బాగా బలిసిన ఒక వేయి గోవులకు ప్రతిదాని గిట్టలకూ, కొమ్ములకూ బంగారు తొడుగులు వేయించి పట్టువస్త్రాలు కప్పి సభలోని బ్రాహ్మణుల నుద్దేశించి "బ్రాహ్మణ శ్రేష్ఠులారా! మీలో అందరికన్న గొప్ప బ్రహ్మవేత్త అయినవాడు ఈ గోవుల్ని తీసుకుపోవచ్చు" అన్నాడు.

ఆ పని చెయ్యటానికి అక్కడ ఉన్న వారెవరికీ ధైర్యం చాలలేదు. పరిస్థితి గమనించిన యాజ్ఞవల్క్యుడు తన శిష్యుణ్ణి పిలిచి 'ఈ గోసంపదను ఆశ్రమానికి తోలుకు పోవలసింది' అన్నాడు. ఈ మాట విన్న మిగిలిన పండితులంతా ఆశ్చర్యపోయారు. కోపగించారు. యాజ్ఞవల్క్యుడు తమకన్న ఏ రకంగా గొప్పవాడు? ఏ రకంగా బ్రహ్మనిష్ఠుడు? అనుకుని ఆతని విజ్ఞానాన్ని పరీక్షించాలని తీర్మానించుకున్నారు. అక్కడ జరిగే యాగంలో హోత 'అశ్వలుడు' హోత అంటే యజ్ఞంలో ఋగ్వేద మంత్రాలు చదివి దేవతలను తృప్తిపరచేవాడు అందరికంటే ముందుగా యాజ్ఞవల్క్యుణ్ణి పరీక్షించటానికి ముందుకు వచ్చినవాడు అశ్వలుడు. మొదటగా అశ్వలుడు ప్రశ్నించాడు "యాజ్ఞవల్క్యా ! నువు గొప్ప బ్రహ్మవేత్తవన్న మాట. నిజమేనా?" కాదు. అని సమాధానం చెప్పాడు యాజ్ఞవల్క్యుడు. 'మరి ఈ గోవులను ఎందుకు తోలుకుపోతున్నావు?' అడిగాడు అశ్వలుడు.

"బ్రహ్మవేత్తలందరికీ నమస్కారం. నాకు ప్రస్తుతం గో సంపద కావాలి" అన్నాడు యాజ్ఞవల్క్యుడు. అయితే నా ప్రశ్నలకు సమాధానం చెప్పు.

"యాజ్ఞవల్క్యా! లోకంలో అన్నీ మృత్యుదేవతకు లోబడినవే కదా! మరి అమృత్యువు దేనికి లోబడి ఉంటుంది?"

"అగ్నికి, అగ్నియే హోత అనే పేరుతో పిలువబడే ఋత్విక్కు. అంటే వాక్కు ద్వారా మృత్యువును జయించవచ్చు. వాక్కే యజ్ఞంలో హోత. వాక్కుకు అధిదేవత అగ్ని. హోతను అగ్నిరూపంలో చూడటమే మృత్యువు నుండి ముక్తుడవటం. అగ్నియే ముక్తి. అజ్ఞాన పాశం నుండి విముక్తి పొందటం అతిముక్తి" అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

"చరాచర జగత్తంతా రాత్రింబవళ్ళచేత వ్యాప్తమై ఉన్నది. అన్నీ రాత్రింబవళ్ళకు లోబడే ఉన్నాయి. మరి ఏ సాధనం వల్ల యజమాని అహోరాత్రాల పట్టునుంచి తప్పించుకోగలుగుతాడు?" అడిగాడు అశ్వలుడు.

"అధ్వర్యుడనే ఋత్విక్కు ద్వారా ! అంటే నేత్రం ద్వారా లేదా సూర్యుని ద్వారా. దృష్టికి అధిదేవత సూర్యుడు. సూర్యుడే ముక్తి. అంటే అధ్వర్యుని ఆదిత్యరూపంలో ఉపాసిస్తే, ఆ రకంగా ఉపాసింపబడే అధ్వర్యుడే ముక్తి. అతడే అతిముక్తి" అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

"ఈ ప్రపంచమంతా చంద్రుని కృష్ణ, శుక్లపక్షాల వల్ల వ్యాప్తమై ఉన్నది కదా! యజమాని ఈ వ్యాప్తిని ఏ విధంగా దాటగలుగుతాడు?" అన్నాడు అశ్వలుడు.

ప్రాణంద్వారా ! అంటే వాయువు ద్వారా తరించగలుగుతాడు. వాయువే ఉద్గాత. యజ్ఞంలో సామవేదాన్ని పఠించేవాడు ఉద్గాత. కాబట్టి ప్రాణమే ముక్తి. అదే అతిముక్తి కూడా' అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

"ఆకాశం ఆధారం లేకుండా ఉంది గదా! మరి యజమాని ఏ ఆధారంతో స్వర్గానికి పోతాడు?" అని ప్రశ్నించాడు అశ్వలుడు.

"బ్రహ్మ అనే ఋత్విక్కు ద్వారా స్వర్గానికి పోతాడు. యాగపర్యవేక్షకుడే బ్రహ్మ. మనస్సు రూపంలో ఉండే చంద్రునిద్వారా స్వర్గానికి పోతాడు. మనస్సే యజ్ఞంలోని బ్రహ్మ. మనస్సు చంద్రుడు. కాబట్టి మనస్సే ముక్తి. అతిముక్తి కూడా" అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

"యజ్ఞంలో హోత తనవంతు ఎన్ని ఋక్కులు పఠిస్తాడు? అవి ఏవి?" ప్రశ్నించాడు అశ్వలుడు.

"మూడు ఋక్కులు. అవి 1) పురోనువాక్యాలు 2) యజ్యాలు 3) శస్యాలు

**1. పురోమవాక్యాలు :** యజ్ఞానికి ముందు ప్రవక్తమయ్యే ఋక్కులు.

**2. యజ్యాలు :** యాగ సమయంలో ప్రవక్తమయ్యే ఋక్కులు

**3. శస్యాలు :** దేవతలను ప్రశంసించటం కోసం స్తుతి రూపమైన ఋక్కులు" అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

"యజ్ఞంలో అధ్వర్యుడు. ఎన్ని విధాలయిన ఆహుతుల్ని హవనం చేస్తాడో వివరించవలసినది" అన్నాడు అశ్వలుడు.

"మూడు రకాల ఆహుతులు.

**1) ప్రజ్వలిత ఆహుతులు :** నేయి, సమిధలు ఆహుతులుగా ఇచ్చినప్పుడు, అవి బాగా ప్రజ్వలిస్తాయి. వాటివల్ల యజమాని దేవలోకం పొందుతాడు.

**2) నాదమయి ఆహుతులు :** నేయి, సమిధలు హోమం చేసినప్పుడు పెద్ద శబ్దాలు వస్తాయి. వీటివల్ల యజమాని పితృలోకం పొందుతాడు.

**3) నిమ్నస్థానీయాహుతులు :** పాలు, సోమరసం హోమం చేసినప్పుడు అగ్ని జ్వాలలు పృథివిలో లీనమవుతాయి. వీటివల్ల యజమాని మనుష్యలోకాన్ని జయిస్తాడు" అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

"బ్రహ్మ అనే ఋత్విక్కు దక్షిణ దిక్కున కూర్చుని ఎంతమంది దేవతల ద్వారా ఈ యాగాన్ని రక్షిస్తున్నాడు?" అడిగాడు అశ్వలుడు.

"ఒక దేవత ద్వారా"

"ఆ దేవత ఎవరు?"

"మనస్సే ఆ దేవత, మనస్సు అనంతమైనది. విశ్వేదేవతలు కూడా అనంతమైన వారు. కాబట్టి అనంతమైన విశ్వేదేవతల వలన రక్షిస్తున్నాడు. దీనివల్ల యజమాని అనంత లోకాలు జయిస్తాడు." అని సమాధానం చెప్పాడు యాజ్ఞవల్క్యుడు. అంతటితో తన పని అయిపోయిందన్నట్లుగా కూర్చుండిపోయాడు అశ్వలుడు.

ఇక జరాత్కరువు వంశానికి చెందినవాడు, ఋతభాగుని కుమారుడు అయిన 'ఆర్తభాగుడు' ప్రశ్నించటం ప్రారంభించాడు.

"యాజ్ఞవల్క్యా! గ్రహాలు ఎన్ని. అతిగ్రహాలు ఎన్ని" అడిగాడు ఆర్తభాగుడు.

"గ్రహము అంటే గ్రహించేది, ఇంద్రియము. విషయాలను గ్రహించేవి కాబట్టి గ్రహాలు. అతిగ్రహము అంటే గ్రహముకన్న పెద్దది; గొప్పది. కాబట్టి విషయాలే అతిగ్రహాలు.

1. ప్రాణము (ముక్కు) గ్రహము, వాసన గంధము అతిగ్రహము, గ్రహము అనేది అతిగ్రహము యొక్క అధీనంలో ఉంటుంది. వాసన అనేది అపానము అంటే లోపలికి పీల్చేగాలి. దాని ద్వారానే మనకు వాసన తెలుస్తోంది. అందుకనే ప్రాణము గ్రహము అపానము అతిగ్రహము. అదే విధంగా ...

2. వాగింద్రియము గ్రహము, నామము అతిగ్రహము

3. నాలుక గ్రహము, రుచి అతిగ్రహము.

4. కన్ను గ్రహము, రంగు, రూపము అతిగ్రహము.

5. చెవి గ్రహము, శబ్దము అతిగ్రహము

6. మనస్సు గ్రహము. కోరిక అతిగ్రహము

7. చేతులు గ్రహము, కర్మ అతిగ్రహము.

8. చర్మము గ్రహము, స్పర్శ అతిగ్రహము.

ఈ రకంగా గ్రహలు ఎనిమిది, అతిగ్రహాలు ఎనిమిది.'' అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

"కనిపించే జగత్తు అంతా మృత్యువుకు అన్నం కదా? మరి మృత్యువు ఏ దేవతలకు ఆహారమవుతుంది?" అని ప్రశ్నించాడు ఆర్తభాగుడు.

"అగ్నే మృత్యువు. అగ్ని రూపంలో ఉన్న మృత్యువు జలానికి అన్నమవుతోంది. అంటే జలము అగ్నిని ఆర్పివేస్తుంది." అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

"యాజ్ఞవల్క్యా! మానవుడు చనిపోయినప్పుడు, బ్రహ్మవేత్త యొక్క ఇంద్రియాలు (ప్రాణాలు) అతనినుండి పైకి పోతాయా? పోవా?" అని అడిగాడు ఆర్తభాగుడు.

"అలా జరగదు. తత్త్వజ్ఞాని యొక్క ప్రాణాలు పరమాత్మలో లీనమవుతాయి. సామాన్య మానవుడిలాగానే బ్రహ్మవేత్త మరణిస్తాడు. కాని అతడికి పునర్జన్మ ఉండదు" అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

"పురుషుడు చనిపోయినపుడు అతణ్ణి వదలకుండా ఉండేది?" మళ్ళీ అడిగాడు ఆర్తభాగుడు.

"పేరు. అన్నీ లీనమైపోయినా, జాతి సంసర్గం కారణంగా నామమాత్రం లీనం కాదు. నామమనేది నిత్యము, అనంతము. నామాన్ని ఆశ్రయించి ఉన్న విశ్వేదేవులు కూడా అనంతంగానే ఉన్నారు. వీరిని ఉపాసించిన వారు అనంత లోకాలు పొందుతారు" అన్నాడు యాజ్ఞవల్క్యుడు, చివరిసారిగా అడుగుతున్నాడు ఆర్తభాగుడు. "యాజ్ఞవల్క్యా ! మానవుడు చనిపోయిన తరువాత అతని యొక్క

| | | |
|---|---|---|
| వాక్కు | – | అగ్నిలో లీనమై పోతుంది |
| ప్రాణం | – | వాయువులో లీనమై పోతుంది |
| నేత్రాలు | – | ఆదిత్యునిలో లీనమై పోతాయి |
| శ్రోత్రాలు | – | దిక్కులయందు లీనమై పోతాయి |
| మనస్సు | – | చంద్రునిలో లీనమై పోతుంది |
| శరీరం | – | భూమిలో లీనమై పోతుంది |
| హృదయాకాశం | – | భూతాకాశంలో లీనమై పోతుంది |
| కేశాలు | – | వనస్పతులలో లీనమై పోతాయి |
| శుక్రశోణితాలు | – | జలంలో కలిసిపోతాయి కదా! |

అటువంటి స్థితిలో పురుషుడు ఎక్కడ ఉంటాడు? అంటే ఇంద్రియాలన్నీ వాటి వాటి కారణాల్లో లీనమైపోగా మిగిలిన పురుషుడు ఏమౌతాడు? దేని ఆధారంగా అతడు మళ్ళీ శరీరం ధరిస్తాడు?"

"కర్మ, కర్మవల్ల మానవుడు పాపపుణ్యాలు పొందుతాడు. పుణ్యకర్మల వల్ల పుణ్యాత్ముడు, పాపకర్మల వలన పాపాత్ముడు అవుతాడు. ఆ కర్మ ఆధారంగానే వేరొక శరీరము. ఇంద్రియాలు ధరిస్తాడు. అంతేకాని కర్మవల్ల మోక్షం సిద్ధించదు" అన్నాడు యాజ్ఞవల్క్యుడు దీంతో 'ఇంక అడిగేది ఏమీ లేదు' అన్నాడు ఆర్తభాగుడు.

"ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. శోకం తాకదు. దానికి ఆకలి దప్పికలు లేవు. మానవుడు సత్యకాముడు, సత్య సంకల్పుడు అయి ఆత్మజిజ్ఞాసను అలవరచుకోవాలి. ఆత్మకోసం అన్వేషించినవాడు, ఆత్మను అనుభవించినవాడు ఆత్మస్వరూపాన్ని పొందుతాడు. పూర్ణస్థితి అతనికి వస్తుందన్నమాట."

దేవతలు, రాక్షసులుకూడా ఆ మాటలు విన్నారు. "ఆత్మను గురించి మనంకూడా అన్వేషిద్దాం. ఆత్మవల్ల అన్ని కోరికలు తీరతాయని బ్రహ్మచెప్పాడు కదా!" అని వారు భావించారు.

దేవతలరాజు ఇంద్రుడు, రాక్షసుల రాజు విరోచనుడు ఇద్దరూ ఆత్మజ్ఞానం సంపాదిద్దామని చేతితో దర్భలు పట్టుకుని బ్రహ్మవద్దకు వెళ్ళారు. బ్రహ్మ వీరిద్దరినీ ముప్పైరెండు సంవత్సరాలు, బ్రహ్మచర్యదీక్ష వహించమని చెప్పాడు. దీక్ష పూర్తి చేశారిద్దరూ.

"వత్సలారా ! మీరు నాకోసం దేనికి వచ్చారు?" అన్నాడు బ్రహ్మ.

"భగవాన్ ! ఆత్మ తత్త్వాన్ని గురించి చెప్పిన విషయాలు విన్నాం. ఆత్మను గురించి ప్రత్యక్షంగా తమ నోటిమీదుగా వినాలని వచ్చాం" అన్నారు. ఇంద్ర విరోచనులు.

"మనుష్యుల కనుపాపలలో మెదలుతూ కనుపించే పురుషుడే ఆత్మ. ఆత్మ అభయం. అమృతమయం. అదే బ్రహ్మం" అన్నాడు బ్రహ్మ.

అదివిన్నవారు "భగవాన్ ! నీటిలో కనుపించే ప్రతిబింబం, అద్దంలో కనిపించే ప్రతిబింబం. ఈ రెంటిలో ఏది ఆత్మరూపం?" అని అడిగారు.

"నేను మొదటగా కళ్ళలో మెరిసే ఏపురుషుని వర్ణన చేశానో వీటన్నింటిలోనూ ప్రతిఫలించేది ఆ పురుషుడే. ఒకసారి నీళ్ళలోను, అద్దంలోను మీ రూపాలు చూసుకుని మీ అనుభవాలు నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ. ఇంద్ర విరోచను లిద్దరూ అలాగే చేసి ప్రజాపతి దగ్గరకు వెళ్ళారు. ప్రజాపతి వీరిని చూసి "మీరు ఏం చూశారు." అన్నాడు.

"నఖశిఖ పర్యంతము కేశపాశాలతో మా శరీరాల ప్రతిరూపమే మాకు నీళ్ళలోనూ, అద్దంలోనూ కూడా కనిపించింది" అన్నారు వారు.

"నాయనలారా ! శరీరాలు శుభ్రపరచుకుని, మంచి వస్త్రాలు ఆభరణాలు ధరించి నీటిలో మీ ముఖాన్ని చూసుకోండి. తరువాత ఏం చేశారో నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ 'అలాగే' అని చెప్పి ఇద్దరూ వెళ్ళిపోయారు. మరునాడు తిరిగి వచ్చి "స్వామీ ! ఈ చక్కని వస్త్రాలతో ఆభరణాలతో అలంకరించిన మా శరీరాలే నీటిలో కనిపించాయి" అన్నారు.

"అభయమూ, అమృతమయమూ అయిన ఆత్మ అదే. అదే బ్రహ్మము" అన్నాడు ప్రజాపతి

అదివిన్న ఇంద్ర విరోచనులు ఆత్మను గురించి తమకు అంతా తెలిసిందనుకుని తిరిగి వెళ్ళిపోయారు. అలా వెళ్ళిపోతున్నవారిని చూసి" అసలు ఆత్మజ్ఞానం లభించకుండానే వారు తెలిసింది అనుకుని వెళ్ళిపోతున్నారు. వారు దేవతలైనా, రాక్షసులైనా **శరీరాన్నే ఆత్మ అని భావించటం పతన హేతువు"** అనుకున్నాడు.

విరోచనుడు ఆత్మని గురించిన ఈ సిద్ధాంతంతోనే తృప్తి చెంది, రాక్షస జాతి కంతటికీ ఈ సిద్ధాంతాన్నే బోధించాడు. అసలైన పరమసత్యం తనకు లభించిందని తృప్తి చెందాడు. దేహమే ఆత్మ అని ప్రచారం చేశాడు.

ఇంద్రుడు దేవలోకానికి బయలుదేరాడు. దారిలో తాను నేర్చుకున్న దానిలో ఏదో లోపం కనిపించింది. తను నేర్చుకున్న సిద్ధాంతాన్ని ఒకసారి సమీక్షించుకున్నాడు. విషయాన్ని విమర్శచేసి చూశాడు. బాగా అలంకరించుకుంటే అలంకరించినట్లు, మంచి వస్త్రాలు ధరిస్తే ధరించినట్లు, కుంటివాడైతే కుంటివాడిలాగా, గ్రుడ్డివాడైతే గ్రుడ్డివాడిలాగా శరీర ప్రతిబింబం కనిపిస్తుంది. మరణానంతరం శరీరం లేనప్పుడు ఆత్మ ఏమౌతుంది. మృత్యువువాత పడే ఈ శరీరాన్ని అమృతమయమగు ఆత్మ అనటంలో అర్ధంలేదు. ఇంద్రుడి సంశయాలు తీరలేదు. సంతృప్తి లభించలేదు. వెనక్కి తిరిగి ప్రజాపతి దగ్గరకు వెళ్ళి నుంచున్నాడు.

తిరిగి వచ్చిన ఇంద్రుణ్ణి చూసి ప్రజాపతి "ఇంద్రా! నువు విరోచనుడితో వెళ్ళిపోయావు కదా! మళ్ళీ ఎందుకు తిరిగి వచ్చావు?" అని అడిగాడు.

ఇంద్రుడు తన అనుమానాలన్నీ వివరించాడు "ప్రభూ! శరీరంలోగాని, శరీరచ్ఛాయలో గాని నాకు ఏమీ విశేషం కనబడలేదు. అందుకని గతంలో

నేర్చుకున్నది తృప్తిని కలిగించలేదు. ఆత్మజ్ఞానాన్ని మీవద్ద అభ్యసించాలని మళ్ళీ వచ్చాను" అన్నాడు.

ఇంద్రుడి జిజ్ఞాసకు ఆనందించాడు బ్రహ్మ. ఇంద్రుణ్ణి మళ్ళీ ముప్పై రెండు సంవత్సరాలు బ్రహ్మచర్యదీక్ష పాటించమన్నాడు. ఇంద్రుడు దీక్షతో బ్రహ్మవద్దనే గడిపాడు. దీక్ష పూర్తి అయిన తరువాత ప్రజాపతి ఇంద్రుడితో "స్వప్న ప్రపంచంలో ప్రభువులాగా స్వేచ్ఛగా విహరించే చైతన్యమే ఆత్మ" అన్నాడు.

ఈ మాటలతో ఇంద్రుడు తృప్తిపడి తిరిగి వెళ్ళిపోవటానికి బయలుదేరాడు. అలా వెడుతుంటే త్రోవలో మళ్ళీ అనుమానం వచ్చింది. "స్వప్నాలు అనుభవించే చైతన్యమే ఆత్మ ఎలా అవుతుంది. మనకు ఒక్కొక్కసారి కలలో ఎవరో పీడిస్తున్నట్లు అనిపిస్తుంది. మనం దుఃఖిస్తాము. పాపరహితము, అభయము అయిన ఆత్మ ఈ రకంగా దుఃఖించటంలో అర్థం లేదు. ఇది సత్యంకాదు." అనిపించింది. మళ్ళీ తిరిగి వచ్చాడు ఇంద్రుడు. ప్రజాపతి ఆదేశం మేరకు మళ్ళీ కొన్ని సంవత్సరాలు బ్రహ్మచర్య దీక్ష గడిపాడు. అప్పుడు ప్రజాపతి ఇంద్రుడితో ఈ విధంగా చెప్పాడు. "గాఢసుషుప్తిలో సంతృప్తిగా ఆనందాన్ని అనుభవించేదే ఆత్మ."

ఇంద్రుడు ఈ మాట నిజమే అని నమ్మి దేవలోకానికి బయలుదేరాడు. మార్గమధ్యంలో ఇంద్రుడికి మళ్ళీ అనుమానం వచ్చింది. గాఢనిద్ర అనుభవిస్తున్నదే ఆత్మ అనుకుంటే ఆత్మ తనను తాను తెలుసుకోలేని స్థితిలో ఉంటుందన్నమాట. తనను గురించి తాను తెలుసుకోలేని అవ్యక్తతత్త్వం ప్రకాశవంతమైన ఆత్మ ఎలా అవుతుంది? ఈ అనుమానంతో ఇంద్రుడు తిరిగి ప్రజాపతి దగ్గరకు వచ్చాడు. ఈ సారి ప్రజాపతి ఇంద్రుణ్ణి కేవలం ఐదు సంవత్సరాలు తనదగ్గర బ్రహ్మచర్య దీక్షతో ఉండమన్నాడు.

గుడువు పూర్తయిన తరువాత ఇంద్రుడి పట్టుదలకు మెచ్చి ఆత్మతత్త్వాన్ని పూర్తిగా వివరించాడు.

ఇంద్రా! నీ పట్టుదలకు మెచ్చాను. ఆత్మానుభవం పొందటానికి నువు పూర్తిగా అర్హుడవు. శరీరం అశాశ్వతమైనది. ఆఖరుక్షణాలు ఆసన్నం కాగానే శరీరాన్ని మృత్యువు కబళిస్తుంది. శాశ్వతమైన ఆత్మకు అశాశ్వతమైన శరీరమే ఆవాసం.

శరీరం ఉన్నంత కాలంలో ఆత్మకు సుఖదుఃఖాలు, గుణదోషాలు అంటినట్లూ, వాటితో సతమతమవుతున్నట్లు కనిపిస్తుంది. ఆత్మశరీరంతో సంబంధం ఏర్పరచుకోవటం వల్లనే జీవులకు సుఖదుఃఖాలు ఏర్పడతాయి. శరీరం ఆత్మనుండి విడివడితే ఈ బంధం నుండి విముక్తి లభిస్తుంది.

భౌతిక విషయాల నుండి విముక్తి పొంది ఆత్మను మనస్సుకు, ఇంద్రియాలకు విలక్షణమైనదిగా గ్రహించి, తేజోమయుని భావించి అనుభవజ్ఞుడు ఆనందిస్తాడు. ఆత్మజ్ఞానం పొందినవాడు ముక్తి సామ్రాజ్యంలో విహరిస్తాడు.

శాస్త్రోక్తంగా గురుకుల వాసం చేసి గురుకులం నుండి సమావర్తనం పూర్తి చేసి, పెండ్లాడి, గృహస్థుడయి పవిత్రమైనచోట స్వాధ్యయనం చేస్తూ పుత్రుల్ని, శిష్యుల్ని ధర్మపరాయణులుగా తీర్చిదిద్దుతూ ఇంద్రియాలను అదుపుచేసి అంటే జితేంద్రియుడై శాస్త్ర విరుద్ధమైన జీవహింస చేయకుండా జీవితాన్ని గడిపేవాడు చివరకు బ్రహ్మలోకం పొందుతాడు. అక్కడ నుండి మళ్ళీ తిరిగిరాడు. ఈ విధంగా అర్చిరాది మార్గం ద్వారా బ్రహ్మలోకానికి పోయిన ఉపాసకుడు బ్రహ్మలోకమున్నంత వరకు అక్కడ దివ్యభోగాలను అనుభవించి తరువాత పరబ్రహ్మలో లీనమవుతాడు. అతడికి పునరావృత్తి ఉండదు."

ఈ రకంగా ప్రజాపతి ఆత్మజ్ఞానాన్ని దేవేంద్రుడికి వివరించాడు.

పరబ్రహ్మ హృత్పద్మంలోనే ఉన్నాడు. కాబట్టి దహరాకాశమే బ్రహ్మ.

***సూత్రం - 83 "అన్యార్థశ్చ పరామర్శః"***

దహరవిద్యా ప్రకరణంలోని దహరుడు పరమేశ్వరుడే.

***సూత్రం - 84 "అల్పశ్రుతేరితి చేత్తదుక్తమ్"***

దహరము అంటే సూక్ష్మము అల్పము అని అర్ధము. దహరాకాశము అంటే సూక్ష్మమైన ఆకాశము. అయితే సూక్ష్మము అని చెప్పినంత మాత్రంచేత అది పరమాత్మ కాకపోదు. పరమాత్మ పరమాణువులాగా అతిసూక్ష్మరూపంలో కూడా ఉన్నాడని **కఠోపనిషత్తు**లో చెప్పబడింది. కాబట్టి సూక్ష్మరూపంలో ఉన్నప్పటికీ దహరాకాశము అంటే పరమాత్మ. లలితా సహస్రంలో 610వ నామము.

## 610. దహరాకాశరూపిణీ

హృదయాకాశము నందుండునది. ఈ బ్రహ్మపురం (శరీరం)లో దహరమనే పుండరీకము (హృత్పద్మము) ఉన్నది. దాని మధ్య ఆకాశమున్నది. అందులో పరబ్రహ్మ ఉన్నాడు. అని వేదం చెబుతోంది. ఈ విషయాన్ని గతంలో వివరించాం.

జగత్తులో పైన కనిపించే ఆకాశము – మహదాకాశము. ఘటంలో కనిపించే ఆకాశము – ఘటాకాశము హృదయస్థానంలో ఉండే ఆకాశము – దహరాకాశము. ఆ దహరాకాశమే రూపంగా గలది. కాబట్టి దహరాకాశ రూపిణీ అనబడుతోంది. ఆమెయే పరబ్రహ్మ, పరాశక్తి.

## 6. అనుకృత్యధికరణము (బ్రహ్మము స్వయంప్రకాశము)

ఆత్మ అమితమైన ప్రకాశం కలది. దాని దగ్గర సూర్యుడు, చంద్రుడు నక్షత్రాలు ఏవీ ప్రకాశించవు.

**న తత్ర సూర్యోభాతి, నతత్ర చంద్రతారకం** అని చెబుతోంది **ముండకోపనిషత్తు.** అలాంటప్పుడు ఆ కాంతి (ఆత్మయొక్క ప్రకాశము) కూడా ఏదో ఒక తేజస్సే అయి ఉండాలి కదా? అని అనుమానం వస్తుంది. దీనికి సమాధానం చెబుతున్నారు ఆరవదైన **'అనుకృత్యధికరణ'**లో దీంట్లో మొత్తం రెండు సూత్రాలున్నాయి.

***సూత్రం – 85 "అనుకృతేస్తస్య చ"***

అనుకరించటంవల్ల ఆత్మయొక్క తేజస్సుతోనే సమస్తమూ ప్రకాశిస్తుంది.

***సూత్రం – 86 "అపి చ స్మర్యతే"***

ఈ విషయం స్మృతులలో కూడా వివరించబడింది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో "ఒకరోజున యాజ్ఞవల్క్యుడు జనక మహారాజు ఆస్థానానికి వచ్చాడు. అతడికి నమస్కరించి జనకమహారాజు తన సందేహాలు తీర్చమని అడిగాడు. అలాగే అన్నాడు యాజ్ఞవల్క్యుడు. ఇప్పుడు జనకుడు అడుగుతున్నాడు.

జ : మానవుడు ఏ వెలుగు వల్ల నిత్యకృత్యాలు సాగిస్తున్నాడు?

యా : సూర్యునియొక్క వెలుగు వల్ల

జ : సూర్యుడు లేకపోతే, అంటే రాత్రులందు ఏ వెలుగుచేత నిత్యకృత్యాలు సాగిస్తాడు?

యా : చంద్రుని యొక్క కాంతులలో

జ : సూర్యుడు, చంద్రుడు ఇద్దరూ లేనప్పుడు? అంటే సంధ్య వేళల యందు?

యా : అగ్ని యొక్క కాంతులతో

జ : సూర్యుడు, చంద్రుడు, అగ్ని కూడా లేనప్పుడు?

యా : వాక్కు యొక్క సాయంతో

జ : మరి వాక్కు కూడా లేనప్పుడు?

యా : జనక మహారాజా! ఈ వెలుగులన్నిటికీ ఆవల ఆత్మజ్యోతి ఉన్నది. ఆ ఆత్మ ప్రకాశములకు ప్రకాశము. కాంతులకు కాంతి. అటువంటి ఆత్మవల్లనే మానవుడు తన మనుగడ సాగిస్తాడు.

జ. : స్వామీ ! ఆత్మ అంటే ఏమిటి? శరీరము, ఇంద్రియాలు, మనస్సు, వీటిలో ఆత్మజ్యోతి ఏది?

యా : ప్రాణాల్లోను, బుద్ధివృత్తుల యందు ఉండే విజ్ఞాన జ్యోతియే ఆత్మ. ఇంద్రియాల మధ్య స్వయంప్రకాశమై హృదయంలో ఉండే పురుషుడే ఆత్మ. అతడే జ్యోతిస్వరూపుడు.

**ముండకోపనిషత్తులో** చెబుతున్నాడు.

**నతత్ర సూర్యోభాతి నతత్ర చంద్రతారకం**

అక్కడ సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు ఏవీ ప్రకాశించవు. కేవలము ఆత్మజ్యోతి ప్రకాశము మాత్రమే ఉంటుంది.

**అష్టోత్తరశతం వహ్నే। షోడశోత్తరశతం రవేః ।**
**షట్త్రింశ తదుత్తరశతం చంద్రశ్య కిరణాశ్శివేః ॥**

పరమేశ్వర స్వరూపము జ్ఞానజ్యోతి. ఆ జ్యోతి నుంచి అనేకవేల లక్షల కోట్ల కోటానుకోట్ల కిరణాలు ప్రకాశిస్తున్నాయి. అందులో 360 కిరణాలు మాత్రమే మనం తీసుకోగలిగాము. అందులో అగ్ని 108 కిరణములు, రవి 116 కిరణములు, చంద్రుడు 136 కిరణములు తీసుకోగలిగారు. ఈ మొత్తం 360 కిరణములు సూర్యుడు, చంద్రుడు, అగ్ని అందరూ ఆ పరమేశ్వరుని కిరణాలవల్లనే ప్రకాశిస్తున్నారు.

**అంగుష్టమాత్రః పురుషోంతరాత్మా సదాజనానాగ్ం హృదయే సన్నివిష్టః**

పరబ్రహ్మ అంగుష్టమాత్ర పరిమాణంతో హృదయగుహలో నివసిస్తున్నాడు. అంటోంది శ్వేతాశ్వతరోపనిషత్తు.

ఈ రకంగా బ్రహ్మవల్లనే ఈ జగత్తు అంతా ప్రకాశిస్తున్నది. పరబ్రహ్మ స్వయం ప్రకాశము గలవాడు. అదే పరాశక్తి.

## 7. ప్రమితాధికరణము (అంగుష్టమాత్ర పురుషుడు బ్రహ్మమే)

అంగుష్టమాత్ర పురుషుడు బ్రహ్మమేను అని వివరిస్తున్నారు ఏడవదైన '**ప్రమితాధికరణ**'లో దీంట్లో రెండు సూత్రాలున్నాయి.

అంగుష్టమాత్ర పురుషుడు శరీర మధ్యలో ఉన్నాడు. అతడే భూతభవిష్య ద్వర్తమానాలకు ప్రభువు". అని **కఠోపనిషత్తు**లో చెప్పారు.

**అంగుష్టమాత్రః పురుషోంతరాత్మా సదాజనానాగ్ం హృదయే సన్నివిష్టః ।**

పరబ్రహ్మ అంగుష్టమాత్ర పరిమాణంతో హృదయ గుహలో నివసిస్తున్నాడు. అంటోంది **శ్వేతాశ్వతరోపనిషనిషత్తు.** ఈ అంగుష్టమాత్రుడు జీవుడా? పరమాత్మా?

భారతంలో యముడు సత్యవంతుని శరీరం నుండి అంగుష్టమాత్రుడైన పురుషుణ్ణి బయటకు లాగాడు అని చెప్పారు. ఇక్కడ అంగుష్టమాత్రుడు అంటే జీవుడే కదా?" ఇది అనుమానం.

***సూత్రం – 87 "శబ్దాదేవ ప్రమితః"***

అంగుష్టమాత్రుడైన పురుషుడు అంటే జీవుడు కాదు. పరమాత్మే.

***సూత్రం – 88 "హృద్యపేక్షాతు మనుష్యాధికారత్వాత్"***

ఈశ్వరుడు సర్వవ్యాపి అయినప్పటికీ అతడు అంగుష్టమాత్రుడై, హృదయ స్థానంలో ఉన్నాడు.

పరమేశ్వరుడు సర్వాంతర్యామి. సర్వశక్తి సంపన్నుడు. అతనికి ఉన్న ఈశత్వము, భూతభవిష్యత్తుల మీద అధికారము జీవికి ఉండవు. పరమేశ్వరుడు ఎందులో ఉంటే ఆ రూపంలోనే ఉంటాడు. అంటే వెదురు బొంగులో ఉండే ఆకాశము సన్నగా పొడవుగా ఉంటుంది. అలాగే చీమ, దోమలయందు ఉన్న పరమాత్మ, సూక్ష్మరూపంలో ఉంటాడు. ఈ అంగుష్టమాత్రుడు అనే శబ్దం మానవులలో ఉండే పరమాత్మకే వర్తిస్తుంది. కాబట్టి అంగుష్టమాత్ర పురుషుడు పరబ్రహ్మయే. అదే పరాశక్తి.

## 8. దేవతాధికరణము (దేవతలు బ్రహ్మవిద్యకు అధికారులే)

దేవతలకు బ్రహ్మవిద్య తెలుసుకునే అధికారమున్నది అని చెబుతున్నారు ఎనిమిదవ అధికరణలో ఇందులో ఎనిమిది సూత్రాలున్నాయి. దీని పేరు **'దేవతాధికరణ'.**

"బ్రహ్మవిద్యను ఎవరు అభ్యసించాలి? మానవులకు బ్రహ్మోపదేశము పొందే హక్కు ఉన్నది. మరి దేవతల సంగతి ఏమిటి? దేవతలకు బ్రహ్మవిద్యను పొందే అధికారము ఉన్నదా!" ఈ ప్రశ్నకు సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 89 "తదుపర్యపి బాదరాయణః సంభవాత్"***

మానవులకన్న ఉన్నతులు దేవతలు. దేవతలు భోగలాలసులు అనే మాట నిజమే. కాని వారి భోగం శాశ్వతం కాదు అనే విషయం వారికి తెలుసు. అందుకే వారుకూడా శాశ్వతమైన ఆనందం కావాలి అనుకుంటారు. కాబట్టే వారికికూడా వైరాగ్యం కలుగుతుంది. అప్పుడు బ్రహ్మవిద్యకు అధికారులవుతారు.

***సూత్రం - 90 "విరోధః కర్మణీతి చెన్నానేకప్రతిపత్తేర్దర్శనాత్"***

దేవతలకు దేహమున్నది మానవులు చేసే యజ్ఞయాగాలలో హవిర్భాగము తీసుకోవటానికి దేవతలు వస్తారు. ఒకేసారి అనేకచోట్ల ప్రత్యక్షమై హవిర్భాగం తీసుకుంటారు. **బృహదారణ్యకోపనిషత్తు**లో శాకల్యుడు అడుగుతున్నాడు. యాజ్ఞవల్క్యా! దేవతలెంతమంది? యాజ్ఞవల్క్యుడు చెబుతున్నాడు 3306 మంది.

శా : దేవతలెంతమంది

యా : ముప్పై ముగ్గురు

శా : దేవతలెంతమంది

యా : ఆరుగురు

శా : దేవతలెంతమంది

యా : ముగ్గురు

అంటే ఒకే దేవత ఒకేసారి అనేక శరీరాలు పొందుతుంది శ్రీకృష్ణుడు అనేకమంది గోపికలతో ఒకేసారి క్రీడించాడని చెప్పబడింది. కాబట్టి దేవతలకు శరీరత్వమున్నది.

***సూత్రం - 91 "శబ్ద ఇతి చేన్నాతః ప్రభవాత్ప్ర త్యక్షానుమానాభ్యామ్"***

వేదము నిత్యమైనది. దేవతలు అనిత్యులు. దేవతలంతా పూర్వజన్మలో చేసిన కర్మననుసరించి దైవత్వము పొందినవారే. అందుకే వారు అనిత్యులు. నిత్యమైన వేదంనుంచే అనిత్యులైన దేవతలు ఉద్భవించారు. ప్రజాపతే దేవతలందరినీ సృష్టించాడు. అని **ఐతరేయోపనిషత్తు**లో చెప్పబడింది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో కూడా పరమేశ్వరుడు ఎనభై నాలుగు లక్షల జీవరాసులను సృష్టించాడు వీరిలో బ్రహ్మను గురించి తెలుసుకున్నవారు బ్రహ్మస్వరూపులయ్యారు. అని చెప్పబడింది. కాబట్టి దేవతలకు బ్రహ్మవిద్యయందు అధికారమున్నది.

***సూత్రం - 92 "అత ఏవ చ నిత్యత్వమ్"***

నిరాకారుడైన పరబ్రహ్మ ఒకరూపం దాల్చినట్లైతే అదే అక్షరము. దాని నామమే ఓంకారము. ఇది నిత్యమైనది. ఓంకారం నుండే వేదాలు ఉద్భవించినాయి. అందుచేతనే వేదాలుకూడా నిత్యమైనవి. దేవతలు వేదంనుంచే ఉద్భవించారు. జగత్తంతా వేదంనుంచే ఆవిర్భవించింది.

ప్రళయకాలంలో ఈ వేదాలు మూడూ ఆకార ఉకార మకారాలలో కలిసి పోతాయి. అకార ఉకార మకారాలు ఓంకారంలో చేరిపోతాయి. వేదాలు నిత్యాలు అంటే వ్యావహారిక నిత్యాలని గుర్తుంచుకోవాలి. పారమార్థిక నిత్యాలు కాదు.

***సూత్రం - 93 "సమాననామరూపత్వాచ్చావృత్తా వప్య విరోధో దర్శనాత్ స్మృతేశ్చ"***

ఒక అక్షరానికి లేదా పదానికి దాని ఆకారమే అర్థం. ప్రళయ కాలంలో సమస్తము నశించిపోతాయి కదా. మళ్ళీ అదే ఆకారాలతో పుడతాయనే నమ్మకం లేదు కదా!

ప్రళయం సంభవించినప్పుడు, సమస్తమూ పరమాత్మలో లీనమైపోతాయి. సృష్టి జరిగినప్పుడు మళ్ళీ పుడతాయి. వేసవికాలంలో చెరువులు ఎండిపోతాయి. వాటిలోని చేపలు, కప్పలు అన్నీ చచ్చిపోతాయి. వర్షాలు పడి చెరువులు నిండగానే మళ్ళీ అన్నీ పుట్టినట్లే ఈ సృష్టి, ప్రళయము కూడా సంభవిస్తాయి. సృష్టి జరిగినప్పుడు అన్ని జీవరాసులు పరమాత్మ నుండే ఉద్భవిస్తాయి అని **ఐతరేయోపనిషత్తు, ముండకోపనిషత్తు**లలో చెప్పబడింది. ఈ సృష్టి అంతా పూర్వంలాగానే జరిగింది. అంటే గతంలో లాగానే జీవరాసులన్నీ ఆవిర్భవించాయి. ప్రళయ కాలంలో దేవతలు కూడా పరమాత్మలో లీనమైపోయి మళ్ళీ ఆవిర్భవిస్తారు. అందుచేతనే దేవతలు శాశ్వతానందం కోసం ప్రయత్నిస్తారు. వారికి బ్రహ్మవిద్యాధికారమున్నది.

***సూత్రం - 94 "మధ్వాదిష్వసంభవాదనధికారం జైమినిః"***

బ్రహ్మవిద్య యందు దేవతలకు అధికారం లేదు అంటున్నాడు జైమిని.

**ఛాందోగ్యోపనిషత్తు**లో మధువిద్య చెప్పబడింది. అందులో "దూరంగా ఆకాశంలో మనకు కనిపించేవాడే సూర్యుడు. అతడు దేవతలను తృప్తిపరుస్తాడు. అతడే దేవతలకు మధువు అని చెప్పబడింది. సూర్యుడు దేవతలకు మధువు వంటివాడు. అంటే దేవత. అటువంటప్పుడు సూర్యుడికి బ్రహ్మవిద్యయందు అధికారం లేదు కదా? అంటున్నాడు జైమిని.

***సూత్రం - 95 "జ్యోతిషి భావాచ్చ"***

సూర్యచంద్రాది దేవతలు గ్రహాలు. వారికి ప్రత్యేక మండలాలున్నాయి. కాబట్టి వారికి బ్రహ్మవిద్య యందు అధికారం లేదు అంటాడు జైమిని.

సూర్య, చంద్ర, వాయుమండలాలు జ్యోతిర్మండలాలు అచేతనాలు. విగ్రహాలు కావు, కాబట్టి వాటికి బ్రహ్మవిద్యాధికారం లేదు. అంటున్నాడు.

***సూత్రం - 96 "భావం తు బాదరాయణోస్తి హి"***

వ్యాసుడు దేవతలకు బ్రహ్మవిద్యయందు అధికారము ఉన్నది అంటున్నాడు.

దేవతలతో కూడి ఉన్న ఉపాసన యందు దేవతలకు అధికారం ఉండకపోవచ్చు. కాని బ్రహ్మవిద్య యందున్నది. సూర్య, చంద్ర, వాయువులు మండలాలని చెబుతున్నప్పటికీ వారికి కూడా రూపం చెప్పబడుతోంది. కాబట్టి వారికి కూడా బ్రహ్మ విద్యయందు అధికారమున్నది. **ఛాందోగ్యోపనిషత్తు**లో ప్రజాపతిగాధ కూడా దీనికి నిదర్శనం.

## ప్రజాపతి

పూర్వకాలంలో ప్రజాపతి ఇంద్రుడికి ఆత్మతత్త్వాన్ని వివరించాడు.

పూర్వకాలంలో ఒకసారి ప్రజాపతి ఆత్మతత్త్వాన్ని గురించి ఒక ప్రకటన చేశాడు.

"ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. శోకం తాకదు. దానికి ఆకలి దప్పికలు లేవు. మానవుడు సత్యకామడు, సత్య సంకల్పుడు అయి ఆత్మజిజ్ఞాసను అలవరచుకోవాలి. ఆత్మకోసం అన్వేషించినవాడు, ఆత్మను అనుభవించినవాడు ఆత్మస్వరూపాన్ని పొందుతాడు. పూర్ణస్థితి అతనికి వస్తుందన్నమాట."

దేవతలు, రాక్షసులుకూడా ఆ మాటలు విన్నారు. "ఆత్మను గురించి మనంకూడా అన్వేషిద్దాం. ఆత్మవల్ల అన్ని కోరికలు తీరతాయని బ్రహ్మచెప్పాడు కదా!" అని వారు భావించారు.

దేవతలరాజు ఇంద్రుడు, రాక్షసుల రాజు విరోచనుడు ఇద్దరూ ఆత్మజ్ఞానం సంపాదిద్దామని చేతితో దర్భలు పట్టుకుని బ్రహ్మవద్దకు వెళ్ళారు. బ్రహ్మ వీరిద్దరినీ ముప్పైరెండు సంవత్సరాలు, బ్రహ్మచర్యదీక్ష వహించమని చెప్పాడు. దీక్ష పూర్తి చేశారిద్దరూ.

"వత్సలారా ! మీరు నాకోసం దేనికి వచ్చారు?" అన్నాడు బ్రహ్మ.

"భగవాన్ ! ఆత్మ తత్త్వాన్ని గురించి చెప్పిన విషయాలు విన్నాం. ఆత్మను గురించి ప్రత్యక్షంగా తమ నోటిమీదుగా వినాలని వచ్చాం" అన్నారు. ఇంద్ర విరోచనులు.

"మనుష్యుల కనుపాపలలో మెదలుతూ కనుపించే పురుషుడే ఆత్మ. ఆత్మ అభయం. అమృతమయం. అదే బ్రహ్మం" అన్నాడు బ్రహ్మ.

అదివిన్నవారు "భగవాన్ ! నీటిలో కనుపించే ప్రతిబింబం, అద్దంలో కనిపించే ప్రతిబింబం. ఈ రెంటిలో ఏది ఆత్మరూపం?" అని అడిగారు.

"నేను మొదటగా కళ్ళలో మెరిసే ఏపురుషుని వర్ణన చేశానో వీటన్నింటిలోనూ ప్రతిఫలించేది ఆ పురుషుడే. ఒకసారి నీళ్ళలోను, అద్దంలోను మీ రూపాలు చూసుకుని మీ అనుభవాలు నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ. ఇంద్ర విరోచను లిద్దరూ అలాగే చేసి ప్రజాపతి దగ్గరకు వెళ్ళారు. ప్రజాపతి వీరిని చూసి "మీరు ఏం చూశారు." అన్నాడు.

"నఖశిఖ పర్యంతము కేశపాశాలతో మా శరీరాల ప్రతిరూపమే మాకు నీళ్ళలోనూ, అద్దంలోనూ కూడా కనిపించింది" అన్నారు వారు.

"నాయనలారా ! శరీరాలు శుభ్రపరచుకుని, మంచి వస్త్రాలు ఆభరణాలు ధరించి నీటిలో మీ ముఖాన్ని చూసుకోండి. తరువాత ఏం చేశారో నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ 'అలాగే' అని చెప్పి ఇద్దరూ వెళ్ళిపోయారు. మరునాడు తిరిగి వచ్చి "స్వామీ ! ఈ చక్కని వస్త్రాలతో ఆభరణాలతో అలంకరించిన మా శరీరాలే నీటిలో కనిపించాయి" అన్నారు.

"అభయమూ, అమృతమయమూ అయిన ఆత్మ అదే. అదే బ్రహ్మము" అన్నాడు ప్రజాపతి

అదివిన్న ఇంద్ర విరోచనులు ఆత్మను గురించి తమకు అంతా తెలిసిందనుకుని తిరిగి వెళ్ళిపోయారు. అలా వెళ్ళిపోతున్నవారిని చూసి" అసలు ఆత్మజ్ఞానం లభించకుండానే వారు తెలిసింది అనుకుని వెళ్ళిపోతున్నారు. వారు దేవతలైనా, రాక్షసులైనా **శరీరాన్నే ఆత్మ అని భావించటం పతన హేతువు"** అనుకున్నాడు.

విరోచనుడు ఆత్మని గురించిన ఈ సిద్ధాంతంతోనే తృప్తి చెంది, రాక్షస జాతి కంతటికీ ఈ సిద్ధాంతాన్నే బోధించాడు. అసలైన పరమసత్యం తనకు లభించిందని తృప్తి చెందాడు. దేహమే ఆత్మ అని ప్రచారం చేశాడు.

ఇంద్రుడు దేవలోకానికి బయలుదేరాడు. దారిలో తాను నేర్చుకున్న దానిలో ఏదో లోపం కనిపించింది. తను నేర్చుకున్న సిద్ధాంతాన్ని ఒకసారి సమీక్షించుకున్నాడు. విషయాన్ని విమర్శచేసి చూశాడు. బాగా అలంకరించుకుంటే అలంకరించినట్లు, మంచి వస్త్రాలు ధరిస్తే ధరించినట్లు, కుంటివాడైతే కుంటివాడిలాగా, గ్రుడ్డివాడైతే గ్రుడ్డివాడిలాగా శరీర ప్రతిబింబం కనిపిస్తుంది. మరణానంతరం శరీరం లేనప్పుడు ఆత్మ ఏమౌతుంది. మృత్యువువాత పడే ఈ శరీరాన్ని అమృతమయమగు ఆత్మ అనటంలో అర్థంలేదు. ఇంద్రుడి సంశయాలు తీరలేదు. సంతృప్తి లభించలేదు. వెనక్కి తిరిగి ప్రజాపతి దగ్గరకు వెళ్ళి నుంచున్నాడు.

తిరిగి వచ్చిన ఇంద్రుణ్ణి చూసి ప్రజాపతి "ఇంద్రా! నువు విరోచనుడితో వెళ్ళిపోయావు కదా! మళ్ళీ ఎందుకు తిరిగి వచ్చావు?" అని అడిగాడు.

ఇంద్రుడు తన అనుమానాలన్నీ వివరించాడు "ప్రభూ! శరీరంలోగాని, శరీరచ్ఛాయలో గాని నాకు ఏమీ విశేషం కనబడలేదు. అందుకని గతంలో నేర్చుకున్నది తృప్తిని కలిగించలేదు. ఆత్మజ్ఞానాన్ని మీవద్ద అభ్యసించాలని మళ్ళీ వచ్చాను" అన్నాడు.

ఇంద్రుడి జిజ్ఞాసకు ఆనందించాడు బ్రహ్మ. ఇంద్రుణ్ణి మళ్ళీ ముప్పై రెండు సంవత్సరాలు బ్రహ్మచర్యదీక్ష పాటించమన్నాడు. ఇంద్రుడు దీక్షతో బ్రహ్మవద్దనే గడిపాడు. దీక్ష పూర్తి అయిన తరువాత ప్రజాపతి ఇంద్రుడితో "స్వప్న ప్రపంచంలో ప్రభువులాగా స్వేచ్ఛగా విహరించే చైతన్యమే ఆత్మ" అన్నాడు.

ఈ మాటలతో ఇంద్రుడు తృప్తిపడి తిరిగి వెళ్ళిపోవటానికి బయలుదేరాడు. అలా వెడుతుంటే త్రోవలో మళ్ళీ అనుమానం వచ్చింది. "స్వప్నాలు అనుభవించే చైతన్యమే ఆత్మ ఎలా అవుతుంది. మనకు ఒక్కొక్కసారి కలలో ఎవరో పీడిస్తున్నట్లు అనిపిస్తుంది. మనం దుఃఖిస్తాము. పాపరహితము, అభయము అయిన ఆత్మ ఈ రకంగా దుఃఖించటంలో అర్థం లేదు. ఇది సత్యంకాదు." అనిపించింది. మళ్ళీ తిరిగి వచ్చాడు ఇంద్రుడు. ప్రజాపతి ఆదేశం మేరకు మళ్ళీ కొన్ని సంవత్సరాలు బ్రహ్మచర్య దీక్ష గడిపాడు. అప్పుడు ప్రజాపతి ఇంద్రుడితో ఈ విధంగా చెప్పాడు. "గాఢసుషుప్తిలో సంతృప్తిగా ఆనందాన్ని అనుభవించేదే ఆత్మ."

ఇంద్రుడు ఈ మాట నిజమే అని నమ్మి దేవలోకానికి బయలుదేరాడు. మార్గమధ్యంలో ఇంద్రుడికి మళ్ళీ అనుమానం వచ్చింది. గాఢనిద్ర అనుభవిస్తున్నదే

ఆత్మ అనుకుంటే ఆత్మ తనను తాను తెలుసుకోలేని స్థితిలో ఉంటుందన్నమాట. తనను గురించి తాను తెలుసుకోలేని అవ్యక్తతత్త్వం ప్రకాశవంతమైన ఆత్మ ఎలా అవుతుంది? ఈ అనుమానంతో ఇంద్రుడు తిరిగి ప్రజాపతి దగ్గరకు వచ్చాడు. ఈ సారి ప్రజాపతి ఇంద్రుణ్ణి కేవలం ఐదు సంవత్సరాలు తనదగ్గర బ్రహ్మచర్య దీక్షతో ఉండమన్నాడు.

గుడువు పూర్తయిన తరువాత ఇంద్రుడి పట్టుదలకు మెచ్చి ఆత్మతత్త్వాన్ని పూర్తిగా వివరించాడు.

ఇంద్రా! నీ పట్టుదలకు మెచ్చాను. ఆత్మానుభవం పొందటానికి నువు పూర్తిగా అర్హుడవు. శరీరం అశాశ్వతమైనది. ఆఖరుక్షణాలు ఆసన్నం కాగానే శరీరాన్ని మృత్యువు కబళిస్తుంది. శాశ్వతమైన ఆత్మకు అశాశ్వతమైన శరీరమే ఆవాసం. శరీరం ఉన్నంత కాలంలో ఆత్మకు సుఖదుఃఖాలు, గుణదోషాలు అంటినట్లూ, వాటితో సతమతమవుతున్నట్లు కనిపిస్తుంది. ఆత్మశరీరంతో సంబంధం ఏర్పరచుకోవటం వల్లనే జీవులకు సుఖదుఃఖాలు ఏర్పడతాయి. శరీరం ఆత్మనుండి విడివడితే ఈ బంధం నుండి విముక్తి లభిస్తుంది.

భౌతిక విషయాల నుండి విముక్తి పొంది ఆత్మను మనస్సుకు, ఇంద్రియాలకు విలక్షణమైనదిగా గ్రహించి, తేజోమయుని భావించి అనుభవజ్ఞుడు ఆనందిస్తాడు. ఆత్మజ్ఞానం పొందినవాడు ముక్తి సామ్రాజ్యంలో విహరిస్తాడు.

శాస్త్రోక్తంగా గురుకుల వాసం చేసి గురుకులం నుండి సమావర్తనం పూర్తి చేసి, పెండ్లాడి, గృహస్థుడయి పవిత్రమైనచోట స్వాధ్యయనం చేస్తూ పుత్రుల్ని, శిష్యుల్ని ధర్మపరాయణులుగా తీర్చిదిద్దుతూ ఇంద్రియాలను అదుపుచేసి అంటే జితేంద్రియుడై శాస్త్ర విరుద్ధమైన జీవహింస చేయకుండా జీవితాన్ని గడిపేవాడు చివరకు బ్రహ్మలోకం పొందుతాడు. అక్కడ నుండి మళ్ళీ తిరిగిరాడు. ఈ విధంగా అర్చిరాది మార్గం ద్వారా బ్రహ్మలోకానికి పోయిన ఉపాసకుడు బ్రహ్మలోకమున్నంత వరకు అక్కడ దివ్యభోగాలను అనుభవించి తరువాత పరబ్రహ్మలో లీనమవుతాడు. అతడికి పునరావృత్తి ఉండదు."

ఈ రకంగా ప్రజాపతి ఆత్మజ్ఞానాన్ని దేవేంద్రుడికి వివరించాడు.

ఇందులో బ్రహ్మదేవుడు దేవరాజైన ఇంద్రుడికి బ్రహ్మవిద్యను ఉపదేశించాడు. కాబట్టి మొత్తంమీద దేవతలకు బ్రహ్మవిద్యయందు అధికారమున్నది.

## 9. అపశూద్రాధికరణము (శూద్రులకు బ్రహ్మవిద్యాధికారం లేదు)

చాతుర్వర్ణాలలోను శూద్రులకు బ్రహ్మవిద్యాధికారం లేదు అని తొమ్మిదవ అధికరణ అయిన **'అపశూద్రాధికరణ'**లో వివరించారు. ఈ అధికరణలో ఐదు సూత్రాలున్నాయి.

బ్రహ్మవిద్యను తెలుసుకోవటానికి శూద్రునికి అధికారమున్నదా? **ఛాందోగ్యోపనిషత్తు**లో 'జానస్రుతి' గాధలో రాజును చూసి ఓ శూద్రా! నీ గోవుల్ని నీవద్దనే ఉంచుకో అంటాడు. అదీగాక శూద్రుడికి ఉపనయనం లేదు. ఉపనయనం లేనివారికి వేదాధికారం లేదు. వేదాధికారం లేకపోతే వేదాంతానికి అధికారం ఉండనే ఉండదు కదా! కాబట్టి శూద్రుడికి బ్రహ్మవిద్యాధికారమున్నదా?" అనే ప్రశ్నకు సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 97 "శుగస్య తదనాదరశ్రవణాత్ తదాద్ర వణాత్ సూచ్యతే హి"***

**ఛాందోగ్యం**లో జానస్రుతి మహారాజును చూసి రైక్వుడు ఓ శూద్రా! అని సంబోధించాడు. కాని నిజానికి జానస్రుతి మహారాజు క్షత్రియుడు. అయితే ఇక్కడ శూద్రుడు అంటే విచారముతో నిండినవాడు అని అర్థం. అంతేకాని నాల్గవజాతి వాడు అని మాత్రం కాదు. శూద్రుడికి ఉపనయనముండదు కాబట్టి వేదాభ్యాసము వేదాంత విచారము ఉండవు.

***సూత్రం - 98 "క్షత్రియత్వావగతేశ్చోత్తరత్ర చైత్రరథేన లిఙ్గాత్"***

బ్రహ్మవిద్య కావాలంటే ఉపనయనాది సంస్కారాలు కావాలి. అటువంటి సంస్కారాలు లేని శూద్రునికి బ్రహ్మవిద్యాధికారం లేదు.

***సూత్రం - 99 "సంస్కారపరామర్శాత్తదభావాభి లాపాచ్చ"***

శూద్రత్వం లేదని నిశ్చయించినప్పుడు మాత్రమే బ్రహ్మోపదేశం చెయ్యాలి.

***సూత్రం - 100 "తదభావనిర్ధారణే చ ప్రవృత్తేః"***

**ఛాందోగ్యోపనిషత్తు**లో సత్యకామజాబాలి. గౌతముడి దగ్గరకు వెళ్ళి బ్రహ్మోపదేశం చెయ్యమని అడుగుతాడు. అప్పుడు గౌతముడు నీ గోత్రం ఏమిటి?

అంటాడు. దానికి సత్యకాముడు తన వృత్తాంతాన్ని వివరిస్తాడు. అది విన్న గౌతముడు సత్యం చెప్పేవాడు బ్రాహ్మణుడు తప్ప ఇంకెవరూ ఉండరు. అని సత్యకాముడు బ్రాహ్మణుడే అని నిర్ధారణ చేసుకున్న తరువాతనే అతనికి బ్రహ్మోపదేశం చేశాడు కాబట్టి శూద్రుడికి బ్రహ్మవిద్యాధికారం లేదు.

***సూత్రం - 101 "శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్ స్మృతేశ్చ"***

స్మృతులలో కూడా శూద్రునికి వేదశ్రవణము, అధ్యయనము, అనుష్ఠానము అనేవి లేవు. కాబట్టి శూద్రునికి బ్రహ్మవిద్యార్హత లేదు అన్నారు.

అయితే ఈ రోజుల్లో శూద్రులలో కూడా అనేకమంది సన్యాసులౌతున్నారు. బ్రహ్మవిద్యపై ఆసక్తి చూపుతున్నారు. అలాగే బ్రాహ్మణులైనప్పటికీ ఏ రకమైన కర్మలూ చేయనివారు అనేకులున్నారు. అదంతా పూర్వజన్మ సుకృతం.

'శూద్రులకు బ్రహ్మవిద్యాధికారం లేదు' అన్నారు.

మరి బ్రాహ్మణుడు ఎవరు? బ్రాహ్మణ కులంలో పుట్టి ఏ కర్మలు చేయనివాడా? శూద్రుడుగా జన్మించి బ్రహ్మవిద్య యందు ఆసక్తి గలవాడా? ఈ విషయం వజ్రసూచికోపనిషత్తులో చెప్పబడింది.

## బ్రాహ్మణుడు ఎవరు? (వజ్రసూచికోపనిషత్తు)

మనదేశంలో వర్ణవ్యవస్థ అనేది అనాదిగా ఉన్నది. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర అని నాలుగు వర్ణాలు ఉన్నాయి. వీటినే చాతుర్వర్ణాలు అన్నారు. ఈ వర్ణ వ్యవస్థ మొట్టమొదటగా పురుష సూక్తంలో చెప్పబడింది. పరమేశ్వరుని యొక్క ముఖం నుంచి బ్రాహ్మణులు, బాహువుల నుంచి క్షత్రియులు, ఊరువుల నుంచి వైశ్యుడు, పాదాల నుంచి శూద్రులు జన్మించారు అని వేదంలో (పురుషసూక్తం) చెప్పబడింది. ఆ తరువాత భగవానుడు గీతలో **చాతుర్వర్ణం మయాసృష్టం గుణకర్మ విభాగచ** మానవులు చేసే కర్మల ననుసరించి వారిని నాలుగు వర్ణములుగా నేనే విభజించాను అన్నాడు. అయితే ఇది ఈనాడు మనకున్న కులవ్యవస్థ కాదు. వారు చేసే వృత్తిని బట్టి వర్ణనిర్ణయం జరిగింది. ఒక వర్ణం వారు ఇంకొక వర్ణంలోకి

మారటం జరిగేది. అలాగే క్షత్రియుడైన విశ్వామిత్రుడు బ్రాహ్మణుడైనాడు. ఐతే ఇప్పుడు మనముందున్న ప్రశ్న ఏమంటే ఇవాల్టి రోజున అందరూ ఉద్యోగాలు చేస్తున్నారు. అటువంటి పరిస్థితిలో మరి బ్రాహ్మణుడు అంటే ఎవరు. అయితే ఈ ప్రశ్న ఇవాళ కాదు. కొన్నివేల సంవత్సరాల క్రితమే వచ్చింది. దానికి సమాధానం కూడా వేదంలోనే చెప్పబడింది. **'వజ్రసూచికోపనిషత్తు'**లో ఈ విషయం వివరించబడింది. వజ్రసూచికోపనిషత్తు సామవేదానికి సంబంధించినది.

ఈ ఉపనిషత్తు మొదటి మంత్రంలోనే

**బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రా ఇతి చత్వారోవర్ణాస్తేషాం**
**వర్ణానాం బ్రాహ్మణ ఏవప్రధాన ఇతి వేదవచానురూపం**
**స్మృతి భిరవ్యక్తమ్, తత్ర చోద్యమస్తి**

"బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులని నాలుగు వర్ణాలు ఉన్నాయని, ఆ వర్ణాలలో బ్రాహ్మణుడు శ్రేష్ఠుడని వేదవాక్యానుసారము స్మృతులు కూడా చెబుతున్నాయి. ఆ విషయాన్ని విచారణ చెయ్యాలి" అంటే అప్పటికే ఎవరు బ్రాహ్మణుడు? అనే ప్రశ్న వచ్చింది.

**కోవాబ్రాహ్మణః? కిం జీవః? కిం దేహః? కింజాతిః ?**
**కిం జ్ఞానం ? కిం కర్మ? కిం ధార్మికః ? ఇతి**

బ్రాహ్మణుడు అంటే ఎవరు? జీవుడా? దేహమా? వర్ణమా? జ్ఞానమా? కర్మమా? ధర్మాన్ని ఆచరించే వాడా? ఎవడు బ్రాహ్మణుడు?

అనాదిగా బ్రాహ్మణుడు వేదవేదాంగాలను అభ్యసిస్తున్నాడు. అగ్నికార్యం చేస్తున్నాడు. యజ్ఞయాగాది కర్మలు చేస్తున్నాడు. అటువంటివాడు బ్రాహ్మణుడు, ఉత్తముడు అనటంలో సందేహం లేదు. కాని రానురాను చాతుర్వర్ణాలు శాఖోపశాఖలుగా పెరిగి కులాలయినాయి. ఈ రోజున కులవిద్య ఎవరూ చెయ్యటం లేదు. బ్రాహ్మణ కులంలో పుట్టినవారు కూడా వేదాధ్యయనం మానేసి బతుకుబాటలో ఇతర వృత్తులు చేపడుతున్నారు. మిగిలిన వారితో బాటుగానే జీవిస్తున్నారు. ఇప్పుడు వేదాధ్యయనం చెయ్యనివాడు, యజ్ఞయాగాది క్రతువులు ఆచరించనివాడు, కనీసం సంధ్యావందనం కూడా చెయ్యనివాడు కేవలం బ్రాహ్మణ కులంలో పుట్టినంత

మాత్రంచేతనే బ్రాహ్మణుడవుతాడా? ఇదీ అనుమానం. దీనికి సమాధానమే ఈ ఉపనిషత్తు.

**జీవుడే బ్రాహ్మణుడా?** కాదు. ఎందుకంటే గతంలో జరిగిపోయినవి, భవిష్యత్తులో వచ్చేవి అనేక దేహాలున్నాయి జీవుడికి. అంటే జీవి అనేక జన్మలు ఎత్తుతాడు. ఇక్కడ జన్మలు అనేకం. కాని జీవుడు ఒక్కడే. జీవి తాను చేసిన కర్మవల్లనే అనేక జన్మలు ఎత్తటం జరుగుతోంది. అనేక శరీరాలు ధరిస్తోంది. ఈ శరీరాలన్నింటిలోను ఉన్న జీవుడు ఒక్కడే. క్రిమికీటకాదుల నుంచి మానవుడిదాకా 84 లక్షల రకాల జీవజాలమున్నది. తాను చేసిన కర్మవల్ల రకరకాల శరీరాలు ధరించే జీవుడే బ్రాహ్మణుడు అని చెప్పటం సరికాదు.

పోనీ **దేహమే బ్రాహ్మణుడా?** అంటే కాదు అని చెప్పాలి. ఈ దేహం పంచభూతాలతో నిండినది. అన్ని వర్ణాల వారికి, అన్ని కులాల వారికి, అన్ని మతాల వారికి కూడా ఈ దేహం ఉన్నది. బాల్య, కౌమార, యవ్వన, వృద్ధాప్య దశలు అందరికీ సమానమే. జరామరణాలు అన్ని దేహాలకు ఉన్నాయి. కర్మలు ధర్మాలు అందరికీ ఒక్కటే. బ్రాహ్మణుడు తెల్లగా ఉండాలని, వైశ్యుడు నల్లగా ఉండాలనీ ఏమీ లేదు. కాబట్టి ఈ దేహము బ్రాహ్మణుడు కాదు.

పోనీ **వర్ణమే బ్రాహ్మణుడా?** అంటే చాతుర్వర్ణాలలో మొదటివాడు బ్రాహ్మణుడా? అలా ఏం కాదు. ఒకే వర్ణంలో మళ్ళీ రకరకాల తేడాలున్నాయి. ఉదాహరణకు బ్రాహ్మణ కులంలోనే చూస్తే వైదికులు, నియోగులు, తెలగాణ్యులు, కాసలనాటి వారు, ప్రథమ శాఖవారు, ఇలా అనేక రకాలు. అంతేకాదు. వీరి జన్మలలో కూడా తేడా ఉంది. ఋష్యశృంగుడు జింకవల్ల జన్మించాడు. కౌశికుడు దర్భ నుంచి, జంబూక మహర్షి జంబూకంవల్ల, వ్యాసుడు మత్స్యగంధివల్ల, శుకుడు ఘృతాచి అనే అప్సరాంగనవల్ల, గౌతముడు కుందేటి వీపునుంచి, వశిష్టుడు ఊర్వసివల్ల, అగస్త్యుడు కుండనుండి జన్మించారు. వీరందరూ తమ జాతి ప్రవృత్తిలేని మహాజ్ఞానులు, మహర్షులు. కాబట్టి కేవలము వర్ణమే బ్రాహ్మణుడు కాదు.

పోనీ **జ్ఞానమే బ్రాహ్మణుడా.** అంటే – కాదు. అని చెప్పాలి. ఎందుకంటే? – జ్ఞానం కలిగిన క్షత్రియులు చాలామంది ఉన్నారు. మిథిలానగరాన్ని పాలించిన జనక మహారాజు, కాశీరాజు అశ్వపతి, మహావృష సామ్రాజ్యాన్ని పాలించిన జానశృతి

ఇలాటివారు అనేక మంది మహాజ్ఞానులున్నారు. కాబట్టి జ్ఞానము గలవాడు బ్రాహ్మణుడు అనరాదు.

**కర్మలు చేసేవాడు బ్రాహ్మణుడా?** అంటే కాదు, ప్రతి వ్యక్తికి 1. ప్రారబ్ధము 2. సంచితము 3. అగామి అని మూడు రకాల కర్మలున్నాయి. కర్మల వలన ప్రేరేపించబడిన జీవుడు ఆ కర్మలు చేస్తాడు. కాబట్టి కర్మలు చేసేవాడే బ్రాహ్మణుడు కాదు.

మరి **ధర్మం చేసేవాడు బ్రాహ్మణుడా?** అంటే కాదు అని చెప్పాలి. ఎందుకంటే దానం చేసేవారు అనేకమంది ఉన్నారు. బలిచక్రవర్తి వంశనాశనం అవుతుందని తెలిసికూడా మూడడుగులు పేరుతో సర్వస్వాన్నీ దానం చేశాడు. దానగ్రహీత సాక్షాత్తు శ్రీమహావిష్ణువు అతనికి దానం ఇస్తే తాను సర్వనాశనమై పోతాడు అని తెలిసి కూడా దానమిచ్చాడు. అలాగే శిబిచక్రవర్తి తన దేహాన్ని కోసి దానమిచ్చాడు కర్ణుడు. ఇలాటి వారు ఇంకా చాలామంది ఉన్నారు. వారు బ్రాహ్మణులు కాదు. అందుచేత దానం చేసినవాడే బ్రాహ్మణుడు కాదు.

మనం గొప్ప గుణాలు గల వారెవరిని చెప్పినా అతడు బ్రాహ్మణుడు కాదు. అంటున్నారు మరి బ్రాహ్మణుడంటే ఎవరు? అద్వితీయుడు, జాతి, గుణ, క్రియారహితుడు, షడూర్మలు, షడ్భావాలు, షడ్వికారాలు లేనివాడు. (షడూర్మలు – ఆకలి, కోరిక, శోకము, మోహము, జర, మరణము, షడ్వికారాలు – పుట్టుట. పెరుగుట, ముదియుట, చిక్కుట, చచ్చుట, గర్భనరకస్థితి) సత్యజ్ఞానానంద స్వరూపుడు, నిర్వికల్ప సంకల్పుడు, అన్ని సంకల్పాలకు ఆధారమైన వాడు, అన్ని భూతాలకు అంతర్యామి, ఆకాశం లాగా బాహ్యాంతరాలలో అంతటా వ్యాపించిన వాడు, అవిచ్ఛిన్నమైన ఆనందము గలవాడు, అప్రమేయుడు, స్వానుభవముతో మాత్రమే గ్రహించతగ్గవాడు, స్వయంప్రకాశి, భగవస్సాక్షాత్కారము పొంది కృతార్థుడైన వాడు, ఏ రకమైన దోషాలు లేనివాడు, శాంతి మొదలైన సద్గుణాలు కలవాడు, అరిషడ్వర్గాలను జయించిన వాడు, దంభము, అహంకారము, ఏ మాత్రము లేనివాడు, నిరంతర సత్యాన్వేషి మాత్రమే బ్రాహ్మణుడు అని చెబుతోంది ఈ ఉపనిషత్తు.

**జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః**

కాబట్టి బ్రాహ్మణత్వము అనేది కేవలము పుట్టుకతోనే రాదు మనంచేసే **కర్మని బట్టి వస్తుంది. ఆ రోజు పరిస్థితులు వేరు. నేటి సామాజిక పరిస్థితులు వేరు. అందుచేత విద్యమీద ఆసక్తిగల వారందరూ కులమతాల ప్రసక్తి లేకుండా బ్రహ్మ విద్యకు అర్హులేను కర్మఛండాలుడి కన్న జన్మ ఛండాలుడే ఉత్తముడు అంటున్నారు పరమానంద నాథులు**

## 10. కంపనాధికరణము

## (సమస్తాన్నీ ప్రవర్తింపచేసే ప్రాణం బ్రహ్మమే)

ప్రాణాన్ని గురించి తెలుసుకున్నవాడు అమృతత్వాన్ని పొందుతాడు అని చెబుతున్నారు పదవదైన **'కంపనాధికరణ'**లో. ఇందులో ఒక్క సూత్రమే ఉంది.

***సూత్రం - 102 "కమ్పనాత్"***

ప్రాణము అనేది భయకారణము. దానిని తెలుసుకున్నవాడు అమృతత్వాన్ని పొందుతాడు. అని **కఠోపనిషత్తు**లో చెప్పారు కదా ! మరి ప్రాణము అంటే ఏది. ప్రాణవాయువా? లేక పరమాత్మా?" ఈ విషయం వివరిస్తున్నారు.

సమస్త జగత్తు ప్రాణము నుండి పుట్టి చలిస్తున్నది. **బృహదారణ్యకోపనిషత్తు**లో "దోషభూయిష్టమైన ఇతర అవయవాలకు ఆత్మత్వం సిద్ధించలేదు. ముఖ్యప్రాణం పాపరహితమైనది. అందుకే దానికి ఆత్మత్వం సిద్ధించింది. కాబట్టి మిగిలిన ఇంద్రియాలు ప్రాణాన్ని ఆత్మరూపంలో ఆశ్రయించినాయి. పవిత్రమైన ప్రాణానికి మృత్యువు ఎప్పుడూ దూరంగానే ఉంటుంది. మృత్యువు ప్రాణాలు తీసింది అనుకుంటాము. అది తప్పు, ప్రాణాలు పోయిన తరువాతే మృత్యువు ఆసన్నమవుతుంది" అని చెప్పబడింది. అంటే ఆ ప్రాణానికి ఆత్మత్వం ఉన్నది. అందుకే సమస్తాన్ని ప్రవర్తింపచేసే ప్రాణము బ్రహ్మమే. అంటూ పదవ అధికరణను పూర్తిచేశారు.

## 11. జ్యోతిరధికరణము (జ్యోతిశబ్దం బ్రహ్మనే చెబుతోంది)

జ్యోతి అంటే సూర్యుడు కాదు పరమాత్మ అంటున్నారు పదకొండవదైన **'జ్యోతిరధికరణ'**లో దీంట్లో ఒక సూత్రమే ఉంది.

***సూత్రం - 103 "జ్యోతిర్దర్శనాత్"***

ప్రాణం బ్రహ్మ అన్నారు. బాగున్నది. మరి జ్యోతి అంటే సూర్యుడా? పరమాత్మా?" దీన్ని వివరిస్తున్నారు.

జ్యోతి అంటే తేజస్సు, కాంతి అని చెబుతున్నది. అంటే జ్యోతిశబ్దము పరమాత్మ వాచకమే.

**జ్యోతిరూపా పరాకారా యశ్యాదేహోద్భవాశ్శివే**

పరమేశ్వరుని నుంచి జ్యోతి అంటే అనేక వేలకోట్ల కిరణాలు ఉద్భవిస్తున్నాయి. అదే పరమాత్మ రూపం. ఆ కిరణాలలో 116 కిరణాలను సూర్యుడు గ్రహించాడు. కాబట్టి జ్యోతి అంటే సూర్యుడు కాదు. పరమాత్మే.

## 12. అర్థాంతరత్వ్యపదేశాధికరణము (ఆకాశము బ్రహ్మమే)

ఆకాశం బ్రహ్మ నుంచి పుట్టింది కాబట్టి ఆకాశం కూడా బ్రహ్మమే అంటున్నారు పన్నెండవదైన **'అర్థాంతరత్వాది వ్యపదేశాధికరణ'**లో ఇందులో ఒక సూత్రమే ఉంది.

***సూత్రం - 104 "ఆకాశోఽర్థాన్తరత్వాదివ్యపదేశాత్"***

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఆకాశము బ్రహ్మ అని చెప్పబడింది. మరి ఆకాశమంటే పరమాత్మా? భూతాకాశమా? అనే విషయం వివరిస్తున్నారు.

ఇక్కడ ఆకాశము అంటే బ్రహ్మ. పంచభూతాలలో ముందు పుట్టింది ఆకాశము. ఆకాశము బ్రహ్మనుంచే పుట్టింది కాబట్టి ఆకాశము కూడా బ్రహ్మమే అందుచేతనే దహరాకాశము కూడా బ్రహ్మమే అని గతంలోనే చెప్పబడింది. అంటూ పన్నెండవ అధికరణను పూర్తిచేశారు.

# 13. సుషుప్త్యుత్క్రాంత్యధికరణము

## (సుషుప్తి యందలి పురుషుడు బ్రహ్మమే)

సుషుప్తిలో ఉన్న పురుషుడు బ్రహ్మమేను అంటున్నారు పదమూడవ అధికరణలో. ఇందులో రెండు సూత్రాలున్నాయి. దీనిపేరు **'సుషుప్త్యుత్క్రాంత్యధికరణము'**

సుషుప్తిలో ఉన్న పురుషుడు బ్రహ్మమా కాదా? అనే విషయాన్ని వివరిస్తున్నారు.

***సూత్రం - 105 "సుషుప్త్యుత్క్రాన్త్యోర్భేదేన"***

సుషుప్తిలోని పురుషుడు పరమాత్మయే కాని వేరు కాదు.

***సూత్రం - 106 "పత్యాదిశబ్దేభ్యః"***

దీనిలో పతి మొదలైన శబ్దాలు అసంసారియైన వాడి స్వరూపాన్ని ప్రతిపాదిస్తున్నాయి.

**బృహదారణ్యకోపనిషత్తు**లో జనకుడు యాజ్ఞవల్క్యుడిని ఆత్మను గురించి వివరించమని అడిగాడు. యాజ్ఞవల్క్యుడు చెబుతున్నాడు.

ప్రాణాల్లో, బుద్ధి వృత్తులలో ఉండే విజ్ఞానజ్యోతి స్వరూపమే ఆత్మ. ఇంద్రియాల మధ్య స్వయంప్రకాశమై హృదయంలో ఉండే పురుషుడే ఆత్మ. అదే ఈ లోకంలోనూ, పరలోకంలోనూ సంచరిస్తుంది. కదులుతున్నట్లు కనిపిస్తుంది. స్వప్నంలాగా ఉంటూ దేహేంద్రియాలను, మృత్యువును కూడా దాటిపోతుంది.

ఆత్మపురుషుడికి ఈ లోకము, పరలోకము అని రెండు స్థానాలున్నాయి. ఈ రెండింటి మధ్యనా ఉన్న స్వప్నజగత్తు మూడవస్థానము. ఆ లోకము అంటే సుషుప్తావస్థ. స్వప్నంలో ఉంటూ మిగిలిన రెండు స్థానాలనూ చూస్తాడు ఆత్మపురుషుడు. నిద్రించేటప్పుడు ఆత్మపురుషుడు సమస్త లోకాలలోని అనుభవాలను తీసుకుని స్థూలశరీరాన్ని వదలి, స్వప్నశరీరంలో ప్రవేశించి ఆత్మజ్యోతి రూపమైన ప్రకాశంతో స్వప్నం చూస్తాడు. ఈ స్థితిలో అతడు స్వప్నద్రష్ట అయిన పురుషుడు తైజసుడు.

సుషుప్తిలో అతడు అన్ని దుఃఖాలను అధిగమిస్తాడు. అదే గాఢనిద్ర. ఈ స్థితిలో తల్లి, తండ్రి అనే సంబంధాలు ఉండవు. అయినవారు కానివారవుతారు. ఆ స్థితిలో

పురుషుడికి పాపపుణ్యాలతో సంబంధం ఉండదు. ఏ భేద భావము ఉండదు. అప్పుడు హృదయంలో ఉండే సమస్త శోకాలకు అతీతుడౌతాడు.

ఆ స్థితిలో వాసన చూడలేడు. అంటే వాసన చూసే శక్తి నశించిందని కాదు. అతడు వాసన చూస్తూనే వాసన చూడలేదు.

సుషుప్తిలో ఆత్మపురుషుడు ఎవరితోనూ మాట్లాడలేడు. వినలేడు. మననం చెయ్యడు. అద్వితీయ స్థితిలో ఉంటాడు. అంటూ సుషుప్తిలో ఉండే పురుషుడు బ్రహ్మమే అని చెప్పారు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్ధాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు సుషుప్తిని గురించి వివరిస్తూ మానవుడు గాఢనిద్రలో ఉన్నప్పుడు అతడు సుషుప్తిలో ఉన్నాడంటారు. ఆ సమయంలో జీవుడు పరమసత్తను పొందుతాడు. అంటే తన నిజస్వరూపాన్ని పొందుతాడు. తన ఆత్మను తాను పొందుతాడు. అంటూ సుషుప్తిలో ఉండే పురుషుడు బ్రహ్మమే అని వివరించారు.

కాబట్టి సుషుప్తి యందలి పురుషుడు బ్రహ్మమే.

జ్ఞేయము అంటే తెలుసుకోతగినది. ఎరుగతగినది అని అర్థం. లలితా సహస్రంలో 252 నుంచి 255 వరకు నామాలలో పరమేశ్వరి జ్ఞేయరూపాన్ని వివరిస్తున్నారు

## 252. పరమానందా

**పరమః ఉత్కృష్టః ఆనందోయస్యాః స్వరూపం - సా**

ఉత్కృష్టమైన ఆనందము స్వరూపంగా గలది. నిరతిశయ సుఖస్వరూపం గలది. 'ఏది అనంతమో అది సుఖము' అంటోంది శ్రుతి.

ఆనందము రెండు రకాలు 1. ఇహము 2. పరము. ఇహంలో ఉండే ఆనందము అశాస్వతము అనిత్యము అది అనుభవించినంతవరకే ఉంటుంది. ఆ తరువాత దుఃఖానికి దారితీస్తుంది. పరమానందం ఒక్కటే శాశ్వతమైన ఆనందం. అదే బ్రహ్మానందం. బ్రహ్మానందాన్ని గురించి తైత్తిరీయోపనిషత్తులో చెప్పబడింది.

ఈ ఆనందం శ్రోత్రీయుడు, సదాచారసంపన్నుడు. నిష్కాముడు అయిన బ్రహ్మవేత్తయే అనుభవించతగ్గది. ఈ మూడు గుణాలు లేనివాడికి ఈ ఆనందం లభించదు.

ఈ లోకంలోని సంపద అంతా యువకుడు, సదాచారసంపన్నుడు, వేదాధ్యాయి, బలమైనవాడు అనుభవించటానికే ఉన్నది. దీనిని అనుభవించటంవల్ల కలిగే ఆనందం మానుషానందం.

మానుషానందానికి నూరురెట్లు – మనుష్యగంధర్వానందం. మనుష్యగంధర్వులు అంటే మానవులై ఉండి పుణ్యకర్మలచేత గంధర్వత్త్వం పొందినవారు.

మనుష్యగంధర్వానందానికి నూరురెట్లు – దేవగంధర్వానందం. సృష్టికాలంలో దేవలోకంలో గంధర్వులుగా పుట్టినవారు దేవగంధర్వులు. దేవగంధర్వానందానికి నూరురెట్లు – చిరలోక పితరానందము. చిరకాలం ఉండే లోకంలో ఉన్న పిత్రుదేవతలను చిరలోకపితురులు అంటారు. చిరలోకపితరానందానికి నూరురెట్లు – అజానజదేవానందం. దేవలోకానికి పైన ఈ లోకమున్నది. అజానజదేవానందానికి నూరురెట్లు – కర్మ దేవానందం. వైదిక కర్మలు చేసిన వారు కర్మదేవతలు.

కర్మ దేవానందానికి నూరురెట్లు – దేవానందం. యజ్ఞంలోహవిర్భాగం తీసుకునే 33 మంది దేవతలు.

| | | |
|---|---|---|
| దేవానందానికి నూరురెట్లు | – | ఇంద్రానందం |
| ఇంద్రానందానికి నూరురెట్లు | – | బృహస్పతి ఆనందం |
| బృహస్పతి ఆనందానికి నూరురెట్లు | – | ప్రజాపతి ఆనందం |
| ప్రజాపతి ఆనందానికి నూరురెట్లు | – | బ్రహ్మానందం |

అతడే పరబ్రహ్మ. జీవులందరిలోనూ ఉన్నాడు. అదే పరమానందము. పరమేశ్వరి పరబ్రహ్మ స్వరూపిణి కాబట్టి పరమానందం పొందుతుంది.

## 253. విజ్ఞానఘనరూపిణీ

**విజ్ఞానం చైతన్య మేవ ఘనంసాంద్రం త దేకరసం రూప మస్యాః**

దట్టమైన చైతన్యరూపము గలది. 'ఈ భూతముల నుండి విజ్ఞానముద్భవించింది' అని వేదంలో చెప్పబడింది. కాబట్టి విజ్ఞానఘనము అంటే చిదేకరసరూపము అని అర్థం చెప్పారు. విజ్ఞానము అంటే జీవుడు అని అర్థం. జీవుడు పరబ్రహ్మయందు

అంతర్యామి. కాబట్టి జీవసమష్ట్యాత్మకరూపం గలది దేవి. అంటే జీవుల యొక్క సమష్టిరూపమే ఆ దేవి. అందుకే విజ్ఞానఘనరూపిణీ అనబడింది.

విజ్ఞానము అంటే చైతన్యము. దానియొక్క అఖండస్వరూపమే విజ్ఞాన ఘనరూపము.

**ఇదం మహద్భూతం అనంతం అపారం ప్రజ్ఞాన మేవ**

అఖండము అనంతము అయిన మహద్భూతమే ప్రజ్ఞానము అంటోంది శ్రుతి.

ఏదైనా ఒక విషయాన్ని గురించి కలిగేది జ్ఞానము. కళలు 64 అని ముందే చెప్పాం. మరి అటువంటి జ్ఞానం అన్ని కళలలోనూ కలిగినట్లైతే పూర్తిగా గలిగిన ఆ పాండిత్యాన్ని విజ్ఞానఘనము అంటారు. ప్రపంచంలో ఒకరికి ఉండే దాన్ని విజ్ఞానమని, అందరికే ఉండే సమష్టిజ్ఞానాన్ని విజ్ఞానఘనమని అంటారు. లోకంలోని సర్వజీవరూపము, సర్వచైతన్యరూపము ఆ పరమేశ్వరియే. అందుచేతనే ఆమె విజ్ఞాన ఘనరూపిణి అనబడింది.

## 254. ధ్యానధ్యాతృధ్యేయరూపా

ధ్యాన ధ్యాతృ ధ్యేయములే రూపముగా గలిగి నటువంటిది.

| | | |
|---|---|---|
| ధ్యానము | – | ఉపాసనక్రియ |
| ధ్యాత | – | ఉపాసకుడు కర్త |
| ధ్యేయము | – | ఉపాస్యదేవత |

ఈ మూడింటి యొక్క సమష్టిరూపమైన దేవి. త్రిపుటి యొక్క సమైక్యరూపమే ఆ దేవి అని గతంలో వివరించటం జరిగింది. జ్ఞాత జ్ఞాతృ జ్ఞేయరూపము ఆ దేవి. మాతృమానమేయములు ఆ దేవియే.

ధ్యానము అంటే బుద్ధిని స్థిరము చెయ్యటం. ధ్యానమనేది రెండువిధాలు. 1. సగుణ ధ్యానము 2. నిర్గుణధ్యానము. సగుణధ్యానంలో త్రిపుటి అంటే ధ్యాన ధ్యాతృ ధ్యేయాలుంటాయి. కాని నిర్గుణధ్యానంలో అవేవీ ఉండవు. అన్నీ ఒకటే. అందుకే మంత్రము, మంత్రాధిదేవత, మంత్రంచేసేవాడు ముగ్గురూ ఒకటే.

పరదేవత, మంత్రము మాదిరిగానే గురుశిష్యులకు కూడా గణేశాది రూపత్వమున్నది అని భాస్కరరాయలవారు తమ వరివస్యారహస్యంలో వ్రాశారు.

# 255. ధర్మాధర్మవివర్జితా

ధర్మము, అధర్మము అని వాడుకలో కూడా చెబుతుంటాం. వాటి నిర్ణయమెలా? ఇష్టాన్ని పొందించేది ధర్మము. అయిష్టాన్ని కలిగించేది అధర్మం. ఇది ఒక వ్యక్తికి కాదు. సంఘానికి, లోకాన్ని దృష్టిలో ఉంచుకుని ఆలోచించాలి. మత్స్యపురాణంలో గొప్పగా ధరించునది ధర్మము. ఏది ఇష్టమో ఏది అయిష్టమో కూడా గురువులే చెబుతారు అని చెప్పబడింది.

సంవర్తస్మృతిలో

**దేశే దేశే య ఆచారః పారంపర్యక్రమాగతః**
**ఆమ్నాయైః అవిరుద్ధ శ్చ స ధర్మః పరికీర్తితః**

ఆయా దేశాలయందు పారంపర్యముగ వచ్చునది, వేదవిరుద్ధముకాని ఆచారమే ధర్మము.

యాజ్ఞవల్క్యస్మృతిలో

యజ్ఞము, సచ్ఛీలము, దమము, అహింస, దానము, స్వాధ్యాయము అను కర్మలే పరమధర్మములు. వీటివల్ల ఆత్మదర్శనం కలుగుతుంది అని చెప్పబడింది. ధర్మము అనేది కేవలం మానవులకే. దేవతలకు ధర్మంలేదు. ఎందుకంటే వారు అశరీరులు. కర్మ చేయలేరు.

నిత్యాహృదయ మందు

**ధర్మాధర్మస్వవాచ్యస్య విషామృత మయస్య చ**

ధర్మాధర్మములు విషామృతమయాలు. త్రిపురోపనిషత్తులో

**న నిరోధో న చోత్పత్తిః న బంధో న చ సాధకః**
**న ముముక్షుః న వై ముక్తిః ఇత్యేషా పరమార్థతే**

లయము లేదు. పుట్టుక లేదు, బంధము లేదు, మోక్షము లేదు ఇదే పరమార్థం.

ఆ దేవి గుణి గుణ రహితురాలు. ధర్మాధర్మాలు లేనటువంటిది.

విద్వాంసులైన పెద్దలచేత చెప్పబడిన ఆచారాలు ధర్మాలు. వాటికి వ్యతిరేకమైనవి అధర్మాలు. మానవుడు వర్ణాశ్రమ ధర్మాలు పాటించేంతవరకు ఈ ధర్మాలను కూడా

పాటించాలి. ధర్మాధర్మాలు బంధమోక్షాలు. ధర్మాన్ని ఆచరించే వారికి ఉత్తమగతులు కలుగుతాయి. ఉత్తమజన్మలు ప్రాప్తిస్తాయి. అలాగే అధర్మపరులకు అధోగతులు, నీచజన్మలు కలుగుతూయి. ఈ ధర్మాధర్మాలు శివశక్తిస్వరూపాలు. అదే ప్రకృతిపురుషులు. కాబట్టి సుగుణారాధకులకే ఈ ధర్మాలు. పరమేశ్వరి నిర్గుణస్వరూపిణి. ఆమే పరబ్రహ్మస్వరూపం. నిరాకార. రూపమే లేనివారికి ధర్మాధర్మాలు ఎలా ఉంటాయి ? పరమేశ్వరికి ధర్మాధర్మాలు లేవు. అందుచేతనే ఆమె ధర్మాధర్మ వివర్జితా అనబడుతోంది.

అంటూ 252 నామం దగ్గర నుండి 255వ నామంవరకు అంటే 4నామాలలో పరమేశ్వరి యొక్క జ్ఞేయరూపం వివరించారు.

ఆమెను గురించే తెలుసుకోవాలి. ఆమెయే పరబ్రహ్మ. పరాశక్తి.

***దీంతో బ్రహ్మసూత్రాలలోని మొదటి అధ్యాయంలో***
***మూడవ పాదం పూర్తయింది.***

# మొదటి అధ్యాయం

## నాల్గవ పాదం

వేదాంత వాక్యాలన్నీ జగత్కారణం బ్రహ్మ అని చెబుతున్నాయి. ప్రకృతి జగత్కారణం కాదు అని చెప్పారు. కాని ఇంకా చాలాచోట్ల ప్రకృతే జగత్కారణము అని చెప్పే వాక్యాలున్నాయి. కపిలుడు మొదలైనవారు ప్రకృతినే జగత్కారణము అంటున్నారు. ఇది నిజం కాదు అని నిరూపిస్తే తప్ప 'పరమాత్మే జగత్కారణము' అనే మాటకు బలం చేకూరదు. అందుకే ఈ పాదాన్ని చెబుతున్నారు. ఈ పాదంలో ఎనిమిది అధికరణలు. 28 సూత్రాలు ఉన్నాయి.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | అనుమానికాధికరణము | అవ్యక్తం అనే పదం శరీరాన్ని చెబుతోంది | 7 |
| 2. | చమసాధికరణము | అజము అంటే ప్రకృతి కాదు | 3 |
| 3. | సంఖ్యోపసంగ్రహాధికరణము | పంచజనములు అంటే 25 తత్త్వాలు కాదు | 3 |
| 4. | కారణత్వాధికరణము | జగస్సృష్టికి బ్రహ్మ తప్ప వేరేదీ కారణం కాదు | 2 |
| 5. | బాలాక్యాధికరణము | వేదితవ్యుడైన పురుషుడు బ్రహ్మమే | 3 |
| 6. | వాక్యాన్వయాధికరణము | ద్రష్టవ్యము, శ్రోతవ్యము అయినది పరమాత్మే | 4 |
| 7. | ప్రకృత్యధికరణము | జగత్తుకు బ్రహ్మమే నిమిత్త ఉపాదాన కారణము | 5 |
| 8. | సర్వవ్యాఖ్యానాధికరణము | ప్రకృతిని నిరాకరించటంతో అన్నింటినీ నిరాకరించినట్లే | 1 |

మొత్తం అధికరణలు 8 సూత్రాలు 28.

# 1. అనుమానికాధికరణము (అవ్యక్తమంటే శరీరము)

నాల్గవపాదంలోని మొదటి అధికరణలో అవ్యక్తము అంటే శరీరము అంటున్నారు. ఈ అదికరణ పేరు **'అనుమానికాధికరణము'.** ఇందులో ఏడు సూత్రాలున్నాయి.

***సూత్రం - 107 "అనుమానికమప్యేకేషామితి చేన్న శరీరరూపక విన్యస్తగృహీతేర్దర్శ యతి చ"***

సాంఖ్యులు మొదలైనవారు ప్రధానము (ప్రకృతి) వేద ప్రతిపాదితం కాదు అంటున్నారు. ఇక్కడ ప్రకృతి అంటే శరీరమే.

**కఠోపనిషత్తు**లో "ఈ శరీరం రథం వంటిది. కర్మఫలాన్ని అనుభవించే జీవాత్మ దాని యజమాని. బుద్ధే సారథి. మనస్సే కళ్ళెం. ఇంద్రియాలే గుర్రాలు. విషయమే మార్గం. కాబట్టి ఇంద్రియాలను నడిపే సారథి నేర్పరి కాకపోతే గుర్రాలు అదుపులో ఉండవు. అందుకనే

| | | |
|---|---|---|
| ఇంద్రియాలు | – | మనస్సు అధీనంలోనూ |
| మనస్సు | – | బుద్ధి అధీనంలోనూ |
| బుద్ధి | – | యజమాని అధీనంలోనూ ఉండాలి |

విజ్ఞానహీనుడు మనసును అదుపులో ఉంచుకోలేడు. తాను చేరవలసిన గమ్యం చేరలేడు. మోక్షాన్ని పొందలేడు. వివేకవంతమైన బుద్ధిని గలవాడు మనసును అదుపులో ఉంచగలుగుతాడు. పరమపదాన్ని చేరగలుగుతాడు.

| | | |
|---|---|---|
| ఇంద్రియాలకన్న | – | వాటి విషయాలు శ్రేష్ఠమైనవి |
| విషయాలకన్న | – | మనస్సు శ్రేష్ఠమైనది |
| మనస్సుకన్న | – | బుద్ధి శ్రేష్ఠమైనది |
| బుద్ధికన్న | – | మహతత్త్వం శ్రేష్ఠమైనది |
| మహత్తత్వంకన్న | – | అవ్యాకృత ప్రకృతి శ్రేష్ఠమైనది |
| ప్రకృతికన్న | – | సూక్ష్మరూపి అయిన పురుషుడు గొప్పవాడు |

ఇంతకు మించినదేదీ లేదు. ఇదే పరాకాష్ట. అతణ్ణి చేరినవారు తిరిగి రారు. ఇక్కడ అవ్యాకృత ప్రకృతి అంటే – శరీరం అని అర్థం.

***సూత్రం - 108 "సూక్ష్మం తు తదర్హత్వాత్"***

వెనుకటి సూత్రంలో అవ్యక్తము అంటే శరీరము అన్నారు కదా. మరి శరీరం స్థూలమైనది. అటువంటప్పుడు ఈ శరీరం అవ్యక్తం ఎలా అవుతుంది?

వ్యక్తం కాని దానిని అంటే స్పష్టంగా కనిపించని దానిని అవ్యక్తము అంటారు. స్థూలశరీరం స్పష్టంగా కనిపిస్తుంది. కాబట్టి అది అవ్యక్తం కాదు. కానీ స్థూలశరీరానికి కారణభూతమైన కారణశరీరము అవ్యక్తం.

***సూత్రం - 109 "తదధీనత్వాదర్థవత్"***

అవ్యక్తము అంటే – కారణశరీరమైనప్పుడు, ప్రకృతి అంటే శరీరమే.

ఈ జగత్తు అంతా చేతనుడైనటువంటి ఈశ్వరునివల్లనే సృష్టించబడినందు వల్ల అది సార్థకము. అయితే అవ్యక్తమనేది ఈశ్వరాధీనమైనందువల్ల అది స్వతంత్రం కాదు. ఈశ్వరునిచేత అధిష్టితమైన మాయ జగత్కారణం. ఈ మాయనే అవిద్య, అవ్యక్తము, అక్షరము, ఆకాశము అంటారు.

"జగత్తుకు కారణం ఈశ్వరుడు అంటూ మధ్యలో మాయ, అవిద్య అంటారేమిటి?" అని అనుమానం వస్తుంది.

సృష్టికి పూర్వం అంతా పరమేశ్వరుని అధీనంలో ఉన్నది. శక్తిరహితుడైన పరమాత్మకు ఏ ప్రవృత్తి ఉండదు. ముక్తి పొందిన పురుషులు మళ్ళీ పుట్టరు. అవిద్య, అజ్ఞానము అనేది పరమేశ్వరుని అధీనంలో ఉంటుంది. ఆత్మసాక్షాత్కారం పొందని మానవులు ఈ అవిద్యను ఆశ్రయిస్తారు. ఇదే మాయశక్తి. అవ్యక్తము. దీనినే ఆకాశము అనికూడా అంటారు. పరమాత్మ ఈ ప్రకృతికన్న వేరైనవాడు. మాయే ప్రకృతి. మాయకు అధిపతి పరమాత్మ. అవ్యక్తం నుంచే మహత్తత్వము పుట్టింది. మహత్తు అంటే హిరణ్యగర్భ రూపమైన బుద్ధి. కాబట్టి మహతత్త్వము కన్న అవ్యక్తము గొప్పది.

అవ్యక్తమే అవిద్య, అదే మాయ. శరీరము అవ్యక్త కారకము. శరీరంలాగానే ఇంద్రియాలు కూడా అవ్యక్తానికి వికార స్వరూపాలు.

***సూత్రం - 110 "జ్ఞేయత్వావచనాచ్చ"***

అవ్యక్తము అంటే జ్ఞేయము అని చెప్పలేదు. కాబట్టి అవ్యక్తము అంటే ప్రధానం కాదు.

***సూత్రం - 111***

సాంఖ్యులు పురుషత్వంలాగానే ప్రధానత్వం కూడా జ్ఞేయము (తెలుసుకోతగ్గది) అంటారు. కాని శ్రుతులలో ఈ మాట చెప్పలేదు కాబట్టి అవ్యక్తము అంటే జ్ఞేయము కాదు.

శబ్ద స్పర్శ రూప రస గంధాలు లేనిది, అనాది, అవ్యయము, అనంతము అయినది మహత్తుకన్న పరమైనది, నిశ్చలమైనది అయిన దానిని తెలుసుకున్నవాడు మృత్యువాత పడడు అని ఉపనిషత్తులలో చెప్పబడ్డది. అయితే ఇక్కడ తెలుసుకోతగ్గది ప్రధానాన్ని గురించి చెప్పలేదు. పురుషునికన్న పరమైనవాడు లేడు. అతణ్ణి గురించి తెలుసుకోవాలి. ఆత్మజ్ఞానంవల్ల మాత్రమే మృత్యువు నుంచి తప్పుకోవటం సాధ్యమవుతుంది. కాబట్టి తెలుసుకోదగినవాడు బ్రహ్మమే. అదే పరాశక్తి.

***సూత్రం - 112 "త్రయాణామపి చైవముపన్యాసః ప్రశ్నశ్చ"***

ఇంతవరకు ప్రశ్నలు అన్నీ అగ్ని, జీవాత్మ పరమాత్మల గురించే వచ్చాయి. అంతేకాని ప్రధానం గురించి లేవు. **కఠోపనిషత్తు**లో నచికేతుడు యముణ్ణి కొన్ని ప్రశ్నలు అడిగాడు. అవి

1. అగ్నిని ఆరాధించే అగ్నిచయనము గురించి చెప్పవలసినది.

2. మరణం మీద నాకు అనేక అనుమానాలున్నాయి. మరణించిన తరువాత ఇంద్రియాలు, అవయవాలు, మనస్సు మొదలైన వాటితో జీవాత్మకు సంబంధం ఉండదని కొందరు, ఉంటుందని కొందరు అంటారు. అందులో నిజం ఏది? దానికి దానికి యముడు.

1. అగ్నిచయనము గురించి వివరంగా చెప్పాడు.

2. చనిపోయిన తరువాత జీవుడు ఏమవుతాడో ఆ రహస్యం నీకు చెబుతాను. ఈ విషయం తెలుసుకుంటే జన్మరాహిత్యం జరుగుతుంది. ఈ విషయం తెలియని అజ్ఞానులకు జన్మరాహిత్యం ఉండదు. వారికి పునర్జన్మ ఉంటుంది. చేసిన కర్మను అనుసరించి వారు మళ్ళీ జన్మనెత్తుతారు. విద్వాంసుడైన వాడికి జనన మరణాలుండవు అన్నాడు. ఇక్కడ ప్రధానాన్ని గురించి చెప్పలేదు. ఆత్మను గురించే చెప్పారు.

*సూత్రం - 113 "మహద్వచ్చ"*

మహత్ అనే శబ్దం సాంఖ్యులు చెప్పేది కాదు. అలాగే అవ్యక్తం కూడా సాంఖ్యులు చెప్పే ప్రధానం కాదు.

అవ్యక్తమనే పదానికి అర్ధం 'కారణ శరీరము' అంతేకాని 'ఆత్మకాదు'.

## 2. చమసాధికరణము (అజము అంటే ప్రకృతి కాదు)

ఈ అధికరణ పేరు **'చమసాధికరణము'**. దీనిలో మూడు సూత్రాలు ఉంటాయి.

*సూత్రం - 114 "చమసవదవిశేషాత్"*

చమసము అంటే నాలుగు పలకలుగా (చతురస్రంగా) ఉండే యజ్ఞపాత్ర. ఈ పాత్రలాగానే అజ శబ్దానికి కూడా ప్రత్యేకమైన నిర్ణయం ఏమీ లేదు.

అజము అంటే - జీవుడు, మేక అని అర్ధం.

చమసము అంటే క్రిందవైపు గొయ్యిలాగా ఉండి, పైన ఉబ్బెత్తుగా ఉండే పాత్ర. దీన్ని నిర్ణయించటానికి తగిన విశేషం ఏదీ లేదు. ఎందుకంటే యజ్ఞంలో ఉపయోగించే పాత్రలన్నీ మనం వాడుకునే గరిటలు లాగా ఎత్తుపల్లాలుగానే ఉంటాయి. అలాగే 'అజ' అనే శబ్దం ప్రత్యేకంగా ప్రధానాన్ని చూపుతుందని చెప్పటానికి కారణము ఏదీలేదు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో "ఒక గిన్నె ఉంది. దాని మూతి క్రిందివైపు తెరిచి ఉంది. పై భాగం ఉబ్బెత్తుగా ఉంది. దాని ప్రక్కనే ఏడుగురు ఋషులున్నారు. వేదాలద్వారా వాదము చేసే వాక్కున్నది. ఆ గిన్నే శిరస్సు. క్రింది బాగంలో తెరచి ఉండేదే నోరు. పై భాగాన ఉబ్బెత్తుగా ఉండేదే పుర్రె. సోమపాత్రలో సోమరసం ఉన్నట్లుగా శిరస్సులో అనేక రకాల విజ్ఞానమున్నది" అని చెప్పబడింది.

ఇక్కడ చమసము అంటే శిరస్సు అని అర్ధము.

*సూత్రం - 115 "జ్యోతిరుమక్రమా తు తథా హ్యధీయత ఏకే"*

తేజస్సు దేనిలో ఉంటుందో, దానిని అజ అని గ్రహించాలి.

**ఛాందోగ్యోపనిషత్తు**లో తేజస్సు ఉదకము అన్నము అనేవి సమస్త జగత్తుకు కారణము అని, కార్యమైన వస్తువు కారణం కన్న భిన్నం కాదు అని చెప్పబడింది.

తేజస్సు అన్నములందు అజ యొక్క ఆకృతి ఏదీ లేదు. అందుచేత జన్మరహితమైన అజ శబ్దము వాటియందు అన్వయించదు.

***సూత్రం - 116 "కల్పనోపదేశాచ్చ మధ్వాదివద విరోధః"***

ఆదిత్యాదులందు మధువును చెప్పినట్లుగానే అజా శబ్దము తేజోలక్షణము.

అంటే తేజస్సు, జలము, అన్నము, వీటి లక్షణాలు గల చరాచర యోనులందు అజ శబ్దము చెప్పబడ్డది.

చాందోగ్యోపనిషత్తులో ఆకాశంలో కనిపించే సూర్యుడు దేవతలను తృప్తిపరుస్తాడు. అతడు దేవతలకు మధువు వంటివాడు ఈ విధంగానే అజ శబ్దాన్ని కూడా చెప్పటం జరిగింది.

అజము అంటే మేక, మేక మూడురంగుల్లో ఉంటుంది. ఎరుపు, తెలుపు, నలుపు, ఇతర రంగులు ఉండవు. ఈ మేక తనవంటి అనేక మేకలను ఉత్పత్తి చేస్తోంది. అలాంటి మేకను మేకపోతు సేవిస్తోంది. అంటే ప్రకృతిని అజ్ఞాని అయిన జీవుడు సేవిస్తున్నాడు. వేరొక మేకపోతు తాను అనుభవించిన మేకను వదలివేస్తోంది. అంటే జ్ఞాని తాను అనుభవించిన ప్రకృతిని వదలివేస్తున్నాడు. త్యాగ భోగాలలో ప్రకృతియందు సమత్వమే ఉంటుంది అని చెబుతున్నారు.

సూర్యోపాసన కోసం మధువును కల్పించి చెప్పారు. అంతేకాని నిజంగా సూర్యుడు మధువు కాదు. అలాగే అవాంతర ప్రకృతియందు మేకను కల్పించి చెప్పారు. అంతేకాని అజము అంటే ప్రకృతి కాదు.

## 3. సంఖ్యోపసంగ్రహాధికరణము

## (పంచపంచజనులు అంటే 25 తత్త్వాలు కాదు)

పంచపంచ జనులంటే 25 తత్త్వాలు కాదు అని చెబుతున్నారు మూడవ అధికరణలో. దీని పేరు **'సంఖ్యోపసంగ్రహాధికరణము'**. ఇందులో మూడు సూత్రాలు ఉన్నాయి.

'పంచ పంచ జనులు' అంటే ఇరవై ఐదు తత్త్వాలేనా అని అనుమానం పంచ పంచ అంటే ఐదు ఐదులు ఇరవైఐదు తత్త్వాలు. అని చెపుతున్నారు సాంఖ్యులు.

ఆ తత్త్వాలు పంచభూతాలు–5, తన్మాత్రలు–5, జ్ఞానేంద్రియాలు–5, కర్మేంద్రియాలు–5, మనస్సు–1, మహత్తత్త్వము–1, అహంకారము–1, ప్రకృతి–1, పురుషుడు–1 వెరసి ఇరవై ఐదు.

***సూత్రం - 117 "న సంఖ్యోపసంగ్రహాదపి నానాభావాదతిరేకాచ్చ"***

సాంఖ్యులు చెప్పిన తత్త్వాలన్నీ పరస్పర విలక్షణాలు కలిగి ఉంటాయి. పంచ అంటే ఐదు అని అర్థం చెప్పారు. ఇవి ఐదు సమూహాలుగా ఉండాలి. ఒక సమూహంలోని ఐదింటికీ ఒకే లక్షణాలుండాలి. కాని ఇవి అలా లేవు. వీటి ధర్మాలు వేరుగా ఉన్నాయి. కాబట్టి పంచపంచ జనులు అంటే 25 తత్త్వాలు కాదు.

***సూత్రం - 118 "ప్రాణాదయో వాక్యశేషాత్"***

పంచజన అనే శబ్దానికి ప్రాణాదులను గ్రహించాల్సి ఉంటుంది. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములే, పంచజనములు, అంతేకాని 25 తత్త్వాలు కాదు.

***సూత్రం - 119 "జ్యోతిషైకేషామసత్యన్నే"***

**బృహదారణ్యకోపనిషత్తు**లో జనకమహారాజుకు బ్రహ్మజ్ఞానాన్ని వివరిస్తూ, పరబ్రహ్మ ప్రాణానికి ప్రాణం, చక్షువుకు చక్షువు, శ్రోత్రానికి శ్రోత్రం, అన్నానికి అన్నం, మనస్సుకు మనస్సు అంటాడు యాజ్ఞవల్క్యుడు. వీటిలో అన్నము అనే మాటకు బదులుగా జ్యోతిని తీసుకోవాలి. ఇప్పుడు పంచజనులు అంటే ప్రాణము, చక్షువు, శ్రోత్రము, జ్యోతిషు, మనస్సు. అంతేకాని 25 తత్వాలు మాత్రం కాదు.

## 4. కారణత్వాధికరణము

### (జగసృష్టికి బ్రహ్మ తప్ప వేరేదీ కారణం కాదు)

పరబ్రహ్మకు ఆదిమధ్య అంతాలు లేవు. జన్మజరాదులు లేవు. జగత్తు యొక్క సృష్టికి ఆ బ్రహ్మమే కారణము అంటున్నారు. నాల్గవదైన **'కారణత్వాధ్యధికరణ'**లో ఇందులో రెండు సూత్రాలున్నాయి.

ఇంతవరకు చెప్పిన అక్షేపణలన్నీ సమన్వయం చేశారు. కాని ఇంకా కొన్ని అనుమానాలున్నాయి. ఉపనిషత్తులలో చెప్పినదాంట్లో సమన్వయం కుదరటం లేదు. **తైత్తిరీయోపనిషత్తు**లో ఆత్మనుంచి ఆకాశం పుట్టింది అన్నారు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో అతడు తేజస్సును సృష్టించాడు అన్నారు

**ప్రశ్నోపనిషత్తు**లో అతడు ప్రాణాన్ని సృష్టించాడు అన్నారు

**ఐతరేయోపనిషత్తు**లో అతడీ లోకాలు సృష్టించాడు అన్నారు

**ఛాందోగ్యోపనిషత్తు**లో మొదట అద్వితీయమైన సత్తే ఉన్నది

**ఛాందోగ్యోపనిషత్తు**లో మొదట ఇది అసత్తే. తరువాత సత్తయింది అన్నారు.

ఈ వైవిధ్యంవల్ల ఈ జగత్తుకు కారణం బ్రహ్మ అని సమన్వయం కుదరటం లేదు కదా! ఇది అనుమానం.

***సూత్రం - 120 "కారణత్వేన చాకాదిషు యతావ్యపదిష్టోక్తేః"***

చరాచర జగత్తుకు కారణం బ్రహ్మ. ఇందులో సందేహం లేదు. ఆకాశాది పంచభూతాలకు కూడా పరబ్రహ్మ కారణము అని ఉపనిషత్తులలో చెప్పబడింది.

ఒకవేళ ఎక్కడైన క్రమంలో తేడా ఉండచ్చు. అంటే పంచభూతాలలో ముందుగా ఆకాశము తరువాత వాయువు అగ్ని, జలము, పృథివి ఉద్భవించినాయి. అయితే కొన్నిచోట్ల ముందుగా అగ్ని ఉద్భవించింది అన్నారు. ఏమైనా ఈ పంచభూతాలకు కారణం బ్రహ్మమే. ఇందులో సందేహం లేదు. అలాగే పరమాత్మ సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, సర్వాత్మ. అద్వితీయుడు అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. కాబట్టి జగత్తుకు కారణం బ్రహ్మ తప్ప వేరొకటి కాదు.

***సూత్రం - 121 "సమాకర్షాత్"***

ఈ సృష్టి అంతా సత్తు నుంచి జరిగిందని ఒకచోట. అసత్తు నుంచి జరిగిందని ఇంకొకచోట చెప్పబడింది అంటారు. ఇది సమాకర్షణ దీనివల్ల ఇబ్బంది ఏమీ లేదు.

సృష్టికి పూర్వం ఈ జగత్తు అంతా అసత్తై ఉండేది. అంటే అసత్తుతో నిండి ఉండేది. అంతేకాని సృష్టికి కారణం అసత్తుకాదు. బ్రహ్మను అసత్తు అనుకున్నవాడు తానుకూడా అసత్తే అవుతాడు. ఎవడు బ్రహ్మను సద్వస్తువు అనుకుంటాడో, తానుకూడా సద్వస్తువు అవుతాడు.

ఇక అది సత్యము, నిత్యము అన్నారు. ఈ ప్రకృతి సత్యమూ కాదు నిత్యమూ కాదు. సత్యము, నిత్యము అయినది బ్రహ్మ ఒకటే. దానికి జరామరణములు, అద్యంతములు లేవు. అదే శాశ్వతమైనది. కాబట్టి ఈ జగసృష్టికి బ్రహ్మము తప్ప వేరేదీ కారణం కాదు.

# 5. బాలాక్యాధికరణము (వేదితవ్యుడైన పురుషుడు బ్రహ్మమే)

ఈ విషయం ఐదవదైన **'బాలాక్యధికరణ'**లో వివరిస్తున్నారు. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

**బృహదారణ్యకోపనిషత్తు**లో బాలాకి ఉదంతం చెప్పబడింది. గార్గ్య గోత్రంలో పుట్టిన బాలాకి బ్రహ్మోపదేశం చేస్తానని కాశీరాజు దగ్గరకు వెళ్ళి సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు, ఆకాశము, వాయువు, జలము, దిక్కులు మొదలైన వాటిలో ఉండే పురుషుడే బ్రహ్మము అంటాడు. అవి ఏవీ బ్రహ్మకాదు అంటాడు రాజైన అజాతశత్రువు. ఆ మాటలు విన్న బాలాకి, రాజునే బ్రహ్మోపదేశం చెయ్యమని అడుగుతాడు.

మానవుడు నిద్రిస్తున్నప్పుడు, ఇంద్రియాలన్నీ అతని ప్రాణంలో కలిసిపోతాయి. ఆత్మస్వప్నావస్తలో ఉన్నప్పుడు దానికర్మ ఫలాలు ప్రారంభమవుతాయి. స్వప్నస్థితిలో ఆత్మ మహారాజులా ఉంటుంది. గొప్ప బ్రాహ్మణునిలా ఉంటుంది. దేవతలవలె ఉచ్ఛస్థితి, అసురులవలె నీచస్థితి పొందుతుంది. రాజుగారు తన దేశంలో సంచరించినట్లే ఆత్మ ఈ శరీరంలో స్వేచ్ఛగా విహరిస్తుంది." అని చెబుతాడు రాజైన అజాతశత్రువు. దీనిని బట్టి చూస్తే మనం తెలుసుకోవలసినది ప్రాణమా? లేక ఆత్మా?" ఇది అనుమానం.

***సూత్రం - 122 "జగద్వాచిత్వాత్"***

ఇక్కడ కర్మ ప్రపంచ వాచకం. కర్త పరమాత్మే. కర్మ అనే పదం జగత్తును సూచిస్తుంది. పైన చెప్పిన కథలో బాలాకి సూర్యుడు, చంద్రుడు మొదలైన వారందరినీ చెప్పాడు. వాటిలో ఎవరూ బ్రహ్మకాదు. ఈ మాటే చెప్పాడు కాశీరాజు.

తరువాత కాశీరాజే బాలాకికి బ్రహ్మోపదేశం చేశాడు.

కొంచెం తెలిసినంత మాత్రం చేతనే అంతా తెలుసునని అనుకోకూడదు. గార్గ్యగోత్రంలో పుట్టిన బాలాకి అనేవాడు బ్రహ్మోపదేశం చేస్తానని కాశీరాజు దగ్గరకు వెళ్ళి చివరకు ఆయన దగ్గరే బ్రహ్మోపదేశం పొంది వచ్చాడు.

పూర్వకాలంలో కాశీనగరాన్ని 'అజాత శత్రువు' అనే రాజు పాలిస్తూండేవాడు. అతడు బ్రహ్మవేత్త. గార్గ్యవంశంలో పుట్టిన బాలాకి అనేవాడు వాచాలుడు. గర్విష్ఠి. అతడు ఒకసారి కాశీరాజు దగ్గరకు వెళ్ళి "రాజా! నీకు బ్రహ్మోపదేశం చేస్తాను"

అన్నాడు. ఆ మాటలు విన్న కాశీరాజు ఆ బ్రాహ్మణుడికి వేయిగోవులు దానమిచ్చి "ఓ వేదవిదుడా! బ్రహ్మవేత్తలు, ఆధ్యాత్మిక చింతనాపరులు అందరూ జనకుని పేరే తలుస్తున్నారు. అతని దగ్గరకే పోతున్నారు. నీ ప్రభావం వల్ల నేను కూడా బ్రహ్మవేత్తనై జనకునితో సమానమైన వాడనిపించుకుంటాను. కాబట్టి నాకు బ్రహ్మోపదేశం చెయ్యవలసినది" అన్నాడు. బాలాకి చెప్పటం మొదలుపెట్టాడు. ఇతణ్ణే "గార్గ్యుడు" అని కూడా అంటారు.

"రాజా! సూర్యునిలో ఉన్న పురుషుడే బ్రహ్మ. అతన్నే నేను ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

ఆ మాటలు విన్నరాజు సూర్యుని గురించి నాకు తెలుసును. అతణ్ణి అన్ని భూతాలకు మకుటాయమానంగా కాంతివంతంగా నేను ఉపాసన చేస్తాను. అంతేకాని అతను బ్రహ్మకాదు. ఈ రకంగా సూర్యుని ఉపాసించే వాడు రాజవుతాడు" అన్నాడు.

"చంద్రునిలో ఉన్న పురుషుని బ్రహ్మగా నేను ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

"చంద్రుడు గొప్పవాడు. తెల్లని వస్త్రాలు ధరించిన సోమరాజు. అంతేకాని చంద్రుడు బ్రహ్మకాదు. ఈ రకంగా చంద్రుని ఉపాసన చేసేవారికి అన్నం లోటురాదు" అన్నాడు కాశీరాజు.

"విద్యుత్తులో పుట్టిన పురుషుణ్ణి బ్రహ్మగా ఉపాసన చేస్తాను" అన్నాడు బాలాకి.

"ఆ విద్యుత్తును మహాశక్తివంతమైన దాన్నిగా నేను ఉపాసిస్తాను. అంతేకాని విద్యుత్తు మాత్రం బ్రహ్మకాదు. ఈ రకంగా అతణ్ణి ఉపాసించేవారు సంతానము పొంది తేజోవంతులు, శక్తివంతులు అవుతారు" అన్నాడు కాశీరాజు.

"ఆకాశంలో ఉన్న పురుసుణ్ణి బ్రహ్మగా ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

"నేను ఆకాశాన్ని పూర్ణమైన దానిగా, నిశ్చలమైనదానిగా భావించి ఉపాసిస్తాను. ఈ విధంగా ఆకాశాన్ని ఉపాసించేవారు సంతానము, పశువులతో సుఖంగా ఉంటారు." అన్నాడు కాశీరాజు.

"నేను వాయువులో ఉన్న పురుషుణ్ణి బ్రహ్మగా ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

"నేను వాయురూపంలో. ఓటమి ఎరుగని సేవ చేస్తున్నాను. ఈ విధంగా ఉపాసించే వారు శత్రువులను జయిస్తారు" అన్నాడు రాజు.

"నేను జలంలో ఉండే పురుషుణ్ణి బ్రహ్మగా ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

"జలాన్ని ప్రతిరూపంగా భావించి నేను ఉపాసన చేస్తాను. ఈ విధమైన ఉపాసన చేసిన వారికి అన్నీ వారు కోరిన వస్తువులే లభిస్తాయి" అన్నాడు రాజు.

"అద్దంలో ఉండే పురుషుణ్ణి బ్రహ్మగా భావించి ఉపాసన చేస్తాను" అన్నాడు బాలాకి.

"నేను అద్దంలో ఉండే పురుషుణ్ణి కాంతివంతుడుగా భావించి ఉపాసిస్తాను. ఆ రకంగా ఉపాసించినవాడు దీప్తిమంతుడౌతాడు. అతని సంతానం కూడా దీప్తివంతమవుతుంది అన్నాడు అజాత శత్రువు.

"మనం నడిచేటప్పుడు వెనుక నుంచి వచ్చే శబ్దాన్ని నేను బ్రహ్మగా భావించి ఉపాసన చేస్తాను" అన్నాడు బాలాకి.

"ఆ విషయం నాకు తెలుసు. నేను ఆ శబ్దాన్ని వాయువు లేక ప్రాణంగా ఉపాసిస్తాను. ఈ రకంగా ఉపాసించేవాడు పూర్ణాయుర్దాయాన్ని పొందుతాడు" అన్నాడు రాజు.

"నేను దిక్కుదలందుండే పురుషుని బ్రహ్మగా ఉపాసిస్తాను. అన్నాడు బాలాకి.

"ఆ విషయం నాకు తెలుసు. నేనా పురుషుణ్ణి రెండవవాడు కలవానినిగా వేరు చేయబడని వానినిగా భావించి ఉపాసిస్తాను. దిక్కులందుండే పురుషుణ్ణి ఈ రకంగా ఉపాసించేవాడు స్నేహితులు, అనుచరులు కలవాడవుతాడు" అన్నాడు రాజు.

నేను నీడలో ఉండే పురుషుణ్ణి బ్రహ్మగా ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

"ఆ విషయం నాకు తెలుసు. ఆ ఛాయలో ఉండే పురుషుణ్ణి మృత్యువుగా భావించి నేను ఉపాసిస్తాను. ఈ రకంగా ఉపాసించేవాడు పూర్ణాయుర్దాయుడౌతాడు" అన్నాడు రాజు.

"బుద్ధిలో ఉన్న పురుషుణ్ణి నేను బ్రహ్మగా భావించి ఉపాసన చేస్తాను" అన్నాడు బాలాకి.

"ఆ విషయం నాకు తెలుసు. అతన్ని నేను ఆత్మగల వానిగా ఉపాసిస్తాను. ఈ రకంగా ఉపాసన చేసేవాడు ఆత్మవంతుడౌతాడు. బుద్ధిమంతుడౌతాడు" అన్నాడు రాజు.

గార్గ్యుడికి ఇంతకన్న విషయం తెలియదు. అందుకని మాట్లాడకుండా ఊరుకున్నాడు. అప్పుడు ఆ బ్రాహ్మణ్ణి చూసి "నీకు తెలిసిన బ్రహ్మజ్ఞానం ఇంతేనా? ఇంకేమైనా ఉన్నదా అన్నాడు రాజు.

"ఇంతే! ఇంకేంలేదు" అని సమాధానమిచ్చాడు బాలాకి.

"ఈ కొంచెం తెలిసినంత మాత్రంచేత బ్రహ్మజ్ఞానం తెలిసినట్లు కాదు" అన్నాడు రాజు.

ఆ మాటలు విన్న గార్గ్యుడు "రాజా! నీవే శరణు. నాకు బ్రహ్మోపదేశం చెయ్యి" అన్నాడు.

అప్పుడు అజాతశత్రువు గార్గ్యుణ్ణి నిద్రపోతున్న ఒక మనిషి దగ్గరకు తీసుకుపోయి "ఓ బ్రాహ్మణ శ్రేష్టుడా! నిద్రలే" అన్నాడు. అతడు లేవలేదు. చేతితో తట్టిలేపాడు నిద్రిస్తున్నవాడు లేచి కూర్చున్నాడు.

అప్పుడు రాజు గార్గ్యునితో, "చేతితో తట్టి లేపటానికి పూర్వం పురుషుడు నిద్రిస్తున్నాడు పిలిచినా లేవలేదు. అప్పుడతడు ఎక్కడ ఉన్నాడు? ఇప్పుడు ఎక్కడ నుంచి వచ్చాడు?

జీవుడు నిద్రింస్తుండగా ఇంద్రియాల యొక్క విషయాలన్నింటినీ అనగా వాక్కు మొదలైన ప్రాణాల విజ్ఞానాన్ని పూర్తిగా గ్రహించి హృదయాకాశంలో నిద్రిస్తున్నాడు. హృదయాకాశము పరమాత్మ ఉండే చోటు. నిద్రావస్థలో ఉన్నప్పుడు పురుషుడు శరీరము, ఇంద్రియాలను తనలో లీనం చేసుకుంటాడు. ప్రాణాలన్నింటినీ తనలోకి ఆకర్షించుకుంటాడు. వాక్కు, చక్షువు, శ్రోత్రము మొ॥ ఇంద్రియాలు మనస్సుతో సహా లోపలకు ఆకర్షింపబడతాయి. ఆ స్థితిలో క్రియ అనేది ఉండదు. క్రియాఫలం ఉండదు. కాబట్టి ఆత్మ తన నిజస్థితిలో ఉంటుంది.

ఆత్మ స్వప్నావస్థలో ఉన్నప్పుడు దాని కర్మఫలాలు ప్రారంభమవుతాయి. స్వప్నస్థితిలో ఆత్మ మహారాజులాగా ఉంటుంది. గొప్ప బ్రాహ్మణునిలా ఉంటుంది. దేవతలవలె ఉచ్ఛస్థితులు, అసురులవలె నీచస్థితులు కూడా పొందుతుంది. రాజుగారు తన దేశంలో స్వేచ్ఛగా తిరిగినట్లుగానే, ఆత్మస్వప్నంలో ప్రాణాన్ని, ఇంద్రియాలను గ్రహించి తన దేహంలో యధేచ్ఛగా తిరుగుతుంది. అదే సుషుప్తావస్థలో ఆనందంతో కూడిన స్థితిని పొందుతుంది.

అగ్ని నుండి చిన్న చిన్న రవ్వలు పైకి లేచినట్లుగానే ఆత్మనుండి అన్ని ప్రాణులు. ఇంద్రియాలు, లోకాలు, దేవగణాలు, భూతగణాలు పుడుతున్నాయి. ఇదే ఆత్మకు

సంబంధించిన విషయాన్ని వివరించే రహస్యోపనిషత్తు" అంటూ అజాత శత్రువు అనే రాజు గార్గ్యవంశంలోని బాలాకికి ఆత్మతత్త్వాన్ని ఉపదేశించాడు.

***సూత్రం - 123 "జీవముఖ్యప్రాణలిఙ్గాన్నేతి చేత్తద్వ్యాఖ్యాతమ్"***

తెలుసుకోవలసినది పరమాత్మనుగురించి. ప్రాణము, బ్రహ్మ. వీరిలో తెలుసుకోదగిన వాడు బ్రహ్మ మాత్రమే. ఈ విధంగా బ్రహ్మను గురించి తెలుసుకున్న వాడు సమస్తపాపాలను నాశనంచేసుకుని అమరుడౌతాడు.

***సూత్రం - 124 "అన్యార్థం తు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానా భ్యామపి చెవమేకే"***

ఇక్కడ బ్రహ్మ ప్రతిపత్తి కోసమే జీవ పరామర్శ జరిగింది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో అజాతశత్రువు గార్గ్యుణ్ణి నిద్రపోతున్న ఒక మనిషి దగ్గరకు తీసుకుపోయి "ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! నిద్రలే" అన్నాడు. అతడు లేవలేదు. చేతితో తట్టిలేపాడు నిద్రిస్తున్నవాడు లేచి కూర్చున్నాడు.

అప్పుడు రాజు గార్గ్యునితో, "చేతితో తట్టి లేపటానికి పూర్వం పురుషుడు నిద్రిస్తున్నాడు పిలిచినా లేవలేదు. అప్పుడతడు ఎక్కడ ఉన్నాడు? ఇప్పుడు ఎక్కడ నుంచి వచ్చాడు?

జీవుడు నిద్రింస్తుండగా ఇంద్రియాల యొక్క విషయాలన్నింటినీ అనగా వాక్కు మొదలైన ప్రాణాల విజ్ఞానాన్ని పూర్తిగా గ్రహించి హృదయాకాశంలో నిద్రిస్తున్నాడు. హృదయాకాశము పరమాత్మ ఉండే చోటు. నిద్రావస్థలో ఉన్నప్పుడు పురుషుడు శరీరము, ఇంద్రియాలను తనలో లీనం చేసుకుంటాడు. ప్రాణాలన్నింటినీ తనలోకి ఆకర్షించుకుంటాడు. వాక్కు, చక్షువు, శ్రోత్రము మొ॥ ఇంద్రియాలు మనస్సుతో సహా లోపలకు ఆకర్షింపబడతాయి. ఆ స్థితిలో క్రియ అనేది ఉండదు. క్రియాఫలం ఉండదు. కాబట్టి ఆత్మ తన నిజస్థితిలో ఉంటుంది.

ఆత్మ స్వప్నావస్థలో ఉన్నప్పుడు దాని కర్మఫలాలు ప్రారంభమవుతాయి. స్వప్నస్థితిలో ఆత్మ మహారాజులాగా ఉంటుంది. గొప్పబ్రాహ్మణునిలా ఉంటుంది. దేవతలవలె ఉచ్చస్థితులు, అసురులవలె నీచస్థితులు కూడా పొందుతుంది. రాజుగారు తన దేశంలో స్వేచ్ఛగా తిరిగినట్లుగానే, ఆత్మస్వప్నంలో ప్రాణాన్ని, ఇంద్రియాలను గ్రహించి తన దేహంలో యధేచ్ఛగా తిరుగుతుంది. అదే సుషుప్తావస్థలో ఆనందంతో కూడిన స్థితిని పొందుతుంది.

అగ్ని నుండి చిన్న చిన్న రవ్వలు పైకి లేచినట్లుగానే ఆత్మనుండి అన్ని ప్రాణులు. ఇంద్రియాలు, లోకాలు, దేవగణాలు, భూతగణాలు పుడుతున్నాయి. ఇదే ఆత్మకు సంబంధించిన విషయాన్ని వివరించే రహస్యోపనిషత్తు" అంటూ అజాత శత్రువు అనే రాజు గార్గ్యవంశంలోని బాలాకికి ఆత్మతత్త్వాన్ని ఉపదేశించాడు. కాబట్టి ఇక్కడ ఆకర్షింపబడే పురుషుడే బ్రహ్మ. అదే పరాశక్తి.

## 6. వాక్యాన్వయాధికరణము

### (ద్రష్టవ్యము, శ్రోతవ్యము అయినది పరమాత్మే)

ఆత్మశబ్దం జీవిని సూచిస్తుందా? పరమాత్మను సూచిస్తుందా? అనే విషయాన్ని ఆరవ అధికరణలో వివరిస్తున్నారు. దీని పేరు **'వాక్యాన్వయాధికరణము'** ఇందులో నాలుగు సూత్రాలున్నాయి.

శ్రుతులలో చెప్పిన 'ఆత్మ' శబ్దము జీవాత్మని సూచిస్తుందా? పరమాత్మను సూచిస్తుందా? ఈ విషయం చూద్దాం.

***సూత్రం - 125 "వాక్యాన్వయాత్"***

వాక్యాలకు అన్నింటికి పరబ్రహ్మ యందే అన్వయం కలుగుతున్నది. శ్రవణ, మననాదులకు యోగ్యమైనది బ్రహ్మమే.

**బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు సన్యాసం స్వీకరించాలనే కోరికతో తన ఇద్దరు భార్యలకు తన ఆస్తిపాస్తులు పంచుతానంటాడు. రెండవ భార్యయైన మైత్రేయి ఈ సిరిసంపదలు నాకు వద్దు. శాశ్వతమైన ఆనందాన్ని ఇచ్చే బ్రహ్మవిద్యను నాకు ఉపదేశించండి అంటుంది. అప్పుడు యాజ్ఞవల్క్యుడు చెబుతాడు.

"మైత్రేయీ ! ఆత్మప్రయోజనం కోసమే ఒకరికొకరు ప్రియులౌతారు. భార్యభర్తను ప్రేమిస్తోంది అంటే ఈ ప్రేమ భర్తకోసం కాదు. కేవలం భార్య ప్రయోజనం కోసమే. అలాగే భర్తకూడా తన ప్రయోజనం కోసమే భార్యను ప్రేమిస్తాడు. తల్లితండ్రులు పుత్రులను తమ ప్రయోజనం కోసమే ప్రేమిస్తున్నారు. అంతేకాని పుత్రుల ప్రయోజనం కోసం కాదు. అదే విధంగా ధనాన్ని మన ప్రయోజనం అంటే ఆత్మ ప్రయోజనం కోసమే ప్రేమిస్తున్నాము. ఈ విధంగా లోకాలను, క్షత్రియులను, పంచభూతాలను

ఒకటేమిటి? లోకం దేన్నయినాసరే ఆత్మ ప్రయోజనం కోసమే ప్రేమిస్తున్నాము. కాబట్టి ఈ ఆత్మ ఒక్కటే దర్శనీయమైనది, తెలుసుకోతగినది. ముందుగా దీన్ని గురించి గురువు ద్వారా వినాలి. శాస్త్రాలు చదవాలి. ఇతరులతో తర్కించాలి. ఆత్మతత్త్వాన్ని గూర్చి దర్శనం, శ్రవణం, మననం, విజ్ఞానం ద్వారా అన్నీ తెలుస్తాయి. రజ్జుసర్పభ్రాంతి కలిగినప్పుడు, అది కేవలం త్రాడు అని తెలిస్తే అది సర్పమనే భ్రాంతి తొలగిపోతుంది. విజ్ఞానం కలగగానే ఆత్మస్వరూపం గోచరిస్తుంది.

బ్రాహ్మణజాతిని ఎవరైనా ఆత్మకన్న భిన్నమైనదిగా భావిస్తే వాళ్ళను ఆజాతి నిర్లక్ష్యం చేసి దూరంగా త్రోసివేస్తుంది. పురుషార్థాల నుండి భ్రష్టుల్ని చేస్తుంది. అదే విధంగా క్షత్రియజాతిని ఎవరైనా ఆత్మకన్న భిన్నమైనదిగా భావిస్తే వాళ్ళని ఆ జాతి త్రోసివేస్తుంది. దేవతలను ఆత్మకన్న భిన్నంగా భావించిన వారిని దేవతలు తృణీకరిస్తారు. ఈ విధంగా బ్రాహ్మణజాతి, క్షత్రియజాతి, లోకాలు, దేవతలు, పంచభూతాలు ఒకటేమిటి? కంటికి కనుపించే ప్రతిదీ ఆత్మస్వరూపమే. ఆత్మకన్న భిన్నమైనది ఏదీలేదు. అన్నీ ఆత్మనుండే పుడుతూ, ఆత్మలోనే లీనం అవుతున్నాయి.

ఏది లేకుండా ఒక వస్తువును మనం గ్రహించలేమో, అది దానియొక్క తత్త్వము, ధర్మము అవుతుంది. ఒక నగారాను కర్రతో కొట్టినప్పుడు దానినుంచి వచ్చే స్వరాలు దాని యొక్క సామాన్య స్వరానికి భిన్నంకావు. ఎన్నిరకాల శబ్దాలు వచ్చినా అవి సామాన్య స్వరంతో కలిసిపోతాయి. వాటికి ప్రత్యేకమైన అస్థిత్త్వం ఉండదు. ముందుగా సామాన్య స్వరం గ్రహిస్తే తరువాత విశేష శబ్దం పట్టుబడుతుంది. అలాగే ముందు చిదాత్మను గ్రహిస్తే, తరువాత దానిలోని కల్పితమైన నామరూపాత్మకమైన జగత్తు పట్టుబడుతుంది. కన్ను ముందుగా వెలుగును గ్రహించిన తరువాతనే నీలము, ఎరుపు, నలుపు రంగులను చూడగలము. అదే విధంగా చిదాత్మను దర్శించిన తరువాతనే నామరూపాత్మకమైన జగత్తును చూడగలము.

శంఖాన్ని ఊదినప్పుడు వెలువడే ప్రత్యేకమైన శబ్దాలను గ్రహించగలిగితే దాని నుండి వెలువడిన శబ్దాలు వాటంతటవే పట్టుబడతాయి. కాబట్టి ముందు సామాన్య శబ్దం పట్టుపడాలి. అగ్నినుంచి వచ్చే రవ్వలు అగ్ని కన్న వేరైనవి కావు. అలాగే వేదాలు, పురాణాలు, ఉపనిషత్తులు, మంత్రాలు, కళలు, సూత్రాలు ఇవన్నీ పరమాత్మ యొక్క స్వరూపాలు. ప్రయత్నం లేకుండానే ఇవన్నీ విజ్ఞానఘనుడైన పరమాత్మ

నుంచి ఉత్పన్నమౌనాయి. రవ్వలు, జ్వాలలు రావటానికి ముందు అంతా అగ్నిమయమే. అలాగే నామరూపాత్మక స్థితికి ముందు జగత్తంతా ప్రజ్ఞానఘనుని స్వరూపమే.

అన్ని నదులకు గమ్యస్థానం సముద్రమే. సముద్రంలో చేరగానే నదులు తమ అస్థిత్వాన్ని కోల్పోతాయి. అలాగే

| | |
|---|---|
| అన్ని రకాల స్పర్శలకు గమ్యస్థానం | – చర్మము |
| అన్ని రకాల వాసనలకు ప్రళయస్థానం | – నాసిక |
| అన్ని రుచులకు ప్రళయ స్థానం | – నాలుక |
| అన్ని శబ్దాలకు ప్రళయ స్థానం | – చెవులు |
| అన్ని ఆలోచనలకు ప్రళయ స్థానం | – మనస్సు |
| అన్ని విద్యలకు ప్రళయ స్థానం | – హృదయం |
| అన్ని కర్మలకు ప్రళయ స్థానం | – చేతులు |
| అన్ని సుఖాలకు ప్రళయ స్థానం | – జననేంద్రియము |
| అన్ని నడకలకు గమ్యస్థానం | – కాళ్ళు |
| అన్ని విషయాలకు గమ్యస్థానం | – ఇంద్రియాలు. |

ఈ రకంగా కార్యాలన్నీ కారణాలలో కలిసిపోయి ఇవన్నీ ప్రజ్ఞాన ఘనుడిలో చేరిపోతాయి.

నీళ్ళలో ఉప్పు వేస్తే అది కరుగుతుంది. అంటే ఆ ఉప్పు నీరంతా వ్యాపించి ఉంటుంది. అదే విధంగా అద్భుతమైన శక్తి గల పరమాత్మ అనంతుడు, అవ్యయుడు, విజ్ఞానఘనుడు. అతడు దేహాది ఉపాధులతోబాటుగా కలిసిపోయి, అవి నాశనమయి నప్పుడు తాను కూడా నాశనమయినట్లు కనిపిస్తాడు. దేహంనుండి విడివడిన తరువాత విశేష సంజ్ఞలు ఏమీ ఉండవు.

లోకంలో ఉన్నదంతా ఆత్మే. ఆత్మయే అందరిలోనూ సమానంగా ఉన్నది. ఆత్మనుండే అన్నీ పుట్టినాయి. మళ్ళీ ఆత్మలోనే లయం అవుతాయి. అందుచేతనే ఆత్మను గురించి తెలుసుకుంటే మిగిలిన విషయాలన్నీ తెలుసుకున్నట్లే.

ఈ జగత్తులోని ప్రతి వస్తువు, ప్రతి ప్రాణి ఒకదానికొకటి ఉపకార్య, ఉపకారిక స్వభావాలు కలిగి ఉంటాయి.

పిపీలికాది బ్రహ్మపర్యంతము సృష్టియే జగత్తు. తేనెటీగలు అసంఖ్యాకంగా చేరి తేనెతుట్టెను నిర్మించినట్లుగా సమస్త భూతాలు చేరి ఈ పృథివిని నిర్మించాయి. సమస్త భూతాలకు ఈ భూమియే మధువు. తేనెతుట్టె తేనెటీగలకు ఆశ్రయం అయినట్లుగా భూతాలన్నింటికీ భూమి ఆశ్రయం, ఆహారం అవుతోంది. అందుకే భూమిని కూడా మధువు అంటారు. ఈ పృథివిలో చిన్మాత్రుడు, ప్రకాశమయుడు, అమృతమయుడు అయిన పురుషుడే ఈ అధ్యాత్మ శరీరంలోని తేజోమయుడైన, అమరణ ధర్ముడైన పురుషుడు కూడా! ఇద్దరూ ఒకటే. అదే ఆత్మ. ఈ ఆత్మ జ్ఞానమే అమృతత్వానికి సాధనం. వీటన్నింటిలో ఉన్న ఏకత్వమే బ్రహ్మ. అదే సర్వస్వరూపం. పృథివి అనేది శరీరానికి ప్రతీక. ఈ బ్రహ్మజ్ఞానమే సమస్తమూ తాను అవటానికి సాధనం.

అదే విధంగా జలం సమస్త భూతాలకు, ప్రాణాలకు మధువు. భూతాలు జలానికి మధువు. జలాన్ని రేతస్సు అంటారు. జలంలో ఉన్న ప్రకాశమయుడు, అమృత స్వరూపుడే ఈ శరీరాల్లో బీజంగా ఉన్న ప్రకాశమయుడు, అమృతమయుడు. అదే ఆత్మ. ఈ రెంటిలో ఉన్న ఏకత్వమే బ్రహ్మ. ఈ బ్రహ్మజ్ఞానమే సర్వమూ తాను అవటానికి సాధనం.

జీవులన్నింటికీ అగ్నిమధువులాంటిది. అలాగే అగ్నికి ఈ ప్రాణులన్నీ మధువు లాంటివి. అగ్నిలో ఉన్న తేజోమయుడైన పురుషుడే శరీరంలో వాగ్రూపంలో ఉన్న పురుషుడు. ఈ ఇద్దరూ ఒకటే. ఇదే బ్రహ్మ. అదే అమృతము.

వాయువు జీవరాశులన్నింటికీ మధువు వంటిది. ఈ జీవరాశులు వాయువుకు మధువు వంటివి. వాయువులో ఉన్న తేజోమయుడు, అమృతమయుడు అయిన పురుషుడు శరీరంలో ప్రాణరూపంలో ఉండే తేజోమయుడైన పురుషుడు ఇద్దరూ ఒకటే. అదే ఆత్మ. అదే అమృతం.

సూర్యుడు అన్ని భూతాలకు మధువు. అన్ని భూతాలు ఆదిత్యునికి మధువు లాంటివి. ఆదిత్యునిలో ఉన్న ప్రకాశవంతుడైన పురుషుడే శరీరంలోని కనులలో

ఉండే తేజోమయుడైన పురుషుడు. వీరిద్దరూ ఒకటే. అదే ఆత్మ. అదే అమృతం. అదే బ్రహ్మ.

దిక్కులన్నీ సమస్త భూతాలకు మధువు వంటివి. అలాగే సమస్త భూతాలు దిక్కులన్నింటికి మధువు వంటివి. ఈ దిక్కులలో ఉన్న తేజోమయుడైన పురుషుడే శరీరంలో ఉండే శ్రోత్రపురుషుడు. శ్రవణ సమయంలో ఉండే పురుషుడు. ఈ ఇద్దరూ ఒకటే. అతడే ఆత్మ అతడే బ్రహ్మ సర్వరూపుడు.

చంద్రుడు సమస్త భూతాలకు, మధువు వంటివాడు. అలాగే సమస్త భూతాలూ చంద్రునికి మధువులాంటివి. చంద్రునిలో ఉన్న తేజోమయుడైన పురుషుడు. శరీరంలో ఉన్న మనస్సంబంధమైన అమృతమయుడైన పురుషుడు, ఇద్దరూ ఒకటే. అదే అమృతం. అదే బ్రహ్మ. అదే సర్వస్వరూపం.

విద్యుత్తు సమస్త జీవకోటికి మధువు. అలాగే సమస్త జీవరాసులు విద్యుత్తుకు మధువు. విద్యుత్తులో ఉండే ప్రకాశవంతమైన పురుషుడూ, శరీరంలో ఉండే తేజోమయుడైన అమృతమయుడు ఇద్దరూ ఒకటే. అతడే ఆత్మ. అతడే అమృతమయుడు, అతడే బ్రహ్మ.

సమస్త భూతాలకు మేఘం మధువు. అలాగే సమస్త భూతాలు మేఘానికి మధువు. మేఘంలో ఉన్న తేజోమయుడైన పురుషుడు, శరీరంలో శబ్దము, స్వరము రూపంలో ఉన్న పురుషుడు, ఇద్దరూ ఒకటే. అదే ఆత్మ. అదే అమృతం. అతడే బ్రహ్మ.

సమస్త భూతాలకు ఆకాశం మధువు. అలాగే సమస్త జీవులు ఆకాశానికి మధువు. ఆకాశంలో ఉండే తేజోమయుడైన పురుషుడు శరీరంలోని హృదయాకాశంలో ఉండే తేజోమయుడైన పురుషుడు ఇద్దరూ ఒకటే. అదే ఆత్మ. అమృతమయమైనది. అదే బ్రహ్మ.

ధర్మమనే పేరుతో వ్యవహరింపబడి మనం ఆచరించదగ్గది అయిన ధర్మము ఈ భూతాలన్నింటికి మధువు. ఈ భూతాలన్నీ ఆ ధర్మానికి మధువు లాంటివి. ధర్మంలో ఉండే తేజోమయుడైన పురుషుడు, శరీరంలో ఉండే తేజోమయుడైన పురుషుడు ఇద్దరూ ఒకటే. అతడే ఆత్మ. అతడే అమృతుడు. అతడే బ్రహ్మ.

సత్యమనేది సమస్త భూతాలకు మధువు. అలాగే సమస్త భూతాలు సత్యానికి మధువు. సత్యంలో ఉండే తేజోమయుడైన పురుషుడు శరీరంలో ఉండే తేజోమయుడైన పురుషుడు ఇద్దరూ ఒకటే. అతడే ఆత్మ. అతడే అమృతుడు. అతడే బ్రహ్మ.

మనుష్యాది జాతులన్నీ భూతాలకు మధువు. భూతాలన్నీ మనుష్యాది జాతులకు మధువు. భూతాలలో ఉన్న తేజోమయుడైన పురుషుడే శరీరానికి సంబంధించిన తేజోమయుడైన పురుషుడు. అతడే ఆత్మ. అతడే బ్రహ్మ.

విజ్ఞానమయుడైన ఆత్మయే సమస్త భూతాలకు అధిపతి. సమస్త భూతాలకు రాజు. సమస్త దేవతలు, సమస్త లోకాలు, సమస్త ప్రాణులు, అన్నీ పరమాత్మలో ఇమిడి ఉన్నాయి. ఆ ఆత్మయే పరబ్రహ్మ.

ఇదే మధువిజ్ఞానము. పూర్వకాలంలో దీనిని దధ్యమహర్షి తన శిష్యులయిన అశ్వనీదేవతలకు వివరించాడు" అని యాజ్ఞవల్క్యుడు తన భార్య మైత్రేయికి బ్రహ్మతత్త్వాన్ని వివరించాడు అని చెబుతాడు. ఆత్మ అనే పదాన్ని ముందు చెప్పటంచేత ఇక్కడ చెప్పింది జీవుణ్ణి గురించి కాదు. జీవవిజ్ఞానం వల్ల అమృతత్వం లభించదు. ఆత్మవిజ్ఞానం చేతనే సమస్తమూ తెలుస్తుంది. కాబట్టి ద్రష్టవ్యుడు పరమాత్మే కాని వేరు కాదు.

### *సూత్రం - 126 "ప్రతిజ్ఞాసిద్ధేర్లిఙ్గమాశ్మరథ్యః ఉత్క్రమిష్యత"*

ఏకవిజ్ఞానం వల్ల సర్వమూ తెలుస్తుంది. ఇలాంటివి జీవునితో ప్రారంభించటమనేది సంప్రదాయము అని 'అశ్చరధ్యాచార్యుడు' చెబుతున్నాడు. 'ఆత్మవిజ్ఞానం తెలిస్తే ఈ దృశ్యజాతమంతా తెలుస్తుంది' ఆత్మయే సమస్తము. అని ఉపనిషత్తులో చెప్పబడింది. ఇక్కడ ఆత్మ అంటే జీవాత్మ కాదు. పరమాత్మ అని అర్థం.

### *సూత్రం - 127 "ఏవంభావాదిత్యౌడులోమిః"*

ఆత్మసాక్షాత్కారం జరిగిన తరువాత ఈ దేహాన్ని విడిచిన జీవాత్మ, పరమాత్మలో లీనమవుతుంది. కాబట్టి 'ఔఢలోమి' అనే ఆచార్యుడు ఈయన వ్యాసునికన్న పూర్వీకుడు భవిష్యత్తులో జరుగబోయే దాన్ని ముందుగానే ఊహించి జీవునితో వాక్యం ప్రారంభించటం తప్పుకాదు అంటున్నాడు.

*సూత్రం - 128 "అవస్థితేరితి కాశకృత్స్నః"*

అవిద్య, అజ్ఞానములతో వచ్చిన భేదభావం వల్ల ఆ పరబ్రహ్మ జీవరూపంలో ఉన్నాడు. అందుచేతనే 'జీవాత్మ'తో వాక్యం ప్రారంభమవుతుంది.

కాబట్టి తెలుసుకోదగినవాడు పరమాత్మ ఆ పరాశక్తి తప్ప వేరెవరూ కాదు.

## 7. ప్రకృత్యధికరణము

### (జగత్తుకు బ్రహ్మమే ఉపాదాన నిమిత్త కారణము)

ఈ జగత్తుకు బ్రహ్మ ఉపాదానకారణమా? నిమిత్తకారణమా అనే విషయాన్ని ఏడవ అధికరణలో వివరిస్తున్నారు. దీని పేరు '**ప్రకృత్యధికరణము**'. ఇందులో ఐదు సూత్రాలు ఉంటాయి.

ఈ జగత్తుకు బ్రహ్మ ఉపాదానకారణమా? నిమిత్తకారణమా? కుండకు కుమ్మరి నిమిత్త కారణము మట్టి ఉపాదాన కారణము. అలాగే ఆభరణానికి ఉపాదాన కారణము బంగారం. నిమిత్త కారణం కంసాలి. కుమ్మరివాడు కుండను ఏ రకంగా తయారుచెయ్యాలో ముందుగా ఆలోచించుకుని తయారుచేస్తాడు. అలాగే స్వర్ణకారుడు కూడా. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఈ సృష్టిని గురించి పరబ్రహ్మ ఆలోచించాడు. ఒకటిగా ఉన్న పరబ్రహ్మ తాను అనేకం కావాలి అనుకున్నాడు **ప్రశ్నోపనిషత్తు**లో ఆ పరబ్రహ్మ ఆలోచన చేశాడు. ముందుగా ప్రాణాన్ని సృష్టించాడు **ఐతరేయోపనిషత్తు**లో పరమాత్మ విరాట్స్వరూపాన్ని దృష్టిలో ఉంచుకుని తీవ్రమైన ఆలోచన చేశాడు. అని చెప్పబడింది. కాబట్టి ఈ జగత్తుకు పరబ్రహ్మ ఉపాదాన కారణమా? నిమిత్త కారణమా? ఈ విషయం చూద్దాం.

*సూత్రం - 129 "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాన్తాను పరోధాత్"*

పరబ్రహ్మ ఈ జగత్తుకు ఉపాదానకారణము నిమిత్తకారణము కూడా.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఆత్మజ్ఞానాన్ని బోధిస్తూ ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుతో అంటున్నాడు. "నాయనా శ్వేతకేతూ! శ్రవణ గోచరంకాని తత్త్వం ఇంద్రియ గోచరమయ్యే విధానము గురించి మీ గురువుగారిని అడిగావా."

ఎమిటా విషయం? అన్నాడు శ్వేతకేతువు. మట్టిని గురించి తెలిస్తే, మట్టితో చేసిన రకరకాల వస్తువులు వాటి పేర్లలో తేడా గురించి తెలుస్తుంది. అలాగే బంగారం గురించి తెలిస్తే దానితో తయారుచేసే నగలకు ఏ పేరు పెట్టినా అందులో ఉన్నది బంగారమే అని తెలుస్తుంది. అలాగే ఏ విషయం తెలుసుకున్నందువల్ల మనకు అన్ని విషయాలు బోధ పడతాయో, దాన్ని గురించి తెలుసుకోవాలి. ఇక్కడ మట్టి సత్యం. ఉపాదాన కారణము. అలాగే బ్రహ్మసత్యం. ఈ జగత్తుకు అదే ఉపాదాన కారణము, నిమిత్తకారణము కూడా.

***సూత్రం - 130 "అభిధ్యోపదేశాచ్చ"***

పరబ్రహ్మ తాను అనేకం కావాలని కోరుకున్నాడు. ఈ కోరిక వల్ల బ్రహ్మకు కర్తృత్వము, ఉపాదానత్వము రెండూ వస్తాయి.

***సూత్రం - 131 "సాక్షాచ్చోభయామ్నానాత్"***

బ్రహ్మకు సృష్టి, లయాలు రెండూ చెప్పటంవల్ల అతడు జగత్తుకు ఉపాదాన కారణం అవుతున్నాడు. ఈ సమస్తభూతాలు ఆకాశం నుంచే పుడుతున్నాయి. ఆకాశంలోనే లీనమవుతున్నాయి. అని చెప్పటం జరిగింది. ఇక్కడ ఆకాశము అంటే పరబ్రహ్మ అంతేకాని భూతాకాశం కాదు. ఈ జగత్తంతా బ్రహ్మనుండే పుట్టి బ్రహ్మలోనే లీనమవుతుంది. ఒక వస్తువు యొక్క సృష్టికి, లయానికి ఏది కారణమవుతుందో, అది దానికి ఉపాదాన కారణము. మట్టినుండి పుట్టినకుండ మళ్ళీ మట్టిలోనే కలిసిపోతుంది. అందుకే కుండకు మట్టిలాగా జగత్తుకు బ్రహ్మ ఉపాదానకారణము.

***సూత్రం - 132 "ఆత్మకృతేః పరిణామాత్"***

ఆత్మసంబంధమైన ప్రకృతివల్ల, ఆత్మను స్వయంగా సృజించాడు అని చెప్పటంవల్ల బ్రహ్మ ఆ జగత్తుకు ఉపాదాన కారణము అవుతున్నాడు. అతడే స్వయంగా నామరూపాత్మకమైన జగత్తును సృష్టించాడు అని చెప్పటంవల్ల అతడికి కర్తృత్వం వస్తోంది. అంటే నిమిత్త కారణమవుతున్నాడు.

***సూత్రం - 133 "యోనిశ్చ హి గీయతే"***

ఇక్కడ యోని అంటే ఆత్మ అని అర్థం. **ముండకోపనిషత్తు**లో వివేకవంతులు సమస్త భూతాలకు కారణమైన వానిని అంతటా చూస్తారు అని చెప్పటం జరిగింది.

కాబట్టి ఈ జగత్తుకు బ్రహ్మ ఉపాదానకారణము మరియు నిమిత్తకారణము కూడా.

## 8. సర్వవ్యాఖ్యానాధికరణము

### (ప్రకృతిని నిరాకరించటంతో అన్నింటినీ నిరాకరించినట్లే)

ఈ అధికరణ పేరు **'సర్వవ్యాఖ్యానాధికరణము'** దీనిలో ఒక్క సూత్రమే ఉంది.

ఇంతవరకు సాంఖ్యుల యొక్క వాదాన్ని తిరస్కరించి జగత్కారణం ప్రకృతి కాదు అని నిరూపించారు. ఇక అణువాదాన్ని నిరాకరిస్తున్నారు.

***సూత్రం - 134 "ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః"***

ప్రధాన కారణాన్ని నిరాకరించటం వల్ల మిగిలినవాదనలన్నీ నిరాకరించ బడినట్లే. సాంఖ్యుల వాదనలో ఉన్న లోపాలే అణువాదుల జగత్కారణంలోనూ ఉన్నాయి. కాబట్టి ఈవాదనకూడా నిరాకరించినట్లే. వాదన లన్నింటిలోకి సాంఖ్యుల వాదనే బలమైనది. అందుకనే సాంఖ్యులను తిరస్కరిస్తే మిగిలిన వాదనలు కూడా తిరస్కరించినట్లే అంటూ నాల్గవ పాదం పూర్తి చేశారు.

***దీంతో బ్రహ్మసూత్రాలలోని మొదటి అధ్యాయం పూర్తయింది.***

# రెండవ అధ్యాయం

## మొదటి పాదం

మొదటి అధ్యాయంలో సర్వేశ్వరుడైన పరమేశ్వరుడే సృష్టి, స్థితి, లయాలకు కారకుడు అని నిరూపించి, ఈ అధ్యాయంలో సాంఖ్య, యోగ, కణాది శాస్త్రాలతోను, వారి తర్కాలతోను, వేదాంత వాక్యాలలో కనుపించే విరోధాలను సమన్వయం చేస్తున్నారు. మొదటి పాదంలో మొత్తం పదమూడు అధికరణలు, ముప్ఫై ఏడు సూత్రాలు ఉన్నాయి.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | స్మృత్యధికరణము | శ్రుతులకు విరుద్ధమైన స్మృతుల నిరాకరణ | 2 |
| 2. | యోగప్రత్యుక్త్యధికరణము | యోగసిద్ధాంత నిరాకరణ | 1 |
| 3. | సవిలక్షణత్వాధికరణము | ఉపాదాన కారణమైనందున బ్రహ్మ స్వభావానికి భంగం లేదు | 8 |
| 4. | శిష్టాపరిగ్రహాధికరణము | శిష్టులు అంగీకరించని మతాన్ని నిరాకరణ | 1 |
| 5. | భోక్త్రాపత్యధికరణము | బ్రహ్మ, భోక్త అయిన జీవుడు, భోగ్యవిషయాలు | 1 |
| 6. | ఆరంభణాధికరణము | కార్యకారణాలకు తేడా లేదు | 7 |
| 7. | ఇతర వ్యపదేశాధికరణము | పరమేశ్వరునికి హితకణాది దోషప్రసక్తి | 3 |
| 8. | ఉపసంహారదర్శనాధికరణము | బ్రహ్మానికి బాహ్యసాధనాలు అవసరం లేదు | 2 |
| 9. | కృత్స్నప్రసక్త్యధికరణము | జగత్తువల్ల బ్రహ్మ పరిపూర్ణతకు బాధ్యత లేదు | 4 |
| 10. | సర్వోపేతాధికరణము | బ్రహ్మ యొక్క వివిధ శక్తులు | 2 |

| | | | |
|---|---|---|---|
| 11. | ప్రయోజనత్వాధికరణము | జగత్తు ఈశ్వరుని లీల | 2 |
| 12. | వైషమ్యనైరుణ్యాధికరణము | బ్రహ్మకు పక్షపాతం, దయ లేవు | 3 |
| 13. | సర్వధర్మోపపత్త్వధికరణము | సృష్టికి కావలసిన లక్షణాలన్నీ బ్రహ్మకు ఉన్నాయి | 1 |

మొత్తం అధికరణలు 13 సూత్రాలు 37. ఇప్పుడు మొదటి అధికరణ చూద్దాం.

## 1. స్మృత్యధికరణము

### (శ్రుతులకు విరుద్ధమైన స్మృతుల నిరాకరణ)

ఇక్కడ వేదవిరుద్ధమైన సాంఖ్యమతాన్ని ఖండిస్తున్నారు. ఈ అధికరణ పేరు **"స్మృత్యధికరణ"** దీంట్లో రెండు సూత్రాలున్నాయి.

కపిల మహర్షి సర్వజ్ఞుడు అంటారు. సృష్టి ఆరంభంలో పుట్టినటువంటి కపిలుడు, పుట్టుకతోనే మహాజ్ఞానియై, తన జన్మకు కారణము ఎవరో కనుక్కోవాలి అనుకున్నాడని పురాణాలు చెబుతున్నాయి. మరి అటువంటి కపిలుడు చెప్పిన విషయాలు కాదనటానికి లేదు. కపిల మహర్షి 'బ్రహ్మమే సమస్త జగత్తుకూ కారణము' అనే విషయంలో సందేహం వెలిబుచ్చాడు కదా!" అనేది ప్రశ్న.

నిజమే ! కపిలుడు చాలా గొప్పవాడు. సాంఖ్యస్మృతి వ్రాసినది ఆయనే. దానికి సమాధానంగానే వ్యాసుడు ఈ క్రింది సూత్రాలు చెబుతున్నాడు.

***సూత్రం – 135 "స్మృత్యనవకాశదోషప్రసఙ్గ ఇతి చేన్నాన్య స్మృత్యనవకాశదోష ప్రసంగాత్"***

లోకంలో అనేకమంది గొప్పవాళ్ళున్నారు. వాళ్ళలో మనువు మొదలైన వాళ్ళు కూడా కపిలునికి లాగానే స్మృతులను వ్రాశారు. అందుకని విషయనిర్ణయం చేసేటప్పుడు, కేవలం సాంఖ్యస్మృతిని మాత్రమే దృష్టిలో ఉంచుకుని నిర్ణయించాలి అనటం తప్పు. ఇలాంటప్పుడు అనేకమంది చెప్పినది అంగీకరించటమే మంచిది ఈ సృష్టికి కారణంబ్రహ్మ అనే మాటను స్మృతులు అంగీకరించాయి. వేదాలు స్వతః ప్రమాణాలు వీటిని శ్రుతులు అంటారు. వాటిలో ఉన్న అర్థాన్ని గ్రహించి, తేలిక భాషలో వ్రాసినవే స్మృతులు. కాబట్టి స్మృతులలో వ్రాసిన విషయం శ్రుతులకు కొంతవరకు తేడాగా ఉండవచ్చు. అందుచేత వేదంలో చెప్పిన దానికి విరుద్ధమైన

అర్థం వచ్చేటప్పుడు ఆ స్మృతులను అంగీకరించరాదు. ఈ జగత్తుకు కారణము బ్రహ్మ అనే విషయం అనేకచోట్ల చెప్పబడింది. భగవద్గీత, పురాణాలు కూడా ఈ విషయాన్నే చెబుతున్నాయి. కాబట్టి వేదార్థానికే ప్రామాణ్యత ఉన్నది కాని, దానికి విరుద్ధమైన సాంఖ్యస్మృతికి ప్రామాణ్యత లేదు.

***సూత్రం – 136 "ఇతరేషాం చానుపలబ్ధేః"***

సాంఖ్య స్మృతిలో ప్రధానమైనది ప్రకృతి. మహత్తు మొదలైన తత్త్వాలు లేవు. అయితే ప్రకృతియొక్క పరిణామాలుగా చెప్పబడుతున్న మహత్తత్వము, అహంకారము, తన్మాత్రలు మొదలైనవి సాంఖ్యులు కల్పించినవి. భూతాలు, ఇంద్రియాలు వేదంలో చెప్పబడ్డాయి. కాని ఆరవ ఇంద్రియము అని చెప్పి మహత్తును కల్పించారు సాంఖ్యులు. అందుచేతనే సాంఖ్యము అప్రమాణమైనది.

కాబట్టి వేదవిరుద్ధమైన స్మృతులను నిరాకరించి 'జగత్కారణము బ్రహ్మమే' అంటే పరాశక్తి అని చెప్పాలి.

## 2. యోగప్రత్యుక్త్యధికరణము (యోగసిద్ధాంత నిరాకరణ)

ఇక్కడ పతంజలి యోగశాస్త్రాన్ని కాదంటున్నారు. దీని పేరు **'యోగప్రత్యుక్త్యధికణము'.** ఇందులో ఒకే సూత్రం ఉంది.

***సూత్రం – 137 "ఏతేనయోగః ప్రత్యుక్తః"***

సాంఖ్యస్మృతిని ఆధారంగా చేసుకుని వచ్చిందే యోగశాస్త్రము. యోగశాస్త్రంలో కూడా వేదాలకు విరుద్ధంగా ప్రకృతినే జగత్కారణంగా అంగీకరించారు. అయితే సాంఖ్యస్మృతిని నిరాకరించటం వల్ల యోగశాస్త్రాన్ని కూడా నిరాకరించినట్లే అవుతుంది. సాంఖ్యమతాన్ననుసరించే యోగశాస్త్రమున్నప్పటికీ యోగశాస్త్రంలో ఈశ్వరుడున్నాడు. సాంఖ్య శాస్త్రంలో ప్రకృతే ప్రధానమైనది. ఈ రెండింటికీ తేడా ఇది ఒక్కటే. మిగిలినవన్నీ సమానమే. అయితే ఒక చిన్న అనుమానం. ఏమంటే ఉపనిషత్తులలో యోగాన్ని వివరించటం జరిగింది. యోగి ఏ రకంగా ఉండాలో కూడా చెప్పారు. **కఠోపనిషత్తు**లో సంపూర్ణమైన యోగవిధిని పొందిన నచికేతుడు బ్రహ్మత్వం పొందాడు అని చెప్పారు. కాబట్టి యోగాన్ని, యోగశాస్త్రాన్ని కాదనలేము కదా"

దానికి సమాధానం చెబుతున్నారు. యోగశాస్త్రం సాంఖ్యశాస్త్రాన్ని ఆధారంగా చేసుకుని చెప్పబడింది. సాంఖ్యులు ప్రకృతే జగత్కారణము అన్నారు. అదే యోగానికి కూడా ఆధారం. మరి సాంఖ్యశాస్త్రానికే ప్రమాణం లేనప్పుడు, యోగశాస్త్రానికి ప్రమాణం ఎలా ఉంటుంది? ఈ రెండింటికీ వేద ప్రమాణం లేదు. వేదప్రమాణాన్ని ఎప్పుడు అంగీకరించలేదో, అప్పుడే వీటికి ప్రమాణత్వం లేదు. ఇవి అప్రమాణాలు.

## 3. సవిలక్షణత్వాధికరణము

### (ఉపాదాన కారణం కాబట్టి బ్రహ్మ స్వభావానికి భంగం లేదు)

ఇక్కడ తార్కికులను ఖండిస్తున్నాడు. ఈ అధికరణ పేరు **'సవిలక్షణత్వాద్యధికరణము'** ఇందులో ఎనిమిది సూత్రాలున్నాయి.

సాంఖ్యస్మృతిని కాదన్నాము. కాని తార్కికుల మాటేమిటి? **బృహదారణ్యకోపనిషత్తు**లో ఆత్మ అనేది శ్రవణ, మనన, నిధిధ్యాసలకు తగినది అని చెప్పబడింది కదా! ఇక్కడ యుక్తులతో చింతనచేయటమే మననము అని తార్కికులు అంటున్నారు కదా" ఇది సందేహం. దీనికి సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 138 "న విలక్షణత్వాదస్య తథాత్వం చ శబ్దాత్"***

ఈ జగత్తు తనకు కారణమైన బ్రహ్మకన్న విలక్షణమైనది. కాబట్టి చేతనమైన బ్రహ్మమే జగత్కారణము అనటానికి వీలు లేదు. ఈ రకంగా తేడా ఉన్నది అనే విషయం కూడా వేదంవల్లనే తెలుస్తోంది.

ఏ లక్షణాలు గల పదార్థం నుండైనా, ఆ లక్షణాలు గల పదార్థాలే పుడతాయి. జడపదార్థం నుంచి జడపదార్థమే పుడుతుంది కాని చైతన్యము పుట్టదు. జడమైన మట్టి నుంచి, జడమైన కుండ మాత్రమే పుడుతుంది. అంతేగాని బంగారు ఆభరణాలు పుట్టవు. దారం నుండి వస్త్రం తయారవుతుంది. అంతేకాని కుండ తయారు కాదు. అలాగే జగత్తు అచేతనము, జడము. బ్రహ్మము చేతనము ప్రకాశ రూపము, ఆనందాత్మకము మరి జగత్తు అప్రకాశము, దుఃఖరూపము. బ్రహ్మ శుద్ధము, జగత్తు అపవిత్రము ఈ రెండింటికీ లక్షణాలు వేరు. కాబట్టి చేతనమైన బ్రహ్మనుంచి, జడమైన జగత్తు పుట్టదు. అందుచేత జగత్తుకు కారణం బ్రహ్మకాదు అని తార్కికులు వాదిస్తున్నారు.

అయితే బ్రహ్మకు, జగత్తుకు విరుద్ధ భావాలు లక్షణాలు లేవు. బ్రహ్మము చైతన్యము అలాగే జగత్తుకూడా చైతన్యమే. ఉపనిషత్తులలో అనేకచోట్ల మృత్తిక చెప్పింది. ఉదకం ఆలోచించింది. వాయువు చెప్పింది. అంటూ పంచభూతాలకు చేతనత్వము చెప్పబడింది. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉపకోశలుడికి అగ్నులు ఉపదేశం చేశాయి. అంతేకాదు ఇంద్రియాలు కూడా చేతనమే. **బృహదారణ్యకము, ఛాందోగ్యోప నిషత్తు**లలో ఇంద్రియాలు తమలో ఎవరు గొప్ప అని పోట్లాడుకున్నాయి అని చెప్పబడింది. ఈ రకంగా ఇంద్రియాలు తమలో తాము వాదులాడుకుని తీర్పు కోసం బ్రహ్మ దగ్గరకు వెళ్ళటం అనేది చేతనధర్మమే కాని జడత్వం కాదు. కాబట్టి జగత్తు, బ్రహ్మ రెండూ చేతనాలే. చేతనం నుండి జడము పుట్టదు. చేతనం నుండి చేతనమే పుడుతుంది. అని తార్కికుల వాదన.

***సూత్రం - 139 "అభిమానివ్యపదేశస్తు విశేషానుగతిభ్యామ్"***

ఉపనిషత్తులలో ఇంద్రియాలు మాట్లాడాయి అని చెప్పబడింది గదా. అక్కడ ఇంద్రియాలు అంటే ఇంద్రియాభిమానులైన దేవతలు. **ఐతరేయోపనిషత్తు**లో ఇంద్రియాభిమానులైన దేవతల గురించి చెప్పబడింది. నోటికి అధిదేవత అగ్ని. ముక్కుకు వాయువు అధిదేవత. అందుచేత ఇంద్రియాలు, భూతాలు చేతనాలు కావు.

***సూత్రం - 140 "దృశ్యతే తు"***

చేతనం నుంచి అనేక అచేతన పదార్థాలు పుట్టాయి. అలాగే అచేతనం నుంచి చేతనాలు పుట్టాయి. కాబట్టి అచేతనమైన జగత్తు చేతనంవల్ల వచ్చిందనటానికి సందేహం లేదు.

బ్రహ్మ చేతనము. జగత్తు అచేతనము. కాబట్టి జగత్తు బ్రహ్మచే సృష్టించబడలేదు అని చెప్పటానికి వీలులేదు. చేతనుడైన పురుషుడి నుండి అచేతనమైన గోళ్ళు, వెంట్రుకలు పుడుతున్నాయి. అలాగే అచేతనమైన పేడ, పెంటప్రోగుల నుండి తేళ్ళు, జర్రులు పుడుతున్నాయి. ప్రకృతి వికృతి అని రెండు ఉన్నాయి. ప్రకృతి యొక్క ధర్మాలన్నీ వికృతిలో ఉండవు. ఒకవేళ ఉంటే అది వికృతి కాదు. ప్రకృతి అవుతుంది. అలాగే చేతనుడైన పరమాత్మ యొక్క ధర్మాలన్నీ జగత్తులో ఉండనవసరం లేదు.

కాబట్టి ప్రకృతిలోని సమస్త వికారాలకు ప్రకృతి బ్రహ్మమే. బ్రహ్మవిషయంలో శ్రుతి (వేద) ప్రమాణం తప్ప, తర్కం పనికిరాదు. అయితే తర్కం పూర్తిగా పనికి రానిది కాదు. అది అవసరమైనంత వరకు, వేదప్రమాణమున్నంతవరకూ మాత్రమే ఉపయోగించాలి.

***సూత్రం - 141 "అసదితి చేన్న ప్రతిషేధ మాత్రత్వాత్"***

నామరూపాలు లేనట్టి బ్రహ్మము, నామరూపాలు ఉన్న జగత్తుకు కారణము. సృష్టికి ముందు అంతా బ్రహ్మమయమే.

***సూత్రం - 142 "అపీతౌ తద్వత్ప్రసంగాదస మఞ్జసమ్"***

ప్రళయకాలంలో కర్మపరిపక్వం చెందని ప్రాణులన్నీ తమ కర్మను తమతో పాటు మూటకట్టుకుని బ్రహ్మలో లీనమవుతున్నాయి. ఈ రకంగా జగత్తంతా బ్రహ్మలో లీనమయిపోతుంది. మరి అటువంటప్పుడు జగత్తుకు ఉన్నటువంటి అవలక్షణాలన్నీ బ్రహ్మకు సంక్రమిస్తాయి. కాబట్టి ఉపనిషత్తులలో చెప్పిన పరిశుద్ధము చేతనము అయిన బ్రహ్మ జగత్తుకు కారణము అని చెప్పటానికి వీలులేదనేది వీరి వాదన.

***సూత్రం - 143 "న తు దృష్టాన్తభావాత్"***

ఈ వాదన సరికాదు. ఎందుకంటే మట్టిలో కలిసిపోయిన కుండ తనకు కారణమైన మట్టిని కలుషితం చేయదు. అలాగే బంగారు ఆభరణాలు మళ్ళీ బంగారంలో కలసిపోయేటప్పుడు, ఆ బంగారాన్ని దూషితం చెయ్యవు.

ఈ సమస్తమూ బ్రహ్మమే. సృష్టి ఆరంభంలో అంతా బ్రహ్మమయంగానే ఉండేది. పరబ్రహ్మ స్వయంప్రకాశం గలవాడు. నిరాకారుడు. పుట్టుక, ప్రాణము మనస్సు లేనివాడు. పరిశుద్ధమైనవాడు. అతని నుండే ప్రాణము, మనస్సు, ఇంద్రియాలు, పంచభూతాలు పుడుతున్నాయి. అని **ముండకోపనిషత్తు** చెబుతున్నది. గారడీవాడు, తాను చేసే మాయద్వారా దూషితుడు కానట్లే, పరమాత్మ కూడా తనలో లీనమయిన జగత్తువల్ల దూషితుడు కాడు.

***సూత్రం - 144 "స్వపక్షదోషాచ్చ"***

సాంఖ్యులు చెప్పే దోషాలు వారి మతంలోనూ ఉన్నాయి. కాబట్టి దోషాలు, దోష పరిహారాలు రెండు మతాల్లోనూ సమానమే.

**సాంఖ్యుల ఆక్షేపణలు**

1. బ్రహ్మకన్న జగత్తు విలక్షణమైనది. ఆ రెండింటికీ ప్రకృతి వికృతుల భావం కుదరదు.

2. సృష్టికి పూర్వం అంతా అసత్తుగా ఉన్నది.

3. ప్రళయ కాలంలో జగత్తు అంతా బ్రహ్మలో లీనమయినప్పుడు, బ్రహ్మ అపరిశుద్ధమవుతుంది.

ఈ దోషాలు సాంఖ్యమతంలో కూడా ఉన్నాయి.

1. శబ్దహీనమైన ప్రకృతి నుండి శబ్దాదులు గల జగత్తు పుడుతోంది. ఈ రెండింటికీ కూడా ప్రకృతి వికృతి భావం కుదరదు.

2. ప్రళయ కాలంలో గుణాలు లేని ప్రకృతిలో గుణాలు గల జగత్తు లీనమయి నప్పుడు, ప్రకృతి దోషభూయిష్టమవుతుంది.

3. దోషాలన్నీ సాంఖ్యమతానికే వర్తిస్తాయి కాని ఉపనిషత్వానికి వర్తించవు.

***సూత్రం - 145 "తర్కాప్రతిష్ఠానాదాన్యథాను మేయమితి చేదేవమప్యనిర్మోక్ష ప్రసఙ్గః"***

తర్కం ఒప్పుకోకపోయినప్పటికీ బ్రహ్మమందు వేదాంతవాక్యాలు సమన్వయించటంలో ఆక్షేపణ ఉండదు. ఒక తార్కికుడు చెప్పే అర్థము వేరొక తార్కికుడు ఒప్పుకోడు. కాబట్టి తర్కం నిలకడ లేనిది అందుచేత వేదాంత సిద్ధాంతం ప్రకారం చెప్పిన బ్రహ్మమే జగత్కారణము అనటంలో సందేహం లేదు.

ఏ విధమైన సందేహాలకు తావు లేకుండా ఉండేటటువంటి జ్ఞానమే తత్త్వజ్ఞానము. ఇందులో విరుద్ధ భావాలుండవు. వేదాలను అనుసరించకుండా చెప్పే జ్ఞానము సమ్యజ్ఞానము కాదు. అటువంటి జ్ఞానంవల్ల మోక్షం రాదు. కాబట్టి **వేదప్రమాణం లేని తర్కము పనికిరాదు.** ఈ జగత్తుకు బ్రహ్మమే ఉపాదాన కారణము అందులో ఏ మాత్రం సందేహం లేదు.

# 4. శిష్టాపరిగ్రహణాధికరణము

## (శిష్టులు అంగీకరించని మతాన్ని నిరాకరిస్తున్నారు)

ఏ సిద్ధాంతమైనా సరే శిష్టులు ఒప్పుకోకపోతే, అందరూ ఒప్పుకోనట్లే అంటున్నారు నాల్గవ అధికరణలో. దీని పేరు **శిష్టాపరిగ్రహణాధికరణము**. ఇందులో ఒకటే సూత్రముంది.

***సూత్రం – 146 "ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః"***

ఏ సిద్ధాంతాన్నైనా సరే శిష్టులు ఖండించినట్లైతే, ఆ సిద్ధాంతాన్ని అందరూ తిరస్కరించినట్లే.

ఈ జగన్నిర్మాణానికి కారణము ప్రకృతి అన్నారు సాంఖ్యులు. ఇలాగే పరమాణువులు కారణమని అణువాదులంటారు. ఈ సిద్ధాంతాలన్నింటినీ మనువు, వ్యాసుడు వంటి మహానుభావులు ఖండించారు. కొంతవరకు ఈ వాదనలు వేదాలను అనుసరించి ఉన్నప్పటికీ, అవి మొత్తంమీద వేదవిరుద్ధములే. వీటిలో ముఖ్యమైనది సాంఖ్యము. దాన్నే తిరస్కరించారు కాబట్టి మిగిలిన వాటిని కూడా తిరస్కరించినట్లే.

ఈ రకంగా సాంఖ్యసిద్ధాంతాన్ని ఖండించటం ద్వారా వేదాలలో లేనటువంటి కణాద (వైశేషిక దర్శనం), గౌతమ (న్యాయదర్శనం), యోగ, బౌద్ధ, మతసిద్ధాంతా లన్నింటినీ ఖండించినట్లే అవుతుంది. కాబట్టి శిష్టులు అంగీకరించనటువంటి మతాన్ని నిరాకరించినట్లే.

# 5. భోక్త్రాపత్త్యధికరణము

## (బ్రహ్మ, భోక్త అయిన జీవుడు, భోగ్య విషయాలు)

ఇప్పుడు భోక్త భోగ్య విభాగాన్ని వివరిస్తున్నారు ఐదవ అధికరణలో. దీనిపేరు **భోక్త్రాపత్త్యధికరణము** ఇందులో ఒకే సూత్రం ఉంది.

***సూత్రం – 147 "భోక్త్రాపత్తేరవిభాగశ్చేత్స్యాల్లోకవత్"***

భోక్త అంటే చేతనుడైన జీవుడు. భోగ్యము అంటే శబ్దాది విషయ సమూహాము. బ్రహ్మమే జగత్తుకు ఉపాదాన కారణము. కాబట్టి భోగ్యవస్తువునకే భోక్తృత్వము

కూడా లభిస్తోంది. అందుచేత భోక్త భోగ్య విభాగం కుదరదు కదా!" ఇది అనుమానం. దీనికి సమాధానం చెబుతున్నారు.

బ్రహ్మము ఈ జగత్తుకు ఉపాదాన కారణము. భోక్తరూపంలో గాని, భోగ్యరూపంలో గాని కనిపించే జగత్తంతా బ్రహ్మకన్న భిన్నమైనది కాదు. అందువల్ల భోక్త భోగ్యము అనే విభాగము ఉండదు.

కుండ, మూకుడు వీటిలో ఉన్నది మట్టే. ఈ వస్తువులలో తేడా ఉన్నప్పటికీ వాటికి కారణమైన మట్టిలో తేడా లేదు. అలాగే ఈ జగత్తుకు బ్రహ్మ ఉపాదాన కారణము. ఈ జగత్తు, బ్రహ్మ రెండూ వేరు కాదు.

## 6. ఆరంభణాధికరణము (కార్యకారణాలకు తేడా లేదు)

జగత్తుకు బ్రహ్మకు తేడాలేదని తేల్చి చెప్పి ఇప్పుడు కార్యకారణాలకు కూడా తేడా లేదు అంటున్నారు ఆరవ అధికరణలో. దీనిపేరు **'ఆరంభణాధికరణము'** ఇందులో ఏడు సూత్రాలున్నాయి.

జగత్తుకు, బ్రహ్మకు భేదం లేదు అన్నారు. దీనివల్ల జగత్తుకు భోక్తృత్వం వస్తోందనే దోషాన్ని కూడా పరిహరించారు. కాని లోకంలో కనిపించే మట్టి, కుండ ఉదాహరణలుగా చెప్పటంవల్ల కార్యకారణాలకు భేదం కనిపిస్తోంది కదా! కాబట్టి జగత్తుకు, బ్రహ్మకు భేదం ఎందుకు చెప్పకూడదు?" ఇది సందేహం. సమాధానం చూడండి.

*సూత్రం - 148 "తదనన్యత్వమారమ్భణశబ్దాదిభ్యః"*

కార్యము జగత్తు, కారణము బ్రహ్మ. ఈ రెండింటికీ అభిన్నత్వమున్నదనే విషయం వేదాలలో చెప్పబడింది.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానాన్ని వివరిస్తూ మట్టిని గురించి తెలుసుకుంటే ఆ మట్టితో చేసే వివిధరకాల వస్తువులకు పేర్లలోను ఉపయోగాలలోను తేడా ఉన్నప్పటికీ వాటిని గురించి తెలుస్తుంది. ఎందుకంటే అవన్నీ పేరుకు మాత్రమే వికారాలు. మట్టి అనేదే సత్యం మట్టితో తయారైన పాత్రల రూపంలో తేడా ఉన్నప్పటికీ, అవి మట్టికన్న భిన్నమైనవి కాదు. అలాగే బంగారము,

ఆభరణాలు, తేజము, జలము, అన్నము అనే వాటిని బ్రహ్మకు కార్యంగా చెప్పినప్పుడు, కార్య రూపంలో ఉన్న ఇవి తమకు కారణ రూపమైన బ్రహ్మకన్న భిన్నమైనవి కాదు. ఎప్పుడూ వికారాలనేవి నామమాత్రం. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు సృష్టి అంతా ఆత్మస్వరూపం. అదే సత్యం. అదే ఆత్మ. అదే నీవు ఈ సమస్తమూ ఆత్మపదార్థమే. ఇక్కడ భిన్నమైనది ఏదీ లేదు. కాబట్టి కారణము సత్యం. కార్యం వికారం. అందుకే కారణమయిన బ్రహ్మసత్యం కార్యమైన జగత్తుమిధ్య. కార్యకారణాలకు భేదం లేదు.

***సూత్రం – 149 "భావే చోపలబ్ధేః"***

కారణమున్నప్పుడే కార్యము లభించటం జరుగుతుంది. అంటే మట్టి ఉంటేనే కుండ తయారవుతుంది. బంగారముంటేనే ఆభరణాలు తయారవుతాయి. కాబట్టి కార్యకారణాలకు భేదం లేదు.

***సూత్రం – 150 "సత్త్వాచ్చావరస్య"***

కార్యము అంటే వస్తువు రావటానికి ముందు కూడా కారణమున్నది. కాబట్టి కార్యకారణాలకు భేదం లేదు. కుండ తయారవకముందే మట్టి ఉన్నది. కుండ తయారయిన తరువాత కూడ అది మట్టికన్న వేరు కాదు.

సృష్టికి ముందు అంతా ఆత్మమయంగానే ఉండేది మట్టి నుండి కుండ పుట్టినట్లే, బ్రహ్మ నుండి జగత్తు పుట్టింది.

***సూత్రం – 151 "అసద్వ్యపదేశాన్నేతి చేన్న ధర్మాన్తరేణ వాక్యశేషాత్"***

సృష్టికి ముందు అసత్తు అని చెప్పటంవల్ల కార్యం కారణరూపంలో లేదు అంటారు. ఇది సరికాదు. ఎందుకంటే కేవలము అది అసత్తు కాదు.

***సూత్రం – 152 "యుక్తేః శబ్దాన్తరాచ్చ"***

యుక్తి విషయంగా ఆలోచిస్తే పెరుగుకు పాలు, కుండకు మట్టి, ఆభరణానికి బంగారము కారణము. పెరుగు కావాలనుకున్నవాడు పాలను కోరతాడు అంతేకాని మట్టిని కోరడు. సృష్టికి అంటే పుట్టటానికి ముందు పెరుగు, పాలరూపంలో ఉంది. అలాగే కుండ కావాలనుకునేవాడు మట్టిని, ఆభరణాలు కావాలనుకునే వాడు బంగారాన్ని కోరతాడు. అంతేకాని అసత్తును కోరడు. కార్యమనేది ఉత్పత్తికి పూర్వం కారణరూపంలోనే ఉంది. అందుచేత కార్యకారణాలకు భేదం లేదు.

*సూత్రం – 153 "పటవచ్చ"*

బట్టచుట్టగా చుట్టబడి ఉన్నా, పరచబడి ఉన్నా అది బట్టే. అంటే ఒక్క ఆకారమే మారుతోంది. మూలంలో మార్పుండదు. అలాగే మట్టి, కుండ విషయంలో కూడా. అయితే వస్త్రం చుట్టబడి ఉన్నప్పుడు దాని పొడవు, వెడల్పు, నాణ్యత తెలియవు. అది పరచినప్పుడు మాత్రమే అవి తెలుస్తాయి. అలాగే మట్టిగా ఉన్నప్పుడు తెలియని విషయాలు కుండ తయారైన తరువాత తెలుస్తాయి. అంతేకాని కార్యకారణాలయిన కుండ, మట్టిలలో భేదం లేదు.

*సూత్రం – 154 "యథా చ ప్రాణాది"*

ప్రాణాయామం చేస్తున్నప్పుడు ఊపిరి బిగపడతారు. అంటే వాయువును కుంభిస్తారు. అప్పుడు, అపాన, వ్యాన, ఉదానములనే తేడాలు వాయువుకు ఉండవు. అప్పుడు ప్రాణం మాత్రమే ఉంటుంది. ఎందుకంటే వాయుప్రసరణ జరగటంలేదు కాబట్టి. ప్రాణాయామం ఆపేసినప్పుడు అవన్నీ యథాతథంగా వస్తాయి. అంతమాత్రం చేత వీటిమధ్య తేడా ఉన్నదని కాదు. కార్యకారణాల మధ్య ఏ మాత్రం భేదం లేదు.

## 7. ఇతరవ్యపదేశాధికరణము (పరమేశ్వరుడికి దోషప్రసక్తి)

కర్మలు చేసేటప్పుడు కొన్ని దోషాలు దొర్లుతాయి. జీవాత్మ పరమాత్మ ఒకటే. అలాంటప్పుడు జీవి చేసిన దోషాలు పరమాత్మకు అంటవా? అనే విషయాన్ని వివరిస్తున్నారు ఏడవ అధికరణలో దీని పేరు **ఇతరవ్యపదేశాధికరణము** ఇందులో మూడు సూత్రాలున్నాయి.

కార్యకారణ భేదం లేదన్నారు బాగుంది. అయితే జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అంటున్నారు కదా. జీవి కర్మలు చేస్తుంటాడు. ఆ కర్మలవల్ల అతనికి జనన మరణాదులు సంభవిస్తుంటాయి. ఈ కర్మలలో కొన్ని దోషములు కూడా ఉంటాయి. జీవాత్మ, పరమాత్మ ఇద్దరూ ఒకటే అయినందున జీవి చేసిన దోషాలు పరమేశ్వరుడికి కూడా సంక్రమిస్తాయి కదా. అప్పుడు పరబ్రహ్మ కూడా దోషభూయిష్టుడు కాడా?" అనేది అనుమానం. దీనికి సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 155 "ఇతర వ్యపదేశాద్ధితాకరణాది దోషప్రసక్తిః"***

జీవుడికి బ్రహ్మత్వం చెప్పటంవల్ల, బ్రహ్మకు హితకరణాది దోషం వస్తుంది అంటారు.

తత్త్వమసి అనటంవల్ల జీవుని యందలి దోషాలు బ్రహ్మకు అంటుతాయని, జీవాత్మా, పరమాత్మా రెండూ ఒక్కటే అనటంవల్ల జీవికుండే లక్షణాలన్నీ బ్రహ్మకు ఆపాదించబడతాయి. అప్పుడు బ్రహ్మ దోష భూయిష్టుడౌతాడు. కాబట్టి అతడు జగత్కారణము అనటం వీలుపడదు. అని వాదము. **ఛాందోగ్యపనిషత్తు**లో ఉద్దాలకుడు శ్వేతకేతూ 'తత్త్వమసి' నీవే ఆత్మవి అంటాడు. అలాగే **ఐతరేయోపనిషత్తు**లో మనుషులను సృష్టించి వారి దేహంలో ప్రవేశించాడు అని తెలుస్తోంది. ఈ కారణంచేత బ్రహ్మకున్న సృష్టికర్తృత్వం జీవికి కూడా వస్తోంది. అప్పుడు జీవుడికి ఉన్న జన్మజరాదులు అనే దోషాలు బ్రహ్మకు కూడా వర్తిస్తాయి కాబట్టి బ్రహ్మ జగత్కారణం అనటానికి వీలు లేదు అనివారి వాదన.

***సూత్రం - 156 "అధికం తు భేదనిర్దేశాత్"***

సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు అయిన బ్రహ్మ జగత్కర్త. కాబట్టి అతనికి హితాహితీకరణ దోషాలు ఉండవు.

ఆత్మదర్శనం కావాలంటే దానిని గురించి వినాలి. తెలుసుకోవాలి. మననం చెయ్యాలి. ఆత్మ మననం చెయ్యదగ్గది. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఆత్మను గురించి చెబుతూ సుషుప్తిలో అది సత్ శబ్ద వాచ్యునితో కూడి ఉంటుంది అన్నారు. మరణ కాలంలో జీవాత్మ పరమాత్మ చేత అధిష్టితమై శబ్దం చేస్తూ పోతుంది. ఈ రకంగా కర్త కర్మ భేదం వల్ల జీవుడికి బ్రహ్మకు భేదం చెప్పారు. ఈ భేదం ఉపాధి (శరీరం)కి సంబంధించినది మాత్రమే. పరబ్రహ్మకు హితము అహితము అనేవి లేవు. ఆయన నిర్గుణుడు. నిర్వికారుడు, ప్రేమ, దయ, అభిమానము ఏవీ లేనివాడు. కాబట్టి ఆయనకు దోషాలు అంటవు.

***సూత్రం - 157 "అశ్మాదివచ్చ తదనుపపత్తిః"***

ఒకేరూపం గల బ్రహ్మ ఈ జగత్తును నిర్మించినప్పుడు కార్యాల్లో వైచిత్ర్యము ఉండకూడదు అని వారి వాదన.

భూమిలో నుంచి రాళ్ళు పుడుతున్నాయి. వాటిలో కొన్ని బండరాళ్ళు. కొన్ని కంకరరాళ్ళు, కొన్ని వజ్రాలు ఈ రకంగా వాటి విలువలో తేడాలున్నాయి. భూమిమీద పెరిగే మొక్కలలో కూడా ఈ తేడా ఉన్నది. ఒకచెట్టు కాయలు తియ్యగా ఉంటే, వేరొక దానివి పుల్లగా ఉంటాయి. మనం తీసుకునే ఆహారం జీర్ణమయి రక్తము, మాంసము, చర్మము, ఎముకలు, మజ్జ, గోళ్ళు, వెంట్రుకలుగా మారుతుంది. వీటన్నింటికీ రూపంలోను, ఉపయోగంలోనూ భేదం ఉన్నది. అదే విధంగా ఒకే పరమాత్మ నుంచి పుట్టిన జగత్తులోనూ వైవిధ్యం ఉంటుంది. ఇందులో తప్పులేదు ఇదేమీ దోషం కాదు.

## 8. ఉపసంహారదర్శనాధికరణము

### (బ్రహ్మానికి బాహ్యసాధనాలు అవసరం లేదు)

జగత్తు సృష్టించటానికి బ్రహ్మకు ఏ రకమైన సాధనాలు అవసరం లేదు అంటున్నారు ఎనిమిదవ అధికరణలో దీని పేరు. **'ఉపసంహార దర్శనాధికరణము'.** ఇందులో రెండు సూత్రాలున్నాయి.

కుమ్మరివాడు కుండలు చెయ్యాలి అంటే కేవలము మట్టి మాత్రమే కాకుండా కుమ్మరిసారె, కర్ర, నీరు వంటి ఇతర సాధనాలు కావాలి కదా. మరి జగత్తును సృష్టి చేసే బ్రహ్మకు మాత్రం ఈ రకమైన ఇతర సాధనాలు అవసరం ఉండవా?" ఇది సందేహం. దీనికి సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 158 "ఉపసంహారదర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి"***

పనిచేసేవాడు సాధనాలను ప్రోగు చేస్తాడు. మరి బ్రహ్మకు ఇతర సాధనాలుండవా? అంటే కుమ్మరివాడు ఇతర సాధనాలు ఉపయోగిస్తాడు. మరి బ్రహ్మకు ఇతర సాధనాలు ఏవీ లేవు. కాబట్టి జగత్తుకు కారణం బ్రహ్మకాదు అనకూడదు. ఉపకరణాలు లేకపోయినా లోకంలో పని జరుగుతుంది. పాలు పెరుగుగా మారాలంటే ఏ సాధనము అవసరం లేదు. పాలను వేడి చేస్తున్నాం అనకండి. అవి తొందరగా తోడుకోవటానికి వేడి చేస్తున్నాం అంతే. వేడి చెయ్యకపోయినా పెరుగవుతుంది. పాలల్లో పెరుగయ్యే గుణం లేకపోతే వాటిని వేడి చేసినా, ఇగరపెట్టినా పెరుగవదు. నీటిని వేడి చేస్తే పెరుగవదు. మట్టిని వేడే

చేస్తే పెరుగవదు. ఆ గుణం లేకపోతే దాన్ని ఏం చేసినా అది పెరుగవదు. అలాగే పరమాత్మ సర్వశక్తి సంపన్నుడు. సర్వగుణ సంపన్నుడు. కాబట్టి అతడికి ఇతర సాధనాలు ఏవీ అవసరం లేదు.

బ్రహ్మకు కార్యము కారణము లేదు. అతనితో సమానమైన వారు గాని, అతనికన్న అధికులు గాని లేరు. కాబట్టి అతడికి వేటి సాయము అవసరం లేదు.

***సూత్రం - 159 "దేవాదివదపి లోకే"***

మంత్రశాస్త్రంలోను, ఇతిహాసాల్లోనూ కూడా దేవతాదులు అసహాయులై కార్యం చేస్తున్నారని చెప్పబడింది.

వేదాలు, పురాణాలు, ఇతిహాసాలలో దేవతలు, పిత్రుదేవతలు ఏ సాధన సంపత్తి లేకుంవీడానే సంకల్పబలం మాత్రంచేతనే మహత్తర కార్యాలు చేశారని చెప్పబడింది. సాలెపురుగు ఏ సహాయం లేకుండానే గూడు నిర్మిస్తుంది. కొంగ శుక్ర వీర్యాలు లేకుండానే గర్భధారణ చేస్తుంది. అలాగే బ్రహ్మకూడా ఏ సహాయము, సాధన సంపత్తి లేకుండానే జగన్నిర్మాణము చేస్తున్నాడు.

## 9. కృత్స్నప్రసక్త్యధికరణము

### (జగత్తువల్ల బ్రహ్మపరిపూర్ణతకు బాధ్యత లేదు)

పాలు పెరుగుగా మారినట్లే, బ్రహ్మ జగత్తుగా మారుతున్నాడు అన్నారు ఇది పూర్తి పరిణామమా? లేక కొంత భాగమేనా? అనే విషయం వివరిస్తున్నారు తొమ్మిదవ అధికరణలో. దీని పేరు **కృత్స్నప్రసక్త్యధికరణము** ఇందులో నాలుగు సూత్రాలున్నాయి.

***సూత్రం - 160 "కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వ శబ్ద కోపోవా"***

అవయవాలు లేని బ్రహ్మ గనక పరిణామం చెందినట్లైతే, బ్రహ్మ పూర్తిగా కార్యరూపంలో పరిణామం చెందినట్లవుతుంది. కొంత భాగమే అయితే బ్రహ్మకు అవయవాలు వచ్చి, బ్రహ్మ నిరవయవుడు అన్న శ్రుతికి విరోధం వస్తుంది. ఏది ఎలా చూచినా బ్రహ్మ అనిత్యమవుతుంది. అందుచేత బ్రహ్మ జగత్తుకు ఉపాదాన కారణము కాలేదు. అని వారి వాదన.

బ్రహ్మపూర్తిగా పరిణామం చెందాడు అంటే జగత్తు బ్రహ్మ రెండూ ఒక్కటే. కొంత భాగమే పరిణామం చెందాడు అంటే, జగత్తు కాక బ్రహ్మ ఇంకా కొంత

భాగం ఉన్నాడు అని. అంటే బ్రహ్మసాకారుడు. ఏదైనప్పటికీ వేదాలలో చెప్పిన విషయాలకు విరుద్ధమవుతుంది. కాబట్టి జగత్తుకు బ్రహ్మ ఉపాదాన కారణము కాదు. అని అంటారు.

***సూత్రం - 161 "శ్రుతేస్తు శబ్దమూలత్వాత్"***

బ్రహ్మము వేద ప్రమాణమైనది. కాబట్టి ఆ దోషం అంటదు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో "శుద్ధ బ్రహ్మ కార్య బ్రహ్మకన్న గొప్పది. పాంచభౌతికమైన జగత్తంతా శుద్ధ బ్రహ్మయొక్క ఒక పాదమే. మిగిలిన మూడు పాదాలు ఆ పరబ్రహ్మలోనే ఉన్నాయి. గాయత్రి ద్వారా ప్రతిపాదించబడి, మూడు పాదాలు గల అమృత స్వరూపమైన బ్రహ్మ ఇదే. ఆ పురుషునికి బయటా, లోపలా కూడా ఉన్న ఆకాశము ఒకటే. అని చెప్పబడింది. బ్రహ్మనికి వేదప్రమాణమున్నది. అందుచేత వారు చెప్పే దోషం బ్రహ్మకు అంటదు.

***సూత్రం - 162 "ఆత్మని చైవం విచిత్రాశ్చ హి"***

బ్రహ్మలో ఇన్ని రకాల వస్తువులు సృష్టించబడినట్లే, స్వప్నాన్ని చూసే ఆత్మలో కూడా అనేక రకాలయిన సృష్టులు చెప్పబడ్డాయి.

ఈ జగత్తంతా బ్రహ్మయొక్క పరిణామము. కాబట్టి స్వప్న ప్రపంచంలాగా మాయతో కూడినది. ఈ జగత్తుకు బ్రహ్మఉపాదాన కారణమే అయినప్పటికీ, స్వప్నావస్తలోని సాక్షి వంటివాడు. కాబట్టి అతడికి దోషాలు అంటవు. గారడీ వాడి రూపం నాశనం కాకుండానే, అతడు సృష్టించిన అనేక వస్తువులు కనిపించినట్లుగానే బ్రహ్మలో కూడా ఈ విచిత్ర సృష్టులు కనిపిస్తున్నాయి.

***సూత్రం - 163 "స్వపక్షదోషాచ్చ"***

ఈ దోషము సాంఖ్యులు చెప్పే మతంలో కూడా ఉన్నది. సాంఖ్యులు ప్రధానాన్ని జగత్కారణంగా చెబుతారు. ఆ ప్రధానము కూడా నిరవయవము, అపరిచ్ఛిన్నము అది సావయవము, పరిచ్ఛిన్నము అయిన జగత్తుకు కారణము అవుతోంది.

ఒకే దోషం అన్ని మతాలలోనూ ఉంది కాబట్టి దానిని లెక్కించనవసరం లేదు. ఈ జగత్తుకు బ్రహ్మ ఉపాదాన కారణమే. జగత్తువల్ల బ్రహ్మపరిపూర్ణతకు బాధ్యత లేదు.

## 10. సర్వోపేతాధికరణము (బ్రహ్మ యొక్క వివిధ శక్తులు)

బ్రహ్మ విచిత్రమైన కార్యశక్తి గలది. ఆ విషయాన్ని వివరిస్తున్నారు పదవ అధికరణలో. దీని పేరు **సర్వోపేతాధికరణము**. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

బ్రహ్మ విచిత్రమైన కార్యశక్తి గలది అని చెప్పారు కదా ! ఆ విషయం ఎలా తెలుస్తుంది?" ఇది అనుమానం. సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 164 "సర్వోపేతా చ తద్దర్శనాత్"***

వేదాలలో పరదేవత శక్తిసంపన్నమైనది అని చెప్పబడింది.

**ఛాందోగ్యోపనిషత్తు**లో పరమాత్మ స్థూల సూక్ష్మ రూపాలు లేనివాడు. చైతన్య స్వరూపుడు సత్యసంకల్పుడు. సర్వవ్యాపి, సమస్త కర్మలు స్వరూపంగా గలవాడు. సర్వకాముడు. సమస్త గంధములు, రసములు గలవాడు. జగత్తును వ్యాపించి ఉండేవాడు అని చెప్పబడింది. **బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు గార్గికి సమాధానం చెబుతూ "బ్రహ్మయొక్క శాసనం వల్లనే సూర్యచంద్రులు తమ స్థానాలలో ఉన్నారు" అంటాడు. **ముండకోపనిషత్తు**లో పరబ్రహ్మ స్వయంప్రకాశి నిరాకారుడు. బాహ్యాభ్యంతరాల్లో ఉండేవాడు. పుట్టుక, ప్రాణము లేనివాడు అని చెప్పబడింది. కాబట్టి బ్రహ్మకు విచిత్రమైన కార్యశక్తి ఉన్నది.

***సూత్రం - 165 "వికరణత్వాన్నేతి చేత్తదుక్తమ్"***

బ్రహ్మకు ఇంద్రియాలు లేవు. నిరాకారుడు. నిరవయవుడు అని చెప్పబడింది. అలాంటి బ్రహ్మ జగత్తును ఏ విధంగా ఉత్పత్తి చేస్తాడు? అని వారి ప్రశ్న.

బ్రహ్మనిరాకారుడనే మాట నిజమే. అవయవాలు లేనివాడు. అయినప్పటికీ సర్వజ్ఞుడు. సర్వశక్తిమంతుడు. కాబట్టే జగదుత్పత్తి చేస్తాడు.

## 11. ప్రయోజనత్వాధికరణము (జగత్తు ఈశ్వరుని లీల)

జగత్తంతా ఈశ్వరుని లీల అని పదకొండవదైన ప్రయోజనసత్త్వాధికరణలో వివరిస్తున్నారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

***సూత్రం - 166 "న ప్రయోజనవత్త్వాత్"***

ప్రవృత్తి అనేది ప్రయోజనాన్ని ఆశించి ఉంటుంది. పరబ్రహ్మ నిత్యతృప్తుడు. అందుచేత ప్రయోజనం ఉండదు. ప్రవృత్తి ఉండదు. అని వాదిస్తారు. అంటే ఈ

జగత్తంతా బ్రహ్మచేతనే సృష్టించబడుతోంది. ఎవరు ఏ పని చేసినా కొంత ప్రయోజన ముంటుంది. **బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి ఈ విషయమే చెబుతాడు. ప్రయోజనం లేనిదే ఎవరూ ఏ పనీ చెయ్యరు. పరబ్రహ్మ ఏ ప్రయోజనం ఆశించి ఈ సృష్టి చేశాడు? అన్నది ప్రశ్న.

***సూత్రం - 167 "లోకవత్తు లీలాకైవల్యమ్"***

లోకంలో గొప్పవారు ఏ ప్రయోజనం ఆశించకుండానే పనులు చేస్తారు. ఏ ప్రయోజనం ఆశించకుండానే గాలి వీస్తుంది. నదులు ప్రవహిస్తాయి. సూర్యుడు కాంతినిస్తాడు. అలాగే పరమాత్మ కూడా ఏ అపేక్ష లేకుండానే ఈ సృష్టి చేస్తున్నాడు. ఈ జగత్తు అంతా ఈశ్వరలీల.

## 12. వైషమ్యనైరుణ్యాధికరణము (బ్రహ్మకు పక్షపాతము దయ లేవు)

బ్రహ్మకు ఏ విధమైన దయ, పక్షపాతము లేవని పన్నెండవదైన **వైషమ్యనైర్ఘృణ్యాధి కరణం**లో వివరిస్తున్నారు. ఇందులో మూడు సూత్రాలు ఉన్నాయి.

పరమాత్మ ప్రాణులను వారివారి కర్మలను బట్టి సృష్టిస్తున్నాడా? లేదా? కర్మలను బట్టి సృష్టిస్తే సృష్టి కర్మాధీనమవుతుంది. అలా కాకుండా అంటే కర్మలను పరిగణించకుండా సృష్టిస్తున్నాడు అంటే బ్రహ్మకు పక్షపాతము అంటుకుంటుంది. ఎందుకంటే పశువులు, పక్షులుగా పుట్టిన ప్రాణులు హింసింపబడుతున్నాయి. దేవతలు విలాసవంతులు ఈ విషయాన్ని వివరిస్తున్నారు.

***సూత్రం - 168 "వైషమ్యనైర్ఘృణ్యేన సాపేక్షత్వాత్తథా హి దర్శయతి"***

పరమేశ్వరుడికి పక్షపాతము, నిర్దయత్వము అనే లక్షణాలు, దోషాలు లేవు. జీవులను కర్మానుసారమే సృష్టిస్తాడు. ఇలా చెయ్యటంవల్ల సృష్టి కర్మాధీనమవుతుంది. అనీశ్వరత్వం కలుగుతుంది అనే మాట తప్పు.

పరబ్రహ్మ జీవుల ధర్మాధర్మాల ననుసరించి, సాపేక్షుడై ఈ విషమసృష్టి నిర్మాణం సాగిస్తున్నాడు. పరమేశ్వరుడు మేఘం వంటివాడు. అన్ని పంటలకు వర్షాన్నిస్తాడు. ధాన్యంలో ఉండే తేడా, ఆ విత్తనాలలోనే ఉన్నది. భగవద్గీతలో చెప్పినట్లుగా **పరమేశ్వరుని ఎవరు ఏ విధంగా సేవిస్తారో, వారికి ఆ విధమైన ఫలమే వస్తుంది.**

***సూత్రం - 169 "న కర్మావిభాగాదితి చేన్నానా దిత్వాత్"***

సృష్టికి పూర్వం ఏ విధమైన భేదమూ లేదు. కాబట్టి కర్మ అనేది లేదు. అలాంటప్పుడు ఈ విషమ సృష్టి ఎలా జరిగిందనేది ప్రశ్న. దీనికి సమాధానం.

సంసారమనేది అనాది అయింది. బీజాంకురములు లాగా సృష్టి, కర్మలకు కార్యకారణ భావం ఉన్నది. అందుచేత కర్మను అనుసరించే సృష్టి జరిగింది.

ప్రళయం జరిగినప్పుడు కర్మపరిపక్వంకాని జీవులు తమ కర్మను తమతో మూటు కట్టుకుని పరమేశ్వరునిలో లీనమయినాయి. మళ్ళీ సృష్టి జరిగినప్పుడు తమ కర్మానుసారము జన్మిస్తున్నాయి.

***సూత్రం - 170 "ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ"***

సృష్టి అనేది చాలా కాలం నుంచీ జరుగుతున్నది. చెట్టు లేనిదే విత్తు లేదు. విత్తు లేనిదే చెట్టు లేదు. అలాగే కర్మలేనిదే జన్మలేదు. జన్మలేనిదే కర్మలేదు. ఈ రెండూ ఒక దానిని ఒకటి ఆశ్రయించుకుని ఉంటాయి. **ప్రశ్నోపనిషత్తు**లో చెప్పినట్లుగా ప్రజాపతి సంతానాన్ని పొందాలనే కోరిక గలవాడై తపస్సు చేశాడు. ఇక్కడ తపస్సు అంటే పూర్వకల్పంలో తాను చేసిన సృష్టిని ధ్యానించటము.

కాబట్టి సృష్టి వెనుకటి కల్పంలో లాగానే జరిగింది. ఈ సృష్టిలో బ్రహ్మకు ఏ విధమైన పక్షపాతమూ లేదు. జీవులన్నీ తమ కర్మానుసారమే ఉద్భవిస్తాయి. ఏ రకమైన కర్మా చెయ్యనివాడికి మళ్ళీ పుట్టుకే లేదు.

# 13. సర్వధర్మోపపత్త్యధికరణము

## (సృష్టి చెయ్యటానికి కావలసినవన్నీ బ్రహ్మకున్నాయి)

జగత్తును సృష్టించటానికి ఎవరి సహాయము అవసరం లేదు. సృష్టి చెయ్యటానికి కావలసినవన్నీ బ్రహ్మకున్నాయి అంటున్నారు పదమూడవదైన **సర్వధర్మోప పత్త్యధికరణము**లో ఇందులో ఒకటే సూత్రం ఉంది.

***సూత్రం - 171 "సర్వధర్మోపపత్తేశ్చ"***

జగత్తును సృష్టించటానికి కావలసిన సర్వజ్ఞత్వము, జగత్కారణత్వము, సర్వశక్తిత్వము అనే సమస్త ధర్మాలు పరబ్రహ్మకున్నాయి. కాబట్టి జగత్తును సృష్టించటానికి కారణం పరబ్రహ్మ అంటే పరమేశ్వరి ఆ పరాశక్తి తప్ప ఇతరమైనవేవీ కాదు.

**దీంతో రెండవ అధ్యాయంలో మొదటి పాదం పూర్తయింది.**

# రెండవ అధ్యాయం

## రెండవ పాదం

ఇందులో ఎనిమిది అధికరణలు నలభైఐదు సూత్రాలు ఉన్నాయి. ఇక్కడ సాంఖ్యులు మొదలైన వారి యుక్తుల్ని ఖండిస్తూ అని ప్రమాణాలు కాదని నిరూపిస్తున్నారు.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | రచనానుపత్త్యధికరణము | సాంఖ్యుల ప్రధానం జగత్కారణం కాదు | 10 |
| 2. | మహాదీర్ఘాధికరణము | వైశేషికుల సిద్ధాంతము | 1 |
| 3. | పరమాణు జగదకారణత్వాధికరణము | పరమాణువాద నిరాకరణ | 6 |
| 4. | సముదాయాధికరణము | బౌద్ధమత ఖండన | 10 |
| 5. | అభావాధికరణము | యోగాచారుల మతఖండన | 5 |
| 6. | నైకస్మిన్న సంభవాధికరణము | జైనమత ఖండన | 4 |
| 7. | పత్యధికరణము | మహేశ్వరవాదన ఖండన | 5 |
| 8. | ఉత్పత్త్యధికరణము | పాంచరాత్రాగమ మతఖండన | 4 |

మొత్తం అధికరణలు 8. సూత్రాలు 45.

ముందుగా సాంఖ్యదర్శనం చూద్దాం.

## సాంఖ్యదర్శనము

బ్రహ్మమానసపుత్రుడు కర్దముడు. స్వాయంభువ మనువు యొక్క కుమార్తె దేవహూతిని వివాహం చేసుకున్నాడు. వీరి కుమారుడే కపిలుడు. విష్ణ్వంశ సంభూతుడు. కర్దముడు స్వర్గస్థుడైన తరువాత, కపిలుని తల్లి దేవహూతి కుమారుడి దగ్గరకి వచ్చి "సంసారార్ణవము నుంచి తరించే జ్ఞానం ఉపదేశించమని" ప్రార్థించింది.

అప్పుడు కపిలుడు తల్లికి సాంఖ్యయోగాన్ని బోధించాడు అని శ్రీమద్భాగవతం చెబుతోంది. అయితే సాంఖ్యాన్ని బోధించిన కపిలుడు, భాగవతంలోని కపిలుడు ఒకరు కాదు అన్నారు శంకర భగవత్పాదులవారు.

**సమ్యక్ఖ్యానమ్** అంటే సమ్యగ్విచారణ, మంచి ఆలోచన, వివేకబుద్ధి అని అర్థం. ఇక్కడ వివేకము అంటే ప్రకృతి పురుషుల వివేకం అని అర్థం. ఈ వివేకబుద్ధి, ప్రకృతి పురుష వివేచన సాంఖ్యశాస్త్రంలో చర్చనీయాంశమైంది. అందుచేతనే దీన్ని "సాంఖ్యదర్శనము" అన్నారు.

భగవద్గీతలో రెండవ అధ్యాయము "సాంఖ్యయోగము" శరణాగతుడైన అర్జునుడు తన శోకనివృత్తి కోసం తిరుగులేని ఒక ఉపాయం చెప్పమని భగవానుణ్ణి ప్రార్థించాడు. దానికి భగవానుడు ముప్ఫై శ్లోకాలలో ఆత్మతత్త్వాన్ని వివరించాడు. ఆ తరువాత స్వధర్మము, కర్మయోగము వివరించినప్పటికీ, అధ్యాయం ఆరంభం మాత్రం సాంఖ్యంతోనే జరిగింది. ఇక్కడ **సాంఖ్యము** అంటే **'ఆత్మతత్త్వము'** అని అర్థం. మిగిలిన అధ్యాయాలలో కన్నా, ఈ అధ్యాయంలోనే ఆత్మతత్త్వము ఎక్కువగా వివరించబడింది. అందుకే ఈ అధ్యాయాన్ని సాంఖ్యయోగము అన్నారు. మొత్తం మీద చూసినట్లైతే భగవద్గీతలో సాంఖ్యము అంటే ఆత్మతత్త్వము అని అర్థం. కాని "ప్రకృతి స్వరూపాన్ని వివేచించి, ఇరవైనాలుగు తత్త్వాలను గూర్చిన విజ్ఞానాన్ని వివరించటం చేత, వీరు సాంఖ్యులు అనబడ్డారు" అని మహాభారతం చెబుతోంది.

సాంఖ్యదర్శనం ఆరు అధ్యాయాలలో 527 సూత్రాలు గలది. దీనిలో

మొదటి అధ్యాయం – విషయప్రతిపాదన

రెండవ అధ్యాయం – 'ప్రధానం' యొక్క లక్షణ నిరూపణ

మూడవ అధ్యాయం – వైరాగ్యం

నాల్గవ అధ్యాయం – సాంఖ్యతత్త్వాలను వివరించే చిన్న చిన్న కథలు

ఐదో అధ్యాయం – విపక్షఖండనం

ఆరో అధ్యాయం – సిద్ధాంతాల సంక్షిప్త పరిచయం చెప్పబడ్డాయి.

సాంఖ్యదర్శనం మూల ప్రవర్తకుడు కపిలుడు. ఈయన 'ఆదివిద్వాన్' అని కీర్తించబడ్డాడు. ఈయన దేవహూతి, కర్దముల యొక్క కుమారుడు. సాక్షాత్తు

శ్రీమహావిష్ణువు యొక్క అవతారము అని భాగవతంలో చెప్పబడింది. రామాయణంలో సగర పుత్రులను భస్మం చేసింది కూడా ఈ కపిలుడే. కాని వీరిద్దరు వేరు వేరు అంటాడు శంకరుడు. కపిలుడి తరువాత ఆసురి, పంచశిఖాచార్యుడు, ఈశ్వరకృష్ణుడు, వింధ్యవాసి, విజ్ఞానభిక్షువు సాంఖ్యమతాన్ని బాగా ప్రచారం చేశారు.

ఈశ్వరకృష్ణుడు సాంఖ్యదర్శనానికి ఏడువందల కారికలను వ్రాశాడు. దీనికే **'కనకసప్తశతి, సాంఖ్యసప్తశతి, సువర్ణసప్తశతి'** అని కూడా పేర్లు. దీనిమీద అనేకమంది వ్యాఖ్యానాలు వ్రాశారు. వీటిలో **మాఠరవృత్తి, గౌడపాదభాష్యం, జయమంగళ, చంద్రిక, తత్త్వకౌముది, యుక్తిదీపిక, సువర్ణసప్తశతిశాస్త్రం** అనేవి ముఖ్యమైనవి. ఇవి కాకుండా అనేకమైన కారికలున్నాయి. వీటన్నింటిలోను **ఈశ్వరకృష్ణుడు వ్రాసిన "సాంఖ్యకారిక"లే అత్యంత ప్రామాణికం.**

సాంఖ్యమతంలో 'సేశ్వరవాదము', 'నిరీశ్వరవాదము' అంటే ఈశ్వరుడు ఉన్నాడని కొందరు, లేడని కొందరు చెప్పారు. సృష్టి జరగటానికి కారణం ఈశ్వరుడు మాత్రం కాదు అన్నారు కొంతమంది సాంఖ్యులు. ఈశ్వరసృష్టిని ఋజువు చెయ్యటానికి తగిన ఆధారాలు, ప్రమాణాలు లేవు అన్నారు. అంతమాత్రంచేత సాంఖ్యులు నాస్తికులు కాదు. ఈశ్వరుడున్నాడని చెప్పటానికి సరైన హేతువు లేదు అని మాత్రమే వీరు చెబుతారు. ప్రారంభంలో ఇది నిరీశ్వరమైనప్పటికీ ప్రస్తుతం మనకు లభిస్తున్న గ్రంథాలను బట్టి ఈ మతంవారికి పరమేశ్వరుడు ఉన్నాడనే భావించాలి. అంటే వీరిది సేశ్వరవాదంగానే పరిగణించాలి. పై పెచ్చు సాంఖ్య మతానికి మూలపురుషుడైన కపిలుడు పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని అవతారం. ముందుగా భాగవతంలోని సాంఖ్యమతంలో కపిలుడు ఏం చెప్పాడో చూద్దాం.

ప్రకృతి సత్వము, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు కలిగి ఉంటుంది. దీనికి జ్ఞానాన్ని మరుగునపడేసే శక్తి ఉన్నది. పురుషుడు దానికి మోహితుడవుతాడు. దాంతో ప్రకృతి వేరు తాను వేరు అని గుర్తించలేడు. ప్రకృతియొక్క గుణాలతో జరిగే పనులన్నింటికీ తానే కర్త అని భావిస్తాడు. దీనివల్లనే జనన మరణాదికమైన బంధాలు కలుగుతాయి.

ప్రకృతి గుణత్రయానికి ఆలవాలమైంది కాబట్టి అది బ్రహ్మము కాదు. అది దేని పరిణామము కూడా కాదు. అది అవ్యక్తము. కార్యకారణ రూపమైనది.

పంచభూతాలు, తన్మాత్రలు, అంతఃకరణచతుష్టయము, దశేంద్రియాలు వెరసి ఇరవై నాలుగు తత్త్వాలు. ఇదే ప్రకృతి. ప్రకృతి గుణాలు క్షోభించినప్పుడు చిచ్ఛక్తి రూపమైన తన వీర్యాన్ని పరమపురుషుడు ప్రకృతి యొక్క యోనియందు స్థాపించాడు. అప్పుడు ప్రకృతినుంచి మహత్తత్త్వము పుట్టింది. మహతత్త్వము నుంచి అహంకారము పుట్టింది. అహంకారము మూడు రకాలు 1. సాత్త్వికాహంకారము 2. రాజసాహంకారము 3. తామసాహంకారము. అహంకారం నుంచి తన్మాత్రలు ఆవిర్భవించినాయి. వాటినుంచి జ్ఞానేంద్రియాలు ఆవిర్భవించినాయి.

| వ.నెం. | భూతము | లక్షణము | జ్ఞానేంద్రియము |
|---|---|---|---|
| 1. | ఆకాశము | శబ్దము | చెవి |
| 2. | వాయువు | స్పర్శ | చర్మము |
| 3. | తేజస్సు (అగ్ని) | రూపము | కన్ను |
| 4. | జలము | రుచి (రసము) | నాలుక |
| 5. | భూమి | వాసన (గంధము) | ముక్కు |

ఈ తన్మాత్రల నుంచే పంచభూతాలు పుట్టినాయి. కర్మేంద్రియాలు పుట్టినాయి. ఈ రకంగా సృష్టి జరిగింది.

ఒకే విషయాన్ని పదే పదే చూడటం వల్ల అది కలలో కనిపిస్తుంది. ఆ కల నిజమనే భ్రమ కలిగిస్తుంది. అలాగే సంసారం కూడా. సంసారానికి శాశ్వతత్త్వం లేకపోయినా అది నిత్యము, సత్యము అనిపిస్తుంది.

జీవియొక్క బంధ మోక్షాలకి మనసే ప్రధానం. పరమాత్మతో అనురక్తి పొందినట్లైతే అది మోక్షహేతువు అవుతుంది. అందుకే మనసుకు వైరాగ్యాన్ని అలవాటు చేసి యోగసాధన చెయ్యాలి. ఏకాగ్రచిత్తుడై భగవంతుని కథలు వినాలి. సర్వప్రాణుల యందు సమభావం కలిగి ఉండాలి. కోరికలు విడనాడాలి. బ్రహ్మచర్యము, మౌనవ్రతము, స్వధర్మము పాటించాలి. దొరికిన దానితో తృప్తి చెందాలి. మితాహారం తీసుకోవాలి. ఏకాంతవాసం గడపాలి. అహంకార మమకారాలు పూర్తిగా వదిలి పెట్టాలి. ఈ రకంగా సాధన చేస్తే ప్రకృతి పురుషుల తత్త్వము అవగతమవుతుంది.

ఈ రకంగా జరిగితే ఆత్మ ప్రతిబంధకమైన ప్రకృతి క్రమక్రమంగా పురుషుని విడిచిపోతుంది. అజ్ఞానికి ప్రకృతి సంసార రూపమైన అనర్థాలు కలిగిస్తుంది. కాని జ్ఞానియైన వాడిని ఈ ప్రకృతి ఏమీ చెయ్యలేదు. ఇటువంటి జ్ఞాని ఆత్మతత్త్వాన్ని తెలుసుకుని పరమానందం పొందుతాడు అతడికి కైవల్యము సిద్ధిస్తుంది.

**అష్టాంగయోగవిధి :** చెడు మార్గాలనే అన్వేషిస్తుంది మనస్సు. అందుచేత దాన్ని ముందుగా కట్టి పడెయ్యాలి. దానికి అష్టాంగయోగవిధి అవసరము.

| | | |
|---|---|---|
| 1. | ఆసనము | – పవిత్రమైన ప్రదేశంలో దర్భలు పరచి వాటి మీద మృగచర్మం పరిచి దానిమీద కూర్చోవాలి. |
| 2. | పూరకము | – ఊపిరి పూర్తిగా పీల్చటం. |
| 3. | రేచకము | – పీల్చిన గాలి బయటకు వదలటం |
| 4. | కుంభకం | – పీల్చిన గాలి లోపల అట్టిపెట్టటం |
| 5. | అనులోమ, ప్రతిలోమాలు | – ప్రాణాయామం చెయ్యటం |
| 6. | ధారణ | – మనసును లగ్నం చేయటం. |
| 7. | ప్రత్యాహారము | – మనసును, ఇంద్రియాలను వాటి వాటి వాసనల నుంచి మరల్చటము |
| 8. | ధ్యానము | – భగవత్ చింతన |

ఇలా అష్టాంగయోగం ద్వారా శ్రీమన్నారాయణుని ధ్యానం చెయ్యాలి. అప్పుడు సాధకుడి హృదయమంతా భక్తితో నిండి పోతుంది. తాదాత్మ్యత, తత్పరత కలుగుతుంది. శరీరం పులకించి పోతుంది. పరమేశ్వర సాక్షాత్కారం కలుగుతుంది. భగవానుడి మాయాశక్తి మన ఊహకందదు. భగవానుడి మీద అచంచలమైన భక్తితోనే ఆయన్ను చేరాలి. ఇంకో మార్గం లేదు. భక్తి ఐదు రకాలుగా ఉంటుంది. 1. తామసభక్తి 2.రాజసభక్తి 3.సాత్త్వికభక్తి 4.నిర్గుణభక్తి 5.అత్యంతిక భక్తి. ఇదే తాదాత్మ్యత, తత్పరత.

**సంసారకూపం :** అజ్ఞానంవల్లనే సంసార బంధనాలు ఏర్పడతాయి. భార్యాపుత్రులు ధనధాన్యాలు, భోగభాగ్యాలు ఇవన్నీ అశాశ్వతం. అయితే జీవుడు అశాశ్వతమైన ఈ జగత్తే శాశ్వతం అనుకుంటాడు. క్షణికమైన ఆనందమే శాశ్వతానందం అనుకుంటాడు. తాను కష్టాలు పొందుతూ కూడా అదే సుఖం

అనుకుంటాడు. ఇలా జీవితమంతా గడిచిపోతుంది. ముసలితనం వస్తుంది. మనిషి చేతకానివాడై పోతాడు. కుటుంబాన్ని పోషించలేడు. భార్యాబిడ్డలు గతంలో లాగా ఆదరించరు. వాళ్ళ దయాధర్మాల మీద ఆధారపడవలసి వస్తుంది. కదల్లేడు. ప్రతిదానికీ ఎవరిమీదైనా ఆధారపడాలి. ఇలా ఘోరంగా సాగుతుంది ముసలితనం. ఇంతలో కాలం సమీపిస్తుంది. యమభటులు వస్తారు. వారిని చూసి భయపడతాడు. మలమూత్ర విసర్జన చేసుకుంటాడు. అతని యాతనా దేహాన్ని యమభటులు తీసుకుపోతారు. తాను చేసిన పాపాలు గుర్తు వచ్చి దుఃఖిస్తాడు. ఆకలిదప్పులు దహించి వేస్తుండగా, యమభటులు కొరడాలతో కొడుతుంటారు. ఎండమాడిపోతూ ఉంటుంది. ఇసుక దారి. వేడిగాడ్పులు. ఎక్కడా నీడ అనేది కనిపించదు. నీళ్ళు దొరకవు. కొరడా దెబ్బలు తింటూ ఆ త్రోవలో నడవాలి. ఇలా తొంభై తొమ్మిది వేల యోజనాల యమలోకం దారిని రెండు ముహూర్తాల కాలంలో నడిచిపోవాలి. యమలోకంలో అతడు చేసిన పాపాలను బట్టి శిక్షలు అనుభవించాలి. తన కుటుంబం కోసం తాను చేసిన పాపాలకు శిక్షలు తానొక్కడే అనుభవించాలి. యజ్ఞయాగాది కర్మలు, దేవతారాధన చేసిన వారు ధూమమార్గంలో చంద్రలోకం చేరి సుఖాలు అనుభవించి తిరిగి కర్మశేషం అనుభవించటానికి ఈ లోకంలో జన్మిస్తారు. పరబ్రహ్మను ఉపాసన చేసినవారు ముందుగా సత్యలోకం చేరి, ప్రళయం సంభవించే వరకు అక్కడ ఉండి, ఆ తరువాత కర్మబ్రహ్మతో కలిసి పరబ్రహ్మలో లీనమవుతారు. అతడికి పునర్జన్మ ఉండదు." అంటూ భాగవతంలో కపిలుడు సాంఖ్యమతాన్ని వివరించాడు. ఇప్పుడు అసలు సాంఖ్యమతాన్ని చూద్దాం.

**సాంఖ్యతత్త్వము (నిరీశ్వరతత్త్వము) :** సాంఖ్యదర్శనంలో తత్త్వాలను గురించిన చర్చ చాలా ముఖ్యమైనది. తత్త్వాలు ఇరవై ఐదు. మానవుడు ఏ ఆశ్రమంలో ఉన్నప్పటికీ బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం, వానప్రస్థం, సన్యాసం ఏదైనప్పటికీ, ఈ తత్త్వాలను తెలుసుకుంటే చాలు, అతడికి ముక్తి లభిస్తుంది. ఇక్కడ ముఖ్యమైన విషయం ఏమంటే

1. ఒక తత్త్వం అన్నింటికీ కారణమవుతుంది. కాని స్వయంగా దేనికీ కార్యం కాదు. అదే ప్రకృతి (అవ్యక్తం) 1

2. కొన్ని తత్త్వాలు కేవలం కార్యాలుగానే ఉంటాయి. ఇతర తత్త్వాలను ఉత్పన్నం చెయ్యవు - జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, పంచభూతాలు. వెరసి పదహారు.

3. కొన్ని తత్త్వాలు స్వయంగా కారణం, కార్యము కూడా అవుతాయి. ఒక తత్త్వం నుంచి ఉత్పన్నం కావటమే కాక మరొక తత్త్వాన్ని జన్మింపచేస్తాయి - మహతత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు. మొత్తం-7.

4. కొన్ని తత్త్వాలు దేనికీ కారణం కావు. కార్యం కూడా కావు -పురుషుడు 1

వెరసి మొత్తం తత్త్వాలు ఇరవై ఐదు. వీటిలో ప్రకృతి అవ్యక్తం. ఇరవై మూడు తత్త్వాలు-వ్యక్తం. వీటన్నింటికీ అతీతమైన వాడు పురుషుడు. అతడు చైతన్య స్వరూపుడు. వీటన్నింటినీ గురించిన వివేకమే విజ్ఞానము అదే - మోక్షము.

# 1. రచనానుపత్త్యధికరణము

## (సాంఖ్యుల ప్రధానము జగత్కారణం కాదు)

సాంఖ్య మతంలో జగత్కారణం ప్రధానము అంటే ప్రకృతి. ఆ ప్రకృతి జగత్కారణం కాదు అంటున్నారు మొదటి అధికరణలో. దీని పేరు **'రచనానుపత్త్యాధి కరణము'** ఇందులో పది సూత్రాలున్నాయి.

"పురుషుడు తామరాకు మీద నీటిబొట్టులా ఉంటాడు. జగత్తుకు కారణము ప్రధానము. పురుషునికి భోగవస్తువులను సమకూర్చటానికే ప్రధానము (ప్రకృతి) అనేక రూపాలలో సృష్టించబడింది.

ఈ జగత్తు సుఖము, దుఃఖము, మోహములతో కూడి ఉంది. ఇవే త్రిగుణాలు. సుఖము-సత్వగుణము, దుఃఖము-రజోగుణము, మోహము-తమోగుణము, త్రిగుణాత్మకమైనదే జగత్తు" ఇది సాంఖ్యవాదము. ఇక్కడ ఈ వాదాన్ని ఖండించటం జరుగుతున్నది.

***సూత్రం - 172 "రచనానుపపత్తేశ్చ నానుమానమ్"***

ఈ జగత్తంతా సుఖము, దుఃఖము, మోహములతో ఏర్పడింది. ఎందుకనంటే వాటిని కూడి ఉన్నది కాబట్టి. ఇది కేవలము అనుమానం. ఈ అనుమాన

ప్రమాణంతోనే ప్రధానమనేది జగత్తుకు ఉపాదాన కారణము అంటున్నారు. ప్రధానము జడము. దానినుంచే చిత్రవిచిత్రాలయిన వస్తువులు పుడుతున్నాయి.

ఏది దేనితోకూడి ఉన్నదో, దానికి అదే కారణము అని సాంఖ్యుల సిద్ధాంతము. జగత్తు సుఖ దుఃఖ మోహాలతో కూడి ఉన్నది కాబట్టి జగత్తుకు త్రిగుణాలే కారణము అని వారి వాదన. అయితే ప్రధానము అచేతనము, జడము. దానికి సృష్టించే శక్తి ఉండదు.

### *సూత్రం - 173 "ప్రవృత్తేశ్చ"*

ప్రవృత్తి, ఆచరణల వల్ల కూడా ప్రధానమనేది ఈ జగత్తుకు కారణం కాదు. ఎందుకంటే ఈ ప్రవృత్తి అనేది లోకంలో చేతనమైన వాటికే ఉంటుంది. అచేతనాలకు ప్రవృత్తి అనేది ఉండదు. ఒకవేళ ఈ జగత్తు గనక అచేతనమైన ప్రధానంవల్ల సృష్టించబడి ఉంటే, మట్టితో తయారయిన కుండలాగా, దారంతో తయారైన వస్త్రంలాగా ఏ రకమైన చైతన్యము లేకుండా అలాగే పడి ఉండాలి అయితే

అచేతనాల్లో కూడా ప్రవృత్తి కనిపిస్తున్నది కదా. పాలు అచేతనము. అవి దూడను పోషిస్తున్నాయి. అలాగే నీరు అందరికీ ఉపయోగిస్తోంది. అలాగే జడమైన ప్రధానము పురుషునికి భోగవస్తువు కావచ్చును కదా ?" దీనికి సమాధానం

### *సూత్రం - 174 "పయోమ్బువచ్చేత్తత్రాపి"*

దూడకోసం పాలు, లోకం కోసం నీరులాగానే పురుషుని కోసం ప్రకృతి రూపు దాలుస్తున్నాయనేది నిజం కాదు. వాటిల్లో కూడా చేతనప్రవృత్తి ఉన్నది.

లోకంలో జరిగే పనులన్నీ చేతనుడైన ఈశ్వరునిచే నడిపించబడతాయి. **బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు చెబుతాడు. "అతడు వాయువులో ఉంటాడు. వాయువు అతణ్ణెరగదు. వాయువే అతని శరీరం. వాయువులో ఉంటూనే వాయువును నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి అయిన నీ ఆత్మ. జలంలో ఉంటాడు. జలం అతణ్ణెరగదు. జలమే అతడి శరీరం. జలంలో ఉంటూనే జలాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి అయిన నీ ఆత్మ. దూడకు పాలిచ్చే ఆవు చేతనమే పాలు త్రాగేదూడ కూడా చేతనమే. అలాగే పల్లానికి ప్రవహించటమనేది నీటి ప్రవృత్తి. ఇదంతా బ్రహ్మచైతన్యం వల్లనే జరుగుతోంది.

***సూత్రం - 175 "వ్యతిరేకానవస్థితేశ్చానపేక్షత్వాత్"***

ప్రధానానికి వ్యతిరేకమైన అప్రధానము ఏదీ లేదు కాబట్టి అచేతనమైన ప్రధానము జగత్కారణం కాదు.

సాంఖ్యమతం ప్రకారము త్రిగుణముల సమూహమే ప్రధానము. దీనికి మించినది ఇంకొకటి లేదు. పురుషుడు ప్రవర్తకుడు కాదు. నివర్తకుడూ కాదు. కేవలం ఉదాసీనుడు ఏమీ పట్టనివాడు.

సాంఖ్యమతం కన్న ఇతర మతాల్లో ఈశ్వరుడు చేతనుడు, సర్వజ్ఞుడు. సర్వశక్తి మంతుడు. తన ఇష్టప్రకారము ప్రవృత్తి నివృత్తులలో పాల్గొంటాడు.

***సూత్రం - 176 "అన్యత్రాభావాచ్చ న తృణాదివత్"***

గడ్డి క్రమంగా పరిణామం చెంది, పశువులకు ఆహారమై, చివరకు పాలుగా మారుతున్నది. ఆ విధంగా ప్రధానానికి స్వాభావిక పరిణామము ఉండదు.

గడ్డికి పాలుగా మారటము స్వాభావిక లక్షణం కాదు. ఆవులు, గేదెలు తిన్న గడ్డి మాత్రమే పాలుగా మారుతుంది. ఎద్దులు, దున్నలు తిన్న గడ్డి పాలుగా మారదు. అంటే గడ్డి పాలుగా మారటానికి ప్రత్యేకమైన కారణము వేరుగా ఉందన్నమాట. అయినా గడ్డి పాలుగా మారటమనేది గడ్డియొక్క స్వభావం కాదు. ఎందుకంటే ఒకవేళ అలా మారితే ఆవు, గేదెలతో పని లేదు. కాబట్టి ప్రధానం యొక్క పరిణామం గడ్డి మొదలైన వాటిలాగా స్వాభావికం అనటానికి వీలులేదు.

***సూత్రం - 177 "అభ్యుపగమేఽ ప్యర్థాభావాత్"***

పోనీ, ప్రధానానికి స్వాభావిక ప్రవృత్తి ఉన్నది అనుకుందాం. ఆ ప్రవృత్తికి తగిన ప్రయోజనం లేదు. అందువల్ల దోషం కలుగుతున్నది. అంటే....

ప్రధానానికి ఇతర ప్రయోజనం ఏదీలేదు అన్నట్లయితే, ఈ ప్రధానమనేది పురుషునికి భోగాలనిస్తుందని అందుకే ప్రవృత్తమవుతున్నదని చెప్పటం సాంఖ్యులకు కష్టమవుతుంది. సాంఖ్యమతంలో పురుషుడు నిర్మలుడు, ఉదాసీనుడు, అన్ని విశేషాలు ఉన్నవాడు. అటువంటి పురుషుడికి ప్రధానం భోగాన్ని ఇవ్వలేదు. అందుచేత ప్రధానం పురుష ప్రయోజనం కోసం కాదు.

**సూత్రం – 178 "పురుషాశ్మవదితి చేత్తథాపి"**

ప్రధానం పురుష ప్రయోజనం కోసం కాదు అన్నారు బాగుంది. అయితే పురుషుడే ప్రధానాన్ని ప్రవృతం చెయ్యవచ్చును గదా! ఏ విధంగా అంటే, గ్రుడ్డివాడు ఒంటరిగా పోలేడు. అలాగే కుంటివాడు చకచకా నడిచిపోలేడు. ఇప్పుడు కళ్ళున్న కుంటివాడు, కాళ్ళున్న గ్రుడ్డివాడి భుజాలమీద కూర్చుని వెళ్ళటం లేదా? ఐస్కాంతము తాను కదలకుండానే ఇనుపముక్కను కదల్చటం లేదా? అదే విధంగా పురుషుడు ప్రధానాన్ని ప్రవృత్తం చెయ్యవచ్చును కదా!" మళ్ళీ అనుమానం.

"నిజమే కుంటివాడి సాయంతో నడిపించబడే గ్రుడ్డివాడు అస్వతంత్రుడు. అలాగే ఇనుపముక్క కూడా. పురుషుని ప్రేరణవల్ల ప్రవృతమయ్యే ప్రధానం అస్వతంత్రమవుతోంది. ఇది దోషం. అంతేకాకుండా, ఉదాసీనుడు, కూటస్థుడు, వికార రహితుడు అయిన పురుషుడు ప్రేరకుడు కావటం రెండవ దోషం. కుంటివాడు గ్రుడ్డివాడు. ఇనుపముక్క ఐస్కాంతముల సాన్నిధ్యం నిత్యం కాదు. కాని ప్రధాన పురుషుల సాన్నిధ్యం నిత్యం. కాబట్టి ఎప్పుడూ ఈ ప్రవృత్తి ఉంటూనే ఉంటుంది. అందుచేత ప్రధానం ప్రవృతమవుతోందనటం మూడవ దోషం. అవిద్య అయిన ప్రధానాన్ని, చేతనమైన పురుషుని కలిపే తత్త్వం ఇంకొకటి ఏదీ లేదు.

**సూత్రం – 179 "అఙ్గిత్వానుపపత్తేశ్చ"**

అంతేకాదు గుణాలకు సంబంధించిన అంగాంగి భావం కూడా కుదరదు.

సత్వ రజ స్తమో గుణాలు మూడూ సామ్యావస్థను పొందిన స్థితినే ప్రధానము అంటారు. కాబట్టి ఈ మూడింటిలోనూ ఒకటి ఎక్కువ, ఒకటి తక్కువ లేదు. సామ్యావస్థలో ప్రధానానికి ప్రవృత్తి ఉండదు. ప్రవృత్తి కలగాలంటే సామ్యావస్థలో వికారం, కదలిక పుట్టాలి. ఆ రకమైన కదలిక కలిగించే పదార్ధమేదీ లేదు. కాబట్టి ప్రధానానికి జగదుత్పాదక శక్తి లేదు.

**సూత్రం – 180 "అన్యథానుమితౌ జ్ఞశక్తివిరోదాత్"**

ఈ మూడు గుణాలు కార్యోత్పత్తికి అనుకూలంగా అంగాంగి భావాన్ని పొందుతాయని అనుకున్నప్పటికీ, ప్రధానంలో జ్ఞానశక్తి లేనందువల్ల జగన్నిర్మాణం జరగదు. జ్ఞానశక్తిలేని ప్రధానం జగత్తును నిర్మించలేదు. ఒకవేళ సాంఖ్యులు గనక

ప్రధానానికి జ్ఞానశక్తి ఉన్నదని ఒప్పుకుంటే, చేతనమైన పదార్ధమే జగదుత్పత్తికి ఉపాదాన కారణమవుతుంది. అంటే బ్రహ్మమే జగన్నిర్మాణానికి కారకుడు అని అంగీకరించినట్లౌతుంది.

అంతేగాకుండా సామ్యావస్థలో కూడా, నిమిత్తం లేకుండానే త్రిగుణాలు మార్పు చెందుతాయి. అని గనక అంటే, అవి ఎప్పుడూ మార్పు చెందుతూనే ఉండాలి. అప్పుడు జగత్తే నిత్యమవుతుంది. మోక్షమనేది ఉండదు.

***సూత్రం - 181 "విప్రతిషేధాచ్చాసమజ్జసమ్"***

సాంఖ్యమతలో పరస్పర విభేదాలున్నాయి. 'ఈశ్వరుడు జగత్కారణము' అన్న మాట సాంఖ్యమతం ఒప్పుకోదు. వీరు మహత్తు నుంచి తన్మాత్రలు వచ్చాయని ఒకసారి, అహంకారం నుంచి తన్మాత్రలు పుడుతున్నాయని ఒకసారి చెప్పారు. అలాగే కర్మేంద్రియాలు ఏడు (చర్మము మనస్సు కలిపి) అంటారు.ఇ ంకొక చోట కర్మేంద్రియాలు ఐదే అంటారు. ఒకసారి ఇంద్రియాలు మొత్తం పదకొండు అంటారు. అంతఃకరణ అంటే బుద్ధి, మనస్సు, అహంకారము అంటారు. ఇంకోచోట బుద్ధి ఒక్కటే అంటారు. (మన లెక్కలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) ఈ రకంగా వారి వాదనలో పొంతన అనేది ఉండదు. సాంఖ్యుల వాదనకు బలం లేదు. కాబట్టి సాంఖ్యులు చెప్పే ప్రధానం జగత్కారణం కాదు.

## 2. మహాదీర్ఘాధికరణము (వైశేషికుల సిద్ధాంత నిరాకరణ)

ముందుగా వైశేషిక సిద్ధాంతాన్ని చూద్దాం. దీన్నే అణువాదము అంటారు.

## వైశేషిక దర్శనము (అణువాదము)

వైశేషిక దర్శనము పది అధ్యాయాలతో, మొత్తం 372 సూత్రాలతో ఉంటుంది. ఈ దర్శనాన్ని వ్రాసినవాడు **కణాదమహర్షి** ఇతన్నే కణభోజి, కణభక్షకుడు అని కూడా అంటారు. ఇతని అసలు పేరు కశ్యపుడు. ఇతడు న్యాయదర్శనాన్ని వ్రాసిన అక్షపాదుడు లేక గౌతముడి తరువాత వాడు బుద్ధ భగవానుడికి పూర్వీకుడు కూడా అంటే క్రీస్తుపూర్వం నాల్గవ శతాబ్దానికి చెందినవాడు. ఈ దర్శనానికి ఔలూక్య దర్శనము అని కూడా పేరున్నది.

బాహ్యజగత్తు వాస్తవము అని దాని స్వరూప స్వభావాలను వివరించింది వైశేషిక దర్శనము. ఒక వస్తువును చిన్న చిన్న ముక్కలుగా విభజిస్తూ పోతే చివరకు విడదీయటానికి వీలు లేనటువంటి పరమాణువులుగా అవుతుంది. వీటినే కణాలు అన్నాడు మహర్షి. ఈ కణాల వల్లనే జగత్తు సృష్టించబడింది అంటాడు. ఇది ఒక రకమైన భౌతిక శాస్త్రము. కణము నిత్యమైనది. ఈ కణాల సంయోగం వల్ల ఏర్పడే పదార్థాలు అనిత్యమైనవి.

వైశేషిక సూత్ర గ్రంథంలో ఈశ్వరప్రసక్తి లేదు. ఈశ్వరుణ్ణి అంగీకరించకపోతే అది నాస్తిక వాదము అవుతుంది. అందుచేత ఆ తరువాత కాలంలో వచ్చిన ప్రశస్త పాదాచార్యుడు మొదలైన వారు ఈశ్వర అస్థిత్వాన్ని అంగీకరించారు. వారి ప్రకారము ఈశ్వరుడు ఈ జగత్తుకు పరమ కారణము. పరమాణువులు ఉపాదాన కారణము. అదృష్టాన్ని ఆధారంగా చేసుకుని ఈశ్వరుడు ఈ జగత్తును నిర్మించాడు.

ప్రశస్తపాదుడు వైశేషిక సూత్రాలకు **పదార్థ ధర్మసంగ్రహము** అనే పేరుతో భాష్యం వ్రాశాడు. కణాదుడు వైశేషిక సూత్రాలలో ఈశ్వర అస్థిత్వాన్ని చెప్పలేదు. ఆ కారణం చేత ప్రశస్తపాదుడు ఇందులో ఈశ్వర ప్రశస్తిని కూడా చేర్చాడు. తరువాత కాలంలో వచ్చిన వారంతా కూడా ఈ మార్గాన్నే అనుసరించారు వైశేషిక దర్శనానికి రావణబ్రహ్మ కూడా భాష్యం వ్రాశాడని ప్రతీతి. మనదేశంలోనే కాకుండా చైనా, జపాన్‌లలో కూడా ఈ దర్శనం మీద వ్యాఖ్యలున్నాయి. ఈ దర్శనం మీద ఉదయనుడి **'కిరణావళి'** శంకరమిశ్రుడు వ్రాసిన **'ఉపస్కారము'** శివాదిత్యుని **'సప్తపదార్థి'** ముఖ్యమైన వ్యాఖ్యలు.

**అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః** అనే సూత్రంతో ఈ దర్శనం ప్రారంభమవుతుంది. అంటే ఇంక ధర్మనిరూపణం చేస్తున్నాము అని చెప్పి అటువంటి ధర్మము అభ్యుదయాన్ని, నిఃశ్రేయస్సును ప్రాప్తింపచేస్తుంది అని నిరూపించారు. అటువంటి ధర్మానికి వేదములే ప్రమాణము. వైశేషికతత్త్వము వలన మన ఎదుట ఉన్న పదార్థాల గురించిన జ్ఞానాన్ని తెలియచెయ్యటం ద్వారా మిథ్యాజ్ఞానాన్ని నిర్వర్తింప చేయగల తత్త్వజ్ఞానాన్ని ప్రజలకు పంచగలము అని భావించిన కణాదుడు ఈ దర్శనంలో ముందుగా పదార్థ విచారం చేశాడు.

పదార్థము అంటే – ఒక పదానికి మనం తెలుసుకో తగినటువంటి అర్థము. ప్రపంచంలో గల భావపదార్థాలను ఈ దర్శనంలో ఏడు విధాలుగా విభజించారు. అవి **ద్రవ్యగుణ కర్మసామాన్య విశేష సమవాయాభావా స్సప్త పదార్థాః**

1. ద్రవ్యము 2. గుణము 3. కర్మము 4. సామాన్యము 5. విశేషము 6. సమవాయము 7. అభావము

**అర్థ ఇతి ద్రవ్యగుణ కర్మసు**

ద్రవ్యగుణ కర్మలు మూడు, అర్థము అనే మాటతో చెప్పబడ్డాయి. అర్థము అనే మాటను సామాన్యంగా శబ్దార్థము అనే భావంతోనే వాడతారు. కాని ఇక్కడ అలా జరగలేదు. ఇక మిగిలిన మూడు పదార్థాలు అంటే సామాన్య, విశేష, సమవాయువులను ఉపార్థాలు అన్నారు. కణాదుడు, ప్రశస్తపాదుల దృష్టిలో పదార్థాలు ఆరే. ఆ తరువాత వచ్చిన శ్రీధరుడు, ఉదయనాచార్యుడు శివాదిత్యుడు మొదలైన వారు 'అభావము'ను ఏడవ పదార్థంగా అంగీకరించారు. భావము అంటే ఉండటం. అభావము అంటే లేకపోవటం. పైన చెప్పిన వాటిలో మొదటి ఆరు భావ పదార్థాలు. కాగా ఏడవది అభావ పదార్థం.

ఈ దర్శనంలో సంసారము దుఃఖమయమని దీని అత్యంతిక నివృత్తియే పరమ పురుషార్థము అని చెప్పబడింది. దీనికి ఉపాయమైన తత్త్వజ్ఞానము పైన చెప్పిన ఏడు పదార్థాలకు చెందుతుంది. ఈ ఏడు పదార్థాల తత్త్వజ్ఞానము వల్లనే ముక్తి లభిస్తుంది అని వీరి వాదన.

రెండవ అధికరణలో వైశేషికుల సిద్ధాంతాన్ని ఖండిస్తున్నారు. దీని పేరు **మహద్దీర్ఘాధికరణము.** ఇందులో ఒక సూత్రమే ఉంది.

ఇప్పటిదాకా సాంఖ్యమతాన్ని చెప్పి, ఇప్పుడు వైశేషిక మతాన్ని ఖండిస్తున్నారు. వైశేషిక మతాన్ననుసరించి కారణ పదార్థాలకుండే గుణాలతోనే కార్యాలు పుడతాయి. అంతేగానీ వేరే గుణాలు గలవి పుట్టవు. ఎర్రరంగు నూలుతో తయారయిన వస్త్రం, ఎర్రగానే ఉంటుందిగాని తెల్లగా ఉండదు. ఈ సిద్ధాంతం ప్రకారము చేతనమైన బ్రహ్మనుంచి పుట్టిన జగత్తు అచేతనం కావటానికి వీలులేదు. అది కూడా చేతనమే కావాలి. కాని అలా కాలేదు. కాబట్టి జగదుత్పత్తికి కారణం చేతనమైన బ్రహ్మకాదు. ఇది వైశేషికుల వాదన. అయితే వారి వాదాన్ని, వారి వాదంతోనే ఖండిస్తున్నారు.

*సూత్రం - 182 "మహద్దీర్ఘవద్వా హ్రస్వపరి మణ్డలాభ్యామ్"*

హ్రస్వములు, పరిమండలాలు, వీటివల్ల మహత్తులు దీర్ఘములు పుట్టినట్లే, చేతనమైన బ్రహ్మ నుండి జగత్తు పుడుతున్నది. అనేది వైశేషికుల వాదన.

వైశేషికుల మతం ప్రకారము జగస్సృష్టికి మూలము పరమాణువులు. రెండు పరమాణువులు కలిస్తే ద్వ్యణుకములౌతాయి. ద్వ్యణుకములు సంయోగం చెందితే త్ర్యణుకములౌతాయి. అలాగే చతురణుకములౌతాయి. ఈ రకంగా అణువుల నుండి కొండలు, నదులు, పర్వతాలు, మొదలైన సృష్టి అంతా ఏర్పడుతుంది.

ఈ అణువులు ఒకదానితో ఒకటి కలిసినప్పుడు వాటి ఆకారము మారుతుంది.

ఒక అణువు యొక్క పరిమాణాన్ని- పారిమాండల్యపరిమాణము

అదిద్విగుణాలుగా మారినప్పుడు - హ్రస్వ పరిమాణము

త్ర్యణుకాలుగా మారినప్పుడు - దీర్ఘపరిమాణము

పొందుతాయి. అంటే పూర్వమున్న ఆకారం పొందకుండా క్రొత్త ఆకారం పొందుతాయి. ఈ విధంగా చూస్తే వారి వాదన వారికే సమర్ధనీయం కాలేదు. అందుచేత చేతనమైన బ్రహ్మ నుండి చేతనమైన జగత్తే సృష్టించబడాలి అనే వాదన సరికాదు.

## 3. పరమాణు జగత్కారణత్వాధికరణము

### (పరమాణువాద నిరాకరణ)

మూడవ అధికరణలో పరమాణువాదాన్ని ఖండిస్తున్నారు. ఈ అధికరణ పేరు **'పరమాణు జగత్కారణత్వాధికరణము'** ఇందులో ఆరు సూత్రాలున్నాయి.

*సూత్రం - 183 "ఉభయథాపి న కర్మాతస్తదభావః"*

రెండు విభాగాలుగా కూడా పరమాణువులందు సృష్టి జరగదు. కాబట్టి పరమాణువుల నుండి ద్వ్యణుకం మొదలైన క్రమంలో సృష్టి జరగదు.

వైశేషికుల ప్రకారము అణువుల కలయిక వల్లనే ఈ సృష్టి జరుగుతోంది. అయితే ఇక్కడ కర్మ ఏదీ లేదు అని వారంటారు. దారపుపోగులు వాటంతటవి అవి వస్త్రంగా తయారుకావు. వాటిని కలిపి వస్త్రంగా తయారుచెయ్యాలి. ఇది కర్మ. అయితే ఈ కర్మ అనేది లేదు అని వారంటారు.

వైశేషిక మతంలో మొత్తం తొమ్మిది ద్రవ్యాలుంటాయి. వీటిలో పృథివి, జలము, అగ్ని, వాయువు అనే నాలుగు నిత్యములు. ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు అనబడే ఐదు అనిత్యాలు. పరమాణువులు ఒకదానితో ఒకటి కలియటంవల్ల ఘట, పటాది (వస్త్రము) రూపాల్లో సృష్టి జరుగుతోంది.

ఇక ప్రళయం ఏ విధంగా జరుగుతుంది అంటే కొన్ని అణువులు కలిసి ఒక వస్తువు ఏర్పడింది. మళ్ళీ ఆ అణువులన్నీ విడిపోతే, ఆ వస్తువు ఉండదు. ఈ విధంగా అణువులు విడిపోవటమే ప్రళయము.

అయితే వారు చెప్పే క్రమాన్ని పరిశీలిస్తే అణువులు పర్వతంగానో, కొండగానో తయారవటానికి ఏ అవసరం లేదు. కాని మట్టికుండగా తయారవటానికి కర్మ అవసరమవుతుంది. కాని వారి వాదనలో కర్మ అనేది లేదు. అందుచేత వైశేషికుల వాదం సరికాదు.

***సూత్రం - 184 "సమవాయాభ్యుపగమాచ్చ సామ్యాదవస్థితేః"***

అన్యోన్య సంబంధాన్ని గనక అంగీకరించినట్లైతే భేదం సమమవటం చేత అనవస్థా దోషం అంటే ఉపపాద్య, ఉపపాదకాలకు తెంపు లేకపోవటం అనే దోషం కలుగుతుంది.

పరమాణువుకు కొన్ని లక్షణాలున్నాయి. అవి రెండు కలిసినప్పుడు పరమాణువుల లక్షణాలు వదలి వేరే లక్షణాలు సంతరించుకుంటున్నాయి. ఈ రకంగా సంతరించుకోవటం చేత అనవస్తా అంటే అంతు లేకపోవటం అనే దోషం కలుగుతున్నది. అందుచేత వీరి వాదన సరికాదు.

***సూత్రం - 185 "నిత్యమేవ చ భావాత్"***

పరమాణు వాదంలో చాలా విచిత్రమైన స్థితి ఉన్నది. దీని ప్రవృత్తి స్వభావాన్ని అంగీకరిస్తే, ప్రవృత్తి నిత్యం అవటం వల్ల ప్రళయం ఉండదు. నివృత్తి వాదాన్ని అంగీకరిస్తే, నివృత్తి నిత్యమైనందున సృష్టి అనేది ఉండదు. కాబట్టి పరమాణువాదం కుదరదు.

ప్రవృత్తి స్వభావం – అంటే ఆ స్వభావంలో మార్పు ఉండదు కాబట్టి ఎప్పుడూ సృష్టి జరుగుతూనే ఉంటుంది లయం ఉండదు.

నివృత్తి స్వభావం – అంటే అణువులు నాశనమై పోతుంటాయి. కాబట్టి సృష్టి అనేది జరగదు. ఈ విధంగా సృష్టిగాని, ప్రళయం గాని, ఈ రెండింటిలో ఏదో ఒకటి మాత్రమే జరుగుతుంది.

*సూత్రం – 186 "రూపాదిమత్త్వాచ్చ విపర్యయో దర్శనాత్"*

వైశేషికులు పరమాణువులకు రూపము మొదలైనవి ఉన్నాయంటారు. కాని నిజ స్థితిలో వీరి వాదనలో తేడా కనిపిస్తోంది.

పృథివి, జలము, అగ్ని, వాయువు. వీటికి సంబంధించిన అణువులు నిత్యములు, నిరవయవములు, కుండ, వస్త్రములలో కూడా ఈ లక్షణాలున్నాయి అంటారు. కాని లోకంలో నూలు పోగులతో తయారయిన వస్త్రం, ఆ పోగులకన్న స్థూలంగా ఉంటుంది. అలాగే మట్టితో తయారయిన కుండ కూడా. కాబట్టి వీరు నిత్యము, నిరవయత్వము అని చెప్పేవి స్థూలము, సావయవత్వముగా కనిపిస్తున్నాయి. కాబట్టి వీరివాదన సరికాదు.

మనం పంచీకరణ చెప్పినట్లుగానే వీరు

వాయువులో – స్పర్శ

అగ్నిలో – స్పర్శ, రూపము

జలములో – స్పర్శ, రూపము, రసము

భూమిలో – స్పర్శ, రూపము, రసము, గంధము

ఉన్నాయి. వాటివల్లనే ఈ సృష్టి జరుగుతోంది అంటారు. ఇవి ఒకదానికన్న ఒకటి స్థూలమైనవి. వీటివల్ల జగన్నిర్మాణం జరగదు.

*సూత్రం – 187 "ఉభయథా చ దోషాత్"*

ఒకదానికన్న ఒకటి స్థూల సూక్ష్మాలని తారతమ్యం చెప్పినా, తారతమ్యం లేదని చెప్పినా రెండు విధాలుగానూ దోషమే ఉన్నది కాబట్టి పరమాణువాదం సరికాదు.

భూమిలో స్పర్శ, రూప, రస, గంధాలున్నాయి. కాబట్టి ఇది స్థూలము. జలంలో మూడు గుణాలున్నాయి. కాబట్టి భూమికన్న ఇది సూక్ష్మము. ఈ రకంగా అగ్ని

ఇంకా సూక్ష్మం. వీటన్నింటిలోకీ వాయువు మరీ సూక్ష్మం. ఈ రకంగా వీటిలో తేడాలుండటం వల్ల, వీటికి కారణమైన పరమాణువులలో కూడా తేడాలుండి ఉంటాయి. ఇలా తేడాలున్నవి పరమాణువులు అని చెప్పటానికి లేదు. ఇది దోషం.

ఒకవేళ భూమిలో గంధము, జలంలో రసము, అగ్నిలో రూపము, వాయువులో స్పర్శ మాత్రమే ఉన్నాయి. వీటిమధ్య తారతమ్యాలు లేవు అని అంటే ఇదీ దోషమే. అందువల్ల అణువాదం సరికాదు.

***సూత్రం - 188 "అపరిగ్రహాచ్చాత్యన్తమనపేక్షా"***

పరమాణువాదాన్ని మనువు మొదలైన శిష్టులు ఎవరూ అంగీకరించలేదు. అంటే మోక్షవాదులు దీనిని అంగీకరించరు.

పరమాణువాదం శిష్ట సమ్మతమూ కాదు, యుక్తి సమ్మతమూ కాదు. అందుచేత దీనిని అంగీకరించవలసిన అవసరం లేదు.

## 4. సముదాయాధికరణము (బౌద్ధమతఖండన)

నాల్గవ అధికరణలో బౌద్ధమతాన్ని ఖండిస్తున్నారు. దీని పేరు **'సముదాయాధికరణము'.** ఇందులో పది సూత్రాలున్నాయి.

ముందుగా బౌద్ధమతాన్ని చూద్దాం.

బౌద్ధమతాన్ని ప్రచారం చేసినవాడు బుద్ధుడు. కపిలవస్తు నగరాన్ని పాలించిన శాక్యవంశస్థుడైన శుద్ధోధనమహారాజు కుమారుడు. బుద్ధుని తల్లి మాయాదేవి. బుద్ధుని చిన్నతనంలో శుద్ధోధనుడు జ్యోతిష్కులను రావించి ఇతని జాతకం అడిగాడట. అప్పుడు వారు ఈ కుమారుడు మహర్జాతకుడు. అయితే గొప్పచక్రవర్తి కావాలి లేదా పరివ్రాజకశిరోమణి కావాలి. అన్నారట. చివరకు జ్యోతిష్కులు చెప్పినట్లుగానే పరివ్రాజకశిరోమణి అయినాడు బుద్ధుడు. బుద్ధుడు అంటే - క్లేశాలు, ఉపక్లేశాలు మహాక్లేశాల నుంచి విముక్తుడైనవాడు అని అర్థం. క్లేశము అంటే పాళీభాషలో- ప్రమాదము, భ్రమ అని అర్థం. అసలు పేరు **సిద్ధార్థుడు.** బుద్ధుడు తన సూత్రాలన్నీ పాళీభాషలో వ్రాశాడు.

బుద్ధుడు జన్మించిన కాలంలో పరిస్థితులన్నీ అస్తవ్యస్తంగా ఉండేవి. ఆ రోజుల్లో ప్రజలు వేదాలను అత్యంతప్రమాణంగా అంగీకరించేవారు. అలాంటివారికి సంఘంలో ప్రత్యేకమైన స్థానం ఉండేది. దేశంలో వైదిక కర్మకాండ ఆచరణలో ఉండేది. వేదాలలో కూడా బ్రాహ్మణులకు అత్యంత ప్రాముఖ్యత ఉండేది. బ్రాహ్మణ ధర్మాలను అనుసరించేవారు తక్కువ కులాలవాళ్ళని హీనంగా చూసేవారు. యజ్ఞయాగాదులలో చేసే పశుహింస హింసకాదని అనేక జంతువులను యజ్ఞంలో బలి ఇచ్చేవారు. కొంతమంది ఘోరమైన తపస్సే పరమపురుషార్థమని భావించి, అడవులలో తపస్సు చేస్తుండేవారు. కఠోర నియమాలు పాటించి శరీరాన్ని శుష్కింప చేసేవారు. మండుటెండలో ఒంటికాలి మీద నుంచుని జపంచేసేవారు. దొంగ సన్యాసులు బయలుదేరి గృహస్థులను మోసంచేస్తున్నారు. పరలోకంలేదని, దేవుడు లేడని, పునర్జన్మలేదని చెబుతుండేవారు.

ఆత్మ ఉన్నదా ? లేదా ? పరలోకం సంగతి ఏమిటి ? స్వర్గ నరకాలున్నాయా? ఈ ప్రశ్నలకు సమాధానాలు గందరగోళంగా ఉండేవి. దేవుడున్నాడని, అతడే సర్వశక్తి సంపన్నుడని, అతడే సృష్టికర్త, సర్వనియంత, సర్వసాక్షి అని కొందరు, దేవుడున్నాడో లేదో తెలియదని, మానవుడే సర్వశక్తి సంపన్నుడని, మానవుణ్ణి మించిన శక్తి. ఇంకోటి లేదని, కొందరు వాదిస్తుండేవారు. తత్త్వవిచారణ చేసేవారు కొందరైతే, దాన్ని ఖండించే వారు కొందరు. మోక్షమున్నదని కొందరు, లేదని కొందరు, మోక్షాన్ని తొందరగా పొందలేమని కొందరు వాదించేవారు. ఈ బిక్షువులు, పరివ్రాజకులు, తీర్థంకరులు, బ్రాహ్మణులు, గణికులు, సంశయవాదులు, జడవాదులు, అంతా బయలుదేరి తమ వాదాలే పరమ సత్యమని ప్రజలకు బోధించేవారు. అటువంటి సమయంలో నేపాల్ ప్రాంతంలోని కపిలవస్తునగరాన్ని రాజధానిగా చేసుకుని రాజ్యం చేస్తున్న సూర్యవంశపు రాజు శుద్ధోధనుడికీ, అతని భార్య మాయాదేవికి 'లుంబినీ' వనంలో క్రీస్తు పూర్వం 567లో బుద్ధుడు జన్మించాడు. బుద్ధుడు జన్మించిన ఏడవరోజునే అతని తల్లి మరణించింది. ఇతనిపేరు సిద్ధార్థుడు. సంకల్పించినపని నెరవేరే వరకు ప్రయత్నం చేసేవాడు అని అర్థం. ఇతడికి 'సర్వార్థసిద్ధి' అనే పేరు కూడా ఉంది.

సిద్ధార్థుడికి అన్ని విద్యలు నేర్పించి యశోధర అనే అందమైన కన్యతో వివాహం చేశాడు శుద్ధోధనుడు. అయితే సిద్ధార్థుడి భార్య పేరు గోప, గోపిదేవి అని 'లలిత విస్తారము' అనే గ్రంథములో వ్రాయబడింది. సుఖంగా సంసారం చేస్తున్న సిద్ధార్థుడు ఒకరోజున నగరం చూట్టానికి వెళ్ళాడు. త్రోవలో ఒక వృద్ధుడు కనుపించాడు. అతడు నడవలేకుండా ఉన్నాడు. శరీరం ముడతలు పడిపోయింది. కళ్ళు కనపడటం లేదు. చెవులు వినపడటం లేదు. అడుగు పడటం లేదు. ఇంకొంత దూరం వెళ్ళిన తరువాత ఒక కుష్ఠరోగి కనిపించాడు. ఇంకొంత దూరం వెళ్ళిన తరువాత ఒక మృతదేహం కనుపించింది. అంత్యక్రియలు చెయ్యటానికి దాన్ని తీసుకుపోతున్నారు. ఈ మూడు దృశ్యాలు చూసిన సిద్ధార్థుడి మనస్సు వికలమై పోయింది. తాను చూసిన దృశ్యాలను గురించే ఆలోచిస్తున్నాడు. నెమ్మదిగా భోగములందు విరక్తి కలిగింది. జీవితం మీద విరక్తి కలిగింది. క్రమేణా ఆధ్యాత్మిక చింతన, తత్త్వవిచారణ, మొదలైంది. అసలు దేవుడనే వాడున్నాడా ? ఉంటే జీవులు కష్టాలు పడుతుంటే ఎందుకు చూడడు? లోకమంతా దుఃఖమయమై ఉంది. ఆ దుఃఖాన్ని నివారించటం ఎలా ? జగత్తులో అంతా నశించేదే. నాశరహితమైనది ఏది ? సత్యాన్వేషణ చెయ్యాలంటే ఇంట్లో ఉండకూడదు. ఇల్లు వదిలిపెట్టి పోవాలి. అని ఆలోచించి ఒకరోజు అర్థరాత్రి ఎవరికీ చెప్పకుండా భార్య యశోధర, కుమారుడు రాహులుడు వీరిని వదిలి తన ఇరవైతొమ్మిదవఏట సత్యాన్వేషణ కోసం బయలుదేరాడు.

బింబిసారుని రాజ్యంలోగల రత్నగిరికొండ మీద ఒక గుహలో ఉండి ఉపనిషత్తులు అభ్యసించాడు. తృప్తి కలగలేదు. బింబిసారుడు యజ్ఞ చేస్తున్నాడు. ఆ యజ్ఞం కోసం కొన్ని గొర్రెలను తోలుకుపోతున్నారు. అందులో ఒకదాని కాలు విరిగి నడవలేక పోతోంది. సిద్ధార్థుడు ఆ గొర్రెను భుజాన వేసుకుని బింబిసారుడి దగ్గరకు పోయి, అహింసను గురించి అతనికి చెప్పి, ఆ యజ్ఞం మాన్పించాడు. హిరణ్వతీ నదీ తీరంలో నివసిస్తున్న 'నాకాడ కాలమనుడు' అనే ఋషి దగ్గర సకల శాస్త్రాలు నేర్చుకున్నాడు. అక్కడే సిద్ధార్థుడికి 1. కౌండిన్యుడు 2. అశ్వజితుడు 3. భద్రకుడు 4. వప్రుడు 5. మహానాముడు అనే వారు శిష్యులైనారు. ఆ శిష్యులతో కలిసి గయలో నిరంజనానది ఫల్గుణనదితో కలిసే చోట కోతులు రాల్చినవి, చిలకలు కొరకగా క్రింద పడిన పండ్లు తింటూ ఆరు సంవత్సరాలు తపస్సు చేస్తూ సత్యాన్వేషణ

చేశాడు. అన్నపానాదులు లేకపోవటం వల్ల శక్తి లేక ఒకరోజున క్రిందపడి మూర్ఛపోయాడు. అప్పుడు అతని శిష్యులు చూసి తపోభంగమైనందువల్లే ఇలా జరిగింది అని భావించి వాళ్ళు తమ గురువును అలా వదిలి వెళ్ళిపోయారు. కొంతసేపటికి అటుగా పోతున్న గొర్రెలకాపరి సిద్ధార్థుణ్ణి చూసి, పాలు పోసి అతన్ని బ్రతికించాడు. ఆరు సంవత్సరాలు పూర్తయినా సిద్ధార్థుడికి సత్యము తెలియలేదు.

ఒకరోజున సిద్ధార్థుడు ఒక పొదమాటున తపస్సు చేసుకుంటుండగా అటువైపుగా వెడుతున్న దేవదాసీలు తమలో తాము మాట్లాడుకుంటున్నారు. అందులో ఒకావిడ "వీణవాయించేటప్పుడు హెచ్చు తగ్గులు లేకుండా శ్రుతి సవరించాలి. తీగను గట్టిగా బిగిస్తే తెగిపోతుంది. బిగువు తక్కువైతే సరిగా మ్రోగదు. కాబట్టి కావలసినంత వరకే తీగను బిగించాలి" అంది. ఆ మటలు విన్నాడు సిద్ధార్థుడు. అవి తన కోసమే భగవంతుడు దేవదాసి ముఖతః చెప్పించాడు అని భావించాడు. శరీరం నాశనమయ్యేంత తపస్సు పనికిరాదు. అన్నపానాదులు లేకపోతే శరీరము, మనసు కూడా పని చెయ్యవు. కాబట్టి అంత కఠినమైన తపస్సు పనికి రాదని నిశ్చయించుకున్నాడు. ఆ సమీపంలో ఉన్న పల్లెలో ఉండే ఒక భూస్వామికి పిల్లలు లేరు. ఆయన భార్య తనకు పిల్లలు పుడితే వనదేవతకు పాయసం సమర్పిస్తానని మ్రొక్కుతుంది. ఆమె పేరు సుజాత. ఆమెకు పిల్లవాడు పుట్టాడు. దాంతో పాయసం వండి, పిల్లవాణ్ణి తీసుకుని అడవికి వెళ్ళింది. అక్కడ పొదమాటున కూర్చున్న సిద్ధార్థుణ్ణి చూసి, అతడే వనదేవత అనుకుని పాయం సమర్పించి, పిల్లవాణ్ణి ఆశీర్వదించమంది. ఇంతలో పిల్లవాడు పాకుతూ, ప్రక్కనే ఉన్న బోధివృక్షం దగ్గరకు పోయాడు. సిద్ధార్థుడు ఆ పిల్లవాణ్ణి ఎత్తుకుని ఆశీర్వదించి, ఆ చెట్టు క్రింద పూర్ణజ్యోతి ప్రత్యక్షమయ్యేదాకా అక్కడ నుంచి కదలను అని ప్రతిజ్ఞ చేసి, ధ్యానంలో కూర్చున్నాడు. ఇక్కడ విచిత్రం ఏమిటంటే బుద్ధగయలో ఉన్నది రావిచెట్టు. పుస్తకాలలో వ్రాసింది మర్రిచెట్టని ఏది ఏమైనప్పటికీ గయలో ఒక చెట్టుక్రింద సిద్ధార్థుడు 'బోధము' పొందాడు. బోధము అంటే జ్ఞానము. అప్పటి నుంచీ అది బోధివృక్షమయింది.

సిద్ధార్థుడు బుద్ధభగవానుడయిన రాత్రి ఆయన అనేక విషయాలను చూశాడని బౌద్ధగ్రంథాలు వ్రాశాయి. అనేక పాపాలు ఆయన్నిచుట్టు ముట్టినాయి. అందమైన అప్సరాంగనలు ఆయన చుట్టూ తిరుగుతూ నాట్యం చేశారు. యశోధర వచ్చి

దీనాతి దీనంగా విలపించింది. ఇలా అనేక విషయాలు చూశాడు. అయితే మొదటి జాములో సిద్ధార్థుడు తన పూర్వజన్మలను, రెండవజాములో సమస్త లోకాలను, మూడవ జాములో ప్రతీత్యసముత్పాదాన్ని చూశాడని, నాల్గవజాములో నిర్వికల్పమైన సర్వజ్ఞస్థితిని పొందాడని అశ్వఘోషుడు 'బుద్ధచరిత్ర'లో వ్రాశాడు. సిద్ధార్థుడు దేనికోసం సమస్త భోగాలు వదలుకున్నాడో, దేనికోసమైతే పడరాని కష్టాలు పడ్డాడో, అది, ఆ అమృతము ఆయనకి ఆ రోజున వైశాఖ పూర్ణిమనాడు రాత్రి లభించింది. సిద్ధార్థుడు బుద్ధుడైనాడు.

వారణాసి దగ్గర **"ఋషిపతనమృగదానము"** అనే చోట తన ఐదుగురు శిష్యులకు బౌద్ధదీక్ష నిచ్చాడు. అక్కడే అశోకుడు సారనాథ స్థూపాన్ని నిర్మించాడు. ఆ తరువాత కపిలవస్తు నగరానికి వెళ్ళి తన తండ్రి శుద్ధోదనుడికి, భార్య యశోధరకు, కుమారుడు రాహులుడికీ బౌద్ధదీక్ష ఇచ్చాడు.

**బౌద్ధమతం :** ఆ కాలంలో ఉన్న సాంఘిక పరిస్థితులు, మూఢనమ్మకాలు, విశ్వాసాలు, ఆచరణలు నిశతంగా పరిశీలించాడు బుద్ధుడు. ప్రజలు మనోనిగ్రహం కోసం కఠినమైన నియమాలు పాటించేవారు. అర్థం తెలియకపోయినా మంత్రాలు కంఠస్థం చేసేవారు. యోగాసనాలు వేసేవారు. ఒంటి కాలిమీద నిలబడి తపస్సు చేసేవారు. వీటన్నింటినీ పరిశీలించిన బుద్ధుడు ఆద్యంతాలు లేని వాదోపవాదాలు, తాత్త్విక సిద్ధాంతాలు మానవుణ్ణి దుఃఖసాగరం నుంచి విముక్తి చేయలేవని గుర్తించాడు. వేదాలు అపౌరుషేయాలని ఒప్పుకోలేదు. మాధవసేవ కన్న మానవసేవయే మిన్న అని గుర్తించాడు. యజ్ఞయాగాదులతోను, కర్మకాండతోను, పురోహితులతోను, స్వర్గనరకాలతోను ప్రమేయం లేని ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రబోధించాడు. మానవుడు హృదయ పరివర్తన, అంతఃకరణ శుద్ధి, దయ, మనోనిగ్రహం మొదలైన నైతిక విలువలు కలిగి ఉండాలి. శీలం, సత్యం జీవకారుణ్యం, ధర్మాచరణ అనేవి బుద్ధుని బోధనలలో ముఖ్యాంశాలు. గతంలో లేనటువంటి ధర్మదీక్షకు ప్రాధాన్యత నిచ్చాడు. బౌద్ధమతంలో దైవప్రసక్తి, వాదనకోసం చేసే తత్త్వవిచారణలకు తావులేదు. ఈ లక్షణాలు బౌద్ధమతానికి ప్రత్యేక స్థానాన్నిచ్చి, బహుళ జనాదరణ పొందేటట్లు చేశాయి. అసంఖ్యామైన ప్రజలు, రాజులు కూడా బౌద్ధాన్ని స్వీకరించారు. విపరీతమైన వాదాలు, విరుద్ధభావాలు ఎక్కువగా ఉన్న ఆ రోజులలో బౌద్ధం ఒక దివ్యతేజస్సు

అయింది. బుద్ధుడు హేతువాది అయినప్పటికీ తర్కాలద్వారా ఇతరుల భావాలు. సిద్ధాంతాలు ఖండించటం ఇతని ధ్యేయం కాదు. దేవతలతోనూ, అతీతశక్తుతోను సంబంధం లేకుండా సహజమైన పద్ధతిలో, జనసామాన్యానికి అర్థమయ్యే రీతిలో సత్యాన్ని పరిశీలించటానికి ప్రయత్నం చేసి **హేతువాది** అయ్యాడు. తాను చెప్పదలచుకున్న విషయాలు అనుమానం లేకుండా స్పష్టంగా చెప్పాడు. తాను నమ్మినసత్యంద్వారా లోకంలో దుఃఖాన్ని రూపుమాపటానికి ప్రయత్నించాడు. బుద్ధుడు అన్ని భావాలను, సిద్ధాంతాలను తీసుకుని, నిశతంగా పరీక్షించి, పరీక్షలో తట్టుకుని నిలబడ్డ వాటినే ప్రచారం చేశాడు. తాను నమ్మిన సత్యాలనే శిష్యులకు బోధించాడు.

**లక్షణత్రయము :** ప్రపంచంలో ఉన్న పదార్థాలన్నింటిలోనూ, అనుభవాలన్నింటి లోనూ కూడా మూడు లక్షణాలుంటాయనే మూల విశ్వాసం బౌద్ధమతంలో కనిపిస్తుంది. వీటినీ బౌద్ధ లక్షణత్రయం అంటారు. అవి 1. దుఃఖము 2. అనిత్యము 3. అనాత్మ

ఇప్పటిదాకా అణుసిద్ధాంతాన్ని నిరాకరించిన వ్యాసభగవానుడు ఇప్పుడు బౌద్ధమతాన్ని ఖండిస్తున్నాడు. బుద్ధుని ఉపదేశాలను ఆధారం చేసుకున్న శిష్యులు నాలుగు శాఖలుగా చీలిపోయారు. వారు వరుసగా

1. వైభాషికులు 2. సౌత్రాంత్రికులు 3. విజ్ఞానవాదులు 4. సర్వశూన్యవాదులు

వీటిలో ముందుగా మొదటి ఇద్దరి వాదాన్ని ఉటంకిస్తున్నారు.

***సూత్రం - 189 "సముదాయ ఉభయహేతుకేపి తద ప్రాప్తిః"***

పరమాణు హేతుకమైన బాహ్యసముదాయము, స్కంధహేతువైన ఆధ్యాత్మ సముదాయంలో కూడా తమంతట తాముగా సముదాయం సిద్ధించదు.

లోకంలోని పదార్థమంతా బాహ్యము, అభ్యంతరము అని రెండు విధాలు. బాహ్యపదార్థం మళ్ళీ రెండు రకాలు. 1. భూతము 2. భౌతికము. అభ్యంతర పదార్థము కూడా రెండు విధాలు 1. చిత్తము 2. చైత్త్వము

1. భూతము అంటే – భూమి, జలము, అగ్ని, వాయువులు

2. భౌతికము అంటే – స్పర్శ, రూప, రస, గంధాలు

వీటిలో ఆకాశము, దాని లక్షణమైన శబ్దము లేవు. భౌతిక పదార్థాలన్నీ ఆ నాలుగు భూతాలకు సంబంధించినవే.

వీటిలో భూమికి సంబంధించిన పరమాణువులు – కఠిన స్వభావం గలవి.

జలానికి సంబంధించిన పరమాణువులు – స్నేహస్వభావం గలవి

అగ్నికి సంబంధించిన పరమాణువులు – ఉష్ణస్వభావం గలవి

వాయువుకు సంబంధించిన పరమాణువులు – చలన స్వభావం గలవి

ఈ పరమాణువుల స్వరూపమే జగత్తు.

బాహ్యసముదాయం పరమాణు హేతువు. ఆధ్యాత్మిక సముదాయం స్కంద హేతువు. ఈ రెండూ అచేతనాలే. ఈ రెండు అచేతనాలను ఒకచోట చేర్చే సంధాన కర్త ఒకడుండాలి. అటువంటివాడు ఉన్నాడని వీరు అంగీకరించటం లేదు.

***సూత్రం – 190 "ఇతరేతరప్రత్యయత్వాదితి చేన్నోత్పత్తి మాత్రనిమిత్తత్వాత్"***

అవిద్యాదులు ఒక దానికి ఒకటి కారణమైనంత మాత్రంచేత, చేతనుడు లేకపోయినప్పటికీ ఉత్పత్తి జరుగుతుంది అని వారంటారు. అది నిజం కాదు.

అవిద్యాదులన్నీ ఒకదానికి ఒకటి పుట్టటానికి మాత్రమే కారణమవుతాయి. అంతేకాని సముదాయోత్పత్తికి మాత్రం కాదు. సముదాయోత్పత్తి కావాలంటే చేతనుడు ఉండాల్సిందే. కాబట్టి వీరివాదన సరికాదు.

***సూత్రం – 191 "ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్"***

వీరి మతంలో ఉత్తర కార్యోత్పత్తి జరిగే సమయానికి, పూర్వకారణం నశిస్తోంది. కాబట్టి హేతువుకు అధీనమైన కార్యోత్పత్తి కూడా జరగదు.

వీరి మతానుసారము అవిద్య, సంస్కారము, విజ్ఞానము, నామము, రూపము మొదలైన వాటిలో అవిద్య వల్ల సంస్కారం పుడుతుంది. సంస్కారం పుట్టగానే అవిద్య నశిస్తుంది. సంస్కారం నుంచి విజ్ఞానం పుడుతుంది. విజ్ఞానం పుట్టగానే సంస్కారం నశిస్తుంది. విజ్ఞానం నుంచి నామం పుడుతుంది. నామం పుట్టగానే విజ్ఞానం నశిస్తుంది. ఈ రకంగా ఉత్తర కార్యాలు నశించినప్పుడు, పూర్వకార్యాలు నశిస్తాయి. నశించిన వస్తువు ఇంక ఉండదు. లేనిది కారణం కాదు కదా! కాబట్టి కారణాన్ని అనుసరించి కార్యోత్పత్తి జరగదు. ఇది ఒక దోషం.

***సూత్రం - 192 "అసతి ప్రతిజ్ఞోపరోధో యౌగపద్య మన్యథా"***

కారణం లేకుండానే కార్యం జరుగుతుంది. అని వారు చెప్పిన దానికి భంగం కలుగుతుంది. అలా కాక కార్యం కలిగేంతవరకు కారణం ఉంటుంది అన్నా, వారు చెప్పే దానికి భంగం కలుగుతుంది.

బౌద్ధమతంలో ఇది ఎరుపు. ఇది నలుపు అనే జ్ఞానరూపమైన కార్యం పుట్టాలి అంటే పూర్వజ్ఞానము, చక్షుసు, ఆ లోకము (చూచుట) విషయము అనే నాలుగు హేతువులుండాలి. కాబట్టి కారణం లేకుండా కార్యం పుడుతుందని అంగీకరిస్తే వారి వాదనకు భంగం వస్తుంది. అలాగే కారణం ఉన్నప్పుడే కార్యం ఉంటుంది. అని అంగీకరించినా వారి వాదనకు భంగం వస్తుంది. ఎందుకంటే కార్యకారణాలు ఒకే కాలంలో ఉంటాయి కాబట్టి సర్వం క్షణికం అనే మాటకు భంగం వాటిల్లుతుంది. ఈ రకంగా బౌద్ధుల వాదన తప్పు అవుతోంది.

***సూత్రం - 193 "ప్రతిసంఖ్యా ప్రతిసంఖ్యా నిరోధాప్రాప్తే రవిచ్ఛేదాత్"***

ఇక్కడ రెండు పదాలున్నాయి. 1. ప్రతి సంఖ్యా నిరోధము - బుద్ధి పూర్వకమైన నాశనము ఇదే స్థూలనాశనము.

2. అప్రతిసంఖ్యా నిరోధము - బుద్ధి పూర్వకము కాని నాశనము. సహజంగా జరిగే నాశనము.

ఈ రెండు వినాశనాలు బౌద్ధులు కల్పించుకున్నవే. వీరి భాషలో భావాలు అంటే కుండ, వస్త్రము మొదలైనవి. ఇవి ప్రతిక్షణం నశించి పోతుంటాయి. అంటే - వాటంతట అవే నశిస్తాయి. అలాంటప్పుడు బుద్ధి పూర్వక నాశనానికి అవకాశం లేదు.

వీరి మతం ప్రకారం ప్రతిక్షణం నశించటము అంటే కుండ వాటి మూల పదార్ధమైన మట్టి నాశనం అయ్యే వరకు నశిస్తుంది అనాలి. నశించిన కుండే మళ్ళీ పుట్టింది అనాలి. అలాకాక ఇంకొక కుండ వచ్చింది అంటే వెనుకటి కుండ, ఇప్పటి కుండ ఒకటే అని అనిపించదు. జాగ్రత్తగా పరిశీలించినట్లైతే కుండ, వస్త్రము మొదలయిన వస్తువులలో మట్టి, దారాల యొక్క అనుబంధం స్పష్టంగా కనిపిస్తుంది. కాబట్టి అప్రతి సంఖ్యానిరోధము బుద్ధి పూర్వకం కాని నాశనము జరగటం లేదు. కాబట్టి వారి వాదన తప్పు.

***సూత్రం – 194 "ఉభయథా చ దోషాత్"***

అవిద్య అనేది జ్ఞానంవల్ల నశిస్తోందా? లేక తనంతట తానే నశిస్తోందా?

క్షణికములైన వాటిని శాశ్వతమని భావించటమే అవిద్య. యమ నియమాలతో కూడిన మార్గం ఈ అవిద్యను నిరోధిస్తుంది. అని బౌద్ధుల వాదన. జ్ఞానంవల్లనే అవిద్య నిరోధించబడుతోంది అంటే, అన్ని వస్తువులకు నాశనం ఏర్పడుతుందనే వాదన తప్పవుతుంది. అలా కాకుండా దానంతట అదే అవిద్య నశించిపోతుంటే, సర్వం క్షణికం అన్న బుద్ధుని బోధలు తప్పవుతాయి. ఏ రకంగా చూసినా వీరి వాదనకు బలం లేదు.

***సూత్రం – 195 "ఆకాశే చావిశేషాత్"***

ఆకాశం అనేది ఒక వస్తువు కాదు అంటారు బౌద్ధులు. బౌద్ధమతంలో ఆకాశము అంటే ఆవరణ లేకపోవటము. అని అర్థం చెపుతూ, భూమి మొదలైన వాటిలాగా ఆకాశముకూడా ఒక వస్తువే అని భావించటం లేదు.

కాని ఆకాశం కూడా ఒక వస్తువే. ఆకాశము అంటే అవకాశం కల్పించేది. నేలమీద కుండను ఉంచినప్పుడు, ఆ కుండకు ఆధారంగా భూమి ఉన్నదనే భావం కలుగుతోంది. ఆకాశంలో పక్షులుగాని, విమానాలు గాని ఎగురుతున్నప్పుడు వాటికి ఆధారంగా నిలిచేది ఆకాశమే. ఈ విధంగా ఆకాశం కూడా ఒక వస్తువే. **తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పినట్లుగా పరబ్రహ్మ నుండి ఆకాశం పుట్టింది. ఈ రకంగా ఆకాశం కూడా ఒక వస్తువులాగానే పుట్టింది. అని ఉపనిషత్తులలో చెప్పబడింది. కాబట్టి ఆకాశం కూడా ఒక వస్తువు లాంటిదే.

***సూత్రం – 196 "అనుస్మృతేశ్చ"***

బౌద్ధుల వాదం ప్రకారం సర్వము క్షణికం, అంటే ఆత్మకూడా క్షణికమే అంటారు. కాని అది నిజం కాదు.

ఆత్మ శాశ్వతమైనది. అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ ఉండేది. ఆత్మే నిత్యము సత్యమైనది. ఈ విషయం ఉపనిషత్తులలో స్పష్టంగా అనేకసార్లు చెప్పబడింది. కాబట్టి ఆత్మక్షణికమైనది అని చెప్పే బౌద్ధుల వాదన తప్పు.

***సూత్రం – 197 "నాసతో దృష్టత్వాత్"***

అసత్తు, అభావం నుండి ఏమీ పుట్టదు. బౌద్ధమతంలో స్థిరమైనది అంటూ ఏమీ లేదు. సర్వమూ క్షణికం. విత్తనం నుండి మొలక పుడుతోంది. అంటే విత్తనం తన రూపాన్ని కోల్పోయి అభావరూపం పొందుతుంది. తరువాత అంకురం వస్తోంది. కాబట్టి బీజం యొక్క అభావ భావం నుండి (లేకపోవటమనే దాని నుండి) వస్తువు పుడుతోంది. అని వారి వాదం.

అభావం నుంచి భావం ఎప్పుడూ పుట్టదు. లేని వస్తువు నుంచి ఉన్న వస్తువు ఎలా పుడుతుంది? అభావానికి కారణమయ్యే శక్తి ఉండదు. కుందేటి కొమ్ము నుండి ఏమీ పుట్టదు. బీజం నశించినప్పుడు కూడా అందులోని బీజవాయువులే అంకురానికి కారణమవుతాయి. అంతే కానీ పప్పుబద్దల్లాగా ఉండే బీజదళాల నాశనాన్ని చూసి బీజం అంతా నశించిందనుకోవటం తప్పు.

***సూత్రం – 198 "ఉదాసీనానామపి చైవం సిద్ధిః"***

అభావం నుండి భావం పుడుతుందనే మాట అబద్ధం. ఈ మాటే గనక నిజమైతే వ్యవసాయం చెయ్యవలసిన అవసరం లేదు. ఇంట్లో కూచుని కోరుకుంటే చాలు కోరికలు నెరవేరాలి. ఈ రకంగా కష్టపడకుండా కోరికలు తీరితే కర్మ చెయ్యాల్సిన పనే ఉండదు. స్వర్గ నరకాలు అసలే ఉండవు.

కాబట్టి బౌద్ధులవాదం సరియైనది కాదు. అంటూ నాల్గవ అధికరణ పూర్తి చేశారు.

## 5. అభావాధికరణము (యోగాచారుల మతఖండన)

ఐదవ అధికరణలో యోగాచారుల మతాన్ని ఖండిస్తున్నారు. దీనిపేరు **అభావాధికరణము.** ఇందులో ఐదు సూత్రాలున్నాయి.

బౌద్ధమతాన్ని స్థాపించినవాడు సిద్ధార్థుడు. అతడే గౌతమబుద్ధుడు. అతని తరువాత బౌద్ధమతం హీనయానము, మహాయానము, వైభాషికులు, సౌత్రాంతికులు, యోగాచారులు, మాధ్యమికులు అంటూ అనేక శాఖలుగా చీలిపోయింది. వీటిలో మాధ్యమికులు శూన్యవాదులు కాగా యోగాచారులు విజ్ఞానవాదులు.

క్రీస్తుశకం మూడవ శతాబ్దం ఆఖరున, నాల్గవ శతాబ్దం ప్రారంభంలో ఆర్యసంగుడు (ఇతణ్ణే అసంగుడు అని కూడా అంటారు) అతని సోదరుడైన వసుబంధుడు ఈ శాఖను ప్రారంభించారు. అలా కాదు మైత్రేయనాథుడు ఈ శాఖను ప్రారంభించాడని ఒక వాదము.

బుద్ధులైన వారు దర్శించిన పరమసత్యాన్ని యోగాభ్యాసము వల్లనే పొందారని, యోగాభ్యాసము లేకపోతే బుద్ధులు కాలేరని చెప్పటం వల్ల వీరు యోగాచారులు అనబడ్డారు.

వీరి అనుష్ఠానపద్ధతి, తత్త్వవిచారము అంతా విజ్ఞానవాదంగా ఉంటుంది. అందుకే వీరిని **'విజ్ఞానవాదులు'** అని కూడా అంటారు.

వీరివిజ్ఞానము రెండు విధాలుగా ఉంటుంది.

**1. ఆలయ విజ్ఞానము :** ఇది సమష్టి విజ్ఞానము. సముద్రంలో అలలు పుట్టి, కొంత దూరం ప్రయాణించి మళ్ళీ సముద్రంలోనే కలిసిపోతాయి. మళ్ళీ క్రొత్త తరంగాలు పుడతాయి. ఈ విధంగా సముద్రం ఎప్పుడూ క్రియావంతంగా ఉంటుంది. అలాగే వ్యక్తులుకూడా, ఆలయ విజ్ఞానం నుంచి జ్ఞానసముపార్జన చేసి మళ్ళీ అందు లోనే లయమవుతారు. విశ్వపరిమాణము పొందిన విజ్ఞానమే ఆలయ విజ్ఞానము.

**2. వ్యక్తి విజ్ఞానము :** దీన్ని జీవవిజ్ఞానము, వ్యష్టి విజ్ఞానము అని కూడా అంటారు. దీనికి ఆలయ విజ్ఞానానికి భేదము నామమాత్రమే. సముద్రానికి, అలలకు ఉండే తేడా వంటిది. పంచేంద్రియాల నాశ్రయించి పుట్టే విజ్ఞానము మనోవిజ్ఞానము. ఇది శరీరాలు గాను మందిరాలుగాను భాసిస్తుంది.

**తథత :** ఈ రెండు విజ్ఞానాలకన్నా పరమైనది 'తథత' అంటారు. అది ఇలా ఉంటుంది. అని చెప్పటానికి వీలు కానిది. పరమసత్యము. భావాభావాలు, జ్ఞానాజ్ఞానాలు కానిది. సదసత్తులు కానిది. జనన మరణాలు లేనిది, వృద్ధిక్షయాలు లేనిది, చలనము లేనిది. ఇదే పరతత్త్వము అంటారు. తథత అంటే శూన్యము కాదు.

**యోగదర్శనాన్ని** చెప్పినవాడు పతంజలిమహర్షి. మానవుడికి అంతఃదృష్టి సామర్థ్యాన్ని కలుగచేసేదే యోగశాస్త్రం. ఇది అనుష్ఠాన ప్రాధాన్యత గల శాస్త్రం.

సాంఖ్య ప్రవర్తకులు ఎక్కడ ఆగిపోయారో, అక్కడ నుంచి మొదలవుతుంది యోగశాస్త్రము. సాంఖ్యులు "ప్రకృతి పురుషుల సంయోగము బంధహేతువు. ప్రకృతి పురుష వివేక ఖ్యాతి బంధవిముక్తికి ఏకైక మార్గం. ఈ వివేకఖ్యాతి కావాలంటే యోగసాధన చెయ్యాలి" అని చెప్పి అక్కడ ఆగిపోయారు. యోగశాస్త్రం, ఆ యోగాన్ని వివరించి 'యోగదర్శనం' అయింది. సాంఖ్యులు చెప్పిన ఇరవై ఐదు తత్త్వాలకు ఇంకొకటి కలిపి ఈశ్వరుడు అనే ఇరవైఆరవ తత్త్వాన్ని చెప్పారు యోగులు. అంతేకాక సాంఖ్యులు చెప్పిన తత్త్వాలను సాక్షాత్కరించుకునే మార్గం దీనిలో చెప్పబడింది. ఈ రకంగా యోగదర్శనం సాంఖ్యదర్శనంతో గట్టి సంబంధం కలిగి ఉంది.

యోగదర్శనానికి మూలం వేదాలలో ఉంది. వేదాలలో దీన్ని 'ప్రాణవిద్య' అంటారు. ప్రసిద్ధి చెందిన 108 ఉపనిషత్తులలోను 21 ఉపనిషత్తులు యోగవిజ్ఞానానికి సంబంధించినవి. ప్రాచీన భారతీయ సాహిత్యంలోను, జైన బౌద్ధ గ్రంథాలలోను కూడా యోగరహస్యాలు అనేకం చెప్పబడ్డాయి. మనకి లభించిన గ్రంథాలలో పతంజలిమహర్షి వ్రాసిన స్మృతి ప్రకారం యోగశాస్త్ర ప్రవర్తకుడు హిరణ్యగర్భుడు. యోగసూత్రాలు శివప్రోక్తము అని సాంప్రదాయకుల విశ్వాసం. పతంజలి యోగసూత్రాలతో పాటు వ్యాకరణ సూత్రాలు వైద్యశాస్త్రం కూడా వ్రాశాడు అంటారు.

పతంజలి చెప్పిన యోగదర్శనంలో నాలుగు పాదాలున్నాయి. అవి 1. సమాధి పాదం 2. సాధన పాదం 3. విభూతి పాదం 4. కైవల్య పాదం. ఈ దర్శనంలో మొత్తం 195 సూత్రాలున్నాయి. అవి సమాధి పాదంలో 51. సాధన పాదంలో 55, విభూతి పాదంలో 55, కైవల్యపాదంలో 34 సూత్రాలున్నాయి.

**1. సమాధిపాదం :** ఇందులో యోగం యొక్క ఉద్దేశ్యము, లక్షణము, చిత్తవృత్తులు, యోగ ఉపాయాలు, యోగభేదాలు చెప్పబడ్డాయి.

**2. సాధనపాదం :** ఇందులో క్రియాయోగం, క్లేశాలు, కర్మవిపాకము, చతుర్వ్యూహాలు, అష్టాంగయోగం వివరించారు.

**3. విభూతిపాదం :** ఇందులో ధారణ, ధ్యాన, సమాధి, యోగంవల్ల కలిగే వివేక జ్ఞానము, విభూతి చెప్పబడ్డాయి.

**4. కైవల్యపాదం :** ఇందులో ముక్తికి యోగ్యమైన చిత్తం, పరలోక సిద్ధి, బాహ్యార్థసిద్ధి, ఆత్మసిద్ధి, ధర్మమేఘ సమాధి, జీవన్ముక్తి, విదేహ కైవల్యము చెప్పబడ్డాయి.

పతంజలి యోగదర్శనం మీద ప్రామాణికమైన వ్యాఖ్య **'వ్యాసభాష్యం'**. వ్యాస భాష్యానికి **వాచస్పతిమిశ్రుడు** వ్రాసిన **తత్త్వవైశారది** ముఖ్యమైనది. ఇది కాక సాంఖ్యకారుడైన విజ్ఞానభిక్షువు వ్రాసిన **యోగవార్తికము, యోగసార సంగ్రహము** యోగాన్ని వివరించాయి. ఇవి కాక భోజుడు వ్రాసిన **భోజవృత్తి,** భావగణేశుడు వ్రాసిన **భావగణేశవృత్తి,** రామానంద యతి వ్రాసిన **మణిప్రభ,** అనంత పండితుడు వ్రాసిన **యోగచంద్రిక,** సదాశివేంద్ర సరస్వతి వ్రాసిన **యోగసుధాకరము,** నాగోజీభట్టు వ్రాసిన **లఘు, బృహత్‌వృత్తులు** ప్రసిద్ధమైనవి. వీటన్నింటిలోకి భోజవృత్తి అత్యంత శ్రేష్ఠమైనది.

యోగదర్శనం ప్రకారం జీవుడు స్వతంత్రుడు. అతడు సాధారణంగా స్థూలశరీరాన్ని, ముఖ్యంగా సూక్ష్మశరీరాన్ని (జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి) ఆశ్రయించి ఉంటాడు. స్వాభావికంగా అతడు శుద్ధచైతన్య స్వరూపుడు. శారీరక బంధనాలకు, మానసిక వికారాలకు అతీతంగా ఉంటాడు. అజ్ఞానంవల్ల తనను తాను చిత్తంగా భావించుకుంటాడు. ఆ చిత్తంతో తాదాత్మ్యం పొందుతాడు. చిత్తము అనేది ప్రకృతియొక్క మొదటి వికారం. ఇది త్రిగుణాత్మకం. ఇందులో సత్త్వగుణం ఎక్కువగా ఉంటుంది. చిత్తమనేది ప్రకృతి సంతానం కాబట్టి చిత్తంకూడా జడమే. కాని పురుషుడితో సాన్నిహిత్యం పొంది చైతన్యం పొందుతుంది. చిత్తం శుద్ధసత్త్వం. కాబట్టి అత్యంత నిర్మలం. దానిపై పురుషుని (ఆత్మ) ప్రతిబింబంపడి, దానికి చైతన్యం కలుగుతుంది. ఇంద్రియాల ద్వారా చిత్తానికి ఏదైనా వస్తువుతో సంబంధం కలిగితే, దాని ఆకారం పొందుతుంది. ఇలా చిత్తం వికారాలు పొందుతుంది. చిత్తం పొందే వికారాల ద్వారా పురుషుడికి విషయజ్ఞానం కలుగుతుంది. స్వభావరీత్యా పురుషుడు నిర్వికారి. కాని నిత్యము పరిణామశీలమైన చిత్తవృత్తులలో ప్రతిబింబిస్తున్న కారణంచేత, అతనిలో పరిణామశీలత ఆభాస మాత్రంగా గోచరిస్తుంది. సరస్సులో నీరు కదులుతున్నప్పుడు, అందులోని చంద్రబింబం కూడా కదులుతున్నట్లుగా ఉంటుంది. అలాగే చిత్తవృత్తులు వికారాలకు లోనవుతుండగా, అవి పురుషుడిలోనే కలుగుతున్నట్లనిపిస్తుంది. ఇక్కడ

ముఖ్యమైన విషయం ఏమంటే, వాస్తవానికి చిత్తం ఉపకరణం మాత్రమే. పురుషుడు ద్రష్ట. కాని నిరంతరము పరిణామశీలమైన చిత్తవృత్తులలో ప్రతిఫలిస్తున్న కారణంచేత అతనిలో వికారాల ఆభాసన కలుగుతుంది. చిత్తవృత్తులు ఆగిపోతే వికారాలు తగ్గుతాయి. అప్పుడు పురుషుడిలో వికారాల ఆభాస పోయి, అతడు స్వస్థితి పొందుతాడు. చిత్తవృత్తుల నిరోధాన్ని యోగదర్శనం వివరిస్తుంది.

**యోగస్వరూపము : 'యోగ'** అనే శబ్దానికి **'సమాధి'** అని అర్థం. చిత్తవృత్తులు లేని స్థితినే సమాధి అంటారు. 'యోగః సమాధిః' అని వ్యాసుడు భాష్యం చెప్పాడు. **'యోగశ్చిత్త వృత్తినిరోధః'** యోగం చిత్తవృత్తులను నిరోధిస్తుంది అని పతంజలి యోగసూత్రాలు వివరిస్తున్నాయి. యోగంవల్ల పురుషుడికి స్వస్వరూప జ్ఞానం కలుగుతుంది. చిత్తవృత్తి నిరోధము. ఇక్కడ నిరోధము అంటే లేకుండా చేయటం అని కాదు. అడ్డగించటము, లేదా నిలుపు చేయటము, ఆపటము అని అర్థం. అంటే చిత్తం ఏకాగ్రస్థితిని పొందినప్పుడు బాహ్యావృత్తులు అన్నీ అడ్డగించబడతాయి. క్రొత్తగా వృత్తులు ఏర్పడవు. ఈ రకంగా చిత్తంలో ఏ వృత్తులు లేని స్థితి **'నిరుద్ధస్థితి'** ఈ స్థితిలో అన్ని వృత్తులూ, సంస్కారాలు లీనమై పోతాయి. అప్పుడు చిత్తం శుద్ధ సత్త్వగుణం కలిగి, నిర్మలమైన దర్పణంలాగా ఉంటుంది. ఆ సమయంలో పురుషుడికి వివేకం కలుగుతుంది. అతడు స్వస్వరూప జ్ఞానం పొంది ముక్తుడౌతాడు.

గురూపదేశంతో అవిద్య, అజ్ఞానము నశిస్తుంది. కాని దేహములో ఉండే దోషాలను యోగంతో మాత్రమే నశింపచెయ్యాలి. దేహికి దేహము అద్దం లాంటిది. అద్దం స్వచ్ఛంగా ఉంటేనే, అందులో బింబం చక్కగా కనిపిస్తుంది. అద్దానికి మకిలపడితే, దాన్ని తోమి శుభ్రం చెయ్యాలి. అలాగే దేహంలో ఉండే మాలిన్యాలను యోగాభ్యాసంతో నశింపచెయ్యాలి. గురూపదేశంతో జ్ఞానాన్ని పొంది, విరక్తి చెందిన వాడి, దోషాలను నశింపచెయ్యటానికి యోగాన్ని మించిన మార్గం లేదు. ఇక్కడ పంచక్లేశములు చెప్పబడుతున్నాయి. అవి 1. అవిద్య 2. అస్మితము 3. రాగము 4. ద్వేషము 5. అభినివేశం.

**1. అవిద్య :** ఇది జ్ఞానానికి విరోధమైన విపర్యజ్ఞానం. అసత్యాన్ని సత్యమని, అనిత్యాన్ని నిత్యమని, అనాత్మ వస్తువును ఆత్మవస్తువని, అపవిత్రమైన దాన్ని పవిత్రమని భావించటము.

**2. అస్మితము :** ప్రకృతి వికారమైన చిత్తం, దర్శనశక్తి భోగసాధనం మాత్రమే అయినప్పటికీ, తానే ద్రష్టనని, భోక్తనని భ్రమించి 'అహమస్మి' అనే అభిమానాన్ని పొందుతుంది. ఇదే అస్మితమనబడుతుంది. ఇక్కడ నిజానికి ద్రష్ట కాని, భోక్త కాని చిత్తమే. పురుషుడు మాత్రం కాదు.

**3. రాగము :** అస్మితవల్ల విషయాల పట్ల రాగద్వేషాలు పుట్టుకొస్తాయి. సుఖము అంటే ఏమిటో తెలుసుకుని దాన్ని పొందాలనే ఆసక్తి కలిగి ఉండటమే రాగం.

**4. ద్వేషం :** దుఃఖము అంటే ఏమిటో తెలుసుకుని,, దాన్ని వదిలించుకోవాలను కోవటం. దాని పట్ల వైరభావం కలిగి ఉండటం. దీన్నే ద్వేషం అంటారు.

**5. అభినివేశం :** అంటే మృత్యుభయం. గతజన్మలో దాన్ని అనుభవించాము. కాబట్టి దానియొక్క వాసనారూప సంస్కారము ఈ జన్మలో కూడా చిత్తాన్ని అంటి ఉంటుంది. అందుచేత మరణము అంటే భయం కలుగుతుంది. ఈ కారణంచేతనే ప్రతి ఒక్కడూ జీవించాలనే ఆశపడతాడు. ఇది పండితులకు గాని, పామరులకు గాని సమానంగానే ఉంటుంది.

ఈ దేహం నాది. ప్రతిపనీ నేనే చేస్తున్నాను వీరంతా నా వాళ్ళు. నా భార్య. నా పిల్లలు. నా ఆస్తిపాస్తులు అనుకుంటాడు అవిద్యతో కూడిన మానవుడు. అజ్ఞానం గనక నశించినట్లైతే, రాగద్వేషాలను వదిలిపెడతాడు. అప్పుడు ఈ లోకంలో గాని, పరలోకంలోగాని భోగాలు పొందాలనే కోరిక ఉండదు. అలా కోరిక లేని పురుషుడు ముక్తి కోసం యోగాన్ని అభ్యసించాలి.

ఈ అధికరణలో యోగాచారుల మతాన్ని ఖండిస్తున్నారు. యోగాచారుల ప్రకారం బాహ్యపదార్థాలనేవి లేవు. వీరి మతం ప్రకారము విజ్ఞానమనేది ఒక్కటే ఉన్నది. మనకు కనిపించే ఎరుపు, తెలుపు, నీలము రంగులన్నీ విజ్ఞానం యొక్క ఆకార విశేషాలే. కలలో కనిపించేవి కూడా విజ్ఞానం యొక్క ఆకార విశేషాలే. ఈ విధంగా సర్వత్రా విజ్ఞానమే బాహ్యాకారాన్ని పొందుతున్నదని వీరి వాదన.

***సూత్రం – 199 "నాభావ ఉపలబ్ధేః"***

విజ్ఞానం కన్న ఇతర పదార్థాలు లేవనేది నిజం కాదు. బాహ్యపదార్థాలు గోడ, కుండ, వస్త్రము లాంటివి కంటికి కనిపిస్తున్నాయి. అలాంటప్పుడు విజ్ఞానం తప్ప ఇతర వస్తువులు లేవనటం సరికాదు.

**సూత్రం - 200 "వైధర్మ్యాచ్చనస్వప్నాదివత్"**

స్వప్నావస్థకూ, జాగ్రదావస్థకు భేదం ఉన్నది. స్వప్నంలో కనిపించిన వస్తువుల్లాగా జాగ్రదావస్థలో కూడా విజ్ఞానం తప్ప ఇతర పదార్థాలేమీ లేవు. అనే వాదన తప్పు.

యోగాచార్యులు జాగ్రదావస్థలో ఉన్నవేవీ కూడా విజ్ఞానంకన్న భిన్నమైనవి, తెలుసుకోవలసినవి కాదు. స్వప్నావస్థలోని విజ్ఞానం లాంటిదే జాగ్రదావస్థలో కూడా అంటారు. ఇది సరికాదు. స్వప్నానికి జాగ్రత్తకు పోలిక లేదు. కలలో కనిపించిన వస్తువు, మెలకువ రాగానే కలతో పాటుగానే కరిగిపోతుంది. కాని జాగ్రదావస్థలో అలా కాదు. ఈ వస్తువులు అలాగే ఉంటాయి. అందరికీ ఉన్నట్లుగానే కనిపిస్తాయి. (స్వప్నంలో మన ఒక్కరికే కనిపిస్తాయి) కలలో కనిపించిన దానికి, దాని అనుభవానికి కారణం గుర్తు ఉండటం. కాని జాగ్రత్తలో ప్రత్యక్షానుభవం ఉన్నది. వస్తువును తాకుతున్నాం. అనుభవిస్తున్నాం. అందరికీ చూపిస్తున్నాం. ఇంకొకరికి ఇస్తున్నాం. ఈ రకంగా జాగ్రస్వప్నాలకు తేడా ఉన్నది. స్వప్నావస్థ లాంటిదే జాగ్రదావస్థ కూడా అనటం తప్పు.

**సూత్రం - 201 "నభావోఽనుపలబ్ధేః"**

యోగాచారుల ప్రకారం బాహ్యపదార్దాలు లేవు. కాబట్టి వాటివలన వచ్చే వాసనలు కూడా ఉండవు అంటారు.

వీరి మతానుసారము బాహ్యపదార్థాలు లేవు. కాబట్టి వాసనలు, సంస్కారాలు కూడా ఉండవు. వాటి అనుభవం కూడా ఉండదు. అనుభవం ఉంటేనే గాని వాసనలు, సంస్కారాలు జనించవు. కాబట్టి వాసనా వైచిత్ర్యంవల్ల జ్ఞానవైచిత్ర్యం కలుగుతోంది అనటం సరికాదు. వాసనే లేనప్పుడు దానివల్ల జ్ఞానం కలగటం అసంభవం.

**సూత్రం - 202 "క్షణికత్వాచ్చ"**

ఆలయ విజ్ఞానం కూడా క్షణికం అన్నారు కాబట్టి అది కూడా వాసనలకు ఆశ్రయం కాలేదు.

ఆలయ విజ్ఞానము అంటే - ఈ మతంలో నేను, నేను అంటూ అందరికీ ఎప్పుడూ అన్వయించే జ్ఞానపరంపర. ఇటువంటి ఆలయ విజ్ఞానమే వాసనలకు ఆశ్రయం అని వీరంటారు.

శూన్యవాదులు ఈ ఆలయ విజ్ఞానాన్ని క్షణికము అంటారు. కాబట్టి ఆలయ విజ్ఞాన పరంపర వాసనలకు ఆశ్రయం కాజాలదు.

***సూత్రం - 203 "సర్వథానుపపత్తేశ్చ"***

ఏ విధంగా చూసినా బౌద్ధదర్శనం ఆమోదం కాదు. వీరు చెప్పే బాహ్యార్థవాదం, విజ్ఞానవాదం, శూన్యవాదం, ఏవీ యుక్తియుక్తంగా లేవు. పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. కాబట్టి ఈ మతం అంగీకారం కాదు.

## 6. నైకస్మిన్నసంభవాధికరణము (జైనమత ఖండన)

ఆరవదైన **'నైకస్మిన్న సంభవాధికరణం'**లో జైమతాన్ని ఖండిస్తున్నారు. ఇందులో నాలుగు సూత్రాలున్నాయి.

ముందుగా జైనమతాన్ని చూద్దాం.

'జినుడు' అంటే జయించినవాడు అని అర్థం. ఇంద్రియాలను జయించినవాణ్ణి జినుడు అంటారు. మనకి అర్థం అయ్యే భాషలో చెప్పాలంటే అంతరింద్రియ నిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము గలవాడు, శమదమాది గుణాలు గలవాడు మాత్రమే జినుడు అనబడతాడు. జినుని అనుసరించిన వారే జైనులు.

సృష్టి ప్రారంభంలో ఉన్నవాడు స్వాయంభువ మనువు. అతని కుమారుడు – ప్రియవ్రతుడు. ప్రియవ్రతుని కుమారుడు – అగ్నీధ్రుడు. అగ్నీధ్రుని కుమారుడు – నాభి. నాభి కుమారుడు ఋషభుడు అంటే ప్రియవ్రతుని ముని మనవడు – ఋషభుడు స్వాయంభువ మనువు వంశంలో ఐదవవాడు. ఈ ఋషభుడే జైనమత స్థాపకుడు, మొదటి తీర్థంకరుడు. తీర్థంకరుడు అనే పదానికి – ప్రచారకుడు, జైన మత ప్రవక్త అని అర్థం. దీనిని బట్టి జైనమతం చాలా ప్రాచీనమైనది అని తెలుస్తోంది. ఈ మతంలో తీర్థంకరులందరూ క్షత్రియులే. 20, 22 తీర్థంకరులు తప్ప, మిగిలిన వారంతా కూడా ఇక్ష్వాకు వంశంలోని వారే కావటం విశేషం. జైనమతంలో 19వ తీర్థంకరి **"మల్లినాథ"** అనే స్త్రీ. 23వ తీర్థంకరుడు కాశీరాజు అశ్వసేనుడి కుమారుడు **'పార్శ్వనాథుడు'** 24వ తీర్థంకరుడు **'వర్ధమాన మహావీరుడు'**

క్రీ.పూ.599లో వైశాలి రాజ్యంలో ప్రస్తుతం బీహారు రాష్ట్రంలోని సుప్రసిద్ధ రాజైన సిద్ధార్థుడికి, త్రిశలాదేవికీ జన్మించాడు వర్ధమానుడు. ఇతడికి వర్ధమానుడు, వీరుడు, అతివీరుడు, మహావీరుడు, సన్మతి అని బిరుదులున్నాయి. వర్ధమానుడు బుద్ధునికి సమకాలీకుడు. బుద్ధుడికన్న కొంచెం పెద్దవాడు.

వర్ధమాన మహావీరుడు తన 28వ ఏట ఆధ్యాత్మిక జీవితాన్ని ప్రారంభించాడు. అప్పటి నుండి 12 సం॥ ఘోరమైన తపస్సు చేశాడు. ఆ తరువాత కొద్ది కాలానికే ఇతడు కేవలి అయినాడు. దిగంబరుడు కూడా అయినాడు. అన్ని వస్తువుల పరిపూర్ణ జ్ఞానాన్ని 'కేవలం' అంటారు. ఈ జ్ఞానం కలిగినవాడు 'కేవలి'. ఆ తరువాత తీర్థంకరుడని అంగీకరించబడ్డాడు. సర్వజ్ఞుడు, జినుడు, మహావీరుడు అని ప్రసిద్ధి చెందాడు. మొత్తం 72 సంవత్సరాలు జీవించాడు. జీవితంలో చివరి 30 సం॥లు మతప్రచారంలోను, సన్యాసవర్గ నిర్మాణంలోను కాలం గడిపాడు. ఇతని అనుచరులలో చాలామంది రాజకుటుంబాల నుంచే వచ్చారు. ఇతని బోధనలు అంగీకరించి పోషించిన వారు అతని మాతృసంబంధుల సామంతరాజులు. వీరిలో స్త్రీ పురుషులకు వేరువేరుగా గృహస్థ, సన్యాస వర్గాలను ఏర్పాటు చేశాడు. వర్ధమానుడి బోధనలకు చాలామంది ఆకర్షితులై సంపూర్ణ దిగంబరులైనారు. పార్శ్వనాథుని అనుసరించిన వారు వస్త్రధారణ అవసరమని భావించారు. వారే శ్వేతాంబరులు. దీంతో జైనమతం శ్వేతాంబరులు, దిగంబరులు అని రెండు శాఖలుగా విడిపోయింది. వీరిద్దరికీ తేడా తత్త్వసిద్ధాంతంలోనే గాక, అసలు సూత్రాలలోనే కనిపిస్తుంది. పూర్ణసిద్ధి పొందిన వారు తిండి కూడా లేకుండా జీవించగలరని 'నాది' అనే భావన లేశమాత్రము ఉన్నప్పటికీ నిర్వాణము లభించదనీ, ఈ కారణంచేతనే వంటిమీద వస్త్రాలు కూడా ఉండకూడదని, స్త్రీలకు మోక్షము లేదని వీరి నమ్మకం. వస్త్రాలు కూడా లేకుండా, అలంకారాలు లేకుండా, తలవంచుకుని ఉండటమే తీర్థంకరుని లక్షణము అంటారు. వీరికి పవిత్ర గ్రంథాలనేవి లేవు. శ్వేతాంబరుల మతగ్రంథాలను వీరు ఒప్పుకోరు. జైనమతాన్ని బాగా ప్రచారంలోకి తెచ్చినవాడు వర్ధమాన మహావీరుడు.

ఈ జగత్తు ఎలా సృష్టించబడింది? అన్న ప్రశ్నకు జైనమతంలో సమాధానం లేదు. ఈ జగత్తు అనాదిగా ఉన్నది అని వీరి సిద్ధాంతము. అది దేనినుండీ ఆవిర్భవించలేదు. వికారం పొందలేదు. సత్యపదార్థం నుంచి అంతకన్నా రాలేదు.

ఈశ్వరుడు జగత్తును సృష్టించలేదు. స్వతంత్రమైన అణుపదార్థాల కలయిక వల్లనే ఈ జగత్తు ఏర్పడింది. ఈ అణుపదార్థాలు రెండు రకాలు 1. జీవము 2. అజీవము

**1. జీవము :** ఆత్మ లేదా జీవులు అనేకులు. జీవులు అణుస్వరూపులు కారు. ఏ జీవుడు ఏ శరీరాన్ని పొందుతాడో, ఆ జీవుడు ఆ శరీరపరిమాణాన్ని కలిగి పాలలో నెయ్యిలాగా శరీరమంతా వ్యాపించి ఉంటాడు. ఆత్మ అనేది జడపదార్థం కాదు. ఏ జడపదార్థం నుంచి గాని, శరీరం నుంచి గాని పుట్టలేదు. జీవులలో జీవమే తప్ప పదార్థము అనేది ఏదీలేదు. ఆత్మ స్వయంప్రకాశి. దానికి పెరుగుట, తరుగుట అనేవి ఉన్నాయి. అంతవరకే కాని ఆత్మకు సంపూర్ణ నాశనం లేదు. ఆత్మ నిత్యమైనది. జీవి జన్మించినప్పుడు శరీరం చిన్నగా ఉంటుంది. ఆ సమయంలో ఆత్మకూడా చిన్నగానే ఉంటుంది. శరీరము పెరిగినకొద్దీ ఆత్మకూడా పెరుగుతుంది. జీవి మరణించినప్పుడు ఆత్మసూక్ష్మాకారం పొందుతుంది. తిరిగి జన్మించినప్పుడు ఏ శరీరాన్ని పొందుతుందో, ఆ శరీర పరిమాణం పొందుతుంది. అంటే చీమలోని ఆత్మ చిన్నగాను, ఏనుగుయందున్న ఆత్మ పెద్దగాను ఉంటుంది.

ఏదైనా కర్మ చెయ్యటానికి, చెయ్యకపోవటానికి కర్త జీవుడే. కర్మఫలము అనుభవించేది కూడా అతడే. కర్మఫలాన్ని ఇచ్చేఈశ్వరుడు ఇంకొకడు లేడు. కర్మే కర్మ ఫలాన్నిస్తుంది. ఆత్మస్వచ్ఛమైనది. జ్ఞానస్వరూపమైనది. సుఖదుఃఖాలకు అతీతమైనది. ఆత్మ నాలుగు రకాలైన స్వరూపం కలిగి ఉంటుంది. అవి

1. అనంతదర్శనము 2. అనంతజ్ఞానము 3. అనంతానందము 4. అనంత వీర్యము. కర్మ మాలిన్యము కడిగి వేయబడిన ఆత్మకి ఈ అనంతచతుష్టయము స్వరూపంగా ఉంటుంది. కాబట్టి ఆత్మ అనేది అనంత చతుష్టాత్మకమైనది. కాని కర్మలవల్ల మాలిన్యమవుతున్నది. ఈ కారణం చేత పైన చెప్పిన అనంతదర్శనము మొదలైనవన్నీ పరిమితమవుతున్నాయి. అత్యంత ప్రయత్నం చేసి ఈ కర్మలను కడిగి వేసినట్లైతే, ఆత్మ తన సహజ స్థితిని పొందుతుంది. దీన్నే "సిద్ధావస్థ" అంటారు. కర్మలవల్ల కలిగిన పరమాణువులు ఆత్మలో ప్రవేశిస్తాయి. అది ఎలా అంటే పాలలో నీరులాగా, నూనెలో నెయ్యిలాగా ఆ మాలిన్యాలు ఆత్మలో ప్రవేశించి ఉంటాయి. ప్రతికర్మకీ ఫలితము అనేది ఉంటుంది. దాన్నించి తప్పించుకోవటం ఎవరికీ సాధ్యం కాదు. జైన ధర్మాన్ని ఆచరిస్తేనే అది సాధ్యమవుతుంది. కర్మ ఉన్నంతవరకు ఆత్మకు

మాలిన్యం ఉంటుంది. ఆత్మకి మాలిన్యంఉంటే అజ్ఞాని అవుతుంది. అజ్ఞానంతో తనే అంటే ఆత్మే దేహము అని భావించటం జరుగుతుంది. ఈ కారణంచేతనే దేహానికి కలిగే సుఖదుఃఖాలన్నీ తనవిగా భావిస్తుంది. నిర్మలమైన జ్ఞానము కావాలి అంటే కర్మనంతటినీ కడిగి వెయ్యాలి. అయితే జైన సిద్ధాంతంలో కర్మకి ఆకారం ఉన్నది. దాన్ని జ్ఞాని మాత్రమే చూడగలడు.

ఇక్కడ ఇంకొక విషయం ఏమిటంటే జీవాత్మలు రెండు రకాలు 1. సంసారాత్మలు 2. ముక్తాత్మలు. సంసారాత్మలు మళ్ళీ రెండు రకాలుగా ఉంటాయి. 1. స్థావరములు 2. జంగమములు (చలనములు) స్థావరములు మళ్ళీ ఐదు రకాలు 1. భూమి 2.జలము 3. తేజస్సు 4. వాయువు 5. వనస్పతి. వీటిని కాయములు అంటారు. జీవులు వారి వారి పూర్వజన్మల కర్మ ఫలితాన్ని అనుసరించి ఈ జన్మలో శరీరాన్ని ధరిస్తాయి.

**2. అజీవము :** అజీవము ఐదు రకాలు అవి 1. ధర్మము 2. అధర్మము 3. ఆకాశము 4. పుద్గలము 5. కాలము.

**1. ధర్మము :** ఇక్కడ ధర్మము అంటే మనం చెప్పే ధర్మం కాదు. దీనివల్ల జీవులకు చలనశక్తి కలుగుతుంది. ధర్మముయొక్క ఉనికివల్లనే చలనము ఏర్పడుతుంది. చేప కదలటానికి నీరు ఏ రకంగా ఆధారమో, అలాగే జీవుల చలనశక్తికి ధర్మం ఆధారం. లోకమంతా ధర్మాన్ని ఆశ్రయించే ఉంటుంది. ధర్మము ఒకచోటి నుంచి ఇంకో చోటికి కదలదు. అది చలనము లేనిది. కాని జీవుల చలనశక్తికి కారణమవుతున్నది.

**2. అధర్మము :** ఇది పురుషుణ్ణి స్తంభింపచేస్తుంది. అతడు ముందుకు సాగిపోకుండా అరికట్టి జడపదార్థంగా చేస్తుంది. ధర్మము గతిస్వభావం కలిగి ఉండగా అధర్మం స్థితి స్వభావం కలిగి ఉంటుంది. ఇది మనం చెప్పే అధర్మము, పాపము వంటిది కాదు ప్రపంచమంతా వ్యాపించి ఉంటుంది. ధర్మానికి మల్లేనే అధర్మం కూడా జీవజడములకు ఉపకారి. అధర్మము జీవుల చలనాన్ని నిరోధించి, వాటికి విశ్రాంతి ఇస్తుంది. అధర్మమే గనక లేకపోతే జీవులకు విశ్రాంతి అనేది ఉండదు. నిరంతరము తిరుగుతూనే ఉంటాయి. ధర్మాధర్మాలు ఏవీ కూడా ఇంద్రియాలకు కనిపించవు కాని ఇవి రెండూ సర్వవ్యాపకాలు.

**3. ఆకాశము :** అవకాశం ఇచ్చేది ఆకాశం. ఇది రెండు రకాలు 1. లోకాకాశము 2. అలోకాకాశము

**1. లోకాకాశము :** లోకంలోని సమస్తాన్ని తనయందు ఇముడ్చుకొన్న దాన్ని లోకాకాశము అంటారు. ఇక్కడ సమస్తము అంటే ధర్మాధర్మాలు, కాలము, ద్రవ్యము, జీవులు, నైశ్చల్యము, నియామకము.

**2. అలోకాకాశము :** లోకాకాశానికి పైన శూన్యంగా ఉన్న దాన్ని అలోకాకాశము అంటారు. మొత్తంమీద ఆకాశము సర్వగతము, నిత్యము.

**4. పుద్గలము :** శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు పుద్గలము యొక్క లక్షణాలు. విభజించటానికి వీలు లేనటువంటి ప్రాథమిక ద్రవ్యశకలాన్ని అణువు అంటారు. ఇది విభజించటానికి వీలు లేకుండా, ఆది మధ్య అంతములు కలిగి ఉంటుంది. దానికి స్పర్శ, రూపము, రసము, గంధములు గుణాలు. జైనమతంలో భూమి మొదలైన అణువులకు వేరువేరుగా ఆ జాతి గుణాలుంటాయి. అయితే వాటికి ఆ గుణాలు ఒక్కొక్కటే ఉంటాయి. కాని జైనమతంలో ప్రతి అణువుకు అన్ని గుణాలు ఉంటాయి.

**5. కాలము :** ఇది సూక్ష్మకణాత్మకము. కణాలు విభజించటానికి వీలు లేకుండా, అసంఖ్యాకంగా ఉంటాయి. ఇక్కడ గం॥ ని॥ సె॥ మొ॥న హద్దులు గల కాలాన్ని **'సమయ'** అంటారు. ఆద్యంత రహితమైన దాన్ని కాలము అంటారు.

విశ్వానికి మూలమనేది లేదు. ఈ జగత్తు సత్యమా? లేక నశించిపోయేదా? జగత్తు దానిలో ఉన్న పదార్థాలు ఒక్కొక్కటిగా భావిస్తే అది శాశ్వతమే. ఇలా మొత్తం కాకుండా, వేరు వేరు భాగాలుగా భావించినప్పుడు, ఆ క్షణంలో మార్పు వస్తోంది. కాబట్టి అవి వినాశం పొందేవే అని గుర్తించాలి.

**జ్ఞానము :** జైనమతంలో జ్ఞానము ఐదు రకాలు. జ్ఞానానికి ఐదు ద్వారాలుంటాయి. అవి

1. మతి 2. శ్రుతి 3. అవధి 4. మనఃపర్యాయము 5. కేవలజ్ఞానము

**1 మతి :** ఇంద్రియాల చేత తెలుసుకొనే సామాన్య జ్ఞానాన్నే 'మతి' అంటారు. దీనిలోనే స్మృతి, అనుమానము, ఉపలబ్ధి, భావన, ఉపయోగము అనేవి ఉన్నాయి.

జ్ఞానానికి ముందు దర్శనము ఉంటుంది. దానివల్ల వస్తువుయొక్క భౌతిక రూపం తెలుస్తుంది.

**2. శ్రుతి :** శబ్దం నుంచి గ్రహింపబడేది. సాక్ష్యము లేక సంజ్ఞల ద్వారా గ్రహించబడేది. లబ్ధి (సహకారము) భావన (శ్రద్ధ) ఉపయోగము (విషయగ్రహణం) నయము (వస్తు జ్ఞానవిశేషము) ఇవన్నీ ఇందులోనే ఉంటాయి.

**3. అవధి :** ఇతర ప్రదేశాలలో గాని, ఇతర కాలాలలో గాని ఉన్నటువంటి వస్తువులను గురించి తెలుసుకునేది. దూరశ్రవణం, దూరదర్శనం మొదలైన శక్తులకు సంబంధించిన జ్ఞానము.

**4. మనఃపర్యాయము :** దీన్నే మనోగ్రహణశక్తి అంటారు. ఇతరుల మనోభావాలు తెలుసుకునే జ్ఞానము. ఎదుటి మనిషి మనసులో ఉండే ఆలోచనలు తెలుసుకునే శక్తి.

**5. కేవలజ్ఞానము :** దీన్నే పరిపూర్ణజ్ఞానము అంటారు. వస్తువుల యొక్క రూపము, గుణము మొదలైన విశేషాలు తెలుసుకునేది. దేశకాల వస్తువుల చేత పరిఛిన్నము కానిది. సర్వజ్ఞము అతీంద్రియము అయిన ఆత్మజ్ఞాన పరాకాష్ఠ స్థితి. ఈ స్థితిలో మానవుడు శారీరక అవధులను అతిక్రమించిపోతాడు. ఇది అనుభవైక వేద్యమైన పరిపూర్ణ జ్ఞానము. పరిశుద్ధమైన ఆత్మగల పరమపురుషుల (కేవలులు)కే ఈ స్థితి కలుగుతుంది. దీన్నే **'కైవల్యము'** అంటారు.

***సూత్రం - 204 "నైకస్మిన్నసంభవాత్"***

ఒకే వస్తువులో విరుద్ధమైన ధర్మాలుండటం అసంభవం కాబట్టి వీరి సిద్ధాంతం అంగీకార యోగ్యం కాదు. ఒకే వస్తువుకు అనేక రూపాలుండవు. విషయాన్ని చెప్పేటప్పుడు ఫలానా అని ఖచ్చితంగా నిర్ధారణ చెయ్యకపోతే, అది ప్రమాణం కాదు. జైనమతం ఏ విషయాన్నీ ఖచ్చితంగా చెప్పదు. ఉండచ్చు, ఉండకపోవచ్చు. అంటుంది కాబట్టి వీరి వాదం సరికాదు.

***సూత్రం - 205 "ఏవం చాత్మాకర్త్స్న్యమ్"***

జైనమతంలో ఆత్మకు పరిచ్ఛిన్నత్వము అనే దోషం కలుగుతోంది. కాబట్టి ఆత్మకూడా మిగిలిన వస్తువులకు మల్లేనే అనిత్యమవుతున్నది.

జైనమతం ప్రకారము శరీర పరిమాణము ఎంత ఉంటుందో, ఆత్మపరిమాణము అంతే ఉంటుంది. ఇలా అనటంవల్ల ఆత్మకు శాశ్వతత్వం పోయి శరీరంలాగానే చెప్పబడుతుంది. అంటే ఆత్మ అనిత్యమవుతోంది. ఇది ఈ మతంలోని దోషం.

ఆత్మ శరీరమంత పరిమాణం కలిగి ఉంటుంది అనటం తప్పు. ఎందుకంటే ఒక జీవి శరీరం పెద్దది ఇంకొక జీవి శరీరం చిన్నది ఉంటుంది. అలా అయినప్పుడు పెద్దదైన ఏనుగు శరీరంలో అంత పెద్ద ఆత్మ. చిన్నదైన చీమ శరీరంలో చిన్న ఆత్మ ఉండాలి. ఒకవేళ ఆత్మకు ఒకే పరిమాణముంటే, పెద్ద, చిన్న శరీరాలలో అది ఇమడటానికి ఇబ్బంది పడాలి.

***సూత్రం - 206 "న చ పర్యాయాదప్యవిరోధోవ వికారాదిభ్యః"***

జీవికి క్రమంగా అవయవాలు వస్తాయి. ఆత్మకూడా శరీరమంతా ఉంటుంది కాబట్టి దీనికి కూడా ఈ దోషాలు (అవయవాలు) వస్తాయి. ఆత్మ అనిత్యము అంటున్నారు కాబట్టి మోక్షం లేదు.

వికారం (మార్పు) చెందటం జీవుడికి ఉన్నది అని గనక అంటే, ఆత్మ అనిత్యమవుతుంది. గతజన్మలో పశువు. ఈ జన్మలో మనిషి. మరి పశువుగా ఉన్నప్పటి అవయవాలు కృశించి ఇప్పుడు మనిషి అవయవాలు వస్తాయా? ఈ రకంగా జీవికి వికారం వస్తుందా? ఆత్మకు నాశనము ఉన్నదా? ఆత్మ నాశనమయితే మోక్షం మాట ఏమిటి? అనే ప్రశ్నలకు సమాధానాలు లేవు.

జైనమతంలో మోక్షం పొందే సమయానికి ఉండే జీవుని శరీర పరిమాణమే నిత్యము అంటారు.

***సూత్రం - 207 "అన్త్యావస్థితేశ్చోభయనిత్యత్వా దవిశేషః"***

మోక్షావస్థలోని పరిమాణం నిత్యము అయినట్లైతే, ముందు ఉన్నవి కూడా నిత్యమే కావాలి ఆది మధ్య అంతము అన్నీ సమానంగానే ఉండాలిగాని ఒకటి నిత్యము, ఇంకొకటి అనిత్యము కావు. అందుకే ఈ మతం అప్రమాణము. ఆమోదయోగ్యం కాదు.

లలితా సహస్రంలోని 141వ నామము **శాంతా**లో జైనమతాన్ని ఖండించారు.

## 7. పత్యధికరణము (మహేశ్వరవాదన ఖండన)

ఏడవది **పత్యధికరణము.** ఇందులో మహేశ్వర మతాన్ని ఖండిస్తున్నారు. ఇందులో ఐదు సూత్రాలున్నాయి.

మాహేశ్వరులు అంటే శివుణ్ణి ఆరాధించేవారు. వీరు శైవులు, పాశుపతులు, కాపాలికులు, కారుణిక సిద్ధాంతులు అని నాలుగు రకాలుగా ఉన్నారు.

శైవమతము చాలా ప్రాచీనమయింది. వేదంలో రుద్ర సూక్తాలున్నాయి. వేదంలో ఉన్న రుద్రుడే పురాణాలలో శివుడుగా మార్పు చెందాడు. ఈ మతము పూర్తిగా ఆగమాల మీదనే ఆధారపడింది. శ్రీకంఠుడు బ్రహ్మసూత్రాలకు శివాద్వైతపరంగా భాష్యము కూడా వ్రాశాడు. దీనికే 'శ్రీకంఠభాష్యము' అని పేరు. దీనికి అప్పయ్య దీక్షితులు **"శివార్కమణిదీపిక"** అనే పేరుతో వ్యాఖ్య కూడా వ్రాశాడు.

శైవమతంలో అనేక శాఖలున్నాయి. వాటన్నింటి మూల సిద్ధాంతం ఒకటే. కేవలం చిన్నచిన్న తేడాలతో వేరు వేరు శాఖలుగా ఏర్పడ్డాయి. వీరి ప్రకారం తత్త్వాలు ముప్పై ఆరు.

పరమాత్మ ప్రధాన తత్త్వానికీ, పురుష తత్త్వానికీ ప్రేరకుడు. ఈ పరమాత్మ ప్రపంచానికి నిమిత్తకారకుడే తప్ప ఉపాదాన కారకుడు కాదు అని మాహేశ్వరులు అంటున్నారు కదా. మరి వారి మాట ఏమిటి?" అనేది అనుమానం. దీనికి సమాధానంగా చెబుతున్నారు.

***సూత్రం - 208 "పత్యురసామఞ్జస్యాత్"***

పరమేశ్వరుడు ప్రకృతికి, పురుషునికి ప్రేరకుడు అన్నారు. మరి ప్రేరకుడికి, ప్రేరేపించే వాడికి సంబంధం ఏమిటి? సంబంధం లేకపోతే అతడు ప్రేరకుడు అనటం కుదరదు.

***సూత్రం - 209 "సంబన్ధానుపపత్తేశ్చ"***

వారి మతం ప్రకారము ప్రకృతి, పురుషుడు, పరమేశ్వరుడు. ఈ మూడు తత్త్వాలు నిరవయవాలు. సర్వవ్యాపకాలు. వీటికి సంయోగము ఉన్నది అంటారు. ఇది సంభవం కాదు. అవయవాలుంటేనే సంయోగ ముంటుంది. లేకపోతే ఈ సంబంధం ఉండదు. కాబట్టి వీరి వాదం సరికాదు.

***సూత్రం - 210 "అధిష్ఠానానుపపత్తేశ్చ"***

రూపం లేని ప్రకృతికి ప్రేరకుడు కానందువల్ల ఈశ్వరుడు నిమిత్తకారణుడు అవడు

ప్రకృతి రూపం లేనటువంటిది. రూపరహితమైన ప్రకృతిని ప్రేరేపించి ఈశ్వరుడు సృష్టి చేస్తున్నాడనటం సమంజసం కాదు.

***సూత్రం - 211 "కరణవచ్చేన్న భోగాదిభ్యః"***

ఇంద్రియాలు జీవునిచేత ప్రేరేపించబడి పని చేస్తున్నాయి. అలాగే ప్రకృతిని ఈశ్వరుడు ప్రేరేపిస్తున్నాడు అని చెప్పరాదు. అలా చెబితే జీవుడిలాగా ఈశ్వరుడికి కూడా భోక్తృత్వము వస్తుంది. అప్పుడు ఈశ్వరత్వానికే లోపం వస్తుంది.

***సూత్రం - 212 "అన్తవత్త్వమసర్వజ్ఞతా వా"***

ఈశ్వరుడు ప్రకృతిది, పురుషుడుది, తనది అయిన సంఖ్యా పరిమాణాన్ని నిశ్చయిస్తాడా, నిశ్చయించడా? ఇక్కడ నిశ్చయిస్తే పరిచ్ఛిన్నత్వ దోషము. నిశ్చయించక పోతే అసర్వజ్ఞత్వ దోషము వస్తుంది.

ఈశ్వరుడు సర్వజ్ఞుడు, అనంత స్వరూపుడు. అతడు ప్రధాన, పురుషుల, తనయొక్క పరిమితిని గుర్తిస్తున్నాడా? లేదా? గుర్తిస్తున్నాడు అంటే అతనికి అంతముంటుంది గుర్తించకపోతే సర్వజ్ఞుడు కాదు. అందుచేత వీరి వాదము అసమంజసము అంటూ ఏడవ అధికరణ పూర్తి చేశారు.

## 8. ఉత్పత్త్యధికరణము (పాంచరాత్రాగమ మతఖండన)

ఎనిమిదవ అధికరణలో పాంచ రాత్రాగమాన్ని ఖండిస్తున్నారు. ఈ అధికరణ పేరు **ఉత్పత్త్యధికరణము** ఇందులో నాలుగు సూత్రాలున్నాయి.

ఈ అధికరణలో పాంచరాత్రుల మతాన్ని ఖండిస్తున్నారు. ఈ మతాన్నే **భాగవత మతము** అని కూడా అంటారు.

ఈ మతంలో భగవంతుడు వాసుదేవుడు. అతడు నిర్వికారుడు, నిరంజనుడు, జ్ఞానస్వరూపుడు, ఇతడే ఈ జగత్తుకు ఉపాదాన, నిమిత్త కారణము. వాసుదేవుని

నుండి సంకర్షణుడు (జీవుడు) అతని నుండి ప్రద్యుమ్నుడు (మనస్సు) అతని నుండి అనిరుద్ధుడు (అహంకారము) పుడుతున్నారు. భక్తులు భగవంతుణ్ణి పరిపరివిధాల ఆరాధించి చివరకు పరమపదం చేరతారు.

వీరికీ వైదిక మతానికీ పెద్దగా తేడా ఏమీ లేదు. ఉన్నదల్లా ఒక్కటే అది. వాసుదేవుని నుండి సంకర్షుణుడనే జీవుడు పుడుతున్నాడనటం. అది సరికాదు.

***సూత్రం - 213 "ఉత్పత్త్యసంభవాత్"***

వాసుదేవుని నుండి జీవుడు ఉద్భవించటం అసమంజసము. ఇలా చెప్పటం వల్ల జీవి అనిత్యుడు అని, అతనికి ఉత్పత్తి లేదని చెప్పాలి. మరి అనిత్యమైన జీవుడికి మోక్షంకూడా ఉండదు.

***సూత్రం - 214 "న చ కర్తుః కరణమ్"***

కర్త నుంచి సాధనం పుట్టదు. ఇక్కడ కర్త రూపం సంకర్షుణుడు (జీవి) అతని నుండి మనస్సు, అతని నుండి అహంకారము పుట్టవు. ఈ ప్రక్రియకు వేదప్రమాణం లేదు.

***సూత్రం - 215 "విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః"***

సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులు వాసుదేవునిలాగే ఐశ్వర్యము, బలము గలవారే అని చెప్పినట్లైతే, ఒకే ఈశ్వరునితో సృష్టికార్యము జరిగేటప్పుడు, నలుగురు ఈశ్వరులు అనవసరం. వీరందరినీ సమానులుగా ఒప్పుకుంటే వాసుదేవుడొక్కడే పరతత్త్వం అనే మాట అబద్ధమవుతుంది.

***సూత్రం - 216 "విప్రతిషేధాచ్చ"***

ఈ రకంగా పరస్పర విభేదాలున్నాయి కాబట్టి ఈ మతం సరికాదు.

***దీంతో బ్రహ్మ సూత్రాలలోని రెండవ అధ్యాయంలో రెండవ పాదం పూర్తయింది.***

# ద్వైతము (మధ్వాచార్యులు)

ద్వైతము అంటే రెండుగా చెప్పబడేది. ఈ మతంలో జీవాత్మ వేరు, పరమాత్మ వేరు. మోక్షము అన్నప్పుడు జీవాత్మ పరమాత్మ సన్నిధి చేరుతుంది. అంతేకాని పరమాత్మలో లీనం కాదు.

ద్వైతమతస్థాపకుడైన మధ్వాచార్యుడు పూర్వాశ్రమంలో శుద్ధ అద్వైతి. వీరు కర్ణాట రాష్ట్రంలోని 'కెనరా' ప్రాంతంలో 'వేలి' గ్రామం (పాకక్షేత్రం)లో క్రీ.శ. 69లో జన్మించారు. వీరి తల్లి వేదవతి తండ్రి మధ్వగేహభట్టు. జన్మతః వీరు బ్రాహ్మణులు. ఈయన అసలు పేరు 'వాసుదేవుడు' వీరు తన 11వ ఏటనే సన్యాసం స్వీకరించి పూర్వప్రజ్ఞుడైనాడు. వీరి వేదాంత గురువు అచ్యుత ప్రేక్ష్యులవారు. వీరు అద్వైతి.

మధ్వాచార్యులవారి ప్రకారము ప్రపంచంలో రెండే తత్త్వాలున్నాయి. 1. పరమ స్వతంత్రం. అదే సర్వాంతర్యామియైన శ్రీమన్నారాయణుడు లేదా శ్రీమహావిష్ణువు. 2. పరతంత్రం భగవంతునిమీద పూర్తిగా ఆధారపడి ఉంటాడు. ఇతడు అస్వతంత్రుడు. ఈ లోకంలో ప్రతిది పరిమితంగానే ఉంటుంది. ప్రతి దానికి అవధులుంటాయి. ప్రతిదీ ఏదో ఒక దానిమీద ఆధారపడుతుంది. అలా ఆధారపడకుండా ఉండేదే పరమార్థతత్త్వం. దాని రూపం – చైతన్యం, ఆనందమయం. ఆ రూపమే శ్రీమహా విష్ణువు. సృష్టిస్థితిలయాలకు కారకుడు. ఈ సృష్టిలో ఉన్న వైవిధ్యం అంతా ఆయన జ్ఞానసముదాయానికి నిదర్శనం. ఆయన సర్వాంతర్యామి. సర్వజ్ఞుడు. సర్వాతీతుడు. ఆయన రూపాన్ని ఎవరూ తెలుసుకోలేరు. మనసుకు, చింతనకు, వాక్కుకు అందడు. ఈ జగత్తంతా ఆయన నిలయమే. ఆయన పూర్ణస్వరూపుడు, పూర్ణకాముడు. అనంత కళ్యాణ గుణశోభితుడు.

శృతిప్రమాణాన్ని, తర్కాన్ని ఆధారంగా చేసుకుని భగవానుడు సగుణుడు అని నిరూపిస్తాడు. పరమేశ్వరుడు నిర్గుణుడు అన్నప్పుడు నిర్గుణుడు అనే పదానికి 'విసర్జించదగిన గుణాలు లేనివాడు' అని అర్థం చెప్పాడు రామానుజుడు. అదే పదానికి పరమేశ్వరుడు త్రిగుణాలకు అతీతుడు అని అర్థం చెప్పాడు మధ్వాచార్యుడు. ఆయన అసమగ్రమైన గుణాలు లేనివాడు. సత్యము, జ్ఞానము, అనంతము, ఆనందము మొదలైన గుణాలు కలిగినవాడు భగవంతుడు.

మధ్వదర్శనంలో జీవుడికి ప్రత్యేకమైన స్థానం ఉన్నది. అద్వైతము జీవుడు - బ్రహ్మ వీళ్ళిద్దరి మధ్య భేదం లేదు అంటుంది. విశిష్టాద్వైతం జీవ-బ్రహ్మల మధ్య విశిష్టమైన ఐక్యతను తెలుపుతుంది. మధ్వదర్శనంలో జీవ-బ్రహ్మలు రెండూ ఎప్పుడూ ఒకటే కాని, ఆ రెండింటి మధ్య ఎప్పుడూ తేడా ఉంటుందని తెలుపుతుంది. బ్రహ్మకి ఉన్నట్లే జీవుడికి కూడా చైతన్యము, ఆనందము అనే రెండు గుణాలున్నాయి. అయితే పరబ్రహ్మలో ఉండేది నిరతిశయానందం. జీవిలో ఉండేది పరిమితమైన ఆనందం. ఈ ఆనందం యొక్క నిష్పత్తిని బట్టే జీవరాశిలో తేడాలు గుర్తించవచ్చు అంటాడు మధ్వాచార్యుడు. చైత్యము, ఆనందము జీవుని యథార్థగుణాలు అంటాడు. శంకరుడి దృష్టిలో అవి జీవుడి లక్షణాలు. శంకరుడి దృష్టిలో జీవుడికి ప్రత్యేకమైన ఉనికిలేదు. కాని మధ్వమతంలో జీవుడికి ప్రత్యేకమైన ఉనికి ఉంది. జీవుడు శాశ్వతుడు. జీవుడికి నామరూపాలుంటాయి. అతనికి ఒక ఆకారం ఉంటుంది. నిత్యానందాన్ని అనుభవించాలంటే నామరూపాలు ఉండితీరాలి. నిరతిశయానందాన్ని అనుభవించా లంటే ఆత్మకు ఒక ఆకారం కావాలి. ఆత్మనిత్య ప్రకాశమైనది కాబట్టి దానికి ఒక ఆకారం ఉంటుంది. ప్రకృతిలో నామరూపాలున్న పదార్థాలన్నీ నశించిపోతాయి. ఆత్మకి నామరూపాలున్నప్పటికీ, అది ప్రకృతిలోని ఏ పదార్థాన్నీ పోలి ఉండదు. ప్రకృతి ధర్మాలకు అతీతంగా ఉండటమే దాని ప్రత్యేకత. ఆత్మభౌతిక పదార్థంతో నిర్మించబడదు. ప్రకృతి ధర్మాలన్నీ భౌతిక పదార్థాలకు మాత్రమే పరిమితం. ఆత్మ దైవీసంపత్తితో నిర్మితమైంది. అది ఈశ్వరుని ప్రతిబింబం.

జీవుడు ఈశ్వరసంభూతుడు. నిత్యశాశ్వతుడు. విశిష్టాద్వైతంలో జీవులు ఐదు రకాలుగా ఉంటారు. కాని మధ్వదర్శనంలో జీవులు మూడు విధాలు.

**1. నిత్యముక్తులు :** వీరు లక్ష్మీదేవి, వాయువు మొ॥వారు వాయుదేవుడు జీవోత్తముడు.

**2. ముక్తులు :** భగవంతుడి అనుగ్రహంతో సంసారం నుంచి తరించినవారు.

**3. బద్ధులు :** సంసార సాగరంలో మునిగి కొట్టుమిట్టాడుతున్న వారు. వీరు మళ్ళీ రెండు విధాలుగా ఉంటారు. 1. ముక్తికి యోగ్యులు 2. ముక్తికి అయోగ్యులు. ఈ అయోగ్యులలో కొందరు నిత్యసంసారంలోను, కొందరు నిత్యనరకంలోను

ఉంటారు. అయితే నిత్యనరకంలో ఉండేవారు ఎలాంటి పాపకర్మలు చేస్తారో ఎక్కడా చెప్పబడలేదు.

ఈ మతంలో ఒక జీవుడికి, ఇంకొక జీవుడికి మధ్యగల తారతమ్యము ఆగంతుకము కాదు. జీవులు అనాదులు. తారతమ్యము కూడా అనాదియే. జీవులు ముక్తులైన తరువాత కూడా ఈ తారతమ్యము ఉంటుంది. జీవులందరూ నిత్యులే. వీరు ఐదు రకాలైన భేదములను పాటిస్తారు అవి

1. జీవేశ్వరుల మధ్యభేదము 2. జీవులమధ్య పరస్పర భేదము 3. జడానికి ఈశ్వరుడికి మధ్య భేదము 4. ఒక జడానికి ఇంకొక జడానికి మధ్య భేదము 5. జీవులకు జడవస్తువులకు మధ్య భేదము

ఈ ఐదు రకాల భేదాలు నిత్యాలు. ఇవి మోక్షదశలో కూడాఉంటాయి అంటాడు మధ్వాచార్యుడు. అందుకే ఈ మతానికి ద్వైతమని, తారతమ్య మతమని, భేదమతమని పేర్లు.

**మోక్షము :** మోక్షమనేది ఒక ప్రాప్యవస్తువు లాంటిది. అంటే పోగొట్టుకున్నది తిరిగి పొందటమన్న మాట. మోక్షంలోను, మోక్ష స్వరూపంలోను కూడా తారతమ్యమున్నది అంటాడు మధ్వాచార్యుడు. రకరకాల దశలలో ఉన్న జీవరాశి మోక్షానికి అర్హులు కాబట్టి మోక్షం కూడా రకరకాల దశలలో జీవరాశికి లభిస్తుంది.

రామానుజుల వారు ముక్తజీవులందరూ సమానులే అని, ముక్తికి అర్హత లేని జీవులు లేవని చెప్పారు. మధ్వాచార్యుడు దీన్ని ఒప్పుకోలేదు.

ఈ మతానికి మొదటివాడు బ్రహ్మదేవుడని చెబుతారు. అందుకే ఈ సంప్రదాయానికి బ్రహ్మసంప్రదాయమని పేరు. ఆ తరువాత ఆంజనేయుడు, భీముడు. మధ్వాచార్యులు వాయుదేవుని అవతారమని చెబుతారు.

ఈ సంప్రదాయంలో విష్ణువే పరమతత్త్వం కాని వీరు శివద్వేషులు కారు. మన రాష్ట్రంలో ఈ మతం బ్రాహ్మణులయందుమాత్రమే ఉన్నది. బ్రాహ్మణేతరులెవ్వరూ ఈ మతాన్ని స్వీకరించలేదు.

# అద్వైతము

ఇంతవరకు సాంఖ్యము, న్యాయము మొదలైన మతాలన్నీ ఖండిస్తూ, అద్వైతాన్ని చెబుతున్నాం. అసలు అద్వైతం అంటే ఏమిటి? శంకరుల వారు వివిధ మతాలను ఎలా ఖండించారు? అనే విషయం పాఠకులకు తెలియటం కోసం ఇక్కడ చెబుతున్నాం.

న+ద్వైతము - అద్వైతము. ద్వైతము అంటే రెండవది. న అనగా లేనిది. అద్వైతము అంటే రెండవది లేనిది. ఈ చరాచర జగత్తులోను రెండవది అంటూ ఏదీలేదు. ఉన్నది ఒక్కటే. అదే పరమేశ్వరస్వరూపము. ఈ జగత్తంతా ఆ పరమేశ్వరుని నుంచే ఆవిర్భవించింది. పిపీలికాదిబ్రహ్మపర్యంతము జగత్తంతా ఆయన రూపమే. సృష్టి స్థితి లయాలకు కారణం ఆ పరమేశ్వరుడే. పరమేశ్వర స్వరూపం నాలుగు పాదాలుగా ఉంటుంది. అందులో 1. తూర్పు పడమర ఉత్తరం దక్షిణం నాలుగు దిక్కులు మొదటి పాదము 2. భూమి, ఆకాశం సముద్రాలు, నదులు, పర్వతాలు, అన్నీ బ్రహ్మపదార్థంలోని భాగాలే. 3. అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు పరబ్రహ్మలోని మూడవభాగము 4. ప్రాణంబ్రహ్మ, దృష్టిబ్రహ్మ, శ్రవణంబ్రహ్మ, మనస్సుబ్రహ్మ. ఈ రకంగా చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అని చెబుతోంది. ఛాందోగ్యోపనిషత్తు. అలాగే మిగిలిన ఉపనిషత్తులు కూడా జగత్తంతా పరబ్రహ్మస్వరూపము అని ఎలుగెత్తిచాటినాయి. అయితే ఆ పరమేశ్వరుడికి రూపం ఉన్నదా ? లేదా ? అన్నదే పెద్ద ప్రశ్న. నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ అని చెబుతున్నాయి ఉపనిషత్తులు. ఇక్కడ నిరాకారుడు అంటే ఆకారము లేనివాడు అనే కాదు. ఏ ఆకారంలో ఉంటాడో చెప్పలేని వాడు. జగత్తులో ఉన్నవన్నీ ప్రాణమున్నవి, ప్రాణంలేనివి, చలనమున్నవి చలనంలేనివి అన్నీ ఆయన స్వరూపాలే. ఒక వస్తువు అమూల్యమైనది అంటే విలువలేనిది అనిమాత్రమే కాదు. విలువ కట్టలేనిది అనికూడా అర్థం చెప్పుకోవాలి. అలాగే పరమేశ్వర స్వరూపం ఎలా ఉంటుంది? అంటే- కొన్ని కోట్ల సూర్యుల యొక్క కాంతితో, కొన్ని కోట్ల చంద్రుల చల్లదనంతో, కొన్ని కోట్ల విద్యుల్లతలు ఒక్కసారిగా మెరిసినట్లుగా ఉంటుంది ఆ పరమేశ్వర స్వరూపం. దానికి పైన క్రింద అడ్డము లేవు. మొదలు చివర, ఆది

అంతము లేవు. దానికి ఒక రూపంలేదు. లింగములేదు. అది పరమేశ్వర స్వరూపము. జన్మమృత్యుజరాదులు లేనిది, ఆద్యంతములు లేనిది, రూపభేదం, లింగభేదం ఏవీ కూడా లేనిది. ఈ జగత్తు అంతా వ్యాపించినది. ఇది నిరాకారము నిర్గుణము అయిన పరమేశ్వర స్వరూపము. ఇక్కడ నిర్గుణము అంటే సత్యరజస్తమో గుణాలు ఏవీలేనిది. ఆ మూడుగుణాలకు అతీతమైనది. త్రిగుణాలు ఆ పరమేశ్వరునిలోనే ఉన్నాయి. కాని ఆయనకు అవేవీ అంటవు. అందుకే పరమేశ్వర స్వరూపము గుణాతీతమైనది. రూపాతీతమైనది. వికారాలు లేనిది. సత్యజ్ఞానానందమయమైనది. పరిపూర్ణమైనది. సనాతనముగా ఉన్నది. ఏకముగా ఉన్నది. రెండవదిలేనిది. అదే పరబ్రహ్మస్వరూపము అని చెబుతున్నాయి ఉపనిషత్తులు.

పరమేశ్వరుడు నిరాకారుడు అన్నారు. మరి ఆకారం లేనివాణ్ణి ఉపాసన చెయ్యటం కష్టం కదా ? అనే ప్రశ్న వస్తుంది. అందుకే పరమేశ్వరుడు సాకారుడు కూడా అని చెబుతున్నాయి ఉపనిషత్తులు. ప్రశ్నోపనిషత్తులో ఓంకారమనేది పరబ్రహ్మము, అపరబ్రహ్మము కూడా. పరబ్రహ్మము అంటే సర్వాతీతమైన నిర్గుణబ్రహ్మ. అపరబ్రహ్మము అంటే సాకారము. వ్యక్తరూపం గల హిరణ్యగర్భుడు. అపరబ్రహ్మోపాసనకే అనేక ధ్యానశ్లోకాలు, మంత్రాలు చెప్పబడ్డాయి. నారాయణ అష్టాక్షరీ, ద్వాదశాక్షరి, గోపాలమంత్రం, పంచదశి మహామంత్రం, చండీమంత్రం. ఇలా అనేక రకాలైన మంత్రాలు ఉపనిషత్తులలో చెప్పబడ్డాయి. ఇవన్నీ సాకారబ్రహ్మవే.

సాధకుడికి ఒక్కసారిగా నిరాకారమైన పరబ్రహ్మ అని చెబితే, అతడికి అర్థం కాదు. అందుకే బ్రహ్మసూత్రాలలో కూడా ముందుగా సాకారబ్రహ్మని తెలుసుకుని, ఆ తరువాత నిరాకారం వైపుగా పయనించాలి అని చెప్పబడుతోంది. దీన్నే 'అపవాద పద్ధతి' అంటారు. ఇందులో కొన్ని సంకేతాల ద్వారా పరబ్రహ్మ పరిమిత రూపాన్ని వివరించి, ఆ తరువాత ఇవేవీ బ్రహ్మము కాదు. పరబ్రహ్మ ఉన్న చోటికి ఇంద్రియాలు పోలేవు. ఇంద్రియాల ద్వారా ఆ పరమేశ్వరుని గురించి తెలుసుకోవటం సాధ్యం కాదు. పరమేశ్వరుడు సచ్చిదానందరూపుడు. సత్యములన్నింటికీ పరమసత్యము అతడే అని చెప్పాలి.

పరమేశ్వరుడు ఎక్కడ ఉంటాడు? ఇది ఇంకొక ప్రశ్న. ఒకచోట అనేది లేదు. ఆయన అన్నిచోట్ల నిండి ఉంటాడు. ప్రాణమున్నవి, ప్రాణంలేనివి, చలనమున్నవి,

చలనం లేనివి. అన్నింటియందు అంతర్యామిగా ఉంటాడు. అలా ఉంటూ, అన్నింటినీ నియంత్రిస్తూ ఉంటాడు. సూర్యుడిలోఉన్నాడు. కాని సూర్యుడు అతన్నెరగడు. సూర్యుడే అతడిశరీరం. సూర్యునిలో ఉంటూనే సూర్యుణ్ణి నియంత్రిస్తుంటాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ అని చెబుతోంది బృహదారణ్యకోపనిషత్తు. ఈ రకంగా పరమేశ్వరుడు అన్నింటియందూ అంతర్యామిగా ఉంటాడు. ఇదే పరమాత్మ యొక్క నిగూఢతత్త్వం. పరమేశ్వరుడు ఉన్నాడనే భయంతోనే సూర్యచంద్రులు తమ గతులు తప్పక తిరుగుతున్నారు. గ్రహాలు తమ కర్తవ్యాన్ని నెరవేరుస్తున్నాయి. జగత్తులో అన్నీ కూడా సవ్యమైన మార్గంలో పయనిస్తున్నాయి.

సాకారబ్రహ్మని ఉపాసన చేసినవారు అంటే యజ్ఞయాగాది క్రతువులు, పూజలు, వ్రతాలు, దానాలు మొ॥వి చేసినవారు పుణ్యలోకాలకు పోయి, అక్కడ స్వర్గసుఖా లనుభవించి, కర్మఫలశేషం అనుభవించటం కోసం ఈ భూలోకంలో మళ్ళీ జన్మిస్తుంటారు. ఈ రకంగా పుణ్యకర్మలు చేసినవారు ఉత్తమయోనులందు, పాపకర్మలు చేసినవారు నీచయోనుల యందు, దుర్మార్గమైన పనులు చేసిన వారు క్రిమికీటకాలుగా పుడుతూ, చస్తూ ఉంటారు.

జిజ్ఞాసువు మాత్రమే ఈ జగత్తంతా పరమేశ్వర స్వరూపము అని తెలుసుకోగలుగుతాడు. అలాంటివాడు మాత్రమే ఐహిక బంధనాలను తెంచుకుని, బంధవిముక్తుడై ముక్తి పొందుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు. అతని యొక్క జీవాత్మ, పరమాత్మ ఒకటై పోతాయి. అదే ముక్తి, మోక్షము, సాయుజ్యము, పరమపదము అని చెప్పబడుతుంది. అతనికి కర్మశేషం ఉండదు కాబట్టి పునర్జన్మ ఉండదు. ఈ రకంగా జీవాత్మ పరమాత్మలు ఏకీభావం పొందటమే అద్వైతము. అప్పుడు జగత్తులో ఉండేది పరమేశ్వరస్వరూపం ఒక్కటే. రెండవది ఏదీలేదు. ఇదే అద్వైత సిద్ధాంతము. సృష్టి జరగటానికి ముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరమేశ్వరుడు ఆక్రమించి ఉన్నాడు. అంటే జగత్తంతా పరమేశ్వరమయంగా ఉన్నది. ఆ పరమేశ్వర స్వరూపం నుంచే ఈ జగత్తంతా ఆవిర్భవించింది. ప్రళయ కాలంలో మళ్ళీ ఈ జగత్తంతా పరమేశ్వరునిలో లీనమయిపోతుంది. కాబట్టి ఎప్పుడూ ఉండేది పరమేశ్వరతత్త్వం ఒక్కటే. అదే నిత్యము సత్యము శాశ్వతము. అదే అద్వైతము.

**ఆత్మతత్త్వము :** అద్వైత సిద్ధాంతంలో ఆత్మను గురించి ఎక్కువ విచారణ చెయ్యబడింది. అద్వైత వేదాంతధ్యేయం ఆత్మనిరూపణ. ఆత్మ–పరమాత్మ రెండూ ఒక్కటే. **"బ్రహ్మసత్యం జగన్మిధ్య"** ఇదే అద్వైత వేదాంతసారం. ఈ సిద్ధాంతం ప్రకారము శరీరం వేరు. ఆత్మ వేరు. దేహమే ఆత్మకాదు. జీవసృష్టి జరిగిన తరువాత ఆ పరమేశ్వరుడు "నేను ఈ దేహంలో లేకపోతే ఎలాగ?" అని ఆలోచించినవాడై బ్రహ్మరంధ్రం గుండా ఈ శరీరంలో ప్రవేశించి, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, నవరంధ్రాలతో కూడిన ఈ దేహంలో ఉంటూ, ఇంద్రియ సుఖాలనుభవిస్తూ, తానే పరబ్రహ్మననే విషయం, ఈ దేహం నుంచి బయటకు పోయేమార్గం, మరచిపోయాడు. అవసానకాలంలో జీవిప్రాణాలు సాధారణంగా నవరంధ్రాలలోను ఏదో ఒక రంధ్రంగుండా బయటకు పోతాయి. అటువంటిజీవి తాను చేసిన కర్మలను బట్టి మరణానంతరము స్వర్గనరకాలు అనుభవించి, కర్మఫలశేషాన్ని అనుభవించటానికి గాను ఈ భూమిమీద జన్మిస్తాడు. కాని అవసానదశలో యోగియొక్క ప్రాణాలు ఉత్క్రమించవు. ఉత్రమించటం అంటే నవరంధ్రాలలోను ఏదో ఒక రంధ్రం గుండా బయటకు పోవటము. యోగియొక్క ప్రాణాలు ఉత్క్రమించవు. వచ్చిన త్రవోనే బయటకు పోతాయి. అంటే బ్రహ్మరంధ్రం ద్వారా బయటకు పోయి, మొదట సూర్యలోకానికి, అక్కడ నుంచి పగటి దేవత, రాత్రి దేవత, దినదేవత, వారదేవత, పక్షదేవత. ఇలా ఈ దేవతలందరినీ దాటి, సూర్యలోకం, అగ్నిలోకం, వరుణలోకం, అర్చిరాది మార్గం గుండా బ్రహ్మలోకం చేరి, కల్పాంతం వరకు ఆ కర్మబ్రహ్మతోనే ఉండి, తరువాత కర్మబ్రహ్మతోపాటుగా పరబ్రహ్మలో లీనమవుతాయి. ఈ రకంగా జీవాత్మ పరమాత్మలు ఏకీకృతం చెందుతాయి అని చెబుతోంది "అద్వైతసిద్ధాంతము"

ఈ సిద్ధాంతం ప్రకారం మానవశరీరంలో పంచకోశాలున్నాయి. అవి 1. అన్నమయ 2. ప్రాణమయ 3. మనోమయ 4. విజ్ఞానమయ 5. ఆనందమయ కోశాలు. పరమేశ్వరస్వరూపం సర్వానందమయమైనది. మానవశరీరంలో ఐదు కోశాలున్నాయి. కోశము అంటే వర అని అర్థం. ఈ ఐదు కోశాలు ఒక దానిలో ఒకటి ఉంటాయి. ముందుగా అన్నమయకోసం. ఇది అన్నంవల్లనే ఏర్పడింది. దీనిలో ప్రాణమయకోశము ఉంటుంది. అందులో మనస్సు అనబడే కోశముంటుంది. ఇందులో విజ్ఞానమయకోశం ఉంటుంది. విజ్ఞానమయ జగత్తుకు సంబంధించిన

విజ్ఞానమంతా ఇందులో ఉంటుంది. దానిలో ఆఖరుది అయిన ఆనందమయకోశం ఉంటుంది. ఇందులో ఆనందమయుడైన పురుషుడు ఉంటాడు. ఆ పురుషుణ్ణే మనం ధ్యానం చెయ్యాలి. అతడే పరమేశ్వరుడు. ఈ విషయాలన్నీ తైత్తిరీయోపనిషత్తులో చెప్పబడ్డాయి. ఆత్మ త్రికాలాలకు అతీతమయింది అని చెబుతోంది ముండకోపనిషత్తు. ఈ రకంగా చూస్తే ఆత్మ సర్వాంతర్యామి. అన్నింటియందు అంతర్లీనంగా ఉండి, అన్నింటినీ నియంత్రించేది, త్రిగుణాలకు, త్రికాలాలకు అతీతమైనది ఆత్మ.

**సాక్షి :** ‘‘ఆత్మ బుద్ధిలో ప్రతిబింబించినప్పుడు అది సాక్షిచైతన్యము అనబడుతుంది” ప్రతి మానవుడిలోను కొన్ని శక్తులుంటాయి. ఆ శక్తుల వల్లనే మానవుడు భావోద్రేకాలు పొందుతాడు. విషయాలను ప్రత్యక్షంగా అనుభవిస్తాడు. గతంలో జరిగిన సంఘటనలను గుర్తుకు తెచ్చుకుంటాడు. ఇవికాక వీటన్నింటినీ చూసే సాక్షీభూతమైన మరొకశక్తి ఉన్నది అంటాడు శంకరుడు. నిత్యమూ చైతన్యంగా భాసించేదే సాక్షి. ఇది అనుభవం వల్ల ఏర్పడదు. భావాలు, వస్తువుల అనుభవంతో ఏర్పడుతుంది. అనుభవాలకు ముందే ఏర్పడుతుంది.

“స్థూలసూక్ష్మ శరీరాలకు ఏది ఆధారభూతమో, వాటి సమస్తమైన కర్మలను ఏదైతే చూస్తుంటుందో, ఆ కర్మఫలాలు అంటకుండా ఏదైతే ఉంటుందో, అదే సాక్షి” అంటారు విద్యారణ్యులవారు. నాట్యశాలలో వేదికమీద దీపం ఉంచబడింది. ఆ దీపం నృత్యశాలను, నటులను, అందులోని వివిధవస్తువులను, పరికరాలను ప్రకాశింపచేస్తుంది. అలాగే సాక్షి చైతన్యం కూడా సమస్తమై వస్తువులను, భావాలను ప్రకాశింప చేస్తుంది. ఒకవేళ అక్కడ ఎవరూ లేకపోయినా ఆ దీపం తన కాంతిలో తానే ప్రకాశిస్తుంటుంది. అంతేకాకుండా ఈ సాక్షిచైతన్యం అహంకారాన్ని, బుద్ధిని, విషయాలను కూడా ప్రకాశింప చేస్తుంది. ఇంద్రియాలు, వస్తువులను కూడ ప్రభావితం చేస్తుంది. అవేవీ లేకపోయినా తన స్వరూపంలో తాను వెలుగుతూ ఉంటుంది. అహంకారమనేది నృత్యశాల యొక్క యజమాని. విషయాలే–ప్రేక్షకులు. బుద్ధి– నర్తకి. ఇంద్రియాలే – వివిధ రకాలైన వాద్యాలు. వీటన్నింటినీ ప్రకాశింపచేసే దీపంలాంటివాడు సాక్షి. దీపం ఎక్కడికీ కదలకుండా ఉన్నచోటనే ఉంటూ, చుట్టూ ఉన్న పదార్థాలను ప్రకాశింపచేస్తుంది. అలాగే మూడు కాలాలలోను, రాకపోకలు లేకుండా ఉండే సాక్షియైన ఆత్మ, లోపల బయటా అంతటా ప్రకాశింప చేస్తూ

ఉంటుంది. అయితే సాక్షికి బాహ్యాభ్యంతర భేదం లేదు కదా ? అని అనుమానం రావచ్చు. ఇక్కడ బాహ్యాంభ్యంతర విభాగం సాక్షికి సంబంధించినది కాదు. అది శరీరాన్ని దృష్టిలో పెట్టుకుని లోపల, బయట అంతా ప్రకాశింపచేస్తూ ఉంటుంది. శరీరంలోపల అహంకారముంటుంది. శరీరం బయట శబ్దాది విషయాలుంటాయి. ఈ రెండింటినీ ప్రకాశింప చేస్తుంది సాక్షి. అయితే సాక్షి చంచలం కాదు. బాహ్యాంభ్యంతరాలకు వస్తూ పోతూ ఉండేది అంతకాన్న కాదు. కిటికీ గుండా సూర్యకాంతి ఇంటి లోపలకు వస్తోంది. నిజంగా చెప్పాలంటే దానికి చాంచల్యాము అనేది ఏమీలేదు. ఆ కాంతికి చేతిని అడ్డంగా పెట్టాం అనుకోండి అప్పుడు కదులుతున్నట్లుగా అనిపిస్తుంది. ఇక్కడ కదిలేది చెయ్యి అంతే తప్ప సూర్యకాంతి కాదు. అలాగే తన స్వరూపంలో స్థితుడై ఉన్న సాక్షి (ఆత్మ) కూడా బయటకు లోపలకు పోయినా, బుద్ధి చాంచల్యంవల్ల మనకి అది వస్తూ పోతున్నట్లుగా అనిపిస్తుంది. సాక్షి అయిన చైతన్యానికి బాహ్యాంభ్యంతరమైన స్థానం అంటూ ఏదీ ఉండదు. లోపల బయట అనే స్థానభేదం బుద్ధి విషయంలోనే ఉంటుంది. వాస్తవానికి బుద్ధియొక్క, ఇంద్రియాల యొక్క ప్రతీతి ఎక్కడ నిలిచిపోతుందో, అక్కడే ఆ చైతన్య రూపమైన సాక్షి భాసిస్తూ ఉంటుంది. సమస్త వ్యవహారాలు నిలచిపోయినప్పుడు, ఒక దేశానికి సంబంధించిన ప్రతీతి ఉండదు కదా ? ఆ స్థితిలో అటువంటి చోట సాక్షి ఉంటాడని ఎలా చెప్పగలుగుతాము? అంటే సాక్షియైన వాడికి తనదంటూ ఏదో ఒక ప్రత్యేకమైన స్థానం ఉండాల్సిన అవసరం లేదు. అతడు సర్వగతుడు అంటున్నాయి శాస్త్రాలు. కాని స్వభావ సిద్ధంగా అది అద్వితీయము, సంగరహితము.

పరబ్రహ్మకు ఉన్నట్టి సర్వసాక్షిత్వము అనేది నిజం కాదు. అది కేవలం కల్పన మాత్రమే. బుద్ధి బాహ్యంగా గాని, అంతరంగికంగా గాని, ఏ స్థానంలో, ఏ వస్తువును కల్పించినా, ఆ స్థానంలో, ఆ వస్తువులో సాక్షిగా ఉండేది ఆత్మే. యథార్థంగా చూస్తే ఆత్మకి ఉండే సర్వసాక్షిత్వం సత్యం కాదు అని తెలుస్తుంది. ఎందుకంటే, ఆత్మయందు సాక్షిత్వం కూడా సరిపడదు. బుద్ధిద్వారా ఏ యే రూపము మొదలైన వాటి కల్పన జరుగుతుందో, ఆ రూపాన్ని ప్రకాశింప చేస్తున్న కారణంగా, ఆత్మను ఆయా విషయాలకు సాక్షి అన్నారు. కూటస్థమైన ఆత్మ, వాక్కుకు మనస్సుకు విషయం కానప్పుడు నా చేత ఎలా తెలుసుకోబడుతుంది? అంటే ఆత్మ అనేది గ్రాహ్యం

కాదు. అది తెలుసుకోబడదు. అగ్రాహ్యం. సమస్త విషయాలు నశించిన తరువాత చివరకు కూటస్థమైన ఆత్మ మాత్రమే మిగిలి ఉంటుంది. ఈశ్వరుడే సర్వసాక్షి అని శ్వేతాశ్వరోపనిషత్తు, కౌముది అనే గ్రంథాలు చెబుతున్నాయి. జీవుడి యొక్క సమస్తమైన చర్యలు చూస్తున్నప్పటికీ, అవేవీ ఈశ్వరుని అంటవు. జీవిలో ఆయన ఉంటూ దాన్ని ప్రభావితం చేస్తాడు. అప్పుడు ఈశ్వరుడు ప్రజ్ఞగా భాసిస్తాడు. ఆ "ఈశ్వరుడే సర్వసాక్షి" అంటోంది అద్వైతం.

**జీవుడు-ఆత్మ:** ఆత్మ సమస్తమైన అనుభవాలకు ఆధారభూతము. అయినప్పటికీ ఆత్మ ఏ రకమైన మార్పు లేక వికారము పొందదు. ఆత్మని గురించి తెలుసుకోవటం దుర్లభం. మనలో ఉండే ఆలోచనలకు, అనుభవాలకు సాక్షి ఆత్మ. తెరలోంచి బొమ్మలు రావు. కాని తెర లేకపోతే బొమ్మలు పడవు. అలాగే సమస్త అనుభూతులకు ఆధారభూతం ఆత్మ. అంత మాత్రం చేత ఇవన్నీ ఆత్మలోంచే వచ్చాయి అనుకోవటం సరికాదు. పదార్థం యొక్క స్వరూపాన్ని మనం సరిగా అర్థం చేసుకోనంత మాత్రం చేత వాటిలో మార్పు ఉంటుంది అనుకోరాదు. అంటే ఆత్మలో ఏ రకమైన మార్పు ఉండదు. అయితే మార్పు లేదా వికారము లేని ఆత్మ మార్పు ఉన్నట్లుగా ఎందుకు కనిపిస్తుంది? పరమార్థ సత్త అయిన ఆత్మ వ్యవహారిక సత్తగ ఎందుకు గోచరిస్తుంది? శరీరంలో ఆత్మ ప్రతిబింబించినప్పుడు, శరీరానికి ఉండే వ్యావహారిక లక్షణాలు ఆత్మకు వస్తాయి. ఈ విధంగా ఆత్మ మార్పు చెందినట్లు, భిన్న లక్షణాలతో ప్రకాశితమవుతుంది.

జీవుడు పరమార్థతత్త్వం యొక్క ప్రతిబింబం మాత్రమే ఇందులో ఏ మాత్రం సందేహం లేదు. ఆకాశంలో ఉన్న ఒకే సూర్యుడు, ఈ భూమి మీద అందరికీ ఒక్కొక్కడుగా కనిపిస్తాడు. అలాగే ఉన్నది ఒక్క పరమాత్మే అయినప్పటికీ ఉపాధి భేదం చేత రకరకాలుగా కనిపిస్తాడు. సూర్యుడు ప్రకాశించేటప్పుడు ఆయన కాంతి అడవులు, సముద్రాలు, నదులు, ఎడారులు, కాలువలు, స్వచ్ఛమైన నీరు, మురికి కాల్వలు వీటన్నింటిలోనూ ప్రతిబింబిస్తాడు. అంతమాత్రం చేత ఆయన యొక్క తేజస్సుకు కళంకం ఏ మాత్రం రాదు. అలాగే పరమేశ్వరుడు ఉపాధి భేదం చేత భిన్నరూపాలుగా కనిపిస్తున్నప్పటికీ ఏ వికారము ఉండదు. ఏ విధమైన తేడా లేకుండా పరమాత్మ తత్త్వం జీవరాశిలో ప్రతిబింబిస్తుంది. అవిద్యా వ్యామోహితులమయిన

మనం ఆత్మకి భేదాన్ని, అసమానత్వాన్ని అంటగడతాము. ఇదే వ్యామోహం లేదా మాయ అనబడుతుంది.

'ఫేనబుద్బుదతరంగ న్యాయాన్ని' అనుసరించి జీవబ్రహ్మల ఐక్యతను వివరించాడు శంకరుడు. అసలు ఫేనబుద్బుదము అంటే ఏమిటి? సంస్కృత న్యాయాలలో ఇది ఒకటి. ఫేనము అంటే సముద్రపు నురుగు. బుద్బుదము అంటే బుడగ, నీటిబుడగ. తరంగములు అంటే సముద్రంలో వచ్చే అలలు. సముద్రము అనంతమైన జలరాశి. అయితే సముద్రము అంటే కేవలము నీరే కాదు. ఉవ్వెత్తున లేచే తరంగాలు, నీటిబుడగలు, నురుగు ఇవన్నీ కలిసినదే సముద్రము. తరంగాలు, నీటిబుడగలు సముద్రంకన్న వేరైనవి కావు. అలాగే జగత్తులో 84 లక్షల రకాలైన జీవరాశి, క్రిమికీటకాల నుంచి మానవులదాకా ఉన్న జీవరాశి ఆ పరమేశ్వరుని కన్న వేరు కాదు. మనస్సు, బుద్ధి, అంతఃకరణ అనేవి జీవుడికి విశేషణాలు కావు. ఉపాధులు మాత్రమే. ఒక పదార్థం యొక్క స్వభావాన్ని తెలిపేది విశేషణం. రంగు అనేది వస్తు విశేషణం. శరీరము అనేది ఉపాధి. ఘటాకాశము అన్నప్పుడు, ఘటంలో ఆకాశమున్నది. కాబట్టి ఘటమనేది విశేషణం కాదు. ఉపాధి. ఇక్కడ గుణము అనేది ఒక పదార్థాన్ని ఆశ్రయించి ఉంటుంది. పదార్థం నుంచి దాన్ని విడదీయలేము. ఒక పదార్థం స్వభవాన్ని తెలిపేది విశేషణం. రంగు అనేది వస్తు విశేషణము. కాని కుండలో ఉన్న ఆకాశం, ఆ కుండ విశేషణం కాదు. అది ఉపాధి. ప్రపంచం గనక ఒక నీడ లాంటిది అయితే ఆ నీడని ప్రసరింపచేసే వాస్తవిక పదార్థమే బ్రహ్మతత్త్వము. ఈ విధంగా ఈశ్వరుడు బింబమైతే, జీవుడు ప్రతిబింబము ఇలా బింబప్రతిబింబ వాదాన్ని చేస్తూ పరమేశ్వరుడు జీవుడు బింబప్రతిబింబాలు అన్నాడు శంకరుడు.

**మాయావాదం :** అనాదియైనది, అంతము గలది, ప్రమాణాలకు అప్రమాణాలకు సాధారణమైనది, సత్తుకాదు, అసత్తు కాదు, సదసత్తు అంతకన్నా కాదు. స్వయంగా అధికమైనది. వికారాలు లేనిది, నిరూపించటానికి వీలైన లక్షణాలు లేనిది మాయ.

అద్వైత సిద్ధాంతంలో మాయ, మిథ్య, భ్రాంతి, అవిద్య అనే పదాలు ఎక్కువగా కనిపిస్తాయి. మాయ అంటే ఏమిటి? ఈ మాయకు, పరమేశ్వరుడికి సంబంధం ఏమిటి? ఇటువంటి ప్రశ్నలకు లౌకిక దృష్టిలో తావులేదు. వాటిని పారమార్థిక

దృష్టితోనే ఆలోచించాలి అంటాడు శంకరుడు. సమస్త జగత్తుకు మూలం పరమేశ్వరుడే. ప్రపంచం బ్రహ్మానికి బాహ్యంగా లేదు కాబట్టి, ఆ రెండింటి మధ్యనా తాదాత్మ్యమున్నది. ప్రపంచం పొందే విచ్ఛిన్నమంతా బ్రహ్మానికి వర్తించదు. కాబట్టి బ్రహ్మము, ప్రపంచము, ఒకటి కాదు. బ్రహ్మముసత్యము. జగత్తుమిథ్య. బ్రహ్మవేత్తకు జగత్తుమిథ్య అనిపిస్తుంది. సామాన్యుడికి జగత్తు అనేక రకాలుగా ఉన్నట్లు కనిపిస్తుంది.

బ్రహ్మము జగత్తుకు మూలమైనప్పటికీ, జగత్తుకు ఆధారమైనప్పటికీ, జగత్తులో ఉండే మార్పులు, నానాత్వము బ్రహ్మానికి వర్తించవు. మాయామయమైన ఈ జగత్తులో అనేక వాదనలున్నాయి. వాటిలో తాడు పాముగా కనిపించటం వివర్తవాదం. పాలు పెరుగుగా మారటం పరిణామవాదం. ఈ విషయాలను శంకరుడు సామాన్య ఉదాహరణలతో వివరించాడు అవి

1. రజ్జుభ్రాంతి – తాడు పాముగా కనిపించటం
2. మరుమరీచికలు – ఎండమావులను చూసి నీటిమడుగు అనుకోవటం
3. శుక్తరజతభ్రాంతి – ముత్యపుచిప్పను చూసి వెండి అనుకోవటం.

ఇక్కడ కారణంలో మార్పు లేదు. కాని ఉన్నట్లు కనిపిస్తుంది. ఉన్నదంతా పరమేశ్వర స్వరూపమే. కాని అది మాయవల్ల విచ్ఛిన్నమైనట్లు కనిపిస్తుంది. ఆ విచ్ఛిన్నశక్తే మాయ. ఆకారంలేనిదాంట్లో ఆకారాన్నిచూపించేదే మాయ. పరమేశ్వరుని మూలశక్తే మాయ. అది సత్తు కాదు. అసత్తు కాదు. మాయకు పరబ్రహ్మకు మధ్య ఉన్న సంబంధమే ఈశ్వరుడు. అంత మాత్రంచేత ఈశ్వరుణ్ణి మాయ బంధిస్తుందని కాదు. ఆయన మాయచేత బాధితుడు కాదు. మాయ ఈశ్వరుని శక్తిని చాటుతుంది. మాయ లేకపోతే ప్రపంచం యొక్క ఉనికిని గురించి తెలుసుకోలేము. జగత్తును బహిర్గతం చేస్తున్నంతవరకు దానికి ఉనికి ఉంటుంది. అది సత్తే. కాని బ్రహ్మ అవగతమైనప్పుడు దానికి ఉనికి లేదు. అప్పుడది అసత్తు. మరొకటి లేనిదయితే ఈ మాయ సదసత్ అవుతుంది. **జగత్తు మిథ్య. జీవుడు–బ్రహ్మ ఒకటే. ఇదే అద్వైతసారం.**

మాయ అనేది పరబ్రహ్మలాగ పరమార్థ సత్తకాదు. అలా అని గగనకుసుమము, వంధ్యాపుత్రుడు లాగా తుచ్ఛముకాదు. వ్యావహారిక ప్రపంచాన్ని తెలుసుకోవాలంటే

ప్రాతిభాసికసత్త అవసరము. అలాగే పారమార్థికసత్తను గురించి తెలుసుకోవటానికి వ్యావహారికసత్త అవసరం. నదిని దాటిన తరువాత తెప్పతో అవసరం లేదు. అలాగే పారమార్థికసత్యం తెలిసిన తరువాత వ్యావహారికసత్తతో అవసరం లేదు. మాయనశించి పరమార్థతత్త్వాన్ని అనుభవంలోకి తెచ్చేదే మాయ. ఈ మాయ అనేది ఈశ్వరుని శాశ్వతశక్తి. ఇది ప్రపంచానికి ఉపాదాన కారణం కాదు. భౌతిక జగత్తుకు వివర్త కారణంగా ఉంటుంది. మాయకు రెండు లక్షణాలున్నాయి. 1. ఆవరణ 2. విక్షేపము. ఉన్న సత్యాన్ని కనిపించకుండా చెయ్యటం, కప్పి పుచ్చటం ఆవరణము. లేనటువంటి దాన్ని ఉన్నట్లుగా చూపటం విక్షేపము. ఆవరణలో జ్ఞానం కప్పి పుచ్చబడుతుంది. విక్షేపంలో భ్రాంతిజన్యమైన జ్ఞానం బహిర్గతం చేయబడుతుంది. అందువల్ల పరబ్రహ్మని మనం చూడలేం. భ్రమతో కూడిన వేరొక దాన్ని చూస్తాం. మాయ అనేకమైన నామరూపాలు ధరిస్తుంది. ఆ నామరూపాల సముదాయమే ఈ జగత్తు. యథార్థాన్ని దాచి పెట్టటం, యథార్థం కాని దాన్ని బహిర్గతం చెయ్యటం మాయ చేసే పని. ఈ పని జరుగుతున్నంత వరకు మనకు పరబ్రహ్మతత్త్వం తెలియదు. అద్వైత సిద్ధాంతంలో మాయను గురించి చెప్పింది ఏమంటే ?

1. ప్రపంచము తనంత తానుగా బహిర్గతం చేసుకోలేదు కాబట్టి ఇంకొక శక్తి మీద ఆధారపడి బహిర్గతమవుతుంది. ఆ శక్తే మాయ.

2. జగత్తుకు మూలం బ్రహ్మమే అయినప్పటికీ, జగత్తుతో ఉండే మంచి చెడ్డలు, తారతమ్యాలకు కారణం బ్రహ్మ కాదు.

3. బ్రహ్మాన్ని విస్తరింప చేసి జగత్తుగా కనిపించేట్లు చేసేది మాయ.

4. ఈశ్వరుడి శక్తి మాయ. మాయ ఆయన అధీనంలోనే ఉంటుంది. ఆయన మాయ అధీనంలో ఉండడు.

**ఈశ్వరుడు :** అద్వైతం మూడు సత్తలను అంగీకరిస్తుంది. అవి

1. పారమార్థిక సత్త (పరబ్రహ్మ)

2. వ్యావహారిక సత్త (జగత్తు, జీవుడు)

3. ప్రాతిభాసిక సత్త (మిథ్యా ప్రపంచము, స్వప్న జగత్తు)

సర్వసంకల్పాలకు, సర్వకల్పనాభావాలకు మూలం అనేది ఒకటుంది. ఇదే శంకరుని మూలసిద్ధాంతం. దీన్ని తర్కంతోను, శ్రుతి ప్రమాణంతోను సమర్థించాడు శంకరుడు. భగవంతుని గుణగణాలతో నిమిత్తం లేకపోయినప్పటికీ, భగవంతుని ఉనికితోను, ఆయనకు ప్రపంచానికి మధ్య సంబంధమున్నది అనే విషయంతోను శంకరుడు ఏకీభవించాడు. ఈ జగత్తులో అనేకమైన 'సామాన్యాలు' అనేకమైన 'విశేషాలు' ఉన్నాయి. వీటన్నింటిని ఒక రాశిలో ఇమిడ్చినట్లైతే అదే పరబ్రహ్మ. అదే విజ్ఞాన ఘనమయము. దీన్ని గురించి తెలుసుకుంటే జగత్తులో ఉన్న అన్ని విషయాల గురించి తెలుస్తుంది. పరబ్రహ్మ అనేది వ్యావహారికసత్యం కాదు. ద్రవ్యం కాదు. గుణము అంతకన్నా కాదు. కాని సమస్త ద్రవ్యాలకు, గుణాలకు, మూలాధారం. అది దిక్కులకు, కాలాలకు, అతీతంగా ఉంటుంది. పారమార్థికసత్యం. అది సర్వత్రా వ్యాపించి ఉంటుంది. కాని ఏ ప్రదేశంలోనూ ఉన్నట్లు చెప్పలేము. అన్ని కాలాల్లోనూ ఉంటుంది. ఒక వస్తువు కాదు. ఒక పదార్థం కాదు. కాబట్టి ఒకచోట ఉంటుంది, ఒక కాలంలో ఉంటుంది అని చెప్పలేం. అది అవ్యాకృతం. తర్కం ద్వారా దాన్ని తెలుసుకోలేము. సామాన్యుడికి అది అర్థం కాదు. ఆ పరబ్రహ్మ సజాతీయ, విజాతీయ, స్వగత భేదాలు లేనటువంటిది. సజాతీయము అంటే – ఒక జాతిలో ఉండే తేడాలు మామిడి చెట్టుకు, మామిడి చెట్టుకు, ఉండే తేడా. చెట్టు ఆకులు, కొమ్మలు, రెమ్మలు, కాయలు మొదలగునవి. విజాతీయము అంటే – భిన్న జాతులలో ఉండే తేడాలు, మామిడిచెట్టుకు, వేపచెట్టుకు, మధ్య గల తేడా. స్వగతము అంటే ఒకే దానిలో ఉండే తేడా. చెట్టు ఆకులు, పూలు, కాయలు, కొమ్మలు మొదలైనవి. అలాంటప్పుడు ఆ బ్రహ్మను గురించి తెలుసుకోవటం ఎలా ? ఏది బ్రహ్మకాదో మనం చెప్పగలం. కాని ఏది ఔనో మనం చెప్పలేం. అది మార్పుకు, శాశ్వతత్వానికి అతీతంగా ఉంటుంది. భావాలకు, సమగ్రతకు అసమర్థతకు అతీతంగా ఉంటుంది. సాపేక్షానికి, నిరపేక్షానికి అతీతంగా ఉంటుంది. ఈ ద్వంద్వాలన్నీ సాధారణ పరిధిలోకి వస్తాయి. అలా సాధారణ పరిధిలోకి రానిదే బ్రహ్మము. అది అనంతమైనది. అది అనుభవాతీతమైనది. అందుకే నిర్గుణము అని చెప్పబడింది. గుణాలన్నీ ప్రకృతికి సంబంధించినవి. ప్రకృతిలోంచే పుడతాయి. ప్రకృతిలోనే లీనమవుతాయి. పరబ్రహ్మతత్త్వం గుణాతీతము.

పరబ్రహ్మలో ఏ మార్పు ఉండదు. లోకంలో మనకి కనిపించేదంతా అంతః కరణ ప్రవృత్తిలో జరిగే మార్పు. మనం తెలుసుకోవటానికి పరబ్రహ్మతత్త్వము ఏమీ ఉండదు. జ్ఞానమే పరబ్రహ్మ స్వరూపం. అంతేకాని జ్ఞానం దానిలక్షణంకాదు. గుణం అంతకన్నా కాదు. అది సంపూర్ణమైనది. దాని సమగ్రత, సంపూర్ణత అనేవి ఒక ప్రదేశంలో కాని, కాలంలో కాని జరిగింది కాదు. అందుచేతనే దిక్కులకు, కాలానికీ అతీతమైనది. అందుకే దాని వర్ణనంతా నిర్గుణంగాను, నిషిద్ధాత్మకంగాను ఉంటుంది. అది అసత్తు కాదు, జడపదార్థం కాదు, దుఃఖమయం కాదు. అది లేని ప్రదేశం ఏదీ లేదు. సర్వవ్యాపి. మూడు కాలాల్లోనూ ఉంటుంది. త్రికాలాలకీ అతీతమైనది. అది దేని మీద ఆధారపడదు. సర్వము దానిమీదనే ఆధారపడుతున్నాయి. దానికి ఆద్యంతాలు కాని బాహ్యాంభతరాలు లేనే లేవు. అది భౌతికం కాదు. అశాశ్వతం కాదు. నిరంతరము తన స్వరూపంలో కాంతులను వెదజల్లుతూ ఉంటుంది. నిరంతరము ప్రకాశిస్తుంటుంది. ఆనందసాగరంలో ఓలలాడుతుంది.

ఆ పరబ్రహ్మ శూన్యం కాదు. నిర్వస్తువు, భ్రాంతిజన్యము అంతకన్నా కాదు. బ్రహ్మను గురించిన భావాలు శూన్యం కావచ్చు కాని బ్రహ్మమాత్రం శూన్యం కాదు. అది పరిపూర్ణమైనది. అది అఖండం, ఏకరాశి, ఆనందరాశి, విజ్ఞానఘనమయం. అటువంటిది ఏదీ ఉండదని, ఉన్నా దాన్ని గురించి తెలుసుకోవటం కష్టమని, అది శూన్యమని భావించారు, ఇతర మతస్థులు. కాని ఇదే "పరమార్థసత్యం" అన్నాడు శంకరుడు. పరబ్రహ్మని నిషిద్ధవాక్యాలద్వారా మాత్రమే తెలుసుకోవాలి అంటాడు.

ఉపనిషత్తులు పరబ్రహ్మ స్వరూపాన్ని వివిధ రకాలుగా వర్ణించాయి. ఈ వర్ణన ప్రయోజనం రెండు రకాలు.

1. ఉపలబ్ధ్యార్థం – తెలుసుకోవటానికి
2. ఉపాసనార్థం – ఉపాసన చెయ్యటానికి

పరబ్రహ్మ తత్త్వాన్ని తెలుసుకోవాలంటే ఉపాసనాబలము, సత్ప్రవర్తన ఉండాలి. ఈ రెండూ ఉంటేనే పరబ్రహ్మను గురించి తెలుస్తుంది. ఉపాసన, సన్మార్గత లేని వారికి పరబ్రహ్మ కనిపించదు. పరబ్రహ్మ మనకి రెండు లక్షణాలతో కనిపిస్తుంది. 1. స్వరూపలక్షణము 2. తటస్థ లక్షణము. ఇందులో సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ

అనేవి స్వరూప లక్షణాలు. అతను సృష్టికర్త, కర్మఫలప్రదాత, విశ్వకర్త లాంటి వాక్యాలు తటస్థ లక్షణాలు. ఇవన్నీ ఉపాసన కోసం చెప్పినవే. దేన్నైనా సరే మానవుడు బాగా ఆలోచించి, తరచి తరచి ప్రశ్నించి, విషయం తెలుసుకోవాలి. అలా తెలుసుకోలేక పోవటాన్నే అవిద్య అంటారు. బ్రహ్మను గురించి తెలుసుకోవాలనుకోవటం జిజ్ఞాస. కేవలం బ్రహ్మను గురించే తెలుసుకోవాలనుకోవటం ముముక్షుత్వం. అలా తెలుసుకోవటమే మోక్షము.

పరబ్రహ్మ నిరూపణ అనేది తర్కంవల్ల జరగదు. కేవలం శృతి ప్రమాణం వల్లనే సాధ్యమవుతుంది. భగవంతుడు సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, సర్వశక్తి సంపన్నుడు. శ్రుతిని అంగీకరించటమంటే శ్రద్ధను, నమ్మకాన్ని, విశ్వాసాన్ని, ఆప్తుల వచనాన్ని అంగీకరించటమే. వేదాంత సూత్రాలు శ్రుతిప్రమాణాన్నే ఆశ్రయించాయి. ఒకసారి శ్రుతిప్రమాణాన్ని ఆశ్రయిస్తే ఈశ్వరుని ఉనికిని నిరూపించటం చాలా తేలిక. అప్పుడు తర్కము, హేతువు నిరుపయోగమవుతాయి. కాబట్టి శ్రుతి ప్రమాణాన్నే అంగీకరించాలి అంటాడు శంకరుడు.

అద్వైత సిద్ధాంతంలో కర్మని అంగీకరించారు. మానవుడు చేసే కర్మలవల్ల పుణ్యపాపాలు, కష్టనష్టాలు వస్తాయి. తద్వారా సుఖదుఃఖాలు, అసమానత్వం, దరిద్రం కూడా సంభవిస్తాయి. వీటన్నింటికీ అతడు చేసిన కర్మేకారణం. జీవి, పాపపుణ్యాలు అన్యోన్యాశ్రయాలు. ఈ ప్రకృతి అంతా ఈశ్వరమయం. పరబ్రహ్మ అవిద్యలో ప్రతిబింబించినప్పుడు జీవుడుగా, మాయతో ప్రతిబింబించినప్పుడు ఈశ్వరుడుగా భాసిస్తాడు. స్వయంగా ఆ పరబ్రహ్మ మాయకు అతీతుడు. మాయ అనేది ఆయన శక్తి. ఆయన సంకల్పసిద్ధుడు. సృష్టి ఆయన స్వాభావిక చర్య. అందులో సంకల్పమే కాని ప్రయత్నం ఉండదు. జీవి తాను చేసిన కర్మఫలంవల్లనే ఈ శరీరం ధరిస్తాడు.

శంకరభగవత్పాదులు అద్వైతానికి వ్యతిరేకంగా ఉన్న దర్శనాలన్నిటినీ ఖండించి జ్ఞానంవల్లనే మోక్షం సిద్ధిస్తుంది అన్నారు. ఇప్పుడు వివిధ దర్శనాలను వారు ఏ రకంగా ఖండించారో చూద్దాం.

**1. యోగదర్శన ఖండన :** సాంఖ్య మతాన్ననుసరించే యోగశాస్త్రం వచ్చింది. యోగశాస్త్రంలోకూడా వేదాలకు విరుద్ధంగా ప్రకృతినే జగత్కారణంగా అంగీకరించారు.

సాంఖ్యమతాన్ని నిరాకరించటంవల్ల యోగమతాన్ని కూడా నికరించినట్లే అవుతుంది. బ్రహ్మసూత్రాలలోని 2వ అధ్యాయం 2వ అధికరణలో యోగమతాన్ని ఖండించారు.

సాంఖ్యమతాన్ననుసరించే యోగశాస్త్రమున్నప్పటికీ, యోగశాస్త్రంలో ఈశ్వరుడున్నాడు. ఈ రెండింటికీ తేడా ఇదొక్కటే. సాంఖ్యులు ప్రకృతే జగత్కారణము అన్నారు. అదే యోగానికి ఆధారం. అయితే సాంఖ్యశాస్త్రానికే ప్రమాణం లేనప్పుడు, యోగశాస్త్రానికి ప్రమాణం ఎలా ఉంటుంది. ఈ రెండింటికీ వేదప్రమాణం లేదు. వేదప్రమాణాన్ని అంగీకరించినంతవరకే వీటికి ప్రమాణత్వమున్నది. కాని ఎప్పుడైతే ఇవి వేదప్రమాణాన్ని అంగీకరించవో అప్పుడే వీటికి ప్రమాణత్వం లేదు.

**2. జైమిని పూర్వమీమాంస ఖండన :** శంకరుని దృష్టిలో యజ్ఞయాగాది కర్మలు చెయ్యాలి. వీటివల్ల, శిష్టాచారం వల్ల, మనసు నిర్మలమవుతుంది. కర్మలవల్ల స్వర్గసుఖాలు లభిస్తాయి. అంతేకాని మోక్షంమాత్రం రాదు. జ్ఞానం వల్ల మాత్రమే మోక్షం సిద్ధిస్తుంది.

మానవుడు చేసిన కర్మంతా ఒక చోట చేరుతుంది. దాన్నే **'సంచితకర్మ'** అంటారు. దానిలో కొంత భాగం మాత్రమే ఈ జన్మలో అనుభవిస్తాడు. అదే 'ప్రారబ్ధము' అనుభవించటం వల్ల ఇది క్షయమవుతుంది. మరి మిగిలిన సంచిత కర్మ ఏమవుతుంది? అది క్షయం కాకుండా మోక్షమెలా వస్తుంది? జ్ఞానంచేత గాని, భగవంతుని శరణు పొందటం వల్ల గాని సంచితకర్మ నశిస్తుందని వీరు నమ్మరు. వీరి సిద్ధాంతం ప్రకారం సంచితకర్మ ఎలా క్షయమవుతుందో తెలియదు. ముముక్షువు కామ్యకర్మలు, నిషిద్ధకర్మలు త్యజిస్తే మోక్షం వస్తుందని వేదంలో ఎక్కడా చెప్పబడలేదు. బ్రహ్మసూత్రాలలో జైమిని మహర్షి చెప్పిన పూర్వమీమాంసను వ్యాసభగవానుడు, శంకర భగవత్పాదులు తీవ్రంగా ఖండించారు. కర్మచేసిన మరుక్షణంలోనే దాని ఫలితాన్ని అనుభవించరు. ఆ ఫలితాన్ని కాలాంతరంలో కర్త అనుభవిస్తాడు. మరి అంతవరకు ఆ కర్మ ఫలము ఎక్కడ దాగి ఉంటుంది? దీనికి 'అపూర్వము ఒకటున్నది అన్నాడు జైమిని. అదే కర్మఫలాన్ని ఇస్తుంది అంటాడు.

వేదాలలో ఈ 'అపూర్వము' ఎక్కడా కనపడదు. ప్రత్యక్షది ప్రమాణాలచేత కూడా అపూర్వాన్ని తెలుసుకోలేము. వారు చెప్పే అపూర్వము అచేతనము. దానికి తారతమ్యజ్ఞానం లేదు. ఈ కర్మకు ఫలమిది అని గాని ఈ జన్మలో చేసిన కర్మ,

ఇంకొక జన్మలో అనుభవించాలని గాని లేదు. అందుచేత అపూర్వము కర్మ ఫలితాన్ని అనుభవింప చేస్తుందనటం సమంజసము కాదు. ఇలా చెయ్యటము సర్వజ్ఞుడైన పరమేశ్వరుడికే సాధ్యము.

గురుద్రోహం చేశారని భావించి కుమారిలభట్టు తుషాగ్నిలో అంటే వరిపొట్టులో కాల్చుకుని, పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోవలసిన అవసరం లేదు. జ్ఞానం కలగగానే సంచిత కర్మ పూర్తిగా నశించిపోతుంది అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. ధర్మరూపమైన కర్మచేత పాపము నశిస్తుంది. పాపముకన్న ధర్మము బలవత్తరమైనది అని **సనత్సుజాతీయం**లో చెప్పబడింది. దానికి శంకరుడు భాష్యం వ్రాస్తూ

**పుణ్యేన పాపం వినిహత్యపశ్చా ।**

**త్సంజాయతే జ్ఞానవిదీపితాత్మా ॥**

ఈశ్వరార్పితబుద్ధితో పుణ్యకర్మలాచరించినవాడు పాపాలను నశింపచేసినవాడై, పరిశుద్ధమైన అంతఃకరణగలవాడై, పరమాత్మని చేరతాడు. అంటే పరమేశ్వరార్పణంగా కర్మ చేస్తే, పాపాలు సంచితకర్మ పూర్తిగా నశిస్తాయి.

భగవంతుని శరణు పొందినవాడు సంచితకర్మను నశింపచేస్తాడు అని భగవద్గీత చెబుతోంది. కాబట్టి తను చేసిన పాపక్షయం కోసం కుమారిలభట్టు తుషాగ్నిలో దగ్ధం కావలసిన పనిలేదు. ఈ రకంగా పూర్వమీమాంస ప్రామాణికం కాదు.

**3. సాంఖ్యమతఖండన :** పురుషుడు తామరాకు మీద నీటిబొట్టులాగా ఉంటాడు. జగత్తుకు కారణం ప్రధానము (ప్రకృతి). పురుషునికి భోగవస్తువులను సమకూర్చటానికే ఈ ప్రకృతి అనేక రూపాలలో సృష్టించబడుతున్నది. ఈ జగత్తు సుఖము, దుఃఖము, మోహములతో కూడి ఉన్నది. త్రిగుణాత్మకమైనది ఈ జగత్తు అని సాంఖ్యుల వాదన.

బ్రహ్మసూత్రాలలోని రెండవ అధ్యాయంలోని రెండవ పాదంలోని మొదటి అధికరణలోని పదిసూత్రాలలో సాంఖ్యమతాన్ని ఖండించటం జరిగింది.

ఈ జగత్తంతా సుఖము, దుఃఖము మోహాలతో ఏర్పడింది. ఎందుకంటే జగత్తు వాటితోనే కలిసి ఉన్నది. ఇది కేవలము అనుమానం. ఈ అనుమాన ప్రమాణంతోనే ప్రకృతి జగత్తుకు ఉపాదాన కారణము అన్నారు. ప్రధానము అంటే ప్రకృతి. ఇది

జడము. దాని నుంచే చిత్రవిచిత్రాలయిన వస్తువులు పుడుతున్నాయి. ఏది దేనితో కూడి ఉన్నదో, దానికి అదే కారణము అని సాంఖ్యుల సిద్ధాంతము. జగత్తు సుఖ దుఃఖ మోహాలతో కూడి ఉన్నది కాబట్టి జగత్తుకు త్రిగుణాలే కారణము అని వారి వాదన. అయితే ప్రకృతి అచేతనము, జడము. దానికి సృష్టించే శక్తి ఉండదు.

ప్రవృత్తి ఆచరణల వల్ల కూడా ప్రధానమనేది ఈ జగత్తుకు కారణం కాదు. ఎందుకంటే ఈ ప్రవృత్తి అనేది లోకంలో చేతనమైన వాటికే ఉంటుంది. అచేతనాలకు ప్రవృత్తి ఉండదు. ఒకవేళ ఈ జగత్తు గనక అచేతనమైన ప్రకృతివల్ల సృష్టించబడి ఉంటే, మట్టితో తయారైన కుండలాగా, వస్త్రంలాగా ఏ రకమైన చైతన్యము లేకుండా అలాగే పడి ఉండాలి. అయితే అచేతనాల్లో కూడా ప్రవృత్తి కనిపిస్తున్నది. పాలు అచేతనము. అని దూడను పోషిస్తున్నాయి. అలాగే నీరు అందరికీ ఉపయోగిస్తున్నది. అదే విధంగా ప్రకృతి పురుషుడికి భోగవస్తువు కావచ్చు కదా ? అని అనుమానం.

దూడకోసం పాలు, లోకంకోసం నీరు లాగానే పురుషుని కోసం ప్రకృతి రూపుదాలుస్తున్నాయనేది నిజం కాదు. వాటిలో కూడా చేతన ప్రవృత్తి ఉంది. లోకంలో జరిగే పనులన్నీ చేతనుడైన ఈశ్వరుని చేతనే నడిపించబడతాయి. బృహదారణ్యకోప నిషత్తులో యాజ్ఞవల్క్యుడు చెబుతాడు. "అతడు వాయువులో ఉంటాడు. వాయువు అతన్నెరగదు. వాయువే అతని శరీరము. వాయువులో ఉంటూనే వాయువును నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి అయిన నీ ఆత్మ." కాబట్టి పరమేశ్వరుడు ఈ జగత్తంతా ఆవరించి ఉంటాడు. దూడకు పాలిచ్చే ఆవు చేతనమే. పాలు త్రాగే దూడకూడా చేతనమే. అలాగే పల్లానికి ప్రవహించటమనేది నీటి ప్రవృత్తి. ఇదంతా బ్రహ్మచైతన్యం వల్లనే జరుగుతోంది.

ప్రధానానికి వ్యతిరేకమైన అప్రధానం ఏదీ లేదు. కాబట్టి అచేతనమైన ప్రధానం జగత్కారణం కాదు. సాంఖ్యమతం ప్రకారం త్రిగుణాల సమూహమే ప్రధానము. దీనికి మించినది ఇంకోటి ఏదీ లేదు. పురుషుడు ప్రవర్తకుడు కాదు. నివర్తకుడు కాదు. కేవలం ఉదాసీనుడు. ఏమీ పట్టనివాడు. సాంఖ్యం కన్న ఇతర మతాల్లో ఈశ్వరుడు చేతనుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు. తన ఇష్టప్రకారం ప్రవృత్తి నివృత్తులలో పాల్గొంటాడు. గడ్డి క్రమంగా పరిణామం చెంది, పశువులకు ఆహారమై, చివరకు పాలుగా మారుతుంది. ఆ విధంగా ప్రధానానికి స్వాభావిక పరిణామం

ఉండదు. గడ్డిపాలుగా మారటం స్వాభావిక లక్షణం కాదు. ఆవులు, గేదెలు తిన్న గడ్డి మాత్రమే పాలుగా మారుతుంది. అదే ఎద్దులు దున్నపోతులు తిన్న గడ్డిపాలుగా మారదు. అంటే ఆ గడ్డిపాలుగా మారటానికి కారణం వేరే ఉన్నదన్న మాట. అయినా గడ్డి పాలుగా మారటమనేది గడ్డియొక్క స్వభావం కాదు. ఎందుకంటే ఒకవేళ అలా మారితే ఆవులు, గేదెలతో పనిలేదు. కాబట్టి ప్రకృతియొక్క పరిణామం గడ్డి మొదలైన వాటిలాగా స్వాభావికం అనటానికి వీలు లేదు.

పోనీ, ప్రధానానికి స్వాభావిక ప్రవృత్తి ఉన్నది అనుకుందాం. ఆ ప్రవృత్తికి తగిన ప్రయోజనం లేదు. అందువల్ల దోషం కలుగుతుంది. అనగా ప్రధానానికి ఇతర ప్రయోజనం ఏదీ లేదు అన్నట్లైతే, ఈ ప్రధానమనేది పురుషుడికి భోగాల నిస్తుందని, అందుకే ప్రవృత్తమవుతున్నదని, చెప్పటం సాంఖ్యులకు కష్టమవుతుంది. సాంఖ్యమతంలో పురుషుడు నిర్మలుడు. ఉదాసీనుడు. అన్ని విశేషాలు ఉన్నవాడు. అటువంటి పురుషుడికి ప్రధానం భోగాన్ని ఇవ్వలేదు. అందుచేత ప్రధానం పురుషుని ప్రయోజనం కోసం కాదు. అయితే ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది అది ఏమిటంటే ప్రధానం పురుషుడి ప్రయోజనం కోసం కాదు అన్నారు బాగుంది. అయితే పురుషుడే ప్రవృతం చెయ్యచ్చు కదా ? అది ఎలా అంటే కళ్ళున్న కుంటివాడు కాళ్ళున్న గ్రుడ్డివాడి భుజాలమీద కూచుని వెళ్ళటం లేదా ? అయస్కాంతము తాను కదలకుండానే ఇనుపముక్కను కదల్చటం లేదా ? అదే విధంగా పురుషుని ప్రేరణవల్ల ప్రవృతమయ్యే ప్రధానం అస్వతంత్రమవుతోంది. ఇది దోషం. అంతే కాకుండా ఉదాసీనుడు, కూటస్థుడు, వికారరహితుడు అయిన పురుషుడు ప్రేరకుడు కావటం రెండవ దోషం. కుంటివాడు, గ్రుడ్డివాడు, ఇనుపముక్క, అయస్కాంతాల మధ్య సాన్నిత్యం నిత్యం కాదు. కాని ప్రకృతి పురుషుల మధ్య సాన్నిత్యం నిత్యం. కాబట్టి ఎప్పుడూ ఈ ప్రవృత్తి ఉంటూనే ఉంటుంది. అందుచేత ప్రధానం ప్రవృత మవుతోందనటం మూడవ దోషం. అవిద్య అయిన ప్రధానాన్ని, చేతనమైన పురుషుణ్ణి కలిపే తత్త్వం ఇంకోటి ఏదీ లేదు.

అంతేకాదు గుణాలకు సంబంధించిన 'అంగాంగిభావము' కూడా కుదరదు. సత్త్వరజస్తమో గుణాలు మూడు సామ్యావస్థను పొందిన స్థితినే ప్రధానము అంటారు. కాబట్టి ఈ మూడింటిలోనూ ఒకటి ఎక్కువ, ఒకటి తక్కువ లేదు. సామ్యావస్థలో

ప్రధానానికి ప్రవృత్తి ఉండదు. ప్రవృత్తి కలగాలంటే సామ్యావస్థలో వికారం, కదలిక పుట్టాలి. ఆ రకమైన కదలిక కలిగించే పదార్థం ఏదీ లేదు. కాబట్టి ప్రధానానికి జగదుత్పాదక శక్తి లేదు.

ఈ మూడు గుణాలు కార్యోత్పత్తికి అంగాంగి భావము పొందుతాయి. అనుకున్నప్పటికీ, ప్రధానంలో జ్ఞానశక్తి లేనందువల్ల జగనిర్మాణం జరగదు. జ్ఞానశక్తి లేని ప్రధానం జగత్తును నిర్మించలేదు. ఒకవేళ ప్రధానానికి జ్ఞానశక్తి ఉన్నదని ఒప్పుకుంటే చేతనమైన పదార్థమే జగదుత్పత్తికి ఉపాదాన కారణమవుతుంది. అంటే బ్రహ్మమే జగన్నిర్మాణానికి కారణము అని అంగీకరించినట్లౌతుంది. అంతేకాకుండా సామ్యావస్థలో కూడా, నిమిత్తం లేకుండానే త్రిగుణాలు మార్పు చెందుతాయి. అవి అలా ఎప్పుడూ మార్పు చెందుతూనే ఉండాలి. అలా జరిగితే జగత్తే నిత్యమవుతుంది. మోక్షమనేది ఉండదు.

సాంఖ్యమతంలో పరస్పర విభేదాలున్నాయి. ఈశ్వరుడు జగత్కారణమని సాంఖ్యులు ఒప్పుకోరు. వీరు మహత్తు నుంచి తన్మాత్రలు వచ్చాయని ఒకసారి, అహంకారంనుంచి తన్మాత్రలు వచ్చాయని ఒకసారి చెబుతారు. అలాగే కర్మేంద్రియాలు ఐదు కాదు చర్మము, మనస్సు కలిపి ఏడు అంటారు. ఒకసారి ఇంద్రియాలు పదకొండు అంటారు. అంతఃకరణ అంటే బుద్ధి, మనస్సు, అహంకారము అంటారు. ఇంకొకసారి బుద్ధి ఒక్కటే అంటారు. మన లెక్కలో అంతః కరణ అంటే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము. ఈ రకంగా సాంఖ్యుల వాదనలో పొంతన లేదు. కాబట్టి సాంఖ్యులు చెప్పే ప్రధానం (ప్రకృతి) జగత్కారణం కాదు.

**4. వైశేషిక దర్శన ఖండన :** శంకర భగవత్పాదుల వారు ఈ దర్శనాన్ని ఖండించారు. శంకరుడు చెప్పిన ప్రకారము అంటే అద్వైత సిద్ధాంతం ప్రకారము ఈశ్వరుడనే వాడున్నాడు. అతడు నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ. ప్రళయకాలంలో జీవులన్నీ మాయతో కలసి పరబ్రహ్మలో లీనమవుతాయి. కొంత కాలం తరువాత కర్మశేషంగల జీవులకర్మ క్షయం చేసి, వారికి మోక్షం ప్రసాదించాలనే ఉద్దేశ్యంతో సృష్టి చెయ్యాలని సంకల్పించాడు. అయితే ఆయనకు ఈ సృష్టితో ఏ రకమైన సంబంధము లేదు. శంకర భగవత్పాదుల ప్రకారము తత్త్వాలు ఏడు

కాదు ఇరవై ఐదు. జీవాత్మ, పరమాత్మ రెండూ ఒక్కటే. మోక్షము అంటే జీవాత్మ పరమాత్మలో లీనం కావటమే వేదాలు అపౌరుషేయాలు. సాక్షాత్తూ అవి బ్రహ్మముఖం నుంచే వచ్చాయి. పరబ్రహ్మ సర్వవ్యాపి. అతడు జగత్తంతా ఆవరించి ఉన్నాడు. అతడే నిత్యుడు, సత్యుడు, శాశ్వతుడు. అతడు తప్ప ఈ జగత్తులో శాశ్వతమైనది ఏదీ లేదు.

బ్రహ్మసూత్రాలలో రెండవ అధ్యాయంలోని రెండవ అధికరణలో అంటే పదకొండవ సూత్రం నుంచి పదిహేడవ సూత్రం దాకా వైశేషిక మతాన్ని ఖండించారు. వైశేషిక మతాన్ననుసరించి కారణ పదార్థాలకుండే గుణాలతోనే కార్యపదార్థాలు పుడతాయి. అంతేగాని వేరే గుణాలు కలవి పుట్టవు. ఎర్రరంగు నూలుతో తయారైనవస్తువులు ఎర్రగానేఉంటాయి గాని తెల్లగాఉండవు. ఈ సిద్ధాంతం ప్రకారం చేతనమైన బ్రహ్మనుంచి పుట్టిన జగత్తు చేతనంగానే ఉండాలి. అంతేకాని అచేతనం కావటానికి వీల్లేదు. కాని అలాజరగటంలేదు. కాబట్టి జగదుత్పత్తికి కారణం చేతనమైన బ్రహ్మ కాదు. ఇది వైశేషికుల వాదన. ఇక్కడ వైశేషికుల వాదంతోనే వారి వాదాన్ని ఖండిస్తున్నారు. హ్రస్వములు, పరిమండలాలు వీటివల్ల మహత్తులు దీర్ఘములు పుట్టినట్లే, చేతనమైన బ్రహ్మనుండి జగత్తు పుడుతున్నది అంటారు వైశేషికులు.

వీరి మతం ప్రకారం జగత్‌సృష్టికి మూలము పరమాణువు. రెండు పరమాణువులు కలిస్తే ద్వ్యణుకములౌతాయి. ద్వ్యణుకాలు సంయోగం చెందితే త్ర్యణుకములవుతాయి. అలాగే చతురణుకములవుతాయి. ఈ రకంగా అణువుల నుంచి కొండలు, నదులు, పర్వతాలు మొదలైన సృష్టి జరిగింది. అణువులు ఒకదానితో ఒకటి కలిసినప్పుడు వాటి ఆకారం మారుతుంది.

ఒక అణువు పరిమాణము – పారమాడల్యము అది రెండు అణువులుగా మారితే – హ్రస్వము. మూడు అణువులుగా మారినప్పుడు – దీర్ఘ ప్రమాణము పొందుతాయి. పూర్వమున్న ఆకారం పోయి క్రొత్త ఆకారం వస్తుంది. ఇలా చూస్తే వీరి వాదన సమర్థనీయం కాదు. అందుచేత చేతనమైన బ్రహ్మనుంచి చేతనమైన జగత్తే సృష్టింపబడాలనే వాదన సరికాదు.

వైశేషికుల ప్రకారము అణువుల కలయిక వల్లనే ఈ సృష్టి జరుగుతోంది. అయితే ఇక్కడ కర్మఏదీలేదు అని వారంటారు. దారపు పోగులు వాటంతట అవి

వస్త్రంగా తయారు కావు. వాటిని కలిపి వస్త్రంగా తయారుచెయ్యాలి. ఇది కర్మ. అయితే ఈ కర్మ అనేది లేదని వారంటారు.

వైశేషిక మతంలో తొమ్మిది ద్రవ్యాలుంటాయి. వీటిలో పృథివి, జలము, అగ్ని, వాయువు అనే నాలుగు నిత్యములు. ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు అనబడే ఐదు అనిత్యాలు. పరమాణువులు ఒకదానితో ఒకటి కలియటం వల్ల ఘట, పటాది (వస్త్రము) రూపాల్లో సృష్టి జరుగుతోంది. ఇక ప్రళయం ఏ రకంగా జరుగుతుంది అంటే, కొన్ని అణువులు కలిసి ఒక వస్తువు ఏర్పడింది. మళ్ళీ అణువులన్నీ విడిపోతే ఆ వస్తువు ఉండదు. ఈ విధంగా అణువులు విడిపోతే ప్రళయము. అయితే వారు చెప్పే క్రమాన్ని పరిశీలిస్తే అణువులు పర్వతంగానో, కొండగానో తయారవటానికి ఏ అవసరము లేదు. కాని మట్టి కుండగా తయారవటానికి కర్మ అవసరమవుతుంది. కాని వారి వాదనలో కర్మ అనేది లేదు. అందుచేత వీరి వాదన సరికాదు.

అన్యోన్య సంబంధాన్ని గనక అంగీకరిస్తే, భేదం సమమవటం చేత అవస్థాదోషం అంటే ఉపాపావ్య ఉపాదకాలకు తెంపు లేకపోవటం అనే దోషం కలుగుతోంది. పరమాణువుకు కొన్ని లక్షణాలున్నాయి. అవి రెండు కలిసినప్పుడు వాటి లక్షణాలను వదిలి వేరే లక్షణాలు సంతరించుకుంటాయి. ఈ రకంగా సంతరించుకోవటం చేత అవస్తాదోషం అంతులేకపోవటం అనే దోషం కలుగుతోంది. అందుచేత వీరి వాదన సరికాదు. పరమాణువాదంలో చాలా విచిత్రమైన స్థితిఉన్నది. దీని ప్రవృత్తిస్వభావాన్ని అంగీకరిస్తే, ప్రవృత్తి నిత్యంఅవటంవల్ల ప్రళయంఉండదు. నివృత్తివాదాన్ని అంగీకరిస్తే, నివృత్తినిత్యమైనందున సృష్టిఅనేదిఉండదు. కాబట్టి పరమాణువాదం కుదరదు. ప్రవృత్తి స్వభావం అంటే ఆ స్వభావంలో మార్పు ఉండదు కాబట్టి ఎప్పుడూ సృష్టి జరుగుతూనే ఉంటుంది. లయం ఉండదు. నివృత్తి స్వభావం అంటే అణువులు నాశనమై పోతుంటాయి. కాబట్టి సృష్టి అనేది జరగదు. ఈ విధంగా చూస్తే సృష్టిగాని, ప్రళయం గాని, ఈ రెండింటిలో ఏదో ఒకటి మాత్రమే జరుగుతుంది.

వైశేషికులు పరమాణువులకు రూపము మొదలైనవి ఉన్నాయి అంటారు. కాని నిజమైన స్థితిలో వీరి వాదనలో తేడా కనిపిస్తోంది. పృథివి, జలము, అగ్ని, వాయువు వీటికి సంబంధించిన అణువులు నిత్యములు, నిరవయవములు. కుండ, వస్త్రములలో

కూడా ఈ లక్షణాలున్నాయి అంటారు. కాని ఈ లోకంలో నూలుపోగుతో తయారైన వస్త్రం, ఆ పోగులకన్న స్థూలంగా ఉంటుంది. అలాగే మట్టితో తయారైన కుండ కూడా. కాబట్టి వీరు నిత్యము, నిరవయవము అని చెప్పేవి స్థూలము. సావయవముగా కనిపిస్తున్నాయి. అందుచేత వీరి వాదన సరికాదు. మనం పంచీకరణ చెప్పినట్లుగానే వీరు వాయువులో – స్పర్శ, అగ్నిలో – స్పర్శ, రూపము, జలములో – స్పర్శ, రూపము, రసము, భూమిలో – స్పర్శ, రూపము, రసము, గంధము ఉన్నాయి. వాటివల్లనే ఈ సృష్టి జరుగుతోంది అంటారు. ఇవి ఒక దానికన్న ఒకటి స్థూలమైనవి. వీటివల్ల నిర్మాణం జరగదు. ఒకదానికన్న ఒకటి స్థూల సూక్ష్మాలని, తారతమ్యం చెప్పినా, తారతమ్యం లేదని చెప్పినా, రెండు విధాలుగాను దోషమే ఉన్నది. కాబట్టి పరమాణువాదం సరికాదు.

భూమిలో స్పర్శ, రూప, రస, గంధాలున్నాయి. కాబట్టి ఇది స్థూలము. జలంలో మూడు గుణాలున్నాయి కాబట్టి ఇది భూమికన్న జలం సూక్ష్మము. ఈ రకంగా అగ్ని, ఇంకా సూక్ష్మం. కాగా వాయువు మరీ సూక్ష్మం. ఇలా వీటిలో తేడాలుండటం వల్ల, వీటికి కారణమైన పరమాణువులలో కూడా తేడాలుండి ఉంటాయి. ఇలా తేడాలున్నవి పరమాణువులని చెప్పటానికి వీలు లేదు. ఇది దోషం. ఒకవేళ భూమిలో గంధము, జలంలో రసము, అగ్నిలో రూపము, వాయువులో స్పర్శ మాత్రమే ఉన్నాయి. వీటి మధ్య తారతమ్యాలు లేవు అంటే – ఇది దోషమే.

పరమాణువాదాన్ని మనువు మొదలైన శిష్టులు ఎవరూ అంగీకరించలేదు. మోక్షవాదులు దీన్ని అంగీకరించరు. పరమాణువాదం శిష్టసమ్మతం కాదు, యుక్తిసమ్మతం కాదు. అందుచేత వైశేషిక మతాన్ని అంగీకరించవలసిన అవసరం లేదు.

**5. న్యాయదర్శనం ఖండన :** శంకరభగవత్పాదులవారు ఈ దర్శనాన్ని ఖండించి అద్వైతమత వ్యాప్తి చేశారు.

న్యాయదర్శనంలో పునర్జన్మ ఉన్నది. జీవికి తాను చేసిన కర్మల ఆధారంగా ఉత్తరజన్మ లభిస్తుంది. శరీరంలో ఆత్మ అనేది ఉన్నది. ఈ విషయాలన్నీ శంకరులవారు ఒప్పుకున్నారు. కాని ఎవరి ఆత్మ వారిదే అనే మాటను ఖండించారు. ఆత్మ అనేది పరమేశ్వర స్వరూపము. జీవాత్మ వేరు పరమాత్మ వేరు కాదు. రెండూ ఒక్కటే.

ఐతరేయోపనిషత్తులో చెప్పినట్లుగా పరమేశ్వరుడు మానవదేహాన్ని సృష్టించిన తరువాత, ఈ దేహంలో తాను ప్రవేశించాలి అనుకున్నాడు. అలా ప్రవేశించటానికి రెండు మార్గాలున్నాయి. 1. పైనుంచి 2. క్రిందనుంచి. క్రింద నుంచి ప్రవేశించటము సేవకాలక్షణము కాబట్టి పైనుంచి అంటే బ్రహ్మరంధ్రం నుంచి ప్రవేశించాడు.

హకార సంజ్ఞ కలిగిన పరమేశ్వరుడు సకార సంజ్ఞ కలిగిన ప్రకృతితో కలిసి శబళ బ్రహ్మమై బ్రహ్మ రంధ్రం ద్వారా మానవదేహంలో ప్రవేశించాడు. అతడే ఆత్మ. కాబట్టి ఆత్మ అనేది ప్రత్యేకమైన పదార్థం కాదు. పరమేశ్వర స్వరూపమే. అందుచేత జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే కాని వేరు కాదు.

ఈ దర్శనంలో ఇంకొక ముఖ్యమైన విషయం ఏమిటంటే రాగద్వేషాలను, అహంకారాన్ని పోగొట్టేది తత్త్వజ్ఞానము అని చెబుతూ దుఃఖము లేకుండా ఉండటమే మోక్షము అన్నారు. శంకరులు ఈ వాదాన్ని కూడా ఖండించారు. శంకరుల అద్వైత సిద్ధాంతంలో దుఃఖము లేకుండా ఉండటం మోక్షం కాదు. బండరాయి ఏ కర్మలు చెయ్యదు. దానికి సుఖదుఃఖాలుండవు. అంతమాత్రం చేత దానిది మోక్షస్థితి కాదు.

మానవుడు కర్మలను చెయ్యాలి. కర్మలవల్ల ఏ రకమైన ఫలితం వస్తుందో ముందుగా తెలుసుకోవాలి. ఆ ఫలితాన్ని అనుభవించాలి. ఆ తరువాత కర్మలు చెయ్యకపోయినప్పటికీ అదే ఫలితాన్ని సాధించవచ్చునని తెలుసుకోవాలి. ముందుగా సగుణారాధన చెయ్యాలి. ఆ తరువాత పరమాత్మ స్వరూపం తెలుసుకోవాలి. చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అనే భావన ప్రత్యక్షంగా కలగాలి. ఆ పరమేశ్వరుడు ఎక్కడో లేడు. తనలోనే ఉన్నాడు. తానే పరమేశ్వర స్వరూపము. ఉపనిషత్తులలో చెప్పినట్లుగా జగత్తులోని ప్రతివస్తువూ పరమేశ్వరస్వరూపమే. అంతా పరమేశ్వరమయం. పిపీలికాది బ్రహ్మపర్యంతము అంతా పరబ్రహ్మస్వరూపం. ఈ విధమైన ప్రత్యక్షానుభవం కలగటమే జ్ఞానసముపార్జన. దీనికి భగవదారాధన, కర్మానుష్ఠానము, యోగసాధన, శాస్త్రపాండిత్యము, తపస్సు అన్నీ మార్గాలు. వీటి ద్వారా జ్ఞానాన్ని పొంది, జీవాత్మ పరమాత్మ ఒక్కటే. **'అహంబ్రహ్మాస్మి'** నేనే పరబ్రహ్మను. అనే విషయాన్ని తెలుసుకుంటాడు. అప్పుడు చరాచర జగత్తునూ తనలో చూడగలుగుతాడు. ఇదే ఆత్మసాక్షాత్కారం. **బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి** అనే ఉపనిషద్వాక్యాన్ని అనుసరించి ఎవరైతే బ్రహ్మను గురించి తెలుసుకుంటాడో అతడే

పర(బహ్మస్వరూపుడు. అటువంటి వ్యక్తికి కర్మశేషం ఉండదు. కర్మశేషం ఉన్నవాడికే పునర్జన్మ ఉంటుంది. కర్మశేషం లేదు. కాబట్టి అతడికి పునర్జన్మ లేదు. అతడికి మోక్షం సిద్ధిస్తుంది. దీన్నే ముక్తి అంటారు. ముక్తి అంటే విముక్తి. ఐహిక బంధనాల నుంచి విముక్తి పొందటమే ముక్తి. ముక్తి పొందిన వాని జీవాత్మ పరమాత్మలో లీనమయిపోతుంది.

న్యాయదర్శనంలో జీవాత్మ పరమాత్మల విలీనం చెప్పలేదు. అందుకే ఆ దర్శనాన్ని శంకర భగవత్పాదులు ఖండించారు.

**6. చార్వాకమతఖండన :** వీరు ప్రత్యక్ష ప్రమాణం తప్ప ఇంకా దేనినీ అంగీకరించరు. అనుమాన ప్రమాణాన్ని అసలు అంగీకరించరు. ఇది మూర్ఖత్వానికి పరాకాష్ఠ. బహుశః వీరికి తాతముత్తాతలు ఎవరూ ఉండి ఉండరు. వాళ్ళెవరూ లేకుండానే వీరు పుట్టి ఉండాలి. నా తండ్రి లేకపోతే నేను లేను. తాత లేక పోతే తండ్రీ లేడు. ఇలా ఊహించి, తండ్రి తాత ఉన్నారని గ్రహించాలి. అది అనుమాన ప్రమాణము. తాత, ముత్తాతల విషయంలో ప్రత్యక్ష ప్రమాణం పనికి రాదు. అంతేకాదు లౌకికమైన విషయాలలో కూడా ప్రత్యక్ష ప్రమాణం పనికి రాదు. ఒక వ్యక్తి వైద్యుడి దగ్గరకు వచ్చి నాకు తలనొప్పిగా ఉన్నదని చెబుతాడు. నొప్పి ఎక్కడ అనేది అతడు చెబితేనే తెలుస్తుంది. లేకపోతే తెలియదు. నొప్పి ఎంతగా ఉన్నదో తెలుసుకోవటానికి ప్రత్యక్ష ప్రమాణం పనికి రాదు.

ఇక అనుమాన ప్రమాణం చూద్దాం. అనుమాన ప్రమాణమంటే ఊహ. కొన్ని విషయాలని ఊహించి మాత్రమే తెలుసుకోవాలి. కొండ మీద పొగ కనిపిస్తోంది. కాబట్టి అక్కడ నిప్పు ఉండిఉంటుంది అని ఊహిస్తాం. ఇది అనుమాన ప్రమాణం. ఇంట్లో కూచుని ఉన్నాము. బయట నుంచి ఉరుముల శబ్దం వినిపిస్తోంది. కాబట్టి ఆకాశం మేఘావృతమై ఉన్నది అని ఊహిస్తాం. గర్భవతిని చూసి, ఆమె కడుపులో బిడ్డ ఉన్నది అని ఊహిస్తాం. ఇలాంటివన్నీ అనుమాన ప్రమాణం వల్లనే సిద్ధిస్తాయి. దీన్ని చార్వాకులు ఒప్పుకోరు.

అలాగే శబ్దప్రమాణం కూడా చార్వాకులు అంగీకరించరు. ఒక వ్యక్తి పేరు సుబ్బారావు. ఆ పేరు అతని ముఖం మీద వ్రాసి ఉండదు కదా? అందరూ అతన్ని ఆ పేరుతో పిలుస్తున్నారు కాబట్టి అతని పేరు అదే అని తెలుస్తోంది. ఇది శబ్ద

ప్రమాణం. శబ్దము వైదికము, లౌకికము అని రెండు రకాలు. వేద సంబంధమైనది వైదికము. వ్యవహారంలో ఉండేది లౌకికము. లౌకికానికి పొరపాటు, మోసబుద్ధి మొదలైన దోషాలుంటాయి. కాని రాగద్వేష రహితులైన వేదవేత్తలు చెప్పినది వేదప్రమాణము. ఇది మానవశ్రేయస్సును బోధిస్తుంది. ఇష్టప్రాప్తిని, అనిష్ట పరిహారాన్ని పొందటానికి అలౌకికమైన మార్గం చూపేదే వేదము. ఆ వేద ప్రమాణాన్ని చార్వాకులు అంగీకరించరు. అతీంద్రియ విషయాలను చెప్పేది వేదము. అందుచేత శబ్ద ప్రమాణాన్ని అంగీకరించి తీరాలి.

పొట్టు పారేసి బియ్యం తీసుకున్నట్లుగా జీవితంలో కష్టాలు వదిలేసి సుఖాలు మాత్రమే అనుభవించాలనేది వీరి మతము. బ్రతికినన్నాళ్ళూ సుఖంగా బ్రతకాలనేది వీరి కోరిక. ఇంతవరకూ బాగానే ఉంది. కాని జీవితమన్న తరువాత కష్టాలు రాకుండా ఉండవు. రోగాలు, నొప్పులు రాకుండా చెయ్యలేం కదా? అలా శాసించలేం కదా?

భస్మమైన దేహము తిరిగి రాదు అని వీరు చెబుతున్నారు? భస్మమైన దేహం తిరిగి వస్తుందని ఎవరన్నారు? శరీరమే నాశనమవుతుంది. ఆత్మనాశనం కాదు. అతడు చేసిన పాపపుణ్యాలననుసరించి పునర్జన్మ ఎత్తుతాడు. ఇందులో సందేహము లేదు.

పంచభూతాలలో ఆకాశం లేదు అని వీరంటారు. ఆకాశం అంటే అవకాశం కల్పించేది అని అర్థం. **ఆకాశం గగనం శూన్యం.** ఆకాశమంటే శూన్యమైన ప్రదేశము. ఖాళీగా ఉండి మిగిలిన భూతాలు సంచరించేందుకు అవకాశం కల్పిస్తుంది. పైన ఆకాశం ఉన్నది కాబట్టే కూర్చున్న మనం లేచి నుంచోగలుగుతున్నాం. చేతులు పైకి ఎత్తగలుగుతున్నాం. కాంతి ప్రసరిస్తోంది. గాలి వీస్తోంది. శబ్దం ప్రయాణం చేస్తోంది అంటే కారణం ఆకాశం ఉండటమే. ఆకాశమే లేకుండా పైన అంతా ఏదైనా వస్తువుతో నిండిపోతే ఇవేవీ సాధ్యం కాదు. కాబట్టి పంచభూతాలలో ఆకాశం ఉన్నదని ఒప్పుకు తీరాలి.

చైతన్యము దేహాన్ని విడిచి అవతలకి వెళ్ళదు. అది దేహంలోనే ఉంటుంది అంటారు. అలా అయితే స్వప్నంలో ఎక్కడెక్కడికో వెడతాము. అనేక పనులు చేస్తాం. అనేక అనుభవాలు పొందుతాము కదా ? చార్వాకులకి స్వప్నాలు రావా ? స్వప్నంలో అనుభవాలు కలగవా ? అందుచేత ఈ సిద్ధాంతము అసంగతము.

వీళ్ళకి అర్ధకామాలు రెండే పురుషార్థాలు. అప్పుచేసి పప్పుకూడు తినటం వీరి ఆచారం. మరి ఆ అప్పుఎవరుతీరుస్తారు? అప్పుతీర్చాలి అంటే కష్టపడాలి కదా? అందరూ అప్పు తీసుకుంటే తీర్చేదెవరు? అప్పు ఇచ్చేదెవరు? తీర్చని వాళ్ళకి అప్పు ఎవరిస్తారు? అప్పు తీర్చకపోవటమనేది న్యాయవిరుద్ధము కాదా ?

పరలోకానికి వెళ్ళిన జీవుడు తన భార్యా, పిల్లలు, బంధువులు, మిత్రులను చూడటానికి ఎందుకు తిరిగి రాడు? అని వీరి ప్రశ్న. ఎందుకు రాడు? వస్తాడు? మరణానంతరము ప్రేతకర్మ చేస్తాం. అందులో భాగంగా కాకులకి పిండాలు పెడతాం. అన్నం చూడగానే ఎగబడే కాకులు, ఒక్కొక్కసారి పిండాల దగ్గరకు వెళ్ళి కూడా వాటిని ముట్టుకోకుండా వెనక్కి తిరిగి వెళ్ళిపోతాయి. ఆ సమయంలో పోయిన వాళ్ళకి ఏవో కోరికలు ఉన్నాయని భావించి, ఆ కోరికలు తీరుస్తామని నమస్కారం పెడతాం. ఆ తరువాత కాకులు వచ్చి పిండాలు తింటాయి. ఇలాంటి సంఘటనలు చాలామంది చూసే ఉంటారు. మరణించిన జీవి పిండప్రదానకాలంలో కాకుల రూపంలో వస్తుందని శాస్త్రం చెబుతోంది. అంతేకాదు మరణించిన వారు మళ్ళీ జన్మించారు అని మనం వింటూనే ఉంటాం. కొంత కాలం క్రితం ఉత్తరదేశంలో 8 సం॥ బాలికకు పునర్జన్మ జ్ఞానం కలిగింది. దాంతో నా ఇల్లు ఫలానా చోట ఉన్నది అని అక్కడికి తనను తీసుకువెళ్ళమని గోల చేసింది. ఆ పిల్ల గోల భరించలేక తల్లితండ్రులు ఆ పిల్ల చెప్పిన చోటికి తీసుకుపోయారు. ఆ ఇంట్లో వరండాలో కూర్చుని ఉన్నాయన తన భర్త అని, లోపల ఉన్నది తన అత్తగారని ఇలా అందర్నీ పేరు పేరునా చెప్పింది. ఆ ఇంటి ఇల్లాలు మరణించి సరిగ్గా ఎనిమిది సంవత్సరాలైంది. ఇంతే కాకుండా పెరట్లో ఒకచోట డబ్బులు పాతిపెట్టాను అని కూడా చెప్పింది. వెళ్ళి తవ్వి చూస్తే, అక్కడ ఆ పిల్ల చెప్పినట్లుగా డబ్బులున్నాయి. దీనిబట్టి మరణించిన జీవి మరలజన్మించినట్లు తెలుస్తోంది కదా ?

ప్రేతకర్మలు బ్రాహ్మణుల బ్రతుకుతెరువు కోసం చేస్తారు అంటారు. ఈ కర్మలు చేయించేది బ్రాహ్మణులే కాదు జంగాలు, మాలదాసరులు కూడా చేయిస్తారు.

భగవానుడు **గీతలో జాతస్యహి ధృవో మృత్యుః ధ్రువంజన్మమృతస్యచ** జన్మించిన ప్రతిజీవి మరణించక తప్పదు. అలాగే మరణించిన ప్రతిజీవి తిరిగి జన్మించకా తప్పదు అంటాడు. జీవి పుణ్యకర్మలు చేస్తే మంచి జన్మలు ఎత్తుతాడు. పాపకర్మలు

చేస్తే నీచయోనులందు జన్మిస్తాడు. మళ్ళీ జన్మించేటప్పుడు తనకు ఇష్టమైన వారింట్లో జన్మించరాదా? అంటే అలా జరగదు. ఎందుకని అంటే ఈ జీవి మళ్ళీ మానవుడిగానే జన్మించాలని లేదు. కర్మఫలాన్ని బట్టి పశు, పక్షి, క్రిమి, కీటకాలుగా కూడా జన్మించవచ్చు.

అపరకర్మలు బ్రాహ్మణుల పొట్టనింపుకోవటం కోసం చేయిస్తారని వీరి వాదన. అది నిజం కాదు. అపరకర్మ అనేది జీవితంతో ఒకసారి మాత్రమే వస్తుంది. పుట్టిన దగ్గరనుంచి మరణించేదాకా అనేక కర్మలున్నాయి. కాబట్టి బ్రాహ్మణుడు జీవించటానికి ఇవి చాలు.

ఇంకో విషయం చూడండి. యజ్ఞంలో వధించబడిన పశువుకు స్వర్గం వచ్చేట్లైతే, యజమాని తన తండ్రినే వధించవచ్చుగదా అన్నది వీరి ప్రశ్న. యజ్ఞంలో బలి ఇచ్చే పశువుకు ఉండవలసిన లక్షణాలు శాస్త్రంలో చెప్పారు. పూర్తిగా నల్లగా ఉన్న మేకని మాత్రమే వధించాలి. అప్పుడే యజ్ఞం పూర్తి అయినట్లు. ఇంకదేన్నైనా బలిస్తే మహాపాతకం చుట్టుకుంటుంది.

చార్వాకమతం బృహస్పతి ప్రచారం చేశాడు. కాబట్టి ఆయన మాటలు కాదనలేం కదా ? ఇది వీరి వాదన. ఇక్కడ ఒక్కమాట ఏమంటే, బృహస్పతి రాక్షసులను పెడత్రోవ పట్టించటానికి ఈ మతాన్ని ప్రచారం చేశాడు. అంటే ఈ మతం ఆచరణ యోగ్యం కాదు అనే కదా అర్థం. బృహస్పతి చెప్పిన వాక్యాలు విని రాక్షసులు పతనం చెందారు. కాబట్టి ఆ మతాన్ని ఆశ్రయిస్తే మన గతికూడా అంతే కదా ? అందుచేత చార్వాక సిద్ధాంతం సరియైనది కాదు అని వ్యాసుడు శంకరుడు కూడా దాన్ని ఖండించారు.

**7. జైనమతఖండన :** జైనమతాన్ని వ్యాసభగవానుడు బ్రహ్మసూత్రాలలో ఖండించాడు. దానికి శంకర భగవత్పాదుల వారు భాష్యం వ్రాశారు. బ్రహ్మసూత్రాలలోని రెండవ అధ్యాయం, రెండవ పాదంలోని ఆరవ అధికరణలో జైనమతాన్ని ఖండించారు. దీన్ని **"ఏకస్మిన్న సంభవాదికరణము"** అంటారు. ఇందులో నాలుగు సూత్రాలు ఉన్నాయి. ఇవే ద్వితీయపాదంలోని 33, 34, 35, 36 సూత్రాలు.

**33వ సూత్రం : న ఏకస్మిన్ అసంభవాత్**

ఒకే వస్తువులో విరుద్ధమైన ధర్మాలుండటం అసంభవం. కాబట్టి వీరి సిద్ధాంతం అంగీకారయోగ్యం కాదు. ఒకే వస్తువుకు అనేక రూపాలుండవు. విషయాన్ని చెప్పేటప్పుడు ఫలానా అని ఖచ్చితంగా నిర్ధారణచెయ్యకపోతే, అది ప్రమాణం కాదు. జైనమతం ఏ విషయాన్నీ ఖచ్చితంగా చెప్పదు. ఉండచ్చు, ఉండకపోవచ్చు. అంటుంది. కాబట్టి ఆ వాదన సరికాదు.

**34వ సూత్రం : ఏవంచ ఆత్మాకార్త్న్యు**

జైనమతంలో ఆత్మకి పరిచ్ఛిన్నత్వము అనే దోషం కలుగుతోంది. కాబట్టి ఆత్మకూడా మిగిలిన వస్తువులకు మల్లేనే అనిత్యము అవుతుంది.

జైనమతం ప్రకారం శరీరపరిమాణం ఎంత ఉంటుందో, ఆత్మపరిమాణం కూడా అంతేఉంటుంది. ఇలా అనటం వల్ల ఆత్మకు శాశ్వతత్త్వం పోయి శరీరం లాగా చెప్పబడుతోంది. ఆత్మ అనిత్యమవుతోంది. ఇదే ఈ మతంలోఉన్న దోషం.

ఆత్మ శరీరమంత పరిమాణం కలిగి ఉన్నది అనటం తప్పు. ఎందుకంటే ఒక జీవి శరీరం పెద్దది, ఒక జీవి శరీరం చిన్నది ఉంటుంది. అలా అయినప్పుడు ఏనుగు శరీరంలో పెద్ద ఆత్మ, చీమ శరీరంలో చిన్న ఆత్మ ఉండాలి. అలా కాకుండా ఆత్మకి ఒకే పరిమాణం గనక ఉంటే, పెద్ద, చిన్న శరీరాలలో ఇమడటానికి ఆత్మ ఇబ్బంది పడాలి.

**35వ సూత్రం : న చ పర్యాయాత్ అపి అవిరోధః వికారాదిభ్యః**

జీవికి క్రమంగా అవయవాలు వస్తాయి. ఆత్మ శరీరంఅంతా ఉంటుంది కాబట్టి, దానికి కూడా ఈ దోషాలు (అవయవాలు) వస్తాయి. అంటే ఆత్మ అనిత్యము అంటున్నారు. కాబట్టి మోక్షం లేదు.

వికారము అంటే మార్పు చెందటం. ఇది జీవుడికి ఉన్నది అనే మాట నిజమైతే, ఆ మార్పు ఆత్మకి కూడా ఉన్నట్లే. అనగా ఆత్మ అనిత్యము అవుతుంది. మార్పు చెందేది, వృద్ధి చెందేది నశించి తీరుతుంది. గతజన్మలో పశువు ఈ జన్మలో మనిషి అయింది. పశువుగా ఉన్నప్పటి అవయవాలు నశించి ఇప్పుడు మనిషి అవయవాలు వస్తాయా? ఇలా జీవికి వికారం వస్తుందా ? అలా అయితే ఆత్మకి నాశనం ఉన్నదా?

ఆత్మనాశనమయితే మోక్షం సంగతి ఏమిటి? ఈ ప్రశ్నలకు సమాధానం లేదు. జైనమతంలో మోక్షం పొందే సమయంలో ఉండే జీవుని శరీరపరిమాణమే నిత్యము అంటారు.

**36వ సూత్రం : అంత్యావస్థితేః చ ఉభయనిత్యత్వాత్ అవిశేషః**

మోక్షావస్థలోని పరిమాణం గనక నిత్యమైనట్లైతే, అంతకు ముందున్నవి కూడా నిత్యమే కావాలి. ఆది మధ్య అంతము అన్నీ సమానంగానే ఉండాలి కాని ఒకటి నిత్యము, ఇంకోకటి అనిత్యము కావు. అందుచేతనే ఈమతం అప్రమాణము. ఆమోదయోగ్యం కాదు అన్నారు.

**8. బౌద్ధమతఖండన :** వ్యాసభగవానుడు బ్రహ్మసూత్రాలలోని ద్వితీయాధ్యాయం లోని ద్వితీయపాదంలో నాల్గవ అధికరణలో పదిసూత్రాలలో యోగచారులను ఖండించాడు. నాల్గవ అధికరణలోని సూత్రాలు చూడండి. బుద్ధుని ఉపదేశాలను ఆధారంగా చేసుకున్న బౌద్ధులు తరువాత కాలంలో నాలుగు శాఖలుగా విడిపోయారు. వారు వరుసగా 1. వైభాషికులు 2 సౌతాంత్రికులు 3. యోగాచారులు 4.మాధ్యమికులు. ముందుగా మొదటి ఇద్దరి వాదాన్ని ఖండిస్తున్నాడు.

పరమాణు హేతుకమయిన బాహ్యసముదాయము. స్కంధ హేతువైన అధ్యాత్మ సముదాయంలో కూడా తమంత తాముగా సముదాయం సిద్ధించదు. లోకంలోని పదార్థమంతా బాహ్యము, అభ్యంతరము అని రెండు రకాలు. బాహ్య పదార్థం మళ్ళీ రెండు రకాలు. 1. భూతము 2. భౌతికము. అభ్యంతరము కూడా రెండు రకాలు. 1. చిత్తము 2. చైత్యము

భూతము అంటే భూమి, జలము, అగ్ని, వాయువులు

భౌతికము అంటే – స్పర్శ, రూప, రస, గంధాలు

వీటిలో ఆకాశం గాని దాని లక్షణమైన శబ్దం గాని లేవు. భౌతిక పదార్థాలన్నీ ఆ నాలుగు భూతాలకు సంబంధించినవే. వీటిలో భూమికి సంబంధించిన పరమాణువులు – కఠిన స్వభావం గలవి. జలానికి సంబంధించినవి – స్నేహభావం గలవి. అగ్నికి సంబంధించినవి – ఉష్ణభావం గలవి. వాయువుకు సంబంధించినవి – చలన స్వభావం గలవి. ఈ పరమాణువుల స్వరూపమే జగత్తు. బాహ్యసముదాయం

పరమాణు హేతువు, ఆధ్యాత్మిక సముదాయం స్కంధహేతువు. ఈ రెండూ అచేతనాలే ఈ రెండు అచేతనాలను ఒకచోట చేర్చే సంధానకర్త ఒకడుండాలి. అటువంటి వాడున్నాడని వీరంగీకరించరు.

అవిద్యాదులు ఒక దానికి ఒకటి కారణమైన మాత్రంచేత, చేతనుడు లేకపోయినప్పటికీ ఉత్పత్తి జరుగుతుందని వారంటారు. అది నిజం కాదు. అవిద్యాదులన్నీ ఒక దానికి ఒకటి పుట్టటానికి మాత్రమే కారణమవుతాయి. అంతేకాని సముదాయోత్పత్తికి మాత్రం కాదు. సముదాయోత్పత్తి కావాలంటే చేతనుడు ఉండాల్సిందే. కాబట్టి వీరి వాదన సరికాదు.

వీరి మతంలో ఉత్తరకార్యోత్పత్తి జరిగే సమయానికి పూర్వ కారణం నశిస్తోంది. కాబట్టి హేతువుకు అధీనమైన కార్యోత్పత్తి కూడా జరగదు. వీరి మతానుసారం అవిద్య, సంస్కారము, విజ్ఞానము, నామము, రూపము మొదలైన వాటిలో అవిద్యవల్ల సంస్కారం పుడుతుంది. సంస్కారం పుట్టగానే అవిద్య నశిస్తుంది. సంస్కారం వల్ల విజ్ఞానం పుడుతుంది. విజ్ఞానం పుట్టగానే సంస్కారం నశిస్తుంది. విజ్ఞానం నుంచి నామం పుడుతుంది. నామం పుట్టగానే విజ్ఞానం నశిస్తుంది. ఈ రకంగా ఉత్తర కార్యాలు పుట్టినప్పుడు పూర్వ కార్యాలు నశిస్తాయి. నశించిన వస్తువు ఇక ఉండదు. లేనిది కారణం కాదు. కాబట్టి కారణాన్ని అనుసరించి కార్యోత్పత్తి జరగదు. ఇది ఇంకో దోషం. కారణం లేకుండానే కార్యం జరుగుతుంది అని వారు చెప్పిన దానికి భంగం కలుగుతుంది. అలా కాకుండా కార్యం కలిగేంతవరకు కారణం ఉంటుంది. అన్నప్పటికీ వారి వాదనకు భంగం కలుగుతుంది.

బౌద్ధమతంలో ఇది ఎరుపు, ఇది నలుపు అనే జ్ఞానరూపమైన కార్యం పుట్టాలంటే పూర్వజ్ఞానము, చక్షువు, ఆలోకం (చూడటం) విషయం అనే నాలుగు హేతువులుండాలి. కాబట్టి కారణం లేకుండా కార్యం పుడుతుందని అంగీకరిస్తే, వారి వాదనకు భంగం కలుగుతుంది. అలాగే కారణం ఉన్నప్పుడే కార్యం ఉంటుంది అని అంగీకరించినా, వారి వాదనకు భంగం కలుగుతుంది. ఎందుకంటే కార్యకారణాలు ఒకే కాలంలో ఉంటాయి. కాబట్టి **'సర్వంక్షణికం'** అనే మాటకు భంగం వాటిల్లుతోంది. ఈ రకంగా బౌద్ధుల వాదన తప్పు అవుతోంది.

ఇక్కడ రెండు పదాలున్నాయి. 1. ప్రతిసంఖ్యానిరోధము బుద్ధి పూర్వకమైన నాశనము. ఇదే స్థూలనాశనము. 2. అప్రతిసంఖ్యానిరోధము – బుద్ధి పూర్వకంగా కాక, సహజంగా జరిగే నాశనము. ఈ రెండు వినాశాలు బౌద్ధులు కల్పించుకున్నవే. వీరిభాషలో భావాలు అంటే కుండ, వస్త్రము మొదలైనవి. ఇవి ప్రతిక్షణం నశించి పోతుంటాయి అంటే వాటంతటవే నశిస్తాయి. అలాంటప్పుడు బుద్ధిపూర్వక వినాశనానికి అవకాశం లేదు. వీరి మతం ప్రకారం ప్రతిక్షణం నశించటం అంటే కుండ, దాని మూలపదార్థమైన మట్టి నాశనమయ్యేదాకా నశిస్తుంది అని చెప్పాలి. నశించిన కుండే మళ్ళీ పుట్టింది అనాలి. అలా కాక ఇంకో కుండ వచ్చిందంటే, వెనుకటి కుండ, ఇప్పటి కుండ ఒకటే అనిపించదు. జాగ్రత్తగా పరిశీలిస్తే, కుండ వస్త్రము మొదలైన వస్తువులలో మట్టి, దారాల యొక్క అనుబంధం స్పష్టంగా కనిపిస్తుంది. కాబట్టి అప్రతిసంఖ్యా నిరోధము బుద్ధి పూర్వకంగా నాశనం కాదు. అందుచేత బౌద్ధుల వాదన తప్పు.

అవిద్య అనేది జ్ఞానం వల్ల నశిస్తోందా? లేక తనంత తానే నశిస్తోందా? క్షణికమైన వాటిని శాశ్వతమని భావించటమే అవిద్య. యమనియమాలతో కూడిన మార్గం ఈ అవిద్యను నిరోధిస్తుంది అని బౌద్ధుల వాదన. జ్ఞానంవల్లనే అవిద్య నిరోధించబడుతోంది అంటే, అన్ని వస్తువులకు నాశనం ఏర్పడుతుందనే వాదన తప్పుతుంది. అలా కాకుండా అవిద్య దానంతట అదే నశిస్తుంది అంటే 'సర్వంక్షణికం' అన్న బుద్ధుని బోధనలు తప్పుతాయి.

ఆకాశం అనేది వస్తువు కాదు అంటారు బౌద్ధులు. బౌద్ధమతంలో ఆకాశం అంటే ఆవరణ లేకపోవటం అని అర్థం చెపుతూ, భూమి మొదలైన వాటిలాగా ఆకాశం కూడా ఒక వస్తువే అని భావించటం లేదు. కాని ఆకాశం కూడా ఒక వస్తువే. ఆకాశం అంటే అవకాశం కల్పించేది. నేలమీద కుండను ఉంచినప్పుడు, ఆ కుండకు ఆధారంగా భూమి ఉన్నదనే భావన కలుగుతుంది. మరి ఆకాశంలో పక్షులు, విమానాలు ఎగిరేటప్పుడు వాటికి ఆధారంగా నిలచేది ఆకాశమే. ఈ విధంగా ఆకాశం కూడా ఒక వస్తువే ఉపనిషత్తులలో చెప్పినట్లుగా పరబ్రహ్మనుంచే ఆకాశం పుట్టింది. కాబట్టి ఆకాశం కూడా ఒక వస్తువే.

బౌద్ధులవాదన ప్రకారం సర్వమూ క్షణికమే. అంటే ఆత్మకూడా క్షణికమే అంటారు అది నిజం కాదు. ఆత్మ శాశ్వతమైనది. అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ ఉండేదే ఆత్మ. ఆత్మ సత్యము నిత్యమైనది. ఈ విషయం ఉపనిషత్తులలో చాలా స్పష్టంగా, అనేకసార్లు చెప్పబడింది. కాబట్టి ఆత్మక్షణికము అనే బౌద్ధుల వాదన తప్పు.

అసత్తు, అభావం నుంచి ఏమీ పుట్టదు. బౌద్ధమతంలో స్థిరమైనది అంటూ ఏదీ లేదు. సర్వమూ క్షణికం. విత్తనం నుండి మొలక వస్తోంది అంటే విత్తనం రూపాన్ని కోల్పోయి అభావం పొందుతుంది. ఆ తరువాత అంకురం వస్తుంది. కాబట్టి బీజం యొక్క అభావభావం (లేకపోవటం) నుండి వస్తువు పుడుతోందని వారి వాదన. అభావం నుంచి భావం ఎప్పుడూ పుట్టదు. లేని వస్తువు నుంచి ఉన్న వస్తువు ఎలా పుడుతుంది? అభావానికి, కారణమయ్యే శక్తి ఉండదు. కుందేటి కొమ్ము నుంచి ఏమీ పుట్టదు. బీజం నశించినప్పుడు అందులోని బీజవాయువులే అంకురానికి కారణమవుతాయి. అంతే కాని పప్పుబద్దల్లా ఉండే బీజదళాల నాశనాన్ని చూసి, బీజం అంతా నశించింది అనుకోవటం తప్పు. అభావం నుంచి భావం పుడుతుందనే మాట అబద్ధం. అదే గనక నిజమైతే, వ్యవసాయం చెయ్యవలసిన అవసరం లేదు. ఇంట్లో కూచుని కోరితే కోరికలు తీరతాయి. ఇలా కష్టపడకుండా కోరికలు తీరితే కర్మచేయవలసిన పనే ఉండదు. స్వర్గనరకాలు అసలే ఉండవు. కాబట్టి బౌద్ధులవాదన సరికాదు అంటూ వైభాషికుల, సౌతాంత్రికులవాదాన్ని ఖండించారు.

ఇక యోగాచారుల మతాన్ని ఖండిస్తున్నారు. యోగాచారుల ప్రకారం బాహ్య పదార్థాలనేవి లేవు. వీరిమతంలో ఉన్నది విజ్ఞానమొక్కటే. మన కంటికి కనిపించే ఎరుపు, తెలుపు, నలుపు రంగులన్నీ విజ్ఞానం యొక్క ఆకార విశేషాలు. ఈ విధంగా సర్వత్రా విజ్ఞానం బాహ్యాకారాన్ని పొందుతున్నదని వీరి వాదన. అయితే విజ్ఞానం కన్న ఇతర పదార్థాలేవీ లేవనేది నిజం కాదు. బాహ్యపదార్థాలు గోడ, కుండ లాంటివి కంటికి కనిపిస్తున్నాయి. కాబట్టి విజ్ఞానం తప్ప ఇంకొక విషయం లేదనటం సరికాదు. స్వప్నావస్థకు, జాగ్రదావస్థకూ భేదం ఉన్నది. స్వప్నంలో కనిపించిన వస్తువుల్లాగా జాగ్రదావస్థలో కూడా విజ్ఞానం తప్ప ఇతర పదార్థాలేవీ లేవనటం తప్పు.

యోగాచారులు జాగ్రదావస్థలో ఉన్నవేవీ కూడా విజ్ఞానంకన్న భిన్నమైనవి, తెలుసుకోదగినవి కాదు. స్వప్నావస్థలో విజ్ఞానం లాంటిదే జాగ్రదవస్థలో కూడా అంటారు. ఇది సరికాదు. స్వప్నానికీ, జాగ్రత్తకూ పోలిక లేదు. కలలో కనిపించిన వస్తువు మెలకువ రాగానే కరిగిపోతుంది. కాని జాగ్రదావస్థలో అలా కాదు. ఈ వస్తువులు అలాగే ఉంటాయి. అందరికీ కనిపిస్తాయి. కలలో కనుపించిన దాని అనుభవానికి కారణం గుర్తుండటం. కాని జాగ్రత్తలో ప్రత్యక్షానుభవం ఉంది. వస్తువును తాకుతున్నాం. అనుభవిస్తున్నాం. అందరికీ చూపిస్తున్నాం. ఇంకొకరికి ఇస్తున్నాం. ఇలా జాగ్రస్వప్నాలకు తేడా ఉంది. జాగ్రదావస్థ కూడా స్వప్నావస్థలాంటిదే అనటం తప్పు.

యోగాచారుల ప్రకారం బాహ్యపదార్థాలు లేవు. కాబట్టి వాసనలు, సంస్కారాలు ఉండవు. వాటి అనుభవం కూడా ఉండదు. అనుభవం ఉంటేనే గాని వాసనలు, సంస్కారాలు జనించవు. కాబట్టి వాసనా వైచిత్ర్యంవల్ల జ్ఞానవైచిత్ర్యం కలుగుతోంది అనటం సరికాదు. వాసనే లేనప్పుడు, దానివల్ల జ్ఞానం కలగటం అసంభవం.

ఆలయ విజ్ఞానం కూడా క్షణికం అన్నారు. కాబట్టి అది కూడా వాసనలకు ఆశ్రయం కాలేదు. ఆలయ విజ్ఞానం అంటే నేను నేను అంటూ ఎప్పుడూ అందరికీ అందించే జ్ఞాన పరంపర. ఇటువంటి ఆలయ విజ్ఞానమే వాసనలకు ఆశ్రయం అని వీరంటారు. శూన్యవాదులు ఆలయ విజ్ఞానాన్ని క్షణికం అంటారు. కాబట్టి ఆలయ విజ్ఞాన పరంపర వాసనలకు ఆశ్రయం కాలేదు. వ్యాసుడి కాలానికి శూన్యవాదం లేదు. అందుకే బ్రహ్మసూత్రాలలో దాన్ని ఖండించలేదు శంకరుడు మాత్రం శూన్యవాదంమీద ఒక సూత్రం వ్రాశాడు.

**షట్చక్ర నిరూపణం**లో “ఆజ్ఞాచక్రం దాటిన తరువాత యోగి మహానాదాన్ని దర్శిస్తాడు. అతడికి వాక్సిద్ధి కలుగుతుంది. సహస్రదళము పూర్ణచంద్రునిలా ప్రకాశిస్తుంటుంది. దాని కిరణాలు సూర్యకిరణాలలాగా కాంతివంతంగా, చంద్రకిరణాలలాగా చల్లగా ఉంటాయి. ఇక్కడ అకారాది సర్వవర్ణాలు ఉంటాయి. ఇది కేవలము ఆనందరూపమైనది. ఇది చంద్రమండలం. ఇక్కడ వృద్ధిక్షయాలు లేని చంద్రుడుంటాడు. అతడు కళంకరహితుడు. ఈ చంద్రమండలం మధ్యన మహాశూన్యమున్నది. ఆ మహాశూన్యాన్ని దేవతలు రహస్యంగా సేవిస్తారు. అది

చాలా రహస్యమైనది. **తదంతః శూన్యం తత్సకల సురగణైః సేవితం చాతిగుప్తం** అతిప్రయత్నం మీద గాని దాన్ని పొందలేరు. అక్కడే పరమేశ్వరుడుంటాడు. ఆయన సర్వాత్మరూపి. అజ్ఞానము, మోహము పోగొట్టి సాధకుడికి సుధాధారలచే ఆత్మజ్ఞానం కలిగిస్తాడు. అప్పుడు సాధకుడు జీవాత్మ పరమాత్మల సమైక్యము సాధించి, పరమహంస అవుతాడు" అని చెప్పబడింది.

బౌద్ధులు యోగమార్గంలో ఆ శూన్యం వరకు వెళ్ళారు. అందుకే అంతా శూన్యము అంటున్నారు. కాని అక్కడ ఆ శూన్యాన్ని ఆవరించిన పరమాత్మని మాత్రం దర్శించలేకపోయారు. ఏ విధంగా చూసినా బౌద్ధదర్శనం ఆమోదయోగ్యం కాదు. వీరు చెప్పే బాహ్యార్థవాదం, విజ్ఞానవాదం, శూన్యవాదం ఏదీ యుక్తియుక్తంగా లేదు. వారి వాదనలన్నీ పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. కాబట్టి ఈ మతం అంగీకారం కాదు అన్నాడు శంకరుడు.

ఈ విధంగా అద్వైతానికి వ్యతిరేకంగా ఉన్న దర్శనాలను ఖండించి, అద్వైత సిద్ధాంతాన్ని పునః ప్రతిష్ట చేశాడు.

## తులనాత్మక పరిశీలన

ఇప్పటివరకు మనం మొత్తం పన్నెండు దర్శనాలను చూశాం. ఇప్పుడు వాటన్నింటినీ సమన్వయపరచి అంటే ఒకే విషయంలో వివిధ దర్శనాలు ఏం చెప్పినాయి అనేది చూద్దాం. ముందుగా

1. దర్శనకారుడు ఎవరు ? అనే విషయాన్ని పరిశీలిస్తే – 1. యోగ దర్శనాన్ని పతంజలి మహర్షి చెప్పాడు. ఇది నాలుగు పాదాలుగా 195 సూత్రాలతో ఉంటుంది. దీనిమీద ఉన్న వ్యాఖ్యలలో భోజుడు వ్రాసిన – భోజవృత్తి, భావగణేశుడు వ్రాసిన – భావగణేశవృత్తి, రామానందయతి వ్రాసిన – మణిప్రభ, అనంతపండితుడు వ్రాసిన – యోగచంద్రిక, సదాశివేంద్ర సరస్వతి వ్రాసిన – యోగసుధాకరము, నాగోజీభట్టు వ్రాసిన – లఘు, బృహత్ వృత్తులు సిద్ధమైనవి వీటిలో భోజవృత్తి అత్యంత శ్రేష్ఠమైనది.

2. పూర్వమీమాంసను చెప్పినవాడు జైమిని మహర్షి. దీనికి శబర స్వామి, ప్రభాకర మిశ్రుడు భాష్యం వ్రాశారు.

3. ఉత్తరమీమాంసను చెప్పినవాడు వ్యాసుడు. దీనిలో భగవద్గీత, బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులలో కొన్నింటికి ఆదిశంకరులు భాష్యం వ్రాశారు.

4. సాంఖ్యదర్శనం చెప్పినవాడు కపిలుడు. ఇందులో ఆరు అధ్యాయాలు, 527 సూత్రాలు ఉంటాయి. భాగవతంలోని కపిలుడు, ఇతడు ఒకరు కాదు. కపిలుని తరువాత అసురి, పంచశిఖాచార్యుడు, ఈశ్వరకృష్ణుడు, వింధ్యవాసి, విజ్ఞానభిక్షువు ఈ మతాన్ని బాగా ప్రచారం చేశారు. ఈశ్వరకృష్ణుని సాంఖ్యకారికలు అత్యంత ప్రామాణికము.

5. వైశేషిక దర్శనాన్ని చెప్పినవాడు కణాదుడు అనబడే కశ్యపుడు. ఇందులో 372 సూత్రాలుంటాయి. వైశేషిక సూత్రాలకు భాష్యం వ్రాసిన వాడు ప్రశస్తపాదుడు. ఈ దర్శనం మీద ఉదయనుడి కిరణావళి, శంకరమిశ్రుని ఉపస్కారము, శివాదితుని 'సప్తపదార్థి' ముఖ్యమైన వ్యాఖ్యలు.

6. న్యాయదర్శనాన్ని వ్రాసినవాడు అక్షపాదుడు. దీనిమీద ఉదయనాచార్యుడు వ్రాసిన న్యాయకుసుమాంజలి ప్రసిద్ధమైన వ్యాఖ్య.

7.  చార్వాక దర్శనాన్ని వ్రాసినవాడు చార్వాకుడు.

8. జైన దర్శనాన్ని చెప్పినవాడు ఋషభుడు. ఈ మతాన్ని బాగా ప్రచారం చేసినవాడు వర్ధమాన మహావీరుడు.

9. బౌద్ధదర్శనాన్ని వ్రాసినవాడు బుద్ధుడు. అశోకుడి కాలం నుంచి ఈ మతం బాగా వ్యాప్తి చెందింది.

10. ద్వైతాన్ని చెప్పినవాడు మధ్వాచార్యుడు. ఈ మతాన్ని బ్రాహ్మణులు తప్ప ఇంకెవరూ తీసుకోలేరు.

12. అద్వైత మతాన్ని స్థాపించినవాడు శంకరాచార్యుడు. మన దేశంలో బహుళ ప్రచారంలో ఉన్నది ఈ మతం.

11. విశిష్టాద్వైతాన్ని చెప్పినవాడు రామానుజుడు. ఇదే శ్రీవైష్ణవము. నిజానికి ద్వైతము విశిష్టాద్వైత అద్వైతాలు మూడూ ఉత్తరమీమాంసకి వ్యాఖ్యలే.

**2. సృష్టి:** ఈ జగత్తు ఏ రకంగా సృష్టించబడింది. అనే దానికి ప్రకృతి పురుషుల కలయిక చేతనే మహత్తత్త్వము, దాని నుంచి అహంకారము, ఆ తరువాత తన్మాత్రలు, పంచభూతాలు. భూతపంచీకరణంవల్లనే జగత్సృష్టి జరిగింది అన్నారు. ఈశ్వరసృష్టిని ఋజువు చేసే ఆధారాలు లేవు అన్నారు సాంఖ్యులు. ప్రతివస్తువు నిరంతరము మారుతూ ఉంటుంది. దీన్నే పరిణామవాదము అంటారు. యోగులు కూడా ఈ సిద్ధాంతాన్ని అంగీకరించారు. మీమాంసకారుల దృష్టిలో జగత్తు ఎవరిచేత సృష్టించబడలేదు. అది శాశ్వతంగా ఇలాగే ఉంటుంది అంటారు. పరమేశ్వరుడే సృష్టికర్త అంటున్నాడు వ్యాసుడు. జగత్తు పరమాణువుల కలయికచే ఏర్పడింది అంటాడు కణాదుడు. ప్రళయం తరువాత కొంత కాలానికి పరమేశ్వరుడు అదృష్టాన్ని ఆధారంగా చేసుకుని ఈ జగత్తును సృష్టించాడు. ఆ సమయంలో చలనం లేకుండా పడి ఉన్న పరమాణువులు, వాటి అదృష్టాన్ననుసరించి చలనం పొందుతాయి. అలాంటి పరమాణువులు కొన్ని కలిస్తే ఒక రూపం ఏర్పడుతుంది అంటుంది న్యాయదర్శనం. జగత్తు ఎలా సృష్టించబడింది? అన్న దానికి చార్వాకుల దగ్గర సరైన సమాధానం లేదు. అది స్వాభావికము అంటారు. కొన్ని పదార్థాలు కలిస్తే ఒక క్రొత్త రూపం ఏర్పడుతుంది. పసుపు, సున్నము కలిస్తే పారాణి అవుతుంది. ఇది స్వాభావికము. అలాగే జగత్తుకూడా అంటారు. సృష్టి ఎలా జరిగింది? అన్న దానికి జైన మతంలో కూడా సమాధానం లేదు. జగత్తు అనాదిగా ఉన్నదని వీరి సిద్ధాంతము. జగత్తులో వస్తువులన్నీ ఒక దానివల్ల ఇంకొకటి కలుగుతున్నాయి అంటాడు బుద్ధుడు. త్రిగుణాలు ఎక్కువ, తక్కువ కావటమే సృష్టి ప్రారంభము అంటాడు వ్యాసుడు. జగత్తు అనేది నిజంగా లేదు. ఈ జగత్తు మిథ్య అంటాడు శంకరుడు.

**3. ఈశ్వరుడు :** ఈ దర్శనాలలో నాస్తిక దర్శనాలైన చార్వాకము, జైనము, బౌద్ధము వేదాలు అపౌరుషేయాలని కాని, ఈశ్వరుడు ఉన్నాడని కాని అంగీకరించ లేదు. సాంఖ్యదర్శనంలో సేశ్వరవాదము, నిరీశ్వరవాదము రెండూ ఉన్నాయి. ప్రారంభంలో ఇది నిరీశ్వరవాదము. తరువాత కాలంలో ఈశ్వరుడున్నాడనే విషయాన్ని ఇందులో చేర్చారు. మీమాంసవాదులు వేదాలు అపౌరుషేయాలు అంటారు. కాని వేదాలు ఈశ్వర నిర్మితాలు కాదు. ఈశ్వరుడున్నాడని వీరు ఒప్పుకోరు. ఉత్తరమీమాంసలో జగత్తుకు అతీతమైన ఈశ్వరుడున్నాడని, ఆయనే సృష్టి

స్థితిలయాలకు కారణం అంటాడు వ్యాసుడు. వైశేషిక దర్శనాలలో ఈశ్వర ప్రసక్తి లేదు. కాబట్టి ముందుగా ఇది నాస్తికదర్శనము. తరువాత కాలంలో ఈశ్వరుణ్ణి ఇందులో చేర్చారు. న్యాయదర్శనంలో ఈశ్వరుడున్నాడు. అతడు సర్వజ్ఞుడు. మధ్వదర్శనంలో శ్రీమన్నారాయణుడు సర్వశక్తిమంతుడు. ప్రకృతి ఆయన అధీనంలో ఉంటుంది. విశిష్టాద్వైతంలో ఈశ్వరుడు నిర్గుణుడు కాదు, సగుణుడు. ఆయనకు హేయమైన గుణాలు ఏవీ లేవు. ఆయన ఆత్మలకు ఆత్మ. శంకరుని అద్వైత సిద్ధాంతంలో నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరమేశ్వరుడు. అతడే సృష్టి స్థితిలయాలకు కారకుడు. సర్వాంతర్యామి.

**4. కర్మ :** పూర్వమీమాంస పూర్తిగా కర్మసిద్ధాంతం. వేదాలు చెప్పినట్లుగానే కర్మలు చెయ్యాలి. అయితే కర్మ నాలుగు రకాలు. వీటిలో నిత్యకర్మలు ప్రతిరోజు తప్పనిసరిగా చెయ్యాలి. కామ్యకర్మలవల్ల ఫలితం వస్తుంది అంటారు.

సాధారణంగా కర్మ చెయ్యగానే ఫలితం రాదు. కర్మక్షణికము. చెయ్యగానే నశిస్తుంది. ప్రతికర్మలోను సూక్ష్మంగా ఒకశక్తి ఉంటుంది. దీన్నే అపూర్వము అంటారు. నైయాయికులు అదృష్టము అంటారు. ఈ అపూర్వము కర్తలోనే సూక్ష్మరూపంలో దాగి ఉండి, అనుకూల పరిస్థితులు కలిగినప్పుడు ఫలితాన్నిస్తుంది. ఫలితాన్నిచ్చేదాకా ఎన్ని జన్మలు ఎత్తినా అది నశించకుండా కర్తలోనే దాగి ఉంటుంది. ఇది మీమాంసకారుల సిద్ధాంతము. సాంఖ్యుల ప్రకారము వైదిక కర్మలవల్ల మోక్షం రాదు. యజ్ఞ యాగాలలో చేసే పశుహింస పాపహేతువు. వైశేషికుల ప్రకారము కర్మ ఫలితమే అదృష్టము. ఇది సృష్టివిధానము ఒక పద్ధతిలో సాగటానికి ఉపకరిస్తుంది. న్యాయదర్శనం ప్రకారము పరమేశ్వరుడు అదృష్టాన్ని ఆధారంగా చేసుకుని జగత్తును సృష్టిస్తాడు. ఇక్కడ అదృష్టము అంటే కర్మఫలము. జైనదర్శనంలో కర్మ అంటే మనం చేసే పనులు కాదు. కర్మ ద్రవ్యరూపము అంటారు. జైనులు కర్మ సిద్ధాంతం అంగీకరిస్తారు. చార్వాకులు, బౌద్ధులు యజ్ఞయాగాది కర్మలను నిరసించారు. కర్మవల్ల మనస్సు నిర్మలమవుతుంది అంటున్నాయి ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతాలు.

**5. పునర్జన్మ :** వైశేషికుల ప్రకారము పునర్జన్మ ఉన్నది. జీవి ఇంకొక జన్మ ఎత్తినా, మనస్సు ఆత్మను వెన్నంటే ఉంటుంది. ఈ రకంగా జన్మపరంపరలు పొందేది మనస్సే. జైనదర్శనం కర్మలవల్లనే జీవుడు మరణానంతరము పాపపుణ్యాల ననుసరించి జన్మలు ఎత్తుతాడు అంటోంది. బౌద్ధమతంలో పునర్జన్మ ఉన్నది. వేదాంతుల ప్రకారము

మరణించిన దేహంలోని జీవుడే పునర్జన్మ ఎత్తుతాడు. కాని బౌద్ధుల ప్రకారం దేహాన్ని వదలిన వాడొకడు, పునర్జన్మ ఎత్తేవాడింకొకడు. పునర్జన్మకు కారణం వ్యక్తిగతధర్మాలు. అద్వైత, ద్వైత, విశిష్టాద్వైతాలు పునర్జన్మని అంగీకరిస్తున్నాయి.

**6. వాదము :** యోగదర్శనంలో అష్టాంగ యోగమనేది ముఖ్యమైనది. మీమాంసవాదులు కర్మలవల్లనే మోక్షం వస్తుంది అంటారు. జ్ఞానంవల్ల కర్మ నశిస్తుందని ఒప్పుకోరు. సాంఖ్యుల ప్రకారము 25 తత్త్వాలే ఈ సృష్టికి కారణము. వాటిని గురించి తెలుసుకోవటమే మోక్షము. వేశేషికులది పరమాణువాదము. కణములవల్లనే జగత్తు ఏర్పడింది. న్యాయదర్శనంలో కూడా పరమాణువాదాన్ని బలపరిచారు. మరణానంతరము దొరికే స్వర్గసుఖాలకన్న, ఇప్పుడు దొరికే సుఖాలే సత్యము అంటారు చార్వాకులు. వీరు హేతువాదులు. జైనదర్శనంలో స్యాత్ వాదము లేదా సప్తభంగీవాదము ముఖ్యమైనది. బౌద్ధమతంలో నైతిక విలువలకు ప్రాముఖ్యత ఇవ్వబడింది, ద్వైతదర్శనంలో జీవుడు మూడు విధాలు 1. నిత్యముక్తులు 2. ముక్తులు 3. బద్ధులు. విశిష్టాద్వైతంలో ప్రపత్తి, శరణాగతి ముఖ్యమైనవి కాగా అద్వైతంలో 'అహంబ్రహ్మాస్మి' అంటాడు శంకరుడు. ఉపనిషత్తులు కూడా దీన్నే సమర్థించాయి. అద్వైత సిద్ధాంతంలో మాయావాదం ముఖ్యమైనది.

**7. ఆత్మ :** పూర్వమీమాంసలో ఆత్మని గురించి భిన్నాభిప్రాయా లున్నాయి. కుమారిలభట్టు ప్రకారము ఆత్మ పూర్తిగా జడపదార్థం కాదు. జ్ఞానవిశిష్టమైనది. ఆత్మ తెలుసుకునే కర్తే కాకుండా, తెలియబడే విషయం కూడా అంటే ఆత్మే కర్త, కర్మ కూడా. ఆత్మ పరిణామము పొందుతుంది. అయినా ఆత్మనిత్యమైనది. ఆత్మలు అనేకములు. ఇవి శరీరము, బుద్ధి, ఇంద్రియాల కన్న వేరైనవి. ఆత్మ సర్వవ్యాపి. అయినా కర్మ చేస్తుంది. సుఖదుఃఖము మొదలైన ధర్మాలన్నీ ఆత్మవే కాని శరీరానివి కాదు. ప్రభాకరమిశ్రుని ప్రకారము ఆత్మ పూర్తిగా జడము. జ్ఞానం కాదు. ఆత్మ తనను గురించి కాని, ఇతరాన్ని గురించి గాని ఎరగదు. జ్ఞానముచేత మాత్రమే ఎరగబడుతుంది. ఆత్మకర్త, భోక్త. సమస్తమైన వస్తువుల యందు ఆత్మ ప్రకటమవుతుంది. ఆత్మ పరిణామి కాదు.

ఈ మతంలో జీవుడు వేరు ఆత్మ వేరనే వ్యవహారము లేదు. జీవుడే ఆత్మ. ఆత్మ మానస ప్రత్యయమని కుమారిలుడు, అహం ప్రత్యయమని ప్రభాకరుడు అంటారు. ఆత్మలు అనేకములని, ఆత్మ అనిత్యమని ఇద్దరూ చెబుతారు.

వేదాంత దర్శనంలో ఆత్మ అంటే పరమేశ్వరుడే. ఆత్మ నిరాకారము, నిర్గుణము, సర్వవ్యాపి. జగత్తులో ఉన్నది ఒకటే ఆత్మ. అది సత్యము, నిత్యము, శాశ్వతము. వైశేషిక దర్శనంలో చెప్పిన ఆత్మకు, న్యాయదర్శనంలోని ఆత్మకు పెద్దగా తేడా లేదు. వైశేషికుల ప్రకారము ఆత్మ రెండు విధాలు. 1. మనో విశిష్టమైన ఆత్మ. దీనికి మనసుతో సంబంధం ఉంటుంది. 2. కేవలాత్మ. మనసుతో సంబంధంలేని ఆత్మ. ఆత్మ లోపల, బయట అంతటా వ్యాపించి ఉంటుంది. ఆత్మ ప్రత్యక్షం కాదు. శరీరంలోని ఆత్మను గుర్తించే ప్రత్యక్ష ప్రమాణం ఏదీలేదు. న్యాయదర్శనంలో రూపం కలిగిన ప్రతిదీ మరణిస్తుంది. బుద్ధి అనేది ఆత్మయొక్క గుణము. ఆత్మ ప్రమాణమైనది, అనంతమైనది. చైతన్యము ఆత్మయొక్క గుణము. శరీరము, ఇంద్రియాలు, బుద్ధి, మనస్సు మొదలైనవన్నీ ఆత్మయొక్క గుణాలు అని చెప్పబడింది. మధ్వదర్శనంలో ఆత్మకు నామరూపాలున్నప్పటికీ, ప్రకృతిలోని ఏ పదార్థాన్ని పోలి ఉండదు. ప్రకృతి ధర్మాలకతీతంగా ఉంటుంది. ఆత్మ భౌతిక పదార్థాలతో నిర్మించబడదు. దైవీసంపత్తితో నిర్మించబడింది. అది ఈశ్వరుని ప్రతిబింబము అని చెప్పబడింది. జీవాత్మ పరమాత్మ సన్నిధిని చేరటమే మోక్షము అంటాడు రామానుజుడు. అద్వైత సిద్ధాంతాలలో ఆత్మవిచారణ ఎక్కువగా జరిగింది. ఆత్మ, పరమాత్మ రెండూ ఒకటే. ఈ సిద్ధాంతంలో దేహం వేరు, ఆత్మ వేరు, ఆత్మ సర్వజ్ఞుడు, సర్వవ్యాపి.

**8. మోక్షము :** మోక్షాన్ని గురించి దర్శనాలు రకరకాలుగా అభిప్రాయాలు వెలిబుచ్చినాయి. మీమాంస దర్శనాచార్యుడు జైమినిగాని, జైమిని సూత్రాలకు భాష్యం వ్రాసిన శబరస్వామిగాని మోక్షాన్ని ప్రస్తావించలేదు. వీరు కేవలం స్వర్గసుఖాలనే చెప్పారు. కాని స్వర్గము కూడా నిత్యమైనది కాదు. అందుచేత ప్రభాకరమిశ్రుడు మొదలైనవారు జన్మరాహిత్యమే ముక్తి అన్నారు. ముక్తి కావాలంటే నిత్య, నైమిత్తిక, కామ్యకర్మలు చెప్పారు. జీవాత్మ పరమాత్మలో లీనం కావటమే మోక్షము అన్నాడు వ్యాసుడు. ఈ మాటను ఉపనిషత్తులు చెబుతున్నాయి. పురుషుడు తనను తాను తెలుసుకోవటము, ప్రకృతికి స్వరూప జ్ఞానం కలగటం. ఇదే మోక్షము. 25 తత్త్వాలజ్ఞానం పొందటమే మోక్షము. వైదిక కర్మల వల్ల మోక్షం రాదు. లౌకిక బంధనాలు తొలగించుకోవటమే మోక్షము అన్నారు సాంఖ్యులు. ధర్మానుష్టానం చేస్తే తత్త్వజ్ఞానం కలుగుతుంది. తత్త్వజ్ఞానంవల్లనే మోక్షం సిద్ధిస్తుంది అంటారు వైశేషికులు. ఈ జ్ఞానం సప్తపదార్థాలకు సంబంధించినది. న్యాయసూత్రాలు మోక్షం

సాధించాలంటే అష్టాంగ మార్గాన్ని అనుసరించాలి అన్నాయి. జైనదర్శనంలో కూడా మోక్షాన్ని చెప్పటం జరిగింది. జీవులు సిద్ధావస్థలో ఏ విధమైన కర్మ లేకుండా సచ్చిదానంద రూపులై ఉంటారు. అదే ముక్తి. ముక్తి పొందినవారు మిగిలిన వారి ముక్తి కోసం పాటు పడతారు. సంపూర్ణ దుఃఖ నాశనమే మోక్షము. బౌద్ధమతంలో సర్వదుఃఖాలు, క్లేశాల నుంచి విముక్తుడైనవాడు బుద్ధుడు అనబడతాడు. అంటే మహాజ్ఞాని అవుతాడు. ఈ స్థితికి చేరినవాడే నిర్వాణం పొందుతాడు. నిర్వాణం పొందిన వారికి పునర్జన్మ ఉండదు. మధ్వదర్శనంలో మోక్షము అనేది ప్రాప్యవస్తువు. పోగొట్టుకున్న దాన్ని తిరిగి పొందటం. రకరకాల దశలలో ఉన్న జీవరాశి మోక్షానికి అర్హులు. కాబట్టి మోక్షం కూడా రకరకాల దశలలో ఉంటుంది. విశిష్టాద్వైతంలో మోక్షము అంటే భగవత్ప్రాప్తి. వైకుంఠంలో భగవంతుడితో చేరి పరిపూర్ణానందాన్ని అనుభవించటము. వైకుంఠంలో నిత్యసూరులతోను, నిత్యముక్తులతోను, శ్రీమన్నారాయణ రూపుడై ఆడుతూ, పాడుతూ, అమృతసరస్సు, చింతామణి సౌధము, లక్ష్మీనారాయణుల దివ్యసౌందర్యము దర్శిస్తూ ఉండటము. ఇది శాశ్వతస్థితి. పురుషార్థాలలో కైవల్యమును కూడా చేర్చారు. కైవల్యము అంటే జీవుడు ప్రకృతి బంధనాల నుంచి విడివడి స్వస్వరూపంతో కేవలుడై ఉండటము. ఇది కూడా శాశ్వత స్థితి. ఇలా మోక్షాన్ని కైవల్యమని, భగవత్ప్రాప్తి అని రెండు రకాలుగా విడదీశారు. అద్వైత సిద్ధాంతంలో జగత్తులో ఉన్నది ఒక్కటే. అదే పరబ్రహ్మ. జీవాత్మ పరమాత్మల ఏకీభావమే మోక్షము. **జ్ఞానాదేవతుకైవల్యమ్.** జ్ఞానం వల్లనే మోక్షం సిద్ధిస్తుంది. ముక్తి పొందిన వారికి పునర్జన్మ ఉండదు. **బ్రహ్మసత్యం జగన్మిథ్య.** ఇదే అద్వైతసారం.

ఈ విధంగా వివిధ విషయాలమీద భిన్నాభిప్రాయాలు కలిగిన దర్శనాలను మతాలను అన్నింటినీ ఖండించి అద్వైత మతస్థాపన చేశారు. శంకర భగవత్పాదులవారు.

శంకరాచార్యుల వారు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అంటూ అద్వైతపరంగా బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాశారు. రామానుజుడు, మధ్వాచార్యుల వంటి మిగిలిన వారంతా పరబ్రహ్మకు ఒక రూపాన్ని ఆపాదించి రాముడు, కృష్ణుడు, విష్ణువు, ఈశ్వరుడు, శక్తి అన్నారు. వీరి మతంలో జీవుడు వేరు, దేవుడు వేరు. అంటే ఇది ద్వైతము అనవచ్చు. మరి ఇప్పుడు ఈ గ్రంథం శ్రీవిద్యాబ్రహ్మసూత్ర భాష్యము ద్వైతమా? అద్వైతమా? అని అనుమానం వస్తుంది చాలామందికి.

## శ్రీవిద్యాబ్రహ్మసూత్ర భాష్యము ద్వైతమా? అద్వైతమా?

ద్వైతము అంటే జీవాత్మ, పరమాత్మ వేరు వేరు. ఇదంతా సగుణారాధన. ఇందులో సాధకులు అర్చిరాదిమార్గం ద్వారా బ్రహ్మలోకం చేరతారు. అక్కడ సాకారుడైన బ్రహ్మ ఉంటాడు. ఇతడు పరబ్రహ్మకు ప్రతిరూపం. అంతేకాని పరబ్రహ్మ కాదు. ఇతణ్ణే కర్మ బ్రహ్మ, అపరబ్రహ్మ అని కూడా అంటారు. మరణానంతరము అర్హులైన భక్తులు అర్చిరాది మార్గం ద్వారా బ్రహ్మలోకం చేరి, అక్కడ జరిగే రకరకాల ఉత్సవాలు తిలకిస్తూ ఆనంద డోలికలలో తేలియాడతారు. ఇది శాశ్వతమైన స్థితి. బ్రహ్మలోకం చేరిన వారికి మరుజన్మ ఉండదు అని ద్వైతులంటారు. వీరు అనుభవించే ఆనందాన్నే బ్రహ్మానందము అంటారు. ఈ స్థితినే కైవల్యము, ముక్తి, మోక్షము, సాయుజ్యము అంటారు. ఇక్కడ జీవాత్మ పరమాత్మలు విడివిడిగానే ఉంటాయి అంతేకాని ఏకం కావు. జీవాత్మ పరమాత్మలో లీనం కాదు.

అద్వైతంలో జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. జ్ఞానికి దేహపాతం జరగగానే అతని జీవాత్మ ఘటాకాశం మహదాకాశంలో కలిసినట్లుగా, పరమాత్మలో లీనమవుతుంది. ఇదే సాయుజ్యం. ఇక్కడ జ్ఞాని ప్రయాణించటానికి ప్రత్యేకమైన మార్గం ఏదీ ఉండదు. ఇలా సాయుజ్యం పొందిన వారికి పునర్జన్మ ఉండదు.

శ్రీవిద్యాబ్రహ్మసూత్ర భాష్యంలో పరబ్రహ్మను త్రిపురసుందరిగా ఆరాధించిన వారు అర్చిరాది మార్గంద్వారా మణిద్వీపం చేరి మహాదైశ్వర్యము అనుభవిస్తారు. ఆమెను నిరాకారంగా, పరాశక్తిగా ఉపాసించిన వారు, అంతరారాధన చేసినవారు సాయుజ్యం పొందుతారు. వారి జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. వీరికి పునర్జన్మ ఉండదు. ఈ రకంగా **ఈ గ్రంథం సగుణోపాసకులు మహదైశ్యము, నిర్గుణోపాసకులు సాయుజ్యము పొందుతారని నొక్కి వక్కాణిస్తోంది. సగుణోపాసకులలో కూడా జ్ఞానసముపార్జన చేసినవారు సాయుజ్యం పొందుతారు అంటున్నారు పరమానంద నాథులు జ్ఞానాదేవతుకైవల్యం** జ్ఞానం మాత్రమే మోక్షాన్నిస్తుంది. అదే సాయుజ్యము. జీవాత్మ పరమాత్మల ఏకీభావము.

# రెండవ అధ్యాయం

## మూడవ పాదం

ఈ పాదంలో పంచమహాభూతాలు, జీవుడు మొదలైన వాటి గురించి శ్రుతులలో ఉన్న తేడాలను పరిహరిస్తున్నారు. ఇందులో మొత్తం పదిహేడు అధికరణలు, యాభై మూడు సూత్రాలు ఉన్నాయి.

రెండవ పాదంలో అధికరణలు 32 సూత్రాలు ఉన్నాయి.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | వియదధికరణము | ఆకాశానికి ఉత్పత్తి ఉన్నది | 7 |
| 2. | మాతరిశ్వాధికరణము | వాయువు ఆకాశం నుంచి పుట్టింది | 1 |
| 3. | అసంభవాధికరణము | బ్రహ్మకు పుట్టక లేదు | 1 |
| 4. | తేజోధికరణము | వాయువు నుంచి అగ్ని పుట్టింది | 1 |
| 5. | ఆపదధికరణము | అగ్ని నుంచి జలం పుట్టింది | 1 |
| 6. | పృథివ్యధికరణము | జలం నుంచి భూమి పుట్టింది | 1 |
| 7. | తదభిధ్యానాధికరణము | బ్రహ్మమే అన్నింటినీ సృష్టించింది | 1 |
| 8. | విపర్యాధికరణము | బ్రహ్మయందే అన్నీ లయమవుతాయి | 1 |
| 9. | అంతర్విజ్ఞానాధికరణము | ఇంద్రియాల వల్ల భూతాల సృష్టిలయాలకు భయం లేదు | 1 |
| 10. | చరాచరవ్యపాతయాధికరణము | జీవునికి ఉత్పత్తి లయం నిజం కాదు | 1 |
| 11. | ఆత్మాధికరణము | జీవికి జనన మరణాలు లేవు | 1 |
| 12. | జ్ఞానాధికరణము | జీవి నిత్యజ్ఞాన స్వరూపుడు | 1 |
| 13. | ఉత్క్రాంతిగత్యధికరణము | జీవుని పరిమాణ విమర్శనము | 14 |
| 14. | కర్త్రధికరణము | జీవుడే కర్త | 7 |
| 15. | తక్షాధికరణము | వడ్రంగిలాగా ఉపాధివల్ల జీవుడు కర్త అవుతున్నాడు | 1 |

| | | | |
|---|---|---|---|
| 16. | పరాయత్తాధికరణము | జీవుని కర్తృత్వం పరమేశ్వరాధీనం | 2 |
| 17. | అంశాధికరణము | బ్రహ్మతో జీవికి గల సంబంధం | 11 |

మొత్తం అధికరణలు 17 సూత్రాలు 53

## 1. వియదధికరణము (ఆకాశానికి ఉత్పత్తి ఉన్నది.)

మూడవ పాదంలో మొదటి అధికరణ అయిన **'వియదధికరణ'**లో ఆకాశానికి ఉత్పత్తి ఉన్నది అనే విషయం వివరిస్తున్నారు. ఇందులో ఏడు సూత్రాలున్నాయి.

పంచభూతాలలో ఆకాశం మొదటిది. మరి ఈ ఆకాశానికి అసలు ఉత్పత్తి ఉన్నదా? శ్రుతులలో కూడా దీనిమీద భిన్నవాదనలున్నాయి.

***సూత్రం - 217 "న వియదశ్రుతేః"***

ఆకాశము యొక్క ఉత్పత్తిని గురించి శ్రుతులు చెప్పటంలేదు. కాబట్టి ఆకాశానికి ఉత్పత్తి లేదు అని కొందరి వాదన. దీనికి కారణం ఏమిటంటే **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు, తన కుమారుడైన శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానం బోధిస్తూ, "శ్వేతకేతూ, సృష్టికి పూర్వం ఈ ప్రపంచం నామరూపాలతో కూడిలేదు. అప్పుడు కేవలము అద్వితీయమైన 'సత్తు' మాత్రమే ఉన్నది. నామరూపాలు, పదార్థాలు ఏవీ లేవు. సత్తు అంటే - ఉనికి, సత్యము అని అర్థము. అన్నిటికన్నా పూర్వమైనది, రెండు కానిది, మొదటగా ఉన్నది ఏకైకమైన పరబ్రహ్మ. ఆ తత్త్వం అనేకం కావాలనుకుంది. రకరకాల రూపాలతో వస్తువులుగా జీవించాలనుకుంది. జీవులుగా రూపుదాల్చింది. ద్రవ ఘన వాయు పదార్థాలుగా మార్పు చెంది, అనేక రూపాలతో సృష్టి ఆకారం పొందింది.

తాను అనేకం కావాలనుకున్న 'సత్తు' ముందుగా అగ్నిని సృష్టించింది. అగ్నినుండి జలము, జలము నుండి పృథివి వచ్చాయి. వీటివల్లనే అన్నం పుట్టింది.

ఈ రకంగా పంచభూతాలలో అగ్ని, జలము, భూమి మూడింటినే చెప్పారు. ఆకాశాన్ని గురించి చెప్పలేదు. కాబట్టి ఆకాశం లేదు అని వారి వాదన.

***సూత్రం - 218 "అస్తితు"***

కాని వేదాలలో ఆకాశానికి ఉత్పత్తి ఉన్నది అని చెప్పబడింది. **తైత్తిరీయోప నిషత్తు**లో "బ్రహ్మను గురించి తెలుసుకున్నవాడు. మోక్షాన్ని పొందుతాడు. అంటే

తానే పరబ్రహ్మ అవుతాడు. **'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ'** దహరాకాశంలో ఉన్న పరబ్రహ్మను తెలుసుకున్నవాడికి బ్రహ్మజ్ఞానంతోబాటు, ఇష్టకామ్యార్ధసిద్ధి కలుగుతుంది. సృష్టికి మూలము బ్రహ్మ. దాని నుంచే ఆకాశం పుట్టింది. అంటే ఆకాశం కూడా బ్రహ్మమే.

| | | |
|---|---|---|
| బ్రహ్మ నుండి | – | ఆకాశము |
| ఆకాశము నుండి | – | వాయువు |
| వాయువు నుండి | – | అగ్ని |
| అగ్ని నుండి | – | జలము |
| జలము నుండి | – | భూమి |

ఈ రకంగా పంచభూతాలు ఉద్భవించాయి.

***సూత్రం – 219 "గౌణ్యసంభవాత్"***

ఆకాశం నిత్యమనే వారి వాదన ఈ విధంగా ఉంటుంది. ఆకాశం సర్వవ్యాపకమైనది. అది నిత్యమైనది. కాబట్టి ఆకాశానికి ఉత్పత్తి లేదు. కణాది మతానుయాయులు (వైశేషికులు) కారణసామాగ్రి లేకపోవటంవల్ల ఆకాశము ఉత్పత్తి జరగదు అంటారు. భూమి, అగ్ని మొదలైన వాటి విషయాల్లో, వీటి ముందు స్థితికీ, తరువాత స్థితికీ తేడా ఉంది. కాని ఆకాశం విషయంలో ఆ తేడా కనిపించదు. మట్టికుండగా మారితే, చాలా తేడా కనిపిస్తుంది కాని ఆకాశం విషయంలో ఆ తేడా కనిపించదు. ఆకాశం చిన్నది కావటం, పెద్దది కావటం, ఛిద్రం కావటం లాంటివి ఏవీ కనిపించటం లేదు. కాబట్టి 'ఆకాశం గగనం శూన్యం' ఆకాశము అంటే శూన్యము తప్ప ఇంకేమీ కాదు.

***సూత్రం – 220 "శబ్దాచ్చ"***

శృతివల్ల కూడా ఆకాశం ఉత్పత్తి చెప్పబడలేదు. **బృహదారణ్యకోపనిషత్తులో** "పంచభూతాలలో పృథివి, జలము, అగ్ని, ఈ మూడు మూర్తములు, స్థూలమైనవి స్థావరమైనవి. నాశనమై పోయేవి. ఇవి చక్షురాది ఇంద్రియాలకు గోచరిస్తాయి. వీటిని నిర్వచించటానికి వీలవుతుంది.

పంచభూతాలలో మిగిలిన రెండూ వాయువు, ఆకాశము అమూర్తాలు. నాశనము లేనివి. నిర్వచించటానికి వీలు కానివి. అమృతములు. చావు పుట్టుక

లేనివి. అలాగే **తైత్తిరీయోపనిషత్తు**లో బ్రహ్మనుంచి ఆకాశము ఉద్భవించింది. అంటే ఆకాశము కూడా బ్రహ్మమే. అని చెప్పబడింది. ఈ రకంగా ఆకాశము పరబ్రహ్మ స్వరూపము అని చెబుతున్నారు.

**సూత్రం - 221 "స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్"**

ఒకే ప్రకరణంలో విషయభేదంవల్ల 'అన్నంబ్రహ్మ' అన్నప్పుడు బ్రహ్మశబ్దం అప్రధానము 'ఆనందోబ్రహ్మ' అన్నప్పుడు బ్రహ్మశబ్దం ముఖ్యము అవుతుంది. అలాగే పరబ్రహ్మ నుండి ఆకాశం పుట్టింది అన్నప్పుడు ఆకాశం అప్రధానం. ఆకాశం నుండి వాయువు పుట్టింది. అన్నప్పుడు ఆకాశం ప్రధానార్థంలో చెప్పబడింది.

**సూత్రం - 222 "ప్రతిజ్ఞాహానిరవ్యతిరేకాచ్ఛబ్దేభ్యః"**

ఉపనిషత్తులు ప్రతిపాదించిన బ్రహ్మముకన్న ఏవీ భిన్నమైనవి కాదు. అందుచేత "ఏ విషయాన్ని గురించి తెలుసుకుంటే, అన్ని విషయాలు పూర్తిగా తెలుస్తాయో దాన్ని గురించి తెలుసుకోవాలి" అనే మాట నిజమవుతుంది.

**తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః**

బ్రహ్మ నుంచి ఆకాశం పుట్టింది. అని **తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పబడింది. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు శ్వేతకేతువుకు "ఏ విషయాన్ని గురించి తెలుసుకుంటే అన్ని విషయాలు తెలుస్తాయో, దాన్ని గురించి తెలుసుకోవాలి" అని చెబుతాడు. అంటే సర్వానికి ఆధారమైనటువంటిది పరబ్రహ్మ. ఆత్మవిద్యకు మించినది ఏదీ లేదు. **ప్రశ్నోపనిషత్తు**లో పిప్పలాదమహర్షి మహాజ్ఞాని, బ్రహ్మవేత్త. ఆయన దగ్గరకు సత్యకాముడు, గార్గ్యుడు మొదలైన ఆరుగురు శిష్యులు వచ్చారు. వారంతా సగుణ బ్రహ్మారాధనలో శ్రేష్టులు. ఇప్పుడు ఆత్మవిద్య కోసం వచ్చారు. ఆత్మవిద్యకు మించినది ఏదీ లేదు. అదే మోక్షవిద్య. అది నేర్చుకోవటానికి పిప్పలాద మహర్షి దగ్గరకు వచ్చారు. ఆకాశం కూడా బ్రహ్మమే బ్రహ్మనుండే ఆకాశం పుట్టింది. కాబట్టి బ్రహ్మను గురించి తెలుసుకుంటే ఆకాశం గురించి తెలుస్తుంది.

**సూత్రం - 223 "యావద్వికారం తు విభాగో లోకవత్"**

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఆకాశం గురించి చెప్పలేదు. కాని ఖండించలేదు. కాబట్టి ఆకాశాన్ని అంగీకరించినట్లే కాబట్టి ఆకాశం ఉత్పత్తి జరిగింది. పంచభూతాలు ఏ

రకంగా ఉత్పత్తి అయినాయి అంటే **తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పినట్లుగానే ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి నీరు, నీటి నుండి భూమి ఉత్పత్తి అయినాయి.

ఆకాశానికి ఉత్పత్తి ఉన్నదనే విషయం అనుమానంతో నిరూపిస్తున్నారు.

## 2. మాతరిశ్వాధికరణము

### (వాయువు ఆకాశం నుంచి పుట్టింది)

రెండవ అధికరణ అయిన **'మాతరిశ్వాధికరణము'**లో వాయువు ఆకాశం నుంచి పుట్టింది అని చెబుతున్నారు. ఇందులో ఒకే సూత్రం ఉంది.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఆకాశము వాయువులను చెప్పలేదు. తేజస్సును మాత్రమే చెప్పటం జరిగింది. అందుచేత ఇందాక చెప్పినట్లుగానే వాయువుకు ఉత్పత్తి లేదు అంటారు.

***సూత్రం - 224 "ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః"***

ఆకాశానికి ఉత్పత్తి ఉన్నది అని చెప్పటంవల్ల వాయువుకు కూడా ఉత్పత్తి చెప్పినట్లే.

**తైత్తిరీయోపనిషత్తు**లో బ్రహ్మనుండి ఆకాశము, **ఆకాశాద్వాయుః** ఆకాశము నుండి - వాయువు ఉద్భవించాయని చెప్పబడింది కాబట్టి వాయువుకు ఉత్పత్తి ఉన్నది. అంటూ రెండవ అధికరణ పూర్తి చేశారు.

## 3. అసంభవాధికరణము (బ్రహ్మకు పుట్టుకలేదు)

బ్రహ్మకు మాత్రం పుట్టుక లేదని మూడవ అధికరణ అయిన **'అసంభవాధి కరణము'**లో చెబుతున్నారు. ఇందులో ఒకే సూత్రం ఉంది.

"ఆకాశానికి ఉత్పత్తి అసంభవం అన్నారు. మరి అసంభమయిన ఆకాశం నుంచి వాయువు ఉద్భవిస్తున్నది అన్నారు కదా. అలాగే బ్రహ్మకు కూడా వేరొక బ్రహ్మతో ఉత్పత్తి చెప్పకూడదా?" అనేది ప్రశ్న. దీనికి సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 225 "అసంభవస్తు సతోనుపపత్తేః"***

సృష్టికి ముందు ఉన్నది ఒక్కటే అదే సత్తు. అదే బ్రహ్మ. నిత్యమైనది. శాశ్వతమైనది. జరామరణములు లేనటువంటిది. ఆధ్యంతములు లేనట్టిది. జన్మమృత్యువులు లేనట్టిది.

బ్రహ్మముకు జన్మము లేదు. అది శాశ్వతమైనది. మరి అలాంటి శాశ్వతమైన బ్రహ్మకు ఉత్పత్తి ఎక్కడుంటుంది. అన్నింటికీ అనాది అయిన బ్రహ్మ ఇంకొక బ్రహ్మ నుంచి పుట్టదు. బ్రహ్మతో సమానమైన వారు కాని, అంతకన్నా ఎక్కువ అయిన వారు గాని ఇంకెవరూ లేరు. అన్నిటికీ ఆధారము ఆ పరబ్రహ్మమే కాబట్టి దానికి ఉత్పత్తి లేదు. అంటూ మూడవ అధికరణ పూర్తి చేశారు.

## 4. తేజోధికరణము (వాయువు నుంచి అగ్ని పుట్టింది)

నాల్గవ అధికరణలో అగ్ని వాయువు నుంచి పుట్టింది అని చెబుతున్నారు. దీని పేరు **'తేజోధికరణ'** ఇందులో ఒక సూత్రమే ఉంది.

**"ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానం వివరిస్తూ పరబ్రహ్మ అగ్నిని సృష్టించింది అన్నాడు అలాగే **తైత్తిరీయోపనిషత్తు**లో వాయువు నుంచి అగ్ని పుట్టింది అన్నారు. మరి వాయువుకు ఉపాదాన కారణం ఏమిటి?"

**వాయోరగ్నిః**

***సూత్రం - 226 "తేజోతస్తథాహ్యాహ"***

తేజస్సు అంటే అగ్ని, అది వాయువు నుంచే పుడుతోంది. అంతేకాని బ్రహ్మము నుంచి పుట్టటం లేదు. అయితే ఛాందోగ్యంలో చెప్పింది తప్పు కాదు. బ్రహ్మ నుండి ఆకాశం పుట్టింది. అంటే ఆకాశము బ్రహ్మమే. ఆకాశబ్రహ్మ నుంచి వాయువు పుట్టింది. అంటే వాయువు బ్రహ్మమే. వాయు బ్రహ్మనుంచి అగ్ని పుట్టింది. అంటే అగ్నికూడా బ్రహ్మమే. ఈ రకంగా పంచభూతాలు పరబ్రహ్మ స్వరూపాలే. ఇక్కడ బ్రహ్మ నుంచి అగ్ని పుట్టింది అంటే వాయుబ్రహ్మ నుంచి అగ్ని పుట్టింది అని అర్థం.

## 5. ఆపదధికరణము (అగ్ని నుంచి జలం పుట్టింది)

అగ్ని నుంచి జలం పుట్టిందనే విషయాన్ని ఐదవ అధికరణ అయిన **'అబదధికరణ'**లో చెబుతున్నారు. ఇందులో ఒకే సూత్రం ఉంది.

**ఛాందోగ్యోపనిషత్తు**లో బ్రహ్మ నుండి జలము పుట్టినట్లు చెప్పారు. **తైత్తిరీయోపనిషత్తు**లో అగ్ని నుండి జలము పుట్టింది అన్నారు కదా! మరి జలానికి ఉపాదాన కారణమేది?"

*సూత్రం - 227 "ఆపః"*

ఇందాక వాయువు నుంచి అగ్ని పుట్టినట్లుగానే, **అగ్నిర్ ఆపః** అగ్ని నుంచి జలము పుట్టింది. ఇక్కడ అగ్నికూడా బ్రహ్మమే అనే మాట గుర్తించాలి. అగ్ని బ్రహ్మ నుంచి జలబ్రహ్మ పుట్టింది.

## 6. పృథివ్యధికరణము (జలం నుంచి భూమి పుట్టింది)

జలం నుంచి భూమి పుట్టిందనే విషయం ఆరవదైన **'పృథివ్యాధికారాధికరణము'** లో వివరించారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

*సూత్రం - 228 "పృథివ్యధికారరూపశబ్దాన్తరేభ్యః"*

**తైత్తిరీయోపనిషత్తులో 'ఆపఃపృథివీ'** జలం నుంచి భూమి వచ్చింది అన్నారు. ఛాందోగ్యోపనిషత్తులో కూడా జలము బ్రహ్మమే. జలబ్రహ్మ నుంచి పృథివీబ్రహ్మ ఆవిర్భవించింది. ఈ రకంగా **పంచభూతాలు పరబ్రహ్మ అంటే పరాశక్తి స్వరూపాలే.**

## 7. తదభిధ్యానాధికరణము (బ్రహ్మమే అన్నింటినీ సృష్టించింది)

అన్ని కార్యాలకు కారణం బ్రహ్మ. అంతేకాని వేరు కాదు. బ్రహ్మమే అన్నింటినీ సృష్టించింది అని ఏడవదైన **'తదభిధ్యానాధికరణము'**లో చెబుతున్నారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

ఆకాశము మొదలైన పంచభూతాలు సృష్టించబడ్డాయి. అయితే జగత్తులోని నదులు, సముద్రాలు, కొండలు, పర్వతాలు, అడవులు. వీటన్నింటినీ పంచభూతాలే

సృష్టిస్తున్నాయా? లేక పరబ్రహ్మే సృష్టిస్తున్నాడా? అంటూ అనుమానాన్ని వ్యక్తం చేస్తున్నారు. దీనికి సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 229 "తదభిధ్యానాదేవ తు తల్లిఙ్గాత్సః"***

సర్వకార్యాలకు కర్త పరమేశ్వరుడే తప్ప పంచభూతాలు కావు. అసలు ఈ భూతాలకు ఆ శక్తి కూడా లేదు. ఈ వస్తువులను సృష్టించాలనే పరమేశ్వరుని కోరిక వల్లనే ఈ సృష్టి జరుగుతున్నది. **బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు చెబుతాడు. ఆకాశంలో ఉంటాడు. ఆకాశం అతన్నెరగదు. ఆకాశమే అతని శరీరం. ఆకాశంలో ఉంటూనే ఆకాశాన్ని నియంత్రిస్తాడు. అతడే సర్వాంతర్యామి అయిన ఆత్మ.

వాయువులో ఉంటాడు. వాయువు అతణ్ణెరగదు. వాయువే అతని శరీరం. వాయువులో ఉంటూనే వాయువును నియంత్రిస్తాడు. అతడే సర్వాంతర్యామి అయిన ఆత్మ.

అగ్నిలో ఉంటాడు. అగ్ని అతణ్ణెరగదు. అగ్నే అతని శరీరము అగ్నిలో ఉంటూనే అగ్నిని నియంత్రిస్తాడు. అతడే సర్వాంతర్యామి అయిన ఆత్మ.

జలంలో ఉంటాడు. జలం అతణ్ణెరగదు. జలమే అతని శరీరం. జలంలో ఉంటూనే జలాన్ని నియంత్రిస్తాడు. అతడే సర్వాంతర్యామి అయిన ఆత్మ.

భూమిలో ఉంటాడు. భూమి అతణ్ణెరగదు. భూమే అతని శరీరం. భూమిలో ఉంటూనే భూమిని నియంత్రిస్తాడు. అతడే సర్వాంతర్యామి అయిన ఆత్మ.

సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలలో ఉంటాడు. అవేవీ అతణ్ణెరగవు. అవే అతడి శరీరం. వాటిలో ఉంటూనే వాటిని నియంత్రిస్తాడు. అతడే సర్వాంతర్యామి అయిన ఆత్మ.

ఈ విధంగా అతడు పంచభూతాలలోనూ, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు. ఒకటేమిటి అన్నిచోట్లా ఉంటూ అన్నింటినీ నియంత్రిస్తాడు. కాబట్టి సృష్టి అంతా పరమేశ్వర కృతమే. బ్రహ్మమే అన్నింటినీ సృష్టించింది.

## 8. విపర్యాధికరణము (బ్రహ్మ యందే అన్నీ లయమవుతాయి)

బ్రహ్మ నుంచి పుట్టినవన్నీ బ్రహ్మ యందే లయమవుతున్నాయి అని ఎనిమిదవ అధికరణ అయిన **'విపర్యాధికరణ'**లో వివరిస్తున్నారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

ఇంతవరకూ సృష్టి ఎలా జరిగింది? పంచభూతాలు ఏ రకంగా సృష్టించ బడ్డాయి? అనేది చెప్పారు. మరి లయం ఏ రకంగా జరుగుతుంది? ఏ రకంగా సృష్టి జరిగిందో, ఆ రకంగానే లయం కూడా జరుగుతోందా లేక ఇంకా ఏ విధంగానైనా జరుగుతుందా? ఈ విషయం వివరిస్తున్నారు.

***సూత్రం - 230 "విపర్యయేణ తు క్రమోత ఉపపద్యతే చ"***

కారణంలోనే కార్యం లయమవుతుంది. కాబట్టి సృష్టి జరిగిన విధానానికి వ్యతిరేకంగా లయం జరుగుతుంది.

అంటే లయం జరిగేటప్పుడు మొదటగా

| | | |
|---|---|---|
| భూమి | – | జలంలో కలిసిపోతుంది |
| జలం | – | అగ్నిలో కలిసిపోతుంది |
| అగ్ని | – | వాయువులో లీనమై పోతుంది |
| వాయువు | – | ఆకాశంలో లీనమై పోతుంది |
| ఆకాశం | – | పరబ్రహ్మలో లీనమై పోతుంది |

ఇదే వ్యతిరేక దశ. ఈ దిశగానే లయం జరుగుతుంది.

జగత్తులో అన్నీ బ్రహ్మమందే ఆ పరాశక్తి యందే లయమవుతాయి.

## 9. అంతర్విజ్ఞానాధికరణము

### (ఇంద్రియాలవల్ల భూతాల సృష్టిలయాలకు భంగం లేదు)

ఇంద్రియాలు భూతాలు వేరు వేరు కాదు. ఈ రెండూ ఒకటే. అని తొమ్మిదవదైన **'అంతరావిజ్ఞాధికరణము'**లో వివరించారు. ఇందులో ఒకటే సూత్రం ఉంది.

"ఆత్మకీ, భూతాలకీ మధ్యన ఇంద్రియాలున్నాయి కదా! మరి వీటి మాటేమిటి?"

*సూత్రం - 231 "అన్తరావిజ్ఞానమనపీ క్రమేణ తల్లిఙ్గాది తి చేన్నా విశేషాత్"*

ఆత్మకూ, భూతసృష్టికీ మధ్య వరుసగా విజ్ఞానము, ఇంద్రియాలు, మనస్సు, అనేవి ఉన్నాయి. ఇంద్రియాలకు భూతాలకు పెద్దగా తేడా ఏమీ లేదు.

విజ్ఞానము అంటే బుద్ధి, ఇంద్రియాలే ప్రాణాలు. మనస్సు అంటే సంకల్ప వికల్పాలకు నిలయమైనది. విజ్ఞానము, మనస్సు అనేవి ఆత్మకు, ఆకాశానికి మధ్యన పుడుతున్నాయి. **కఠోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఇంద్రియాలు గుర్రాలు. మనస్సు సారధి. మంచి సారధి చేతిలోని ఉత్తమాశ్వాలులాగా ఇంద్రియాలు మన అధీనంలో ఉండాలి. భూతాలయొక్క ఉత్పత్తివల్లనే భౌతికమైన ఇంద్రియాల ఉత్పత్తికూడా తెలుస్తోంది. అందుచేతనే వేరుగా చెప్పలేదు.

భూతాల స్వరూపాలు ఇంద్రియాలు. **ఐతరేయోపనిషత్తు**లో సృష్టిని గురించి చెబుతూ, పరమాత్మ విరాట్స్వరూపాన్ని దృష్టిలో ఉంచుకుని తీవ్రమైన ఆలోచన చేశాడు. అదే తపస్సు దాని ఫలితంగా ఆ స్వరూపానికి నోరు వచ్చింది. నోటి నుంచి వాక్కు వచ్చింది. వాక్కుకు అభిమాన దేవత అగ్ని అంటూ ఇంద్రియాలకు అభిమాన దేవతలను వివరించారు.

నోరు-అగ్ని, ముక్కు-వాయువు, కన్ను-సూర్యుడు, చెవులు-దిక్కులు, మనస్సు-చంద్రుడు, జననేంద్రియము-జలము (వీర్యము), ఈ రకంగా భూతాలు ఇంద్రియాలు ఒకటే కాబట్టి, ఇంద్రియాల గురించి వేరుగా చెప్పలేదు. చెప్పనవసరం లేదు.

# 10. చరాచరవ్యపాతయాధికరణము

## (జీవునికి ఉత్పత్తి లయం నిజం కాదు)

జీవుల పుట్టుక, మరణము ఇవేవీ నిజం కాదు. ఈ విషయం పదవదైన **'చరాచరవ్యపాశ్రయాధికరణము'**లో చెబుతున్నారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

ఇంతవరకు భూతాలు, ఇంద్రియాలు వాటి పుట్టుక, లయము గురించి చెప్పారు. మరి జీవుడి మాటేమిటి? జీవుడికి కూడా చావుపుట్టుకలున్నాయా?

ఫలానా సత్యవర్ధనుడు పుట్టాడు. జయవర్ధనుడు మరణించాడు. అంటే జీవి పుట్టింది, జీవి మరణించింది అంటున్నాము కదా!" అంటే జీవికి చావు, పుట్టుక ఉన్నట్లే కదా?

*సూత్రం-232 "చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్తద్వ్య పదే దేశో భాక్తస్తద్భావభావిత్వాత్"*

జీవుడికి జననమరణాలు లేవు. కాని అవి ఉన్నాయి అని చెప్పటం కేవలము అతని శరీరాన్ని బట్టే. వీటితో జీవుడికి సంబంధం లేదు. జీవుడు శరీరంలో ప్రవేశిస్తే అతడు పుట్టాడు అంటున్నాము. ఆ శరీరాన్ని వదిలిపెడితే మరణించాడు అంటున్నాము. ఇది ఎందుకు జరుగుతుంది? కర్మఫలితాన్ని అనుభవించటానికి. కర్మఫలితం అనుభవించటానికే మాసిన వస్త్రాన్ని వదలి ఏ విధంగా మనం కొత్త వస్త్రము ధరిస్తామో, అలాగే జీర్ణమైన ఈ దేహాన్ని వదలి ఈ జీవి ఇంకొక దేహంలో ప్రవేశిస్తుంది. జీవుడు వేరు, బ్రహ్మ వేరు కాదు. ఇద్దరూ ఒకటే. అయితే అజ్ఞానంతో తాను వేరు, బ్రహ్మ వేరు అనుకుంటుంది. **ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఒకే వృక్షము మీద రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి. అందులో ఒకటి తన కర్మలవల్ల వచ్చిన ఫలితాలను అనుభవిస్తున్నది. రెండవది నిర్వికారంగా చూస్తోంది. వీటిలో మొదటిది జీవాత్మ. రెండవది పరమాత్మ వారిద్దరికీ భేదం లేదు. అజ్ఞానం తొలగిపోతే జీవాత్మ పరమాత్మలో లీనమై పోతుంది. కాబట్టి జీవుడికి చావుపుట్టుకలు లేవు. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఈ జీవరాశిని సృష్టించిన తరువాత, పరమేశ్వరుడు తానుకూడా ఇందులో ప్రవేశించాలి అనుకున్నాడు. శరీరంలో ప్రవేశించాడు. కాబట్టి జీవికి చావుపుట్టుకలు లేవు అంటూ పదవ అధికరణ పూర్తి చేశారు.

## 11. ఆత్మాధికరణము (జీవుడికి జనన మరణాలు లేవు)

ఈ విషయం పదకొండవదైన **'ఆత్మాధికరణము'**లో చెబుతున్నారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

శరీరంలో ఉండేది జీవాత్మ. పంచభూతాలు ఉత్పత్తి అయినట్లుగానే ఈ జీవాత్మ కూడా ఉత్పత్తి అవుతున్నదా? అనేది ప్రశ్న. దీనికి సమాధానం.

*సూత్రం - 233 "నాత్మాశ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః"*

జీవుడు పుట్టటము అనేది లేదు. అతడు నిత్యుడు. **బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి బ్రహ్మోపదేశం చేస్తూ, "తడిసిన కట్టెను నిప్పులో వేసినట్లైతే రకరకాల పొగలు వస్తాయి. తరువాత రవ్వలు వస్తాయి. ఈ రవ్వలు అగ్నికన్న వేరైనవి కావు. అలాగే వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, మంత్రాలు, కళలు,

సూత్రాలు ఇవన్నీ పరమాత్మ యొక్క స్వరూపాలు. రవ్వలు, జ్వాలలు రావటానికి ముందు అంతా అగ్నిమయమే. అలాగే నామరూపాత్మక స్థితికి ముందు జగత్తంతా ప్రజ్ఞానఘనుని స్వరూపమే" అంటాడు. కాలుతున్న కట్టె నుండి రవ్వలు ఏ రకంగా పుడుతున్నాయో. అదే విధంగా పరమాత్మ నుంచి జీవాత్మలు వచ్చి మళ్ళీ అందులోనే కలిసి పోతున్నాయి. **కఠోపనిషత్తు**లో "ఆత్మకు చావులేదు. ఆత్మ స్వయంభువు నాశరహితమైనది. శరీరం మరణించినా ఆత్మ మరణించదు. ఆత్మ చంపేదీ, చంపబడేదీ కాదు. సూక్ష్మమైన వాటికన్న సూక్ష్మమైనది. పెద్దవైన వాటికన్న ఇంకా పెద్దది" అన్నారు. **ఐతరేయోపనిషత్తు**లో 'మానవ శరీరాన్ని సృష్టించిన తరువాత, అందులో ప్రవేశించాలి అనుకున్నాడు. బ్రహ్మరంధ్రం ద్వారా మానవ శరీరంలో పరమాత్మ ప్రవేశించాడు' అని చెప్పబడింది.

ఈ విధంగా చూసినట్లైతే జీవాత్మ పరమాత్మా వేరుకాదు. ఒకటే. పరమేశ్వరుడు మానవుణ్ణి సృష్టించి, బ్రహ్మరంధ్రం గుండా మానవదేహంలో ప్రవేశించాడు. కాబట్టి అందరిలోనూ ఉన్నవాడు పరమేశ్వరుడే. కర్మఫలం అనుభవించిన తరువాత ఈ శరీరాన్ని విడిచి ఇంకొక శరీరంలోకి ప్రవేశిస్తున్నాడు. అంతేకాని జీవికి చావుపుట్టుకలు లేవు. అవి కేవలము శరీరానికి మాత్రమే. **ముండకోపనిషత్తు**లో శౌనకునకు అంగిరసుడు బ్రహ్మతత్త్వాన్ని వివరిస్తూ,

**ఓం తదేతత్సత్యం-యదాసుదీప్తాత్ పావకాత్విస్ఫులింగాః సహస్రశః ప్రభవన్తే। సరూపాః, తథాఽక్షరాద్వివిధాః సోమ్యభావాః ప్రజాయన్తే తత్రచైవాపియన్తి ॥**

"శౌనకా, ప్రజ్వరిల్లిన అగ్ని నుండి అదే విధమైన ఆకారము, గుణముగల వేలకొలది నిప్పురవ్వలు వెలువడుతున్నట్లే, పరబ్రహ్మ నుండి అనేకమైన శరీరాలు రూపాలు వెలువడి మళ్ళీ అందులోనే లీనమవుతున్నాయి. అంటే ఆత్మకు చావు, పుట్టుకలున్నాయని కాదు. ఆత్మ శాశ్వతమైనది. ఇది పరమేశ్వర స్వరూపము. అంటూ తృతీయ ముండకంలో ఒకే రూపము పేరు గలిగిన రెండు పక్షులు ఒక చెట్టును ఆశ్రయించి ఉన్నాయి. ఈ రెండింటిలోను ఒకటి జీవాత్మ, రెండవది పరమాత్మ. ఈ రెండూ వేరు కాదు. కేవలం అజ్ఞానంవల్ల అవి వేరు వేరుగా అనుకుంటున్నాం. జ్ఞానోదయం గలిగిన మరు క్షణమే జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. అంతేగాని జీవునికి చావుపుట్టకలు లేవు అంటూ పదకొండవ అధికరణ పూర్తిచేశారు.

## 12. జ్ఞానాధికరణము (జీవి నిత్యజ్ఞాన స్వరూపుడు)

ఈ విషయం పన్నెండవదైన **'జ్ఞానాధికరణము'**లో చెప్పారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

ఆత్మ నిత్యము, సత్యము అన్నారు కదా ! నిద్రించే స్థితిలో ఆత్మ చేతనంగా ఉండటంలేదు. అలాంటప్పుడు ఆత్మచేతనమా? లేక కొన్నిసార్లు అచేతనం కూడానా?

***సూత్రం – 234 "జ్ఞోత ఏవ"***

జీవుడు నిత్యుడు కాబట్టే చైతన్య స్వరూపుడు. జీవికి పుట్టక లేదు. పరమాత్మ స్వరూపమే జీవుడు. నిత్యజ్ఞానస్వరూపుడు. అయితే శరీరంతో సంబంధం ఏర్పడటంవల్ల అజ్ఞానిగా కనిపిస్తున్నాడు. అతడు నిద్రించడు. సర్వత్రా వ్యాపించి ఉంటాడు. **బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు ఉద్దాలకునికి అంతర్యామి అయిన ఆత్మను గురించి వివరిస్తూ, అగ్నిలో ఉంటాడు. అగ్ని అతన్నెరగదు. అగ్నే అతని శరీరం. అగ్నిలో ఉంటూనే అగ్నిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి అయిన నీ ఆత్మ. అంటూ ఆత్మయొక్క సర్వవ్యాపకత్వాన్ని, చైతన్యరూపాన్ని వివరిస్తాడు. కాబట్టి ఆత్మచలనము గలది. నిత్యచైతన్య స్వరూపమైనది.

## 13. ఉత్క్రాంతిగత్యధికరణము (జీవుని పరిమాణ విమర్శ)

జీవియొక్క పరిమాణము ఎంత? అనే విషయం పదమూడవ అధికరణ అయిన **'ఉత్క్రాంతిగత్యధికరణము'**లో వివరిస్తున్నారు. ఇందులో పద్నాలుగు సూత్రాలున్నాయి.

ఆత్మచలనము గలది అన్నాము. జీవునికి జనన మరణాలు లేవు అన్నాము. అతడు నిత్యజ్ఞానస్వరూపుడు అన్నాము. అసలు జీవుని పరిమాణము ఏమిటి? అతడు అణుపరిమాణుడా? మహత్పరిమాణుడా? లేక మధ్య పరిమాణుడా? ఏ విధంగా ఉంటాడు? అనేది అనుమానం దీనికి సమాధానంగా జీవుని పరిమాణము వివరించటం మొదలుపెట్టారు.

***సూత్రం – 235 "ఉత్క్రాన్తిగత్యాగతీనామ్"***

మరణ కాలంలో జీవి యొక్క ప్రాణాలు శరీరం నుండి ఉత్క్రమిస్తాయి కాబట్టి జీవుడు అణుపరిమాణుడు.

మరణకాలం ఆసన్నమయింది. ముందుగా మానవుడి కర్మేంద్రియాలు పని చెయ్యటం మానివేస్తాయి. ఆ తరువాత జ్ఞానేంద్రియాలు పనిచెయ్యవు. ఇవన్నీ మనసును ఆశ్రయిస్తాయి. ఆ మనసు జీవుణ్ణి ఆశ్రయిస్తుంది. అప్పుడు మానవుడి శరీరంలోని జీవుడు ప్రయాణానికి సిద్ధం అవుతాడు. శరీరంలోని 72000 నాడీమండలము అతని ప్రయాణానికి మార్గాలే. ఈ నాడీమండలమంతా శరీరంలోని నవరంధ్రాలలోనూ ఏదో ఒక రంధ్రంతో కలుపబడి ఉంటుంది. కాబట్టి మానవుని ప్రాణాలు నవరంధ్రాలలోను ఏదో ఒక రంధ్రం గుండా బయటకు పోతాయి. దీనిన్నే **'ఉత్క్రమణ'** అంటారు. అయితే సాధకుని యొక్క ప్రాణములు ఉత్క్రమించవు. అవి బ్రహ్మరంధ్రం గుండా బయటకుపోయి పరమాత్మలో లీనమవుతాయి.

**బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పినట్లుగా "ఇంద్రియాలతో కూడినట్టి, అవిద్యాజన్యమైనట్టి ఈ దేహం వృద్ధాప్యం కారణంగా కృశించిపోతుంది. అప్పుడు చెట్టునుండి పండు రాలిపోయినట్లుగా శరీరంలోని పురుషుడు, ఈ అవయవాలను వదిలించుకుని కర్మానుసారము మరొక యోనిలో జన్మించటం కోసం వెళ్ళిపోతాడు. ప్రాణము, అవయవాలు ఉంటేనేగాని కర్మఫలాన్ని అనుభవించలేడు. అందుకని ఇంకొక శరీరం చేరతాడు. వేరొక శరీరాన్ని పొందటానికి వచ్చే ఆత్మని చూసి సమస్తభూతాలు 'ఇదిగో పరమాత్మ వస్తున్నాడు' అంటూ సభాస్థలి చేరే రాజుగారి కోసం ఎదురుచూసే సేవకులులాగా ఎదురు చూస్తుంటాయి. ఎగశ్వాస ప్రారంభం కాగానే చివరిదశలో ప్రాణాలు, ఇంద్రియాలు, ఆత్మకు ముందుగా నడుస్తూ పోతాయి." కాబట్టి జీవుడు అణుపరిమాణుడు.

***సూత్రం - 236 "స్వాత్మనా చోత్తరయోః"***

ఉత్క్రమణ జరిగిన తరువాత జరిగే గమనం, ఆగమనం అనేవి జీవాత్మతో సంబంధం కలిగి ఉన్నందున జీవుడు అణుపరిమాణం కలవాడు అనాలి.

ఇప్పటిదాకా చెప్పిన ఉత్క్రమణ, గమనము, ఆగమనము అనేవి పరిమితమైన పరిమాణం గల వాడికి మాత్రమే ఉంటాయి. అందుకే జీవుడు అణుస్వరూపుడు.

***సూత్రం - 237 "నాణురతచ్ఛ్రుతేరితి చేన్నేతరా ధికారాత్"***

జీవి సర్వవ్యాపి కాబట్టి అణుపరిమాణుడు కాదు అని వారి వాదన. అది నిజం కాదు. ప్రాణాల్లో ఉన్న విజ్ఞానమయుడే మహత్పరిమాణం గల అజుడైన ఆత్మ. కాబట్టి జీవుడు అణుపరిమాణుడే.

***సూత్రం – 238 “స్వశబ్దోన్మానాభ్యాం చ”***

జీవుడికి అణుత్వం చెప్పే వాక్యాల వల్ల, పరిమాణ నిర్దేశంచేత కూడా జీవుడు అణుపరిమాణుడే. **ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా “ఆత్మసూక్ష్మరూపంలో మన శరీరంలోనే ఉన్నది. ఆత్మసాక్షాత్కారానికి చిత్తశుద్ధి అవసరం. విశుద్ధమైన అంతః కరణ గల ఆత్మజ్ఞాని కోరుకున్నవి పొందగలుగుతాడు. అతడి పునర్జన్మ ఉండదు. **శ్వేతాశ్వతరోపనిషత్తులో**

**వాలాగ్రశతభాగశ్య శతధా కల్పితస్య చ**
**భాగోజీవస్సవిజ్ఞేయ సచానంత్యాయ కల్పతే ॥**

“ఒక వెంట్రుకను నూరు భాగాలుగా చేస్తే, అందులో ఒక భాగమంత ఉంటుంది జీవాత్మ” అని చెప్పబడింది. అందుచేతనే ఆత్మ అణుపరిమాణం గలది.

***సూత్రం – 239 “అవిరోధశ్చన్దనవత్”***

జీవుడు అణుపరిమాణంలో శరీరంలో ఎక్కడో ఉంటే, చల్లదనంగాని, వేడిగాని ఆ ప్రాంతానికే తగలాలి. అంతేగాని శరీరం అంతా ఏ విధంగా వ్యాపిస్తుంది? అని వీరి వాదన. అది సరికాదు. ఎందుచేతనంటే మంచి గంధపు చుక్క శరీరానికి ఎక్కడ రాచుకున్నప్పటికీ శరీరమంతా సుగంధం వ్యాపిస్తుంది. అలాగే జీవుడు అణురూపంలో శరీరంలో ఎక్కడ ఉన్నప్పటికీ శరీరమంతా వ్యాపించే ఉంటాడు. జీవుడు ఒకచోటనే ఉన్నప్పటికీ శరీరమంతా వ్యాపించి సుఖదుఃఖాలు అనుభవిస్తుంటాడు.

***సూత్రం – 240 “అవస్థితివైశేష్యాదితి చేన్నాభ్యుపగ మాద్ధృహి”***

గంధపుచుక్క శరీరానికి రాచుకున్నప్పుడు అది ఎక్కడో ఒకచోట కనిపిస్తుంది. అలా జీవుణ్ణి శరీరంలో ఎక్కడా మనం చూడటం లేదు కదా! అనే అనుమానానికి సమాధానం చెబుతున్నారు.

జీవుడు శరీరంలో ఫలానాచోట ఉన్నాడనటానికి వీలులేదు. కాబట్టి జీవుడు అణురూపుడు కాదు అనటం సరికాదు. ఈ ఆత్మ హృదయస్థానంలో ఉన్నది.

***సూత్రం - 241 "గుణాద్వా లోకవత్"***

జీవుడు అణుపరిమాణం గలవాడు. కాని చైతన్యము గలవాడు కాబట్టి శరీరమంతా వ్యాపించి ఉంటాడు. దీపం గూట్లోనే ఉన్నప్పటికీ ఇల్లంతా కాంతులు ప్రసరింపచేస్తుంది. అలాగే ఆత్మ అణురూపంలో ఉన్నప్పటికీ శరీరమంతా వ్యాపించి ఉంటుంది. గుణిని విడిచి గుణము వ్యాపించటము సంభవము కాదు కదా!"

***సూత్రం - 242 "వ్యతిరేకో గన్ధవత్"***

వస్త్రానికి ఉన్న ఎరుపు, తెలుపు రంగులు ఆ వస్త్రాన్ని వదిలి ఇంకొక చోట ఉండవు. అలాగే దేహంలో ఒకచోట ఉండే ఆత్మ, శరీరమంతా వ్యాపించటం సంభవం కాదు అన్న వాదన ఉన్నది. కాని వాసన అనేది పూవుయొక్క గుణము. ఆ వాసన ఈ పూవు వరకే కాకుండా ఇతర పూవులకు కూడా ఏ విధంగా వ్యాపిస్తుందో, అలాగే ఆత్మకూడా ఉన్నచోటనే కాకుండా దేహమంతా వ్యాపించి ఉంటుంది.

***సూత్రం - 243 "తథా చ దర్శయతి"***

అణుపరిమాణుడైన జీవుడు తన చైతన్య గుణంవల్ల దేహమంతా వ్యాపించి ఉన్నాడని శ్రుతులు చెబుతున్నాయి.

***సూత్రం - 244 "పృథగుపదేశాత్"***

జీవుడు వేరు, అతని చైతన్య గుణం వేరు  అని శ్రుతులు చెబుతున్నాయి. కాబట్టి జీవుడు అణుపరిమాణుడు అనటంలో తప్పు లేదు.

కాని అణురూపుడైన జీవుడు సమస్త శరీరంలో వ్యాపించి ఉన్నాడు కాబట్టి జీవుడికి సర్వవ్యాపకత్వం చెప్పనవసరం లేదు అంటారు.

***సూత్రం - 245 "తద్గుణసార్వత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్"***

పరబ్రహ్మలాగానే జీవుడు కూడా అల్పపరిమాణం గలవాడని చెప్పరాదు.

పరబ్రహ్మకు కర్తృత్వము, భోక్తృత్వము లేవు. కాని బుద్ధి, గుణాలవల్ల కర్తృత్వ భోక్తృత్వాలు చెప్పబడుతున్నాయి. జీవాత్మకు పరమాత్మకు తేడాలేదు. రెండూ ఒక్కటే. పరబ్రహ్మ స్వరూపమెంత ఉంటుందో, ఆత్మస్వరూపం కూడా అంతే ఉంటుంది.

*సూత్రం – 246 "యావదాత్మభావిత్వాచ్చ న దోషస్తదర్శనాత్"*

బుద్ధి సంయోగమనేది ఆత్మజ్ఞానంవల్ల సంసారనివృత్తి జరిగే వరకు ఉంటుంది. శరీర వియోగం జరిగిన పిమ్మట కూడా బుద్ధి సంయోగముంటుందని శ్రుతులు చెబుతున్నాయి.

*సూత్రం – 247 "పుంస్త్వాదివత్త్వస్య సతోఽభివ్యక్తి యోగాత్"*

బాల్యంలో కూడా ఉండే పుంసాదులు, యవ్వనంలో మాత్రమే బహిర్గతమవుతున్నట్లుగా సూక్ష్మరూపంలో ఉండే ఈ బుద్ధి సంయోగం జాగ్రదాది అవస్థలలో పైకి కనిపిస్తుంది.

*సూత్రం – 248 "నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసజ్గో న్యతర నియమో వాన్యథా"*

బుద్ధి లేదా అంతఃకరణమనేది ఆత్మకు ఉపాధి. దానికి అస్తిత్వం ఉన్నదని అంగీకరించాలి. లేకపోతే నిత్యోపలబ్ధి ప్రసంగం లేదా నిత్యానుపలబ్ధి ప్రసంగం ఏర్పడుతుంది.

ఉపలబ్ధి అంటే సాక్షాత్కారం. ఆత్మ ఇంద్రియ విషయాలు అనే వీటి సాన్నిధ్యమే జ్ఞానసాక్షాత్కారానికి సాధనాలు. ఇవి ఉన్నప్పటికీ ఒక్కొక్కప్పుడు జ్ఞానోపలబ్ధి కలగవచ్చు. కలగకపోవచ్చును.

## 14. కర్త్రధికరణము (జీవుడే కర్త)

తాను చేసే క్రతువులన్నింటికీ జీవుడే కర్త అని పద్నాల్గవ అధికరణ అయిన **'కర్త్రధికరణము'**లో వివరించారు. ఇందులో ఏడు సూత్రాలున్నాయి.

శ్రుతులలో ఆత్మకు కోరికలుండవని, పక్షపాతము ఉండదని, కర్మలు చేయదని, కర్మఫలం కూడా ఉండదని చెప్పబడింది. కాని కర్మలు చెయ్యాలి. అంటే యాగాలు, హోమాలు, క్రతువులు చెయ్యాలి. అని కూడా చెప్పబడింది. ఈ వైరుధ్యం ఏమిటి?"

*సూత్రం – 249 "కర్తా శాస్త్రార్థవత్త్వాత్"*

శాస్త్రము అర్ధవంతం కావాలంటే జీవుడు కర్త అని చెప్పాలి.

కర్త లేకపోతే కర్మచేసే వారుండరు. కర్త లేకపోతే కర్మను ఎవరికి ఉపదేశించాలి? కాబట్టి కర్త అనేవాడు ఒకడు ఉండి తీరాలి. మరి ఆ కర్త ఎవరు? ఆత్మయే కర్త, బుద్ధి కర్త కాదు. అన్నీ ఆత్మే. ఆత్మే చూచేది. ఆత్మే వినేది. ఆత్మే ఆలోచించేది. అందుకే ఈ కనులకు చూసే శక్తిని ప్రసాదించేదే ఆత్మ. చెవులకు వినికిడి శక్తిని ప్రసాదించేదే ఆత్మ. మనసుకు ఆలోచనాశక్తిని ప్రసాదించేదే ఆత్మ.

***సూత్రం - 250 "విహారోపదేశాత్"***

జీవుడు కర్త అని చెప్పారు. ఎందుచేతనంటే అతనికి విహారమున్నది. తన ఇష్టం వచ్చిన చోటికి పోతాడు. శరీరంలో స్వేచ్ఛగా విహరిస్తాడు.

***సూత్రం - 251 "ఉపాదానాత్"***

గ్రహించటంవల్ల కూడా జీవుడే కర్త అని చెప్పాలి. ఇంద్రియాల ద్వారా గ్రహించేవాడు జీవుడు. **బృహదారణ్యకోపనిషత్తు**లో ఆత్మపురుషుడు బుద్ధిద్వారా ఇంద్రియాల శక్తిని గ్రహిస్తున్నాడు. అని చెప్పబడింది.

***సూత్రం - 252 "వ్యపదేశాచ్చ క్రియాయా న చేన్నిర్దేశవిపర్యయః"***

లౌకిక, వైదిక క్రియలందు కర్తగా చెప్పబడ్డాడు కాబట్టి జీవుడే కర్త.

***సూత్రం - 253 "ఉపలబ్ధివదనియమః"***

స్వతంత్రుండైన వాడే కర్త. ఈ నియమానుసారము జీవుడు కర్త అయినట్లైతే సర్వస్వతంత్రుడు కావాలి. అంటే తనకిష్టమైనదాన్నే చెయ్యాలి. ఇష్టం లేని దాన్ని చెయ్యకూడదు. మరి లోకంలో ఆ రకంగా కనిపించటం లేదు కదా! జీవుడు అస్వతంత్రుడు, కర్త ఎలా అవుతాడు? అంటున్నారు.

***సూత్రం - 254 "శక్తివిపర్యయాత్"***

జీవికి స్వాతంత్ర్యం ఉన్నప్పటికీ సాధన వైచిత్ర్యాన్ని బట్టి ఇష్టానిష్టాలను చెయ్యటం, చెయ్యక పోవటంలో నియమం లేదు. ఇష్టమైన దానిని, ఇష్టం కాని దానిని కూడా నియమం లేకుండానే గ్రహిస్తున్నాడు.

***సూత్రం - 255 "సమాధ్యభావాచ్చ"***

శక్తియందలి వ్యత్యాసంవల్ల కూడా జీవుడే కర్త అవుతాడు. ఇది కేవలము పేరులో ఉన్న వివాదమే తప్ప వస్తువులో ఉన్నది కాదు.

ఆత్మధ్యానం అంటే సమాధి అసంభవమవుతుంది కాబట్టి జీవుడే కర్త.

లోకంలో ఉన్నదాంతా ఆత్మే. ఈ ఆత్మ అందరిలోనూ సమానంగా ఉన్నది. ఆత్మనుండే అన్నీ పుట్టినాయి. మళ్ళీ ఆత్మలోనే లయం అవుతాయి. అని **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పబడ్డది. కాబట్టి జీవుడే కర్త. అంతేకాని వేరుకాదు అంటూ పధ్నాల్గవ అధికరణ పూర్తి చేశారు.

## 15. తక్షాధికరణము (ఉపాధివల్ల జీవుడు కర్త అవుతున్నాడు)

జీవికి కర్తృత్వము స్వాభావికం కాదు ఉపాధిని బట్టి వచ్చింది అంటున్నారు. పదిహేనవ అధికరణ అయిన **'తక్షాధికరణము'**లో ఇందులో ఒక సూత్రమే ఉంది.

జీవుడే కర్త అని చెప్పారు కదా. మరి ఈ కర్తృత్వము అనేది జీవునికి స్వాభావికమా? లేక ఉపాధిని బట్టి వచ్చిందా?"

***సూత్రం - 256 "యథా చ తక్షోభయథా"***

వడ్రంగిలాగా జీవుడు కూడా కర్త, అకర్త రెండూ అవుతున్నాడు.

వడ్రంగివాడు తన సామాను తీసుకుని కర్త అయి పని చేస్తున్నప్పుడు దుఃఖితుడౌతున్నాడు. ఆ పని మానివేసి సాధనాలన్నీ వదిలేసినప్పుడు అకర్త అవుతున్నాడు. అలాగే ఆత్మకూడా అజ్ఞానంతో వచ్చిన మనస్సు, ఇంద్రియాలతో కూడినప్పుడు కర్తయై సాంసారిక దుఃఖము అనుభవిస్తున్నాడు. అవిద్యా సాధనాలను వదలి వేసినప్పుడు అకర్తయై సుఖిస్తున్నాడు. కాబట్టి ఆత్మయొక్క కర్తృత్వం ఉపాధికి సంబంధించినదే. ఉపాధి వల్లనే జీవుడు కర్త అవుతున్నాడు.

## 16. పరాయత్తాధికరణము (జీవుని కర్తృత్వం పరమేశ్వరాధీనం)

ఈ విషయాన్ని పదహారవ అధికరణ అయిన **పరాయత్తాధికరణము**లో వివరించారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

***సూత్రం - 257 "పరాత్తు తచ్ఛ్రుతేః"***

జీవుడికి ఈ కర్తృత్వము ఈశ్వరునివల్ల లభిస్తోందా? లేక ఈశ్వరుని ప్రమేయం లేకుండానే లభిస్తోందా?"

జీవుడికి కర్తృత్వం ఈశ్వరుని వల్లనే కలుగుతున్నది. జీవి అవిద్యతో కూడి ఉన్నంత వరకు కర్తృత్వ, భోక్తృత్వ లక్షణాలు గల సంసారం లభిస్తోంది. అతడికి జ్ఞానం కలగగానే మోక్షం వస్తుంది. కాబట్టి జీవుడికి కర్తృత్వం ఈశ్వరుని వల్లనే లభిస్తుంది.

***సూత్రం - 258 "కృతప్రయత్నాపేక్షస్తు విహిత ప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః"***

వేదవిహితమైన కర్మలు వ్యర్థం కాకుండా ఉండటానికి పరమేశ్వరుడు జీవునిచేత కర్మలు చేయిస్తాడు.

వేదాలలో చేయవలసిన విధులు, చేయకూడని పనులు కూడా చెప్పబడ్డాయి. యాగాలు చెయ్యాలి. హోమాలు, దానాలు చెయ్యాలి. అలాగే సురాపానం చెయ్యకూడదు. అబద్ధమాడరాదు. ఇవి నిషేధాలు. ఈశ్వరుడు జీవులచేత తన ఇష్టం వచ్చినట్లు పాపపుణ్యాలు చేయించటం లేదు. శ్రుతులందు చెప్పిన కర్మలు మాత్రమే చేయిస్తున్నాడు. ఆ కర్మల ఫలితాన్నే జీవుడు మరుజన్మలో అనుభవిస్తున్నాడు. ఈ రకంగా జీవుని యొక్క కర్తృత్వం పరమేశ్వరాధీనము.

## 17. అంశాధికరణము (బ్రహ్మతో జీవికి గల సంబంధము)

ఈ విషయం మూడవ పాదంలోని పదిహేడవది ఆఖరుది అయిన **'అంశాధికరణము'**లో వివరిస్తున్నారు. ఇందులో పదకొండు సూత్రాలున్నాయి.

జీవుడికి, బ్రహ్మతో గల సంబంధం ఏమిటి?"

***సూత్రం – 259 "అంశో నానావ్యసదేశాదన్యథా చాపి దాశ కితవాదిత్వమధీయత ఏకే"***

జీవికి, ఈశ్వరుడికి భేదం చెప్పినా చెప్పకపోయినా కూడా జీవుడు ఈశ్వరుని అంశమే. వేదాలలో కొన్నిచోట్ల వీరి సంబంధం అగ్నికి, నిప్పురవ్వలకు ఉండే సంబంధంగా చెప్పాయి. ఇక్కడ భేదం చెప్పబడింది.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు ఆత్మజ్ఞానాన్ని తన కుమారుడైన శ్వేతకేతువుకు బోధిస్తూ "జీవులు వాటి రూపాలు, నామాలు పోగొట్టుకుంటాయి. అవి అన్నీ ఏ తత్త్వంలో కలిసిపోతాయో అదే బ్రహ్మ. అది అద్వితీయమైనది. సూక్ష్మమైనది సర్వవ్యాపకమైనది" అన్నాడు. కాబట్టి ఆత్మ, పరమేశ్వరుడు రెండూ ఒక్కటే. **ఐతరేయోపనిషత్తు**లో పరమేశ్వరుడు ఇంద్రియాలతో కూడిన మానవ శరీరంలో బ్రహ్మరంధ్రం ద్వారా ప్రవేశించాడు' అని చెప్పబడింది. కాబట్టి పరమాత్మయే జీవాత్మ రూపంలో ఉన్నది. ఈ రకంగా భేదం చెప్పటంవల్ల ఉపాధివల్ల కలిగిన భేదం కలవాడై, జీవాత్మ, పరమాత్మ యొక్క అంశలాగా ఉన్నాడు

***సూత్రం – 260 "మన్త్రవర్ణాచ్చ"***

మంత్రాలవల్ల జీవునికి అంశత్వం తెలుస్తున్నది. **ఛాందోగ్యోపనిషత్తు**లో గాయత్రి ద్వారా బ్రహ్మోపాసనను వివరిస్తూ "ప్రకృతి రూపమైన గాయత్రి, శరీరంలో ఉండే పంచభూతాలు, ఇంద్రియాల సమూహాలు ఒకటే. పురుషుని శరీర రూపమైన గాయత్రి, పురుషుని హృదయ కమలంలో ఉండే పురుషుడు ఒకటే. ఆ పురుషునిలోనే అంటే గాయత్రిలోనే ప్రాణాలు ప్రతిష్ఠితమై ఉన్నాయి. శుద్ధబ్రహ్మ, కార్యబ్రహ్మ కన్నా గొప్పది. శుద్ధ బ్రహ్మ అంటే – పరబ్రహ్మ. కార్యబ్రహ్మ అంటే అపరబ్రహ్మ, సగుణబ్రహ్మ. పాంచభౌతికమైన జగత్తంతా శుద్ధ బ్రహ్మయొక్క ఒక పాదమే. మిగిలిన మూడు పాదాలు ఆ పరబ్రహ్మలోనే ఉన్నాయి. గాయత్రి ద్వారా ప్రతిపాదించబడి, మూడుపాదములు గల అమృత స్వరూపమైన బ్రహ్మము ఇదే. ఈ మంత్రం జీవుని యొక్క అంశత్వాన్ని తెలుపుతున్నది.

***సూత్రం – 261 "అపి చ స్మర్యతే"***

భగవద్గీతలో కూడా ఈ అంశాన్ని ప్రస్తావిస్తూ దేహంలోని సనాతనమైన జీవాత్మ నా అంశమే అని చెప్పాడు భగవానుడు.

***సూత్రం – 262 "ప్రకాశావన్నైవం పరః"***

అయితే జీవాత్మ అనుభవించే సుఖదుఃఖాలు పరమేశ్వరుడికి కూడా కలుగుతాయా? అనే ప్రశ్న వస్తుంది.

జీవాత్మ దుఃఖాన్ని అనుభవించినట్లుగా పరమాత్మ అనుభవించడు. సూర్యుని వెలుతురుకు చెయ్యి అడ్డు పెడితే సూర్యకాంతి వంకరగా పడుతుంది. అంతేతప్ప వంగదు. అలాగే ఖాళీ కుండలో ఆకాశం ఉన్నది. ఆ కుండను ఒకచోట నుంచి ఇంకొక చోటికి తీసుకు వెళ్ళినప్పుడు, కుండతో పాటుగా ఆకాశాన్ని కూడా మోసుకొని పోము. కంటికి అలా కనిపిస్తుంది. అంతేగాని నిజంగా ఆకాశం తీసుకుపోబడదు. అలాగే తన అంశ అయినప్పటికీ జీవుని సుఖ దుఃఖాలు పరమేశ్వరునికి అంటవు. జీవుని దుఃఖము కూడా ఉపాధికి సంబంధించినదే.

***సూత్రం – 263 "స్మరన్తి చ"***

జీవుని దుఃఖంవల్ల పరమాత్మ దుఃఖితుడు కాడు

పరమాత్మ నిత్యుడు. నిర్గుణుడు. అతడు తామరాకు మీద నీటిబొట్టులాగా అంటకుండా ఉంటాడు. కర్మలను అనుభవించే జీవుడు తిరిగి తిరిగి జన్మలు ఎత్తుతూ ఉంటాడు.

***సూత్రం - 264 "అనుజ్ఞాపరిహారౌ దేహసంబన్ధా జ్యోతిరాదివత్"***

అగ్ని మొదలైన వాటిలాగా, దేహంతో తాదాత్మ్య సంబంధంవలన, అనుజ్ఞ పరిహారము అనేవి సంభవమవుతున్నాయి.

అగ్ని అనేది ఒకటే. కాని ఒకచోట పరిత్యజించబడుతోంది. ఇంకొక చోట పూజింపబడుతోంది. యజ్ఞంలో అగ్ని చాలా పవిత్రం. అది పూజింపబడుతోంది. అదే స్మశానంలో అగ్ని అపవిత్రం. పరిత్యజించడుతోంది. అలాగే ఈశ్వరుడు ఒక్కడే అయినా, దేహసంబంధం వల్ల అనేక రూపాలు పొందుతున్నాడు. కాబట్టి లౌకిక, వైదిక నిషేధాలు చెల్లుతాయి. ఇప్పుడు మళ్ళీ అనుమానం వస్తోంది. సర్వభూతాంతరాత్మ అయిన పరమేశ్వరుడు ఒక్కడే కదా! అలాంటప్పుడు ఒక శరీరంతో చేసిన పాపం ఇంకొక శరీరంతో అనుభవించటం ఏమిటి? ఒక శరీరంతో చేసిన కర్మకు, ఇంకొక శరీరంతో ఫలం ఎందుకు కలగదు?" దానికి సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 265 "ఆసన్తతేశ్చావ్యతికరః"***

జీవాత్మకు అన్ని శరీరాలతోను సంబంధం ఉండదు. కాబట్టి కర్మఫల సంకరం ఉండదు.

ఒక శరీరంలోని జీవాత్మకు వేరొక శరీరంలోని జీవాత్మకు సంబంధం లేదు. అందుచేత చేసే కర్మలు, వాటి ఫలితములతో కూడా సంబంధం ఉండదు. ఒకరి ఫలాన్ని ఇంకొకరు అనుభవించటం కుదరదు.

***సూత్రం - 266 "ఆభాస ఏవ చ"***

జీవుడు, పరమేశ్వరుని ప్రతిబింబము. ఆకాశంలో కనిపించే సూర్యుడు, నీటిలో కనిపించే ప్రతిబింబము, రెండూ ఒకటి కాదు. వేరువేరు.

పది కుండలలో నీరు పోసి పెడతాము. అన్నింటిలోనూ సూర్యుని ప్రతిబింబము కనిపిస్తూనే ఉంటుంది. కాని ఇందులో ఒక కుండను కదిపితే, అందులోని

ప్రతిబింబమే కదులుతుంది. అంతేకాని అన్ని కుండలలోని ప్రతిబింబము కదలదు. అలాగే ఒకజీవి చేసిన కర్మను అతడే అనుభవించాలి అంతేగాని వేరొక శరీరంలో ఉన్న జీవి అనుభవించదు.

***సూత్రం - 267 "అదృష్టానియమాత్"***

అదృష్ట నియమంలేని సాంఖ్య, కణాదులకు మాత్రమే ఈ దోషం సంభవిస్తుంది. అంతేకాని వేదాంత మతానికి కాదు.

సాంఖ్యమతంలో ఆత్మలు అనేకం ఉన్నాయి. అవి అంతటా వ్యాపించి ఉన్నాయి. అవి చైతన్య స్వరూపాలు, నిర్గుణాలు. ప్రధానమనేది ఈ ఆత్మలన్నిటికీ సాధారణమైనది. ఈ ప్రధానంవల్లనే ఆత్మలన్నింటికీ భోగాలు లభిస్తున్నాయి అంటున్నారు.

వీరిమతంలో ఆత్మలన్నీ చైతన్యరూపాలే. అవి అంతటా ఆవరించి ఉన్నాయి. కాబట్టి అన్ని ఆత్మలకు సుఖదుఃఖ సంబంధం కలుగుతుంది. ఇది దోషం.

కణాదుల మతంలో కూడా ఆత్మలు అనేకాలు. అవి అచేతనాలు. వీటికి అచేతనాలయిన మనసులు ఉపకారకాలు. గుణాలు ఆత్మలందు చేరటాన్నే సంసారము అంటారు. ఈ విధంగా ఇచ్ఛ మొదలైన గుణాలు పుట్టకుండా ఉండటమే మోక్షము అన్నారు. వీరి మతంలో కూడా ఒక ఆత్మకు, మనస్సుకు సంయోగం కలిగితే మిగిలిన వాటికి కూడా కలగాలి. ఫలానా ఆత్మకు మనస్సుకు సంయోగం పొందే అదృష్టం లేదు. కాబట్టి వీరికి సాంకర్యదోషం వస్తుంది.

నిశ్చయాలు ఏ ఆత్మకు ఆ ఆత్మకే విడివిడిగా కలుగుతాయా? అంటే నేను ఈ పని చేస్తాను. ఈ ఫలితం పొందుతాను, అనేవే నిశ్చయాలు. వీటిని వివరిస్తున్నారు.

***సూత్రం - 268 "అభిసంధ్యాదిష్వపి చైవమ్"***

అదృష్టానికి నిశ్చయాదులు నియామకాలైతే సుఖదుఃఖాది సాంకర్యదోషం రాదు అన్నప్పటికీ దోషపరిహారం కాదు.

నిశ్చయాదులకు కూడా ఆత్మ, మనస్సుల సంయోగం కావలసినదే, అన్ని ఆత్మలు, అన్ని మనసులు ఒకేచోట ఉండటంవలన, ఏ ఆత్మకు ఏ మనసుతో

సంయోగం ఉంటుందో చెప్పలేము. ఈ ఆత్మకు సంబంధించిన నిశ్చయాదులు ఇవి అని చెప్పటానికి వీలులేదు. కాబట్టి నిశ్చయాదులకు సాంకర్యదోషం తప్పదు.

***సూత్రం - 269 "ప్రదేశాదితి చేన్నాన్తర్భావాత్"***

ఆత్మలు సర్వవ్యాపకాలు. అన్ని శరీరాల్లోను ఉంటాయి. కాబట్టి ఒక శరీరంలో చేరిన ఆత్మ, మనసులకే సంయోగం కలుగుతుంది అని చెప్పటానికి కూడా వీలులేదు. అందుచేత బింబ, ప్రతిబింబ వాదము ప్రకారము సుఖదుఃఖావస్తకు సాంకర్య దోషం లేదు (అంటే పది కుండలలో కనిపించే ప్రతిబింబం, ఒక కుండను కదిపితే అన్ని కుండలలోని ప్రతిబింబం కదలదు) అంటూ ఈ అధికరణను ముగించారు.

***దీంతో బ్రహ్మసూత్రాలలోని రెండవ అధ్యాయంలోని మూడవ పాదం పూర్తవుతోంది.***

# రెండవ అధ్యాయం

## నాల్గవ పాదం

ఈ పాదంలో లింగ శరీరానికి సంబంధించిన శృతివాక్యాలలో ఉన్న భేదాన్ని సమం చేస్తున్నారు. ఇందులో తొమ్మిది అధికరణలు, ఇరవై రెండు సూత్రాలున్నాయి.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | ప్రాణోత్పత్యధికరణము | ఇంద్రియాల ఉత్పత్తి | 4 |
| 2. | సప్తగత్యధికరణము | ఇంద్రియాల సంఖ్య | |
| 3. | ప్రాణాణుత్వాధికరణము | ఇంద్రియాల పరిమాణము | 1 |
| 4. | ప్రాణశ్రేష్టాధికరణము | ముఖ్యప్రాణము బ్రహ్మమే | 1 |
| 5. | వాయు క్రియాధికరణము | ముఖ్యప్రాణము వాయువు కన్న వేరైనది | 4 |
| 6. | శ్రేష్టాణుత్వాధికరణము | ముఖ్యప్రాణము అణుపరిమాణం గలది | 1 |
| 7. | జ్యోతిరాద్యధికరణము | ఇంద్రియాధిష్టాతన దేవతలు | 3 |
| 8. | ఇంద్రియాధికరణము | ఇంద్రియాలు, ముఖ్య ప్రాణము యొక్క వృత్తి భేదాలు కావు | 3 |
| 9. | సంజ్ఞామూర్తిక్లప్త్యధికరణము | నామరూప వ్యక్తీకరణ జీవకృత్యం కాదు | 3 |

మొత్తం అధికరణలు 9 సూత్రాలు 22.

## 1. ప్రాణోత్పత్యధికరణము (ఇంద్రియాల ఉత్పత్తి)

ప్రాణాలు ఏ రకంగా ఉత్పత్తి అయినాయి అనే విషయం, వాటితో పాటుగా ఇంద్రియాలను గురించి మొదటిదైన **ప్రాణోత్పత్యధికరణ**లో చెబుతున్నారు. ఇందులో నాలుగు సూత్రాలున్నాయి.

***సూత్రం - 270 "తథాప్రాణాః"***

ఆకాశము మొదలై వాటిలాగా ప్రాణాలకు కూడా ఉత్పత్తి ఉన్నది. ప్రాణాలు అంటే ఇంద్రియాలు అని కూడా అర్ధము. **ముండకోపనిషత్తు**లో "పరబ్రహ్మ నుండే సప్తప్రాణాలు (కళ్ళు-2, ముక్కులు-2, చెవులు-2, నోరు-1) పుట్టినాయి. అని చెప్పబడింది. **ప్రశ్నోపనిషత్తు**లో "ఆ పురుషుడు ఈ శరీరం నుంచి ఎవరు వెడితే నేను వెడతాను. ఎవరు ఉంటే నేను ఉంటాను అని ఆలోచించినవాడై, ముందుగా శరీరానికి అవసరమైన ప్రాణాన్ని సృష్టించాడు. తరువాత దాని నుండి శ్రద్ధ, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి, ఇంద్రియాలు, మనస్సు, అన్నము సృష్టించాడు అని చెప్పబడింది. వీటిని బట్టి చూస్తే, ప్రాణాలు బ్రహ్మయొక్క వికారాలు అని తెలుస్తోంది.

***సూత్రం - 271 "గౌణ్యసంభవాత్"***

ప్రాణోత్పత్తి విషయం గౌణము అనటం సంభవం కాదు. ఎందుకంటే ఆ ఒక్క విషయము తెలిసినంత మాత్రంచేతనే అన్ని విషయాలు తెలుస్తాయి.

**ముండకోపనిషత్తు**లో శౌనకుడు "గురువర్యా! అంగీరస మహర్షీ! దేన్నిగురించి తెలుసుకుంటే నాకు సర్వమూ తెలుస్తుందో, దాన్ని గురించి వివరించండి" అన్నాడు. ఆ ఒక్క విషయము తెలుసుకుంటే అన్ని విషయాలు తెలుస్తాయి. పరబ్రహ్మనుండే సమస్త ప్రాణాలు పుడుతున్నాయి. ఇక్కడ ప్రాణాలుత్పత్తి కూడా చెప్పబడింది. కాబట్టి ఇది గౌణము కాదు.

***సూత్రం - 272 "తత్ప్రాక్ఛ్రుతేశ్చ"***

ఉత్పత్తిని సూచించే పదం 'జాయతే'. ఇది ఆకాశము మొదలైన వాటికన్న ముందుగా ప్రాణాలతో సంబంధం కలిగి ఉన్నది. కాబట్టి ప్రాణోత్పత్తి ముఖ్యమే కాని గౌణం కాదు.

***సూత్రం - 273 "తత్పూర్వకత్వాద్వాచః"***

జాయతే అనే పదంతోనే ఆకాశము మొదలైన భూతాలన్నీ పుట్టాయని చెబుతుండగా, అక్కడ వాటి విషయంలో ముఖ్యమైన ఈ పదము ప్రాణాల విషయంలో గౌణం కాదు.

వాక్కు, మనస్సు, ప్రాణం అనేవి భూతాలన్నింటికన్న ముందుగా పుడుతున్నాయి. అని శ్రుతులు చెబుతున్నాయి. కాబట్టి ప్రాణోత్పత్తి నిజం, అంటే ప్రాణం ఉత్పత్తి చెందింది.

## 2. సప్తగత్యధికరణము (ప్రాణాలు ఎన్ని? ఇంద్రియాల సంఖ్య)

రెండవ అధికరణ అయిన **సప్తగత్యధికరణ**లో ప్రాణాలు ఎన్ని? వాటి సంఖ్య ఎంత? అనే విషయం వివరిస్తున్నారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

*సూత్రం - 274 "సప్త గతేర్విశేషితత్వాచ్చ"*

ఇంద్రియాలు అంటే ప్రాణాలు. ఇవి ఏడు.

**ముండకోపనిషత్తు**లో ఆ పరబ్రహ్మ నుండే సప్తప్రాణాలు ఉద్భవించాయి. అవి కళ్ళు-2, ముక్కులు-2, చెవులు-2, నోరు-1 మొత్తం ఏడు అన్నారు. **బృహదారణ్యకోప నిషత్తు**లో ఋతభాగుని కుమారుడు ఆర్తభాగుడు అడుగుతున్నాడు. యాజ్ఞవల్క్యా ! గ్రహాలు ఎన్ని? అతిగ్రహాలు ఎన్ని? దానికి యాజ్ఞవల్క్యుడు చెబుతున్నాడు. గ్రహము అంటే గ్రహించేది. ఇంద్రియము. విషయాలను గ్రహించేవి కాబట్టి గ్రహాలు. అతిగ్రహము అంటే అంతకన్న పెద్దది గొప్పది. కాబట్టి విషయాలే అతిగ్రహాలు.

గ్రహాలు ఎనిమిది. అతిగ్రహాలు ఎనిమిది.

1. ముక్కు గ్రహము - వాసన అతిగ్రహము
2. వాగింద్రియము గ్రహము - వాక్కు అతిగ్రహము
3. నాలుక గ్రహము - రుచి అతిగ్రహము
4. కన్ను గ్రహము - రంగు, రూపము అతిగ్రహము
5. చెవి గ్రహము - శబ్దము అతిగ్రహము
6. మనస్సు గ్రహము - కోరిక అతిగ్రహము
7. చేతులు గ్రహము - కర్మ అతిగ్రహము
8. చర్మము గ్రహము - స్పర్శ అతిగ్రహము

ఈ రకంగా ప్రాణాలు ఏడు, ఎనిమిది, పది, పదకొండు, పన్నెండు, అని అనేకచోట్ల చెప్పటం జరిగింది. కాబట్టి అసలు ప్రాణాలసంఖ్య ఎంత? అని అనుమానం వచ్చింది. ఈ కారణంచేత వేదంలోనే భేదం ఉన్నది అని వారి వాదన.

***సూత్రం - 275 "హస్తాదయస్తు స్థితేఽతో నైవమ్"***

చేతులు మొదలైన ఇంద్రియాలు అధికంగా ఉండటంవల్ల ప్రాణాలు ఏడు అనకూడదు.

యుక్తిబలంచేత వచన ప్రాబల్యంచేత ఇంద్రియాలు పదకొండు అంటున్నారు. అవి దర్శన, శ్రవణ, ఆఘ్రాణ, ఆస్వాదన, స్పర్శన, వదన (మాట్లాడటం) ఆ దాన (స్వీకరించటం) గమన, ఆనంద, విసర్గ, ధ్యానము అనేవి. **బృహదారణ్యకోపనిషత్తు**లో జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు ప్రాణి యొక్క కర్మ పరిసమాప్తి అయినప్పుడు శరీరం నుంచి నిష్క్రమిస్తాయి. ఈ రకంగా శరీరం వదలి బంధువులను రోదింపచేస్తాయి కాబట్టి ఇవి రుద్రశబ్దంచేత పిలువబడతాయి. ఇవే ఏకాదశరుద్రులు" అని చెప్పబడింది.

ఈ విధంగా ప్రాణములు భిన్నసంఖ్యలో చెప్పబడ్డాయి. కాబట్టి ప్రాణాలు (ఇంద్రియాలు) ఏడు కావు.

## 3. ప్రాణాణుత్వాధికరణము (ఇంద్రియాల పరిమాణము)

మూడవదైన '**ప్రాణాణుత్యాధికరణ**'లో ఇంద్రియాల పరిమాణము ఎంత? అనే విషయం వివరిస్తున్నారు. దీనిలో ఒక సూత్రమే ఉంది.

***సూత్రం - 276 "అణవశ్చ"***

ఇంద్రియాలు అణురూపాలు. ఇవి సర్వగతాలు కావు. శరీరమంతటా పని చేస్తున్నాయి. మరణ సమయంలో చప్పుడు చేయకుండా శరీరంనుంచి బయటకు వెళ్ళిపోతాయి. ప్రక్కన ఉన్నవారికి కూడా కనిపించవు. కాబట్టి ఇవి విభజించబడి నాయని, అణురూపాలని అనుకోవాలి. అణువు అంటే సూక్ష్మాతిసూక్ష్మమైనదనే అర్థం. ఇవి సర్వవ్యాపకాలు కావు. ఒకవేళ అంతటా వ్యాపించి ఉంటే లోకంలో జరిగే అన్ని విషయాలు వీటికి తెలియాలి. అది జరగదు. కాబట్టి ఇంద్రియ పరిమాణము సూక్ష్మాతిసూక్ష్మము.

## 4. ప్రాణశ్రేష్ఠాధికరణము (ముఖ్యప్రాణము బ్రహ్మమే)

ఈ విషయాన్ని నాల్గవ అధికరణ అయిన '**ప్రాణశ్రేష్ఠాధికరణము**'లో వివరిస్తున్నారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

***సూత్రం - 277 "శ్రేష్ఠశ్చ"***

ముఖ్య ప్రాణము కూడా బ్రహ్మమే. బ్రహ్మము నుండే ప్రాణము పుడుతోంది. **ఛాందోగ్యోపనిషత్తు**లో ప్రాణమే జ్యేష్ఠము, శ్రేష్ఠము అని చెప్పబడింది. **బృహదారణ్యకోపనిషత్తు**లో పూర్వకాలంలో ఒకసారి ఇంద్రియాలన్నీ తమలోతాము పోట్లాడుకోవటం మొదలుపెట్టాయి. దీనికి కారణం తమలో ఎవరు గొప్ప అనే విషయం తేలకపోవటమే. ఆ వాదన ఎంతకీ తెగలేదు. చివరకు అన్నీ కలిసి ఒక నిర్ణయానికి వచ్చి తమకు జన్మనిచ్చిన ప్రజాపతి దగ్గరకు పోయి "ప్రజాపతీ ! మాలో శ్రేష్ఠులెవరో మీరు తేల్చి చెప్పండి" అన్నాయి.

ప్రజాపతి ఒక క్షణం ఆలోచించి "మీలో ఎవరు శ్రేష్ఠులో తేల్చుకునే ఉపాయం ఒకటి చెబుతాను వినండి. మీలో ఎవరు లేకపోతే ఈ శరీరం పనికి రాకుండా, పని చెయ్యకుండా పోతుందో వారు అందరికన్నా శ్రేష్ఠులుగా గుర్తించండి. ఈ విషయం తేలాలంటే ఒక్కొక్క ఇంద్రియము ఒక సంవత్సరంపాటు ఈ శరీరాన్ని విడిచి వెళ్ళండి" అన్నాడు. ప్రజాపతి సలహా ఇంద్రియాలకన్నింటికీ నచ్చింది.

ముందుగా వాక్కు శరీరం నుంచి నిష్క్రమించింది. అది ఒక సంవత్సరంపాటు శరీరానికి దూరంగా ఉండి తరువాత తిరిగి వచ్చి మిగిలిన ఇంద్రియాలను అడిగింది. "నేను లేనప్పుడు మీరెలా జీవించి ఉండగలిగారు?"

"నువు వెళ్ళిపోవటంవల్ల శరీరానికి పెద్ద నష్టం ఏదీ జరగలేదు. కేవలం వాక్కు మాత్రం మూగబోయింది. అంతేగాని మిగిలిన శరీరం యథాతథంగా పనిచేసింది. ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసలు మామూలుగానే జరిగాయి. కళ్ళు చూస్తూనే ఉన్నాయి. చెవులు వింటూనే ఉన్నాయి. ఆలోచనలు సాగుతూనే ఉన్నాయి. ఆ రకంగా మిగిలిన పనులన్నీ జరిగాయి. పసిపిల్లవాడికి మాటలు రావు. అయినావాడు బ్రతకటం లేదా? మూగవాడు జీవించటం లేదా? అలాగే శరీరం జీవించే ఉన్నది." అన్నాయి మిగిలిన అవయవాలు. ఆ మాటలు విన్న వాక్కు మారు మాట్లాడకుండా శరీరంలో ప్రవేశించింది.

తరువాత శరీరం నుంచి దృష్టి నిష్క్రమించి ఒక సంవత్సరం తరువాత తిరిగి వచ్చి మిగిలిన అవయవాలను అడిగింది "నేను లేనప్పుడు మీరంతా ఎలా ఉన్నారు?" అని

అప్పుడవి "నువు లేకపోతే చెప్పుకోతగ్గ ఇబ్బందేం కలగలేదు. గ్రుడ్డివాడు బ్రతకటం లేదా? అలాగే ఈ శరీరం బ్రతికింది. కేవలం చూపుమాత్రం లేదు. అంతేకాని శరీరంలోని మిగిలిన వ్యాపారాలన్నీ సజావుగానే సాగినాయి. ఊపిరి ఆడుతూనే ఉంది. నోరు తింటూనే ఉంది. మాట్లాడుతూనే ఉన్నది. ఆలోచనలు బాగానే ఉన్నాయి" అన్నాయి. మారు మాట్లాడకుండా మారుమాట్లాడకుండా దృష్టి శరీరంలో ప్రవేశించింది.

ఆ తరువాత శ్రవణశక్తి శరీరాన్ని విడిచి వెళ్ళిపోయి ఒక సంవత్సరం తరువాత తిరిగి వచ్చి "నేను లేకపోతే ఎలాఉన్నది?" అని అడిగింది.

దానికి మిగిలిన ఇంద్రియాలు "ఓ శ్రవణేంద్రియమా! నీవులేని శరీరం చెవిటిదయింది. అంతేకాని కన్ను చూస్తోంది. నోరు మాట్లాడుతోంది ఈ రకంగా మిగిలిన ఇంద్రియాలన్నీ వాటిపని అవి చేస్తూనే ఉన్నాయి. కాబట్టి మేమంతా ఈ శరీరంలో సుఖంగానే ఉన్నాము" అన్నాయి. శ్రవణశక్తి శరీరంలో ప్రవేశించింది.

ఆ తరువాత మనస్సు శరీరం నుంచి నిష్క్రమించి ఒక సంవత్సరం తరువాత తిరిగి వచ్చి "నేను లేకపోతే వెలితిగా లేదా?" అని అడిగింది.

దానికి మిగిలిన ఇంద్రియాలు "ఓ మనసా! నీవు సంకల్ప వికల్పాలకు మూలమైనదానవు. నువు లేకపోతే శరీరానికి సంకల్పం ఉండదు. ఆలోచనా శక్తి ఉండదు. ఆలోచన లేదన్నమాటే గాని శ్వాస ఆడుతుంది. కాళ్ళు చేతులు వాటి పని అవి చేస్తాయి. నోరు తింటుంది. మాట్లాడుతుంది. ఈ రకంగా మిగిలిన ఇంద్రియాలు వాటి పని అవి చేస్తూ ఉంటాయి. పసిపిల్లవాడు మనస్సు లేకుండా బ్రతకటం లేదా? అలాగే శరీరం నువు లేకుండా జీవించే ఉన్నది. మిగిలిన కార్యములన్నీ యథాతథంగా జరుగుతూనే ఉన్నాయి." అన్నాయి. మారుమాట్లాడకుండా మనస్సు శరీరంలోకి ప్రవేశించింది.

ఆఖరుకు ప్రాణం బయటకు పోవటానికి వస్తూ ఉంది. అప్పుడు ఇంద్రియాలతో తనుకున్న బంధనాలన్నిటినీ త్రెంచి పారేస్తున్నట్లనిపించింది. శరీరానికి ఊపిరి

అందటం కష్టమవుతున్నది. కళ్లు కనిపించటం మానేసాయి. చెవులు వినిపించటం మానివేసాయి. నోరు మాట్లాడటం కష్టమయింది. అలాగే కాళ్ళు చేతులు కదలటం మానేసాయి. శరీరం గాలిలో తేలిపోతున్నట్లయింది. దాంతో ఇంద్రియాలకు భయం పట్టుకుంది. అప్పుడు అవన్నీ ప్రాణం చుట్టూ చేరి 'ప్రాణమా! నువ్వు మాత్రం శరీరం నుంచి బయటకు వెళ్ళకు. ఇక్కడే ఉండు. నువ్వు గనక శరీరంనుంచి బయటకు వెళ్ళిపోతే శరీరం చచ్చిపోతుంది. అప్పుడు మేమంతా ఉపయోగం లేకుండా పోతాము. మా పని సున్నా అవుతుంది. మా అందరిలోకి శ్రేష్ఠుడివి నువ్వే. ఈ మాట మేమందరం అంగీకరిస్తున్నాం. నువ్వు ఇక్కడే ఉండి మమ్మల్ని జీవింపచెయ్యి' అని వేడుకున్నాయి.

ఈ రకంగా ఇంద్రియాలన్నీ ప్రాణం లేకపోతే తమ ఉనికి లేదని ఒప్పుకున్నాయి. అందుకనే వాక్కు, చక్షువు, శ్రోత్రము, మనస్సు అనే పేర్లతో గాక, అవన్నీ ప్రాణవంతములైతేనే పని చేస్తాయి. అవన్నీ ప్రాణాలనే సంకేతంతో పిలువ బడతాయి. అంటే ప్రాణం లేకుండా వాటికి స్వేచ్ఛ లేదు. అసలు ప్రాణమే ఇన్ని రూపాలుగా మారింది. అందుచేతనే ఇంద్రియాలన్నింటిలోకి ప్రాణమే గొప్పది.

ఈ రకంగా ఇంద్రియాల కోరికమీద ప్రాణం శరీరాన్ని విడిచిపోకుండా ఉండి మిగిలిన ఇంద్రియాలతో 'మీ మాట ప్రకారము నేను ఇక్కడే ఉంటాను. మరి నాకు అన్నము ఏది?' అని అడిగింది. "కుక్కలు, పిల్లులు, పక్షులు మొదలైన జీవ జంతువుల ఆహారమే నీకు ఆహారము" అన్నాయి. ఇది ఏ విధంగా అంటే శరీరంలో ముఖ్యమైన ప్రాణంవల్లనే మిగిలిన ఇంద్రియాలు పని చేస్తున్నాయి. కాబట్టి అన్నింటి ఆహారము ప్రాణానికి ఆహారమవుతోంది. సృష్టిలోని 84 లక్షల రకాల జీవరాసి ఆ పరబ్రహ్మ స్వరూపమే. ఈ జీవరాసి అంతా తీసుకునే అన్ని రకాల ఆహారము ఆ పరబ్రహ్మకు ప్రీతిపాత్రమైనదే. అందుకే లలితా సహస్రంలో ఆ పరాశక్తి **సర్వౌదన ప్రీతిచిత్తా** అని చెప్పబడింది. విరాట్ ప్రాణానికి విరాట్ అన్నమే ఆహారము. ఈ విషయము తెలిసినవాడికి తినరానిది ఏదీ ఉండదు.

ప్రాణం మళ్ళీ అడిగింది "మరి నాకు ఆచ్ఛాదనకు వస్త్రం ఏది?" దానికి ఇంద్రియాలు "జలమే నీకు ఆచ్ఛాదన" అన్నాయి. విద్వాంసులు భోజనానికి ముందు, తరువాత కూడా ప్రాణాన్ని జలంతో ఆచ్ఛాదిస్తున్నారు. భోజన సమయంలో చేసే

ఆపోసనా, ఉత్తరాపోసనలే ప్రాణానికి వస్త్రం. ఈ విషయం తెలుసుకున్నవాడు వస్త్రాన్ని పొంది నగ్నత్వం లేనివాడవుతున్నాడు.

ఈ విధంగా ప్రాణవిజ్ఞానాన్ని తెలుసుకున్నవాడు ఎండిన చెట్టు దగ్గర కూర్చుని ప్రాణ విజ్ఞానం చెబితే ఆ చెట్టు చిగురువేస్తుంది."

"ప్రాణమే జ్యేష్ఠము, శ్రేష్ఠము అని తెలుసుకున్నవాడు తనవారిలో జ్యేష్ఠుడు, శ్రేష్టుడు అవుతాడు" అని చెప్పబడింది. కాబట్టి ప్రాణము శ్రేష్ఠమైనది. ముఖ్యప్రాణము బ్రహ్మమే. అదే పరాశక్తి.

## 5. వాయుక్రియాధికరణము

### (ముఖ్యప్రాణము వాయువు కన్న వేరైనది)

ఐదవ అధికరణ అయిన **వాయుక్రియాధికరణ**లో ముఖ్య ప్రాణము అంటే వాయువు కాదు అని చెబుతున్నారు. దీనిలో నాలుగు సూత్రాలున్నాయి.

ముఖ్యప్రాణము అన్నారు కదా ! దాని స్వరూపము ఎటువంటిది?

***సూత్రం - 278 "న వాయుక్రియే పృథగుపదేశాత్"***

ప్రాణం అంటే వాయువు కాదు. వాయువు యొక్క క్రియల్ని ప్రాణం కన్న వేరుగా నిర్దేశించి చెప్పారు.

సామాన్యంగా ముఖమున ఉండే వాయువునే ప్రాణం అంటారు. అది నిజం కాదు. ప్రాణమనేది మనోమయబ్రహ్మ యొక్క చతుర్ధపాదం. వీటిని బట్టి ప్రాణమనేది వాయువు కన్న వేరైనది. అయితే ప్రాణము సజీవునిలాగా స్వతంత్రమైనదా అని అనుమానం.

***సూత్రం - 279*** "చక్షురాదివత్తత్సహశిష్ట్యాదిభ్యః"

ప్రాణం కూడా చక్షురాది ఇంద్రియాల వంటిదే తప్ప వేరు కాదు. కాబట్టి ప్రాణము జీవునిలాగా స్వతంత్రమైనది కాదు. **ఛాందోగ్యోపనిషత్తు**లోను, **బృహదారణ్యకోపనిషత్తు**లోనూ కూడా ఇంద్రియాలన్నీ తమలో ఎవరు గొప్ప అని వాదించుకున్నాయి. అప్పుడు ఇంద్రియాలతో పాటు ప్రాణంకూడా చెప్పబడింది. దేహానికి జీవుడు రాజు, ప్రాణం మంత్రి ఇంద్రియాలు ప్రకృతివర్గము. కాబట్టి ప్రాణం స్వతంత్రము కాదు. జీవుని అధీనంలో ఉంటూ ఉపకరణంలా సహకరిస్తుంది.

***సూత్రం - 280*** *"అకరణత్వాచ్చ న దోషస్తథా హి దర్శయతి"*

ముఖ్యప్రాణం చక్షురాది ఇంద్రియాల వలె ఇంద్రియం కానందువల్ల దోషం ఏమీలేదు.

ఇంద్రియాలన్నీ జీవుడికి లోబడి ఉంటాయి. కాబట్టి అవి స్వతంత్రములు కావు. అలాగే ప్రాణము కూడా జీవుడికి లోబడి ఉంటుంది. అది అస్వతంత్రము.

***సూత్రం - 281*** *"పఞ్చవృత్తిర్మనోవద్వ్యపదిశ్యతే"*

మనసుకు శ్రోత్రాదుల వలన శబ్దాదిభావాలు కలిగినట్లుగా, ముఖ్యప్రాణము పంచవృత్తులు (భావాలు) కలిగి ఉంటుంది.

మనసుకు నేత్రాది ఇంద్రియాలవల్ల శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు వచ్చినట్లే. ముఖ్యప్రాణానికి కూడా ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములనబడే ఐదు వ్యాపారాలు కలుగుతున్నాయి. ఈ రకంగా ముఖ్యప్రాణము వాయువుకన్న వేరైనది.

## 6. శ్రేష్ఠాణుత్వాధికరణము

### (ముఖ్యప్రాణము అణుపరిమాణము గలది)

ఈ విషయాన్ని ఆరవదైన **శ్రేష్ఠాణుత్వాధికరణ**లో వివరిస్తున్నారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

***సూత్రం - 282 "అణుశ్చ"***

ముఖ్యప్రాణము అణుపరిమాణం గలది. మిగిలిన ఇంద్రియాలలాగానే ఇది అతిసూక్ష్మమైనది. శరీరంనుంచి నిష్క్రమించేటప్పుడు మిగిలిన ఇంద్రియాలలాగానే ఇది కూడా కనిపించదు. అంటూ ఆరవ అధికరణ పూర్తి చేశారు.

## 7. జ్యోతిరాద్యధికరణము (ఇంద్రియాధిష్టాన దేవతలు)

ఏడవదైన **జ్యోతిరాద్యధికరణ**లో ఇంద్రియాధిష్టాన దేవతల గురించి చెబుతున్నారు. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

"వాగింద్రియాలకు తమ తమ వ్యాపారాల్లో స్వాతంత్ర్యం ఉన్నదా?" అనే ప్రశ్నకు సమాధానం చెబుతున్నారు.

**సూత్రం - 283 "జ్యోతిరాద్యధిష్ఠానం తు తదామననాత్"**

అగ్ని మొదలైన అధిదేవతలచే ఇంద్రియాలు ప్రేరేపించబడుతున్నాయి.

పరమాత్మ, విరాట్స్వరూపాన్ని దృష్టిలో ఉంచుకుని తీవ్రమైన ఆలోచన చేశాడు. అదే తపస్సు. దాని ఫలితంగానే విరాట్స్వరూపానికి నోరు వచ్చింది. ఆ నోటి నుండి మాట, వాణికి అభిమాన దేవత అయిన అగ్ని ఉత్పన్నమైనాయి. తరువాత ముక్కు దానినుండి ప్రాణశక్తి. దాని నుండి వాయువు పుట్టాయి. తరువాత

నేత్రాలు - నేత్రానికి అభిమానదేవత సూర్యుడు

చెవులు - దిక్కులు

హృదయం - దానినుండి మనస్సు దాని అభిమానదేవత చంద్రుడు

నాభి - దాని నుండి అపానము - దాని నుండి మృత్యువు

జననేంద్రియము - దాని నుంచి వీర్యము - దాని అభిమాన దేవత జలము

ఈ రకంగా ఇంద్రియాలు, వాటి అభిమాన దేవతలు ఉద్భవించారు. తరువాత ఇంద్రియాలన్నీ తమ అబిమాన దేవతలచే అధిష్ఠాలై తమ తమ పనులు చేస్తున్నాయి.

ఇక్కడ దేవతలచే అధిష్ఠించబడి ఇంద్రియాలు పని చేసేటప్పుడు, ఆ పనుల భోక్తవ్యం కూడా ఆ అభిమాన దేవతలకే చెందాలి కదా? అన్న ప్రశ్న వస్తుంది.

**సూత్రం - 284 "ప్రాణవతా శబ్దాత్"**

శ్రుతులలో చెప్పిన దాన్ని బట్టి ఇంద్రియాలకు జీవునితోనే సంబంధం ఉన్నది. ఇంద్రియాలకు అధిష్ఠాన దేవతలున్నప్పటికీ, వాటి సంబంధం ప్రత్యక్షంగా జీవునితోనే. చక్షురింద్రియము ప్రకాశించిన చోట ఉన్నవాడు చాక్షుష పురుషుడు. అతడే జీవుడు. అతడు చూడటానికే ఈ చక్షువు. అతడు వినటానికే చెవులు అతడు వాసన చూడటానికే ఈ ముక్కు. ఈ రకంగా ఇంద్రియాలన్నీ జీవుని కోసమే. జీవునితోనే ప్రత్యక్ష సంబంధము కలిగి ఉన్నాయి. ఇంద్రియాభిమాన దేవతలు వేరుగా ఉన్నప్పటికీ వారికి భోక్తవ్యము ఉండదు. కర్మఫల సంబంధం ఉండదు.

**సూత్రం - 285 "తస్య చ నిత్యత్వాత్"**

శరీరంలో ఇంద్రియాధిష్ఠాన దేవతలకు భోక్తవ్యం లేదు. భోక్తరూపంలో జీవుడే నిత్యుడు.

ఈ శరీరం జీవుని కర్మవల్ల ఏర్పడింది. అందుచేత జీవుడే భోక్త. అతనికే పుణ్యపాప సంబంధం ఉంటుంది. సుఖము, దుఃఖము, భోగము అతనికే ఉంటుంది.

దేవతలు అంటే విశిష్ఠ కర్మఫలంవల్ల దైవత్వం పొందినవారు. కాబట్టి వీరికి పుణ్యఫలమే కాని పాపం అంటదు. వారికి మానవ శరీరంతో భోగంకూడా ఉండదు. అని **బృహదారణ్యకోపనిషత్తు** చెబుతోంది.

జీవాత్మ శరీరం నుంచి బయటకు పోవటానికి మార్గం కనిపిస్తుంది. ఆ స్థితిలో ఆత్మ శిరస్సుద్వారా గాని, మిగిలిన అవయవాల ద్వారా గాని బయటకు పోతుంది. దానితో పాటే ప్రాణంకూడా పోతుంది. ప్రాణం శరీరం నుంచి బయటకు రాగానే ఇంద్రియాలన్నీ శక్తి హీనమవుతాయి. కాబట్టి అధిష్ఠాన దేవతలకు భోక్తృత్వం జీవునిదే. ఇంద్రియాలకు తమ వ్యాపారాలలో స్వతంత్రం లేదు.

## 8. ఇంద్రియాధికరణము (ఇంద్రియాలు-ముఖ్యప్రాణము)

ఇంద్రియాలు, ముఖ్యప్రాణము వేరువేరా? లేకపోతే ఇవన్నీ ముఖ్యప్రాణం యొక్క వృత్తి భేదాలా? అనే విషయం ఎనిమిదవదైన '**ఇంద్రియాధికరణ**'లో వివరిస్తున్నారు. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

"ముఖ్యప్రాణం ఒకటి. **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఇంద్రియ రూపమైన ప్రాణాలు పదకొండు అంటే మిగిలినవన్నీ ముఖ్యప్రాణం యొక్క వృత్తి భేదాలే. ఇంద్రియాలనేవి వేరుగా ఉంటే, వాటి అధిష్ఠాన దేవతల గురించి ఆలోచించవచ్చు. ఐతే ప్రాణాలే తప్ప, ఇంద్రియాలనేవి వేరుగా లేవుకదా" అనే అనుమానానికి సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 286 "త ఇన్ద్రియాణి తద్వ్యపదేశాదన్యత్ర శ్రేష్ఠాత్"***

వేదమందు వేరుగా చెప్పబడటంవల్ల, ముఖ్యప్రాణము కన్న వేరైనట్టి వాగాదులన్నీ ఇంద్రియాలనే శబ్దంతో చెప్పబడుతున్నాయి.

**ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా పరమాత్మ నుంచి ప్రాణాలు, మనస్సు, సమస్త ఇంద్రియాలు పుడుతున్నాయి. ఇక్కడ ప్రాణము ఇంద్రియాలు వేరువేరని చెప్పారు. కాబట్టి ప్రాణాలు ఇంద్రియాలు కావు. మనస్సు ఆరవ ఇంద్రియము.

***సూత్రం - 287 "భేదశ్రుతేః"***

వేదంలో ప్రాణాలను వేరుగా చూపటంవల్ల వాగాదులు ముఖ్యప్రాణంకన్న భిన్నతత్త్వాలే.

**బృహదారణ్యకోపనిషత్తు**లో దేవదానవుల యుద్ధంలో దేవతలు ఓడిపోయి, ఉద్గీతోపాసనతో అసురుల మీద విజయాన్ని సాధించాలనుకున్నారు. ముందుగా వాగింద్రియాన్ని ఆశ్రయించి, తమ కోసం ఉద్గీతోపాసన చెయ్యమన్నారు. అని చెబుతూ చివరకు ముఖ్యప్రాణంతో అసురులను జయించారు. అని చెప్పబడింది. అంటే ఇంద్రియాలు, ప్రాణము వేరువేరని తెలుస్తోంది.

***సూత్రం - 288 "వైలక్షణ్యాచ్చ"***

ముఖ్యప్రాణంకన్న ఇతర ఇంద్రియాలకు భేదం ఉండటంవల్ల ప్రాణము, ఇంద్రియాలు వేరువేరని చెప్పవచ్చు.

**"బృహదారణ్యకోపనిషత్తులో"** మరణ కాలంలో వాక్కు మనస్సులో లీనమవుతుంది. మనసు ప్రాణంలో లీనమవుతుంది. ప్రాణం తేజస్సులో కలిసి పోతుంది. చివరకు అది పరమశక్తిలో కలిసిపోతుంది" కాబట్టి ఇంద్రియాలు ప్రాణము వేరువేరు.

## 9. సంజ్ఞామూర్తి క్లప్త్యధికరణము

### (నామరూప వ్యక్తీకరణ జీవకృత్యం కాదు)

ఈ విషయాన్ని తొమ్మిదవదైన **'సంజ్ఞామూర్తిక్లప్త్యధికరణము'**లో వివరిస్తున్నారు. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

సంజ్ఞ అంటే నామము, మూర్తి అంటే రూపము. ఈ విధంగా నామరూపాలను వికసింపచేసినది ఈశ్వరుడా? జీవుడా? అన్నది సందేహం. దానికి సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 289 "సంజ్ఞామూర్తికప్తిస్తు త్రివృత్కుర్వత ఉపదేశాత్"***

నామరూపాలను వికసింపచేయటమనేది ఈశ్వరుని పనే. పరమేశ్వరుడు ముందుగా తేజస్సును, ఆ తరువాత జలము, అన్నము సృష్టించి, నేను వీటిలో

ప్రవేశించి, నామరూపాలను విస్తరింపచేస్తాను అనుకున్నాడు. అని **ఛాందోగ్యోప నిషత్తు**లో చెప్పబడింది. కాబట్టి నామరూప వ్యాపకర్త ఈశ్వరుడే కాని వేరెవరూ కాదు.

***సూత్రం - 290 "మాంసాది భౌమం యథాశబ్దమితరయోశ్చ"***

మాంసము పురీషాదులు అన్నాత్మకమైన భూమియొక్క కార్యాలు. మూత్రము, రుధిరము జల కార్యాలు

అన్నాన్ని పురుషుడు భుజిస్తున్నాడు. భుజించిన అన్నము మూడు భాగాలవుతున్నది. అవే మలము, మాంసము, మనస్సు, అన్నంలోని

| | | |
|---|---|---|
| స్థూలభాగము | – | మలము |
| మధ్యభాగము | – | మాంసము |
| సూక్ష్మభాగము | – | మనస్సు |

అంటే ధాన్యాదిరూపంలో పృథివినే భుజిస్తున్నాడు. అదే విధంగా మనం త్రాగిన నీరు; మూత్రము, రక్తము, ప్రాణములుగా మారుతోంది. అలాగే మనం భుజించే తేజోపదార్థము (నూనె, నెయ్యి మొదలైనవి) ఎముకలు, మజ్జ, వాక్కుగా మారుతుంది. దీనినే **'త్రివృత్కరణము'** అంటారు. ఈ రకంగా భూతిక భౌతిక పదార్థాలన్నీ త్రివృత్కృతాలే. అయితే ఇది పృథివి అని, ఇది జలము అని, ఇది తేజస్సు అని అనటం ఏ విధంగా సంభవము అనేది ప్రశ్న.

***సూత్రం - 291 "వైశేష్యాత్తు తద్వాదస్తద్వాదః"***

త్రివృత్కృతం జరిగినా, ఏదో ఒక మూలభూతం యొక్క ఆధిక్యత కనిపిస్తుంది. అగ్నిలో తేజస్సు యొక్క ఆధిక్యం, జలంలో జలం యొక్క ఆధిక్యం. పృథివిలో అన్నము యొక్క ఆధిక్యంలాగా ఈ త్రివృత్కృతమనేది లోకవ్యవహారం కోసం చెప్పబడింది. ఈ రకంగా నామరూప వ్యక్తీకరణ ఈశ్వరకృతమే కాని, జీవకృతం కాదు. అంటూ ఈ అధికరణను పూర్తి చేశారు.

***దీంతో బ్రహ్మసూత్రాలలోని రెండవ అధ్యాయం పూర్తయింది.***

# మూడవ అధ్యాయం

ఈ అధ్యాయంలో  ఉపకరణ సహితుడైన జీవుడికి సంసారగతి ఏ విధంగా సంభవిస్తోంది? వాటి అవస్థలు ఏవి? మోక్షం ఎలా వస్తుంది? అనే విషయాలు వివరించారు.

## మొదటి పాదం

ఈ పాదంలో వైరాగ్యం రావటానికి పంచాగ్నివిద్య మూలంగా సంసారగతిలో భేదాలు చెప్పి తద్వారా వైరాగ్యం కలిగించే మార్గం చెబుతున్నారు. ఇందులో ఆరు అధికరణలు ఇరవై ఏడు సూత్రాలు ఉన్నాయి.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | తదంతర ప్రతిపత్యధికరణము | మరణ సమయంలో జీవుడు భూత సూక్ష్మపరివేష్టితుడై ఉంటాడు | 7 |
| 2. | కృతాత్యయాధికరణము | కర్మశేషం నూతన జన్మను ఇస్తుంది | 4 |
| 3 | అనిష్టాదికార్యాధికరణము | ఇష్టాపూర్తకర్మలు చెయ్యని వారికి చంద్రలోక ప్రాప్తి లేదు | 10 |
| 4 | సాభావ్యాపత్యధికరణము | అవరోహణలో జీవుడు ఆకాశాదుల సాదృశ్యాన్ని మాత్రమే పొందుతాడు | 1 |
| 5. | నాతిచిరాధికరణము | చంద్రలోకం నుంచి దిగటం త్వరగానే జరుగుతుంది | 1 |
| 6. | అన్యాధిష్టితాధికరణము | జీవుడికి ధాన్యాదులతో సంసర్గం మాత్రమే ఉంటుంది | 4 |

మొత్తం అధికరణలు 6. సూత్రాలు 27.

ముందుగా **'పంచాగ్నివిద్య'** అంటే ఏమిటో చూద్దాం. ఈ విషయమంతా సామవేదానికి సంబంధించిన **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉంది.

## పంచాగ్నివిద్య

పూర్వకాలంలో బ్రహ్మజ్ఞానాన్ని గురించి కొంత పరిజ్ఞానం క్షత్రియుల దగ్గర మాత్రమే ఉండేది. దాన్ని మొదటిసారిగా పాంచాలదేశాన్ని పాలించే ప్రవాహణుడు బ్రాహ్మణులకు చెప్పాడు.

పాంచాలదేశాన్ని ప్రవాహణుడు అనే రాజు పాలిస్తుండేవాడు. ఆ రోజుల్లో ఒకసారి శ్వేతకేతువు అనే బ్రాహ్మణబాలకుడు అమితదర్పంతో రాజాస్థానంలో అడుగుపెట్టాడు. శ్వేతకేతువు విద్యావంతుడు, తండ్రివద్దనే విద్యాభ్యాసం చేశాడు. అతనికి తెలిసింది ఎంతైనా, లోకంలోని విద్యనంతా అభ్యసించానని, విజ్ఞానమంతా తన సొంతమని అపోహచెందాడు.

రాజాస్థానంలో ప్రవేశించే సమయానికి అక్కడ వేదాంతచర్చలు జరుగుతున్నాయి. పండితులంతా సభతీర్చారు. ప్రశ్నలు అడుగుతున్నారు. సమాధానాలు చెబుతున్నారు. యజ్ఞయాగాదులు జరిగేటప్పుడు, ఉత్సవాలు, వేడుకల సందర్భంగా ఇలాంటి సభలు జరగటం ఆచారంగా ఉండేది. ఆ కారణంగానే ఇప్పుడుకూడా ఆధ్యాత్మిక చర్చలు జరుగుతున్నాయి.

శ్వేతకేతువు రాజాస్థానంలోకి ప్రవేశించాడు. ఆ సమయంలో రాజైన ప్రవాహణుడు అక్కడే ఉన్నాడు. లోపలికి వస్తున్న శ్వేతకేతును చూసి రాజు అడుగుతున్నాడు. "కుమారా! నీవు విద్యాభ్యాసం పూర్తి చేశావనుకుంటాను". "అవును మహారాజా! మా తండ్రిగారి దగ్గరే చదువంతా పూర్తిచేశాను" అన్నాడు శ్వేతకేతువు. అతను చెప్పిన సమాధానంలో డాబు, దర్పము కనిపించినాయి. సర్వశాస్త్ర పారంగతుణ్ణి అని గర్వం కూడా తొంగిచూసింది. దాంతో ప్రవాహణుడికి శ్వేతకేతువును పరీక్షించాలనిపించింది. ఇక ప్రశ్నించటం మొదలు పెట్టాడు.

"బ్రాహ్మణబాలకా! మనుష్యులు మరణించిన తరువాత ఎక్కడికి వెడతారు?"

"నాకు తెలియదు" అన్నాడు శ్వేతకేతు.

"మరణించిన తరువాత ఈ లోకానికి ఏ విధంగా తిరిగి వస్తారు."

“నాకు తెలియదు”

“మృతి చెందినవారు ప్రయాణం చేసే దేవయాన, పిత్రుయాన మార్గాలను వివరించు”

“నాకు తెలియదు”

“ప్రకృతి పరిణామక్రమంలో పురుషుడిగా ఆకారం దాల్చే ఉదంతము ఏది?”

నాకు తెలియదు”

“శ్వేతకేతూ! ఇన్ని ప్రశ్నలు అడిగాను. ఏ ఒక్కదానికీ సమాధానం చెప్పలేదు. కాని విద్యాభ్యాసం మాత్రం పూర్తయిందని చెప్పావు. దీన్నిబట్టి చూస్తే ముఖ్యమైన విషయాలను గురించిన పరిజ్ఞానం నీకు శూన్యమనిపిస్తోంది” అన్నాడు రాజు.

ఆ మాటలకు సిగ్గుపడ్డాడు శ్వేతకేతువు. విద్యాభ్యాసం పూర్తయిందని ఇంత వరకు అనుకున్నది భ్రమ అని తెలిసిపోయింది. సరాసరి తండ్రి వద్దకు వచ్చి నాన్నగారూ ! నేను నేర్చుకోవలసిన విద్య అంతా పూర్తయిపోయింది అని చెప్పారు. అది నిజమే అని నేను కూడా అనుకున్నాను. కాని పాంచాలదేశాధీశుడు ఐదు ప్రశ్నలడిగితే ఒక్కదానికి కూడా సమాధానం చెప్పలేక తెల్లమొగం వేశాను. విద్యాభ్యాసం పూర్తయిందని మీరు ఎందుకు చెప్పారో నాకు అర్థం కావటం లేదు” అన్నాడు. తనకు సభలో ఎదురైన పరిస్థితినంతా వివరించాడు.

రాజుకు శ్వేతకేతువుకు జరిగిన సంభాషణ అంతా విన్నటువంటివాడై ‘నాయనా! మహారాజు వేసిన ప్రశ్నలకు సమాధానం నాక్కూడా తెలియదు. తెలిస్తే నీకెందుకు చెప్పను?’ అన్నాడు శ్వేతకేతు తండ్రి అయిన ఉద్దాలకుడు.

ఆ తరువాత కుమారునితోపాటుగా రాజు అడిగిన విషయాలను గురించి తెలుసుకోవాలనిపించింది ఉద్దాలకుడికి. తండ్రి కొడుకులిద్దరూ పాంచాలదేశానికి బయలుదేరారు. రాజప్రాసాదం చేరుకుని, రాజదర్శనం కోసం నిరీక్షిస్తూ అక్కడే ఉన్నారు. ఆ మరునాడు రాజదర్శనం లభించింది. వినయ విధేయతలతో రాజుకు నమస్కరించారు.

పాంచాల దేశాధీశుడైన ప్రవాహణుడు శ్వేతకేతువును, అతని తండ్రి ఉద్దాలకుడినిసగౌరవంగా ఆదరించి “బ్రాహ్మణోత్తమా! ఏమాశించి నావద్దకు

వచ్చారు? ధనరాసులు కావాలా? సంపద కావాలా? మీకు ఏం కావాలో చెప్పండి.” అన్నాడు.

ఆ మాటలు విన్న ఉద్దాలకుడు “మహారాజా! నీ ధనం కోసంగాని, గోధనం కోసం గాని ఇక్కడకు రాలేదు. నీవద్దనున్న జ్ఞానధనంకోసం వచ్చాను. అదే నీవు నాకు చేయవలసిన దానం. నా కుమారుణ్ణి అడిగిన ప్రశ్నలేవో నాతో చర్చించి సమాధానాలు చెప్పి నా సందేహాలు తీర్చు. నాకు జ్ఞానాన్ని ప్రసాదించు. అదే నేను కోరేది” అన్నాడు.

బ్రాహ్మణుడి మాటలకు చాలా ఆనందించి మహారాజు వారిని “కొంత కాలం మీరిక్కడే ఉండండి” అని అభ్యర్థించాడు. రాజుకోరిక మేరకు తండ్రీ కొడుకులు కొంతకాలం రాజాస్థానంలోనే ఉన్నారు.

ఒకరోజు మహారాజు తండ్రీకుమారుల వద్దకు వచ్చి “బ్రాహ్మణ శ్రేష్ఠులారా! ఇంతవరకు ఈ జ్ఞానం సంప్రదాయ సిద్ధంగా క్షత్రియుల దగ్గరే పరంపరగా ఉంటూ వచ్చింది. మొట్టమొదటిసారిగా బ్రాహ్మణులైన మీకు వివరిస్తున్నాను” అంటూ చెప్పటం ప్రారంభించాడు.

బ్రాహ్మణవరేణ్యా! నీ కుమారుణ్ణి అడిగిన ఆఖరు ప్రశ్నకు ముందుగా సమాధానం చెబుతాను. యజ్ఞాలు ఐదురకాలు. యజ్ఞవిధానం ఈ విధంగా ఉంటుంది. స్వర్గమేఅగ్ని. ఆ యజ్ఞానికి హవిస్సు సూర్యుడు. యజ్ఞఫలం జీవన ప్రదాత్రి అయిన సోమరసం. ఈ సోమరసం మేఘాల వరకు ప్రయాణిస్తుంది. మేఘాలద్వారా భూలోకంలో వర్షిస్తుంది. దానివల్ల అన్నం ఉత్పత్తిఅవుతుంది. అన్నం మానవుడికి లభిస్తుంది. అది అతనిలో రేతస్సుగా మారుతుంది. ఆ శక్తి స్త్రీలో ప్రవేశిస్తుంది. అప్పుడామె గర్భందాలుస్తుంది. బిడ్డను ప్రసవిస్తుంది. ఈ రకంగా ఐదుయజ్ఞాల దశలు దాటి ప్రాణంపొంది ఆ యజ్ఞఫలమైన సోమరసం పురుషుడుగా మారుతుంది.

ఉద్దాలక అరుణీ ! ఇప్పుడు మిగిలిన నాలుగు ప్రశ్నలకు సమాధానం చెబుతాను విను. మానవుడు నాలుగు భూతాల సమ్మిశ్రస్వరూపుడు. అతడు మరణించిన తరువాత ఆ నాలుగు భూతాలు ఆయాభూతాలలో కలిసిపోతాయి. మానవుని యోగ్యత అనేది అతడు చేసిన కర్మలమీద ఆధారపడి ఉంటుంది. అతడు గనక ఆత్మానుభవం పొందితే వెలుగు బాటలో ప్రయాణం చేస్తాడు. అదే దేవయానము. ఆ బాటలో

ప్రయాణం చేసి పుణ్యఫలాన్ని అనుభవించి మోక్షాన్ని పొందుతాడు. ఇట్టి మానవుడికి పునర్జన్మం ఉండదు. అతడికి శాశ్వతమైన ఆనందం లభిస్తుంది.

అలా కాకుండా ఐహికమైన కోరికలు తీర్చుకోటానికే జీవిస్తూ, పుణ్యకర్మలను ఆచరిస్తూ జీవనయానం సాగిస్తే పితృయానం గుండా స్వర్గానికి చేరతాడు. అక్కడ అతని పుణ్యఫలం పూర్తిగా అనుభవించి మళ్ళీ ఈ లోకంలో జన్మిస్తాడు.

మానవుడు తన జీవిత రహస్యాన్ని తెలుసుకోలేక పాపాలు చేస్తుంటాడు. త్రాగుడు, జూదము, వ్యభిచారము, దొంగతనము మొదలైన పనులు చేస్తాడు. అటువంటివాడు అటు అమృతత్వాన్ని, ఇటు స్వర్గాన్నీ కూడా పోగొట్టుకుంటాడు. ఇటువంటివారు నీచమైన జన్మలు ఎత్తుతారు.

కొంతమంది అతిప్రయత్నము మీద బ్రహ్మలోకాన్ని పొందుతారు. బ్రహ్మలోకము పొందినవారికి పునర్జన్మ లేదు. అయితే ఎక్కువమంది పుణ్యకార్యాలు చేసి స్వర్గము పొందుతారు. ఎంతమంది అక్కడికి చేరినా స్వర్గము మాత్రం క్రిక్కిరిసిపోదు.

సంస్కారవంతులు, సదాచార సంపన్నులు ఉత్తమయోనిని పొందుతారు. అంటే బ్రహ్మక్షత్రియ వైశ్యాది యోనులు పొందుతారు. సంస్కారహీనులు కుక్కలుగా, పందులుగా, ఛండాలురుగా నీచయోనులందు జన్మిస్తారు. పాపాత్ములు పైన చెప్పిన రెండు మార్గాలలోనూ పోరు. వారు శీఘ్రంగా పుడుతూ చస్తూ ఉంటారు. వీరిది మూడవ మార్గం. అందుకనే ఇన్ని జీవులు నిత్యం చస్తున్నా స్వర్గము మొదలైన పరలోకాలు నిండవు. చచ్చిన వారంతా అక్కడికి పోరు. మరణకాలంలో కూడా పాపాత్ములు నీచమైన చావు చస్తారు. వీరి శరీరం ఏ ప్రమాదంలోనో చిన్నాభిన్నమై పోతోంది. ఆనవాలుకూడా దొరకదు. కొంతమందినైతే కుక్కలు పీక్కు తింటాయి. అటువంటి వారి జీవితాన్ని అందరూ అసహ్యించుకుంటారు.

బ్రాహ్మణుల బంగారం దొంగిలించేవారు. బ్రాహ్మణుడై పుట్టి మదిరపానం చేసేవాడు, గురుపత్నీ సంగమము చేసేవాడు, బ్రహ్మహత్య చేసేవాడు ఈ నలుగురు పతితులు. వీరితో సహవాసం చేసేవాడు కూడా పతితుడే. ఇంతకన్నా నీచపు పనులు చేసేవారు క్రిమికీటకాలుగా జన్మిస్తారు.

ప్రవాహణుడు చెప్పిన ఈ విద్యను పంచాగ్ని విద్య' అంటారు. ఈ విద్యను తెలుసుకున్నవాడు పైన చెప్పిన పతితులతో సహవాసము చేసినప్పటికీ అతడికి ఆ పాపము అంటదు. అని చెబుతోంది పంచాగ్నివిద్య.

# 1. తదంతరప్రతిపత్త్యధికరణము

## (మరణ సమయంలో జీవుడు భూతసూక్ష్మ పరివేష్టితుడై ఉంటాడు)

ఈ విషయాన్ని మొదటిదైన '**తదంతరప్రతిపత్త్యధికరణ**'ములో వివరించారు. ఇందులో ఏడు సూత్రాలు ఉన్నాయి.

జీవుడు జీర్ణమైన ఈ దేహాన్ని వదలి వేరొక శరీరంలో ప్రవేశిస్తాడు. అలా వెళ్ళేటప్పుడు ఆ క్రొత్త దేహానికి కారణరూపమైన భూతసూక్ష్మాలతో కలిసివెడతాడా? లేక వాటితో కూడకుండానే వెడతాడా? అనేది ప్రశ్న. **బ్రహ్మసూత్రాలకు శంకరుడు భాష్యం వ్రాశాడని విని, శంకరుణ్ణి పరీక్షించటానికి వచ్చినప్పుడు ఈ సూత్రాన్నే వివరంచమని అడిగాడు వ్యాసభాగవానుడు.** దీనికి సమాధానం చెబుతున్నారు.

***సూత్రం – 292 "తదన్తరప్రతిపత్తౌ రంహతి సంపరి ష్వక్తః ప్రశ్నప్రతిరూపణాభ్యామ్"***

ఇంకొక శరీరాన్ని పొందటానికి జీవుడు భూత సూక్ష్మాలతో కలిసి వెడుతున్నాడు. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఈ విధంగా చెప్పబడింది. పూర్వకాలంలో పాంచాల దేశాన్ని ప్రవాహణుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. అతని ఆస్థానానికి వచ్చాడు శ్వేతకేతువు. వచ్చిన శ్వేతకేతువును పరిక్షించే ఉద్దేశ్యంతో ఐదు ప్రశ్నలు వేశాడు ప్రవాహణుడు. వాటిలో ఒక్కదానికీ సమాధానం చెప్పలేదు శ్వేతకేతువు. ఆ తరువాత శ్వేతకేతువు తండ్రి అయిన ఉద్దాలకుడు వచ్చి, ఆ ప్రశ్నలకు సమాధానం చెప్పమని కోరగా, రాజైన ప్రవాహణుడు చెబుతున్నాడు.

"యజ్ఞాలు ఐదు రకాలు. యజ్ఞవిధానం ఈ విధంగా ఉంటుంది. స్వర్గమే అగ్ని. యజ్ఞానికి హవిస్సు సూర్యుడు. యజ్ఞఫలం సోమరసం.

1. ఈ సోమరసం మేఘాల వరకు ప్రయాణిస్తుంది.
2. మేఘాలద్వారా భూలోకంలో వర్షిస్తుంది.
3. దానివల్ల అన్నం పుడుతోంది.
4. అన్నం మానవునిలో రేతస్సుగా మారుతుంది.

5. ఆ శక్తి స్త్రీలో ప్రవేశిస్తుంది. అప్పుడామె గర్భం దాల్చి బిడ్డను ప్రసవిస్తుంది. ఈ రకంగా ఐదురకాల యజ్ఞదశలు దాటి యజ్ఞఫలమైన సోమరసం పురుషుడుగా

మారుతుంది. ఇదే పంచాగ్నివిద్య అని చెప్పబడింది. దీనివల్ల 'జలము, భూమి ఇత్యాది భూతసూక్ష్మాల వల్లనే జీవి మరొక దేహం పొందుతున్నది' అని తెలుస్తున్నది.

ఇక భూతసూక్ష్మాలు అంతటా లభిస్తాయి కదా ! ప్రత్యేకంగా వెంట పెట్టుకుని వెళ్ళటం ఎందుకు? అన్నది ప్రశ్న.

భూతసూక్ష్మాలు సర్వత్రా లభించినప్పటికీ, దేహానికి అవసరమయ్యే బీజాలు సర్వత్రా లభించవు. అందుచేత భూతసూక్ష్మాలను వెంట తీసుకువెళ్ళటం జరుగుతుంది. అయితే గొంగళిపురుగు ఒక ఆకును పూర్తిగా అనుభవించి, దాన్ని నిస్సారం చేసి, వేరొక ఆకుమీద ఆశ్రయం సంపాదించి అంటే ఇంకొక ఆకును పట్టుకుని శరీరాన్ని కుంచించివేసి మొదటి ఆకునుండి పూర్తిగా ఇవతలకు వస్తుంది. అలాగే ఆత్మ తానున్న శరీరాన్ని చంపి వేరొక శరీరాన్ని ఆశ్రయిస్తుంది" అని **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పబడింది. మళ్ళీ అనుమానం. అలాంటప్పుడు ఈ సూక్ష్మభూతాలతో పని ఏమిటి?" దీనికి సమాధానం. జీవుడు తన కర్మ ఫలం అనుభవించటానికి క్రొత్త శరీరం పొందుతున్నాడు. పాత శరీరాన్ని వదలి కర్మానుసారము క్రొత్త శరీరంలోకి ప్రవేశిస్తాడు అంతేగాని క్రొత్త శరీరం పొంది, పాతదానిని వదలటం జరగదు.

***సూత్రం - 293 "త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్"***

జీవుడు అన్ని భూతాలతోనూ కలిసి వెడుతున్నాడు. గతంలో చెప్పినట్లుగా జీవుడు ఉదకాలతో చుట్టబడిన వాడై వెడుతున్నాడు. అంటే యజ్ఞఫలమైన సోమరసం మేఘాలదాకా వెళ్ళి, వర్షంగా కురుస్తోంది. ఆ వర్షంవల్ల పంటలు పండుతున్నాయి. ఈ వర్షమే ఆ ఉదకము. అయితే జీవుడు ఉదకంతో కలిసి వెడుతున్నాడు కాని, మిగిలిన సూక్ష్మభూతాలతో కలిసి వెళ్ళటం లేదు కదా? అని అనుమానం వస్తుంది. పృథివి, జలము, అగ్ని ఈ మూడింటి రూపము అన్నింటిలోనూ ఉన్నది. ఈ మూడింటిలోని ప్రతిదానిలో అన్నీ ఉన్నాయి. కాబట్టి ఉదకంతో జీవుడు వెళ్ళాడు అంటే, మిగిలిన సూక్ష్మభూతాలతో కూడా కలిసి వెళ్ళినట్లే అని గుర్తుంచుకోవాలి. శరీరంలో పృథివి, అగ్ని భాగాలకన్న జలభాగమే ఎక్కువ ఉంటుంది కాబట్టే ఉదకాలకు పురుషుడనే పేరు కలిగింది.

***సూత్రం - 294 "ప్రాణగతేశ్చ"***

వేదాల ననుసరించి జీవునితోపాటుగా ఇంద్రియాలు కూడా వెడుతున్నాయి. కాబట్టి జీవుడు సూక్ష్మభూతాలతో పరివేష్టితుడై ఉన్నాడని తెలుస్తున్నది. **బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు, జనక మహారాజుకు ఆత్మను గురించి వివరిస్తూ "అంత్యకాలంలో జీవాత్మ శరీరంనుచి బయటకు పోవటానికి మార్గం కనిపిస్తుంది. ఆ స్థితిలో ఆత్మ శిరస్సుద్వారా కాని, నవరంధ్రాల ద్వారా గాని బయటకు పోతుంది. దానితోపాటే ప్రాణంకూడా బయటకు పోతుంది. ప్రాణం శరీరం నుంచి బయటకు రాగానే ఇంద్రియాలన్నీ శక్తిహీనమయి పోతాయి. ఆ స్థితిలో జీవుడు మంచి విజ్ఞానవంతుడుగా ఉంటాడు. విజ్ఞానంతో కూడిన ప్రదేశానికి పోతాడు. అతనితోపాటు, అతని జ్ఞానము, అతడు చేసిన కర్మ, పూర్వజన్మ సంస్కారము అతని వెంట వెడతాయి అంటాడు. దీనిని బట్టి ఆశ్రయం లేకుండా ఇంద్రియాలు ఉండలేవు. ఎక్కడికీ పోలేవు. కాబట్టి వాటికి ఆధారంగా, ఆశ్రయంగా సూక్ష్మభూతాలు ఉండాలి. ఈ విధంగా జీవునితోబాటు సూక్ష్మభూతాలు కూడా వెడతాయి అని తెలుస్తోంది.

***సూత్రం - 295 "అగ్న్యాదిగతిశ్రుతేరితి చేన్న భాక్తత్వాత్"***

మానవుడు చనిపోయిన తరువాత వాక్కు మొదలైన ఇంద్రియాలు వాటివాటి అభిమాన దేవతలలో లీనమవుతాయి అని వేదంలో చెప్పబడింది. కాబట్టి ప్రాణాలు జీవుని అనుసరించవు. అనేవాదన, నిజంకాదు.

**'వాయురనిలమదేథం భస్మాంతంశరీరం'** మానవుడు మరణించిన తరువాత అతని శరీరంలోని పంచభూతాలు (ఇంద్రియాలు) పంచభూతాలలో అంటే వాటి కారణాలలో కలిసిపోతాయి. అంటోంది **ఈశావాశ్యోపనిషత్తు.**

**బృహదారణ్యకోపనిషత్తు**లో ఆర్తభాగుడు యాజ్ఞవల్క్యుణ్ణి అడుగుతున్నాడు. యాజ్ఞవల్క్యా ! మానవుడు చనిపోయిన తరువాత అతని యొక్క

| | | |
|---|---|---|
| వాక్కు | – | అగ్నిలో లీనమయిపోతుంది |
| ప్రాణం | – | వాయువులో లీనమయిపోతుంది |
| నేత్రాలు | – | ఆదిత్యునిలో లీనమైపోతాయి |

| | | |
|---|---|---|
| శ్రోత్రాలు | – | దిక్కులయందు లీనమైపోతాయి |
| మనస్సు | – | చంద్రునిలో లీనమైపోతుంది |
| శరీరం | – | భూమిలో లీనమైపోతుంది |
| హృదయాకాశం | – | భూతాకాశంలో లీనమయిపోతుంది |
| కేశాలు | – | వనస్పతులలో లీనమైపోతాయి |
| శుక్రశోణితాలు | – | జలంలో కలిసిపోతాయి |

అంటే ఇంద్రియాలన్నీ వాటి వాటి కారణాల్లో లీనమైపోగా మిగిలిన పురుషుడు ఏమౌతాడు? దేని ఆధారంగా అతడు మళ్ళీ శరీరం ధరిస్తాడు?"

రోమాలు, కేశాలు వనస్పతులలో లీనమవటము జరిగే పనికాదు. ఇది అసంభవం. అందుచేత ఇది ఔపచారికం అంటే గౌణము. ముఖ్యము కానిది అని చెప్పాలి. జీవించి ఉన్నంతవరకు అగ్ని మొదలైన దేవతలు ఇంద్రియాలకు ఉపచారం చేసి, మరణంతో విరమిస్తున్నారు అనే అర్థం అంతేకాని వాగాదులు అగ్న్యాదులలో లయం కావు.

***సూత్రం – 296 "ప్రథమేఽ శ్రవణాదితి చేన్నతా ఏవ హ్యుపపత్తేః"***

ద్యులోకం మొదలు ఆయా అగ్నులందు ఉదకాలు ఆహుతి అవటం నిరూపించగలిగితే, ఐదవ ఆహుతి పురుషుడు ఎలా అయ్యాడో నిరూపించవచ్చు. కాని మొదటి ఆహుతి 'శ్రద్ధ' అన్నారు ఉదకము అని చెప్పలేదు. 'ద్యులోకమే అగ్ని. ఈ అగ్నితోనే దేవతలు శ్రద్ధను ఆహుతిగా ఇస్తున్నారు' అని **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పబడింది. మిగిలిన నాలుగు ఆహుతులు సోమము, వృష్టి, అన్నము, రేతస్సు వీటికి జల సంబంధమున్నది అయితే శ్రద్ధ అనేది కేవలము జ్ఞానమే తప్ప జలం ఎలా అవుతుంది? మొదటి ఆహుతే అప్రమాణమైనప్పుడు మిగిలినవి కూడా అంతే అవుతాయి కదా! అని వారి వాదన.

అయితే వేదంలో, మొదటి ఆహుతిలో జలం చెప్పబడలేదు కాబట్టి జీవులు జలాన్ని తీసుకుపోరు అనేది నిజం కాదు. యజ్ఞయాగాదులు చేసినవారు స్వర్గలోకానికి పోతారు. శ్రద్ధ అనేది మనోవృత్తి. కాబట్టి శ్రద్ధను మనస్సు నుంచి వేరుచేసి హోమం

చెయ్యటం జరగదు. ఉదకాలను హోమం చెయ్యగలం. **తైత్తిరీయసంహిత**లో యజమాని చేసే పుణ్యకర్మ కోసం జలము శ్రద్ధను పుట్టిస్తున్నది' కాబట్టి శ్రద్ధ అంటే ఉదకము.

***సూత్రం - 297 "అశ్రుతత్వాదితి చేన్నేష్టాదికారిణాం ప్రతీతేః"***

పైన చెప్పిన దానిని బట్టి జలానికి మల్లే జీవులను వర్ణించలేదు. కాబట్టి జీవులు ఉదకంతో కూడి ప్రయాణించటం లేదు. అని వీరి వాదన. అది నిజం కాదు. ఎందుకంటే యజ్ఞయాగాలు చేసినవారు అలానే వెడుతున్నారని నమ్మకం.

యాగకర్మలు ఆచరించినవారు, జలపరివేష్ఠితులై స్వర్గలోకానికి పోతారు. అయితే ఇష్టాధికారులు కర్మఫలాన్ని అనుభవించటానికి చంద్రలోకం వెడుతున్నారనేది అబద్ధం. ఎందుకంటే వారు చంద్రుని చేరి అక్కడ అన్నము అవుతున్నారు. అని చెప్పబడింది. కాబట్టి దేవతలు వారిని భక్షిస్తారు. అంతేకాని వారు ఫలాన్ని అనుభవించడానికి వెళ్ళటం లేదు అని మళ్ళీ వాదన.

***సూత్రం - 298 "భాక్తం వానాత్మవిత్త్వాత్తథా హి దర్శయతి"***

అది నిజం కాదు. ఇష్టాధికారులు దేవతలకు అన్నము అవుతారని, భోగపదార్థాలు అవుతారని శ్రుతులలో ఉన్నది. దేవతలకు అన్నమవుతారు అంటే భోగసాధనాలయి వారికి సంతోషం కలిగిస్తారు అని చెప్పారు. ఇష్టాధికారులు దేవతలకు అన్నమవుతారని చెప్పటం ప్రధానమైన విషయం కాదు. అలా అంటే స్మృతులకు భంగం వస్తుంది.

దేవతలకు అన్నమవుతారంటే ఉపభోగసాధనాలు అవుతారని అర్థం. అంటే భార్యాపుత్రులులాగా దేవతలకు వీరు భోగసాధనాలయి సంతోషం కలిగిస్తారు. వీరంతా ఆత్మజ్ఞానం లేనివారు. అందుచేతనే ఈ రకంగా అవుతున్నారు. ఎవరైతే నేను వేరు, దేవత వేరు అని భావిస్తారో వారు పశుప్రాయులు. మానవులకు పశువు భోగసాధనము. అలాగే మానవుడు కూడా పశువయి దేవతలకు భోగసాధనమవుతాడు. మానవుడు ఫలభోగం కోసం చంద్రలోకానికి సూక్ష్మభూత పరివేష్ఠితుడై వెడతాడు. అని చెప్పారు ఈ అధికరణలో

# ౨. కృతాత్యయాధికరణము

## (కర్మశేషం క్రొత్తజన్మను నిర్ణయిస్తుంది)

ఈ విషయం రెండవదైన **'కృతాత్యయాధికరణము'**లో వివరించారు. ఇందులో నాలుగు సూత్రాలున్నాయి.

జగత్తులోని జీవరాశి అంతా కర్మలు చేస్తాయి. ఆ కర్మఫలాన్ని అనుభవించి, స్వర్గం నుంచి తిరిగి వచ్చేటప్పుడు కర్మశేషం వారిని అంటి ఉంటుంది. ఆ కర్మశేషమే నూతన జన్మను నిర్ణయిస్తుంది అంటారు గదా! **ఛాందోగ్యోపనిషత్తు**లో ప్రవాహణుడు అనే రాజు ఉద్దాలకుడికి పంచాగ్నివిద్య బోధిస్తూ" మహర్షీ! మానవుడు నాలుగు భూతాల మిశ్రమ స్వరూపుడు. మరణానంతరము ఆ నాలుగు భూతాలు, ఆభూతాలలో కలిసిపోతాయి. మానవుని యోగ్యత అనేది అతడు చేసిన కర్మలమీద ఆధారపడి ఉంటుంది. అతడికి ఆత్మానుభవం కలిగితే దేవయానంలో ప్రయాణం చేసి మోక్షం పొందుతాడు. అట్టి మానవుడికి పునర్జన్మ ఉండదు. అలా కాకుండా ఐహికమైన కోరికలు తీర్చుకోవటానికే జీవిస్తూ, పుణ్యకర్మలు ఆచరిస్తూ జీవితం సాగించేవారు పిత్రుయానం గుండా స్వర్గం చేరతారు. అక్కడ వారి పుణ్యఫలం పూర్తిగా అనుభవించి, మళ్ళీ ఈ లోకంలో జన్మిస్తారు. పాపాలు చేసినవాడు అమృతత్త్వాన్ని, స్వర్గాన్నీ పోగొట్టుకుని, నీచమైన జన్మలు ఎత్తుతుంటాడు.

సంస్కారవంతులు, సదాచార సంపన్నులు ఉత్తమ యోని పొందుతారు. పాపాత్ములు పుడుతూ, శీఘ్రంగా చస్తూ ఉంటారు. పాపులు నీచమైన చావు చస్తారు. వీరి జీవితాన్ని అందరూ అసహ్యించుకుంటారు.

బ్రాహ్మణుల సొమ్ము దొంగతనం చేసేవాడు, మధిరపానం చేసే బ్రాహ్మణుడు, గురుపత్నీ సంగమం చేసేవాడు, బ్రహ్మహత్య చేసేవాడు. ఈ నలుగురూ పతితులు. వీరితో సహవాసం చేసేవాడు కూడా పతితుడే. వీరు పశువులు, పక్షులుగా జన్మిస్తారు. ఇంతకన్న నీచపుపనులు చేసేవారు క్రిమికీటకాలుగా పుడతారు. అని చెప్పారు.

ఇక్కడ అనుమానం ఏమిటంటే మానవులు స్వర్గం పొందటానికి అవసరమైన దానికన్న ఎక్కువకర్మను చేస్తారా? కర్మలో కొంతభాగం మాత్రమే అనుభవిస్తున్నారా? లేక కర్మశేషం లేకుండానే తిరిగి వస్తారా?

**సూత్రం - 299 "కృతాత్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేతమనేవం చ"**

మానవుడు స్వర్గసుఖాల కోసం కర్మలు చేస్తున్నాడు. వాటి ఫలితము అనుభవించిన తరువాత, మిగిలిన కర్మతో కూడినవాడై తిరిగి ఈ లోకానికి వస్తున్నాడు. ఈ విషయం శ్రుతులు, స్మృతులు కూడా చెబుతున్నాయి.

స్వర్గసుఖాలు అనుభవించి వచ్చిన సంస్కారవంతులు, సదాచార సంపన్నులు ఉత్తమ యోనులందు జన్మిస్తారు. అంటే బ్రహ్మ క్షత్రియ వైశ్య యోనులు పొందుతారు. సంస్కారం లేనివారు కుక్కలు, పందులుగా, ఛండాలురుగ నీచయోనులందు జన్మిస్తారు. అని **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పబడింది. దీని అర్థం ఏమంటే, అక్కడ ఆ కర్మఫలం పూర్తిఅయ్యేవరకు ఉండి తరువాత భూలోకానికి వస్తాడు అంటే మానవుడు చేసిన కర్మకు ఫలితము స్వర్గనరకాల్లో అనుభవించాలి. మళ్ళీ ఆ కర్మననుసరించే ఉత్తరజన్మలు ఎత్తాలి.

ఇక్కడ ఒక చిన్న అనుమానం వస్తుంది. మానవుడు తాను చేసిన కర్మ ఫలితాన్ని స్వర్గనరకాల్లో అనుభవించాడు కదా? కర్మశేషం అనుభవించటానికి భూలోకంలో జన్మిస్తాడు అని అంటున్నారు. ఈ విషయమే ఉపనిషత్తులు కూడా చెబుతన్నాయి. కర్మఫలితాన్ని అనుభవించిన తరువాత ఇంకా కర్మశేషం ఎక్కడ నుంచి వస్తుంది? ఇది అనుమానం.

ఒక చిన్న ఉదాహరణ చూడండి. ఒక విద్యార్థి బి.టెక్. చదివాడు. గోల్‌మెడల్ వచ్చింది. అతడు కష్టపడి చదివిన దానికి ఫలితం అది. గవర్నర్ గారి చేతులమీదుగా గోల్డ్‌మెడల్ అందుకున్నాడు. అందరూ ప్రశంసించారు. పత్రికలు కూడా అతన్ని గురించి గొప్పగా వ్రాశాయి. ఆ తరువాత అతడు చదివిన చదువు, చూపిన ప్రతిభ వచ్చిన మార్కులు ఆధారంగా మంచి ఉద్యోగం దొరికింది. అతను చదివిన చదువుకు గోల్డ్‌మెడల్ రావటమే ఫలితము. మరి ఈ ఉద్యోగం దేని ఆధారంగా వచ్చింది? ఆ చదువు ఆధారంగానే కదా? అదే కర్మశేషం. అలాగే కర్మఫలితాన్ని స్వర్గనరకాల్లో అనుభవించి, కర్మశేషం అనుభవించటానికి భూలోకంలో జన్మిస్తాడు. మానవుడు ఎత్తే జన్మ, ధరించే శరీరము కూడా ఆ కర్మని బట్టే ఉంటుంది. పుణ్యకర్మలు చేసినవారు ఉత్తమయోనుల యందు, పాపకర్మలు చేసినవారు నీచయోనులయందు, దుర్మార్గులు

పశుపక్ష్యాదులుగా, జన్మిస్తారు కాబట్టి **అందరూ మంచి పనులు చెయ్యటానికే ప్రయత్నించండి ఉత్తమజన్మ పొందండి. అంటున్నారు పరమానంద నాథులు.**

ఇక తిరిగి వచ్చేటప్పుడు ఏ మార్గంగుండా వస్తారు? వెళ్ళిన మార్గం గుండానా? ఇంకొక మార్గం గుండానా? తిరిగి వచ్చేటప్పుడు ఏ మార్గం గుండా నయినా రావచ్చు. వెళ్ళిన మార్గం గుండానే రావాలనే నియమం ఏమీ లేదు.

***సూత్రం - 300 "చరణాదితి చేన్నోపలక్షణార్థేతి కార్ష్ణాజినిః"***

శ్రుతులలో ఆచరణము, శీలము వలన జన్మవస్తున్నది అంటున్నారు. అలాంటప్పుడు ఇష్టాధికారులు కర్మతో ద్యులోకం నుండి దిగి వస్తున్నారనటానికి అవకాశం లేదు అంటున్నారు. కాని ఇది నిజం కాదు. ఎందుకంటే ఆచారమనేది కర్మలోని భాగమే. వ్యాసుడి పూర్వీకుడైన 'కార్ష్ణాజిని' అనే మహర్షి ఈ సూత్రాన్ని సమర్ధిస్తున్నాడు.

***సూత్రం - 301 "ఆనర్థక్యమితి చేన్న తదపేక్షత్వాత్"***

పుణ్యకర్మలే జన్మహేతువులైనప్పుడు ఆచారమనేది అర్థం లేనిది అవుతుంది కదా అని వారి వాదన. కాని అట్లా జరగదు. మౌనము, మితభాషణ, అబద్ధం ఆడకుండాఉండటం, ఇతరులకు హానిచెయ్యకపోవటం, పరోపకారం వంటివి. వాటివల్ల మనంచేసే కర్మ యొక్క శక్తి పెరుగుతుంది. పదిమందికి భోజనాలు పెట్టాం. దాని ఫలితం మనకి వస్తుంది. కాని వారు భోజనం చేసిన విస్తళ్ళు కూడా మనమే తీసెయ్యాలి. అప్పుడు ఫలితం ఇంకా ఎక్కువగా ఉంటుంది. ఈ కారణం చేతనే గతంలో ఒక స్వామి దగ్గరగ సేవాకార్యక్రమం నిర్వహించటానికి ముందుగానే అనుమతి తీసుకుని మరీ భోజనాలు వడ్డించటం, మంచినీరు అందించటం వంటి పనులు చేసేవారు. ఈ సేవాకార్యక్రమంలో అతిగొప్పది ఏమిటో తెలుసా? పాయఖానాలు శుభ్రం చెయ్యటం, దీనికి విపరీతమైన రద్దీ ఉండేది. నియమ నిష్ఠలతో, అంకిత భావంతో చేస్తేనే కర్మ మంచిఫలితాన్ని ఇస్తుంది. **యజ్ఞాలు, యాగాలు మొదలైనవి ఆచారవంతుడు చేసినప్పుడు మాత్రమే మంచిఫలితాన్ని ఇస్తాయి. ఆచారం లేకపోతే కర్మ ఫలప్రదంకాదు. ఆచార హీనుడైన వాడిని వేదాలుగాని, వేదోక్త కర్మలుగాని పవిత్రుణ్ణి చెయ్యలేవు.**

అయితే మానవుని ఉత్తరజన్మకు కర్మలే కారణంగాని, ఆచారము, శీలము కారణము కావు. కాని ఆచారవంతుడు చేసిన కర్మకు ఫలితం ఎక్కువగా ఉంటుంది. కాబట్టి **ఆచారము, సచ్ఛీలము ఉండి తీరాలి.**

***సూత్రం - 302 "సుకృతదుష్కృతే ఏవేతి తు బాదరిః"***

చరణము అనే పదానికి ఆచారము, అనుష్ఠానము, కర్మ అని అర్థం ఉంది. అయితే చరణము అనే పదానికి కొంతమంది ఆచారము అని అర్థం చెప్పినప్పటికీ, ఆచారమనేది కర్మలోని భాగమే. చరణము అంటే కర్మ అనే అర్థం చెప్పాలి. కాబట్టి చరణము అంటే పాపపుణ్యాలే అని వ్యాసుని పూర్వీకుడైన బాదరి అనే మహర్షి అభిప్రాయపడుతున్నాడు. అందుచేత స్వర్గసుఖాలనుభవించిన వ్యక్తి తిరిగి వచ్చేటప్పుడు కర్మశేషంతో వస్తాడు.

## 3. అనిష్టాదికార్యాధికరణము

### (ఇష్టాపూర్తములు చెయ్యనివారికి చంద్రలోక ప్రాప్తి లేదు)

చంద్రలోకానికి ఎవరు వెడతారు? అనే విషయం మూడవదైన **అనిష్టాది కార్యాధికారణము**లో వివరిస్తున్నారు. ఇందులో పది సూత్రాలున్నాయి.

ఇష్టాపూర్తములు. ఇవి రెండు రకాల కర్మలు. 1. ఇష్టము 2. పూర్తము. ఇవి రెండూ కామ్యకర్మలే. ఇష్టము అంటే – యజ్ఞయాగాలు, ఉపనయనాలు, ప్రియత్వము, ఆతిధ్యము మొ॥వి. పూర్తము అంటే – బావులు, చెరువులు త్రవ్వించటం, దేవాలయ నిర్మాణము, చెట్లు నాటించటం, అన్నదానము మొ॥వి. ఈ పనులు చేసినవారు స్వర్గం పొందుతారు.

ఇష్టాపూర్త కర్మలు చేసినవారు చంద్రలోకానికి వెడతారు. మరి ఇష్టాపూర్తములనబడే కర్మలు చెయ్యనివారికి కూడా చంద్రలోక ప్రాప్తి ఉన్నదా?"

***సూత్రం – 303 "సంయమనే త్వనుభూ యేతరేషామా రోహావరోహౌ తద్గతిదర్శనాత్"***

యజ్ఞయాగాదులు చేసినవారే కాదు. నిషిద్ధ కర్మలు చేసిన వారికి కూడా చంద్రలోకం ప్రాప్తిస్తుంది. **కౌషీతకీ ఉపనిషత్తు**లో ఈ లోకం నుంచి వెళ్ళేవారందరూ

చంద్రలోకం చేరతారు అని చెప్పబడింది. పుణ్య పాపాలు చేసిన వారందరూ అక్కడికి చేరతారని చెప్పబడింది. కాబట్టి పుణ్యాత్ములు మాత్రమే చంద్రలోకం చేరతారనే మాట నిజం కాదు అని వీరి వాదన.

***సూత్రం – 304 "సంయమనే త్వనుభూ యేతరేషామా రోహావరోహౌ తద్గతిదర్శనాత్"***

ఇష్టాపూర్తి కర్మలు చెయ్యనివారు యమలోకానికి పోయి, కష్టాలు అనుభవించి తిరిగి ఈ లోకంలో జన్మిస్తారు. ఇష్టాపూర్తి కర్మలు అంటే చెరువులు, బావులు తవ్వించటం, సత్రాలు కట్టించటం, అన్నదానం చెయ్యటం, చెట్లు నాటించటం వంటి ప్రజోపయోగమైన పనులు. ఈ కర్మలు చెయ్యని వారికి చంద్రలోక ప్రాప్తి లేదు. **పుణ్యకార్యాలు చేసిన వారికే చంద్రలోక ప్రాప్తి.**

చంద్రలోకము పుణ్యఫలాన్ని అనుభవించటానికే ఉన్నది. పాపులకు అక్కడ స్థానం లేదు. **కఠోపనిషత్తు**లో యముడు నచికేతుడితో "వేదాలలో చెప్పిన పాపకర్మలు వదలిపెట్టని వాడు, ఇంద్రియలోలుడు, ఏకాగ్రతలేనివాడు, మనశ్శాంతిలేనివాడు బ్రహ్మజ్ఞానాన్ని పొందలేడు. బాలుడికి, డబ్బుమీద వ్యామోహంగల వాడికి, మూఢుడికి, పరలోక సాధనాలు తోచవు. వారంతా నావశం అవుతారు అంటాడు. అంటే పాపాలు చేసినవారు యమలోకానికి పోతారు.

***సూత్రం – 305 "స్మరన్తిచ"***

వ్యాసుడు, మనువు మొదలైన వారు, పాపకర్ములు యమలోకానికి పోతారని చెబుతున్నారు.

***సూత్రం – 306 "అపిచ సప్త"***

రౌరవాది నరకాలు ఏడున్నాయని, అక్కడే పాపులు శిక్షలు అనుభవిస్తారని పురాణాలలో చెప్పబడింది.

## రౌరవాది నరకాలు

నరకాలు 18 ఉన్నాయి. వాటిలో వివిధ రకాలయిన పాపులు శిక్షించబడతారు. అవి :

| నరకము | శిక్షించబడే పాపులు |
|---|---|
| 1. రౌరవము | పక్షపాతి, అసత్యవాది, భ్రూణహంతకుడు |
| 2. సూకము | సురాపానం చేసేవాడు, బ్రాహ్మణ హంతకుడు, బంగారం దొంగిలించేవాడు, వాడి స్నేహితుడు |
| 3. తప్తలోకము | క్షత్రియులను, వైశ్యులను, రాజభటులను చంపేవాడు, సోదరితో, గురుపత్నితో సంగమించే వాడు. |
| 4. మహాజ్వాల | కోడలు, కూతురులతో సంగమించే వాడు |
| 5. శబలము | పరదూషకుడు, గురువును అవమానించే వాడు, వేదాన్ని అవమానించేవాడు, వేదాన్ని విక్రయించే వాడు, పొందరాని స్త్రీని పొందేవాడు. |
| 6. విమోహము | మర్యాద లేనివాడు, చోరుడు |
| 7. క్రిమిభక్ష్యము | దేవతలను, బ్రాహ్మణులను, పితరులను ద్వేషించే వాడు. |
| 8. లాలాభక్ష్యము | దుర్మార్గులను ఆశ్రయించి యాగాలు చేసేవాడు. పితృదేవతలను, అతిథులను ఆదరించకుండా భోజనం చేసేవాడు. |
| 9. విశసనము | బాణాలు వేసేవాడు, రంధ్రాన్వేషకుడు, కత్తి యుద్ధము మొ॥వి సాధన చేసేవాడు. |
| 10. అథోముఖము | పట్టరానిదానం పట్టేవాడు, అనర్హులచే యాగాలు చేయించేవాడు, జ్యోతిశ్శాస్త్రము తెలియకుండా తెలిసినట్లు నటించేవాడు. |
| 11. కృమిపూయము | ఒంటరిగా మృష్టాన్న భోజనం చేసేవాడు, లక్క, పాదరసము, మాంసము, ఉప్పు, నువ్వులు అమ్మే బ్రాహ్మణుడు. |

| | | |
|---|---|---|
| 12. | రుధిరాంధము | నాటకాలు వేసి జీవించేవాడు, చేపలు పట్టేవాడు, కుండలలో అన్నం తినేవాడు, విషం పెట్టేవాడు, కుట్టుపనివాడు, తన భార్య వ్యభిచారంతో జీవించే వాడు; పర్వతాలలో స్త్రీలతో రమించేవాడు, ఇండ్లకు నిప్పు పెట్టేవాడు, శకునాలు చెప్పేవాడు, గ్రామ పురోహితుడు. |
| 13. | వైతరణి | కల్లు అమ్మేవాడు, గ్రామాలు నాశనం చేసేవాడు, తేనె పట్టులు తీసేవాడు. |
| 14. | కృచ్ఛము | రేతస్సు పానము చేసేవాడు, మర్యాద అతిక్రమించి ప్రవర్తించే వాడు, శౌచము లేనివాడు, మోసకారి. |
| 15. | అసిపత్రవనము | అనవసరంగా చెట్లు నరికేవాడు. |
| 16. | వహ్నిజ్వాలము | గొర్రెల మందలు పెంచేవాడు, వేటగాండ్రు. |
| 17. | పదంశము | స్వాశ్రమభ్రష్టుడు. |
| 18. | శ్వభోజనము | పగటివేళ, కలలోను రేతస్కలనము చేసుకునే బ్రహ్మచారి, పుత్రులచే చదివించబడే తల్లి తండ్రులు. |

కాని రౌరవాది నరకాలు మొత్తం పద్దెనిమిది రకాలు అని చెబుతున్నా, రౌరవాది నరకాల్లో చిత్రగుప్తుడు మొదలైనవారున్నారని, వారే పాపులకు శిక్షలు వేస్తారని ఉన్నదికదా. మరి యముడే పాపఫలాన్ని అనుభవింపచేస్తాడని ఎలా చెప్పగలరు?

***సూత్రం - 307 "తత్రాపి చ తద్వ్యాపారాదవిరోధః"***

ఆ నరకాలన్నింటికి యముడే అధిపతి. **కఠోపనిషత్తు**లో యముడు "కర్మఫలం వల్ల లభించే ఫలితము అనిత్యము. ఆత్మనిత్యము. ఆ విషయం తెలిసి కూడా నేను అగ్నిచయనంచేశాను. దాని ఫలితంగా మృత్యుదేవతనయ్యాను" అని నచికేతుడికి చెబుతాడు. కాబట్టి యముడే మృత్యుదేవత నరకలోకాలకుఅధిపతి. చిత్రగుప్తాదు లందరూ యముడికి వశులై ఉంటారు.

***సూత్రం - 308 "విద్యాకర్మణోరితి తు ప్రకృతత్వాత్"***

వేదాలలో దేవయాన పిత్రుయాన మార్గాలు రెండష్ట్ర చెప్పబడ్డాయి. ఉపాసన మార్గం దేవయనం. కాగా కర్మమార్గం పిత్రుయానం. ఈ రెండు మార్గాలు లేని క్షుద్రులు జనన మరణ రూపమైన మూడవ మార్గం గుండాపోతారు. కాబట్టి వారికి చంద్రలోకప్రాప్తి లేదు. **ఛాందోగ్యోపనిషత్తు**లో ప్రవాహణుడు చెబుతాడు" సంస్కార వంతులు, సదాచారసంపన్నులు ఉత్తమయోనిపొందుతారు. సంస్కారహీనులు కుక్కలు, పందులుగా జన్మిస్తారు. పాపాత్ములు పైరెండు మార్గాలలోను పోరు. వీరిది మూడవమార్గం. అందుకనే నిత్యము ఇన్నిజీవులు చస్తున్నా పరలోకాలు నిండవు. చచ్చినవారంతా అక్కడికిపోరు.

***సూత్రం - 309 "న తృతీయే తథోపలబ్ధేః"***

నూతన దేహం పొందటానికి ఐదు ఆహుతులు పూర్తి కావాలని **ఛాందోగ్యోపనిషత్తు**లో ప్రవాహణుడు పంచాగ్నివిద్యలో చెప్పాడు. కాని మూడవ మార్గంలో పోయేవారికి ఆ నియమం లేదు. అది లేకుండానే దేహారంభ నియమం కలుగుతుంది.

***సూత్రం - 310 "స్మర్యతేఽపి చ లోకే***

లోకంలో తలచబడుతున్నది కూడా. ఏమని? అయోనిజులకు అంటే స్త్రీ పురుష సంయోగం లేకుండానే జన్మించే వారికి ఈ నియమం లేదు. పురాణాలలో చెప్పబడిన సీత, ద్రౌపతి, ద్రోణాచార్యుడు, దృష్టద్యుమ్నుడు మొదలైన వారు ఈ కోవకు చెందినవారే. అలాగే క్రిమికీటకాదులు కూడా. వీరికి ఏ నియమం లేదు.

***సూత్రం - 311 "దర్శనాచ్చ"***

స్వేదజాలు - బురద లేక చమట నుంచి పుట్టినవి

ఉద్భిజాలు - భూమి నుంచి పుట్టినవి

వీటి విషయంలో ఆహుతుల సంఖ్యానియమం లేదు.

అయితే **ఛాందోగ్యోపనిషత్తు**లో

అండజములు - గ్రుడ్డు నుండి పుట్టేవి

జీవజములు - జీవులవలన పుట్టేవి

ఉద్భిజములు - భూమి నుండి పుట్టేవి

అని మూడు రకాలే చెప్పారు గదా? మరి స్వేదజాలు ఎక్కడ నుంచి వచ్చాయి?

*సూత్రం – 312 "తృతీయశబ్దావరోధః సంశోకజస్య"*

ఈ స్వేదజాన్ని, ఉద్భిజంతోనే గ్రహించాలి. ఉద్భిజము అంటే భూమిని ఛేదించుకుని పుట్టేది. స్వేదజము జలాన్ని ఛేదించుకుని పుడుతుంది. ఛేదించుకుని పుట్టటమనేది ఈ రెండింటికీ సమానమే. నేలనుంచి పుట్టినా, నీటినుంచి పుట్టినా రెండూఒకటే.

## 4. సాభావ్యాపత్యధికరణము

## (అవరోహణలో జీవుడు ఆకాశాదుల సాదృశ్యాన్ని మాత్రమే పొందుతాడు)

ఈ విషయం నాల్గవదైన **స్వాభావ్యాపత్త్యధికరణము**లో వివరించారు. ఇందులో ఒకే సూత్రం ఉంది.

ఇష్టాపూర్తములాచరించే వారు చంద్రలోకాన్ని పొందుతారని, అక్కడ భోగాలు అనుభవించి తిరిగి భూలోకానికి వస్తారని చెప్పబడింది. **మానవుడు చేసే ప్రతికర్మ (పని)కీ ఫలితంఉంటుంది. అది మంచిదైనా, చెడ్డదైనా. అలాగే తెలిసిచేసినా, తెలియకచేసినా. అయితే తెలిసిచేసిన పనికి ఫలితం ఇంకాఎక్కువ ఉంటుంది. కాని ఫలితం ఆశించకుండానే పనులు చెయ్యాలి.** వీరు చంద్రలోకం నుంచి వెళ్ళిపోతున్నాననే దుఃఖంతోనే వెళ్ళినమార్గంగుండానే తిరిగివస్తారు. ఆకాశాన్ని, ఆకాశం నుండి వాయువును పొంది, వాయువు నుండి – ధూమమై, ఆ ధూమం – అభ్రమై, (అభ్రము అంటే మబ్బు అని అర్ధం.) అభ్రం–మేఘమై వర్షిస్తుంది. ఇలా తిరిగివచ్చేవారు ఆకాశము, వాయువు, ధూమం, అభ్రం, మేఘము అవుతారని చెప్పబడింది. నిజంగా ఆకాశాదికంగా అయిపోతారా? లేక ఆయా భావాల్ని పొందుతారా?

*సూత్రం – 313 "సాభావ్యాపత్తిరుపపత్తేః"*

ఎవరైనా సరే ఒకరి పోలికను పొందగలరే తప్ప, ఆ రూపాన్ని పొందలేరు. కాబట్టి తిరిగి వచ్చేవారు దుఃఖపూరితుడై కరిగిపోయి, క్రమంగా వాటి వాటి సాద్రుస్యాన్ని పొందుతూ వర్షరూపంలో భూమికి వస్తారు.

## 5. నాతిచిరాధికరణము

### (చంద్ర లోకం నుంచి దిగటం త్వరగానే జరుగుతుంది)

ఈ విషయం ఐదవదైన **నాతిచిరాధికరణము**లో వివరించారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

"చంద్రమండలం నుంచి వచ్చే జీవి ధాన్యరూపం పొందటానికి పూర్వం సాదృశ్యంలో పూర్వం ఉన్న రూపంలో ఎంత కాలం పాటు ఉంటుంది?"

***సూత్రం - 314 "నాతిచిరేణవిశేషాత్"***

ఆకాశంతో సాద్రూపం పొంది అంటే ఆకాశము, వాయువు, ధూమము మొదలైన వాటి రూపాలు (పోలికలు) పొంది అతితక్కువ కాలంలోనే వర్షరూపంలో భూమికి వస్తాడు. అవరోహణ క్రమంలో ఆలస్యం ఉండదు. త్వరగానే జరుగుతుంది.

తాను చేసిన కర్మ పరిపక్వమై, అనుభవించటానికి యోగ్యమయ్యే వరకు అక్కడే ఉండి, ఆ కర్మ అనుభవించటానికి యోగ్యమైన తరువాత జీవి భూమి మీదకి వస్తాడు. అప్పుడు అతడు ధరించవలసిన దేహము నిశ్చయమవుతుంది.

## 6. అన్యాధిష్ఠితాధికరణము

### (జీవుడికి ధాన్యాదులతో సంసర్గ మాత్రమే ఉంటుంది.)

ఈ విషయం ఆరవదైన **అన్యాధిష్ఠితాధికరణము**లో వివరించారు. ఇందులో నాలుగు సూత్రాలున్నాయి.

సంసర్గ అంటే సంబంధము అని అర్థం.

చంద్రమండలం నుంచి దిగి వచ్చేవారు వర్షరూపంలో నేలమీదికి వచ్చిన తరువాత ధాన్యము (వడ్లు), యవలు, ఓషధులు, నువ్వులు, మినుములు మొదలైన రూపాల్లో జన్మిస్తారు అని చెబుతున్నారు కదా. మరి ఇష్టాపూర్త కర్మలు చేసి, చంద్రలోక సుఖాలనుభవించి తిరిగి వచ్చేవారు కూడా, పాపాత్ములలాగా ఇలాంటి రూపాలు పొందవలసిందేనా?

**సూత్రం - 315 "అన్యాధిష్ఠితే పూర్వవదభిలాపాత్"**

కర్మశేషం గల జీవుడు పైన చెప్పినట్లుగా ఆకాశము, వాయువులతో సంసర్గము పొందినట్లుగానే, అన్యజీవులచే అధిష్టించబడినటువంటి ధాన్యపు గింజలతో సంబంధము మాత్రమే పొందుతాడు. కాబట్టి కర్మానుభవము మాత్రము ఉండదు.

కర్మశేషం కలిగిన జీవులు ధాన్యపు మొక్కలుగా పుట్టరు. ఆ రూపాల్లో పాపాత్ములు మాత్రమే పుడతారు. వీరు వర్షరూపంలో భూమి మీద పడి ధాన్యపు గింజలతో కలిసినప్పుడు వారికి కర్మఫలభోగమనేది ఉండదు. వీరు ఆకాశవాయు రూపాల్లో ఉన్నప్పుడు ఏ రకంగా కర్మఫలభోగం లేదో, ఇప్పుడూ అంతే. కాబట్టే ధాన్యం దంచటము, ఉడికించటము, చెట్లు నరకటము వలన వచ్చే బాధలు వీరికుండవు. ద్రోవలో వీటితో కొంతసేపు కలిసి ఉండి, తరువాత జన్మకై వెళ్ళిపోతారు. కాబట్టి కర్మశేషం గలవారికి ధాన్యపుగింజలు భోగస్థానాలు కావు.

యజ్ఞయాగాదులు చేస్తున్నప్పుడు వీరు ఆ కర్మలలో హింస చేస్తారు. దాని ఫలితంగానే ధాన్యం రూపంలో ఇందాక మీరు చెప్పినట్లు దంచటం వంటి కష్టాలు పడుతున్నారు. అని అంటున్నారు కదా?

**సూత్రం - 316 "అశుద్ధమితిచేన్న శబ్దాత్"**

యజ్ఞకర్మలు పరిశుద్ధమైనవికాదు అని అనకూడదు. వేదం, విధిరూపంలో ఆ యొక్క హింసను ధర్మమనే చెబుతున్నది.

ధర్మాధర్మాల నిర్ణయం శాస్త్రాలవల్ల జరుగుతుంది 'ఏ ప్రాణిని హింసించకూడదు' అనేది సామాన్య సూత్రం. పదిమంది మేలుకోసం ఒక జీవిని సంహరించినా తప్పు కాదు. పాపం రాదు. ప్రజలను రక్షించటానికి రాక్షసులను, దుర్మార్గులను, క్రూరమృగాలను సంహరించటం పాపంకాదు. దేవతల ప్రీతికోసం పశువును సంహరించాలి. ఇది విశేష వచనం. ఇది అధర్మం కాదు. హింస అంతకన్నా కాదు. అంటున్నాడు వ్యాసుడు. కాని నేటి సమాజంలో యజ్ఞయాగాలలో పశువులను వధించటం హింసగా పరిగణిస్తారు. ఇది శిక్షార్హము కూడా.

దేశకాలమాన పరిస్థితులను బట్టి ఒకప్పటి ధర్మము, ఇంకొకసారి అధర్మ మవుతుంది. ఆ రోజులలో యజ్ఞయాగాలలో జరిగే జంతుబలి హింస కాదు. దీనికి రాజశాసనాలు కూడా ఉన్నాయి. కాని ఇవాళ్ళ కాలం మారిపోయింది.

యజ్ఞయాగాలలో జంతుబలి నిషిద్ధం. అలా చేసినవారు శిక్షకు పాత్రులౌతారు. చంద్రలోకం నుంచి తిరిగి వచ్చేవారు ధాన్యరూపం దాల్చరు.

***సూత్రం - 317 "రేతసిగ్యోగో౽థ"***

వ్రీహ్యాదిభావం పొంది, రేతస్సును విడిచిపెట్టే పురుషుని యొక్క భావం కలుగుతుంది.

అంటే కర్మశేషంతో చంద్రలోకం నుంచి వచ్చేవారు ధాన్యభావం తరువాత, రేతస్సును విడిచిపెట్టే యువకుల భావం పొందుతారు.

అందువల్ల జీవుడు వ్రీహ్యాదులతో సంబంధం పొందటమే తప్ప ఆయా ధాన్యాలుగా పుట్టటంలేదు అని తెలుస్తున్నది.

***సూత్రం - 318 "యోనేః శరీరమ్"***

ఆ పురుషుడు యోనియందు రేతస్సును ఉంచటంవల్ల, తన కర్మలను అనుభవించటానికి వీలైన శరీరాన్ని ఆ యోనినుంచి పొందుతాడు. అందుచేతనే **ఛాందోగ్యోపనిషత్తు**లో సంస్కారవంతులు, సదాచారసంపన్నులు ఉత్తమయోనిని పొందుతారు. అంటే బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యయోనులు పొందుతారు. సంస్కార హీనులు, కుక్కలు, పందులు, ఛండాలురుగా జన్మిస్తారు. ఇంకా పాపాత్ములు క్రిమికీటకాదులుగా జన్మిస్తారు. అని చెప్పబడింది. కాబట్టి కర్మశేషంతో భూమిని చేరేజీవికి ధాన్యపుగింజలతో సంబంధం మాత్రమే ఉంటుంది.

ఇక్కడ ఒక విషయాన్ని గుర్తించాలి. సంస్కారవంతులు, సదాచారసంపన్నులు ఉత్తమయోనిని పొందుతారు. అంటే బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులుగా జన్మిస్తారు. సంస్కారహీనులు కుక్కలు, పందులు, ఛండాలురుగా జన్మిస్తారు అన్నారు. మరి వ్యాసుడు, వాల్మీకి వంటివారు అలా జన్మించలేదు కదా? ఇది చిన్న అనుమానం. వాల్మీకి సాక్షాత్తు బ్రహ్మదేవుని కుమారుడు. శాపవశాన బోయవాడుగా జన్మించాడు.

సత్యయుగంలో ఒకసారి బ్రహ్మ స్వర్గం చూడటాని వెళ్ళాడు. రంభ మొదలైన అప్సరాంగనలతో కలిసి ఇంద్రుడు ఎదురువెళ్ళి స్వాగతం చెప్పాడు. ఆ సమయంలో అప్సరసలను చూసిన బ్రహ్మకు రేతస్సు పతనమైంది. అది కొంత బురదతో కలిసింది. దానిలోంచి ఒక బాలుడు జన్మించాడు. అతడు బ్రహ్మదగ్గరకు వెళ్ళి "బురదతో కలిసిన నీ రేతస్సు నుంచి జన్మించాను. నాకు ఆకలిగా ఉంది. తినటానికి ఏమైనా

పెట్టు" అన్నాడు. ఇదంతా ఇంద్రుడి సభలోనే జరిగింది. తన రహస్యం అందరి ముందు బయట పెట్టాడు అని కోపగించి "నువ్వు పతితుడవై, బోయలతో కలిసి క్రూరకర్మలు చేస్తావు" అని శపించాడు. ఆ బాలుడు ప్రార్థించగా "రామనామ జపం చేసి శాపవిమోచనం పొందుతావు" అన్నాడు. ఆ బాలుడే వాల్మీకి. కారణజన్ముడు. ఈ విషయం ఉత్తర రామాయణంలో ఉంది.

ఇక వ్యాసుడు. **వ్యాసాయ విష్ణురూపాయ, వ్యాసరూపాయ విష్ణవే** సాక్షాత్తు శ్రీమన్నారాయణుని అవతారం. మొదటిసారి బ్రహ్మమానసపుత్రుడుగా అపాంతరతముడు అనే పేరుతో జన్మించి వేదవిభజన చేశాడు. ఆ తరువాత ప్రతిమహాయుగంలోని ద్వాపర యుగంలో ఏదో ఒక పేరుతో అవతరించి వేదవిభజన చేస్తున్నాడు. 28వ మహాయుగంలో పరాశరుడి కుమారుడిగా దాశరాజకన్య అయిన సత్యవతి గర్భాన కృష్ణద్వైపాయనుడుగా జన్మించి, వేదవిభజన చేసి వేదవ్యాసుడైనాడు. ఇతడు కారణజన్ముడు.

అగస్త్య మహర్షి, ద్రోణాచార్యుడు కుంభసంభవులు. ద్రౌపది అగ్నికుండం నుంచి జన్మించింది. సీతామాత భూజాత. లేడినుంచి జన్మించినవాడు విభాండకుని కుమారుడైన ఋష్యశృంగుడు. ఇతడే దశరథ మహారాజుతో పుత్రకామేష్టి యాగం చేయించాడు. ఇలా అనేకమంది మహానుభావులున్నారు. వీరందరూ దైవాంశ సంభూతులు, కారణజన్ములు. **సంస్కారవంతులు ఉత్తమయోనుల యందు జన్మిస్తారు** అనేది సామాన్య సూత్రం. ప్రతిచోటా అలానే జరగదు. ఉత్తముల జనన మరణాలు వారి అధీనంలోనే ఉంటాయి. వారు ఎప్పుడు ఎక్కడ ఎలా కావాలనుకుంటే అలా జన్మిస్తారు. అందుకే **ఏరులపారుల బ్రహ్మఋషుల జననములు మనము ఎన్నతగినవి కావు.** ఏరు అంటే ప్రవాహము. పారు అంటే పారేది. వీటినే నదీనదాలు అంటారు. ఇవి ఎక్కడ ఎలా పుట్టినాయి? వీటి జన్మరహస్యం ఏమిటి? అని కాదు ఆలోచించాల్సింది. వాటి గొప్పదనం. వాటివల్ల మనకి కలిగే మేలు గురించి ఆలోచించాలి. ఒక్క మాటలో చెప్పాలంటే సంస్కారవంతులు ఉత్తమజన్ములు, పాపాత్ములు నీచపుజన్మలు ఎత్తుతారు. ఇంకొక విషయం ఏమంటే పాపాత్ములకు శత్రువులు దూరంగా కాకుండా, ఇంట్లోనే జన్మిస్తారు హిరణ్యకశ్యపుడికి ప్రహ్లాదుడిలా అంటున్నారు పరమానంద నాథులు.

***దీంతో బ్రహ్మసూత్రాలలోని మూడవ అధ్యాయంలోని***
***మొదటి పాదం పూర్తయింది.***

# మూడవ అధ్యాయం

## రెండవ పాదం

జనన మరణాలకు సుఖదుఃఖాలకు కారణం కర్మఫలమే. కాబట్టి మానవుడికి వాటి మీద విరక్తి కలగాలి. అంటే పరమాత్మను గురించిన జ్ఞానం కలగాలి. ఈ జ్ఞానాన్ని రెండవ పాదంలో వివరిస్తున్నారు. ఇందులో ఎనిమిది అధికరణలు, నలభై ఒక్క సూత్రాలు ఉన్నాయి.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | సంధ్యాధికరణము | స్వప్నావస్థలో జీవుని స్థితి | 6 |
| 2. | తదభావాధికరణము | సుషుప్తిలో జీవుని స్థితి | 2 |
| 3. | కర్మానుస్మృతిశబ్దవిద్యధి కరణము | జీవుడు సుషుప్తిలో బ్రహ్మతో ఏకీభవించి, మళ్ళీ దానినుంచే మేల్కొంటాడు | 1 |
| 4. | ముగ్దేర్ధసంపత్యధికరణము | మూర్ఛయొక్క స్వరూపము | 1 |
| 5. | ఉభయలింగాధికరణము | బ్రహ్మకు సగుణ, నిర్గుణ రూపాలు | 11 |
| 6. | ప్రకృత్యైతావత్యాధికరణము | 'నేతి' పదం బ్రహ్మను నిరోధించదు | 9 |
| 7. | పరాధికరణము | బ్రహ్మము అద్వితీయము | 7 |
| 8. | ఫలాధికరణము | కర్మఫలానిచ్చేది పరమాత్మే | 4 |

మొత్తం అధికరణలు 8. సూత్రాలు 41.

పరమాత్మను గురించిన జ్ఞానం కావాలంటే ముందుగా అవస్థాత్రయాన్ని తెలుసుకోవాలి. **జాగ్రస్వప్న సుషుప్తీనాం సాక్షిభూత్యై నమోనమః** అంటోంది. లలితా అష్టోత్తరం. ఈ మూడు అవస్థలకు సాక్షి ఆ పరమేశ్వరియే. ముందుగా అవసాత్రయాన్ని చూద్దాం.

# అవస్థాత్రయము

అవస్థలు మూడు. అవే జాగ్రస్వప్న సుషుప్తులు. వీటినే 1. జాగ్రదావస్థ 2. స్వప్నావస్థ 3. సుషుప్తి అంటారు. పరమేశ్వర స్వరూపం ఈ అవస్థలు మూడింటికీ సాక్షీభూతము.

**"జాగ్రస్వప్న సుషుప్తీనాం సాక్షిభూత్యై నమోనమః"** అంటోంది లలితా అష్టోత్తరము. జాగ్రస్వప్న సుషుప్తులనే మూడు అవస్థలకు లలితాత్రిపురసుందరి సాక్షీభూతమై ఉంటుంది.

**1. జాగ్రదావస్థ :** ఇది జీవుడు మేలుకొని ఉన్న స్థితి. ఈ స్థితిని అనుభవించేది స్థూలదేహము. రక్తము, మాంసము, మలమూత్రాలు, మజ్జ, శుక్లము, నరాలు, ఎముకలు మొదలైన అసహ్యకరమైన పదార్థాలతో నిండి పైన అందంగా చర్మం కప్పబడి ఉంటుంది. అదే స్థూలదేహము. మానవుడు తాను చేసిన కర్మననుభవించటానికే ఈ దేహాన్ని ధరిస్తాడు. సుఖదుఃఖాలు, మానావమానాలు, అనుభవించేది ఈ దేహంతోనే. వర్ణాశ్రమ ధర్మాలు, వివిధ దశలు ఈ దేహానికే వర్తిస్తాయి. జీవుడు భోగాలు అనుభవించటానికి ఈ దేహమే ఆధారము. స్థూలశరీరం ఎప్పుడూ జాగ్రదావస్థలోనే అనుభవం పొందుతుంది. ఈ స్థూలశరీరానికి, జాగ్రదావస్థకు అభిమాని వైశ్వానరుడు. జాగ్రదావస్థే ఇతని సంచార స్థానము. జగత్తంతా బ్రహ్మమయమే. వ్యష్టిగా విశ్వుడు. సమిష్టిగా విరాడ్రూపుడు.

మాండూక్యోపనిషత్తులో **సర్వం హ్యేతద్బ్రహ్మ, అయమాత్మాబ్రహ్మ, సోయమాత్మా చతుష్పాత్తు** చరాచర జగత్తంతా బ్రహ్మమయమే. ఆత్మకూడా పరబ్రహ్మ స్వరూపమే. ఆత్మకు నాలుగు పాదాలున్నాయి.

**జాగరిత స్థానోబహిప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి ముఖః స్థూలభుగ్ వైశ్వానరోప్రథమపాదః**

విశ్వంలోని జీవుల అన్నింటి స్వరూపుడు అయినవాడు వైశ్వానరుడు. జాగ్రదావస్థ ఇతని సంచార స్థానము. ఇతనికి సప్తాంగాలు, పంధొమ్మిది ముఖాలు ఉంటాయి. సప్తాంగాలు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | స్వరము | – శిరస్సు | 5. | జలం | – మూత్రస్థానం |
| 2. | సూర్యుడు | – కన్ను | 6. | భూమి | – పాదాలు |
| 3. | వాయువు | – ప్రాణం | 7. | ఆహవనీయాగ్ని | – నోరు |
| 4. | ఆకాశం | – శరీరం | | | |

ఇతని ముఖాలు పందొనిమిది. ముఖము అంటే – అనుభవించే సాధనం. జ్ఞానేంద్రియాలు – 5, కర్మేంద్రియాలు –5, ప్రాణాలు–5, అంతఃకరణ చతుష్టయము – 4 = వెరసి 19. ఇవి ముఖాలు. ఈ ముఖాలతో గతంలో తాను చేసిన కర్మఫలాన్ని అనుభవిస్తూ ఉంటాడు. ఐదు రకాలయిన జీవనోపాధులు, ఐదు అవస్థలుగా చెప్పబడుతున్నాయి. విశ్వ అంటే – జాగరిదావస్థ. స్థూలరూపము, చైతన్యము గల జీవి. ఇటువంటి జీవుల సమిష్టి రూపమే వైశ్వానరుడు. విశ్వరూపము అన్నప్పుడు – ఈ జగత్తుయొక్క స్వరూపము అని అర్థం. పరమేశ్వరుడు విశ్వరూపం చూపించాడు అంటే – చరాచర జగత్తంతా తనరూపమే. ఈ జగత్తంతా తనలోనే ఉన్నది. అనే విషయాన్ని మనకి తెలియజేశాడు అన్న మాట. నిరాకారుడు పరమేశ్వరుడు. అతని యొక్క ప్రతిరూపమే ఈ జగత్తు. జాగ్రదావస్థ అంటే సర్వేంద్రియ గోచరమైనది. ప్రభోదాత్మకమైన సర్వేంద్రియ జ్ఞానముగల విశ్వుడు అనే జీవుని అవస్థనే జాగరము అంటారు. జాగ్రదావస్థలో స్థూలశరీరాభిమాని అయిన పరమేశ్వరుడు విశ్వుని రూపంలో ఉంటాడు. గృహస్తుకు గృహంలాగా జీవికి దేహం ఆధారమై ఉన్నది. జగత్తులో ఇటువంటి దేహానికి ప్రతినిధి వైశ్వానరుడు. జాగ్రదావస్థ అతని సంచారస్థానము. దీనిని అభిమానించే పురుషుణ్ణే – విశ్వుడు, చిదాభాసుడు, వ్యావహారికుడు అంటారు.

సుషుప్తిలో గాఢనిద్ర పోయాడు. ఆ తరువాత తన కర్మను బట్టి స్వప్నదశగాని, జాగ్రదవస్థ గాని పొందుతాడు. జీవుడు నేత్రంలో ఉన్న దశ జాగ్రదవస్థ. కంఠస్థానంలో ఉంటే స్వప్నావస్థ. హృదయ కమలంలో ఉంటే సుషుప్తి. జాగ్రదావస్థలో నేత్రంలో ఉంటాడు. ఇక్కడ నేత్రము అంటే – ఆపాదమస్తకము అని అర్థం. కాబట్టి చిద్రూపియైన జీవుడు జాగ్రదావస్థలో శరీరమంతా వ్యాపించి మేల్కొని ఉన్నాడు. బాగా కాల్చబడిన ఇనుపముక్క అంతటా అగ్ని వ్యాపించినట్లుగా, జీవుడు శరీరంతో

అభేదభావాన్ని పొంది నేను మనిషిని అని నిశ్చయించుకుని ఉంటాడు. ఇలా దేహంతో తాదాత్మ్యం పొందిన జీవుడు ఉదాసీనుడు, సుఖి, దుఃఖి అవుతున్నాడు. ఇక్కడ సుఖదుఃఖాలు కర్మలవల్ల కలిగేవి. ఉదాసీనత స్వాభావికమైనది. బాహ్యాభోగము, మనోరాజ్యము అనే కారణాలవల్ల సుఖదుఃఖాలు లభిస్తాయి. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయములతో కూడి జీవుడు సుఖదుఃఖాల ననుభవించే స్థితి. ఇది.

**స్వప్నావస్థ :** నిద్రలో కలలుగనే స్థితి. ఈ స్థితిలో జీవుడు కంఠస్థానంలో ఉంటాడు. జాగ్రదావస్థలో పురుషుని అనుభవాలే స్వప్నావస్థలో సాక్షాత్కరిస్తాయి. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయముతో కంఠస్థానానికి వచ్చినప్పుడు జీవుడు కనేది స్వప్నము. జాగ్రదావస్థలో అనుభవించిన విషయాలు జ్ఞాపకానికి రావటమే స్వప్నము. ఈ స్థితిలో మనసు చిత్రవిచిత్రాలైన కల్పనలు చేస్తుంది. రాజులు, రాజ్యాలు, రథాలు, గుర్రాలు, ఏనుగులు, సైనికులు, యుద్ధాలు, జయాపజయాలు. వీటన్నింటినీ ఊహించుకుంటుంది. తానే రాజు అయినట్లు భావిస్తుంది. మహదానందాన్ని అనుభవిస్తుంది. ఒక్కొక్కసారి కష్టాలు కలిగినట్లుగా భావించి దుఃఖిస్తుంది. భయపడుతుంది. ఏడుస్తుంది. ఇలా సుఖదుఃఖాలన్నీ అనుభవిస్తుంది. ఈ అవస్థకు అభిమాని – తైజసుడు, స్వప్నకల్పితుడు, ప్రాతిభాసికుడు అనబడతాడు. జాగ్రస్వప్నాలు రెండు స్థితులందు రాగము, ద్వేషము, కామక్రోధాలు, దర్పము, మాత్సర్యము, అహంకారము, ఈర్ష్య, అసూయ, సుఖము, దుఃఖము కలుగుతాయి.

జాగ్రదావస్థలో అనుభవాలు బీజరూపంలో ఉండి స్వప్నకాలంలో మనకు కనిపిస్తాయి. ఇవన్నీ ఈ జన్మలోని అనుభవాలే కానక్కరలేదు. గతజన్మలవి కూడా కావచ్చు. ఈ దశలో ఇంద్రియాలన్నీ విశ్రాంతి తీసుకుంటూ ఉంటాయి. మనస్సు మేల్కొని ఉంటుంది. మనస్సు ఇంద్రియ ధర్మాలు నిర్వర్తిస్తూ ఉంటుంది. జాగ్రదావస్థలో ఇంద్రియ జ్ఞానం స్థిరంగా ఉంటుంది. స్వప్నావస్థలో స్థిరంగా ఉండదు. మనసే ఇంద్రియాల పనులన్నీ చేస్తుంది. స్వప్నమనేది కేవలము మానసిక సంబంధము. నిద్రలో విషయాలు తెలుస్తాయి. మెలకువ రాగానే అన్నీ మాయమవుతాయి. ఈ రకంగా సూక్ష్మశరీరంతో మానవుడు ఈ అనుభూతులు

పొందుతాడు. స్వప్నము సూక్ష్మదేహముయొక్క వ్యవహారము. ఈ స్థితిలో వ్యష్టిదేహాభిమాని తైజసుడు. సమిష్టిగా అతడే హిరణ్యగర్భుడు.

**స్వప్నస్థానోఽ౽తః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి ముఖః**

**ప్రవివిక్తభుక్ తైజసో ద్వితీయపాదః ॥**

ఆత్మయొక్క రెండవ పాదము తైజసుడు. అదే మానసిక స్థితి. ఈ స్థితికి హిరణ్యగర్భుడు అని పేరు. ఇతడు అంతర్ముఖమైన చేతన గలవాడు. స్వప్నంలో జరిగే విషయాలు మాత్రమే గ్రహించగలడు. వైశ్వానరుడికి లాగానే ఇతనికి కూడా సప్తాంగములు, పందొనిమిది ముఖాలు ఉన్నాయి.

**3. సుషుప్తి:** అంతఃకరణలో చిత్తాహంకారాలను వదలి, మనోబుద్ధులతో జీవుడు హృదయ స్థానానికి వచ్చినప్పుడు, దాన్ని సుషుప్తి అంటారు. ఇంద్రియాలన్నీ అవిద్యలో కలసిపోవటమే సుషుప్తి. ఇంద్రియాలన్నీ వ్యాపార శూన్యమైనప్పుడు నిద్రపోతున్నాడు అంటారు. ఇదే సుషుప్తి. దీని అభిమాని – ప్రాజ్ఞుడు, అవిచ్ఛిన్నుడు, పారమార్థికుడు అనబడతాడు. ఇంద్రియ వ్యాపారము నశించిన స్థితే సుషుప్తి. శివసూత్రాలలో దీన్నే మాయ, అజ్ఞానము అన్నారు. ఇక్కడ బాహ్యవస్తుజ్ఞానము ఏమాత్రము ఉండదు. నేను హాయిగా నిద్ర పోయాను. నాకేం తెలియదు అంటాడు. ఇలా అనటం వల్ల అవిద్యా వృత్తులు మూడు ప్రకటింపబడుతున్నాయి. – 1. అజ్ఞానము 2. అహంభావము 3. సుఖము. ఈ మూడు అవస్థలు కలిసినదే సుషుప్తి. అదే నిర్వికార స్వరూపస్థితి. దీన్ని “సంప్రసాదావస్థ” అని కూడా అంటారు. మనస్సు బుద్ధి కూడా హృదయంలో లీనమయ్యే స్థితి. ఈ స్థితిలో ఇంద్రియాలు, బుద్ధి ముఖ్య ప్రాణంలో కలిసిపోతాయి. ఈ రకంగా మనసు, బుద్ధి కూడా లయమయినప్పటికీ, మెలకువ రాగానే తాను సుఖంగా నిద్రించాను అని తెలుస్తోంది. అంటే జ్ఞానము మాత్రమున్నది. ఈ స్థితిలో జీవుడు వ్యష్టిగా ప్రాజ్ఞుడు సమిష్టిగా ఈశ్వరుడు. నిద్రించినప్పుడు ఏ రకమైన కోరికలు, కలలు కూడా లేని స్థితి. ప్రాజ్ఞుడు, సుషుప్తిలో సంచారం చేస్తాడు. ఇక్కడ అతని అనుభవాలన్నీ ఏకమై పోతాయి. చేతనాశక్తి లేదా గ్రహణశక్తి అస్పష్టంగా నిలచిపోతోంది. అతను అసలు చేతనుడా కాదా ? అనే అనుమానం కూడా వస్తుంది.

సుషుప్తిలో ప్రాజ్ఞుడికి బ్రహ్మభావన కలుగుతుంది. ఛాందోగ్యోపనిషత్తులో ఉద్ధాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు సుషుప్తిని గురించి వివరిస్తూ "కుమారా! గాఢనిద్రలో ఉన్నప్పుడు ఇతడు సుషుప్తిలో ఉన్నాడు అంటారు. ఆ స్థితిలో జీవుడు పరమసత్తను పొందుతాడు. అంటే తన నిజస్వరూపాన్ని పొందుతాడు. తన ఆత్మను తాను పొందుతాడు. కాబట్టి అతన్ని గురించి చెప్పేటప్పుడు నిద్రిస్తున్నాడు అంటారు.

అద్దంలో చూసినప్పుడు మన ప్రతిబింబమే మనకు కనిపిస్తుంది. కాని అద్దం తియ్యగానే మాయమైపోతుంది. మన నిజరూపం మాత్రమే మిగులుతుంది. అదే విధంగా సుషుప్త్యావస్థలో మనస్సు, ఇంద్రియాలు పనిచెయ్యటం మానేస్తాయి. అప్పుడు మిగిలేది ఆత్మ మాత్రమే. ఆ ఆత్మ నిజరూపంలో మిగులుతుంది. ప్రతిబింబం లాంటి జీవభావం పోయి ఆత్మభావం మిగులుతుంది. ఆ స్థితిలో ఆత్మను 'స్వపితి' అంటారు. తన ఆత్మ తనలోనే ఉన్నదని, నిద్రిస్తున్నదని అంటారు. ఇంద్రియాలన్నీ అలసట చెంది ఒక్కొక్కటే మనసులో లీనమై పోతాయి. మనసు ప్రాణంలో లీనమై పోతుంది. అంటే సుషుప్తిలో ప్రాణం ఒక్కటే మేల్కొని ఉంటుంది. ఆ ప్రాణమే ఇంద్రియాల యొక్క, మనస్సు యొక్క, అలసటను తీరుస్తుంది. మనసుకు బంధన స్థానమైన ప్రాణమే పరదేవత" అంటాడు. అలాగే-బృహదారణ్యకోపనిషత్తులో కాశీ రాజు అజాత శత్రువు, బాలాకి అనే బ్రాహ్మణ బాలుడికి సుషుప్తి గురించి వివరిస్తాడు.

సుషుప్తిలో జీవికి బ్రహ్మ భావన కలుగుతుంది. అప్పుడు అతణ్ణి ప్రాజ్ఞుడు అంటారు. కాని జీవుడు అవిద్యతో కలిసి ఉంటాడు అందుచేత అతడు పరమాత్మ కాదు. అందుకని సుషుప్తి పొందిన జీవుణ్ణి కారణ శరీరమని, తురీయావస్థ పొందిన జీవుణ్ణి మహాకారణశరీరము అంటారు. తురీయం పైన ఉండేది తురీయాతీతము. ఈ స్థితిలో జీవి శివతుల్యుడవుతాడు. ఇక్కడ పూర్ణజీవత్వము, పూర్ణశివత్వాలు వేరుగా లేవు. అన్నీ కలిసిపోతాయి.

జీవుడు నిద్రిస్తుండగా ఇంద్రియాల విషయాలన్నింటినీ అంటే వాక్కు మొదలైన ప్రాణాల విజ్ఞానాన్ని పూర్తిగా గ్రహించి హృదయాకాశంలో నిద్రిస్తున్నాడు. హృదయాకాశము పరమాత్మ ఉండే చోటు. నిద్రావస్థలో ఉన్నప్పుడు పురుషుడు శరీరము, ఇంద్రియాలను తనలో లీనం చేసుకుంటాడు. ప్రాణాలన్నింటినీ తనలోకి ఆకర్షించుకుంటాడు. వాక్కు, చక్షువు, శ్రోత్రము మొ॥ ఇంద్రియాలు మనస్సుతో

సహ లోపలకు ఆకర్షింపబడతాయి. ఆ స్థితిలో క్రియ అనేది ఉండదు. క్రియాఫలం అంతకన్నా ఉండదు. కాబట్టి ఆత్మ తననిజస్థితిలో ఉంటుంది.

ఆత్మ స్వప్నావస్థలో ఉన్నప్పుడు దాని కర్మఫలాలు ప్రారంభమవుతాయి. స్వప్నావస్థలో ఆత్మ మహారాజులా ఉంటుంది. గొప్పబ్రాహ్మణునిలా ఉంటుంది. దేవతల్లాగా ఉచ్ఛస్థితి, అసురులలాగా నీచస్థితి పొందుతుంది. రాజుగారు తన దేశంలో స్వేచ్ఛగా తిరిగినట్లు, ఆత్మ స్వప్నంలో ప్రాణాన్ని, ఇంద్రియాలను గ్రహించి, తన దేహంలో యథేచ్ఛగా తిరుగుతుంది. అదే సుషుప్తిలో ఆనందంతో కూడిన స్థితిని పొందుతుంది.

సుషుప్తిలో ద్వైతం ఉండదు. అది అద్వైత స్వరూపం. సుషుప్తి కాలంలో సుషుప్తిని గుర్తించే ఇంద్రియాలేవీ ఉండవు. అవన్నీ తమకు కారణమైన అజ్ఞానంలో లీనమై పోతాయి. ఇతరమైన దృష్టాంతాలు ఏమీ ఉండవు. ఇలా జ్ఞానసాధనాలేవీ లేనప్పుడు కూడా ప్రకాశితమవుతున్నది కాబట్టే సుషుప్తి స్వయంప్రకాశంకలది అంటున్నాం. సుషుప్తిలో సుఖానికి విరోధియైన దుఃఖం ఉండటం లేదు. కాబట్టి మిగిలేది సుఖమే. దుఃఖము లేక అంధత్వము లేనివాడవుతున్నాడు. అంటే దేహాభిమానం కారణంగా కలిగిన అంధత్వం లాంటి దోషాలేవీ సుషుప్తిలో ఉండవు. సుషుప్తిలో గాయం తగిలినవాడు బాధను అనుభవించటం లేదు. రోగిష్టి వాడు కూడా రోగం లేనివాడు గానే ఉంటున్నాడు. ఈ రకంగా సుషుప్తిలో దుఃఖం ఉండదు అని తెలుస్తోంది. సుఖదుఃఖాలు అనుభవ ప్రమాణంచేత తెలియబడతాయి. సుషుప్తిలో కలిగే సుఖం శయ్య మొ॥ సాధనాల వల్ల వచ్చింది కాదు. నిద్రపట్టకముందు వచ్చేది విషయ జన్యమవుతుంది. కాని నిద్రపట్టిన తరువాత వచ్చే సుఖం అలాంటిది కాదు. జగద్వ్యాపారాలతో అలసిపోయిన ఆత్మ మృదువైన పాన్పుమీద విశ్రమించినప్పుడు, అలసట, దుఃఖాలను పారద్రోలి స్వస్థచిత్తంతో శయ్యాది సుఖాల వల్ల వచ్చే సుఖం అనుభవిస్తోంది. అంతర్ముఖమైన బుద్ధివృత్తిలో తన ఆనందమే ప్రతిబింబమవుతుంది. అంటే – ఆ విధంగా అంతర్ముఖమైన బుద్ధి వృత్తిలో అద్దంలో ముఖంలాగా స్వస్వరూపభూతమైన ఆనందం ప్రతిబింబిస్తుంది. ఇదే విషయానందము. సుషుప్తిలో సమస్త ప్రపంచము ప్రకృతిలో లీనమైపోతుంది. అప్పుడు జీవుడు తమస్సుచే

ఆచరించబడినవాడై సుఖాన్నిపొందుతాడు అని చెబుతోంది అధర్వ వేదంలోని **కైవల్యోపనిషత్తు.** కాబట్టి సుషుప్తిలో సుఖము, అజ్ఞానము రెండూ ఉంటాయి.

**అజ్ఞాన భూమికలు :** భూమిక అంటే 'మారు రూపము' అని అర్థం. మోక్షం కావాలంటే, అజ్ఞానాన్ని పూర్తిగా విడిచిపెట్టాలి. అజ్ఞానము ఏడు అవస్థలుగా రూపు దాలుస్తుంది. వీటినే అజ్ఞాన భూమికలు అంటారు. వీటిలో జాగ్రదావస్థ మూడు రూపాలు, స్వప్నావస్థ మూడు రూపాలు, సుషుప్తి. ఈ అవస్థలు ఒకదానితో ఒకటి కలిసి అనేక రూపాలు పొందుతున్నాయి. ఈ విషయమంతా **మహోపనిషత్తు**లో చెప్పబడింది.

1. జాగ్రదావస్థ – ఇది మూడు రకాలుగా ఉంటుంది. అవి

1. బీజజాగ్రదావస్థ 2. జాగ్రదావస్థ 3. మహాజాగ్రదావస్థ

**1. బీజ జాగ్రదావస్థ :** సృష్టి ప్రారంభం కావటానికి ముందు ఈ జగత్తంతా పరమేశ్వరమయంగా ఉండేది. అప్పుడు నామము, రూపము ఏదీ లేదు. ఉన్నదంతా నిర్మలమైన చైతన్యమే. అదే పరమేశ్వర స్వరూపం. భవిష్యత్తులో కల్పించబడే జీవాది శబ్దాలకు, అర్థాలకు, విషయాలకు ఆశ్రయమవుతున్నది అంటే – ఆ పరబ్రహ్మ స్వరూపం నుంచే ఈ సృష్టి అంతా ఆవిర్భవించింది. గతంలో ప్రళయం వచ్చినప్పుడు కర్మక్షయం కాని జీవరాశి అంతా, తమ తమ కర్మలతో పాటుగా ఆ పరబ్రహ్మలో లీనమయింది. ఇప్పుడు ఆ జీవరాశి అంతా బీజరూపంలో అతనియందే ఉన్నది. ఈ రకంగా బీజరూపంలో ఉన్న జాగ్రదావస్థనే 'బీజ జాగ్రదావస్థ' అంటారు. అదే జ్ఞప్తికి, భావానికి అహంకారానికి క్రొత్త అవస్థ అవుతోంది. ఇది కంటికి కనిపించని స్థితి. అందుకనే అవ్యక్తము అనబడుతుంది.

**2. జాగ్రదావస్థ :** బీజజాగ్రదావస్థ నుంచి సూక్ష్మంగా నేను, నాది, అతడు, అది, ఇది అనే వ్యక్తిజ్ఞానమే జాగ్రదావస్థ.

**3. మహాజాగ్రదావస్థ :** జాగ్రదావస్థ అని చెప్పబడుతున్న, జన్మాంతర బంధమైన నేను, నాది, అతడు, అది అని స్ఫుటంగా దర్శనమిస్తున్న స్థూలజ్ఞానాన్నే 'మహాజాగ్రదావస్థ' అంటారు.

స్వప్నావస్థ కూడా మూడు విధాలుగా ఉంటుంది. అవి 1. జాగ్రస్వప్నావస్థ 2. స్వప్నావస్థ 3. స్వప్నజాగ్రదావస్థ

**1. జాగ్రస్వప్నావస్థ :** జగత్తులో కంటికి కనిపించేవి, కనిపించనివి, జగద్వికారమైనవి, సర్వప్రకాశమైనవి, మనసుతో మాత్రమే కల్పించబడినవి, ఇలా అనేక విషయాలున్నాయి. వీటన్నింటితోను నిండిన సృష్టిని జాగ్రస్వప్నావస్థ అంటారు. జగత్తులో ఉన్నవిలేనట్లుగా, లేనివిఉన్నట్లుగా కనిపిస్తాయి. ఆకాశంలో ఉన్నది ఒకే చంద్రుడు. కాని ఇద్దరుగా, ముగ్గురుగా, అనేకంగా కనిపిస్తాడు. అలాగే ముత్యపు చిప్ప వెండిగిన్నెలాగా కనిపిస్తుంది. ఎడారులలో ఎండమావులు కనిపిస్తాయి.

ఇదంతా భ్రాంతి. ఈ భ్రాంతి అందరికీ అనుభవంలోనే ఉంటుంది. అలాగే ఆత్మలో వివిధ రకాలుగా ఈ జగత్తు కనిపిస్తుంది. అంటే పరమేశ్వర స్వరూపం నుంచి ఈ జగత్తు ఆవిర్భవించింది. ఈ స్థితినే 'జాగ్రస్వప్నావస్థ' అంటారు. జగత్తు శాశ్వతం కాదు. కలలోని దృశ్యంలాగా అశాశ్వతమైనది. నశించేది. అయినప్పటికీ శాశ్వతమనిపిస్తుంది.

**2. స్వప్నావస్థ :** నిద్రించేవాడు కలగంటాడు. ఆ కొద్దిసేపు, కలనే శాశ్వతము అనుకుంటాడు. నిద్ర నుంచి మేల్కొన్న తరువాత తాను కలలో చూసిన విషయాలన్నీ ఇతరులకు చెబుతాడు. ఇది స్వప్నావస్థ.

**3. స్వప్నజాగ్రదావస్థ:** పైన చెప్పిన అవస్థల కన్న వేరైనది. చాలా కాలం వేదాంత విజ్ఞానం విన్నాడు. కాని ఆత్మ సాక్షాత్కారం కలగలేదు. అందుచేత పెద్దలు చెప్పినవేవీ అర్థం కావు. ఆ కారణం చేత ప్రయత్నం మీద చాలాకాలము మహాత్ములను అనుసరించటమే స్వప్నజాగ్రదావస్థ.

**సుషుప్తి:** ఇది ఈ ఆరు అవస్థల త్యాగరూపమైన జీవుని జడస్థితి. భవిష్యత్తులో దుఃఖానుభవంతో ఉన్న స్థితి. ఇది తమోగుణ రూపంలో ఉంటుంది. తమోరూపంలో ఉన్న సుషుప్తిలో సర్వజగత్తు లీనమై ఉన్నది. దీన్నే అవ్యక్తము అని కూడా అంటారు. ఈ రకంగా అజ్ఞాన భూమికలు ఒక దానితో ఒకటి కలసి వందలాదిగా పుడుతున్నాయి. వీటివల్లనే మానవుడు సంసార సాగరంలో మునిగిపోతున్నాడు.

ఈ మూడింటి తరువాత తురీయము, తురీయాతీతము అని, మూర్ఛ, మరణము అని ఇంకా రెండు అవస్థలు కూడా చెప్పబడుతున్నాయి. మూర్ఛ, మరణము అనే అవస్థలు వైద్యశాస్త్రంలో ఉన్నాయి. కాని వేదాంత శాస్త్రంలో వాటికి ప్రాముఖ్యత లేదు. అంటున్నారు పరమానంద నాథులు.

## 1. సంధ్యాధికరణము (స్వప్నావస్థలో జీవుని స్థితి)

జాగ్రదావస్థ, సుషుప్తి ఈ రెండింటికీ మధ్య ఉన్నది స్వప్నావస్థ. ఈ స్థితిలో జీవి స్థితి ఎలా ఉంటుందనే విషయం ఇక్కడ వివరిస్తున్నారు. ఈ అధికరణ పేరు **సంధ్యాధికరణము** ఇందులో ఆరు సూత్రాలున్నాయి.

సంధ్య అంటే స్వప్నము. జాగ్రత్, సుషుప్తులకు మధ్య స్థానము. స్వప్నంలో ఉంటూ మిగిలిన రెండు స్థానాలనూ చూస్తాడు ఆత్మపురుషుడు. నిద్రించేటప్పుడు ఆత్మపురుషుడు సమస్త లోకాలలోని అనుభవాలను తీసుకుని స్థూలశరీరాన్ని వదలి స్వప్న శరీరంలో ప్రవేశించి, ఆత్మజ్యోతి రూపమైన ప్రకాశంతో స్వప్నం చూస్తాడు. ఈ స్థితిలో స్వప్నద్రష్ట అయిన పురుషుడు తైజసుడు అని పిలువబడతాడు.

స్వప్నావస్థలో రథాలు, వాటికి కట్టే గుర్రాలు, అవి నడిచే మార్గాలు ఏవీ ఉండవు. అన్నింటినీ ఆ పురుషుడే రచించుకుంటాడు. అప్పుడు ఆనందము, మోదము, ప్రమోదము ఏవీ ఉండవు. అయినా వాటిని తానే కల్పించుకుంటాడు అని **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పబడ్డది. అయితే – స్వప్నంలోని స్థితి యధార్థమైనదా? లేక మిధ్యా?

***సూత్రం – 319 "సంధ్యే సృష్టిరాహ హి"***

స్వప్నమందలి సృష్టి వ్యావహారిక సత్యం. ఇది జాగ్రత్, సుషుప్తులకు మధ్య స్థానము. ఇక్కడ రథాలు, గుర్రాలు, మార్గాలు అన్నీ సృష్టించబడుతున్నాయి. ఈ సృష్టి యదార్థమైనది అని వారి వాదన.

***సూత్రం – 320 "నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ"***

కొంతమంది స్వప్న పదార్థాలు నిర్మించేవాడు పరమేశ్వరుడు అంటారు. అతడు నిర్మించే కామవిషయాలు పుత్రాదులు. ఇంద్రియాలన్నీ నిద్రించిన తరువాత,

పురుషుడు తాను కోరిన పదార్థాలను సృష్టిస్తూ మేల్కొంటాడు. అందుకే అతన్ని కామనిర్మాతగా చెబుతారు.

**కఠోపనిషత్తు**లో యముడు నచికేతుడితో

**శతాయుషః పుత్ర పౌత్రాన్ వృణీష్వ బహూన్ పశూన్ హస్తి హిరణ్యమశ్వాన్**

**భూమేః మహదాయతనం వృణీష్వ స్వయంచ జీవశరదోయాదిచ్ఛసి ॥**

వంద సంవత్సరాల ఆయువుగల పుత్రులను, పౌత్రులను కోరుకో. రాజ్యం కోరుకో, భోగభాగ్యాలు కోరుకో. అంతదాకా ఎందుకు? భూలోకంలో ఏవేవి నీకు దొరకవో అవన్నీ కోరుకో అంటాడు. ఇక్కడ 'కామ' అంటే పుత్రుడు అనే అర్థం కాబట్టి స్వప్నంలో పుత్రాదులను సృష్టించేది పరమాత్మ. జాగ్రదావస్థలాగానే, స్వప్నావస్థలో కూడా అతడే సృష్టికర్త. అందుచేతనే ఈ స్వప్నజగత్తు కూడా సత్యమైనదే అని వారి వాదన. అది నిజం కాదు.

***సూత్రం - 321 "మాయామాత్రం తు కార్త్స్న్యేన నాభివ్యక్తస్వరూపత్వాత్"***

స్వప్న సృష్టి అనేది మాయామాత్రమైనది. అది దేశకాలాది సమస్త ధర్మాలతో కనిపించదు.

స్వప్న సృష్టికి రూపం లేదు. అది యథార్థం కాదు. కల కనేవాడికి మాత్రమే కనిపిస్తుంది. ఇంకొక ప్రాణికి తెలియదు. అంతా మిథ్య. స్వప్నంలో రథాలు, గుర్రాలు అన్నీ కనిపిస్తాయి. కలకరిగి పోగానే ఏవి మిగలవు. ఇంత తక్కువ కాలంలో వీటిని సృష్టించేది ఎవరు. స్వప్నావస్థలో జీవుడు దేహంలో తన ఇష్టం వచ్చినట్లు విహరిస్తున్నాడు. ఈ మాయాస్వరూపాన్ని సృష్టించేది జీవుడు అంతేకాని ఈశ్వరుడు కాదు.

***సూత్రం - 322 "సూచకశ్చ హి శ్రుతేరాచక్షతే చ తద్విదః"***

స్వప్నశాస్త్రం తెలిసినవారు, స్వప్నం శుభాశుభాలను సూచిస్తుంది అని చెబుతున్నారు. కామ్యకర్మలు చేసేటప్పుడు స్వప్నంలో స్త్రీని దర్శిస్తే, ఆ కర్మలయందు సమృద్ధి కలుగుతుంది. అలాగే ఏనుగుపై నెక్కినట్లు కలగంటే శుభము. గాడిద నెక్కితే అశుభము. రామాయణంలో త్రిజట స్వప్న వృత్తాంతము ప్రసిద్ధి చెందింది.

కాబట్టి స్వప్నము, మాయ, మిధ్య అని ఎలా అనగలము? అని వారి వాదన. అది సరికాదు. స్వప్నంవల్ల కలిగే శుభాశుభాలు, లాభనష్టాలు నిజం కావచ్చు. కాని స్వప్నం మాత్రం మిధ్యే. మేలుకోగానే కల కరిగిపోతుంది. కాబట్టి అది అబ్ధం ఈ స్వప్నాలు సృష్టించేది జీవుడు.

ఈశ్వరుడు జీవుడు ఇద్దరూ ఒకటే.

ఈశ్వరుడు సంకల్పమాత్రం చేతనే జగత్తును సృష్టిస్తున్నాడు. జీవుడు కూడా తన సంకల్పంతో స్వప్న జగత్తును సృష్టిస్తున్నాడు. అలాంటప్పుడు స్వప్నజగత్తు మిధ్య ఎలా అవుతుంది? అనేది ప్రశ్న. దీనికి సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 323 "పరాభిధ్యానాత్తు తిరోహితం తతో హ్యస్య బన్ధ విపర్యయౌ"***

జీవుడు, ఈశ్వరుడు ఇద్దరూ ఒకటే. జీవి అవిద్య లేదా అజ్ఞానంచే ఆవరించబడి ఉంటాడు. అందుచేత జీవుడికి ఈశ్వరుడికున్నంత శక్తి లేదు. జీవుడికి అజ్ఞానపు పొరలు తొలగిపోవాలి. అప్పుడు తాను, పరబ్రహ్మ ఇద్దరూ ఒకటే అని తెలుస్తుంది. మరుక్షణమే తాను పరబ్రహ్మలో లీనమవుతాడు. ఇదే విషయం **ముండకోపనిషత్తు**లో చెప్పబడింది. ఒకే వృక్షం మీద రెండు పక్షులున్నాయి. అంటూ వివరించి జీవుడికి ఎప్పుడైతే భేదభావం నశించిపోతుందో, అప్పుడు అద్వైతభావం పొందుతాడు కాబట్టి జీవుడు సృష్టించే స్వప్నం నిజం కాదు.

***సూత్రం - 324 "దేహయోగాద్వాసోఽపి"***

జీవుని కుండే ఐశ్వర్య తిరోభావము దేహాది సంబంధంవల్ల కలుగుతుంది. దేహము, ఇంద్రియాలు, బుద్ధి, మనస్సు, వీటి సంయోగంవల్ల జీవుడికి సహజంగా ఉండవలసిన జ్ఞానము, ఈశత్వము తిరోభావము చెందుతాయి.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు శ్వేతకేతువుకు ఆత్మతత్త్వాన్ని వివరిస్తూ జగత్తులోని నామరూపాలన్నీ దేనిలో లీనమై పోతున్నాయో, అదే బ్రహ్మ. అదే నీవు అంటాడు. అంటే జీవాత్మా పరమాత్మా రెండూ ఒక్కటే. అయినప్పటికీ అవిద్యతో కూడినది జీవాత్మ. అటువంటి జీవుడు చేసే సృష్టి శాశ్వతమైనది కాదు. అంతా మాయ. మిధ్య. అందుకే స్వప్నంఅంతా మాయ. మెలకువ రాగానే కల కరిగిపోతుంది.

## ౨. తదభావాధికరణము (సుషుప్తిలో జీవుని స్థితి)

ఈ విషయం రెండవదైన **తదభావాధికరణము**లో వివరించారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

ఇప్పటిదాకా స్వప్నావస్థ గురించి చెప్పారు. మరి సుషుప్తి అంటే ఏమిటి? సుషుప్త్యావస్థ అనేది నాడులా? పురీతత్తా? దహరాకాశమైన పరబ్రహ్మా? ఈ మూడు కలిసినదేదైనా ఉన్నదా? 'పురీతత్' అంటే హృదయంలో పద్మం ఆకారంలో ఉండే నాడీ మండలము. ఎందుచేతనంటే సుషుప్తిని గురించి ఉపనిషత్తులలో రకరకాలుగా వివరించారు. **మాండూక్యోపనిషత్తు**లో "నిద్రించినప్పుడు ఏ కోరికలూ లేని స్థితి. గాఢనిద్ర అదే సుషుప్తి. ఇందులో సంచరించే ప్రాజ్ఞుడే తృతీయ పాదం. ఈ స్థితిలో భేదభావాలుండవు. జాగ్రస్వప్నాలలోని అనుభవాలు ఇక్కడ కరిగిపోతాయి. అన్ని అనుభవాలు ఏకమై పోతాయి. కేవలం గ్రహణశక్తి మాత్రం నిలచిపోతుంది. పరస్పర విరుద్ధ భావాలు స్ఫురించవు. ఆ స్థితిలో ప్రాజ్ఞుడు ఆనందం అనుభవిస్తాడు. ఇది తమోగుణ ప్రధానమైన అవస్థ. ఇతడే అన్నిటికీ ప్రభువు ఈశ్వరుడు. సర్వమూ తెలిసినవాడు. అంతర్యామి, నియామకుడు అన్నారు. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు ఆత్మజ్ఞానాన్ని తన కుమారుడైన శ్వేతకేతువుకు వివరిస్తూ "నిద్ర పోతున్నప్పుడు మనిషి తాత్కాలికంగా ఆత్మతో తాదాత్మ్యం చెందుతాడు. తేనెటీగలు తోటంతా తిరిగి మకరందాన్ని సేకరిస్తాయి. ఆ తేనెలోని ఏ బొట్టు ఏ పువ్వు నుంచి తీసిందో తెలియదు. అలాగే జీవరాశులు విడివిడిగా ఉన్నప్పటికీ ఆత్మలో లీనమై ఉంటాయి. అది నిద్రాసమయం లేదా మరణ సమయం కావచ్చు గాఢనిద్రలో గతం తెలియదు. వర్తమానం అసలే తెలియదు. అంతా అజ్ఞానం. అందువల్ల యదార్ధమనేది తెలియదు. యదార్ధాన్ని గుర్తించటం కష్టం" అంటాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో కాశీరాజైన అజాతశత్రువు బాలాకికి ఉపదేశం చేస్తూ "జీవుడు నిద్రిస్తుండగా ఇంద్రియాల యొక్క విషయాలన్నింటినీ, అనగా వాక్కు మొదలైన ప్రాణాల విజ్ఞానాన్ని పూర్తిగా గ్రహించి హృదయాకాశంలో నిద్రిస్తున్నాడు. హృదయాకాశము పరమాత్మ ఉండేచోటు, నిద్రావస్థలో పురుషుడు శరీరము, ఇంద్రియాలు తనలో లీనం చేసుకుంటాడు. ప్రాణాలన్నింటినీ తనలోకి ఆకర్షించు

కుంటాడు. వాక్కు, చక్షువు, శ్రోత్రము మొదలైన ఇంద్రియాలు మనస్సుతో సహా లోపలకు ఆకర్షింపబడతాయి. ఆ స్థితిలో క్రియ అనేది ఉండదు. క్రియాఫలం ఉండదు. కాబట్టి ఆత్మ తన నిజస్థితిలో ఉంటుంది. అంటూ ఇక్కడ సుషుప్తిని వివరిస్తున్నారు.

***సూత్రం - 325 "తదభావో నాడీషు తచ్ఛ్రుతే రాత్మని చ"***

నాడుల్లో ప్రవేశించటం ద్వారా, స్వప్నమనేది లేని ఆ స్థితి అంటే సుషుప్తి, ఆత్మ యందు కలుగుతున్నది అని వేదాలలో చెప్పబడింది.

జీవాత్మకు సంబంధించిన సుషుప్తి, నాడులందు, బ్రహ్మమందు, పురీతత్తు అనే స్థానమందు కలుగుతున్నది. హృదయంలో పద్మం ఆకారంలో ఉండే నాడీ సమూహాన్ని 'పురీతత్' అంటారు. ఇది హృదయానికి ప్రాకారంలాంటి ఒక కోశము. శ్రుతివాక్యాలు నాడులు, పురీతత్తు, బ్రహ్మ అనేవి జీవుడికి సుషుప్తి స్థానాలని చెప్పినాయి. ఈ నాడులగుండా పురీతత్తులో ప్రవేశించి అక్కడ బ్రహ్మము నిద్ర పోతుంది.

***సూత్రం - 326 "అతః ప్రబోధోఽస్మాత్"***

ఆత్మలో నిద్రించి ఉన్నాడు కాబట్టి, ఆత్మనుంచే మేలుకుంటాడు. నాడులద్వారా పురీతత్తులో ప్రవేశించి, హృదయాకాశంలో నిద్రిస్తాడు. నాడులుగాని, పురీతత్తుగాని సుషుప్తి స్థానమయి ఉంటే, అక్కడి నుంచే మేల్కొనాలి. కాని అలా చెప్పలేదు కాబట్టి బ్రహ్మమే సుషుప్తి స్థానము. అందుకే సుషుప్తిలో బ్రహ్మభావాన్ని పొందుతాడు. అంటూ రెండవ అధికరణ పూర్తి చేశారు.

## 3. కర్మానుస్మృతి శబ్దవిద్యాధికరణము

## (సుషుప్తిలో బ్రహ్మతో ఏకీభవించి మళ్ళీ అందులోంచే మేల్కొంటాడు)

ఈ విషయం మూడవదైన **'కర్మానుస్మృతిశబ్ద విద్యాధికరణము'**లో వివరించారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

"జీవుడు హృదయస్థానంలో ఉన్న బ్రహ్మలో నిద్ర పోతున్నాడు. మళ్ళీ అందులో నుండే మేల్కొంటున్నాడు. అంటున్నాము. సుషుప్తి పొందిన జీవుడే మళ్ళీ మేల్కొంటున్నాడనటానికి నిదర్శనం ఏముంది? పెద్దదైన సముద్రంలో చిన్న నీటి

బొట్టు వేశాం. అది అందులో కలిసిపోయింది మళ్ళీ బయటకు తీసినప్పుడు ఆ బొట్టే రావాలనే నియమం ఏముంది? అలాగే పరమాత్మలో అనేక జీవులు కలిసిపోతాయి. అసంఖ్యాకమైన జీవులకు సుషుప్తి స్థానంగా ఉండే పరమాత్మ నుండి, ఆ జీవులే మేల్కొంటున్నాయని ఎలా చెప్పగలం? ఇంకా ఇతరమైనవి రావచ్చు కదా?" అనేది అనుమానం. దీనికి సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 327 "స ఏవ తు కర్మానుస్మృతిశబ్ద విధిభ్యః"***

1. కర్మ 2. అనుస్మృతి 3. శబ్దము 4. విధి అనే కారణాల వల్ల నిద్రించిన మానవుడే మళ్ళీ మేల్కొంటున్నాడు. అంతేకాని ఇంకొకడు కాదు.

**1. కర్మ :** కొంత పనిచేసి విశ్రాంతి తీసుకుని మర్నాడు మిగిలిన పని పూర్తి చేస్తున్నాం. పని ఎక్కడ ఆపామో మేల్కొన్న తరువాత మనకు తెలుస్తుంది. ఎందుకని? ఆ పనిని అక్కడ ఆపింది మనమే కాబట్టి. అందుచేత సుషుప్తి తరువాత అంటే మెలకువ వచ్చిన తరువాత ఉండేది, అంతకు ముందున్నవాడే.

**2. అనుస్మృతి :** ఇందులో 'అను' అంటే సుషుప్తికి పూర్వం ఉన్న నేనే మెలకువ తరువాత నేను. అనే జ్ఞానం కలగటం. స్మృతి అంటే జ్ఞాపకం. గతంలో చేసినది గుర్తు రావటం.

**3. శబ్దం :** శబ్దం అంటే వేదం. **ఛాందోగ్యోపనిషత్తు**లో జీవి ఏ రూపంలో ఉన్నప్పటికీ, అంటే పులి, సింహము, మనిషి ఏదైనా కాని, అనంత చైతన్య సముద్రంలో కలిసిపోయిన తరువాత తన రూపాన్ని పోగొట్టుకుంటుంది. జీవులన్నీ ఏ తత్త్వంలో కలిసిపోతాయో, అదే బ్రహ్మ. ఈ రకంగా వేదాలలో అనేకసార్లు, అనేకచోట్ల చెప్పబడింది.

**4. విధి :** యజ్ఞయాగాది విధులు. ఏవో ఫలితాలు వస్తాయని యజ్ఞయాగాది కర్మలు చేస్తున్నారు. ఇవాళ నిద్రపోయినవాడు, రేపు మేల్కొనేవాడు ఒక్కడే. అలా కాకపోతే ఈ కర్మలు, వాటివల్ల వచ్చే ఫలితాలు వ్యర్థమే.

ఇక సముద్రంలో కలిపే నీటి బిందువు. జీవుడు ఉపాధి రహితంగా అంటే శరీరం లేకుండా లీనం కావటం లేదు. నీటిబిందువును ఒక సీసాలో ఉంచి సముద్రంలో పారేశాము. మళ్ళీ ఆ సీసాను తీసినప్పుడు, అంతకుముందు మనం అందులో ఉంచిన బిందువే ఉంటుంది. అలాగే శరీరంతో ఉన్న జీవుడు మళ్ళీ మేల్కొంటాడు. కాబట్టి జీవుడు సుషుప్తిలో బ్రహ్మలో ఏకీభావం పొంది, మళ్ళీ అందులో నుంచే మేల్కొంటాడు.

## 4. ముగ్ధేర్ధసంపత్త్యధికరణము (మూర్ఛ యొక్క స్వరూపము)

ఈ విషయం నాల్గవదైన **'ముగ్ధాదికరణము'**లో వివరించారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

"అవస్థాత్రయము గురించి తెలుసుకున్నాము. మరి ముగ్ధావస్థ అంటే మూర్ఛలో ఉన్న వాడి స్థితి ఏమిటి? పైన చెప్పిన అవస్థలు దేనిలోనైనా చేరతాడా? లేక అది ప్రత్యేకమైన అవస్థా?" అని అనుమానం. దీనికి సమాధానం చెబుతున్నారు. మూర్ఛ అనేది అవస్థ కాదు. వైద్యశాస్త్రం ప్రకారం శారీరిక రుగ్మత.

***సూత్రం – 328 "ముగ్ధేఽర్ధసంపత్తిః పరిశేషాత్"***

మూర్ఛ అనేది సగం సుషుప్తి, సగం మరణ ధర్మంతో కూడి ఉంటుంది అని పరిశేష న్యాయం. అంటే జాగ్రద్, స్వప్న, సుషుప్తి మరణావస్థలలో దేనిలోనూ చేరకుండా ఉండే స్థితి. వేదాలలో ఎక్కడా కూడా ఐదవ స్థితి గురించి చెప్పలేదు. కాబట్టి మూర్ఛ అనేది దేనికి చెందదు. దేనిలోనూ అంతర్భూతం కాదు. ప్రత్యేక అవస్థ అంతకన్నా కాదు. మేలుకొని ఉన్నవాడిలాగా మూర్ఛపోయిన వాడికి బాహ్యజ్ఞానం ఉండదు. అలా అని అంతరజ్ఞానం అంతకన్నా ఉండదు. అసలు అతనికి ఏ విధమైన జ్ఞానము ఉండదు. అతని శరీరం కూడా అదుపులో ఉండదు. వాలిపోతుంది. అతడు స్వప్నాలు చూడలేడు. మనోవ్యాపారాలు అసలుండవు. కాబట్టి అది స్వప్నావస్థ కాదు.

శ్వాస ఆడుతోంది. ప్రాణమున్నది. కాబట్టి మరణం కాదు. పోనీ గాఢనిద్రలో ఉన్నాడా? అంటే అలానూ లేదు అది సుషుప్తి కాదు. ఈ రకంగా అన్ని అవస్థల లక్షణాలూ ఉన్నాయి. కాని ఏ అవస్థా కాదు. **వైద్యశాస్త్రరీత్యా ఇది ఒక రోగము.**

## 5. ఉభయలింగాధికరణము (బ్రహ్మకు సగుణ నిర్గుణ రూపాలు)

బ్రహ్మకు ఉపాసన కోసం సాకారం చెప్పబడింది. లేకపోతే అతడు నిరాకారుడే అనే విషయాన్ని ఐదవదైన **'ఉభయలింగాధికరణము'**లో వివరించారు. ఇందులో పదకొండు సూత్రాలు ఉన్నాయి.

బ్రహ్మను గురించి వేదాలు రకరకాలుగా చెబుతున్నాయి. కొన్నిసార్లు బ్రహ్మసాకారుడు అన్నాయి. మరికొన్నిసార్లు నిరాకారుడు అన్నాయి. మరి బ్రహ్మసాకారుడా, నిరాకారుడా, లేక సాకార నిరాకారాల్లో ఉంటాడా?

నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. అతడు చరాచర జగత్తంతా ఆక్రమించి ఉన్నాడు. సృష్టి ప్రారంభానికి ముందు ఈ జగత్తంగా ఆక్రమించి నిరాకారంగా ఉన్నాడు. సృష్టి జరిగిన తరువాత 84 లక్షల రకాల జీవరాసి రూపంలో ఈ జగత్తును ఆక్రమించి ఉన్నాడు. మొత్తం మీద జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. బ్రహ్మ నిరాకారుడు అంటే ఏ ఆకారము లేనివాడు అని అర్థంకాదు. అన్ని ఆకారాలు, అన్ని రూపాలు అతనివే. మోక్షం ఇవ్వగలిగినవాడు పరబ్రహ్మ. మోక్షం అంటే నిరాకారంలో లీనంకావటం. జీవాత్మ, పరమాత్మల ఏకీకరణము. అందుకే పరబ్రహ్మ నిరాకారుడు. అయితే సాధన విషయంలోకి వచ్చేసరికి, నిరాకారాన్ని ఉపాసించటమనేది అందరికీ సాధ్యం కాదు. అందుకే పరబ్రహ్మకు ఒక ఆకారం చెప్పారు. అంతే కాకుండా సృష్టి చెయ్యాలన్నప్పుడు నిరాకారం సృష్టి చెయ్యలేదు. సాకారం మాత్రమే సృష్టి చేస్తుంది. అందుకే పరబ్రహ్మకు ఒక ఆకారం చెప్పబడింది.

మొత్తం మీద చూసినట్లైతే పరబ్రహ్మ నిరాకారుడు ఇందులో సందేహం లేదు. కాని

**సాధకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా**

సాధకుల కోరికలు తీర్చటం కోసం పరబ్రహ్మకు ఒక రూపం కల్పించబడింది. సృష్టి చెయ్యటం కోసం నిరాకారంగా ఉన్న బ్రహ్మము ఒక రూపాన్ని దాల్చింది. **నిరాకార బ్రహ్మోపాసన చేసిన వారికి సాయుజ్యము, సాకార బ్రహ్మోపాసన చేసిన వారికి మహదైశ్వర్యము లభిస్తాయి.** ఉపాధిభేదం చేతనే బ్రహ్మము సాకారంగా దర్శనమిస్తుంది. ఉపాసన కోసం మాత్రమే సాకారం చెప్పబడింది.

***సూత్రం - 329 "న స్థానతోఽపి పరస్యోభయలిఙ్గం సర్వత్ర హి"***

ఉపాధివలన కూడా బ్రహ్మకు ఉభయత్వం లేదు. వేదాలలో కూడా నిర్గుణమే చెప్పబడింది.

పరబ్రహ్మ స్వరూపము సాకారము, నిరాకారము అని రెండుగా ఎప్పుడూ లేదు. ఉన్నదిఒక్కటే. అదేనిర్గుణబ్రహ్మ. ఉపాధివల్ల రెండుగా కనపడరాదా? అంటే కనపడరాదు. నీళ్ళను నిప్పులమీద కాస్తే అవి వేడెక్కుతాయి. నీళ్ళస్వభావం వేడికాదు. ఇలా వేడెక్కటంవల్ల నిప్పు స్వభావములోనూ మార్పుండదు. అలాగే ఉపాధివల్ల బ్రహ్మకు రెండు రూపాలు రావు. **కఠోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఆత్మకు చావు పుట్టుకలు లేవు. అది స్వయంభువు. నాశరహితమైనది. శాశ్వతమైనది.

***సూత్రం - 330 "న భేదాదితి చేన్నప్రత్యేకమతద్వ చనాత్"***

అన్ని వేదాంత వాక్యాలలోనూ నిర్గుణబ్రహ్మమే చెప్పబడలేదు. బ్రహ్మకు నాలుగు పాదాలున్నాని కూడా చెప్పారు. అని వీరి వాదన.

వేదాలలో బ్రహ్మను గురించి భేదం కనిపిస్తోంది. **ఛాందోగ్యోపనిషత్తు**లో మనస్సు అనే బ్రహ్మకు నాలుగు పాదాలున్నాయి.

| | | |
|---|---|---|
| మొదటి పాదం | – | వాక్కు |
| రెండవ పాదం | – | ప్రాణం |
| మూడవ పాదం | – | నేత్రం |
| నాల్గవ పాదం | – | శ్రోత్రం |

**మాండూక్యోపనిషత్తు**లో ఆత్మకు నాలుగు పాదాలున్నాయి. అవే జాగ్రద్, స్వప్న, సుషుప్తి, తురీయములు. శాస్త్రాన్ని కాదనలేము. అందుచేత బ్రహ్మకు ఆకారం ఉంది. అంటున్నారు.

కాని అది సరి కాదు. అలా అనటానికి వీలు లేదు. పరమేశ్వరుడికి ఆకారం లేదు. అన్ని వస్తువులందు ఉన్నాడు. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు చెబుతున్నాడు. జీవులన్నీ తమ నామరూపాలు కోల్పోయి, ఏ పురుషుడిలో కలిసిపోతాయో, అతడే ఆత్మ. అదే నీవు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు చెబుతున్నాడు.

లోకంలో ఉన్నదంతా ఆత్మే. ఆత్మయే అందరిలోనూ ఉన్నది. ఆత్మనుండే అన్నీ పుట్టాయి. అందులోనే లయం అవుతున్నాయి. ఆ పరమేశ్వరుడు సర్వాంతర్యామి

అన్నిటా చైతన్యమూర్తి అని చెబుతూ "వాయువులో ఉంటూనే వాయువును నియంత్రిస్తాడు. వాయువే అతడి శరీరము. కాని వాయువు అతన్నెరగదు. అతడే నీలో ఉన్న ఆత్మ.

**ఛాందోగ్యోపనిషత్తు**లో నాలుగు దిక్కులూ పరబ్రహ్మ యొక్క మొదటి పాదం. భూమి ఆకాశము సముద్రాలు రెండవ పాదం. అగ్ని సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు మూడవ పాదం. ప్రాణం, దృష్టి, శ్రోత్రము ఇవన్నీ నాల్గవ పాదం అని చెప్పారు. ఉపకోశలుడికి అగ్నులు బ్రహ్మోపదేశం చేస్తూ ఆకాశంలో ఉన్న సూర్యునిలో ఏ తత్త్వమైతే ఉన్నదో, అదే నీలోనూ ఉన్నది. దిక్కులు, నక్షత్రాలు, నీరు, నింగి అన్నింటిలోని తత్త్వము ఒక్కటే. అదే పరబ్రహ్మ అని చెప్పబడింది. కాబట్టి బ్రహ్మనిరాకారము, నిర్గుణము అంతేకాని బ్రహ్మకు రెండు రూపాలు లేవు.

***సూత్రం - 331 "అపి చైవమేకే"***

**బ్రహ్మకు ఆకారము కేవలము ఉపాసన కోసమే చెప్పారు అంతే తప్ప వేరు కాదు. పరబ్రహ్మ నిరాకారుడే. ఇందులో సందేహం లేదు.**

పరబ్రహ్మ స్వరూపాన్ని మనసుతోనే పొందాలి. దాన్ని తెలుసుకున్న తరువాత ఇంక భేదముండదు. బ్రహ్మలో భేదాన్ని చూసేవాడు జనన, మరణ వలయంలో చిక్కుకుపోతాడు. అంతేకాదు. అనుభవించేవాడు, అనుభవించబడేది, ప్రేరేపించేవాడు ఈ మూడు భాగాలు ఉన్నదే బ్రహ్మ.

కొన్నిచోట్ల వేదంలో బ్రహ్మసాకారుడని, కొన్నిచోట్ల నిరాకారుడని చెప్పారు కదా? మరి అలాంటప్పుడు బ్రహ్మ నిరాకారమే అని ఎలా చెబుతారు? మళ్ళీ అనుమానం.

***సూత్రం - 332 "అరూపవదేవ హి తత్ప్రధానత్వాత్"***

రూపం, గుణం, ఆకారం లేనట్టి బ్రహ్మనే గ్రహించాలి. వేదంలో అలాంటి బ్రహ్మనే చెప్పారు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో ఉషస్తికి చెబుతున్నాడు యాజ్ఞవల్క్యుడు. నీ ఆత్మయే బ్రహ్మ. నోటితోనూ, ముక్కుతోనూ ఊపిరి పీల్చే విజ్ఞానమయుడైన ఆత్మయే సర్వాంతర్యామి. అపానక్రియ ఆచరించేవాడే సర్వాంతర్యామి. వ్యానక్రియ

ఆచరించేవాడే సర్వాంతర్యామి. ఉదానక్రియ ఆచరించేవాడే సర్వాంతర్యామి అయిన నీ ఆత్మ. బ్రహ్మము స్థూలమూ కాదు. సూక్ష్మమూ కాదు. పొడవూ కాదు పొట్టీ కాదు. శబ్ద స్పర్శరూప రసాదులు లేనటువంటిది. నాశనరహితమైనటువంటిది. **ముండకోపనిషత్తు**లో ఆ బ్రహ్మ కారణము లేనివాడు ఆకారము లేనివాడు అని చెప్పబడింది. **ఈశావాశ్యోపనిషత్తు**లో ఆత్మదూరంగా ఉన్నది. దగ్గరగా ఉన్నది. లోపలా ఉన్నది, బయటా ఉన్నది. సృష్టికి అతీతమైనది. ఉపాదియుతము అన్నారు. **తైత్తిరీయోపనిషత్తు**లో ఆకాశము బ్రహ్మ, వాయువు బ్రహ్మ, అగ్ని బ్రహ్మ. ఈ విధంగా పంచభూతాలు తన్మాత్రలు బ్రహ్మమని చెప్పబడింది. ఈ రకంగా బ్రహ్మ ఆకారం లేనివాడు. సర్వత్ర వ్యాపించి ఉన్నాడని చెప్పబడింది. అయినప్పటికీ సాకారబ్రహ్మను గూర్చి అనేకచోట్ల చెప్పారు కదా ? వాటి సంగతి ఏమిటి?" అనే అనుమానం వస్తుంది.

***సూత్రం - 333 "ప్రకాశవచ్చావైయర్థ్యాత్"***

సూర్యరస్మి వంకరగా రాదు. సరాసరి వస్తుంది. అలాంటి సూర్యరశ్మికి చెయ్యి అడ్డు పెట్టినట్లైతే, అది వంకరగా వస్తున్నట్లు కనిపిస్తుంది. అలాగే ఉపాధి భేదం చేత పరమాత్మ సాకారంగా దర్శనమిస్తుంది. ఇది కేవలం ఉపాసన కోసం చెప్పబడింది.

***సూత్రం - 334 "ఆహ చ తన్మాత్రమ్"***

కాబట్టి శ్రుతివాక్యాలన్నీ బ్రహ్మగురించి చెప్పాయి. అంతేగాని వేరు కాదు. **బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు చెబుతాడు. ఓ మైత్రేయీ నీళ్ళలో వేస్తే ఉప్పు కరుగుతుంది. ఆ ఉప్పు నీరంతా వ్యాపించి ఉంటుంది. అదే విధంగా అద్భుతమైన శక్తిగల పరమాత్మ అనంతుడు అవ్యయుడు. విజ్ఞానఘనుడు. అతను ఉపాధులతో కలిసి, అవి నాశనమయినప్పుడు, తానుకూడా నాశనం అయినట్లు కనిపిస్తాడు. అంటే పరమాత్మ లోపల, బయటా అంతటా వ్యాపించి ఉన్న రసస్వరూపం.

***సూత్రం - 335 "దర్శయతి చాథో అపి స్మర్యతే"***

ఆయనకు అనేక రూపాలు లేవు అంటూ, వేదం రూపంలేని పరబ్రహ్మను గురించే చెబుతున్నది.

అతడు మనకు తెలుసా? అంటే తెలియదు. తెలియదా? అంటే తెలుసు. సాధారణ బ్రహ్మము అందరికీ తెలుసు. కాని బ్రహ్మను గురించిన విశేషము ఎవరికీ తెలియదు. అందుకే ఎవరికైతే తెలియదో వారికి తెలుసు అని **కేనోపనిషత్తు** చెబుతున్నది. ఈ విధంగా వేదాలలోనే కాదు. స్మృతులలో కూడా అదే విధంగా చెప్పబడింది. **దేవీభాగవతం**లో దేవతలందరూ తారకాసురుని బాధలు పడలేక హిమాలయాల్లో తపస్సు చేశారు. వివిధ రకాల అర్చనలు, ఆరాధనలు, పూజలు, యోగసాధన చేశారు. చైత్రశుద్ధ నవమి రోజున వారికి దేవి దర్శనమయింది.

అప్పుడు వారికి ఏం కనిపించింది? అంటే వేదసమ్మతమైన పరంజ్యోతి వారి ఎదుట ప్రత్యక్షమైంది. దేవిరూపము రూపుదాల్చిన నాలుగు వేదములచే స్తుతించబడుతున్నది. కోట్లకొలది సూర్యకాంతులతో ప్రకాశిస్తున్నది. చంద్రకాంతుల చల్లదనం కలిగి ఉన్నది. ఆ రూపము కొన్నికోట్ల మెరుపులు ఒక్కసారి మెరిసినట్లున్నది. దానికి పైన, క్రింద, ప్రక్కన అనే తేడాలు లేవు. నడుమ, అడ్డము అనేవి లేవు. ఆద్యంతములు లేవు. కాళ్ళు చేతులు లేవు. స్త్రీ పురుష నపుంసక భేదాలు లేవు. ఆ కాంతిని చూడలేక దేవతలు కనులు మూసుకున్నారు. (దేవీభాగవతం, సప్తమ స్కంధము 31వ అధ్యాయము) అంతలోనే ఆ దివ్యతేజస్సు ఒక స్త్రీ రూపం దాల్చింది. ఆవిడే పరమేశ్వరి. పరమేశ్వరుని అసలురూపం నిరాకారము. అదే పరాశక్తి. కాని **ఉపాసన కోసం మాత్రమే రూపం చెప్పబడింది.**

అంతేకాకుండా కొన్నిచోట్ల వివరించటానికి వీలులేక, వ్యతిరేక, నిషేధ భావాలలో చెప్పబడింది. 'బ్రహ్మ అనాదియైనది. ఇంద్రియాలకు గోచరము కానిది ఉన్నదని, లేదని చెప్పటానికి లేనటువంటిది' కాబట్టి వస్తుతః బ్రహ్మము నిర్గుణమే.

అందుకనే పరమాత్మ నీటిలో కనిపించే సూర్యబింబము వంటివాడు అంటారు.

కాంతివంతమైన సూర్యుడు ఒక్కడే. వివిధ కుండలలో నీరు పోసినప్పుడు ఒకదానిలో పెద్దగా, ఒకదానిలో చిన్నగా కనిపిస్తాడు. ఇది ఉపాధి భేదము. అలాగే పరమాత్మ కూడా ఉపాధి భేదంవల్ల వివిధ ఆకారాలుగా దర్శనమిస్తున్నాడు. అంతేకాని అతడు రూపరహితుడు. కాని అవిద్యచే కూడినవాడై వివిధ రకాలుగా కనిపిస్తున్నాడు.

***సూత్రం – 336 "అత ఏవ చోపమా సూర్యకాదివత్"***

'బ్రహ్మ విషయంలో ఉదకంలాంటి పదార్థం ఏదీ లేనందున, మీరు చెప్పినది సరిపోదు.'

***సూత్రం - 337 "అమ్బువదగ్రహణాత్తు న తథాత్వమ్"***

ప్రతిబింబం పడాలంటే ముందు బింబం ఉండాలి. దానికి ఒక రూపం ఉండాలి. అది ఉపాధికి దూరంగా ఉండాలి. ఇంకా సూర్యుణ్ణి చెప్పినప్పుడు, అతడికి దూరంగా నీరున్నది. అందుకనే సూర్యబింబం ప్రతిఫలిస్తోంది. కాని ఆత్మ అనేది రూపంకల పదార్థము కాదు. అది అన్నింటియందు వ్యాపించి ఉన్నది. దానికన్న వేరైనదేదీ లేదు. కాబట్టి మీరు చెప్పిన ఉదాహరణ సరిపోదు." దీనికి సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 338 "వృద్ధిహ్రాసభాక్త్వమన్తర్భావాదు భయసామఞ్జస్యాదేవమ్"***

సూర్యుడు జలంలో ప్రతిబింబిస్తున్నాడు కాబట్టి వృద్ధి, క్షయము పొందుతున్నాడు. అదే విధంగా పరబ్రహ్మ ఉపాధిని పొందటంవల్లనే వృద్ధి క్షయాలు పొందుతాడు.

అంటే నీరు పోసినటువంటి కుండ, మూకుడు, బాన, చట్టి మొదలైన వాటి భేదం వల్ల సూర్యబింబం పెద్దదిగానో, చిన్నదిగానో కనిపిస్తుంది. అలాగే బ్రహ్మకూడా ఉపాధి భేదంతో పెరగటం, తగ్గటం, చలించటం, మొదలైన లక్షణాలున్నట్లు కనిపిస్తోంది.

"సూర్యుడు జలంలో కనిపించినట్లుగా ఆత్మ ఈ దేహము మొదలైన వాటిలో కనుపించటం లేదు కదా?" అనేది మళ్ళీ అనుమానం.

***సూత్రం - 339 "దర్శనాచ్చ"***

ప్రతిబింబం రూపంలో పరమాత్మ దేహంలో ప్రవేశించాడు అని వేదంలో చెప్పబడింది. కాబట్టి బ్రహ్మము నిర్విశేషమే.

పరమేశ్వరుడు రకరకాల ఆకారాలలో 84 లక్షల జీవరాసుల్ని సృష్టించాడు. ఇంద్రియాలను కలిగిన మానవులను సృష్టించి, అందులో ప్రవేశించాలనుకున్నాడు. బ్రహ్మరంధ్రం ద్వారా ప్రవేశించాడు అని **ఐతరేయోపనిషత్తు**లో చెప్పబడింది. ఈ రకంగా ఉపాధిలో ఉండటంచేతనే బ్రహ్మకు వృద్ధిక్షయాలు కలుగుతున్నాయి. అంతేగాక ఉపాసన కోసమే అతనికి సాకారంకూడా చెప్పబడింది. లేకపోతే బ్రహ్మనిరాకారుడే. సాకారమనేది లేదు.

**గమనిక: పరబ్రహ్మఅంటే పరాశక్తే. అందులో అనుమానంలేదు. కాని అందరికీ అలవాటయిన పదాలు కాబట్టి పరమేశ్వరుడు, పరాత్పరుడు, అనే పుంలింగ పదాలు కూడ వాడటం జరిగింది అంతే. నిరాకారమైతే పరాశక్తి. సాకారం త్రిపురసుందరి.**

# 6. ప్రకృత్త్యైతావత్త్వాధికరణము

## ('నేతి' పదం బ్రహ్మను నిరోధించదు)

ఈ విషయాన్ని ఆరవదైన **ప్రకృతైతావత్త్వాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో తొమ్మిది సూత్రాలున్నాయి.

**బృహదారణ్యకోపనిషత్తు**లో మూర్తామూర్తాలను వివరించారు. అందులో పృథివి, జలము, అగ్ని ఈ మూడూ మూర్తములు (స్థూలములు) అని ఆకాశము, వాయువులు అమూర్తములు అంటే సూక్ష్మములనీ పండితులు బ్రహ్మదర్శనం కోసం నేతి, నేతి న ఇతి, న ఇతి ఇది కాదు ఇది కాదు అంటూ శోధన చేస్తారు అని చెప్పబడింది. ఇక్కడ నేతి అనే పదం రెండుసార్లు చెప్పారు. ఒకటి మూర్తామూర్తాన్ని, రెండవది బ్రహ్మను నిషేధించటానికే ఈ రకంగా చెప్పారు.అ ందుచేత శ్రుతివాక్యము బ్రహ్మను నిషేధిస్తున్నది కదా?" అని అనుమానం.

పరమేశ్వరస్వరూపం ఎలా ఉంటుందో తెలుసుకోవాలి అనుకున్నారు. వేదాలు, వేదాంగాలు, శ్రుతులు, స్మృతులు, పురాణాలు, శాస్త్రాలు అన్నీ ఒక కుప్పగా పోసి ఒక్కక్కటే తీసి చూస్తున్నారు. ఇది పరబ్రహ్మ స్వరూపమా? కాదు. ప్రక్కన పెట్టేశారు. మళ్ళీ ఇంకొకటి తీశారు. ఇది కాదు. ఇలా వరుసగా తీసి చూస్తున్నారు. ఇది కాదు. ఇది కాదు. న ఇతి, న ఇతి, నేతి, నేతి అంటూ మొత్తం కుప్ప అంతా తీసేశారు. చివరికి వాళ్ళకి ఒక పెద్ద ముత్యం కనిపించింది అన్నారు. అది నిజంగా ముత్యం కాదు. ఇప్పుడు తీసిన అన్ని గ్రంథాలసారం. అదే పరమేశ్వర స్వరూపము. అదే పరబ్రహ్మ. అదే పరాశక్తి.

ఇక్కడ నేతి అనే శబ్దం శాస్త్రాన్ని, మూర్తామూర్తాల్ని నిరోధిస్తున్నది అంతే కాని బ్రహ్మను కాదు. ఈ విషయమే ఈ అధికరణలో వివరించారు.

**లలితాసహస్రంలో** అద్భుతమైన నామం ఒకటుంది. **సకలాగమ సందోహశుక్తి సంపుట మౌక్తికా.** అమ్మవారి తత్త్వం ఏమిటో తెలుసుకోవాలనుకున్నారు. వేదాలు, వేదాంగాలు, శాస్త్రాలు, అన్నీ ఒక కుప్పగా పోశారు. ఒకొక్కటే తీసి చూస్తున్నారు. ఇది అమ్మవారి స్వరూపమా? కాదు. ప్రక్కన పెట్టేశారు. ఇంకొకటి తీశారు. ఇది కాదు. న ఇతి, న ఇతి నేతి అంటూ అన్నింటినీ శోధించారు. ఏమీ తెలియలా.

చివరకు ఒక పెద్ద ముత్యం కనిపించింది. అదే ఆ పరాశక్తి తత్త్వము అన్నారు. **పరాశక్తి తత్త్వము అంటే పెద్ద ముత్యం కాదు. అక్కడ కుప్పగా పోసిన వేదవేదాంగాల, శాస్త్రాలసారం. మనసుకు, దృష్టికి అందనిది. అన్నింటికన్న అతీతమైనది. అత్యంత సౌందర్యమైనది. అది ఆ పరాశక్తి తత్త్వం.**

***సూత్రం – 340 "ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి చ భూయః"***

ఇక్కడ నేతి నేతి అనే పదాలవల్ల వేదము మూర్తామూర్తాలను నిషేధిస్తున్నది. అంతేకాని బ్రహ్మను కాదు. ఈ రకంగా అన్నింటినీ నిషేధించగా మిగిలేది బ్రహ్మము. అదే సత్యమైనది, నిత్యమైనది, శాశ్వతమైనది.

అయితే 'బ్రహ్మ అనేది ఉంటే ఎందుకు కనిపించదు?' అని ఈసారి అనుమానం.

***సూత్రం – 341 "తదవ్యక్తమాహ హి"***

బ్రహ్మ అవ్యక్తము. వ్యక్తము కానటువంటిది. కనులతో దానిని చూడలేము. చెవులతో వినలేము. 'ఆత్మ కండ్లచేత చూడబడదు. చెవులతో వినబడదు మాట్లాడబడదు' అని చెప్పారు. నేతి నేతి అంటూ నిరూపింపబడిన ఆ ఆత్మ గ్రహించటానికి వీలు కాదు. ఆత్మ తెలియరానిది. ఇంద్రియాలకు విషయం కానిది అని గీతలో చెప్పబడింది.

***సూత్రం – 342 "అపి సంరాధనే ప్రత్యక్షానుమా నాభ్యామ్ "***

యోగులు మొదలైనవారు సమాధి స్థితిలో ఆత్మదర్శనం చేసుకుంటున్నారు. అని వేదాలు, పురాణాలు చెబుతున్నాయి. ఆత్మ అనేది కనులతోచూడబడదు. చెవులతోవినబడదు. ఆలోచింపబడదు. ఆత్మదర్శనానికి ఇంద్రియాలు అసమర్థములు. ఇంద్రియాలతో ఆత్మను చూడలేము. అందుకే మోక్షగామి, ఇంద్రియాలను అంతర్ముఖం చేసి ఆత్మనుదర్శించాలి.

***సూత్రం – 343 "ప్రకాశాదివచ్చావైశేష్యం ప్రకాశశ్చ కర్మణ్యభ్యాసాత్"***

జీవాత్మ పరమాత్మలకు భేదం లేదు. ఆ రెండూ ఒక్కటే. కేవలము వస్తురూపము పొందటంవల్ల భేదభావము కనిపిస్తున్నది. అదే ఉపాధి బేధము.

***సూత్రం – 344 "అతోఽనన్తేన తథాహి లిఙ్గమ్"***

భేదమనేది ఉపాధివల్ల వచ్చింది. అజ్ఞానంవల్లనే ఉపాధి వచ్చింది. ఉపాధి నివృత్తి చెందగానే జీవుడికి అభేదం కలుగుతుంది. అప్పుడు జీవుడు కూడా అనంతమైన బ్రహ్మ అవుతాడు. కాబట్టి పరమేశ్వరుడు నిర్గుణుడే.

***సూత్రం – 345 "ఉభయవ్యపదేశాత్త్వహి కుణ్డలవత్"***

జీవాత్మ పరమాత్మలకు భేదం లేదు. చుట్ట చుట్టుకుని పడుకున్న పాము చుట్టకు, పొడవుగా ఉన్న పాముకు మధ్యన తేడా ఎంతో, జీవాత్మ పరమాత్మల మధ్య తేడా కూడా అదే.

బారుగా ఉన్న పాముకు, పాము చుట్టకు తేడా లేదు. అలాగే జీవేశ్వర పరమేశ్వరులు ఒక్కటే. నిర్వికారుడైన పరమేశ్వరుని ధ్యానిస్తున్నవాడే జీవుడు. పరాత్పరుడైన ఆదివ్య పురుషుని జీవుడు పొందుతున్నాడు. ఇదే వీరి మధ్య భేదము. **బృహదారణ్యకోపనిషత్తు**లో "ఎవరు లోపల ఉంటూ, అన్నింటినీ నియమిస్తున్నాడో, అతడే ఆత్మ" అని చెప్పారు. ఇక్కడ నియమిస్తున్నవాడు, నియమింపబడేవాడు, ఇద్దరూ ఒక్కటే. మహావాక్యాలు కూడా ఈ మాటే చెబుతున్నాయి.

**తత్త్వమసి** – నీవే ఆత్మవు.

**అహంబ్రహ్మ అస్మి** – నేనే పరబ్రహ్మను

కాబట్టి జీవాత్మ పరమాత్మలు రెండూ ఒకటే వేరు కాదు.

***సూత్రం – 346 "ప్రకాశాశ్రయవద్వా తేజస్త్వాత్"***

సూర్యుడికీ, సూర్యకాంతికి ఏ విధమైన తేడా ఉన్నదో, జీవాత్మ పరమాత్మల మధ్య అదే తేడా ఉన్నది.

సూర్యుడు, కాంతి ఈ రెండూ వేరు కాదు. వీటికి తేడా లేదు. కాని చూడటానికి భేదం ఉన్నట్లు కనిపిస్తుంది. అలాగే జీవాత్మ పరమాత్మ కూడా

***సూత్రం – 347 "పూర్వవద్వా"***

గతంలో చెప్పినట్లుగానే ఈ భేదం అనేది ఉపాధివల్ల వచ్చింది. అంటే అవిద్య అజ్ఞానంవలన వచ్చింది. అవిద్య నశిస్తే ఈ భేదభావం కూడా నశిస్తుంది.

***సూత్రం – 348 "ప్రతిషేధాచ్చ"***

పరమాత్మ కన్న భిన్నమైన చేతనం లేదు. బ్రహ్మకన్న వేరైన ప్రపంచం లేదు. పరమాత్మకన్న వేరైన ద్రష్ట ఎవరూ లేరు. బ్రహ్మకారణ రహితుడు. కార్యరహితుడు. బ్రహ్మకన్న భిన్నమైనది ఏదీ లేదు. నేతి అనే పదం బ్రహ్మని నిరోధించదు.

## 7. పరాధికరణము (బ్రహ్మము అద్వితీయము)

బ్రహ్మ ఒక్కటే. రెండవది లేదు అనే విషయం ఏడవదైన **పరాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో ఏడు సూత్రాలున్నాయి.

"ఇంతవరకూ పరమాత్మ కన్న వేరైనది ఏదీ లేదు అని చెప్పారు. కాని వేదంలో కొన్నిచోట్ల సేతువు (వంతెన) అంటూ భేదాన్ని చెప్పటంవల్ల బ్రహ్మకన్న వేరైన వస్తువు ఏదైనా ఉన్నదా?" అనే అనుమానం కలుగుతుంది. దానికి సమాధానం.

***సూత్రం – 349 "పరమతః సేతూన్మానసంబన్ధ భేదవ్య పదేశేభ్యః"***

సేతువు, (వంతెన) ఉన్మానము (కొలత) సంబంధము, భేదములను చెప్పటంవలన బ్రహ్మము కన్న వేరొక వస్తువు ఉన్నదని తెలుస్తున్నది అంటున్నారు.

**సేతువు :** వంతెన. నదులు, కాల్వలపైన దాటటానికి కట్టిన నిర్మాణం. **ఛాందోగ్యోపనిషత్తు**లో పరమేశ్వరుడు ఈ జగత్తును దాటించే సేతువు అని చెప్పారు.

**ఉన్మానము :** ఇంత పొడవు, బరువు, పరిమితి అని కొలత, తూకము చెప్పటం. **ఛాందోగ్యోపనిషత్తు**లో బ్రహ్మకు నాలుగు పాదాలున్నాయి. పదహారు కళలున్నాయి. అని చెప్పబడింది.

**సంబంధము :** ఆత్మతో బ్రహ్మకున్న సంబంధము.

'సుషుప్తిలో జీవుడు బ్రహ్మతో కలుస్తున్నాడు' అని **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పారు.

**భేదము :** చూచేవాడికి, చూడబడేవాడికి భేదము. 'పరమాత్మ చూడదగినవాడు" అన్నారు తెలుసుకోదగినవాడు అన్నారు. అంటే చూసేవానికన్న, తెలుసుకునే వానికన్న భిన్నమైనవాడు.

దీనివల్ల ఈశ్వరునికన్న వేరైనవాడు ఇంకొకడున్నాడు అని తెలుస్తుంది. అని వారు వాదిస్తున్నారు.

***సూత్రం - 350 "సామాన్యాత్తు"***

బ్రహ్మసేతువు వంటివాడు అనటంవల్ల బ్రహ్మకన్న వేరైన వస్తువు ఇంకొకటి ఉన్నదని కాదు. సేతువు నదీజలం వల్ల త్రోవకు అడ్డు రాకుండా ఉంటుంది. అలాగే ఈశ్వరుడు ఈ జగత్తు యొక్క మర్యాదకు విధారకుడు. జగత్తును, దాని కట్టుబాట్లను నిలుపుతున్నాడు. ఇక్కడ సేతువు అంటే సేతువు దాటి బ్రహ్మను పొందాలి.

***సూత్రం - 351 "బుద్ధ్యర్థః పాదవత్"***

కేవలం ఉపాసన కోసం బ్రహ్మకు పరిమితి, కొలత చెప్పబడ్డాయి. ఉపాసన కోసమే బ్రహ్మకు నాలుగు పాదాలున్నాయి అన్నారు. తేలికగా ఉండటంకోసమే పావలా ఎత్తు, తులం బంగారం అని చెప్పినట్లుగా, ఉపాసన కోసమే కొలత చెప్పబడ్డది.

***సూత్రం - 352 "స్థానవిశేషాత్ ప్రకాశాదివత్"***

ప్రకాశములాగానే, ఉపాధియోగంవల్ల బ్రహ్మమందు సంబంధం చెప్పారు.

సంబంధం, భేదము, ఈ రెండూ బ్రహ్మకన్న వేరైన వస్తువున్నదని చెప్పవు. ఒకే బ్రహ్మకు బుద్ధి మొదలైన ఉపాధుల సంబంధంవల్ల జీవుడు, ఈశ్వరుడు అనే భేదం కలిగింది. సుషుప్తిలో ఉపాధి భేదం నశిస్తోంది. ఘటాకాశం మహదాకాశంలో కలిసిపోయినట్లుగా జీవుడు ఈశ్వరునితో ఏకమవుతాడు. సూర్యుడికి అడ్డుగా పెట్టిన వ్రేళ్ళు తీసివేస్తే సూర్యరస్మి సరాసరి పడుతుంది. అలాగే ఉపాధిభేదం పోతే అవిద్య నశించి అభేదం తెలుస్తుంది. కాబట్టి ఇక్కడ చెప్పిన సంబంధము, భేదము వాస్తవాలు కాదు.

***సూత్రం - 353 "ఉపపత్తేశ్చ"***

శ్రుతివాక్యాలవల్ల సంబంధభేదాలు చెప్పటం ముఖ్యం కాదు. **ఛాందోగ్యోప నిషత్తు**లో "సుషుప్తిలో జీవుడు తన రూపాన్నే పొందుతాడు" అన్నారు. అప్పుడు ప్రతిబింబం లాంటి జీవభావం పోయి, మిగిలేది ఆత్మభావం ఒక్కటే. ఉపాధివల్ల వచ్చిన రూపం మాయమై పోగా నిజస్థితి తెలుస్తుంది.

***సూత్రం - 354 "తథాన్యప్రతి షేధాత్"***

ఇతర వస్తువులన్నింటినీ నిషేధించటంవల్ల పరమాత్మకన్న భిన్నమైనది ఏదీ లేదని తెలుస్తుంది. ఈ సమస్తమూ బ్రహ్మమే. ఆత్మయే. ఈ బ్రహ్మలో నానాత్వం ఏమీ లేదు. అని **ఛాందోగ్యోపనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తు** చెబుతున్నాయి. బ్రహ్మకన్న వేరొకటి లేదు. కాబట్టి బ్రహ్మ అద్వితీయము.

***సూత్రం – 355 "అనేన సర్వగతత్వమాయామ శబ్దాదిభ్యః"***

దీనివల్ల బ్రహ్మముకన్న వేరే ఏదీ లేదని, బ్రహ్మము సర్వగతము, పరిపూర్ణము అని తెలుస్తోంది. కాబట్టి బ్రహ్మము ఒక్కటే. అది అద్వితీయము.

**ఏకాకీ భ్రామరూపా నిర్ద్వైతా ద్వైతవర్జితా అంటోంది** లలితా సహస్రము.

## 8. ఫలాధికరణము (కర్మఫలాన్నిచ్చేది పరమాత్మే)

కర్మఫలాన్నిచ్చేది ఎవరు? అనే విషయం ఎనిమిదవదైన **'ఫలాధికరణము'**లో వివరిస్తున్నారు. ఇందులో నాలుగు సూత్రాలున్నాయి.

మానవులు ఇష్టము, అనిష్టము, మిశ్రమము అని మూడు రకాల కర్మఫలాలను అనుభవిస్తున్నారు. ఈ కర్మ ఫలాన్ని ఇచ్చేదెవరు. కర్మమా? ఈశ్వరుడా?

ప్రారబ్ధ కర్మ మూడు రకాలు

1. ఇచ్ఛాప్రారబ్ధము – పూర్తి ఇష్టంతో చేసిన పని.

2. అనిచ్ఛా ప్రారబ్ధం – ఇష్టం లేకపోయినా, తప్పనిసరిగా చేసేది.

3. పరేచ్ఛా ప్రారబ్ధము – ఇతరుల ఆనందం కోసం చేసిన కర్మ. ఈ కర్మల ఫలాన్నిచ్చేది ఆ పరమాత్మ. అదే పరాశక్తి.

***సూత్రం – 356 "ఫలమత ఉపపత్తేః"***

ఉపపత్తి వల్ల కర్మ అనేది ఈశ్వరునివల్లనే కలుగుతోంది. సర్వాధికారి. సృష్టి స్థితి లయాలకు కారకుడు పరమేశ్వరుడు. ఆయన సర్వజ్ఞుడు కాబట్టి, కర్మలు ఆచరించనటువంటి వారికి, వారి వారి కర్మలను బట్టి ఫలితాన్ని ఇస్తాడు.

***సూత్రం – 357 "శ్రుతత్వాచ్చ"***

కర్మఫలాన్ని ఈశ్వరుడే ఇస్తాడని శ్రుతులు చెబుతున్నాయి.

అన్నభక్షణ చేసేవాడు, కర్మఫలాన్ని ఇచ్చేవాడు కూడా ఆ ఆత్మే. అని వేదాలు చెబుతున్నాయి. ధనాన్ని భోగాన్ని ఇచ్చేవాడు ఆ పరమాత్మే.

***సూత్రం - 358 "ధర్మం జైమినిరత ఏవ"***

యాగాది రూపమైన ధర్మమే ఫలమిస్తుంది అని జైమిని అంటున్నాడు.

జైమిని పూర్వమీమాంశ వ్రాశాడు. అందులో ఈశ్వరుణ్ణి అంగీకరించరు. కాబట్టి ఈశ్వరుడుగాని, యాగాదిదేవతలుగాని ఫలాన్ని ఇవ్వరని, కర్మలవల్ల కలిగిన **'అపూర్వము'** అనే సూక్ష్మశక్తే ఫలితము ఇస్తుంది అంటారు. కర్మము ఫలితము ఇవ్వదనే మాట వీరు కూడా అంగీకరిస్తున్నారు.

***సూత్రం - 359 "పూర్వం తు బాదరాయణో హేతువ్యపదేశాత్"***

కాని కర్మయొక్క ఫలితాన్ని ఇచ్చేది ఈశ్వరుడు అంటాడు బాదరాయణుడు. (వ్యాసుడు) కర్మ అనేది స్వయంగాకాని, అపూర్వంగాకాని కర్మఫలానికి కారణం కాదు.

ఈ రకంగా అన్ని కర్మలకు ఫలాన్ని ఇచ్చేవాడు బ్రహ్మ. బ్రహ్మమే కారణము. **కౌశీతకీ ఉపనిషత్తు**లో ఆ పరమేశ్వరుడు ఎవరిని ఈ లోకం నుండి ఉద్ధరించాలనుకుంటున్నాడో, వారితో మంచి పనులు చేయిస్తాడు. అథోలోకాలకు పంపాలనుకునే వారితో చెడ్డపనులు చేయిస్తాడు" అని చెప్పబడింది. కాబట్టి కర్మఫలాన్ని ఇచ్చేవాడు బ్రహ్మమే తప్ప వేరుకాదు. అదే పరాశక్తి.

***దీంతో బ్రహ్మసూత్రాలలోని మూడవ అధ్యాయంలోని***
***రెండవ పాదం పూర్తయింది.***

# మూడవ అధ్యాయం

## మూడవ పాదం

ఈ పాదంలో ఉపాసనలను వివరిస్తున్నారు. ఉపాసన రెండు రకాలు. సగుణోపాసన, నిర్గుణోపాసన. సగుణోపాసన చిత్తస్థైర్యాన్ని కలిగించి, నిర్గుణోపాసనకు దారి చూపిస్తుంది. ఇందులో ముప్ఫై ఆరు అధికరణలు, అరవై ఆరు సూత్రాలు ఉన్నాయి.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | సర్వవేదాంత ప్రత్యయాధికరణము | ఉపాసనల ఏకరూపత్వము | 4 |
| 2. | ఉపసంహారాధికరణము | ఒక శాఖలోని గుణాలను వేరొక శాఖలోకి అన్వయించటము | 1 |
| 3. | అన్యదాత్వాధికరణము | ఒకటిగా కనిపించినా కొన్ని విద్యలు వేరు వేరు | 3 |
| 4. | వ్యాప్త్యధికరణము | ఓంకారము అన్ని వేదాలకు సాధారణము | 1 |
| 5. | సర్వాభేదాధికరణము | ఉపాసనలకు భేదం లేదు | 1 |
| 6. | ఆనందాద్యధికరణము | ఆనందాది గుణాలు మాత్రమే సర్వత్ర అన్వయింపతగ్గవి | 3 |
| 7. | అధ్యానాధికరణము | అన్నింటికన్న పరుడైన వాడు పరమాత్మ | 2 |
| 8. | ఆత్మగృహీత్యధికరణము | ఐతరేయంలోని ఆత్మ పరమాత్మే | 2 |
| 9. | కార్యాఖ్యానాధికరణము | ప్రాణానికి జలమే వస్త్రము | 1 |
| 10. | సమానాధికరణము | ఒకే శాఖలోని సమానమైన విద్యలను సంగ్రహించుకోవాలి | 1 |

| | | | |
|---|---|---|---|
| 11. | సంబంధాధికరణము | సత్యవిద్యలోని రెండు నామములు భిన్నములు | 3 |
| 12. | సంభృత్యధికరణము | రాణాయనీయశాఖలోని బ్రహ్మ గుణాలు ప్రత్యక్షోపాసనకు సంబంధించినవి | 1 |
| 13. | పురుషవిద్యాధికరణము | ఛాందోగ్య, తైత్తిరీయ విద్యలు భిన్నమైనవి | 1 |
| 14. | వేదాద్యధికరణము | వేదాలతోడి వ్యాఖ్యలు బ్రహ్మ విద్యాంగాలు కావు | 1 |
| 15. | హాన్యధికరణము | జ్ఞానియొక్క పుణ్యపాపాలు విసర్జించటము | 1 |
| 16. | సాంపరాయాధికరణము | ఉత్క్రాంతి సమయమందే జ్ఞాని పాపపుణ్యాలు వదులుతాడు | 2 |
| 17. | గతేరర్థవత్త్వాధికరణము | సగుణోపాసకునికి దేవయానము నిర్గుణోపాసకునికి బ్రహ్మము | 2 |
| 18. | అనియమాధికరణము | సగుణోపాసకులందరిదీ దేవయానమే | 1 |
| 19. | యావదధికారాధికరణము | ముక్తులైన వారు ధర్మరక్షణ కోసం మళ్ళీ జన్మించవచ్చు | 1 |
| 20. | అక్షరద్యధికరణము | అక్షరానికి సంబంధించిన నిషేధ భావాలకు ఉపసంహారం ఉన్నది | 1 |
| 21. | ఇయదధికరణము | 'ద్వాసుపర్ణా' 'ఋతంపిబంతౌ' లలో చెప్పిన విద్య ఒకటే | 1 |
| 22. | అంతరత్వాధికరణము | ఉషస్త, కహోళ బ్రాహ్మణాలలో చెప్పిన విద్య ఒకటే | 2 |

| | | | |
|---|---|---|---|
| 23. | వ్యతిహారాధికరణము | ఐతరేయం ఉభయోపాసన చెబుతున్నది | 1 |
| 24. | సత్యాద్యధికరణము | బృహదారణ్యకంలోని సత్యవిద్యలు రెండూ ఒకటే | 1 |
| 25. | కామ్యాద్యధికరణము | ఛాందోగ్య, బృహదారణ్యకాలలోని సర్వకామ్యాదులకు గుణోపసంహారం ఉన్నది | 1 |
| 26. | అదరాధికరణము | ప్రాణాగ్నిహోత్రము | 2 |
| 27. | తన్నిర్ధారణాధికరణము | కర్మలనాశ్రయించిన విద్యలు ఆ కర్మలకు అంగాలు కాదు | 1 |
| 28. | ప్రదానాధికరణము | వాయు, ప్రాణ ఉపాసనలు భిన్నమైనవి | 1 |
| 29. | లింగభూయస్త్వాధికరణము | శతపథ బ్రాహ్మణంలోని అగ్నులు ఉపాసనాత్మకాలు | 9 |
| 30. | శరీరవ్యతిరేకాధికరణము | ఆత్మదేహం కన్న భిన్నమైనది | 2 |
| 31. | అంగావబద్ధాధికరణము | ఉద్గీతాదులు అన్ని శాఖలకు సంబంధించినవి | 2 |
| 32. | భూమజ్యాయస్త్వాధికరణము | వైశ్వానరోపాసన సమగ్రమైనదే | 1 |
| 33. | శబ్దాదిభేదాదికరణము | వేద్యం ఒకటే అయినా, గుణభేదం వల్ల ఉపసనాభేదం కలుగుతోంది | 1 |
| 34. | వికల్పాధికరణము | బ్రహ్మోపాసనలో దేనినైనా అనుష్టించవచ్చు | 1 |
| 35. | కామ్యాధికరణము | కామ్యోపాసనలు సమిష్టిగాను ఒకటిగాను అనుష్టించవచ్చు | 1 |
| 36. | యథాశ్రయభావాది కరణము | కర్మాంగోపాసనలు కలిపి, లేదా విడివిడిగా కూడా చెయ్యవచ్చు | 6 |

మొత్తం అధికరణలు 36. సూత్రాలు 66.

# 1. సర్వవేదాంతప్రత్యయాధికరణము

## (ఉపాసనల ఏకరూపత్వం)

ఉపాసనలన్నీ ఒకటా కాదా అనే విషయం మొదటిదైన **'సర్వవేదాంత ప్రత్యయాధికరణము'**లో వివరిస్తున్నారు. ఇందులో నాలుగు సూత్రాలున్నాయి.

అన్ని ఉపనిషత్తులలో చెప్పబడిన ఉపాసనలు అన్నీ ఒకటేనా? లేక వేరువేరా?

***సూత్రం - 360 "సర్వవేదాన్త ప్రత్యయం చోదనా ద్యవిశేషాత్"***

అన్ని వేదాంతములందు అంటే అన్ని ఉపనిషత్తులందూ చెప్పబడిన ఉపాసనలు భిన్నమైనవి కావు. వాటి విధిలో ఏ రకమైన తేడా లేదు.

ఉపనిషత్తులలో చెప్పబడిన ప్రాణవిద్య, పంచాగ్నివిద్య మొదలైన ఉపాసనలన్నీ ఒక్కటే. అందులో చెప్పిన విషయము, ఉపాసనా విధానము, ఉపాసనా ఫలము అంతా ఒకటే. ఛాందోగ్య, బృహదారణ్యకాలలో చెప్పిన ముఖ్య ప్రాణోపాసన ఒకటే. రెండింటిలోనూ ప్రాణమే శ్రేష్ఠము, జ్యేష్టము, అటువంటి ప్రాణాన్ని గురించి తెలుసుకున్నవాడే జ్యేష్టుడు, శ్రేష్టుడు అని చెప్పబడింది. అలాగే పంచాగ్ని విద్య, శాండిల్య విద్య, వైశ్వానర విద్యలు కూడా.

***సూత్రం - 361 "భేదాన్నేతి చేన్నైకస్యామపి"***

ద్రవ్యభేదము, దేవత భేదాలను బట్టి యాగంలో భేదం వస్తుంది. అలాగే వేద్యుడు, ఉపాసదేవత, విద్య వీటివల్ల కూడా భేదం ఉంటుందనేది సరికాదు.

పంచాగ్నివిద్యలో **బృహదారణ్యకం**లో ఆరు అగ్నులు చెప్పగా, **ఛాందోగ్యం**లో ఐదు అగ్నులే చెప్పారు. అలాగే ప్రాణాన్ని గురించి చెప్పేటప్పుడు, బృహదారణ్యకంలో ఐదు చెప్పారు. అందుచేత ఉపాసన భేదం, విధానంలో నానాత్వం వస్తున్నాయని వారి వాదన. ఇది నిజం కాదు. రూపభేదం, గుణభేదం కొద్దిగా ఉండచ్చు. ఈ తేడాలు అంత ముఖ్యమైనవి కావు. అందువల్ల నానాత్వం సిద్ధించదు.

***సూత్రం - 362 "స్వాధ్యాయస్య తథాత్వేన హి సమాచారే-ధికారాచ్చ సవవచ్చ తన్నియమః"***

ఉపాసనలలో 'శిరోవ్రతము' అని ఒక ఉపాసన ఉన్నది. ఇది **దేవీభాగవతము** వంటి వాటిలో చెప్పబడింది. కానీ ఉపనిషత్తులలో చూస్తే, ఒక్క **ముండకోపనిషత్తు**లోనే చెప్పబడింది. ఇంకే ఉపనిషత్తులోనూ దీన్నిగురించి లేదు. కాబట్టి ఉపాసనలో భేదం ఉంది అనటం సరికాదు.

ఇది కేవలము స్వాధ్యాయానికి సంబంధించినది అంతేకాని ఉపాసధర్మం కాదు. అందుచేత ఉపాసనలలో భేదం లేదు.

***సూత్రం - 363 "దర్శయతిచ"***

వేదాలలో కూడా వేద్యుడు అంటే తెలుసుకొనదగినవాడు, ఉపాసన ఒకటే అని చెప్పబడింది. కాబట్టి ఉపనిషత్తులలో రకరకాల ఉపాసనలు చెప్పినప్పటికీ, వాటిలో ఏకరూపత్వమున్నది. ఉపాసనలన్నీ ఒకటే. అంటూ ఒకటవ అధికరణ పూర్తిచేశారు.

## 2. ఉపసంహారాధికరణము

### (ఒక శాఖలోని గుణాలను వేరొకశాఖలోకి అన్వయించవచ్చు)

ఒక శాఖలోని ధర్మాలను ఇంకొక శాఖలోకి అన్వయింప చేయవచ్చు అంటున్నారు రెండవదైన **'ఉపసంహారాధికరణము'**లో ఇందులో ఒక సూత్రమే ఉంది.

***సూత్రం - 364 "ఉపసంహారోఽర్థాభేదాద్విధి శేషవత్ సమానే చ"***

ఉపసంహారము అంటే ఒకచోట చెప్పిన గుణాన్ని, ధర్మాన్ని ఇంకొకచోట అన్వయింప చేయటం. అగ్నిహోత్రం అనేది ఎక్కడైనా ఒకటే. అలాగే ఉపాసనలో కూడా గుణోపసంహారం జరగాలి. ఉపాసనలో భేదం ఉండదు.

ఒక శాఖలో కొన్ని ధర్మాలు చెబితే, ఇంకొక శాఖలో కొన్ని ధర్మాలు చెబుతారు. ఇప్పుడు ఒకశాఖలోని ధర్మాలను ఇంకొక శాఖలోకి ఉపసంహారం చెయ్యవచ్చు. అంటే ఉపాసకుడు అన్ని శాఖలలోని గుణాలను నేర్చుకుని అన్వయింప చేయవచ్చును. వేరొక శాఖకు సంబంధించిన గుణాలు, ధర్మాలు, సంప్రదాయాలు కూడా పాటించవచ్చు. ఇందులో దోషం లేదు.

# 3. అన్యథాత్వాధికరణము

## (ఒకటిగా కనిపించినా కొన్ని విద్యలు భిన్నమైనవే)

ఒకే పేరుంది కాబట్టి రెండు విద్యలు ఒకటే అనటానికి లేదు అంటున్నారు మూడవదైన '**అన్యథాత్వాధికరణము**'లో ఇందులో మూడు సూత్రాలున్నాయి.

అన్ని ఉపనిషత్తులలోనూ ఉపాసన ఒక్కటే. కాని ఛాందోగ్యోపనిషత్తులోనూ, బృహదారణ్యకోపనిషత్తులోను కూడా ప్రాణవిద్య చెప్పబడ్డది. ఈ ప్రాణవిద్యలు ఒకటేనా? వీటిలో తేడాలున్నాయా? అనేది వివరిస్తున్నారు.

***సూత్రం - 365 "అన్యథాత్వం శబ్దాదితి చేన్నా విశేషాత్"***

ఛాందోగ్యము, బృహదారణ్యకాలలో చెప్పిన ప్రాణవిద్యలు రెండూ వేరువేరు కాదు. వీటిలో ఇతరమైన అంశం ఏమీ లేదు.

ఉద్గీతను గురించి చెబుతూ **ఛాందోగ్యం**లో "ఓంకారాన్ని ఉద్గీతదృష్టితో ఉపాసించాలి అని చెప్పారు. ఇక్కడ ఉద్గీత కర్మగా చెప్పబడ్డది. అదే **బృహదారణ్యకం**లో ముఖ్యప్రాణాన్ని ఉద్గీత కర్తగా చెప్పారు. 'దేవతల కోసం ముఖ్యప్రాణం ఉద్గానం చేసింది.' ఉద్గీత అనేది ఈ రకంగా ఒకచోట కర్త, ఇంకొక చోట కర్మగా చెప్పబడింది. కాబట్టి ఉద్గీతవిద్యలు భిన్నమైనవి అని వారి వాదన. ఇది సరియైనది కాదు.

రెండు చోట్లాకూడా దేవదానవుల యుద్ధం జరిగింది. దవేతలు ఓడిపోయి ఉద్గీతోపాసన చెయ్యమని వాక్కు మొదలైన వాటిని అడగటం, అవి నిర్వీర్యమవటం, చివరకు ముఖ్యప్రాణము ఉద్గానంచెయ్యటం. దాంతో అసురులు ఓడిపోవటం జరిగింది. రెండూ ఒకటే. కాని ఛాందోగ్యంలో పూర్వకాలంలో అనేకమంది ప్రాణాన్ని ఉద్గీతగా ఉపాసన చేశారు. ఇక్కడ ప్రాణం కర్మ. బృహదారణ్యకంలో ప్రాణం ఉద్గీతోపాసన చేసింది అంటూ కర్తగా పేర్కొనబడింది. అంతేతప్ప మిగతా భేదం ఏమీ లేదు.

***సూత్రం - 366 "న వా ప్రకరణభేదాత్పరోవరీయ స్త్వాదివత్"***

ప్రకరణ భేదం ఉండటంవల్ల విద్యైక్యమే లేదు. ఓంకారోపాసన, ప్రాణోపాసన రెండూ వేరు వేరు.

***సూత్రం - 367 "సంజ్ఞాతశ్చేత్తదుక్తమస్తి తు తదపి"***

రెండు విద్యలకు ఒకే పేరున్నది కాబట్టి రెండూ ఒకటే అనటానికి వీలు లేదు. వేరువేరు విద్యలకు కూడా ఒకే పేరుండవచ్చు. కాబట్టి ఒకేపేరుతో ఉన్న రెండు విద్యలలో తేడా ఉండవచ్చును.

## 4. వ్యాప్త్యధికరణము

### (ఓంకారము అన్ని వేదాలకు సాధారణము)

ఓంకారం ఏ వేదంలో చెప్పినదిగా తీసుకోవాలి అనే దానికి వివరణ ఇస్తున్నారు నాల్గవదైన **'వ్యాప్త్యధికరణము'**లో ఇందులో ఒక సూత్రమే ఉంది.

అధర్వణ వేదానికి సంబంధించిన **పరమహంస పరివ్రాజకోపనిషత్తు** ప్రణవాన్ని వివరిస్తోంది.

ప్రణవానికి 16 మాత్రలుంటాయి. అవస్థలు నాలుగు 1. జాగ్రదావస్థ 2. స్వప్నావస్థ 3. సుషుప్త్యావస్థ 4. తురీయావస్థ. ఇవి ఒక్కొక్కటి మళ్ళీ నాలుగు భాగాలుగా అవుతాయి. 1. జాగ్రదావస్థ – ఇవి నాలుగు రకాలు.

1. జాగ్రత్ జాగ్రదావస్థ
2. జాగ్రత్స్వప్నావస్థ
3. జాగ్రసుషుప్త్యావస్థ
4. జాగ్రత్తురీయము

అలాగే స్వప్నావస్థ తదితర అవస్థలు కూడా. మొత్తం – 16. అవస్థలకు నాయకులు విశ్వ, తైజ, ప్రాజ్ఞ్య, తురీయులు. వారుకూడా అవస్థల మాదిరిగానే విభజింపబడతారు. ముందుగా జాగ్రదావస్థలో

1. జాగ్రద్విశ్వుడు 2. జాగ్రత్తైజసుడు 3. జాగ్రత్ప్రాజ్ఞుడు 4. జాగ్రతురీయుడు

తురీయావస్థలో 1. తురీయవిశ్వుడు 2. తురీయ తైజసుడు 3. తురీయప్రాజ్ఞుడు 4. తురీయ తురీయుడు

ఇలాగే మిగిలిన వారు కూడ

| | | |
|---|---|---|
| అకారము | – | జాగ్రద్విశ్వుడు |
| ఉకారము | – | జాగ్రత్తైజసుడు |
| మకారము | – | జాగ్రత్ప్రాజ్ఞుడు |
| అర్ధమాత్ర | – | జాగ్రత్తురీయుడు |
| బిందువు | – | స్వప్నవిశ్వుడు |
| నాదము | – | స్వప్నతైజసుడు |
| కల | – | స్వప్నప్రాజ్ఞుడు |
| కలాతీతము | – | స్వప్నతురీయుడు |
| శాంతి | – | సుషుప్తవిశ్వుడు |
| శాంత్యాతీతము | – | సుషుప్తతైజసుడు |
| ఉన్మని | – | సుషుప్తప్రాజ్ఞుడు |
| మనోన్మని | – | సుషుప్తతురీయుడు |
| వైఖరి | – | తురీయవిశ్వుడు |
| మధ్యమ | – | తురీయతైజసుడు |
| పశ్యంతి | – | తురీయప్రాజ్ఞుడు |
| పరయందు | – | తురీయతురీయుడు |
| జాగ్రన్మాత్రా చతుష్టయము | – | అకారాంశము |
| స్వప్నమాత్రా చతుష్టయము | – | ఉకారాంశము |
| సుషుప్తిమాత్రాచతుష్టయము | – | మకారాంశము |
| తురీయమాత్రా చతుష్టయము | – | అర్ధమాత్రాంశము |

ఇదే ప్రణవబ్రహ్మము. ఇది పరమహంస, తురీయాతీత, అవధూతలు మాత్రంచేతనే ఉపాసించబడుతుంది. దానితోనే బ్రహ్మత్వం ప్రకాశిస్తుంది. దాంతోనే విదేహముక్తి కలుగుతుంది.

**ఓంకారము పరమేశ్వర స్వరూపము. పరమేశ్వరుడికి ఏ రకమైన బంధాలు ఉండవు. అలాగే ఓంకారాన్ని ఉపాసన చేసేవారికి కూడా భవబంధాలు ఉండవు. అందుకే ఓంకారాన్ని పరివ్రాజకులు, సర్వసంఘపరిత్యాగులు, బంధాలు లేనివారు మాత్రమే ఉపాసన చెయ్యాలి.**

ఆత్మజ్ఞానమే - యజ్ఞోపవీతము. ధ్యాననిష్టయే శిఖ. అతడు అన్ని కర్మలు చేస్తాడు. కర్మపవిత్రము అతడు బ్రాహ్మణుడు, బ్రహ్మనిష్టాపరుడు, దేవుడు, ఋషి, తపస్వి, శ్రేష్టుడు. జగద్గురువు. ఇతడే లోకాలను ఏలుతున్న మహానుభావుడు. అతడే నేను అని తెలుసుకోవాలి. పరమహంసపరివ్రాజకుడు నిత్యవుడు. అతడే వేదపురుషుడు, అతడే నేను అని తెలిసిన వారికి పునర్జన్మ ఉండదు.

***సూత్రం - 368 "వ్యాప్తేశ్చ సమఞ్జమ్"***

ఓంకారమనేది ఋగ్ యజు స్సామవేదాలు మూడింటిలోనూ వ్యాప్తమై ఉన్నది కదా! కాబట్టి ఓంకారాన్ని ఏ వేదంలోని ప్రణవంగా గ్రహించాలి?"

ఓంకారము మూడు వేదాలయందు వ్యాప్తమై ఉన్నది. కాని ఉద్గీతం అనేది ఓంకారానికి విశేషణం. ఇది సామవేదంలో ఉంది. అందుచేత సామవేదంలోని ప్రణవంగా దీన్ని గ్రహించాలి.

ఓంకారము అన్ని వేదాలలో ప్రతి ఋక్కుకు, ప్రతి అనువాకానికి ముందు, చివర కూడా ఉంటుంది. అయితే ఋగ్వేదంలో ఉద్గీతాన్ని ఓంకారానికి విశేషణంగా చెప్పారు కాబట్టి సామవేద అవయవంగా ఓంకారాన్ని ఉపాసించాలి.

## 5. సర్వాభేదాధికరణము (ఉపాసనలకు భేదం లేదు)

ఉపాసనలన్నీ ఒక్కటే. వాటి మధ్య భేదం లేదు అంటున్నారు. ఐదవ అధికరణ అయిన **'సర్వాభేదాధికరణము'**లో ఇందులో ఒక్క సూత్రమే ఉంది.

ప్రాణవిద్య అనేది **బృహదారణ్యక ఛాందోగ్యాలలో** ఒకటే. అక్కడ ప్రాణమే శ్రేష్ఠము, జ్యేష్ఠము అని చెప్పబడింది. ఈ ఉపనిషత్తులలో ఇంద్రియాలకు కూడా వశిష్ఠత్వాది గుణాలు చెప్పబడ్డాయి అంటే

వాక్కుకు - సుస్థిరత్వము

చక్షువుకు - ప్రతిష్ఠాత్వము (చక్కగా నిలిచే శక్తి)

శ్రోత్రానికి - సంపత్త్వము (ఇతరుల అభిప్రాయం తెలుసుకునే శక్తి)

మనస్సుకు - అవయవత్వము (అన్ని ఇంద్రియాలకు ఆధారము)

రేతస్సుకు - జనిత్వము (ఉత్పత్తి కారణము)

**కౌశీతకీ ఉపనిషత్తు**లో శ్రేష్ఠత్వము మాత్రమే చెప్పారు. కాని వశిష్ఠత్వాది గుణాలు చెప్పలేదు. కాబట్టి ఒక శాఖలో చెప్పిన వశిష్ఠత్వాది గుణాలు ఇతర శాఖలలోకి కూడా అన్వయించుకోవచ్చా? లేదా?"

***సూత్రం - 369 "సర్వాభేదాదన్యత్రేమే"***

అన్ని శాఖలలోనూ ప్రాణోపాసనకు భేదం లేదు కాబట్టి, వశిష్ఠత్వాది గుణాలు అన్ని శాఖలలోకి అన్వయించవచ్చు. కౌశీతకోపనిషత్తు మొదలైన వాటిలో వశిష్ఠత్వాది గుణాలు వర్ణించబడకపోయినప్పటికి, ఛాందోగ్య, బృహదారణ్యకాలలో చెప్పిన గుణాలన్నీ ఇక్కడ అన్వయించుకోవచ్చు.

## 6. ఆనందాద్యధికరణము

### (ఆనందాది గుణాలు మాత్రమే సర్వత్ర అన్వయింపదగ్గవి)

ఈ విషయం వివరిస్తున్నారు ఆరవదైన **'ఆనందాద్యధికరణము'**లో ఇందులో మూడు సూత్రాలున్నాయి.

బ్రహ్మకు సత్యత్వము అనంతత్వము అనే ధర్మాలు చెప్పబడ్డాయి. మరికొన్ని చోట్ల బ్రహ్మవిద్యను ప్రతిపాదించే సందర్భాలలో విజ్ఞానఘనత్వము, సర్వాత్మత్వము, సర్వగతత్వము మొదలైన గుణాలు చెప్పబడ్డాయి. ఎక్కడ ఏ ఏ గుణాలు చెప్పబడ్డాయో వాటినే అక్కడ గ్రహించాలా? లేక ఎక్కడ చెప్పిన గుణాలనైనా అన్నిచోట్లా గ్రహించవచ్చునా?"

***సూత్రం - 370 "ఆనన్దాదయః ప్రధానస్య"***

పరబ్రహ్మ యొక్క ఆనందత్వము మొదలైన ధర్మాలను సర్వత్రా అన్వయించుకోవచ్చు.

ఉపనిషత్తులలో చెప్పబడిన పరబ్రహ్మ నిర్గుణుడు, ఆనందస్వరూపుడు, విజ్ఞానఘనుడు, సద్రూపుడు, చిద్రూపుడు, పూర్ణుడు అని చెప్పటం జరిగింది. వీటిలో కొన్ని కొన్ని ధర్మాలు కొన్ని కొన్ని చోట్ల చెప్పబడ్డాయి. అయినప్పటికీ, ఉపనిషత్తులలో చెప్పదలచినది నిర్గుణ బ్రహ్మను గూర్చే. కాబట్టి ఆ ధర్మాలు ఎక్కడ అవసరమైతే అక్కడ వాటిని చెప్పవచ్చును.

***సూత్రం - 371 "ప్రియశిరస్త్వాద్యప్రాప్తిరుపచయా పచయౌ హి భేదే"***

**తైత్తిరీయోపనిషత్తు**లోని ప్రియశిరస్త్వాది ధర్మాలకు సర్వప్రాప్తి లేదు. ప్రియశిరస్త్వాది ధర్మాలు అంటే ప్రియము, మోదము, ప్రమోదము, ఆనందము అనేవి.

| | | |
|---|---|---|
| ప్రియము | - | తన వారిని చూసినప్పుడు కలిగే సంతోషము |
| మోదము | - | కోరుకున్నది లభించినప్పుడు కలిగే సంతోషము |
| ప్రమోదము | - | మోదము ఎక్కువైనప్పుడు కలిగేది |
| ఆనందము | - | అన్నింటికీ మించిన సంతోషము |

ఆనందమయుడికి

| | | |
|---|---|---|
| ప్రియము | - | శిరస్సు |
| మోదము | - | దక్షిణ పక్షము |
| ప్రమోదము | - | ఉత్తర పక్షము |
| ఆనందము | - | ఆత్మ |

ప్రియము, మోదము ప్రమోదము అనేవి సంతోషంలో హెచ్చుతగ్గులు. ఈ ధర్మాలను ప్రతిచోట చెప్పటానికి లేదు అనరాదు. వీటిని ఎక్కడైనా చెప్పవచ్చును.

***సూత్రం - 372 "ఇతరే త్వర్థసామాన్యాత్"***

బ్రహ్మమనేది సర్వత్రా ఉండేదే కాబట్టి, ఆనందాది ధర్మాలు సర్వత్ర అన్వయించవలసినదే.

బ్రహ్మయొక్క స్వరూపాన్ని తెలియచేసేవి, బ్రహ్మ విజ్ఞానసాధనాలు ఈ ఆనందాది ధర్మాలు. కాబట్టి వాటిని సర్వత్ర అన్వయించవలసినదే. ఇలా అన్వయించకపోతే బ్రహ్మతత్త్వాన్ని బోధించే మహావాక్యాల అర్థం తెలియదు. అందుకనే ఆనందము, సత్యము లాంటి గుణాలను సర్వత్రా అన్వయించుకోవాలి.

## 7. అధ్యానాధికరణము (అన్నింటికన్నా పరుడు పరమాత్మ)

ఈ విషయాన్ని ఏడవదైన **'అధ్యానాధికరణము'**లో వివరిస్తున్నారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

పరానికి ఈశ్వరి – పరమేశ్వరి. పరానికి శక్తి – పరాశక్తి. పరానికి ఆత్మ – పరమాత్మ. ఆ పరమాత్మ అన్నింటికి అతీతుడు.

| | | |
|---|---|---|
| ఇంద్రియాలు | – | మనస్సు అధీనంలోనూ |
| మనస్సు | – | బుద్ధి అధీనంలోనూ |
| బుద్ధి | – | యజమాని అధీనంలోనూ ఉండాలి |

విజ్ఞానహీనుడు మనసును అధీనంలో ఉంచుకోలేడు. తాను చేరవలసిన గమ్యం చేరలేడు. మోక్షాన్ని పొందలేడు. వివేకవంతమైన బుద్ధిగలవాడు, మనసును అదుపులో ఉంచగలిగినవాడు పరమపదాన్ని చేరతాడు.

| | | |
|---|---|---|
| ఇంద్రియాల కన్న | – | వాటి విషయాలు (లక్షణాలు) శ్రేష్ఠమైనవి |
| విషయాలకన్న | – | మనస్సు శ్రేష్ఠమైనది |
| మనసుకన్న | – | బుద్ధి శ్రేష్ఠమైనది |
| బుద్ధికన్న | – | మహత్తత్త్వం శ్రేష్ఠమైనది |
| ప్రకృతికన్న | – | సూక్ష్మరూపి అయిన పురుషుడు గొప్పవాడు |

ఆ పురుషుడే పరమాత్మ. పరబ్రహ్మ. అదే పరాశక్తి.

అంతకు మించి ఇంకేమీ లేదు. అదే పరాకాష్ఠ. అతణ్ణి చేరినవారు తిరిగి రారు. అని చెప్పబడింది. ఇక్కడ పురుషుడు అన్నింటిలోనూ ఉన్నాడని చెప్పటం దీని ఉద్దేశ్యమా? లేకపోతే విషయాదులైన ఇవన్నీ ఒకదానిలోపల ఒకటున్నాయని చెప్పటం ఉద్దేశ్యమా?

*సూత్రం - 373 "అధ్యానాయ ప్రయోజనాభావాత్"*

జ్ఞానపూర్వకమైన సమ్యక్జ్ఞానం కోసమే పురుషత్వము ఇక్కడ చెప్పబడింది. అంతేగాని మిగిలినవన్నీ ఒకదానికన్న ఇంకొకటి గొప్పది అని చెప్పటానికి మాత్రం కాదు. అలా చెప్పటంవల్ల ఉపయోగం ఏమీ లేదు.

ఇక్కడ ఇంద్రియాల కన్న వాటి లక్షణాలు, వాటికన్న మనస్సు, మనస్సు కన్న బుద్ధి ఇలా ఒకదాని కన్న ఒకటి ఎక్కువ అని చెప్పటం కాదు. ఇవి ఒకదానికన్న ఒకటి శ్రేష్ఠమైనవి అని చెప్పి పరమపురుష సాక్షాత్కారం పొందటమే ఇక్కడ లక్ష్యం. అన్నిటికన్న ఉత్కృష్టమైన వాడు పురుషుడు. అతణ్ణి గురించి తెలుసుకున్న మరుక్షణమే ముక్తి కలుగుతుంది.

*సూత్రం - 374 "ఆత్మశబ్దాచ్చ"*

ఇక్కడ ఆత్మశబ్దం చెప్పటం కేవలం పురుషుణ్ణి ప్రతిపాదించటం కోసమే. **కఠోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఆత్మ అనేది సూక్ష్మమైన బుద్ధితో మాత్రమే గ్రహించ బడుతుంది. ఈ ఆత్మ సర్వవస్తుజాలమందు ఉన్నది. కాని పైకి కనుపించదు. సూక్ష్మబుద్ధి గలవారు మాత్రమే దీనిని గుర్తించగలుగుతారు. వివేకవంతుడు

ఇంద్రియాలను - మనస్సులో లీనం చెయ్యాలి

మనస్సును - బుద్ధిలో లీనం చెయ్యాలి

బుద్ధిని - మహతత్త్వంలో లీనం చెయ్యాలి

మహతత్త్వాన్ని - ఆత్మలో లీనం చెయ్యాలి

ఇదంతా ఎందుకు? పురుషజ్ఞానం కోసం. ఆత్మజ్ఞానం కోసం. అంతేకాని ఇవన్నీ ఒకదానికన్న ఒకటి గొప్పది అని చెప్పటానికి కాదు. ఈ రకంగా అన్నిటికంటే పరుడైనవాడు పరమాత్మ.

## 8. ఆత్మగృహీత్యధికరణము (ఐతరేయోపనిషత్తులోని ఆత్మ పరమాత్మే)

ఐతరేయోపనిషత్తులో లోకాలు సృష్టించిన ఆత్మ పరమాత్మే. అని వివరిస్తున్నారు ఎనిమిదవదైన **'ఆత్మగృహీత్యధికరణము'**లో దీనిలో రెండు సూత్రాలున్నాయి.

"సృష్టి జరగటానికి ముందు ఈ జగత్తంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికన్న భిన్నమైన పదార్థం ఏమీ లేదు. దాన్నే ఆత్మ అంటారు. ఆ ఆత్మయే లోకాలను

సృష్టించాలి అనుకున్నది. అంభస్సు (స్వర్గలోకము) మరీచి (అంతరిక్షము) మర (భూలోకము) ఆపః (పాతాళము) అనే లోకాలను సృష్టించింది. అని **ఐతరేయోప నిషత్తు**లో చెప్పబడింది. ఇక్కడ ఆత్మశబ్దానికి అర్థం–హిరణ్యగర్భుడా? లేక పరమాత్మా?

***సూత్రం - 375 "ఆత్మగృహీతిరితరవదుత్తరాత్"***

వేదాలయందు ఆత్మశబ్దానికి పరమాత్మ అని అర్థం. అలాగే ఇక్కడ కూడా చెప్పాలి.

సృష్టిరచన చెయ్యటం పరమాత్మ లక్షణం. అది పరమాత్మ ధర్మం. కాబట్టి ఆత్మశబ్దానికి అర్థం పరమాత్మే. **తైత్తిరీయోపనిషత్తు**లో ఆత్మనుండి ఆకాశం, ఆకాశం నుండి వాయువు మొదలైన భూతాలు పుట్టినాయి. అని చెప్పబడింది. ఇక్కడ ఆత్మ అంటే పరమాత్మే. **బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు జనకమహారాజుకు ఆత్మను గురించి వివరిస్తూ ఆత్మను ఎవరూ చూడలేరు. అంటూ ఆ వివరణ పూర్తి చేస్తాడు. అలాగే **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానాన్ని వివరిస్తూ "శ్వేతకేతూ! సృష్టికి పూర్వం ఈ ప్రపంచం నామరూపాలతో కూడి లేదు. అని ఆరంభించి ఆత్మతత్త్వాన్ని వివరిస్తాడు ఈ రెండు ఉపనిషత్తులలోనూ ఆత్మశబ్దానికి అర్థం పరమాత్మ.

***సూత్రం - 376 "అన్వయాదితి చేత్స్యాదవ ధారణాత్"***

లోకాలను సృష్టించటం పరమాత్మ పనికాదు. హిరణ్యగర్భుని పని అని వారి వాదన. అందుకనే హిరణ్యగర్భుడు అని అర్థం చెబితేనే బాగుంటుంది అని వారంటారు. ఇది తప్పు. సృష్టికి పూర్వము ఉన్నది పరమాత్మయే కాబట్టి ఇక్కడ ఆత్మ అంటే పరమాత్మ అనే అర్థం చెప్పాలి **ఐతరేయోపనిషత్తు**లాంటి ప్రాచీన ఉపనిషత్తులో కూడా ఆత్మ అనే శబ్దానికి 'పరమాత్మ' అనే అర్థం చెప్పారు. కాబట్టి ఆత్మ అంటే పరమాత్మ అనే చెప్పుకోవాలి.

## 9. కార్యాఖ్యానాధికరణము

## (ప్రాణానికి జలమే వస్త్రము)

ఈ విషయం వివరిస్తున్నారు తొమ్మిదవదైన **కార్యాఖ్యానాధికరణము**లో. ఇందులో ఒకే సూత్రము ఉంది.

ఒకసారి ఇంద్రియాలన్నీ తమలో ఎవరు గొప్ప అనే విషయం మీద ఒకరితో ఒకరు గొడవపడి బ్రహ్మవద్దకు పోయినాయి అంటూ **బృహదారణ్యకోపనిషత్తు**లో ప్రాణవిజ్ఞానము చెప్పబడింది. అందులో చివరకు ఇంద్రియాలన్నీ ప్రాణమే శ్రేష్ఠము అని ఒప్పుకున్నాయి.

ఈ రకంగా ఇంద్రియాలన్నీ ప్రాణం లేకపోతే తమ ఉనికి లేదని ఒప్పుకున్నాయి. అందుకే వాక్కు, చక్షువు, శ్రోత్రము, మనస్సు అనే పేర్లతో గాక అవన్నీ ప్రాణ సంకేతముతో పిలువబడతాయి.

అప్పుడు ప్రాణము మిగిలిన ఇంద్రియాలతో 'మీ మాట ప్రకారము నేను ఇక్కడే ఉంటాను. మరి నాకు అన్నము ఏది? అని అడిగింది. కుక్కలు పిల్లులు పక్షులు మొదలైన జంతువుల ఆహారమే నీకు ఆహారము అన్నాయి ఇంద్రియాలు. అంటే విరాట్ ప్రాణానికి విరాట్ అన్నమే (అన్ని రకాల అన్నము) ఆహారము.

అన్ని రకాల జీవుల రూపము కలిగిన ప్రాణానికి అన్ని రకాల జీవులు తినే ఆహారమే అన్నము. అందుకే పరమేశ్వరి **సర్వౌదనప్రీతచిత్తా** అనబడుతుంది.

ఇప్పుడు ప్రాణం మళ్ళీ అడిగింది. 'మరి నాకు ఆచ్ఛాదనకు వస్త్రం ఏది?' దానికి ఇంద్రియాలు 'జలమే నీకు ఆచ్ఛాదన' అన్నాయి. అంటే భోజనానికి ముందు, తరువాత చేసే ఆపోసనా, ఉత్తరాపోసనలే ప్రాణానికి వస్త్రం. ఇదే విషయం **ఛాందోగ్యోపనిషత్తు**లో కూడా చెప్పబడింది.

ఇక్కడ ఆచమనము, జలాన్ని వస్త్రంగా భావించటము ఈ రెంటిలోను ఏది విధేయము అంటే శాసింపదగినదిగా చెప్పబడ్డది.

***సూత్రం - 377 "కార్యాఖ్యానాదపూర్వమ్"***

అన్ని అనుష్ఠానాల శుద్ధికోసం ఆచమనాన్ని నిత్యకృత్యంగా వేదంలోను, పురాణాలలోను కూడా చెప్పబడింది. అందుకే ఉదకాన్ని వస్త్రంగా భావించటం విధేయం అంతే తప్ప ఆచమనం కాదు.

అన్నాన్ని ఉదకంతో కప్పటమనేది జలాన్ని అపూర్వమైన విషయం. కాబట్టి జలాన్ని అపూర్వమైన వస్త్రంగా భావించదలచారు. అన్నాన్ని నగ్నంగా లేకుండా చేయటం అంటే కప్పటము అనే అపూర్వమైన ధ్యానమే విధేయము.

## 10. సమానాధికరణము

### (ఒకే శాఖలో సమానమైన విద్యలు సంగ్రహించుకోవాలి)

ఈ విషయం వివరిస్తున్నారు పదవ అధికరణ అయిన **సమానాధికరణము**లో ఇందులో ఒకే సూత్రం ఉంది.

వాజసనేయ శాఖలోని **శతపద బ్రాహ్మణం**లో శాండిల్యవిద్య చెప్పారు. అలాగే **బృహదారణ్యకోపనిషత్తు**లో కూడా శాండిల్యవిద్య చెప్పారు. ఈ రెండూ ఒకటేనా? వేరు వేరా? శాండిల్య విద్య 33వ అధికరణలో ఉన్నది.

***సూత్రం - 378 "సమాన ఏవం చాభేదాత్"***

రెండు చోట్లాకూడా ఈ విద్య ఒకటే. ఉపాస్య వస్తువు ఒకటే. కాబట్టి విద్యాభేదం లేదు. **శతపథ బ్రాహ్మణం**లో అనేక గుణాలు చెప్పబడ్డాయి. కాబట్టి అది ఉత్పత్తి విధి. **బృహదారణ్యకం**లోది గుణవిధి. శతపద బ్రాహ్మణంలోని విద్య విధివిహితము. ఉపనిషత్తులోది అనువాదము. కాబట్టి రెండు విద్యలూ సమానమైనవే.

## 11. సంబంధాధికరణము

### (సత్యవిద్యలోని రెండు నామములు వేరు వేరు)

ఈ విషయం పదకొండవదైన '**సంబంధాధికరణము**'లో వివరిస్తున్నారు. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

**బృహదారణ్యకోపనిషత్తు**లో సత్యబ్రహ్మోపాసన గురించి చెప్పారు. పరబ్రహ్మ పేరే సత్యం. సత్యం అనే మాటలో మూడు అక్షరాలున్నాయి. 1. స 2. త్ 3. యం ఇందులో మొదటి అక్షరం సత్యం. చివరి అక్షరం సత్యం. మధ్యలో అక్షరమే అసత్యం. మృత్యువు. ఈ మూడింటిలోనూ రెండు సత్యం. ఒకటి అసత్యం. సత్యం బరువు ఎక్కువయి అసత్యం తేలిపోతుంది. ఈ విధంగా సత్యబ్రహ్మోపాసన చేసిన వారిని అసత్యం అనే మృత్యువు అంటదు.

సత్యమనేదే ఆదిత్యుడు. ఆదిత్య మండలంలోని పురుషుడే దక్షిణ నేత్రంలో ఉన్నాడు. వీరిద్దరూ ఒకటే తన కిరణాల ద్వారా కాంతినిస్తున్న ఆదిత్యుడు కళ్ళలోనే

ఉన్నాడు. అలాగే కళ్ళలోని పురుషుడు ప్రాణాలద్వారా ఉపకారం చేస్తూ, ఆదిత్య పురుషునిలో లీనమై ఉన్నాడు.

మరణ కాలంలో ఆదిత్యుడు తన కిరణాలను ఉపసంహరించుకోవటం వల్ల కళ్ళు తమ శక్తిని కోల్పోతాయి. ఆదిత్యమండలంలోని పురుషునికి వ్యాహృతులు.

భూః అనేది – శిరస్సు

భువః అనేది – భుజాలు

సువః అనేది – పాదాలు

సత్యబ్రహ్మకు అహః అనేది రహస్యనామం. అహర్నామమైన బ్రహ్మన్ని ఈ విధంగా వ్యాహృతుల రూపంలో తెలుసుకుని ఉపాసన చేసేవాడు పాపాలను వదలి వేస్తాడు. ఇక్కడ ఆధ్యాత్మానికి రెండు రహస్యమైన పేర్లు చెప్పబడ్డాయి. అధిదైవతంలో అహః అనే పేరు, ఆధ్యాత్మంలో అహం అనే పేరు. అహః అనేది ఆదిత్యునికి, అహం అనేది అక్షిపురుషునికి పేరు.

ఇప్పుడు సత్యవిద్యలో నామవ్యవస్థను బట్టి ధ్యానం చెయ్యాలా? ఈ రెండు పేర్లను ఆదిత్య అక్షిపురుషులిద్దరికీ అన్వయించవచ్చునా?

***సూత్రం – 379 "సంబన్ధాదేవమన్యత్రాపి"***

ఇందాక చెప్పిన శాండిల్యవిద్యలో చెప్పినట్లుగానే సత్యవిద్యలో కూడా ఇరువురు పురుషులలోను ఈ రెండు పేర్లను ఉపసంహారం చెయ్యవచ్చు అని వారి వాదన.

**శతపద బ్రాహ్మణము, శాండిల్యవిద్య** రెండూ ఒకశాఖకు చెందినవే. ఒకే రకమైన ఉపాసనకు సంబంధించినవి. అందుకనే ఈ రెండు విద్యలకు గుణోపసంహారం చెప్పబడ్డది. అలాగే సత్యవిద్యలో చెప్పబడిన ఇరువురు పురుషుల యందు రెండు పేర్లను (అహః, అహం) ఉపసంహారం చేయవచ్చు అని వారి వాదన.

***సూత్రం – 380 "న వా విశేషాత్"***

ఇక్కడ రెండు ఉపనిషత్తులు – విద్యలకు – రెండు స్థలాల్లో ప్రాప్తి లేదు.

ఆదిత్య మండలంలోని పురుషునికి అహం అని పేరు అని బృహదారణ్యకంలోని మూడవ అధ్యాయంలో చెప్పారు. అలాగే కంటిలోని పురుషునికి అహం అనే పేరు

చెప్పారు. ఇలా స్థానభేదాన్ని నామభేదాలు చెప్పబడ్డాయి. కాబట్టి ఇరువు పురుషుల్లోనూ, వారి పేర్లలోనూ ఉపసంహారం లేదు.

***సూత్రం - 381 "దర్శయతి చ"***

ఈ విధమైన కట్టుబాటు ఉన్నది. **ఛాందోగ్యం**లో ఆదిత్యాంతర్గ పురుషుని రూపం వంటిదే ఈ కంటిలోని పురుషునిది కూడా. ఆ పురుషుని అవయవాలే ఈ పురుషుని అవయవాలు. అతని పేరే ఇతని పేరు, అంటూ ఆదిత్య పురుషుని లక్షణాలను అక్షి పురుషునిలో ఆరోపించి చెప్పారు. ఈ విధమైన ఆరోపణ లేనిదే పరస్పర గుణోపసంహారం కుదరదు. కాబట్టి ఇక్కడ ఇద్దరు పురుషులకు, రెండు పేర్లకు ఉపసంహారం లేదు.

## 12. సంభృత్యధికరణము

### (రాణాయనీయశాఖలో బ్రహ్మగుణాలు ప్రత్యక్షోపాసనకు సంబంధించినవి)

వీటిని వివరిస్తున్నారు పన్నెండవదైన **సంభృత్యధికరణము**లో ఇందులో ఒక సూత్రమే ఉంది.

"పంచభూతాలు బ్రహ్మయొక్క శక్తి రూపాలు. వీటికి కారణం బ్రహ్మ. బ్రహ్మే వీటిని సృష్టించింది. కాబట్టే బ్రహ్మము మిక్కిలి శ్రేష్ఠమైనది. బ్రహ్మను ఎవరూ అతిక్రమించలేరు అనిరాణయనీయ శాఖ, ఛాందోగ్యశాఖ లోని ఖిలకాండలో బ్రహ్మము యొక్క వీర్యసమృద్ధి, స్వర్గవ్యాప్తి చెప్పబడ్డది. ఈ గుణాలన్నీ ఈ శాఖకు చెందిన ఉపనిషత్తులందే చెప్పబడిన శాండిల్యవిద్య మొదలైన వాటిలోకి అన్వయిస్తాయా? ఉపనిషత్తులలో చెప్పబడిన విద్యలు, ఇవి ఒకటేనా? తేడాలేమైనా ఉన్నాయా?"

***సూత్రం - 382 "సంభృతిద్యువ్యాప్త్యపి చాతః పురుషవిద్యాయామివ"***

స్థానభేదం వల్ల నామభేదం వచ్చినట్లుగా, స్థానభేదంవల్లనే సంభృత్యాదులు శాండిల్య విద్యయందు ఉపసంహరింపబడవు.

సంభృతము అంటే - చక్కగా భరించటము అని అర్థం.

**ఛాందోగ్యోపనిషత్తు**లో నా ఆత్మ హృదయంలో ఉన్నది అన్నారు.

ఇంకొకచోట ఆత్మ అనేది దహరాకాశంలో ఉన్నది అన్నారు. ఉపకోశల విద్యలో కంటియందు కనిపించే పురుషుడు అన్నారు. ఈ రకంగా వేరువేరు స్థానాలు చెప్పబడ్డా, వీటిలో ఎక్కడా సంభృత్యాది గుణాలు చెప్పబడలేదు. కాబట్టి ఈ గుణాలకు పై విద్యల్లో ఉపసంహారం లేదు. రాణాయనీ యశాఖలోని బ్రహ్మగుణాలు ప్రత్యక్షోపాసనకు సంబంధించినవి.

## 13. పురుషవిద్యాధికరణము

### (ఛాందోగ్యము, తైత్తిరీయాలలో చెప్పిన విద్యలు వేరువేరు)

ఈ విషయం పదమూడవదైన **పురుషవిద్యాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో ఒకే సూత్రం ఉంది.

'పురుష యజ్ఞము' అంటున్నారు దీనిమీద భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. **ఛాందోగ్యంలోను, తాండినాయన, పైంగి, రహస్య బ్రాహ్మణాల్లో** పురుషయజ్ఞం గురించి చెప్పారు. అంటే ఇక్కడ పురుషుడికి యజ్ఞరూపం కల్పించారు. **ఛాందోగ్యం**లో దాన్ని గురించి చెబుతూ, 'పురుషుడే యజ్ఞం' అతని ఆయుర్దాయంలో

మొదటి 24 సంవత్సరాలు – ప్రాతత్సవనం

తరువాత 44 సంవత్సరాలు – మద్యాహ్న సవనం

చివరి 48 సంవత్సరాలు – తృతీయ సవనం

సవనము అంటే యజ్ఞంలో ఇచ్చే బలి. ఈ విద్యను ఎవరైతే తెలుసుకుంటారో? వారు 116 సంవత్సరాలు జీవిస్తారు అతనికి ఆకలి దప్పిక ఉండవు, ఇష్టమైన వస్తువులను తీసుకోకపోవటమే దీక్ష అంటూ పురుష యజ్ఞాన్ని వివరించారు.

**తైత్తిరీయం**లో 'యజమానియే యజ్ఞం. భార్య శ్రద్ధ, శరీరం ఇధ్మం. రొమ్ము యజ్ఞవేదిక' అని చెప్పారు. కాబట్టి ఈ రెండు చోట్ల చెప్పిన గుణాలు ఉపసంహరించ వచ్చునా?

అంటే, రెండూ పురుష విద్యలే. పేరు ఒకటే. ఛాందోగ్యంలో పురుషుడే యజ్ఞంగా కల్పించబడ్డాడు. తైత్తిరీయంలో 'విద్వాంసుడనే యజ్ఞానికి' అంటున్నారు మరి ఈ

రెండు వేరు వేరనటం సమంజసం కాదు. వీటికి సమాన ధర్మాలు కూడా ఉన్నాయి. కాబట్టి, ఛాందోగ్యంలోని గుణాలు తైత్తిరీయంలోకి తెచ్చుకోవచ్చా?

***సూత్రం – 383 "చేతరేషామనామ్నానాత్"***

తాండి మొదలైన బ్రాహ్మణాలలో చెప్పిన పురుషయజ్ఞము తైత్తిరీయంలో చెప్పబడలేదు. కాబట్టి దానిలోని ధర్మాలను దీనిలో అన్వయించరాదు.

ఈ రెండింటిలోనూ 'మరణమే అవబృధము' లాంటి పోలికలు కొన్ని ఉన్నప్పటికీ, తేడాలే ఎక్కువ ఉన్నాయి. తాండిశాఖలో పురుషుడే యజ్ఞం. కాని తైత్తిరీయంలో పురుషుడు చేసే యజ్ఞంలో ఆత్మాదులందు యజమాని మొదలైనవి కల్పన చెయ్యబడ్డాయి. కాబట్టి ఈ రెండూ ఒకటి కాదు. వేరువేరు.

## 14. వేదాద్యధికరణము

### (వేదాలతోడి వాక్యాలు బ్రహ్మవిద్యాంగాలు కావు)

ఈ విషయం చెబుతున్నారు పద్నాల్గవ అధికరణ అయిన **వేదాద్యధికరణము**లో ఇందులో ఒక్క సూత్రమే ఉంది.

ఉపనిషత్తును ప్రారంభించేటప్పుడు అధర్వశాఖవారు "ఓ దేవతా! నా శత్రువు యొక్క సమస్త అవయవాలను ఛేదించు, హృదయాన్ని ఛేదించు" అంటూ శత్రు సంహార మంత్రాలు చదువుతారు. మిగిలిన ఏ శాఖలోనైనా భగవంతుణ్ణి స్తుతి చేస్తూ, "మనకు వరుణుడు, మిత్రుడు శుభాలిచ్చుగాక" వంటి మంత్రాలు చదువుతారు. మరి వీటన్నింటినీ విద్యలో ఉపసంహరించుకోవచ్చునా?

***సూత్రం – 384 "వేధాద్యర్థభేదాత్"***

పదిమంది కోసం ప్రాణత్యాగం చేస్తే పుణ్యం వస్తుంది. అది మంచిపని. తన స్వార్థం కోసం ఏ ఒక్కరిని హింసించినా అది దుర్మార్గం అవుతుంది. అభిచారిక ప్రయోగాలు స్వార్థపూరితాలు. అందుకే వాటిని నిషేధించారు.

హృదయాన్ని భేదించు మొదలైనవి అభిచారిక మంత్రాలు. వీటి అర్థంలో తేడా ఉన్నది. కాబట్టి విద్యలోను, ఉపాసనలోను వీటికి ఉపసంహారం లేదు.

# 15. హాన్యాధికరణము (జ్ఞానియొక్క పాపపుణ్యాలు)

జ్ఞానియొక్క పాపపుణ్యాలు ఏ రకంగా నశిస్తాయో వివరిస్తున్నారు పదిహేనవదైన **హాన్యాధికరణము**లో ఇందులో ఒక్క సూత్రమే ఉంది.

జ్ఞాని మరణించేటప్పుడు అతని పాపపుణ్యాలు ఏమవుతాయి?

**ఛాందోగ్యోపనిషత్తు**లో గుర్రము శరీరాన్ని విదిల్చి దుమ్మును పోగొట్టుకున్నట్టుగా జ్ఞాని పాపపుణ్యాలు వదలి పరమాత్మలో లీనమవుతాడు అని చెప్పబడింది.

**ముండకోపనిషత్తు**లో నదులన్నీ ప్రవహించి సముద్రంలో కలిసేటప్పుడు తమ నామరూపాలను వదలినట్లుగా జ్ఞాని పాపపుణ్యాలను వదలి పరమాత్మలో లీనమవుతాడు అన్నారు.

**కఠశాఖ**వారు చనిపోయిన వ్యక్తి యొక్క పుత్రులు, శిష్యులు ధనాన్ని పొందుతారు. స్నేహితులు పుణ్యకర్మలను, ద్వేషించేవారు పాపకర్మలు పొందుతారు అన్నారు.

**కౌశీతకీఉపనిషత్తు**లో అంత్యకాలంలో జ్ఞాని తన సుకృత దుష్కృతాలు వదలివేస్తాడు. అతని పుణ్యాన్ని బంధువులు, పాపాన్ని ద్వేషించే శత్రువులు పొందుతారు అని చెప్పారు.

అయితే ఇక్కడ చెప్పినట్లుగా విద్వాంసుడు వదలిపెట్టిన పాపపుణ్యాలను జ్ఞాతులు మొదలైనవారు గ్రహిస్తారా?

***సూత్రం – 385 "హానౌ తూపాయనశబ్దశేషత్వాత్ కుశాచ్ఛన్దస్తుత్యుపగానవత్త దుక్తమ్"***

జ్ఞానియైనవాడు ఉత్క్రమణ కాలంలో పాపపుణ్యాలను వదలిపెడతాడు. వాటిలో పాపాలను శత్రువులు, పుణ్యాలను మిత్రులు బంధువులు గ్రహిస్తారు అంటున్నారు పరమానందనాథులు.

# 16. సాంపరాయాధికరణము

## (ఉత్క్రాంతి సమయంలోనే జ్ఞాని పాపపుణ్యాలు వదులుతాడు)

ఈ విషయం పదహారవదయిన **సాంపరాయాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

"జ్ఞాని పాపపుణ్యాలు వదిలిపెడతాడు అని చెప్పారు కదా! అది ఎప్పుడు జరుగుతుంది? మరణించకముందా? మరణించిన తరువాతనా?

***సూత్రం - 386 "సాంపరాయే తర్తవ్యాభావాత్తథా హ్యన్యే"***

దేహాన్ని వదిలే సమయంలోనే జ్ఞానంవల్ల యోగి సుకృత దుష్కృతాలను వదలివేస్తాడు.

విద్వాంసుడు మరణ సమయంలో అంటే ప్రాణాలు శరీరం నుంచి బయటకు పోయేటప్పుడే, శరీరంతోపాటుగా పాపపుణ్యాలను కూడా వదిలేస్తాడు. అంతేకాని అతని మరణానంతరము అవి కొంతదూరము అతన్ని వెంబడించవు. **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా గుర్రం తన శరీరాన్ని విదిలించి మట్టిని వదలివేసినట్లుగాగా జ్ఞాని పాపపుణ్యాలను వదలివేస్తాడు. మరణానంతరము అతని ధనాన్ని అతని పుత్రులు, శిష్యులు పొందుతారు. పుణ్యకర్మల్ని స్నేహితులు, పాపకర్మల్ని విరోధులు పొందుతారు. అని చెప్పబడింది కాబట్టి యోగి మరణ సమయంలోనే పాపపుణ్యాలను వదలివేస్తాడు.

***సూత్రం - 387 "ఛన్దత ఉభయావిరోధాత్"***

జీవించి ఉండగానే యమ నియమాలతో కాలం వెళ్ళబుచ్చుతున్నాడు కాబట్టి, అతని కర్మక్షయం అయిపోవచ్చు.

అంటే నియమనిష్ఠలతో జీవితం సాగిస్తాడు కాబట్టి అతడు జీవించి ఉండగానే కర్మక్షయం కావచ్చు. బ్రహ్మప్రాప్తి మాత్రం దేహాన్ని వదలిన తరువాతనే జరుగుతుంది. జ్ఞాని ఉత్క్రమణ సమయంలోనే పాపపుణ్యాలను త్యజిస్తాడు.

# 17. గతేరర్థవత్త్వాధికరణము

## (సగుణోపాసకుడికి దేవయానము నిర్గుణోపాసకుడికి పరబ్రహ్మము)

ఉపాసకులు పోయే మార్గాన్ని వివరిస్తున్నారు. పదిహేడవదైన **గతేరర్థవత్త్వాధి కరణము**లో ఇందులో రెండు సూత్రాలున్నాయి.

పాపపుణ్యాలను వదలిపెట్టే సందర్భంలో కొన్నిచోట్ల దేవయానము చెప్పారు. కొన్నిచోట్ల ఏమీ చెప్పలేదు. పాపపుణ్యాలను వదలిపెట్టిన తరువాత జ్ఞానులందరూ దేవయానం ద్వారానే వెడతారా?

సగుణోపాసకుడు దేవయానం ద్వారా బ్రహ్మలోకం చేరి బ్రహ్మయొక్క మహదైశ్వర్యాన్ని తానూ అనుభవిస్తాడు. నిర్గుణోపాసకుడికి మార్గం లేదు. శరీరపాతం జరగగానే పరబ్రహ్మలో లీనమవుతాడు.

***సూత్రం - 388 "గతేరర్థవత్త్వముభయథా న్యథా హి విరోధః"***

ఉపాసనాపద్ధతి, నిర్గుణవిద్యాపద్ధతి. అని రెండు పద్ధతులున్నాయి. ఇవే సగుణ, నిర్గుణ మార్గాలు. వీటిలో ఉపాసనా పద్ధతిలో మాత్రమే దేవయానమున్నది. ఇది సగుణారాధన. నిర్గుణోపాసన సందర్భంలో దేవయానం లేదు. అజ్ఞానం వదలిపోగానే విద్వాంసుడు పాపపుణ్యాలను వదలి నిర్మలుడై పరబ్రహ్మను చేరతాడు. అని **ముండకోపనిషత్తు** చెబుతున్నది.

***సూత్రం - 389 "ఉపపన్నస్తల్లక్షణార్థోపలబ్ధేః లౌకికవత్"***

సగుణోపాసకుడికి సగుణబ్రహ్మప్రాప్తి. నిర్గుణ బ్రహ్మోపాసకుడికి నిర్గుణ బ్రహ్మప్రాప్తి కలుగుతుంది. అంటే సాయుజ్యం లభిస్తుంది. ఏదైనా ఊరికి పోవాలి అంటే ఏదో ఒక మార్గం కావాలి. అలాగే సగుణబ్రహ్మను పొందటానికి దేవయానం అవసరం. ఈ మార్గం ద్వారా వెళ్ళిన వారికి ఉత్తమలోకాలు ప్రాప్తిస్తాయి. సకల భోగాలు దక్కుతాయి.

నిర్గుణోపాసకుడు నిర్గుణస్వరూపం పొందటానికి మార్గంఅంటూఏదీ అవసరం లేదు. కాబట్టి నిర్గుణోపాసకుడికి ఏ మార్గము అవసరం లేదు. నిర్గుణవిద్యలో దేవయాన ప్రసక్తే లేదు. అతడు దేహపాతం జరిగిన వెంటనే ముక్తి పొందుతాడు.

## 18. అనియమాధికరణము (సగుణోపాసకులకు దేవయానము)

సగుణోపాసకులు దేవయానం ద్వారా పై లోకాలు చేరతారు అంటున్నారు పద్దెనిమిదవదైన **'అనియమాధికరణము'**లో ఇందులో ఒక సూత్రమే ఉంది.

సగుణోపాసనలో దేవయానము తప్ప, నిర్గునోపాసనలో దీని ప్రసక్తి లేదు అన్నారు. కాని సగుణోపాసనలో కూడా దేవయానము కొన్నిచోట్ల చెప్పబడ్డది. మరికొన్ని చోట్ల చెప్పబడలేదు. ఉదాహరణకు పంచాగ్నివిద్య, ఉపకోశల విద్యలలో దేవయానం చెప్పబడ్డది. మధువిద్య, శాండిల్యవిద్య, వైశ్వానర విద్యలలో ఇది చెప్పబడలేదు మరి ఈ విద్యలయందు కూడా దేవయానము అన్వయించవచ్చునా?"

***సూత్రం - 390 "అనియమః సర్వాసామవిరోధః శబ్దానుమానాభ్యామ్"***

సగుణోపాసనలన్నింటిలోనూ దేవయానాన్ని చెప్పటంలో తప్పులేదు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఈ విధంగా పంచాగ్నివిద్యను తెలుసుకున్నవారు, శ్రద్ధ, తపస్సు మొదలైన ధర్మాలతో ఉపాసన చేసినవారు అర్చిరాదిమార్గాన్ని పొందుతారు. అంటే సగుణబ్రహ్మోపాసన చేసినవారు అర్చిరాది మార్గంద్వారా బ్రహ్మలోకం చేరతారు.

ఉపాసనాపరులకోసం దేవయానము, కర్మాధికారులకు పిత్రుయానము చెప్పబడ్డాయి. ఒకవేళ ఎక్కడైనా చెప్పకపోయినప్పటికీ సగుణోపాసకులు దేవయానం ద్వారానే ప్రయాణిస్తారని గుర్తించాలి. ఈ రకంగా **సగుణోపాసకులందరికీ దేవయానమే.**

## 19. యావదధికారాధికరణము

### (ముక్తులైన వారు ధర్మరక్షణ కోసం మళ్ళీ జన్మించవచ్చు)

ఈ విషయం పందొనిమిదవదైన **'యావదధికారాధికరణము'**లో వివరిస్తున్నారు. ఇందులో ఒకే సూత్రం ఉంది.

జ్ఞాని ఈ దేహాన్ని వదలిన తరువాత అతడికి ఇంకొక శరీరముంటుందా? ముక్తి అనేది నియమమా? అనివార్యమా? లేక పాక్షికమా? బ్రహ్మవేత్తలు కూడా మళ్ళీ జన్మించినట్లుగా పురాణాలలో చెప్పబడ్డది.

వేదాచార్యుడైన అపాంతరతముడే మళ్ళీ కృష్ణద్వైపాయనుడుగా పుట్టాడు. సనత్కుమారుడే ఈశ్వరాజ్ఞతో కుమారస్వామిగా పుట్టాడు. అంతేకాదు నారదుడు వసిష్టుడు కూడా మళ్ళీ జన్మించారు. అని చెప్పబడుతోంది. కాబట్టి ఈ దేహం విడిచిన తరువాత జ్ఞానికి ముక్తి లభిస్తుందనే నియమం ఏదీ లేదనిపిస్తోంది గదా ?

***సూత్రం - 391 "యావదధికారమవస్థితిరాధికా రికాణామ్"***

అపాంతరతముడు మొదలైన వారు లోకం కోసం ఈశ్వరునిచే అధికారంలో నియమించబడ్డారు. వీరు ఆ అధికార సంపాదకమైన కర్మక్షయం అయ్యేదాకా అలానే ఉంటారు. వీరంతా ముక్తపురుషులే. **జీవన్ముక్తాః చరంతేతి త్రిషులోకేషు సర్వదా** లోకాలను ఉద్ధరించటం కోసం శరీరం ధరించి ముల్లోకాలలోను తిరుగుతూ, అర్హులైన వారితో మంచి పనులు చేయిస్తుంటారు.

ఈ మహానుభావులు మళ్ళీ శరీరాలు ధరించటానికి ఏ కర్మలు చేశారో, అవి క్షయం అయ్యేవరకు ఆ అధికారంలోనే ఉంటారు. శరీరధారణ చేస్తారు. వీరికి దేహ సంబంధమైన లింగశరీరం నుండి విముక్తి కలగటమే తడవుగా పరమాత్మలో లీనమవుతారు. **ఇది సగుణోపాసకులకు మాత్రమే వర్తిస్తుంది. అయితే ఆ శరీరంతో చేసిన కర్మను వారే అనుభవించాలి.**

## ౨౦. అక్షరధ్యధికరణము

### (అక్షరాలకు సంబంధించిన నిషేధ భావాలకు ఉపసంహారం)

ఈ విషయం ఇరవయ్యవదైన **అక్షరాధ్యధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

బ్రహ్మాన్ని గురించి చెప్పేటప్పుడు అవ్యయుడు లేనివాడు, అనే నిషేధ వాక్యాలతో చెప్పారు. ఉదా॥ ఆకారం లేనివాడు, గుణం లేనివాడు, ఇంద్రియాలచేత గ్రహించబడని వాడు. ఈ రకంగా కొన్నిచోట్ల చెప్పారు. కొన్నిచోట్ల చెప్పలేదు. ఈ రకంగా చెప్పనిచోట, చెప్పినచోటినుంచి అన్వయించవచ్చునా?

***సూత్రం – 392 "అక్షరధియాం త్వవరోధః సామాన్య తద్భావాభ్యా మౌపసదవత్తదుక్తమ్"***

సామాన్యమైనందువల్ల, వస్తుభేదం లేనందువల్ల బ్రహ్మకు సంబంధించిన నిషేదార్ధక భావాలు ఉపసంహరించాలి.

ఈ నిషేధవాక్యాల ద్వారా చెప్పదలచినది ఒక్కటే. అది బ్రహ్మమనేది ఒక్కటే. ఈ విధంగా బ్రహ్మకు సంబంధించిన నిషేధ వాక్యాలకు ఉపసంహారమున్నది.

## 21. ఇయదధికరణము

### ('ద్వాసుపర్ణా', 'ఋతంపిబన్తౌ'లలో చెప్పిన విద్య ఒక్కటే)

ఈ విషయాన్నే వివరిస్తున్నారు ఇరవై ఒకటవ అధికరణ అయిన **'ఇయదధికరణము'**లో ఇందులో ఒకే సూత్రం ఉంది.

**ముండకోపనిషత్తులో**

**ద్వాసుపర్ణా సయుజాసఖాయ సమానం వృక్షం పరిషస్వజాతే ।**
**తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్న న్ననోృ అభిచాకశీతి ॥**

ఈ మంత్రం **శ్వేతాశ్వతరోపనిషత్తు**లో కూడా ఉన్నది.

ఈ మంత్రంలో అందమైన రెక్కలు గలవి, ఒకే రూపము ఆకారము గల రెండు పక్షులు చెట్టుమీద కూర్చుని ఉన్నాయి వాటిలో ఒకటి కర్మఫలాన్ని అనుభవిస్తోంది. రెండవది చూస్తూ కూర్చుంది. అని చెప్పబడింది.

**కఠోపనిషత్తులో**

**ఋతం పి బన్తౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమేపదార్ధే ।**
**ఛాయాతపౌ బ్రహ్మవిదోవదంతి. పంచాగ్నయో యే చ త్రిణాచికేతాః ॥**

అనే మంత్రంలో శరీరంలోని బుద్ధి అనే గుహలో గొప్పదైన బ్రహ్మస్థానంలో ప్రవేశించి తమ కర్మఫలాన్ని అనుభవంచే టటువంటి ఎండ, నీడలాగ పరస్పరం విలక్షణమైన తత్త్వాలున్నాయని విద్వాంసు లంటారు. ఈ విషయాన్ని మూడుసార్లు అగ్నిచయనము, పంచాగ్ని ఉపాసన చేసినవారు కూడా చెబుతున్నారు.

ఈ రెండు చోట్ల చెప్పినవి భిన్నవిద్యలా? ఒకటేనా?

సంసారమనే వృక్షంమీద ఒకే రూపము, రంగు, ఆకారము గల రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి. అందులో ఒకటి దొరికిన కాయలు, పండ్లు తింటోంది. రెండవది ఏమీ తినకుండా చూస్తూ కూర్చుంది. ఇక్కడ కాయలు, పండ్లు తినేది జీవాత్మ. అవి తాను చేసిన కర్మఫలాలు. రెండవది పరమాత్మ. ఏమీ తినకుండా చూస్తూ కూర్చుంది. పరమాత్మ ఏ రకమైన కర్మ చేయదు. అందుకే అది తినటానికి (అనుభవించటానికి) ఏమీ లేదు. ఈ రెండూ అంటే జీవాత్మ, పరమాత్మ వేరు వేరా? లేక ఒకటేనా? ఈ రెండూ వేరు కాదు ఒకటే. మరి వేరుగా ఎందుకు కనిపిస్తున్నాయి? అంటే అజ్ఞానంవల్ల. అజ్ఞానం తొలగిపోగానే రెండూ ఒకటై పోతాయి. జీవాత్మ పరమాత్మలు ఒకటై పోతాయి. ఇదే విషయాన్ని ఈ అధికరణలో వివరిస్తున్నారు.

***సూత్రం - 393 "ఇయదామననాత్"***

ఈ రెండింటి యందలి విద్య ఒకటే. తెలుసుకోవలసిన రూపాన్ని రెండుచోట్ల ఒకటిగానే చెప్పారు. రెండు మంత్రాల్లోనూ జీవుణ్ణి చెప్పి, అతనికి పరమాత్మతో

అభేదం చెప్పారు. కాబట్టి విద్యలయందు ఐక్యము ఉన్నది. తెలుసుకోదగిన వాటిలో కూడా ఏకత్వమున్నది కాబట్టి రెండింటిలోనూ చెప్పదలచిన విద్య ఒకటే.

## 22. అంతరత్వాధికరణము

### (ఉషస్త, కహోళ బ్రాహ్మణాలలో చెప్పిన విద్య ఒకటే)

ఈ విషయాన్ని ఇరవై రెండవ అధికరణ అయిన **'అంతరత్వాధికరణము'**లో చెబుతున్నారు. ఇందులో రెండు సూత్రాలు ఉన్నాయి.

**బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుణ్ణి ఉషస్తి, కహోలుడు ఇద్దరూ కూడా సర్వాంతర్యామి అయినబ్రహ్మనుగూర్చి వివరించమని అడిగారు. అయితే యాజ్ఞవల్క్యుడు ఉషస్తికి 'కార్యకారణ రహితుడు ఆత్మ' అని చెప్పాడు. కహోలుడికి 'ఆకలి దప్పికలు లేనివాడు ఆత్మ' అని చెప్పాడు. ఇలా భిన్నంగా చెప్పబడిన ఇద్దరూ ఒకటేనా? లేక వేరువేరా?"

***సూత్రం - 394 "అన్తరాభూతగ్రామవత్స్వాత్మనః"***

రెండుచోట్లా సర్వాంతరత్వాన్ని చెప్పారు. కాబట్టి రెండూ ఒకటే విద్య. **శ్వేతాశ్వతరోపనిషత్తు**లో చెప్పినట్లుగా సమస్త భూతములందు సర్వాంతరుడైన ఆత్మ ఒక్కడే.

***సూత్రం - 395 "అన్యథా భేదానుపపత్తిరితి చేన్నోప దేశాన్తరవత్"***

విద్యాభేదం అంగీకరించకపోతే శ్రుతిభేదం ఉపసన్నం కాదు. అని చెప్పటం సమంజసం కాదు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో తత్త్వమసి అన్న దానిని తొమ్మిదిసార్లు చెప్పినప్పటికీ విద్యాభేదం కలగలేదు. అలాగే ఇక్కడ కూడా.

విద్యలో భేదం లేకపోతే ఒకే మాట లేదా విషయం రెండుసార్లు చెప్పబడవు. అని వారి వాదన. ఇది సరికాదు. 'తత్త్వమసి' అనే మాటను రెండుసార్లు కాదు తొమ్మిదిసార్లు చెప్పారు. అందువల్ల విద్యలో భేదం రాలేదు. పునరుక్తి దోషమూ కలగలేదు.

కాబట్టి ఉషస్తి, కహోళ బ్రాహ్మణాలలో చెప్పిన విద్య ఒకటే.

## 23. వ్యతిహారాధికరణము

### (ఐతరేయం ఉభయ రూపోపాసన చెబుతోంది)

జీవుడు, ఈశ్వరుడు ఒకరేనా? అనే విషయాన్ని ఇరవై మూడవది అయిన **'వ్యతిహారాధికరణము'**లో వివరిస్తున్నారు. ఇందులో ఒకే సూత్రం ఉంది.

దేహేంద్రియాలలో సాక్షిగా ఉన్న పురుషుడే ఆదిత్యమండలంలోని పరమాత్మ. అలాగే ఆదిత్యమండలంలోని పరమాత్మయే మన దేహంలో ఉన్నవాడు అని **ఐతరేయోపనిషత్తు** చెబుతోంది. **జాబాలశ్రుతిలో** ఓ దేవతా! నీవే నేను. నేనే నీవు. అని చెప్పబడింది. ఈ రకంగా జీవుడు, ఈశ్వరుడు ఒకరేనా? లేక వేరు వేరా?

***సూత్రం - 396 "వ్యతిహారో విశింషన్తి హీతరవత్"***

సర్వాత్మత్వాది గుణాలలాగా పరస్పర వినిమయం ఉపాసన కోసం ఉభయరూప చింతనంగా చెప్పబడ్డది.

ఇతర విషయాలలాగానే ఇక్కడ కూడా జీవుడేబ్రహ్మ. బ్రహ్మేజీవుడు. ఉపాసకుడే సూర్యమండలంలోని పురుషుడు. ఆ పురుషుడే ఉపాసకుడు. ఈ రకంగా రెండు రూపాల్ని ఉపాసించాలి.

## 24. సత్యాద్యధికరణము

### (బృహదారణ్యకంలోని సత్యవిద్యలు రెండూ ఒకటే)

ఈ రెండు విద్యలలోను ఉపాస్యుడు హిరణ్యగర్భుడే అంటున్నారు ఇరవై నాల్గవ అధికరణ **సత్యాద్యధికరణము**లో. ఇందులో ఒకటే సూత్రముంది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో అహర్నానమమైన బ్రహ్మాన్ని ఈ విధంగా వ్యాహృతుల రూపంలో తెలుసుకుని ఉపాసన చేసేవాడు పాపాలను వదలివేస్తాడు ఆ సత్యమే ఆదిత్యుడు. ఆదిత్యమండలంలోని పురుషుడే దక్షిణ నేత్రంలో ఉన్న పురుషుడు. అని చెప్పబడ్డది. మరి ఈ రెండు సత్యవిద్యలూ ఒకటేనా? వేరువేరా?

***సూత్రం - 397 "సైవ హి సత్యాదయః"***

బృహదారణ్యకంలో చెప్పిన సత్యవిద్యలు రెండూ ఒక్కటే, ఈ రెండింటిలోనూ ఉపాస్యుడు హిరణ్యగర్భుడే.

# 25. కామ్యాద్యధికరణము

## (ఛాందోగ్యం, బృహదారణ్యకాలలో చెప్పిన సత్యకామాత్వాదులకు గుణోపసంహారమున్నది)

ఈ విషయం ఇరవైఐదవదయిన **కామ్యాద్యధికరణము**లో చెబుతున్నారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

ఈ శరీరాన్నే బ్రహ్మపురం అంటారు. రాజ్యానికి అధికారులు, సేవకులు ఉన్నట్లే శరీరానికి ఇంద్రియాలు మనస్సు ఉన్నాయి. హృదయస్థానంలో ఒక పద్మమున్నది. దాన్నే హృత్పద్మము అంటారు. దాని మధ్య భాగంలో సూక్ష్మమైన ఆకాశం ఉన్నది. అదే దహరాకాశము. అందులో బ్రహ్మ ఉంటాడు. అతడు దర్మాధర్మరహితుడు, పాపరహితుడు జరామృత్యువులు లేనివాడు శోకరహితుడు కోరికలను వెంటనే పొందే శక్తి కలవాడు అని **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పబడింది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో "ఆత్మ గొప్పది. పుట్టుక లేనిది అది ప్రాణము నందుంటుంది. ఇంద్రియాల్లో ఉంటుంది. విజ్ఞాన రూపమైనది. స్వయంజ్యోతి. దహరాకాశంలోనే ఈ పురుషుడు శయనిస్తాడు. అందరిని వశం చేసుకోగలుగుతాడు" అని చెప్పబడింది.

**ఛాందోగ్యం**లోని విద్య సగుణము అని, బృహదారణ్యకంలోని విద్య నిర్గుణము అని అంటారు. కాబట్టి ఈ రెండింటికీ భేదం ఉన్నదా? లేదా? అని అనుమానం.

***సూత్రం - 398 "కామాదీతరత్ర తత్ర చా యతనాదిభ్యః"***

సత్యకామత్వం మొదలైన గుణాలు బృహదారణ్యకంలోకి, బృహదారణ్యకంలోని సర్వవశిత్వాది గుణాలు ఛాందోగ్యంలోకి ఉపసంహరించుకోవచ్చు. రెండింటి యందు హృదయమే ఆయతనము. బ్రహ్మమే ఉపాస్యము. కాబట్టి ఇక్కడ సగుణ నిర్గుణ భేదం ఉన్నప్పటికీ, విద్యాస్తుతి కోసం ఉపసంహారం చెయ్యవచ్చు.

# 26. అదరాధికరణము (ప్రాణాగ్నిహోత్రము)

ప్రాణిగ్నిహోత్రం గురించి ఇరవై ఆరవ అధికరణ అయిన **అదరాధికరణము**లోని రెండు సూత్రాలలో చెబుతున్నారు.

వైశ్వానరోపాసకుడు భోజన సమయంలో ముందుగా వడ్డించిన అన్నాన్ని హవనం చెయ్యాలి అంటే ప్రాణాహుతులివ్వాలి. మొదటి ఆహుతి ప్రాణాయ స్వాహా అంటే ప్రాణం తృప్తి పడుతుంది. దీనివల్ల నేత్రము, ఆదిత్యుడు, ద్యులోకము, దేవతలు తృప్తి పొందుతారు. అందువల్ల భోక్త సంతానము, పశువులు, తేజస్సు, బ్రహ్మవర్చస్సు పొందుతాడు.

రెండవ ప్రాణాహుతి 'వ్యానాయస్వాహా' దీనివల్ల వ్యానవాయువు తృప్తి చెందుతుంది. అందువల్ల శ్రోత్రము, చంద్రుడు, దిక్కులు, దిక్కులకు అధిష్ఠాన దేవతలు తృప్తి పొందుతారు. అంటూ ప్రాణాహుతుల వల్ల ఫలితం చెప్పబడింది. ఒకవేళ ఎప్పుడైనా భోజనం చెయ్యకపోతే అంటే భోజనలోపం కలిగినప్పుడు ప్రాణాగ్ని హోత్రానికి లోపం కలుగుతుందా?"

***సూత్రం - 399 "ఆదరాదలోపః"***

భోజనలోపం కలిగినప్పటికీ అగ్నిహోత్ర లోపం ఉండదు. అతిథులకన్న ముందు భోజనం చెయ్యాలి అని జాబాల స్మృతి చెబుతున్నది. కాబట్టి ఒకవేళ భోజన లోపం కలిగినా ప్రాణాగ్ని హోత్రానికి లోపం కలగదు.

***సూత్రం - 400 "ఉపస్థితేఽ తస్తద్వచనాత్"***

భోజనద్రవ్యం దగ్గరగా ఉన్నప్పుడు, ముందుగా లభించినట్టి పదార్థంతోనే ప్రాణాగ్నిహోత్రం చెయ్యాలి. భోజనం లేకపోతే ప్రాణాహుతులుండవు. అంటే భోజనం దొరకనప్పుడు ప్రాణాగ్నిహోత్రానికి లోపమే.

## 27. తన్నిర్ధారణాధికరణము

### (కర్మలనాశ్రయించిన విద్యలు కర్మాంగాలు కావు.)

ఈ విషయం ఇరవై ఏడవ అధికరణ **'తన్నిర్ధారణాధికరణము'**లో వివరిస్తున్నారు. ఇందులో ఒకటే సూత్రం ఉంది.

ఓంకారాన్ని ఉద్గీథ దృష్టితో ఉపాసించాలి. ఈ విధంగా ఉద్గీథాన్ని ఆశ్రయించిన ఉపాసనలున్నాయి. అంటే అనేకమైన ఉపాసనలు కర్మలకు అంగాలుగా చెప్పబడ్డాయి. కాబట్టి ఈ ఉపాసనలు కర్మలతో నిత్యముగా సంబంధించినవా? లేదా?

*సూత్రం - 401 "తన్నిర్ధారణానియమస్తద్దృష్టేఃపృథగ్ఘ్యప్రతిబన్ధః ఫలమ్"*

కర్మల ఫలసిద్ధికి, కర్మ సంబంధం అనే ఫలం ఉపాసనలకు ప్రత్యేకంగా చెప్పబడింది. కాబట్టి కర్మాంగాలను ఆశ్రయించిన ఉపాసనలకు కర్మాంగత్వ నియమం లేదు.

కొన్ని ఉపాసనలు కర్మాంగాలను ఆశ్రయించి ఉన్నాయి. ఈ ఉపాసనలు కర్మాంగాలు కావు. ఉపాసనలకు, కర్మలకు నిత్యసంబంధం లేదు అని వేదం చెబుతోంది. కర్మలకు, ఉపాసనలకు ఫలము వేరుగా చెప్పబడింది. కర్మఫలం వేరు. ఉపాసనఫలం వేరు. కాబట్టి కర్మఫలం అనుభవించటానికి ఉపాసనలు ప్రతిబంధకాలు.

## 28. ప్రదానాధికరణము (వాయుప్రాణోపాసనలు వేరువేరు)

అధ్యాత్మ సంబంధమైంది ప్రాణము. ఆధిదైవత సంబంధమైనది వాయువు. ఈ రెండూ ఒకటేనా? అనే విషయాన్ని ఇరవై ఎనిమిదవ అధికరణ **ప్రదానాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో ఒకే సూత్రమున్నది.

**బృహదారణ్యకము, ఛాందోగ్యాలలో** సంవర్గ విద్య చెప్పబడింది. సంవర్గము అంటే దేవతలను తనలో లీనం చేసుకోవటం.

**బృహదారణ్యకం**లో ఆధ్యాత్మలలో శరీరమందలి ఇంద్రియాలలో ప్రాణమే జ్యేష్ఠము శ్రేష్ఠము అని చెప్పబడింది. **ఛాందోగ్యం**లో ఆధిదైవతాల్లో వాయువే మిగిలిన దేవతలను తనలో లీనం చేసుకుంటుంది అని చెప్పబడింది.

ఆధ్యాత్మ సంబంధమైనది ప్రాణము. అధిదైవత సంబంధమైనది వాయువు. ఈ రెండూ ఒకటేనా? లేక వేరువేరా?

*సూత్రం - 402 "ప్రదానవదేవ తదుక్తమ్"*

ఇక్కడ వాయువు, ప్రాణాల్ని విడివిడిగా భావించాలి. వాయువు వేరు. ప్రాణము వేరని శ్రుతులు చెబుతున్నాయి. ఇంద్రుడు ఒకడే. అయినప్పటికీ రాజ, అధిరాజ, స్వరాజ గుణభేదాల చేత వేరవుతున్నాడు. అలాగే వాయుతత్త్వంలో భేదం లేకపోయినా ఆధ్యాత్మ, ఆధిదైవత స్థానాలను బట్టి వాయువు, ప్రాణము అనేవాటి ఉపాసనలు వేరువేరుగా ఉన్నాయి.

# 29. లింగభూయస్త్వాధికరణము

## (శతపథ బ్రాహ్మణంలోని అగ్నులు ఉపాసకాత్మకాలు)

ఈ విషయాన్ని ఇరవై తొమ్మిదవదైన **లింగభూయస్త్వాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో తొమ్మిది సూత్రాలు ఉన్నాయి.

"మనస్సుచేత చింతించబడిన దానిని మనశ్చితము అంటారు. **శతపథ బ్రాహ్మణం**లో మనస్సుచేత చింతించబడినట్టి, వాక్కుచేత సంపాదించబడినట్టి, ప్రాణము, చక్షువులు, శ్రోత్రము, మొదలైన వాటిచేత సంపాదించబడిన వాటివాటి వృత్తి రూపమైన ముప్ఫైఆరువేల అగ్నుల్ని చూచింది అని చెప్పబడింది.

మామూలుగా మానవుడి ఆయుర్దాయం వంద సంవత్సరాలు. సంవత్సరానికి రోజులు 360. కాబట్టి మొత్తం 100 × 360 = 36,000 రోజులు. ఒక రోజులో పుట్టే ఆలోచనలన్నీ ఒక మనోవృత్తి అనుకుంటే, జీవితంలో మొత్తం 36,000 మనోవృత్తులు ఉంటాయి. వీటిని అగ్నిగా, సూర్యునిగా, ఆత్మస్వరూపాలుగా భావించి ధ్యానించవచ్చు. ఇవి మనశ్చితాలు.

ఈ విధంగా మనస్సు మొదలైన వాటిచేత చింతించబడినవిగా చెప్పబడినటువంటి అగ్నులు కర్మలకు సంబంధించినవా? లేక ఉపాసన కోసం చెప్పబడినాయా?

***సూత్రం - 403 "లిఙ్గభూయస్త్వాత్తద్ధి బలీయస్తదపి"***

ఈ అగ్నులు అన్నీ కూడా స్వతంత్రములు.

ఈ భూతములు, ప్రాణులు మనస్సులో ఏమి సంకల్పించినా అవన్నీ ఈ అగ్నులు చేసే పనులే. ఉపాసకుడు నిద్ర పోతున్నా మేల్కొని ఉన్నా, అతని కోసం ఈ సమస్త భూతాలు ఎల్లవేళలా, ఈ అగుల్ని సంపాదిస్తూనే ఉంటాయి. కాబట్టి ఈ అగ్నులన్నీ కూడా స్వతంత్రములు.

***సూత్రం - 404 "పూర్వవికల్పః ప్రకరణాత్ స్యాత్ క్రియామానసవత్"***

ఈ అగ్ని, క్రియలకు అంగభూతమైనదే. ఆ అగ్నికి వికల్పోపదేశం తప్ప స్వతంత్రం కాదు. మానస పాత్రలాగా ఇదికూడా కర్మకు అంగమే. అని వారి వాదన.

***సూత్రం – 405 "అతిదేశాచ్చ"***

ఒక ధర్మాన్ని ఇంకొక దానియందు ఆరోపించటానికి అతిదేశము అంటారు. ఈ అతిదేశం వల్లకూడా ఈ అగ్నులు క్రియాంగాలే. అని వారంటారు.

***సూత్రం – 406 "విద్యైవ తు నిర్ధారణాత్"***

ఈ మనశ్చితాది అగ్నులు స్వతంత్రమైన విద్యాత్మకాలే. ఇవి కర్మాంగాలు కావు. **శతపథ బ్రాహ్మణంలో** 'అవి విద్యాభావంతోనే సంపాదించబడతాయి. ఈ విషయం తెలుసుకున్న ఉపాసకుడు వీటిని ఉపాసనతోనే సంపాదించగలుగుతున్నాడు' అని చెప్పబడింది.

***సూత్రం – 407 "దర్శనాచ్చ"***

వెనుక చెప్పిన లింగములవల్ల కూడా ఇవి స్వతంత్రములు అని తెలుస్తోంది.

***సూత్రం – 408 "శ్రుత్యాదిబలీయస్త్వాచ్చ న బాధః"***

శ్రుతి, లింగవాక్యాలూ ప్రకరణకన్న బలమైనవి. కాబట్టి ఈ అగ్నులు స్వతంత్రములు అనటానికి సంశయము లేదు.

'ఈ విషయం తెలుసుకున్న ఉపాసకుడు నిద్రిస్తున్నా, మేల్కొన్నా, అతని కోసం ఈ భూతాలన్నీ అగ్నిరచన చేస్తూనే ఉంటాయి.

ఇలాంటి శ్రుతివాక్యాల వల్ల ఈ అగ్నులు కర్మాంగాలు కావు.

***సూత్రం – 409 "అనుబన్ధాదిభ్యః ప్రజ్ఞాన్తర పృథక్త్వవత్ దృష్టశ్చ తదుక్తమ్"***

అనుబంధం మొదలైన వాని వల్ల కూడా మనశ్చితాదులకు కర్మాంగత్వం లేదు. ఇవి స్వతంత్రాలు. 'అవేష్టి' అనే క్రతువుని రాజసూయం నుండి పైకి తీసినట్లుగా, మనశ్చితాదుల్ని కర్మప్రకరణం నుంచి విడదియ్యాలి అవి కర్మాంగాలు కావు.

***సూత్రం – 410 "న సామాన్యాదప్యులబ్ధేర్మృత్యువన్న హి లోకాపత్తిః"***

మృత్యుశబ్దంలాగానే మనశ్చితాది అగ్నులకు మానసత్వసాదృశం ఉన్నప్పటికీ, అవి క్రియాంగాలు కావని శ్రుతులవల్ల తెలుస్తోంది.

***సూత్రం – 411 "పరేణ చ శబ్దస్య తాద్విధ్యం భూయస్త్వాత్త్వనుబన్ధః"***

ఉత్తర బ్రాహ్మణాన్ని, పూర్వ బ్రాహ్మణాన్ని బట్టి మనశ్చితాదులను చెప్పే ఈ బ్రాహ్మణం కూడా అటువంటిదే. కేవలం విద్యావిధిత్వం కలిగినటువంటిది.

మానసికాగ్ని విద్యలో సంపాదింపదగిన కర్మాంగాలు అనేకం ఉన్నాయి. కాబట్టి ఈ మానసికాగ్ని స్వతంత్రమైన పురుషార్థ హేతువు అవి కర్మాంగాలు కావు. ఆ అగ్నులు ఉపాసనాత్మకాలు అని చెబుతున్నారు.

## ౩౦. శరీరవ్యతిరేకాధికరణము (ఆత్మ దేహంకన్న వేరైనది)

దేహము, ఆత్మ రెండూ వేరని చెబుతున్నారు ముప్పైయవ అధికరణ అయిన **శరీర వ్యతిరేకాధికరణము**లో ఇందులో రెండు సూత్రాలే ఉన్నాయి.

చార్వాకుల దృష్టిలో పంచభూతాలు లేవు. అవి నాలుగే. ఆకాశం అంటేనే శూన్యం. దానికి ప్రత్యేకసత్తా లేదు. నేల, నీరు, నిప్పు, గాలి వీటివల్లనే ఈ జగత్తు సృష్టించబడింది. అయితే చిత్రవిచిత్రమైన జగద్వస్తుజాలము ఎలా పుట్టింది? అనే దానికి వీరిదగ్గర సరైన సమాధానం లేదు. అది స్వాభావికంగా జరుగుతుందని చెబుతారు. నెమళ్ళకు ఇంతఅందమైన రంగులు ఎవరిచ్చారు? కోకిలకు అంత మంచిగొంతు ఎవరిచ్చారు? అంటే అదంతా స్వాభావికం అంటారు.

నాలుగుభూతాల వల్లనే శరీరం ఉత్పన్నమవుతుంది. శరీరం తప్ప ఆత్మ అనేది వేరుగా లేదు. చైతన్యమనేది ఆత్మయొక్క ధర్మం. శరీరాన్ని విడిచి ఆత్మ వేరుగా ఉండదు. కాబట్టి శరీరమే ఆత్మ. అయితే ఆత్మవిషయంలో చార్వాకులలో నాలుగు భేదాలున్నాయి.

**1. దేహాత్మవాదులు :** దేహమే ఆత్మ అని భావించేవారు.

**2. ఇంద్రియాత్మవాదులు :** ఇంద్రియాలతో కలిగే అనుభవాన్ని తీసుకుని, ఇంద్రియాలే ఆత్మ అని భావించేవారు.

**3. ప్రాణాత్మవాదులు :** ప్రాణం లేకపోతే శరీరంలో చలనముండదు. కాబట్టి ప్రాణమే ఆత్మ అని భావించేవారు.

**4. మనసాత్మవాదులు :** మనస్సు యొక్క సంకల్ప వికల్పాలలో జీవిస్తూ, మనస్సే ఆత్మ అని భావించేవారు.

వీరు పూర్తిగా భౌతికవాదులు. వీరికి అలౌకిక విషయాలపట్ల ఏ మాత్రం ఆసక్తి లేదు. ఈ దృక్పథంతోనే వారు మానవ జీవితం యొక్క కర్తవ్య అకర్తవ్యాలను బోధిస్తారు. భారతీయదర్శనాలన్నీ చతుర్విధపురుషార్థాలను చెబుతుండగా, చార్వాకులు

మాత్రం ధర్మ, మోక్షాలను తిరస్కరిస్తారు. అనేక లౌకిక దృష్టాంతాలను చూపించి వైదిక పద్ధతులు కల్పితాలని నిరూపించటానికి ప్రయత్నిస్తారు. ధర్మం లేదు. అధర్మం లేదు. పాపం లేదు పుణ్యం లేదు. కాబట్టి వాటివల్ల ఫలితం కూడా లేదు. మన కంటికి కనిపించేదే లోకం. కాబట్టి బ్రతికినన్నాళ్ళు తిను, తాగు, ఆనందించు. కనిపిస్తున్న వాటిని వదిలి, కనిపించని వాటి కోసం ప్రాకులాడటం మూర్ఖత్వం అంటారు. చార్వాకులు మోక్షాన్ని నమ్మరు. వారి అభిప్రాయంలో ఈ శరీరం జీవించి ఉన్నంత కాలం మనిషి సుఖాలతోపాటు దుఃఖాలు కూడా అనుభవించాల్సిందే. మరణంతో అవన్నీ సమసిపోతాయి. జీవికి అత్యంత నివృత్తి కలుగుతుంది. కాబట్టి మరణమే మోక్షము. చార్వాకులదృష్టిలో లౌకికసుఖమే పరమార్థం. దాని కోసం అర్థకామాలు ఉపకరిస్తాయి. కాబట్టి మానవుడు ధర్మాధర్మాలు, పాపపుణ్యాలను గురించి ఆలోచించకుండా వీలైనంతగా ధనార్జన చెయ్యాలి. సుఖాలు అనుభవించాలి.

**యావజ్జీవేత్ సుఖం జీవేత్ ఋణం కృత్వా ఘృతం పిబేత్**
**భస్మీ భూతస్య దేహస్య పునరాగమనం నకుతః ॥**

తగినంతగా సంపాదించలేనప్పుడు అప్పుచేసైనా సరే సుఖాలను అనుభవించాలి. అనేదే వీరి ముఖ్య సిద్ధాంతము.

దేహంకన్న వేరైనటువంటిది ఆత్మ అనేది ఒకటి ఉండాలి. ఆత్మగనక లేకపోతే బ్రహ్మలోక ప్రాప్తి ఎవరికి జరుగుతుంది? అయితే ఆత్మదేహంకన్న బిన్నమైనదా? కాదా? ఆత్మపురుషుడు ఎవరు?

***సూత్రం - 412 "ఏక ఆత్మనః శరీరే భావాత్"***

శరీరమనేది ఉనప్పుడే ఆత్మయొక్క ధర్మాలకు అస్తిత్వం ఉన్నది. కాబట్టి దేహంకన్న వేరైనటువంటి ఆత్మ అనేది ఏదీ లేదు అంటారు చార్వాకులు. ప్రాణము, చైతన్యము మొదలైన ధర్మాలు శరీరం ఉన్నప్పుడే కనిపిస్తాయి. శరీరం లేకపోతే ఉండవు. కాబట్టి శరీరంకన్న వేరైన ఆత్మలేదని వారి వాదన.

***సూత్రం - 413 "వ్యతిరేకస్తద్భావభావిత్వాన్న తూపలబ్ధివత్"***

ఆత్మ అనేది దేహం కన్న వేరైనది. మృతునికి శరీరమున్నప్పటికీ చైతన్యము ఇత్యాదులుండవు. కాబట్టి శరీరానికి చైతన్యాది ధర్మాలుంటాయనటం సరికాదు.

సమాధి స్థితిలో శరీరముంటుంది. మూర్ఛ వచ్చినప్పుడు శరీరముంటుంది. మరణం తరువాత శరీరముంటుంది. కాని దానిలో చైతన్యం కనుపించదు. కాబట్టి శరీరమే ఆత్మకాదు. ఆత్మ అనేది శరీరం కన్న వేరైనది.

## 31. అంగావబద్ధాధికరణము

### (ఉద్గీదాదులు అన్ని శాఖలకు సంబంధించినవి.)

ఉద్గీధాన్ని, ఉపాసనా విధులు ఆ శాఖలోనే కాదు అన్ని శాఖలకు సంబంధించినవి అంటున్నారు ముప్ఫై ఒకటవ అధికరణ అయిన **అంగావబద్ధాధికరణము**లో ఇందులో రెండు సూత్రాలున్నాయి.

ఓంకారాన్ని ఉద్గీధంగా ఉపాసించాలి. అని **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పారు. ఇలా ప్రతి వేదంలోను, ప్రతిశాఖలోను చెప్పబడ్డాయి. కాబట్టి ప్రతి శాఖలోని ఉద్గీధాన్ని, ఉపాసనా విధుల్ని ఆ శాఖలో మాత్రమే గ్రహించాలా? లేక అన్ని శాఖలకు సంబంధించినవిగా భావించాలా? అనేది ప్రశ్న.

***సూత్రం - 414 "అఙ్గావబద్ధాస్తు న శాఖాసు ప్రతివేదమ్"***

కర్మాంగాశ్రయాలైన ఈ ఉపాసన విద్యలు ఈ శాఖయందే అని లేదు. అవి ప్రతి వేదంలోను, ప్రతి శాఖలోను చెప్పబడ్డాయి.

***సూత్రం - 415 "మన్త్రాదివద్వావిరోధః"***

ఒక శాఖ యందు చెప్పిన ఉద్గీధాదులను ఇతర శాఖలందు చెప్పినప్పటికీ ఇబ్బంది లేదు. కాబట్టి ఉద్గీధాదులు అన్ని శాఖలకు సంబంధించినవే.

## 32. భూమజ్యాయస్త్వాధికరణము

### (వైశ్వానరోపాసన సమగ్రమైనదే)

ముప్ఫై రెండవ అధికరణలో వైశ్వానరాత్మను గురించి చెబుతున్నారు. దీనిపేరు **భూమజ్యాయస్త్వాధికరణము** ఇందులో ఒక సూత్రమే ఉంది.

ప్రాచీనశీలుడు మొదలైనవారు వైశ్వానరాత్మను గురించి తెలుసుకునేందుకు అశ్వపతి మహారాజు వద్దకు వెడతారు. రాజు ప్రాచీనశీలుణ్ణి "నువ్వు వైశ్వానరాత్మను

ఏ విధంగా ఉపాసన చేస్తున్నావు? అని అడుగుతాడు. దానికి ప్రాచీనశీలుడు "రాజా! నేను ద్యులోకాన్ని (స్వర్గం) వైశ్వానరాత్మగా భావిస్తున్నాను" అంటాడు దానికి అశ్వపతి మహారాజు "నువు ఉపాసించేది "సుతేజ" అనే పేరుతో ప్రసిద్ధి చెందిన వైశ్వానరాత్మ ఈ ఉపాసన వల్లనే నీ కులంవారు తరతరాలుగా కర్మనిష్ఠా పరతంత్రులౌతారు. సుతేజమనే ఈ ఆత్మ వైశ్వానరాత్మలో నాల్గవ భాగం మాత్రమే. అది వైశ్వానరాత్మకు శిరోభాగం వంటిది. విశ్వరూపుడు అతనికి నేత్రం. వాయువే అతని ప్రాణం. ఆకాశం శరీరం, జలం పొత్తికడుపు. పృథివి పాదాలు" అంటూ వారు చేసే ఉపాసన గురించి చెప్పాడు. ఈ వ్యష్టి, సమిష్టి ఉపాసనలు రెండూ విధేయాలా? లేక సమస్తోపాసనమా? ఇది అనుమానం. దీనికి సమాధానం చెబుతున్నారు.

***సూత్రం - 416 "భూమ్నః క్రతువజ్జ్యాయస్త్వం తథాహి దర్శయతి"***

**ఛాందోగ్యోపనిషత్తు**లో నువు నా వద్దకు వచ్చి ఉండకపోతే నీ తల తెగిపోయి ఉండేది. పాదాలు శిథిలమై పోయేవి. అని చెప్పబడింది. వారు అతని వద్దకు వెళ్ళకుండా అంశోపాసన చేసినట్లైతే వారి శరీర భాగాలు శిథిలమై పోయి ఉండేవి. ఇలా చెప్పటం వైశ్వానరాత్మ అంటే సమస్తాన్ని ఉపాసించటమే సమగ్రమైన సమస్తోపాసన.

## 33. శబ్దాదిభేదాధికరణము

## (వేద్యం ఒకటే అయినా, గుణభేదంవల్ల ఉపాసనాభేదం కలుగుతున్నది)

ఈ విషయాన్ని ముప్ఫై మూడవ అధికరణ అయిన **శబ్దాదిభేదాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో ఒకటే సూత్రం ఉంది.

**ఛాందోగ్యోపనిషత్తు**లోని శాండిల్యవిద్య, దహరవిద్య, మధువిద్య ఇవన్నీ ఒకటే. వాని యందు వేద్యుడైన ఈశ్వరుడికి నానాత్వం లేదుకదా?

## శాండిల్యవిద్య

"శాండిల్యుడు" అనే మహర్షి బ్రహ్మవిద్యను తన శిష్యులకు వివరించాడు. శాండిల్యుడు చెప్పాడు కాబట్టి దీన్ని శాండిల్యవిద్య అన్నారు.

నామరూపాత్మకమైన జగత్తు అంతా పరబ్రహ్మ స్వరూపమే. ప్రపంచమంతా పరబ్రహ్మనుంచే ఉత్పన్నమై చివరకు పరబ్రహ్మలోనే లీనమవుతుంది. సృష్టి స్థితి

లయాలు అన్నీ కూడా బ్రహ్మమయమే కాబట్టి ఉపాసకుడు రాగద్వేషాలను విడిచి పెట్టి జితేంద్రియుడు కావాలి. పరబ్రహ్మను నిశ్చయాత్మక బుద్ధితో ఉపాసించాలి. పరబ్రహ్మ మనోమయుడుగా కనిపిస్తాడు. అదే విధంగా స్థూల సూక్ష్మ శరీరాలు కలవాడు, చైతన్య స్వరూపుడు, సత్యసంకల్పుడు అతడు ఆకాశాత్మ. అంటే ఆకాశానికి ఉండే సర్వవ్యాపకత్వము, సూక్ష్మత్వము, రూపం లేకపోవటము, అనేవి ఆకాశ లక్షణాలు. ఈ లక్షణాలు కలవాడవటంచేత ఆకాశాత్మ అనబడుతున్నాడు. సమస్త కర్మలు స్వరూపంగా కలవాడు, సర్వకాముడు–సమస్తమైన సత్కామములు కలవాడు. సుఖప్రదమైన సమస్త గంధములు, సమస్త రసములు కలవాడు. అన్నివైపుల నుండి జగత్తును వ్యాపించి ఉండేవాడు. కోరికలు లేనివాడు.

ఆత్మ అనేది సూక్ష్మాతిసూక్ష్మమైనది. అలాగే మహత్తరమైనది. ఈ హృదయ పద్మంలో గల ఆత్మ వడ్లగింజకన్న, బార్లీగింజకన్న, ఆవగింజకన్న కూడా చాలా సూక్ష్మమైనది. అలాగే ఆ ఆత్మ ఈ భూమికన్న, స్వర్గలోకం కన్న, సమస్తలోకాల కన్నాకూడా పెద్దది. హృదయ కమలంలో నివశించే ఆత్మ, పరబ్రహ్మ రెండూ ఒకటే.

హృదయ పద్మంలో ఉండే ఆత్మయే సమస్త కర్మలను నిర్వర్తిస్తుంది. సమస్తమైన మంచి కోరికలు కలిగి ఉంటుంది. సమస్త సుగంధాలు, రసాలు కలిగి ఈ ప్రపంచాన్ని అన్ని వైపులనుండి వ్యాపించి ఉంటుంది. ఆత్మను గురించి మాటలతో చెప్పలేము. దానికి ఏ విధమైన కోరికలు ఉండవు. ప్రాణుల కోరికలన్నీ అదే తీరుస్తుంది. ఈ విధంగా హృదయ పద్మంలోని ఆత్మయే పరబ్రహ్మ స్వరూపము. ఈ రెంటికీ భేదంలేదు. ఈ శరీరం నుంచి వేరైనప్పుడు అంటే సాధకుని శరీరం మరణించినప్పుడు, అందులోని జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. దీనినే శాండిల్యవిద్య అంటారు.

అంగీరస గోత్రంలో పుట్టిన ఘోరమహర్షి దేవకీపుత్రుడైన శ్రీకృష్ణునికి ఆత్మయజ్ఞోపాసన గురించి వివరించాడు. ఈ విద్యను అభ్యసించినవాడికి ఇతర విద్యలయందు కోరికలుండవు.

మానవుడు లౌకికమైన కోరికలు తీర్చుకోటానికి యజ్ఞకర్మలు చేస్తాడు. అలాగే పారలౌకికమైన అసంతృప్తితో, తీవ్రమైన కాంక్షతో ఆత్మయజ్ఞం చేస్తాడు. ఆత్మ యజ్ఞాన్ని చేసినవాడు మరణానంతరము బ్రహ్మలోకాలు పొందుతాడు.

సంకల్ప వికల్పాలకు కారణమైనది మనస్సు. కాబట్టి మనస్సే బ్రహ్మగా ఉపాసించాలి. ఇది ఆత్మ విషయక దర్శనం. తరువాత దేవతా సంబంధమైన ఆకాశాన్ని బ్రహ్మగా ఉపాసించాలి. ఆకాశము, మనస్సు రెండూ సూక్ష్మమైనవే, సర్వవ్యాపకమైనవే, అంతులేనివి కాబట్టే వీటికి బ్రహ్మత్వం ఆపాదించబడింది.

మనస్సు అనే బ్రహ్మకు నాలుగుపాదాలున్నాయి. వీటిలో...

మొదటిపాదం - వాక్కు

రెండవ పాదం - ప్రాణం

మూడవ పాదం - నేత్రం

నాల్గవ పాదం - శ్రోత్రం

ఇది ఆధ్యాత్మిక దృష్టి. ఆదిదైవ దృష్టితో చూసినట్లైతే

మొదటిపాదం - అగ్ని

రెండవ పాదం - వాయువు

మూడవ పాదం - ఆదిత్యుడు

నాల్గవ పాదం - దిక్కులు

ఈ విధంగా ఆధ్యాత్మ, ఆదిదేవత దృష్టితో నాల్గుపాదాలు గల బ్రహ్మోపాసన చెయ్యవచ్చు.

ఈ రెండు విధాలను కలిపికూడా ఉపాసించవచ్చు. మనస్సు, ఆకాశం రెండూ ఒక్కటే కదా ! అటువంటి మనో ఆకాశ బ్రహ్మకు.

మొదటి పాదం - వాక్కు, అగ్ని

రెండవ పాదం - ప్రాణము, వాయువులు

మూడవపాదం - నేత్రము, ఆదిత్యులు

నాల్గవ పాదం - దిక్కులు, శ్రోత్రము

ఈ విషయం తెలుసుకుని మనస్సును, ఆకాశాన్ని, బ్రహ్మగా ఉపాసించేవాడు యశస్సుతోను, బ్రహ్మతేజస్సుతోను ప్రకాశిస్తాడు.

'ఆదిత్యుడు బ్రహ్మ' మొట్టమొదటి ప్రపంచమంతా సత్తుగా అంటే నామరూపాత్మకం లేకుండా ఉంది. ఈ విధంగా నామరూపాత్మకంగాని అసత్తు కార్యోన్ముకమైంది. అది క్రమంగా స్థూలరూపాన్ని పొందుతూ, నీటిలో కలిసి అండంగా తయారైంది. నీటిలో పంచభూతాలు ఉన్నాయి. కాబట్టి పంచభూతాలతో కలిసి అండగా అయిందన్నమాట. కొంత కాలానికి ఈ అండం పగిలి రెండు ముక్కలయింది. ఆ ముక్కలే వెండి, బంగారాలు. ఇందులో వెండిలాగా కనుపించేది క్రింద ఉండే భూలోకము. బంగారు రంగులో కనిపించేది పైన ఉండే ద్యులోకము. ఈ గ్రుడ్డును కప్పి ఉండే పొర పర్వతసమూహాలు. నదులే నాడులు.

ఆ గర్భంలో పుట్టినవాడే ఆదిత్యుడు. ఆదిత్యునితో బాటే దూరప్రాంతాలకు వినిపించే ధ్వనులు, సమస్త జగత్తు, బ్రతకటానికి కావలసిన అన్న వస్త్రాలు పుట్టినాయి. ఇప్పటికీ సూర్యోదయం వల్ల, సూర్యుడు అస్తమించటం వల్ల సమస్త భూతాలు భోగవిషయాలు ఘోషశబ్దంతో పుడుతున్నాయి.

ఇట్టి మహిమాన్వితుడైన ఆదిత్యుని తెలుసుకొని అతనిని బ్రహ్మగా భావించి పూజించేవారు లేక ఆరాధించేవారు స్వయంగా ఆదిత్యుడే అవుతారు. సుఖజీవనం సాగిస్తారు. వారి వద్దకు సంతోషకరమైన శబ్దాలు శీఘ్రంగా చేరతాయి.

## మధువిద్య

ఈ ఉపనిషత్తులోని మూడవ అధ్యాయంలో మధువిజ్ఞానం చెప్పబడింది. ఆదిత్యుని యందు మధువును ఆరోపించి, ఆ విధంగా ఆదిత్యుణ్ణి ఉపాసించటమే మధువిద్య. ఈ విద్యను మొదటగా హిరణ్యగర్భుడు ప్రజాపతికి చెప్పాడు. తరువాత ప్రజాపతి మనువుకు, మనువు ఇక్ష్వాకునికి తద్వారా అతని సంతతికి చెప్పబడింది. అరునిని జ్యేష్టపుత్రుడైన ఉద్దాలకుడికి అతని తండ్రి ఈ బ్రహ్మ విజ్ఞానాన్ని చెప్పాడు. విద్వాంసులైన వారు ఈ విద్యను తమ జ్యేష్ఠపుత్రుడికి గాని, యోగ్యుడైన శిష్యుడికి గాని బోధించాలి. ఇతరులకు బోధించరాదు. అని శ్రుతి చెబుతోంది.

దూరంగా ఆకాశంలో మనకు కనిపించేవాడే సూర్యుడు. అతడే దేవతలను తృప్తిపరచేవాడు. అందుచేతనే అతడు దేవతలకు మధువు వంటివాడు. స్వర్గలోకం తేనెపట్టు పట్టేటందుకు వీలైన కర్రలాంటిది. అంతరిక్షం తేనెపట్టులా వ్రేలాడుతోంది.

ఆదిత్యుని నుండి వచ్చే కిరణాలు తేనెపట్టుకు ఉండే తేనెటీగల పిల్లలు. ఆదిత్య రూపమైన మధువుకు తూర్పుదిక్కున ఉండే కిరణాలే అంతరిక్ష రూపమైన తేనెతుట్టెలోని గదులు. ఋక్కులే తేనెటీగలు. ఋగ్వేదమే పుష్పం. తేనెటీగల్లాగా ఋక్కులే కర్మలనే పూలలోనుంచి అమృతమనే మధువును తయారుచేస్తున్నాయి. అగ్నిలో దాగి ఉండే సోమరసం అనబడే అమృతమే జలం. అగ్నిలో హోమం చేయబడే నెయ్యి, పాలు మొదలైనవి వేడెక్కి ఆవిరై జలరూపందాల్చి అమృతంగా ఆ కిరణాలలో నిక్షిప్తమై ఉంటుంది. తేనెటీగలు తేనెను గ్రహించినట్లుగా హోమం చేసినప్పుడు ఋగ్వేద మంత్రాలు ఈ అమృతాన్ని గ్రహిస్తాయి. ఇక్కడ అమృతము అంటే హోమం చెయ్యటం వల్ల కలిగినటువంటి కనుపించని ఫలితము. దశలవారీగా అమృతత్వానికి అంటే మోక్షానికి  కారణమౌతుంది.

దక్షిణదిక్కున ఉండే కిరణాలే ఆదిత్యరూపమైన మధువుయొక్క దక్షిణ దిక్కులో ఉన్న తేనెతుట్టెలోని గదులు. యజుర్వేదమంత్రాలే తేనెటీగలు. యజుర్వేద విహితమైన కర్మయే పుష్పం. అగ్నిలో హోమం చెయ్యబడిన నెయ్యి మొదలైనవే అమృత జలం.

ఈ యజుర్వేదమంత్రాలు, యజుర్వేద విహితమైన కర్మలకు వేడి కలిగించగా, దాని నుండి యశస్సు, తేజస్సు, ఇంద్రియాలు, బలము, అన్నము ఉత్పన్నమైనాయి. ఇవన్నీ ఆదిత్యుని దక్షిణ భాగాన్ని ఆశ్రయించి తెల్లని రూపంలో ఉంటాయి.

పశ్చిమదిక్కున ఉండే కిరణాలే సూర్యుడనే పడమటి దిక్కున ఉండే తేనెతుట్టెలోని గదులు. సామవేద మంత్రాలే తేనెటీగలు. సామవేద కర్మయే పుష్పం. సోమాది రూపమైన అమృతమే జలం. ఈ సామవేద మంత్రాలు సామవేద విహితమైన కర్మలకు వేడి కలిగించగా దానినుండి యశస్సు, తేజస్సు, ఇంద్రియాలు,వ ఈర్యం, తినటానికి వీలైన అన్నరూపరసం ఉత్పన్నమైనాయి. ఆ రసమే సూర్యుని పశ్చిమ భాగాన ఆశ్రయించి ఉండే నల్లని తేజస్సు.

ఉత్తరదిక్కున ఉండే కిరణాలే తేనెతుట్టెలోని గదులు. అధర్వ, అంగిరస మంత్రాలే తేనెటీగలు. ఇతిహాసాలు, పురాణాలు, పుష్పాలు. అగ్నిలో హోమం చెయ్యబడిన సోమాది రూపమైనదే అమృతజలం. అధర్వణ వేదమంత్రాలు ఇతిహాస, పురాణాలనే పూలను వేడెక్కించగా, వాటినుండి యశము, తేజస్సు, ఇంద్రియాలు, వీర్యము,

అన్న రూపమైన రసము ఉద్భవించాయి. ఈ రసమే సూర్యుని ఉత్తర భాగాన ఆశ్రయించి ఉండే మిక్కిలి నల్లనైన రూపము.

ఆదిత్యుని పైకి వ్యాపించే కిరణాలే ఊర్ధ్వదిక్కులో ఉన్న తేనెతుట్టెలోని గదులు. లోకద్వారాలు తెరువవలసినదిగా చేసే ప్రార్ధనలే తేనెటీగలు. ఓంకారమనే బ్రహ్మమే పుష్పం సోమరసాది రూపమైన అమృతమే జలం. ప్రార్ధనలనే తేనె టీగలు ఓంకారమనే పుష్పాన్ని అభితప్తం చేస్తాయి. అంటే వేడెక్కిస్తాయి. అప్పుడు ఆ పుష్పం నుండి యశము, తేజస్సు, ఇంద్రియాలు, వీర్యం, అన్న రూపమైన రసముపుట్టి సూర్యుని పైభాగాన్ని ఆశ్రయించాయి. ఆదిత్యుని మధ్యలో చలిస్తున్నట్లు కనుపించే ఆ భాగమే మధువు.

ఈ రకంగా లోహితాది రూపాలే రసాలకు, రసలోకాలకు సారభూతం కాబట్టి వేదాలే రసాలు. ఈ వర్ణాలు రసానికి రసంలాంటివి. అమృతానికి అమృతంలాంటివి. వేదాలే అమృతాలు. లోహితాది రూపాలు వాటికన్న కూడా అమృతాలు - నాశనం లేనివి.

వీటిలో లోహితవర్ణంగల మొదటి అమృతాన్ని అగ్నిదేవుని ద్వారా వసువులు అనుభవిస్తారు. ఇందులో దేవతలు తినేది, త్రాగేది ఏమీ ఉండదు. వారు ఆదిత్యుని తూర్పుభాగంలో ఎర్రని రంగుగల అమృతాన్ని చూస్తూ-దాన్ని ఇంద్రియాలతో అనుభవిస్తూ తృప్తి పడతారు. వసుదేవతాగణం కూడా ఈ అమృతాన్ని చూసి తృప్తులౌతారు.

ఇక రెండవ అమృతం ఇంద్రుడు ప్రధానుడుగా రుద్రగణం చేత అనుభవింపబడుతుంది. దేవతలు తినటము, త్రాగటము చెయ్యరు. కనులతో చూచి తృప్తి చెందుతారు. ఈ విషయం తెలిసినవాడు సూర్యుడు దక్షిణదిక్కున ఉదయించి ఉత్తరదిక్కున అస్తమించినంత కాలము రుద్రులవంటి ఆధిపత్యం, స్వరాజ్యం పొందుతాడు.

మూడవ అమృతం, వరుణుడు ప్రధానుడుగా ఆదిత్యగణంచేత అనుభవించ బడుతుంది. ఈ అమృతాన్ని గురించి తెలుసుకున్నవాడు సూర్యుడు పశ్చిమాన ఉదయించి తూర్పున అస్తమించినంత కాలము ఆదిత్యుల ఆధిపత్యాన్ని, సామ్రాజ్యాన్ని పొందుతాడు.

నాల్గవ అమృతం సోముడు ప్రధానుడుగా ఆదిత్యగణంచేత అనుభవించబడుతుంది. ఈ అమృతాన్ని గురించి తెలుసుకున్నవాడు సూర్యుడు పశ్చిమాన ఉదయించి తూర్పున అస్తమించినంత కాలము ఆదిత్యుల ఆధిపత్యాన్ని, సామ్రాజ్యాన్ని పొందుతాడు.

నాల్గవ అమృతం సోముడు ప్రధానుడుగా మరుద్గణంచేత అనుభవించబడుతోంది. ఈ అమృతాన్ని గురించి తెలుసుకున్నవాడు సూర్యుడు ఉత్తరాన ఉదయించి దక్షిణాన అస్తమించినంత కాలము మరుద్గణాల ఆధిపత్యాన్ని, సామ్రాజ్యాన్ని పొందుతాడు.

ఐదవ అమృతం బ్రహ్మ ప్రధానుడుగా సాధ్యులచేత అనుభవింపబడుతుంది. ఈ అమృతాన్ని గురించి తెలుసుకున్నవాడు సూర్యుడు ఊర్ధ్వదిక్కున ఉదయించి అథోదిక్కున అస్తమించినంతకాలము సాధ్యుల ఆధిపత్యాన్ని స్వారాజ్యాన్ని పొందుతాడు.

నిజానికి సూర్యునికి ఉదయాస్తమయాలు లేవు. ఆయన కనుపించినప్పుడే ఉదయం. కనుపించక పోవటమే అస్తమయం కాబట్టి ఏ దిక్కున కనిపించినప్పుడు, అక్కడి వారికి సూర్యోదయం అయిందని గ్రహించాలి. ఈ రకంగా ఉదయాస్తమయాల ద్వారా జీవులకు వాటి కర్మఫలాన్ని అందిస్తూ, ఆ కర్మలు క్షయం అయిన తరువాత వాటిని తనలో లీనం చేసుకుంటాడు. జ్ఞానులైన వారు పైన చెప్పిన వసు, రుద్ర, ఆదిత్య, మరుద్గణాలు లాగా అమృతాన్ని అనుభవించి సూర్యునితో అభేదాన్ని పొందుతారు. అంటూ మధు విద్యను పూర్తిచేశారు.

***సూత్రం - 417 "నానా శబ్దాదిభేదాత్"***

ఇక్కడ వేద్యం అంటే తెలుసుకోదగినది ఒకటే. అయినప్పటికీ ఈ విద్యలలో గుణభేదం ఉన్నది. కాబట్టి శాండిల్యాది విద్యలన్నీ వేరువేరు.

## 34. వికల్పాధికరణము (బ్రహ్మోపాసనలలో దేనినైనా చేయవచ్చు)

ఈ విషయం ముప్ఫైనాల్గవ అధికరణలో చెబుతున్నారు. దీని పేరు **వికల్పాధికరణము** ఇందులో ఒకే సూత్రం ఉంది.

విద్యలన్నీ వేరయినప్పుడు వీటన్నింటినీ అనుష్ఠించాలా? ఏదో ఒకటి అనుష్ఠిస్తే చాలా?

*సూత్రం – 418 "వికల్పోఽ విశిష్టఫలత్వాత్"*

సగుణోపాసన చేసేటప్పుడు వేరు వేరు విద్యలనే ఉపాసించాలి. ఎందుకంటే అక్కడ వేద్యము అంటే తెలుసుకోదగిన వస్తువు వేరు. సాక్షాత్కారమయ్యే దేవత వేరు. ఉపాసనా ఫలం వేరు.

శాండిల్యాది విద్యలు నిర్గుణోపాసన. ఇందులో సాక్షాత్కారమయ్యేది ఆత్మ. వేద్యము తనను గురించి తాను తెలుసుకోవటం. ఫలితము మోక్షము. ఐహిక బంధనాలు తెంచుకుని, జ్ఞానియై పరమాత్మలో లీనం కావటం అదే ముక్తి.

కాబట్టి ముక్తి కోసం అన్ని విద్యలు వేరువేరైనవి అవసరం లేదు. బ్రహ్మోపాసనలలో దేనినైనా అనుష్ఠించవచ్చు.

## 35. కామ్యాధికరణము

**(కామ్యోపాసనలు సమిష్టిగాను, విడిగాను కూడా చెయ్యవచ్చు)**

ఈ విషయం ముప్ఫై ఐదవ అధికరణ అయిన **'కామ్యాదికరణము'**లో చెబుతున్నారు. ఇందులో ఒకటే సూత్రం ఉంది.

బ్రహ్మోపాసన ఒకటిగానే అనుష్ఠించాలి. మరి కామ్యోపాసన మాట ఏమిటి? వీటిని విడివిడిగా ఉపాసించాలా? సమిష్టిగా ఉపాసించవచ్చునా?

కామ్యోపాసనలు అంటే పూజలు, వ్రతాలు, అభిషేకాలు వంటివి. వీటిలో ఒక్కొక్క దానికి ఒక రకమైన ఫలితం ఉంటుంది. కాబట్టి వాటిని విడివిడిగా గాని, ఇతర క్రతువులతో కలిపి గాని చెయ్యవచ్చునేది నా అభిప్రాయం. సత్యన్నారాయణ స్వామి వ్రతం గృహప్రవేశ సమయంలోను చెయ్యచ్చు లేదా విడిగాను చెయ్యవచ్చు.

***సూత్రం – 419 "కామ్యాస్తు యథాకామం సముచ్చీ యేరన్న వా పూర్వ హేత్వభావాత్"***

కామ్యవిద్యలను ఇష్టం వచ్చినట్లు అంటే వ్యష్ఠిగా గాని, సమిష్ఠిగా గాని అనుష్ఠించవచ్చు వీటన్నింటికీ ఒక రకమైన ఫలితం లేదు.

కామ్యవిద్యలు రెండు రకాలు 1. దైవసాక్షాత్కారము 2. భోగప్రాప్తి. మొదటి దానిలో కొంత కాలం ఒక ఉపాసన చేస్తాడు. తరువాత ఇంకొక ఉపాసన. ఆ తరువాత ఇంకొకటి. ఇటువంటి వాటిలో సాధకుడికి పిచ్చి ఎక్కుతుంది. ఉపాసకుడు

గనక తాదాత్మ్యం చెందితే తానే దేవత అవుతాడు. కాబట్టి ఇలాటి వాటిలో ఉపాసనలు మార్చకుండా ఒకే రకమైన ఉపాసన చెయ్యాలి. కాబట్టి దైవసాక్షాత్కారం కావాలంటే ఒకే దేవతను ఉపాసన చెయ్యాలి. అంతేకాని దేవతను. ఉపాసన మార్చరాదు.

ఇక రెండవది భోగప్రాప్తి. ఇందులో సాధకుడు కోరినది పొందుతాడు. అతడికి సుఖము, భోగము లభిస్తాయి. కాబట్టి ఉపాసన మారాల్సిన అవసరం లేదు.

కాబట్టి వీటిని అంటే కామ్యోపాసనలను మన ఇష్టప్రకారం ఉపాసించవచ్చు.

## 36. యథాశ్రయభావాధికరణము

## (కర్మాంగోపాసనలు కలిపి లేదా విడివిడిగా చేయవచ్చు)

ఈ విషయం ముప్ఫై ఆరవ అధికరణ **యథాశ్రయభావాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో ఆరు సూత్రాలున్నాయి.

లౌకికోపాసనలు ఇష్టం వచ్చిన విధంగా ఆచరించవచ్చు అన్నారు. మరి కర్మాంగము లైనట్టి ఉద్గీతాదులను కలిపి అనుష్ఠించాలా? విడివిడిగా అనుష్ఠించవచ్చా?

***సూత్రం - 420 "అఙ్గేషు యథాశ్రయభావః"***

కర్మాంగాలైనటువంటి ఆశ్రిత ఉపాసనలలో సముచ్చయం వల్ల అనుష్ఠాన నియమం ఉంది. అంటే కర్మాంగాలకు, వాటిని ఆశ్రయించిన అంగాలుగా చెప్పబడ్డ ఉపాసనలకు ఒకే నియమం వర్తిస్తుంది. అంటే ఉపాసనలను ఉద్గీథాల్లాగానే సముచ్చయంగా అనుష్ఠించాలి.

***సూత్రం - 421 "శిష్టేశ్చ"***

కర్మాంగాలకు, వాటిని ఆశ్రయించిన ఉపాసనలకు వేదాలు విధానభేదాన్ని ఉపదేశించవు. కాబట్టి కర్మాంగాలలాగానే ఉపాసనలు సముచ్చయంగానే అనుష్ఠించాలి.

***సూత్రం - 422 "సమాహారాత్"***

సమాహారం వల్ల, ఋగ్వేదానికి సంబంధించిన ఓంకారానికి, సామవేదానికి సంబంధించిన ఉద్గీథానికి ఐక్యత చెప్పబడింది.

***సూత్రం - 423 "గుణసాధారణ్యశ్రుతేశ్చ"***

ఉపాసనలకు ఆశ్రయమైన ప్రణవం అన్ని వేదాలకు సాధారణమే. కాబట్టి దానిని ఆశ్రయించిన ఉపాసనలకు కూడా సముచ్చయానుష్ఠానం సిద్ధిస్తోంది.

***సూత్రం - 424 "న వా తత్సహభావాశ్రుతేః"***

మూడువేదాల్లోను విహితమైన అంగాలకు స్తోత్రాలకు సహభావం ఉన్నదని శ్రుతి చెబుతున్నది. కాని ఆశ్రయాలకు, ఆశ్రితాలకు సహభావం లేదు. కాబట్టి ఉపాసన అనుష్ఠించవచ్చు లేదా మానవచ్చు.

***సూత్రం - 425 "దర్శనాచ్చ"***

శ్రుతులు ఆ విధంగా చెప్పటం వల్ల ఉపాసనలకు సహభావం లేదు. వాటిని ఇష్టం వచ్చినట్లుగా అంటే విడివిడిగానో, కలిపో అనుష్ఠించవచ్చు.

***దీంతో బ్రహ్మసూత్రాలలోని మూడవ అధ్యాయంలోని మూడవ పాదం పూర్తయింది.***

# మూడవ అధ్యాయం

## నాల్గవ పాదం

ఇందులో సగుణ నిర్గుణ విద్యలు వేరొక కర్మతో సంబంధం లేకుండా స్వతంత్రంగానే ఫలితాన్నిస్తాయి అనే విషయాన్ని వివరిస్తున్నారు. ఇందులో పదిహేడు అధికరణలు, యాభై రెండు సూత్రాలున్నాయి.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | పురుషార్ధాధికరణము | బ్రహ్మజ్ఞానము కర్మాంగము కాదు | 17 |
| 2. | పరామర్శాధికరణము | సన్యాసాశ్రమం వేదంలో చెప్పబడింది | 3 |
| 3. | స్తుతిమాత్రాధికరణము | కొన్ని శ్రుతులు ఉపాసనల్ని విధిస్తున్నాయి | 2 |
| 4. | పారిప్లవాధికరణము | ఉపనిషత్తులలోని కథలు క్రతుకర్మాంగాలు కావు | 2 |
| 5. | అగ్నీంధనాద్యధికరణము | మోక్షానికి కర్మానుష్ఠానం లేదు | 1 |
| 6. | సర్వాపేక్షాధికరణము | జ్ఞానోత్పత్తికి విహిత కర్మలు ఉపయోగిస్తాయి | 2 |
| 7. | సర్వాన్నానుమత్యధికరణము | ప్రాణాపాయ స్థితిలో ఆహార నియమాలను సడలింపు ఉన్నది | 4 |
| 8. | ఆశ్రమ కర్మాధికరణము | మోక్షాపేక్ష లేని వారు కూడా విహిత కర్మలు చెయ్యాలి | 4 |
| 9. | విధురాధికరణము | ఆశ్రమ రహితులకు కూడా బ్రహ్మవిద్యాధికారమున్నది | 4 |
| 10. | తద్భూతాధికరణము | సన్యాసి మళ్ళీ పూర్వాశ్రమానికి రాకూడదు | 1 |
| 11. | అధికారాధికరణము | సన్యాసాశ్రమభ్రష్టులకు ప్రాయశ్చిత్తం | 2 |

| | | | |
|---|---|---|---|
| 12. | బహిరధికరణము | ప్రచ్యుతి పొందిన నైష్ఠికుడికి సంఘ బహిష్కారం ఉంది | 1 |
| 13. | స్వామ్యధికరణము | ఉద్గీతాది ఉపాసనలకు కర్త ఋత్విక్కే | 3 |
| 14. | సహకార్యంతర విద్యాధికరణము | పాండిత్యము, బాల్యముతో పాటు మౌనం కూడా విధే | 3 |
| 15. | అనావిష్కారాధికరణము | బాల్యం అంటే రాగద్వేషాలు లేని నిర్మలభావం | 1 |
| 16. | ఐహికాధికరణము | జ్ఞానోత్పత్తి ఈ జన్మలోనే కలుగుతుంది | 1 |
| 17. | ముక్తిఫలాధికరణము | మోక్షము అందరికీ ఒకటే | 1 |

మొత్తం అధికరణలు 17 సూత్రాలు 52

ముందుగా ఆత్మజ్ఞానాన్ని చూద్దాం.

## ఆత్మజ్ఞానం

ఆత్మ అంటే ఎక్కడో లేదు. నీలోనే ఉన్నది. నీ తత్త్వమే ఆత్మ. ఈ విషయాన్ని ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు వివరించాడు. **ఛాందోగ్యోపనిషత్తులో**

ఉద్దాలకఅరుణిమహర్షి కుమారుడు శ్వేతకేతువు. కుమారుడికి పన్నెండు సంవత్సరాలు నిండగానే తండ్రి అతణ్ణి పిలిచి "నాయనా శ్వేతకేతూ! గురుకుల ఆశ్రమానికి వెళ్ళి బ్రహ్మచర్య దీక్షతో అక్కడ నివసించు. మన వంశంలో పుట్టిన వారెవరూ బ్రహ్మజ్ఞానం లేనివారు కాదు. కాబట్టి నువుకూడా వెళ్ళి విద్యావంతుడవుకా" అన్నాడు.

తండ్రి మాటమీద పన్నెండు సంవత్సరాలపాటు గురుకులంలో ఉండి వేదాధ్యయనం చేసి, వేదానికి అర్థం తెలుసుకున్నాడు. అయితే సర్వంతనకే తెలుసుననే అహంకారంతో, గర్వంతో, దర్పంతో ఇంటికి తిరిగి వచ్చాడు. ఈ విధంగా దుడుకు స్వభావంతో వచ్చిన కుమారుని అవివేకాన్ని, ఆత్మవంచనను, గుర్తించినవాడై

ఉద్దాలకుడు “నాయనా శ్వేతకేతూ! శ్రవణ గోచరం కాని తత్త్వం ఇంద్రియ గోచరమయ్యే విధానము గురించి మీ గురువుగారిని ఎప్పుడైనా అడిగానా?” అన్నాడు.

“ఏమిటా విషయం?” అన్నాడు శ్వేతకేతు. “నాయనా! మట్టిని గురించి తెలిస్తే మట్టితో చేసే వివిధ రకాల వస్తువులకు పేర్లలో తేడా ఉన్నా వాటిని గురించి తెలుస్తుంది. బంగారం గురించి క్షుణ్ణంగా తెలిస్తే దానితో తయారుచేసిన నగలకు ఏ పేరుపెట్టినా వాటిలో ఉన్నది బంగారమే అని తెలుస్తుంది.

అలాగే ఏ విషయం తెలుసుకున్నందువల్ల అన్ని విషయాలు మనకు బోధ పడతాయో దానిని గురించి తెలుసుకోవాలి. ప్రతి విషయంలోనూ అంతర్గతంగా ఉండే తత్త్వం ఏదో తెలుసుకున్నావనుకో అప్పుడు మిగిలినదంతా పదాలగారడీ అని తెలుస్తుంది” అన్నాడు ఉద్దాలకుడు. దానికి శ్వేతకేతువు “నాన్నగారూ! మీరు చెప్పిన విషయాలు మా గురువర్యులకు తెలియదనుకుంటాను. ఒకవేళ వారికి తెలిస్తే తప్పకుండా నాకు చెప్పేవారే. కాబట్టి పరమోత్కృష్టమైన ఆ విద్యను మీరే నాకు బోధించి నన్ను కృతార్థుణ్ణి చెయ్యండి” అన్నాడు.

“సరే! నీకాతత్త్వాన్ని చెబుతాను. వినవలసినది” అంటూ ప్రారంభించాడు ఉద్దాలకుడు.

“శ్వేతకేతూ! సృష్టికి పూర్వం ఈ ప్రపంచం నామరూపాలతో కూడిలేదు. అప్పుడు కేవలం అద్వితీయమైన ‘సత్తు’ మాత్రమే ఉండేది. నామరూపాలు, పదార్థాలు ఏవీలేవు. సత్తు అంటే–ఉనికి, సత్యం అని అర్థం. అసత్తు అంటే లేనిది, అసత్యం అని అర్థం. అన్నింటికన్నా పూర్వమమైనది, రెండుకానిది, మొదటగా ఉన్నది ఏకైకమైన పరబ్రహ్మ. ఆ తత్వం అనేకం కావాలనుకుంది. రకరకాల రూపాలతో వస్తువులుగా, జీవులుగా రూపుదాల్చింది. ద్రవ, ఘన, వాయు పదార్థాలుగా మార్పుచెంది అనేక రూపాలతో సృష్టి ఆకారం పొందింది. ఈ రకంగా మొదటగా ఉన్న పరబ్రహ్మలో నుంచే ఇవన్నీ వచ్చినాయి.

స్థావర జంగమాత్మకమైన జీవులన్నీ పుట్టుకరీత్యా అనేక విధాలుగా ఉన్నాయి.

1. అండజములు – గ్రుడ్డు నుండి పుట్టేవి (పక్షులు, పాములు)
2. జారజాలు – స్త్రీ జనానంగము నుంచి పుట్టేవి (మనుష్యులు, పశువులు)

3. ఉద్భిజములు - విత్తనాల వల్ల భూమి నుంచి పుట్టేవి. (చెట్లు, చేమలు)
4. స్వేదజములు - చెమట వల్ల పుట్టేవి
5. ఊష్మజాలు - వెచ్చదనం వల్ల పుట్టేవి. (క్రిమికీటకాలు)

జీవరాశులను చెప్పేటప్పుడు పై మూడు రకాలు మాత్రమే చెప్పాలి. అవే ముఖ్యమైనవి.

తాను అనేకం కావాలనుకున్న 'సత్తు' ముందుగా అగ్నిని సృష్టించింది. అగ్ని నుండి జలము, జలము నుండి భూమి ఉద్భవించాయి. వీటివల్లనే అన్నం పుట్టింది. అప్పుడు సత్తు అగ్ని జలము అన్నములలో ప్రవేశించాలనుకుంది అంటే ఈ మూడింటిలోనూ వ్యక్తమయి అనేక రూపాలు పొందింది అన్నాడు.

ఆ మాటలు విన్న శ్వేతకేతు "నాన్నగారూ! మీరు చెప్పిన విషయం చాలా బాగుంది. కాని చిన్న అనుమానం. నిద్రపోతున్నప్పుడు మనిషి ఎక్కడికి పోతాడు?" అన్నాడు.

"నాయనా ! నిద్రపోతున్నప్పుడు మనిషి తాత్కాలికంగా ఆత్మతో తాదాత్మ్యం చెందుతాడు. తేనెటీగలు తోటంతా తిరిగి మకరందాన్ని స్వీకరించి తేనెగా తయారు చేస్తాయి. ఈ తేనె ఆ పువ్వుల నుండి స్వీకరించినదే. కాని ఏ చుక్క ఏ పూవు నుండి తీసిందో మాత్రం చెప్పలేము. అలాగే జీవరాశులు విడివిడిగా ఉన్నప్పటికీ ఆత్మలోనే లీనమై ఉంటాయి. అది నిద్రాసమయం లేదా మరణం ఏదైనా కావచ్చు. గాఢనిద్రలో గతం తెలియదు. వర్తమానం అసలే తెలియదు. అంతా అజ్ఞానం. అందువల్ల యధార్థమనేది తెలియదు. యధార్థాన్ని గుర్తించటం కష్టం.

మానవుడు నిద్రించేటప్పుడు ఆత్మలో తాత్కాలికంగా లీనమౌతాడు. మరణ కాలంలో వాక్కు మనస్సులో లీనమవుతుంది. మనస్సు ప్రాణంలో లీనమవుతుంది. ప్రాణం తేజస్సులో కలిసిపోతుంది. చివరకు అది పరమశక్తిలో కలిసిపోతుంది. ఆశక్తి అతిసూక్ష్మమైనది. కాని విశ్వమంతా వ్యాపించి ఉంది. అదేసత్యం. అదే నిత్యం. అదేఆత్మ. అదేనీవు 'తత్త్వమసి'.

జీవి అనేది ఏ రూపంలో ఉన్నప్పటికీ అంటే పులి, సింహము, మనిషి, ఏదైనా కాని అనంత చైతన్యసముద్రంలో కలిసిపోయిన తరువాత తనరూపాన్ని పోగొట్టు

కుంటుంది. జీవులు వాటిరూపాలు, నామాలు పోగొట్టుకుంటాయి. అవి అన్నీ ఏ తత్త్వంలో కలసిపోతాయో అదే బ్రహ్మ. అది అద్వితీయమైనది. సూక్ష్మమైనది. సర్వవ్యాపకమైనది. అదేనీవు. శ్వేతకేతూ! అదేనీవు.

నదులు తూర్పు నుంచి పడమరకు ప్రవహించినా, పడమర నుంచి తూర్పుకు ప్రవహించినా అన్నీ సముద్రంలోనే కలుస్తాయి. నీరు ఒక సముద్రంలోంచి ఇంకో సముద్రంలోకి చేరుతుంది. సూర్యరశ్మికి నీరు ఆవిరి అయి మేఘంగా మారుతుంది. ఆ మేఘాలు వర్షించి జలాన్నిస్తాయి. ఆ జలం కొండలమీద నుంచి ప్రవహించి నదుల్లో కలుస్తుంది. ఆ నదులన్నీ చాలాదూరం ప్రవహించి సముద్రాల్లో కలుస్తాయి. సముద్రంలో కలిసే వరకూ గంగ, గోదావరి, కృష్ణ అని రకరకాల పేర్లతో ఆ నదులను పిలుస్తారు. కాని అవి సముద్రంలో కలిసిన తరువాత ఏ నీరు ఏ నదిదో తెలియదు కదా! అలాగే విడివిడిగా రకరకాలుగా ఉండే ఈ జీవరాశులు పరబ్రహ్మలో కలిసిపోయినప్పుడు వాటిని విడదీయటం కష్టం. జీవాత్మలన్నీ పరమాత్మలోని భాగాలే.

"నాయనా శ్వేతకేతూ ఒక మర్రి పండును తీసుకునిరా"" అన్నాడు ఉద్దాలకుడు.

మర్రిపండు తెచ్చాడు శ్వేతకేతూ.

"దాన్ని పగులకొట్టు" అన్నాడు తండ్రి

పగులకొట్టాడు కుమారుడు.

"అక్కడ ఏం కనిపిస్తోంది?" అడిగాడు తండ్రి.

"చిన్న చిన్న గింజలు కనిపిస్తున్నాయి"

"ఒక గింజను తీసుకుని పగులకొట్టు"

గింజను పగులకొట్టాడు శ్వేతకేతు.

'ఏముందక్కడ?' ప్రశ్నించాడు ఉద్దాలకుడు.

"ఏమీ కనిపించటం లేదు" అన్నాడు శ్వేతకేతు.

ఇంత పెద్ద మర్రిచెట్టు శూన్యంలో నుండిరాదు కదా. ఆ గింజలో ఏమి లేదని చెప్పావు. కాని అందులో ఇంతపెద్ద మ్రాను, కొమ్మలు, రెమ్మలతో ఉన్న ఈ చెట్టుకు కారణమైన, నీకు కనిపించని జీవమున్నదన్నమాట. అదే విధంగా బయటకు కనిపించకుండా సూక్ష్మాతిసూక్ష్మంగా ఉన్న ఆత్మ సర్వత్రా వ్యాపించి ఉంది. అన్నింటికీ

ఆధారమైనది ఉండికూడా మనకంటికి కనిపించదు. నీకు ఒక్క విషయం చెబుతా విను. "కాస్త ఉప్పు తీసుకొని దాన్ని నీళ్ళలో కలుపు, రేపు ఉదయం మళ్ళీ రా అన్నాడు ఉద్దాలకుడు. తండ్రి ఆజ్ఞప్రకారం నీళ్ళలో ఉప్పు కలిపాడు శ్వేతకేతు. అది పూర్తిగా కలిసిపోయింది. మర్నాడు ఉద్దాలకుడు అన్నాడు.

"శ్వేతకేతూ! నిన్న నీళ్ళలో కలిపిన ఉప్పును తీసుకునిరా!" ఆ ఉప్పు నీళ్ళలో బాగా కలిసిపోయింది. అందుచేత విడదీయటానికి వీలులేదు. అదే మాట చెప్పాడు శ్వేతకేతు.

"అయితే సరే. ఆ నీళ్ళను ఒకసారి రుచిచూడు" అన్నాడు ఉద్దాలకుడు.

"తండ్రీ! ఆ నీళ్ళు చాలా ఉప్పగా ఉన్నాయి." అన్నాడు శ్వేతకేతువు.

"కుమారా! ఇది విను. ఉప్పునీళ్ళలో కలిసిపోయినట్లు ఆత్మ అన్ని వస్తువులలోనూ కలిసిపోయి ఉంటుంది. ఆ ఆత్మయే నీవు."

ఆత్మని గురించి తండ్రి చెప్పిన మాటలు పూర్తిగా అర్థం చేసుకున్నవాడై కుమారుడు తండ్రిని అడుగుతున్నాడు. "తండ్రీ! ఆత్మానుభవంపొందే మార్గం నాకు వివరించండి" మీరు చెప్పే విషయాలు వినటానికి తేలికగానే ఉన్నాయి. కాని అర్థం చేసుకోవటం, అనుభవంలోని తేవటం మాత్రం చాలా కష్టం. దీని అనుభవం పొందటం ఎలా?" అని అడిగాడు శ్వేతకేతువు.

"శ్వేతకేతూ! ఆత్మజ్ఞానం పొందటం ఎలాగో చెబుతాను విను. ఒక మనిషి కళ్ళకు గంతలు, చేతులుకట్టి గుర్తు తెలియని అరణ్యం మధ్యలో అతన్ని వదలి వేశామనుకో. అప్పుడతడేం చేస్తాడు. అతడికి దారి తెలియదు. దిక్కు తెలియదు. తననెవరో బంధించారు. కళ్ళు కనిపించటం లేదు. ఆ గంతలు విప్పుకోటానికి చేతులు లేవు. అవికూడా కట్టేశారు. ఇప్పుడు అతడు భయపడతాడు. దారి తెన్నూ లేకుండా తిరుగుతాడు. రక్షించండి అని అరుస్తాడు. భయంతో ఏడుస్తాడు. అప్పుడు ఎవరో వచ్చి కట్లు ఊడదీస్తారు. అతడికి కళ్ళు కనిపిస్తాయి. త్రోవ తెలుస్తుంది. కనిపించిన వాళ్ళందరినీ తనింటికి దారి అడుగుతూ, వెతుక్కుంటూ ఇల్లు చేరతాడు. అదే విధంగా అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతున్న మానవుడు తన లక్ష్యమైన ఆధ్యాత్మిక సౌధం కోసం ప్రయత్నించి చేరుకోవాలి. జిజ్ఞాసతో మనం వేసే ప్రతి అడుగుకూ గమ్యం ఆత్మయే. ఆ ఆత్మయే నీవు. శ్వేతకేతూ నీవే ఆత్మ. 'తత్త్వమసి'

ఆత్మ అంటే ఎంతో దూరంలో అందని ఆకాశంలో లేదు. అది నీలోనే ఉంది. నీ తత్త్వమే ఆత్మతత్త్వం. నిన్ను నీవు తెలుసుకోవటమే ఆత్మజ్ఞానం". అంటూ ఉద్దాలకుడు ఆత్మజ్ఞానాన్ని తన కుమారుడైన శ్వేతకేతువుకు వివరించాడు.

ఆత్మజ్ఞానం పొందిన వాడికే మోక్షం సిద్ధిస్తుంది.

## 1. పురుషార్ధాధికరణము (బ్రహ్మజ్ఞానము కర్మాంగము కాదు)

ఉపనిషత్తులలో చెప్పిన ఆత్మజ్ఞానం కర్మలతో కలిసి మోక్షానికి దారి తీస్తుందా? లేక కర్మలను అపేక్షించకుండానే స్వతంత్రంగా పురుషార్ధ సాధకమవుతుందా? అనే విషయాన్ని మొదటి అధికరణలో వివరిస్తున్నారు. దీనిపేరు **పురుషార్ధాధికరణ** ఇందులో పదిహేడు సూత్రాలున్నాయి.

కర్మ అంటే ఇష్టాపూర్త కర్మలు. బావులు, చెరువులు త్రవ్వించటము, దేవాలయాలు, అన్నసత్రాలు కట్టించటం, పేదలకు అన్నదానం, వస్త్రదానం చెయ్యటం, యజ్ఞాలు, యాగాలు చెయ్యటం వంటివి. ఈ కర్మలు చెయ్యటం వల్ల పుణ్యఫలం వస్తుంది. దాన్ని అనుభవించటానికి మానవుడు స్వర్గలోకానికి పోతాడు. అక్కడ కర్మఫలం అనుభవించి, కర్మశేషం అనుభవించటానికి మళ్ళీ భూలోకంలో జన్మిస్తాడు. కాబట్టి కర్మలు చేస్తే స్వర్గం వస్తుంది అంతేకాని మోక్షం రాదు.

చతురాశ్రమాలలోను గృహస్తాశ్రమం రెండవది. ఇందులో పూర్తిగా కర్మలు చేస్తారు. ఆ తరువాత వానప్రస్తము, సన్యాసము. వానప్రస్తాశ్రమంలో కేవలము మంత్రాలు చదువుతారు అంతేకాని క్రియ ఉండదు. అంటే యజ్ఞయాగాది క్రతువులు చెయ్యరు. సన్యాసాశ్రమంలో యతీశ్వరులు మంత్రాలు కూడా చదవరు. కర్మ చేసినా, చెయ్యకపోయినా ఒకటే అని భావిస్తారు. మోక్షం పొందాలంటే బ్రహ్మజ్ఞానం కావాలి. బ్రహ్మజ్ఞానం ఆత్మజ్ఞానంవల్లనే మోక్షం వస్తుంది. అంతేకాని కర్మలవల్ల కాదు. కర్మలవల్ల జ్ఞానం పెరుగుతుంది.

***సూత్రం – 426 "పురుషార్థోఽతః శబ్దాదితి బాదరాయణః"***

ఉపనిషత్తులలో చెప్పబడిన స్వతంత్రమైన ఆత్మజ్ఞానం వల్లనే మోక్షం సిద్ధిస్తుంది అంటున్నాడు వ్యాసమహర్షి.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానాన్ని వివరిస్తూ ఆత్మ అనేది ఎక్కడో ఆకాశంలో లేదు. నిన్ను నువ్వు తెలుసుకోవటమే ఆత్మజ్ఞానం. ఆత్మజ్ఞాని మోక్షాన్ని పొందుతాడు అని చెప్పాడు.

**ముండకోపనిషత్తు**లో మనోమయుడు ఈ అన్నమయ శరీరంలోనే ఉన్నాడు. ఈ విషయం తెలిసినవాడు ఆత్మతత్త్వాన్ని సాక్షాత్కరింప చేసుకోగలుగుతాడు. అని చెప్పబడింది. **బృహదారణ్యకోపనిషత్తు**లో బ్రహ్మజ్ఞాని కూడా బ్రహ్మమే అవుతాడు అని చెప్పబడింది.

ఈ విధంగా గురువు యొక్క ఆదేశానుసారం పరబ్రహ్మను శోధించి తెలుసుకున్న వాడు మోక్షం పొందుతాడు. కాబట్టి ఆత్మజ్ఞానంవల్లనే మోక్షం కలుగుతుంది.

***సూత్రం - 427 "శేషత్వాత్పురుషార్థవాదో యథాన్యేష్వితి జైమినిః"***

కర్తృ రూపంలో ఆత్మఅనేది కర్మకు అంగమే. అంటే ఆత్మ, ఆత్మను గూర్చిన జ్ఞానం, ఈ రెండూ కర్మాంగాలే. ఇది జైమిని అభిప్రాయం.

***సూత్రం - 428 "ఆచార దర్శనాత్"***

ఆచారము కనపడటం వల్ల కూడా జ్ఞానమనేది స్వతంత్రంగా జ్ఞానసాధనం కాదు. విదేహాధిపతి అయిన జనకుడు గొప్ప గొప్ప దక్షిణలిచ్చి యజ్ఞాలు చేశాడు. ఈ రకంగా జనకుని లాంటి బ్రహ్మవేత్తలు కూడా కర్మని ఆచరించారని చెబుతున్నారు. కేవలం జ్ఞానం వల్లనే మోక్షం వచ్చేటట్లయితే వారు కర్మలు ఎందుకు చేస్తారు?

***సూత్రం - 429 "తచ్ఛ్రుతేః"***

విద్య అనేది కర్మ శేషము. అంటే జ్ఞానమనేది కర్మలకు అంగము. **ఛాందోగ్యోప నిషత్తు**లో విద్య, శ్రద్ధ, యోగము అనే ఈ మూడింటితోనూ కలిపి చేసిన కర్మ శక్తివంత మవుతుంది. అని చెప్పబడింది. ఇక్కడ 'విద్య' అంటే జ్ఞానము అని అర్థం. అదే బ్రహ్మవిద్య.

***సూత్రం - 430 "సమన్వారమ్భణాత్"***

విద్య, కర్మము అనే వాటి సముచ్చయం కనిపిస్తోంది. ఈ కారణంవల్ల కూడా విద్య కర్మాంగమే. మానవుడు చనిపోయిన తరువాత అతని విద్య, కర్మ రెండూ కూడా అతని వెనకే వెడతాయి. వాటివల్లనే అతడు కర్మఫలితం పొందుతాడు.

ఫలితాన్నివ్వటంలో ఈ రెండూ ఒకదానికొకటి సహాయపడతాయి. అందుచేత విద్య అనేది స్వతంత్రం కాదు కర్మాంగమే.

***సూత్రం - 431 "తద్వతో విధానాత్"***

శ్రుతినిబట్టి అన్ని వేదాల అర్థాన్ని తెలుసుకున్న వారికి కూడా కర్మను విధించటం కనిపిస్తోంది. కాబట్టి విద్య కర్మాంగమే. అని వారి వాదన.

నియమానుసారం గురువును సేవించి, సుశ్రూషలు చేసి వేదాధ్యయనం పూర్తి చేసి, సమావర్తనం చెంది గృహస్థాశ్రమం స్వీకరించి, స్వాధ్యాయం చేస్తూ, విద్యార్థులకు విద్య బోధిస్తూ ఈ రకంగా కర్మలు చేస్తూ బ్రహ్మవిద్య సాధన చెయ్యాలి అని **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పబడింది. కాబట్టి విద్య అనేది కర్మాంగము అని వీరంటారు.

***సూత్రం - 432 "నియమాచ్చ"***

జీవించి ఉన్నంతవరకూ కర్మ చెయ్యాలి అని వేదం చెబుతోంది. కర్మ చేస్తూనే వంద సంవత్సరాలు బ్రతకాలి. అలా చెయ్యటంవల్ల అశుభకర్మ నీకు అంటదు. అని చెప్పబడింది. కాబట్టి విద్య కర్మాంగము అని తెలుస్తోంది అంటారు.

***సూత్రం - 433 "అధికోపదేశాత్తు బాదరాయణ స్యైవం తద్దర్శనాత్"***

విద్య అనేది కర్మశేషం కాదు. జ్ఞానమనేది స్వతంత్రంగానే మోక్షసాధనమని వ్యాసభగవానుడంటాడు ఇది నిజమే. ఎందుకంటే వేదాంతంలో కర్మిష్ఠిని గూర్చి, కర్మశేషుడైన వానిని గూర్చి, సంసారిని గూర్చి, చెప్పిన దానికన్న అసంసారి చిన్మాత్రుడు అయిన పరమేశ్వరుణ్ణి గురించే ఎక్కువగా చెప్పబడింది.

ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వవేత్త అంటూ ఈశ్వరుణ్ణి గూర్చి ఎక్కువగా ఉపనిషత్తులలో చెప్పటంచేత, ఆత్మజ్ఞానము కర్మాంగము కాదని తెలుస్తోంది.

***సూత్రం - 434 "తుల్యం తు దర్శనమ్"***

తత్త్వజ్ఞానము కర్మలకు అంగం కాదు. అనే మాటకు వేదప్రమాణం కూడా ఉంది.

కావషేయమానులు బ్రహ్మజ్ఞానులు, వారు "మనం వేదాధ్యయనం చెయ్యటం ఎందుకు? యజ్ఞయాగాదులు చెయ్యటం ఎందుకు? అని అడిగారు. దానికి

సమాధానంగా **బృహదారణ్యకం**లో 'నేను పరమాత్మను అని తెలుసుకుని, బ్రాహ్మణులైన వారు పుత్రులు, ధనము మొదలైన ఐహిక వాంఛలను వదలి భిక్షాటన చేస్తూ ఉంటారు" అని చెప్పబడింది. అంటే బ్రహ్మజ్ఞానులు కర్మలు చెయ్యరు. కర్మ చేసినా, చెయ్యకపోయినా వారికి ఒకటే. కాబట్టి విద్య కర్మాంగము కాదు.

***సూత్రం - 435 "అసార్వత్రికీ"***

**ఛాందోగ్యం**లో "విద్యాయుక్తుడై శ్రద్ధతో, యోగంతో చేసిన కర్మ మిగతా వాటికన్న ప్రబలంగా ఉంటుంది." అని చెప్పబడింది. ఈ మాట ఉద్గీథోపాసనకు మాత్రమే వర్తిస్తుంది.

***సూత్రం - 436 "విభాగః శతవత్"***

పదిరూపాయలను ఇద్దరికి పంచిఇమ్మన్నప్పుడు, చెరి ఐదురూపాయలు ఇస్తాము. అలాగే విద్య, కర్మ ఈ రెండూ పరలోకానికి వెళ్ళేవాడిని అనుసరిస్తాయి. సాధకులకు విద్యను, కర్మను, విభజించే ఇవ్వాలి. ఇక్కడ విద్య ఒక పురుషుణ్ణి అనుసరిస్తుందని (జ్ఞానిని) కర్మ మరియొక పురుషుణ్ణి (సంసారిని) అనుసరిస్తుందని భావము.

***సూత్రం - 437 "అధ్యయనమాత్రవతః"***

వేదాధ్యయనం చెయ్యాలి. శిష్యులకు బోధించాలి అనేది వేదాధ్యయనం చేసేవారికి చెప్పిన మాట, అంతేకాని జ్ఞానులకు కాదు. **ఛాందోగ్యంలో** చెప్పిన గురువుకు శుశ్రూష చెయ్యాలి ఇత్యాదివిధులు కర్మాధికారికోసం, అంతేకాని జ్ఞాని కోసం కాదు. జ్ఞానియైన వాడికి వేదాధ్యయనం, కర్మానుష్ఠానము అవసరం లేదు.

***సూత్రం - 438 "నావిశేషాత్"***

లోకంలో అగ్నిహోత్రాది కర్మలు చేస్తూ వందసంవత్సరాలు బ్రతకాలి అని చెప్పింది కర్మిష్ఠులకు అంతేకాని జ్ఞానులకు కాదు.

***సూత్రం - 439 "స్తుతయే-నుమతిర్వా"***

తత్త్వజ్ఞానికి కర్మానుష్ఠానము కేవలము స్తుతికోసము. జీవన పర్యంతం కర్మ చెయ్యనప్పటికీ తత్త్వవేత్త యందు విద్యాసామర్థం వల్ల కర్మలోపం ఉండదు.

***సూత్రం - 440 "కామచారేణ చైకే"***

వాజసనేయ శాఖవారు కొందరు గృహస్థాశ్రమాన్ని త్యాగం చెయ్యాలని చెబుతున్నారు.

అంటే జ్ఞానులైన వారు, సంసార బంధనాలు విడిచి పెట్టినవారు, విరాగులు "ఈ సంతానము, కర్మలవల్ల ప్రయోజనం లేదు. మనకు ఆత్మలోకం కావాలి" అని భావించేవారు కర్మలకు ప్రాధాన్యత ఇవ్వరు. వీరు గృహస్థాశ్రమాన్ని త్యాగం చేస్తారు.

***సూత్రం - 441 "ఉపమర్దం చ"***

కొందరు విద్వాంసులు వైరాగ్యం చెబుతున్నారు. విద్యావేత్తకు సర్వమూ ఆత్మే. అతడికి కర్త అనే భావం ఉండదు. కర్మ జరగాలంటే కర్త, కర్మ రెండూ ఉండాలి. విద్యాఫలం అంటే ఆత్మసాక్షాత్కారము. స్వస్వరూప జ్ఞానము. దీనికి కర్మలు అవసరం లేదు. కాబట్టి విద్య కర్మాంగము కాదు.

***సూత్రం - 442 "ఊర్ధ్వరేతస్సు చ శబ్దే హి"***

బ్రహ్మవిద్య, అనేది కేవలం సన్యాసాశ్రమంలోనే వినిపిస్తుంది. ఇంకెక్కడా వినిపించదు. కాబట్టి విద్య కర్మాంగం కాదు.

యతులకు అగ్నిహోత్రాది కర్మలు లేవు. కాబట్టి వారికి విద్య కర్మాంగం కాదు. వారి దృష్టిలో విద్యఅంటే బ్రహ్మవిద్య. ఊర్ధ్వరేతస్కులున్నారని వేదం చెబుతోంది.

ఆత్మలోకం కోరే సన్యాసులు కర్మలు త్యజిస్తారు. వారు కర్మలు చెయ్యరు. కర్మ చేసినా, చెయ్యకపోయినా వారికి ఫలితం ఒక్కటే. కాబట్టి బ్రహ్మవిద్య స్వతంత్రంగానే మోక్షసాధనము.

## 2. పరామర్శాధికరణము (సన్యాసాశ్రమం వేదాల్లో ఉంది)

సన్యాసాశ్రమంలో కర్మ అనేది లేదు. ఐతే అసలు సన్యాసాశ్రమము అనేది ఉన్నదా? అని చాలా మందికి అనుమానం వస్తుంది. దీన్ని వివరిస్తున్నారు రెండవదైన **పరామర్శాధికరణము**లో. ఇందులో మూడు సూత్రాలుంటాయి.

***సూత్రం - 443 "పరామర్శం జైమినిరచోదనా చాపవదతి హి"***

సన్యాసాశ్రమం గురించి చెప్పటంలో విధాయకమైన గుణాలేమీ లేవు. కొన్ని శ్రుతులు దీన్ని నిషేధిస్తున్నాయి. అయినప్పటికీ శాస్త్రాలు సన్యాసాశ్రమాన్ని **అంధ పరంపర న్యాయంగా చెప్పాయి అని జైమిని అభిప్రాయం.**

**అంధ పరంపర న్యాయ**మంటే ఒక గ్రుడ్డివాడి చెయ్యి పట్టుకుని ఇంకొక గ్రుడ్డివాడు. అలా నడిచి వెడుతుంటారు. త్రోవలో ఏమున్నదో ముందు నడిచేవాడికీ తెలియదు. వెనక నడిచే వాడికీ తెలియదు. కాబట్టి అందరూ కలిసి గోతిలో పడతారు. అదే విధంగా ఒక శాస్త్రంలో చెప్పారు కాబట్టి ఇంకొక శాస్త్రంలో సన్యాసాశ్రమం గురించి వ్రాశారు అంటాడు జైమిని.

ఆశ్రమాలు మూడే చెప్పబడినాయి.

1. బ్రహ్మచర్యం – గురుకులవాసంలో గడిపేది
2. గృహస్థాశ్రమం – యజ్ఞము, వేదాధ్యయనము, దానము చేసేది
3. వానప్రస్థం – తపస్సు చెయ్యటం

బహుశః వ్యాసుడు బ్రహ్మసూత్రాలు వ్రాసే నాటికి సన్యాసోపనిషత్తులు ఉండి ఉండకపోవచ్చు. అందుకే ఈ రకంగా మూడు ఆశ్రమాలే చెప్పబడ్డాయి. వాటిలో సన్యాసాశ్రమం లేదు అన్నాడు జైమిని.

***సూత్రం – 444 "అనుష్ఠేయం బాదరాయణః సామ్యశ్రుతేః"***

సన్యాసాశ్రమం అనుష్టింపదగినది అని వ్యాసుడంటాడు. వేదంలో గృహస్తాశ్రమంతో పాటే సన్యాసాశ్రమం కూడా చెప్పారు. వేదంలో పైన చెప్పిన మూడు ఆశ్రమాలకు ఒకే ఫలం పుణ్యలోకాలు అని చెప్పారు. సన్యాసాశ్రమం దీనికి భిన్నమైనది. మోక్షప్రాప్తికి ఉపయోగిస్తుంది. అందుకే దాన్ని అనుష్ఠించాలి.

***సూత్రం – 445 "విధిర్వా ధారణవత్"***

విధిలో చెప్పకపోయినప్పటికీ సన్యాసావస్థ ఉన్నది. మొదటి మూడు ఆశ్రమాలలోనూ ఫలితం పుణ్యలోకాలు. సన్యాసాశ్రమానికి ఫలం మోక్షము. ఇది వేదాలలో చెప్పబడింది. చతురాశ్రమాలలోను సన్యాసం చాలా ఉత్తమమైంది, పవిత్రమైంది. సన్యాసికి సంఘంలో మంచి గౌరవం ఉంది. ప్రజల దృష్టిలో అతడు

సర్వసంఘ పరిత్యాగి. సాక్షాత్తు పరమేశ్వరుడు. పై పెచ్చు సన్యాసాశ్రమానికి ఫలితం మోక్షం అని నమ్మకం. అంటే సన్యసించిన ప్రతివాడు తప్పనిసరిగా మోక్షం పొందుతాడు. ఇది సన్యాసం గురించి ప్రజల భావన, అందుకే పూర్వకాలంలో సామాన్యంగా ప్రతిగృహస్తూ కనీసం చివరి దశలోనైనా సన్యసించేవాడు.

మా ముత్తాత గారు పరమగురువు కూడా గుంటూరు జిల్లా, కొల్లూరు గ్రామ కాపరస్తులు కూచిభొట్ల నాగభూషణ శాస్త్రి గారు. ఆ రోజుల్లో వారింట్లో దొంగలు లోపలికి వచ్చారు. శాస్త్రి గారికి ఆ విషయం తెలియదు. వారికి ఉబ్బసం ఉన్నది. దాంతో ఊపిరి అందక లేచి కూర్చుని దగ్గుతున్నారు. తాము వచ్చినది తెలిసి లేచి ఇంట్లో అందర్నీ లేపటం కోసం దగ్గుతున్నాడు అనుకుని, కర్రతో బుర్ర పగలకొట్టి వెళ్ళిపోయారు దొంగలు. ఆ దెబ్బ నుంచి ఆయన ఇంకా కోలుకోలేదు. కొద్ది రోజులలోనే మరణించారు. ఐతే మరణించటానికి రెండు రోజుల ముందు సన్యసించారట. లేచి కూర్చునే ఓపిక లేకపోయినా ఆయనతో 'సన్యసించాను' అనిపించారు. సన్యసించిన మరునాడే స్వర్గస్తులైనారు. సన్యాసికి మోక్షం వస్తుంది అని నమ్మకం. అందుకే కొద్దిపాటి జ్ఞానమున్న ఏ బ్రాహ్మణుడైనా, కనీసం అంత్యకాలంలోనైనా సన్యసించే వాడు. బ్రాహ్మణేతరుడికి సన్యాసార్హత లేదు. అంటున్నాయి వేదాలు.

సన్యాసం ఒకరిస్తే పుచ్చుకునేది కాదు. జ్ఞాన వైరాగాలు సిద్ధించిన తరువాతనే సన్యసించాలి. సన్యాసము అంటే **మంచి నడవడి** అని అర్థం. సన్యాసి భిక్షుక వృత్తిలో ఉండాలి. భిక్షుకుడికి కూడా కొన్ని లక్షణాలు చెప్పింది **నారద పరివ్రాజకోపనిషత్తు.**

**శ్లో॥ అజిహ్వాష్షండకః పంగు రంధో బధిర ఏవ చ ।**
**ముగ్ధశ్చ ముచ్యతే భిక్షుః షడ్భిరేతైర్న సంశయః ॥ 1**

భిక్షుకుడికి ముఖ్యంగా ఆరు లక్షణాలుండాలి.

1. అజిహ్వా : నాలుక ఉండి కూడా లేనివాడు.
2. షండకః : పుంసత్వము ఉండి కూడా నపుంసకుడు.
3. పంగుః : కాళ్ళు ఉండి కూడా లేనివాడు
4. అంధః : కళ్ళు ఉండి కూడా చూడనివాడు

5. బధిరః : చెవులుండి కూడా విననివాడు

6. ముగ్ధః : ఇంద్రియాలు ఉండి కూడా వికారాలు లేనివాడు.

ఈ లక్షణాలున్నవాడు, ఈ ఆరుఇంద్రియాలకు లోబడనివాడు భిక్షుకు డనబడతాడు. దీనికి వివరణ ఇస్తున్నారు.

**శ్లో॥ ఇదమిష్టమిదం నేతి యోఽశ్నన్నపి న సజ్జతి ।**
**హితం సత్యం మితం వ్యక్తి తమజిహ్వం ప్రచక్షతే ॥ 2**

ఆహారం తీసుకుంటున్నప్పుడు దాని యందు ఇష్టాఇష్టాలు ప్రదర్శించని వాడు, ప్రజలందరికీ ఉపయోగించే మాటలు, సత్యము, మితసంభాషణ చేసేవాడు అజిహ్వుడు అనబడతాడు.

**శ్లో॥ ఆద్యజాతాం యథా నారీం తథా షోడశవార్షికీమ్ ।**
**శతవర్షాం చ యో దృష్ట్వా నిర్వికారస్స షండకః ॥ 3**

నిండు యవ్వనంలో ఉన్న స్త్రీని, అప్పుడే పుట్టిన పసిపాపని, వంద సంవత్సరాల ముసలిస్త్రీని సమానమైన దృష్టితో చూసేవాడు షండుడు. పుంసత్వము ఉండి కూడా లేనివాడు అనబడతాడు.

**శ్లో॥ భిక్షార్థమటనం యస్య విణ్మూత్రకరణాయ చ ।**
**యోజనాన్న పరం యాతి సర్వథా పంగురేవ సః ॥ 4**

భిక్షాటన చెయ్యటానికి, మలమూత్ర విసర్జనకు మాత్రమే కూర్చున్న ప్రదేశం నుంచి నడిచి వెళ్ళేవాడు, ఎంత అవసరమైనా యోజనము దూరము (8 మైళ్ళు) కన్న వెళ్ళనివాడు పంగుడు అనబడతాడు. అంటే ఎప్పుడూ నియమనిష్ఠలతో ఒకేచోట ఉంటూ స్వస్వరూప ధ్యానంలో కాలం గడిపేవాడు.

**శ్లో॥ తిష్ఠతో వ్రజతో వాఽపి యస్య చక్షుర్న దూరగమ్ ।**
**చతుర్యుగాం భువం ముక్త్వా పరివ్రాట్సోఽన్ధ ఉచ్యతే ॥ 5**

నుంచున్నా, కూర్చున్నా, ఏ పని చేస్తున్నా దృష్టి నాలుగు కాడిమానుల దూరం కన్న పోనివాడు అంధుడు అనబడతాడు. ఏకాగ్ర దృష్టి గలవాడు. ప్రక్కచూపులు చూడనివాడు అంధుడు.

**శ్లో॥ హితాహితం మనోరామం వచశ్శోకావహంతు యత్ ।**
**శ్రుత్వాఽపి న శృణోతీవ బధిరస్స ప్రకీర్తితః ॥ 6**

కష్టం కాని, సుఖం కాని, ఇష్టంకాని, అయిష్టంకాని ఏవార్త విన్నప్పటికీ ఏ రకమైన చలనము లేనివాడు బధిరుడు అనబడతాడు. స్తుతి నిందల యందు, సుఖదుఃఖముల యందు సమానభావం కలవాడు.

**శ్లో॥ సాన్నిధ్యే విషయాణాం యః సమర్థో వికలేన్ద్రియః ।**
**సుప్తవద్వర్తతే నిత్యం స భిక్షుర్ముగ్ధ ఉచ్యతే ॥ 7**

విషయాల మధ్యన ఉంటూనే వాటిని గ్రహించని వాడు ముగ్ధుడు అనబడతాడు. అంటే ఇంద్రియ వికారాలు లేనివాడు అని అర్థం. ఈ లక్షణాలు గల యతీశ్వరుడు మాత్రమే భిక్షకుడు అనబడతాడు.

సన్యాసి చేయకూడని పనులు వీటినే ప్రతిబంధకాలు అంటారు.

**శ్లో॥ ఆసనం పాత్రలోపశ్చ సంచయశ్శిష్య సంగ్రహః ।**
**దివాస్వాపో వృథాలాపో యతేర్బంధకరాణి షట్ ॥ 1**

1. ఆసనము 2. పాత్రలోపము 3. సంచయము 4. శిష్య సంగ్రహము 5. దివాస్వాపము 6. వృథాలాపము. ఇవి యతీశ్వరులకు ప్రతిబంధకాలు.

ఈ ఆరుపనులు సన్యాసి చెయ్యరాదు.

**శ్లో॥ ఏకాహాత్పరతో గ్రామే పంచాహాత్పరతః పురే ।**
**వర్షాభ్యోఽన్యత్ర యత్ సానమాసనం తత్ప్రకీర్తితమ్ ॥ 2**

గ్రామంలో ఒకరోజు, పట్టణంలో ఐదు రోజులు, వర్షాకాలములో నాలుగు నెలలు తప్ప ఎక్కువ కాలము ఒకే ప్రదేశంలో ఉండటాన్ని ఆసనము అంటారు.

**శ్లో॥ ఉక్తాలాబ్వాది పాత్రాణాం ఏకస్యాపి న సంగ్రహః ।**
**భిక్షోర్భైక్ష భుజశ్చాపి పాత్రలోపస్స ఉచ్యతే ॥ 3**

భిక్షాన్నం తింటున్నప్పటికీ, సొరకాయ బుర్ర మొదలైన పాత్రలలో ఒకదానినైనా ఉపయోగించకపోవటమే పాత్ర లోపము.

**శ్లో॥ అలాబుం దారుపాత్రం చ మృణ్మయం వైదళం తథా ।**

**ఏతాని యతిపాత్రాణి మనుస్స్వాయంభువోఽబ్రవీత్ ॥ 8**

సొరకాయబుర్ర, చెక్కకమండలము, మట్టికమండలము, వెదురుగొట్టము. ఇవి యతీశ్వరుడు వాడవలసిన పాత్రలు. లోహపాత్రలవల్ల దొంగలభయం ఉంటుంది. అందుకని వాటిని వాడరాదు.

**శ్లో॥ గృహీతస్య తు దండాదే ర్ద్వితీయస్య పరిగ్రహః ।**

**కాలాంతరోపభోగార్థం సంచయః పరికీర్తితః ॥ 4**

కాషాయాంబరాలు, దండము ధరించినప్పటికీ అవి పాడైపోతే వాడుకోవటానికి విడిగా రెండు మూడు దండాలు, బట్టలు సంపాదించి పెట్టుకోవటమే సంచయము అనబడుతుంది.

**శ్లో॥ శుశ్రూషా లాభపూజార్థం యశోఽర్థం వా పరిగ్రహః ।**

**శిష్యాణాం న తు కారుణ్యాత్ స జ్ఞేయ శ్శిష్యసంగ్రహః ॥ 5**

సేవలు చేయించుకోవటానికి గాని, మరి ఏ ఇతర అపేక్షతో గాని శిష్యులను చేర్చుకోవటమే శిష్యసంగ్రహము అనబడుతుంది.

**శ్లో॥ విద్యా దినం ప్రకాశత్వాత్ అవిద్యా రాత్రి రుచ్యతే ।**

**విద్యాఽభ్యాసే ప్రమాదో యః స దివాస్వాప ఉచ్యతే ॥ 6**

బ్రహ్మవిద్య వెలుగు, ప్రకాశము కాబట్టి పగలు అని, అజ్ఞానము చీకటి, రాత్రి అనబడతాయి. ఉపనిషద్విద్య అనే పగటియందు ప్రమాదము కలిగించుట అంటే ఉపనిషద్విద్యకు స్వస్తి పలకటం దివాస్వాపము పగటినిద్ర అనబడుతుంది.

**శ్లో॥ అధ్యాత్మికీం కథాం ముక్త్వా భైక్షచర్యాం గురుస్తుతిమ్ ।**

**అనుగ్రహోత్పృథి ప్రశ్నే వృథాలాపస్స ఉచ్యతే ॥ 7**

ఆధ్యాత్మిక విషయాలు చెప్పటం, భిక్షాందేహి అనటం, పరమేశ్వరస్తుతికి మాత్రమే సన్యాసి మాట్లాడాలి. మిగిలిన ఏ విషయం కోసం మాట్లాడినా అది వృథాలాప మనబడుతుంది.

**శ్లో॥ తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః ।**

**నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్ ॥ 9**

బ్రహ్మజ్ఞానం అపేక్షించే వాడు శమదమాది గుణాలు కలిగి, శ్రవణ, మననముల చేత పరబ్రహ్మ స్వరూపాన్ని తెలుసుకుని, పరబ్రహ్మ సాక్షాత్కారం కోసం నిరంతరము నిధి ధ్యాస (నిరంతర భావన) చెయ్యాలి. ఉపయోగం లేని మాటలు మాట్లాడరాదు. దాని వల్ల నోటినొప్పితప్ప ఇంకేమీ ఉపయోగం లేదు.

**శ్లో॥ ఏకో భిక్షుర్యథోక్తస్స్యాత్ ద్వావేవ మిథునం స్మృతమ్ ।**

**త్రయో గ్రామస్సమాఖ్యాతః ఊర్ధ్వంతు నగరాయతే ॥**

**నగరం న హి కర్తవ్యం గ్రామో వా మిథునం తథా ।**

**గ్రామవార్తా హి తేషాం స్యాత్ భిక్షావార్తా పరస్పరమ్ ॥**

**స్నేహవైశున్యమాత్సర్యం సన్నికర్షాత్రృజాయతే ॥**

బ్రహ్మజ్ఞాన సంపన్నుడు ఒంటరిగా ఉంటేనే నిరంతరము స్వస్వరూపానుసంధానము సాధ్యమవుతుంది. ఇద్దరుచేరితే సంసారము, ముగ్గురుచేరితే గ్రామము, నలుగురు ఆ పైన గనక చేరితే పట్టణమని అంటారు. ఇటువంటిస్థితిలో ఊళ్ళోజరిగే విషయాలు చెప్పుకుంటారు. ఒకరంటేఒకరికి స్నేహము, ద్వేషము కలుగుతాయి.

**పరమాత్మనియోరక్తో విరక్తో పరమాత్మని ।**

**సర్వైషణా వినుర్ముక్తః సభైక్షం భోక్తుమర్హతి ॥**

పరమాత్మధ్యానము నందు ఆసక్తిగలవాడు, పరమాత్మకు సంబంధించని విషయాలలో ఆసక్తిలేనివాడు, ఈషణత్రయము లేనివాడు, ఆత్మధ్యానతత్పరుడే భిక్షాన్నానికి అర్హుడు.

ఇటువంటి సన్యాసికే మోక్షం సిద్ధిస్తుంది. అందుకే విధిలో చెప్పకపోయినప్పటికీ సన్యాసావస్థని ఒప్పుకున్నాడు వ్యాసభగవానుడు. **సన్యాసికి సత్ప్రవర్తన అవసరం అంటున్నారు పరమానంద నాథులు.**

# 3. స్తుతిమాత్రాధికరణము

## (కొన్నిశ్రుతులు ఉపాసనలను చెబుతున్నాయి)

ఉద్గీత అన్నింటికన్నా శ్రేష్ఠమైనది. పరమాత్మ రూపము అందుకే సర్వోత్తమమైనది. అయితే వేదాలలో దాని శ్రేష్ఠతను చెప్పటం జరిగింది. ఇలా చెప్పటం దేనికి? దాన్ని స్తుతించటానికా? లేక ఉపాసన కోసమా? అనే విషయం వివరిస్తున్నారు ఈ మూడవ అధికరణలో. దీనిపేరు **స్తుతిమాత్రాధికరణము** ఇందులో రెండు సూత్రాలున్నాయి.

***సూత్రం - 446 "స్తుతిమాత్రముపాదానాదితి చేత్ - నాపూర్వవత్త్వాత్"***

ఉద్గీథాది శ్రుతులు కర్మాంగాలుగా గ్రహించబడినాయి. అందుచేత ఇది కేవలము స్తుతికోసమే అని అనటం సరికాదు.

ఉద్గీథాదులు శ్రేష్ఠమైన గుణాలతో కూడుకుని ఉంటాయనే విషయంగాని, వాటి ఉపాసన గాని ఏ ప్రమాణంచేతా ప్రతిపాదించబడలేదు. అవి అపూర్వములు. అందుచేతనే శ్రేష్ఠమైన గుణాలతో కూడిన ఉద్గీథోపాసనమే ఈ వాక్యాలలో చెప్పబడ్డది.

***సూత్రం - 447 "భావశబ్దాచ్చ"***

'ఉద్గీథముపాసీత' 'సామోముపాసీత' లాంటి విధులు ప్రత్యక్షంగా ఉన్నాయి. ఈ వాక్యాలన్నీ ఉపాసనా విధులనే బోధిస్తున్నాయి.

# 4. పారిప్లవాధికరణము

## (ఉపనిషత్తులలో కథలు క్రతువులకు కర్మాంగాలు కావు)

ఈ విషయం చెబుతున్నారు నాల్గవదైన **పారిప్లవాధికరణము**లో. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

పారిప్లవకర్మ అంటే అశ్వమేధ యాగంలో రాత్రిపూట యజమానిని సకుటుంబంగా కూర్చోపెట్టి ఆధ్వర్యుడు వేదాలలో ఉన్న కథలు చెప్పటం.

**బృహదారణ్యకం**లో మైత్రేయి కథ ఈ రకంగా చెప్పినదేనా? లేక విద్యను స్తుతించటం కోసం చెప్పినదా?

*సూత్రం - 448 "పారిప్లవార్థా ఇతి చేన్న విశేషితత్వాత్"*

ఇక్కడ పారిప్లవము అనే మాట ఉన్నందువల్ల మైత్రేయి కథ పారిప్లవము అనకూడదు. వేదాలలో కొన్ని కథలు మాత్రమే అలా చెప్పబడ్డాయి. కాబట్టి ఉపనిషత్తులలో కథలన్నీ విద్యావిశేషాలు తప్ప కర్మ శేషాలు కావు.

*సూత్రం - 449 "తథా చైకవాక్యతోపబన్ధాత్"*

ఇవన్నీ విద్య కోసం చెప్పినవే. ఈ కథలన్నీ ఆయాచోట్ల ఉన్న విద్యలతో ఏకవాక్యతను కలిగి ఉన్నాయి. కథవల్ల ఉపాసనకు ఫలం ఏమీ లేదు. శిష్యులకు విద్యయందు అభిలాష కలిగించటానికి, ఆ విద్యను తేలికగా బోధించటానికి ఇటువంటి కథలు చెప్పబడ్డాయి. అంతేకాని ఈ కథలు క్రతుకర్మాంగాలు కావు.

## 5. అగ్నీంధనాద్యధికరణము

### (మోక్షానికి కర్మానుష్ఠానం అవసరం లేదు)

మోక్షంకోసం కర్మచెయ్యవలసిన అవసరం లేదు అంటున్నారు ఐదవదైన **అగ్నీంధనాద్యధికరణము**లో. ఇందులో ఒకటే సూత్రం ఉంది.

బ్రహ్మవిద్య పురుషార్థాన్ని కలిగించటంలో కర్మను అపేక్షిస్తుందా?

బ్రాహ్మణులు వేదాధ్యయనం చేత, యజ్ఞంచేత, దానంచేత పరబ్రహ్మను తెలుసు కుంటారు. అని కొన్నిచోట్ల చెప్పబడింది. అందువల్ల జ్ఞానానికి కర్మ సాధనంగా చెప్పినట్లు కనిపిస్తుంది. అంటే మోక్షానికి కర్మ సహాయం కూడా కావాలి. అని తెలుస్తోంది. అని వీరు వాదిస్తారు.

*సూత్రం - 450 "అత ఏవ చాగ్నీన్ధనాద్యనపేక్షా"*

విద్య అనేది పురుషార్థ హేతువు. అందువల్లనే అగ్ని, ఇంధనాలు ఇవేవీ అవసరం లేదు. విద్య స్వతంత్రంగానే పురుషార్థ హేతువు. కాబట్టి దానికి కట్టెలు, నిప్పులాంటివి అవసరం లేదు. బ్రహ్మవిద్య మోక్షాన్నికలిగించటంలో కర్మనుఅపేక్షించదు. మోక్షం పొందాలంటే కర్మలు చేయవలసిన అవసరం లేదు.

# 6. సర్వాపేక్షాధికరణము

## (విహితకర్మలు జ్ఞానోత్పత్తికి ఉపకరిస్తాయి)

కర్మలు చెయ్యటం వల్ల జ్ఞానం వస్తుంది అని చెబుతున్నారు ఆరవదైన **సర్వాపేక్షాధికరణము**లో. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

***సూత్రం – 451 "సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతే రశ్వవత్"***

విద్యకు అన్ని ఆశ్రమాలలోను కర్మలు అవసరమే యజ్ఞయాగాలు జ్ఞానోత్పత్తికి హేతువులు. గుర్రం పొలం దున్నటానికి పనికిరాదు కాని రథం లాగటానికి పనికి వస్తుంది. అలాగే కర్మలు మోక్షాన్ని ఇవ్వలేకపోయినా జ్ఞానోత్పత్తికి ఉపయోగిస్తాయి.

***సూత్రం – 452 "శమదమాద్యుపేతః స్యాత్తథాపి తు తద్విధేస్తదఙ్గతయా తేషామవ శ్యానుష్ఠేయత్వాత్"***

విద్య స్వతంత్రమైనదే కాని మోక్షగామి శమదమాదులు గలిగి ఉండాలి. అవి విద్యకు అంగాలు.

జ్ఞానసాధనలో అవసరమయ్యేవి కర్మలే. శమదమాలు అంతరంగ సాధనాలు. యజ్ఞాలు చేసినా, యాగాలు చేసినా, సాధకుడు శమదమాదిగుణాలు గలవాడు కావాలి. కాబట్టి జ్ఞానోత్పత్తికి కర్మలుఉపయోగిస్తాయి.

# 7. సర్వాన్నానుమత్యధికరణము

## (ప్రాణాపాయ స్థితిలో ఆహార నియమాలకు సడలింపు ఉన్నది)

ఈ విషయం ఏడవదైన **సర్వాన్నానుమత్యధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో నాలుగు సూత్రాలున్నాయి.

ఆహారానికి నియమం ఉన్నదా? అనేది ప్రశ్న.

సామాన్యంగా ఆహారం తీసుకునేటప్పుడు ఇవి తినచ్చు, ఇవి తనకూడదు అంటారు. అందులోను ప్రత్యేకంగా కొంతమంది వ్యక్తులు ఈ పదార్ధాలే తినాలి అంటారు. ఇలా ఆహారానికి నియమాలు ఏమైనా ఉన్నాయా?

మనం చేసే పనిని బట్టి ఆహారం తీసుకోవాలి. లేకపోతే ఆరోగ్యం దెబ్బ తింటుంది. శరీర దారుఢ్యం కావలసినవారు అంటే సైనికులు, ఆటగాళ్ళు,

మల్లయోధులు మాంసము, బలవర్ధకమైన ఆహారము తీసుకోవాలి. తెలివితేటలు కావలసిన వారు వాటిని పెంచే ఆహారం తీసుకోవాలి.

**ఘృతేన వర్ధతే బుద్ధి క్షీరేణ ఆయుష్యవర్ధతే ।**

**శాకేన వర్ధతే రోగం మాంసం మాంసేన వర్ధతే ॥**

అంటోంది ఆయుర్వేదం. దీన్ని బట్టి మన అవసరానికి అనుగుణంగా ఆహారం తీసుకోవాలి.

సత్త్వగుణ ప్రధానులైనవారు దానికి తగిన ఆహారమే తీసుకోవాలి. ఉదా : బ్రాహ్మణుడు ఉల్లిపాయ తినరాదు అంటారు. ఎందుకని అంటే నిరంతరము సత్యాన్వేషణలో ఉండేవాడు బ్రాహ్మణుడు. అతడికి సత్త్వగుణం కావాలి. ఉల్లిపాయ రజోగుణాన్ని పెంచుతుంది. ఈ రెండింటికీ సరిపడదు. అందుకే బ్రాహ్మణుడు ఉల్లిపాయ తినరాదు. అంతేగాని, తింటే అతడికి అరగదు అని మాత్రంకాదు.

మోక్షమార్గంలో నడిచే వారికి ప్రత్యేకంగా కొన్ని ఆహార పదార్థాలు చెప్పారు. ఉప్పు, కారం పనికిరావు. రుచి ఉండకూడదు. కేవలము కందమూలాలు ఉడికించి తినాలి. చెట్టు నుంచి చిలకలు కొరికితే క్రింద రాలిన పండ్లు, కోతులు రాల్చిన కాయలు వంటివి ఏరుకుని తినాలి. వీరు తినే కాయగూరలు తమ పెరట్లో పండినవే కావాలి. ఇప్పుడు మనం వాడుతున్నట్లుగా డ్రైనేటి నీళ్ళతో పండిన కాయగూరలు వాడరాదు. వంట చేసేవారు కూడా మంచి మనసుతో, మనమీద అమితమైన భక్తి, ప్రేమ, అభిమానము కలిగి ఉండాలి. అందుకే ఎవరు పడితే వారు వండినవి, ఎక్కడ పడితే అక్కడ తినరాదు. కాని ప్రాణాపాయ స్థితిలో నియమాలను పాటించవలసిన అవసరం లేదు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో విరాట్‌ప్రాణానికి విరాట్‌అన్నమే ఆహారము అని చెప్పబడింది. అంటే అన్నిరకాల పదార్థాలను భక్షించవచ్చు అని చెప్పబడింది. అలాగే ఉషస్తికథలో **ప్రాణంపోయేసమయంలో మాత్రమే నియమోల్లంఘనం చెయ్యవచ్చు** అని చెప్పబడింది. కురుదేశంలో ఇభ్య అనే పల్లె ఉన్నది. ఆ పల్లెలో ఉషస్తి అనే ఋషి ఉండేవాడు. అతని భార్యపేరు ఆటకి. ఉషస్తి వేదవేదాంగ విదుడు, పండితుడు.

ఒకసారి కురేదేశంలో భయంకరమైన కరువు వచ్చింది. పంటలు పండలేదు. కాటకం విలయతాండవం చేస్తోంది. తినటానికి ఎక్కడా ఏమీ దొరకలేదు. తిండిలేక ప్రజలు మలమల మాడిపోతున్నారు.

ఆ రోజుల్లో ఉషస్తి ఆహారం లేక బాధపడుతూ ఒక మావటి వాడి దగ్గరకు వెళ్ళి తినటానికి ఏమైనా పెట్టమని అడిగాడు. అప్పుడా మావటీడు భయపడుతూ "బ్రాహ్మణోత్తమా! నావద్ద మినుములు తప్ప ఏమీలేవు. అవి కూడా నేను ఎంగిలి చేసినవి. కాబట్టి నేను మీకు ఏమి ఇవ్వగలను?" అన్నాడు. దానికి ఉషస్తి.

"ఫరవాలేదు. ఆ ఎంగిలి చేసినవే నాకు కొద్దిగాపెట్టు" అన్నాడు. మావటివాడు ఆ ఎంగిలి మినుములు కొన్ని ఉషస్తికి దానం చేసి, తాగటానికి నీరు కూడా ఇచ్చాడు.

ఉషస్తి మినుములను మాత్రం తిని నీరు వద్దన్నాడు. ఆ మాటలకు ఆశ్చర్యపోయిన మావటి "బ్రాహ్మణోత్తమా! ఎంగిలి మినుములు తిన్నావు కదా! మరి ఎంగిలి నీరు త్రాగటానికి అభ్యంతరం ఏమిటి?" అన్నాడు.

దానికి ఉషస్తి 'మిత్రమా! ప్రాణము నిలుపుకోటానికి ఎక్కడి ఆహారమైనా తినవచ్చు. అందులో దోషంలేదు. ఇప్పుడు నాకు ఓపిక వచ్చింది. కాబట్టి నీవిచ్చే నీళ్ళు అవసరం లేదు' అన్నాడు. అంటే అభ్యంతరం ఉన్నది అనే చెప్పాలి. చాలా రోజుల నుంచి ఆహారం తీసుకోలేదు. దాంతో నీరసం వచ్చి పడిపోయాడు లేవలేడు. అటువంటి స్థితిలో ఒక శూద్రుని దగ్గర ఆహారం ఉంది. దాన్ని తీసుకుని తినవచ్చా లేదా? ఇక్కడ గమనించాల్సింది ఏమంటే – మనం జీవించి ఉంటే సంప్రదాయాలు పాటిస్తాం. మనమే లేకపోతే ఈ సంప్రదాయాన్ని పాటించే దెవరు? కాబట్టి ముఖ్యమైనది ఏమంటే, అటువంటి స్థితిలో ముందు ప్రాణాలు నిలబడాలి. లేకపోతే అసలకే మోసం వస్తుంది. అంటే ప్రాణాపాయ స్థితిలో ఆహార నియమాలకు సడలింపు ఉన్నది.

ప్రాణాపాయ స్థితిలో ఆహార నియమాలకే కాదు. అన్ని నియమాలకు సడలింపు ఉంది. మనమంటూ ఉంటేనే నియమాలు, సంప్రదాయాలు.

పూర్వకాలంలో కేరళ రాష్ట్రంలో ఒక పండితుడు. చాలా గొప్పవాడు. ఆచారాలకు సంప్రదాయాలకు విలువ ఇచ్చేవాడు. కుమార్తెకు వివాహం చేశాడు. కాని విధివశాత్తు

చిన్నప్పుడే భర్త మరణించాడు. ఆ పిల్ల తండ్రి వద్దే ఉంటోంది. ఆ పిల్లకు ఇరవై సంవత్సరాలు ఉంటుంది. ఒకరోజున ఆ పండితుడు భార్యా, కుమార్తెతో కలిసి యాత్రలకు బయలుదేరాడు. ఇంటిపాలేరు బండి తోలుతున్నాడు. మధ్యాహ్నం పన్నెండు గంటలు. ఎండ మండిపోతుంది. విపరీతమైన దాహం వేస్తోంది. త్రోవలో ఒకచెరువు కనిపించింది. బండి ఆపారు. చెరువులో దిగి తనివితీరా నీరు త్రాగారు. ఇంతలోనే ఊహించని విధంగా పండితుని కుమార్తె చెరువులో పడిపోయింది. మునిగిపోతోంది. తల్లి తండ్రి పెద్దగా కేకలు పెడుతున్నారు. కుమార్తె మునిగిపోతోంది. పాలేరు ధైర్యం చేసి చెరువులో దూకి ఆ పిల్ల చెయ్యి పట్టుకుని బయటకు లాగాడు. కుమార్తె ప్రాణాలతో బయట పడింది. కాని పాలేరువాడు పిల్ల చెయ్యి పట్టుకున్నాడు. సంప్రదాయం ప్రకారం కుమార్తె మైలపడింది. అందుకని ఆ పండితుడు ఆ అమ్మాయిని అక్కడ వదిలేసి ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ అమ్మాయి గతి ఏమిటి?

ఇటువంటి నియమాలే పనికిరావు అంటున్నాడు వ్యాసభగవానుడు. **ప్రాణాపాయ స్థితిలో నియమోల్లంఘన చేయవచ్చు.** మామూలు స్థితిలో కాదు. **మనమంటూ ఉంటే సంప్రదాయాలు, నియమనిష్ఠలు, ఆచార వ్యవహారాలు ఉంటాయి. కాబట్టి ప్రాణాపాయ స్థితిలో నియమాలను ఉల్లంఘించవచ్చును. అంటున్నారు పరమానంద నాథులు.**

***సూత్రం – 453 “సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్”***

ప్రాణాపాయ స్థితిలో ఏ విధమైన అన్నాన్నైనా తినవచ్చును అని వేదం చెబుతున్నది. ఈ మాటే **ఛాందోగ్యం**లోను, **బృహదారణ్యకం**లోనూ కూడా చెప్పబడ్డది. కుక్కలు, పిల్లులు, పక్షులు మొదలైన జంతువుల ఆహారమే నీకు ఆహారము కాబట్టి ప్రాణాపాయ స్థితిలో ఏ రకమైన ఆహారమైనా తినవచ్చును.

***సూత్రం – 454 “అబాధాచ్చ”***

భక్ష్యాభక్ష్య నిర్ణయశాస్త్రం ఈ విధంగా చెప్పింది కాబట్టి అది ఆచరణీయము.

వేదంలో ఆహారం నిర్మలంగా, పరిశుద్ధంగా ఉంటేనే, మనసు కూడా పరిశుద్ధంగా ఉంటుంది అని చెప్పబడింది. అందుకే ఇది తినవచ్చు, ఇది తినరాదు అని నిర్ణయించబడింది.

***సూత్రం – 455 "అపి చ స్మర్యతే"***

స్మృతులలో కూడా ఈ విషయం చెప్పబడింది. మనుస్మృతిలో 'ఎవరైనా సరే, **ప్రాణాపాయ స్థితిలో భక్ష్యాభక్ష్య విచక్షణ లేకుండా ఏ వస్తువునైనా తినవచ్చు**' అని చెప్పబడింది. ఇది ప్రాణాపాయ స్థితిలో మాత్రమే.

**ఎటువంటి సమయంలోనైనా మద్యము మాత్రము నిషేధము.**

***సూత్రం – 456 "శబ్దశ్చాతో కామకారే"***

ఆహార విషయంలో స్వేచ్ఛ పనికిరాదు. శాస్త్రంలో అంగీకరించిన వాటినే తినాలి. నిషేధించిన వాటిని వదలివెయ్యాలి. అందుకే వాటిని తినరాదు.

## 8. ఆశ్రమకర్మాధికరణము

## (మోక్షాపేక్ష లేనివారు కూడా విహితకర్మలు చెయ్యాలి)

మోక్షం కావాలి అనుకోని వారు కూడా నిత్యకర్మలు చెయ్యాలా అనే విషయాన్ని వివరిస్తున్నారు ఎనిమిదవదైన **ఆశ్రమకర్మాధికరణము**లో. ఇందులో నాలుగు సూత్రాలు ఉన్నాయి.

విహితకర్మలు అంటే నిత్యకర్మలు. ఇవి అందరూ చెయ్యాలా?

మోక్షాపేక్ష లేనివారు, విద్యాసిద్ధి అవసరం లేనివారు నిత్యకర్మలు చెయ్యాలా? అవసరం లేదా? ఒకవేళ కర్మచేస్తే జ్ఞానం కోసం ఒకసారి. విద్యాసిద్ధి కోసం ఒకసారి. మొత్తం రెండుసార్లు చెయ్యాలా? ఒకసారి చేస్తే చాలా?

***సూత్రం – 457 "విహితత్వాచ్చాశ్రమకర్మాపి"***

ముముక్షువు కానివాడు కూడా ఆశ్రమ విహితకర్మలు చెయ్యాలి. అని వేదాలు చెబుతున్నాయి. అయితే నిత్యకర్మ సిద్ధి కోసం ఒకసారి, జ్ఞానం కోసం ఒకసారి రెండుసార్లు చెయ్యనక్కరలేదు. ఒకసారి చేస్తే చాలు.

అయితే "రూపభేదం లేకపోయినా, అగ్నిహోత్రమనేది ఒకటే అయినా ఫలితంలో తేడా ఉంది కాబట్టి రెండుసార్లు చెయ్యనవసరం లేదా? నిత్యకర్మలు పాపక్షయం చేస్తాయి. విద్యాంగకర్మలు జ్ఞానం కోసం కదా" అనేది అనుమానం.

*సూత్రం - 458 "సహకారిత్వేన చ"*

విద్యోత్పత్తిలో యాగాది కర్మలు సహకారి రూపంలో అనుష్ఠింపతగ్గవి.

ఇవి రెండూ పరస్పర సహకారం గలవి. కాబట్టి రెండుసార్లు చెయ్యవలసిన అవసరం లేదు. ఈ నిత్యకర్మలే జ్ఞానంకోసం కూడా తోడ్పడతాయి.

ఈ రెండింటి ప్రయోజనాలు వేరు కదా? అంటే చంద్రకర్ర యజ్ఞంలో యూపస్తంభం గానూ ఉపయోగిస్తుంది. లౌకికంలోనూ ఉపయోగిస్తుంది. అలాగే ఈ కర్మలు కూడా రెండు రకాలుగానూ ఉపయోగిస్తాయి.

*సూత్రం - 459 "సర్వథాపి తు త ఏవోభయ లిఙ్గాత్"*

యాగాది కర్మలు ఆశ్రమత్వ పక్షంలోను, విద్యాసహకారిత్వ పక్షంలో కూడా అనుష్ఠింపతగ్గవే. ఎవరు ఫలితం ఆశించకుండా, చేయవలసిన కర్మలు చేస్తారో వారికి మోక్షమార్గం లభిస్తుంది.

*సూత్రం - 460 "అనభిభవం చ దర్శయతి"*

బ్రహ్మచర్యాది సాధన సంపన్నుడైనవాడు పొందిన ఆత్మజ్ఞానం, క్లేశాలవల్ల నాశనం పొందదు. ఆశ్రమాలకు సంబంధించిన కర్మలు కూడా సాధకునిలోని అవిద్య, రాగము, ద్వేషము మొదలైన క్లేశాలను పోగొట్టి జ్ఞానాన్ని కలుగజేస్తాయి. అందుచేతనే అధ్యయనము. దానము వంటి నిత్యకర్మలు జ్ఞానానికి సహాయకారులవుతాయి. కాబట్టి మోక్షాపేక్ష లేనివారు కూడా ఆశ్రమ విహితకర్మలు చెయ్యాలి.

నీకు ఇష్టం ఉన్నా, లేకపోయినా, చేయవలసిన కర్మలు తప్పనిసరిగా చేసి తీరాలి. ఒకవేళ నువు చెయ్యకపోతే, నిన్ను అనుసరించే నీ కుమారులు, శిష్యులు ఆ కర్మలు చెయ్యరు. సమాజం భ్రష్టు పట్టి పోతుంది. కాబట్టి **ప్రతివారు విహితకర్మలు చేసి తీరాలి అంటున్నారు పరమానంద నాథులు.**

## 9. విధురాధికరణము

### (ఆశ్రమం తీసుకోని వారికి కూడా బ్రహ్మవిద్యాధికారము ఉన్నది)

ఈ విషయం తొమ్మిదవ అధికరణఅయిన **విధురాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో నాలుగు సూత్రాలున్నాయి.

ఆశ్రమరహితులకు కూడా బ్రహ్మవిద్యాధికారమున్నదా?

ఆశ్రమరహితులు అంటే సన్యాసం స్వీకరించని వారు. వీరికి కూడా బ్రహ్మవిద్యాధికారమున్నదా?

***సూత్రం - 461 "అన్తరా చాపి తు తద్దృష్టేః"***

బ్రహ్మ విద్యను చదవటానికి, వినటానికి, మననం చెయ్యటానికి ఎవరికైనా అధికారమున్నది. "సన్యాసాశ్రమం తీసుకున్న వారికే బ్రహ్మవిద్యాధికారమున్నది" అని ఎక్కడా చెప్పబడలేదు. సన్యాసాశ్రమం తీసుకుని బ్రహ్మవిద్యను గురించి తెలియని వారున్నారు. అలాగే ఏ ఆశ్రమము లేకపోయినా రైక్వుడు, సంవర్తకుడు, జడభరతుడు మొదలైన వారు ఆత్మజ్ఞాన సంపన్నులు. జనక మహారాజు, ప్రవాహణుడు, అశ్వపతి మహారాజు వంటి క్షత్రియులు గృహస్థాశ్రమంలో ఉండి కూడా బ్రహ్మజ్ఞాన సంపన్నులు. కాబట్టి బ్రహ్మవిద్య యందు ఎవరికైనా అధికారమున్నది అని చెబుతున్నారు అధికరణలో.

వేదాలలో ఆశ్రమ రహితులైన వారికి కూడా బ్రహ్మవిద్యాధికారమున్నది అని చెప్పబడింది.

ఆశ్రమరహితులు అంటే భార్య చనిపోయినవారు, ధనం లేకపోవటం వల్ల గృహస్థాశ్రమ ధర్మాలు నిర్వహించలేనివారు. ఇటువంటి వారికి బ్రహ్మవిద్యాధికారం ఉన్నదా? అనేది ప్రశ్న. వారికి కూడా బ్రహ్మవిద్యాధికారమున్నది. **ఛాందోగ్యోప నిషత్తు**లో రైక్వుడు ఈ కోవకు చెందినవాడే అతడికి భార్య లేదు. జానశ్రుతి కుమార్తెనిచ్చి వివాహం చేశాడు.

**సంవర్తుడు :**

అంగిరసుని కుమారుడు. బృహస్పతి సోదరుడు. అవధూత వివాహం చేసుకోలేదు. పిచ్చివాడిలా అడవులంబడి తిరుగుతుండే వాడు. అవీ క్షిత్తు, విశాల దంపతుల కుమారుడు 'మరుత్తు'. ఆహారం కోసం చంద్రుని 60 సం॥ అర్చించి ఎందరు తిన్నా తరగని అన్న పానీయాలు సంపాదించాడు. ధనంలోను, భోగంలోను ఇంద్రుణ్ణి మించిపోయాడు. ఇతడు ఒక యజ్ఞం చెయ్యాలనుకున్నాడు. దీంతో ఇంద్రుడికి ఇతనిమీద ఈర్ష్య కలిగి బృహస్పతితో 'మరుత్తు యొక్క యజ్ఞానికి వెళ్ళవద్దు'

అని చెప్పాడు. యజ్ఞం చేయించటానికి నిరాకరించాడు బృహస్పతి. అప్పుడు నారదుడి సలహా మీద మరుత్తు సంవర్తుడిని తన యాగం పూర్తి చేయించవలసింది అని కోరాడు. యాగం నిరాటంకంగా జరపాలి అనే షరతు మీద ఒప్పుకున్నాడు సంవర్తుడు. యాగం జరుగుతోంది. దాన్ని ఆపటానికి ప్రయత్నించాడు ఇంద్రుడు. మరుత్తు యజ్ఞం ఆపలేదు. సంవర్తుడు తన శక్తితో దేవతలను పిలిచి వారికి హవిర్భాగం ఇచ్చాడు. ఇంద్రుడు ఆ యాగాన్ని మెచ్చుకుని అక్కడి పాత్రలన్నీ బంగారుమయం చేశాడు. బ్రాహ్మణులకు దానమివ్వగా మిగిలిన ధనాన్ని నేలలో పాతిపెట్టించాడు మరుత్తు. ధర్మరాజు రాజసూయం చేసినప్పుడు భీమార్జునులు త్రవ్వి తెచ్చారు. మరుత్తు కుమారుడు అరిష్యంతుడు. ఇతని సంతతినాడే **'తృణబిందువు'**.

### *సూత్రం - 462 "అపి చ స్మర్యతే"*

ఏ ఆశ్రమము లేనట్టి సంవర్తుడు మొదలైనవారు మహాయోగులైనారని చెప్పబడింది.

ఇతిహాసాల్లో దిగంబరులైన వారు ఏ ఆశ్రమ ధర్మాలు నిర్వర్తించకుండా (సంవర్తుడు) మహాయోగులైనారని చెప్పబడింది. కాబట్టి ఆశ్రమ రహితులకు కూడా బ్రహ్మవిద్యాధికారం ఉంది.

### *సూత్రం - 463 "విశేషానుగ్రహశ్చ"*

రైక్వుడు మొదలైన వారికి ఏ ఆశ్రమం లేదు. అయినప్పటికీ జపతపాల వంటి కర్మలవల్ల విద్యాధికారం ప్రాప్తించింది. ఆశ్రమాలలో ఉన్నవారికి యజ్ఞయాగాలు, అధ్యయనము వంటి ధర్మాలున్నట్లే, ఏ ఆశ్రమం లేనట్టి రైక్వుడు మొదలైన వారికి జపము, తపము, దేవతారాధన వంటివి విద్యోత్పాదకాలు. "జపం ద్వారా బ్రాహ్మణుడు మోక్షం పొందవచ్చు"నని మనుస్మృతి చెబుతోంది.

### *సూత్రం - 464 "అతస్త్వితరజ్జ్యాయో లిఙ్గాచ్చ"*

ఏ ఆశ్రమం లేకపోవటంకన్న, ఆశ్రమం కలిగి ఉండటమే శీఘ్రమైన విద్యాప్రాప్తికి సాధనం.

ఏ ఆశ్రమం లేకపోయినా విద్యాధికారమున్నప్పుడు, ఇంకా ఆశ్రమధర్మాలు ఎందుకు అనే ప్రశ్న వస్తుంది.

ఏ ఆశ్రమం లేకుండా ఉండేకన్న, ఏదో ఒక ఆశ్రమాన్ని ఆశ్రయించటం శ్రేయస్కరం. అందువల్ల బ్రహ్మవిద్యాసాధన తేలిక అవుతుంది. ఆశ్రమం ఏదీ లేకుండా బ్రాహ్మణుడు ఒక్కరోజు కూడా ఉండకూడదు. ఒక సంవత్సరంపాటు ఈ విధంగా ఉంటే ప్రాయశ్చిత్తం కూడా చేసుకోవాలి.

కాబట్టి ఏ ఆశ్రమం లేకపోయినా విద్యాధికారం మాత్రం నశించదు. అయితే ఏ ఆశ్రమం లేకపోవటంకన్న ఏదో ఒక ఆశ్రమాన్ని గ్రహించటం మంచిది.

ఆశ్రమానికి, బ్రహ్మవిద్యకు ఏ రకమైన సంబంధము లేదు. సన్యాసి మాత్రమే బ్రహ్మవిద్యను అనుష్టించాలి. మిగిలిన వారికి బ్రహ్మవిద్యలో ప్రవేశం ఉండరాదు. అనే నియమం ఏదీలేదు. ఏ ఆశ్రమము లేని సంవర్తకుడు, రైక్వుడు లాంటివారు అనేకమంది బ్రహ్మవిద్యలో నిష్ణాతులున్నారు. కాబట్టి సన్యసించని వారికి కూడా బ్రహ్మవిద్యాధికారమున్నది.

## 10. తద్భూతాధికరణము (సన్యాసి మళ్ళీ పూర్వాశ్రమానికి రాకూడదు)

ఒకసారి సన్యాసం తీసుకుంటే అది రద్దు కాదు. అని వివరిస్తున్నారు పదవదైన **తద్భూతాధికరణము**లో. ఇందులో ఒకే సూత్రం ఉంది.

సన్యసించటము అంటే - సంసార బంధనాలు త్రెంచుకోవటము. కామ్యకర్మలను వదలి వేయటము అని అర్థం.

సన్యాసం రెండు రకాలుగా ఉంటుంది. 1. కేవల సన్యాసము 2. ఆశ్రమ స్వీకారము.

**1. కేవల సన్యాసి :** సంసారంలో బాధ్యతలు పూర్తిచేసి, కోరికలు లేకుండా, రాగద్వేషాలు వదలి, జ్ఞానవైరాగ్యాలు కలిగి సత్యాన్వేషణలో అడవులు, కొండలు, కోనల వెంబడి తిరుగుతూ ఉంటాడు. తినటానికి ఎవరినీ యాచించడు. ఏదైనా దొరికితే తింటాడు. అతని దగ్గర తినటానికి పాత్రలు, కట్టుకోటానికి బట్టలు కూడా ఉండవు. ఒకవేళ జనం మధ్యనే తిరుగుతూ ఉన్నా ఎవర్ని గురించీ, దేని గురించీ

పట్టించుకోడు. ఇంకో రకంగా చెప్పాలంటే పిచ్చివాడిలా ఉంటాడు. బంగారాన్ని మట్టికన్నా హీనంగా చూస్తాడు. అతడి దృష్టిలో "జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. జగత్తులోని ప్రతివస్తువూ, ప్రతిజీవి పరమేశ్వర స్వరూపమే. నేను, నువ్వు కూడా ఆత్మస్వరూపమే. ఇద్దరూ ఒకటే. కాబట్టి నేను నీతో మాట్లాడటము అంటే నాతో నేను మాట్లాడుకోవటమే." ఇది అతని భావన. అందుకే ఎవరితోను మాట్లాడడు. జనం దృష్టిలో అతడు ఒక పిచ్చివాడు. సంవర్తకుడు, రైక్వుడు ఇలాంటివారే. వీరికి దండకమండలాలు కాదు కదా నా అనేది ఏదీ ఉండదు. పేరు, ఊరు కూడా ఉండవు.

**2. ఆశ్రమ స్వీకారం చేసిన సన్యాసి :** ఇతడు గృహస్థాశ్రమము వానప్రస్థము పూర్తిచేసి, భార్యను పిల్లలకు వప్పగించి శాస్త్రబద్ధంగా సన్యసిస్తాడు. ఒక గురువుగారి దగ్గర శిష్యుడుగా చేరతాడు. ఆ గురువుగారికి ఒక ఆశ్రమం ఉంటుంది. దాన్నే మఠము, పీఠము అంటారు. ఆయన పర్యవేక్షణలోనే ఆ పీఠాల నిర్వహించబడతాయి. వీరందరి పోషణ బాధ్యత ఆ పీఠానిదే. పీఠానికి ఆస్తిపాస్తులు ఉంటాయి. వాటిని నిర్వహించటానికి ధర్మాధికారులుంటారు. కొన్నిచోట్ల ఈ పీఠాలకు వందలు, వేలకోట్లలో ఆస్తులుంటాయి. శంకర భగవత్పాదుల వారు భారతదేశంలో నలుమూలలా పీఠాలు ఏర్పాటుచేసి, ఆ పీఠానికి కొంత ప్రాంతము కేటాయించి, అక్కడ ధర్మరక్షణ బాధ్యత వారికి వప్పగించారు. ఇప్పటికి కూడా ఆ పీఠాలు అలా నడుస్తూనే ఉన్నాయి. వీరికి సంప్రదాయబద్ధంగా ఒక దీక్షానామము ఉంటుంది.

## శంకరుడు స్థాపించిన పీఠాలు

| దిక్కు | పీఠం | పీఠాధిపతి | దీక్షానామము |
|---|---|---|---|
| దక్షిణాన | శృంగేరి | సురేశ్వరాచార్యుడు | సరస్వతి, భారతి, పురి |
| పడమర | ద్వారక | హస్తామలకుడు | ఆశ్రమ, తీర్థ |
| ఉత్తరాన | బదరి | తోటకాచార్యుడు | గిరి, పర్వత, సాగర |
| తూర్పు | పూరి | పద్మపాదుడు | వన, అరణ్య |

భారతదేశంలో నాలుగు మూలలా ధర్మసంస్థాపన కోసం శంకర భగవత్పాదుల వారు ఈ పీఠాలను ఏర్పాటు చేశారు. అయితే ఇక్కడ చిన్న అనుమానం. కంచిలో

కామాక్షి పీఠం సంగతి ఏమిటి? ఇది కూడా శంకరుడు స్థాపించినదే అని కొందరి వాదన. దీన్ని శంకర పీటాలలో ఐదవ పీఠంగా చెబుతారు. కాని శంకర విజయంలో శంకరుడు స్థాపించినవి నాలుగు పీఠాలేఅన్నారు. కొంతమంది 'కంచి పీఠమే మూలపీఠము' అంటారు. అంటే శంకరుల వారు స్వయంగా చేసిన దేవతార్చన ఈ పీఠంలో ఉన్నదట. కొంతమంది శంకరుడు నాలుగు పీఠాలు స్థాపించిన తరువాత వచ్చి ఇక్కడే ఉన్నారు అని చెబుతారు. కాని శారదా పీఠాన్ని అధిష్టించిన తరువాత శంకరుడు కేదారం వెళ్ళి దత్తాత్రేయుడి గుహలో అదృశ్యమైనాడని శంకర విజయం చెబుతోంది.

ఏది ఏమైనప్పటికీ, 'చంద్రశేఖరేంద్ర సరస్వతి' అధిష్టించిన పీఠమది. ధర్మనిరతికి ప్రసిద్ధి చెందింది. కాబట్టి కంచి పీఠాన్ని కూడా గౌరవించాల్సిందే.

ఆ తరువాత కొన్ని క్రొత్త పీఠాలు వెలిశాయి. వీటి శాఖలు కూడా దేశం అంతటా విస్తరించాయి. ఈ పీఠాలు, మఠాలు అర్హులైన వారికి సన్యాసం ఇస్తుంటాయి. సన్యసించిన వారు ధర్మాన్ని బోధిస్తూ అలానే ఉండిపోవాలి. ఈ పీఠాలు నేను, మీరు ఎవరైనా స్థాపించవచ్చు. దీనికి నియమ నిబంధనలు ఏవీలేవు. ఈ మధ్యనే ఒక పీఠాధిపతి **"నాకు ఆత్మసాక్షాత్కారం అయి ఆరు సంవత్సరాలయింది. రూ. 1,116 తీసుకుని ఇప్పటివరకు పదివేల మందికి శక్తిపాతం ఇచ్చాను."** అని బహిరంగంగా టి.వి.లో చెప్పారు. ఆత్మసాక్షాత్కారము అంటే చరాచర జగత్తంతా జగత్తంతా పరమేశ్వర స్వరూపము. అదే నేను. అని తెలియటం. శక్తిపాతము అంటే మంత్రోపదేశం చేసి, కొంత కాలం శిష్యుడు ఆ మంత్రజపం చేసిన తరువాత, అతణ్ణి ఉన్నత స్థితికి చేర్చటానికి గురువుగారు తనలోని కొంత శక్తిని శిష్యుడికి ధారపోసి, అతణ్ణి తనంతటి వాడుగా చేస్తాడు. రామకృష్ణ పరమహంస తన శిష్యుడైన వివేకానందుడికి శక్తిపాతం ఇచ్చినప్పుడు వివేకానందుడి స్థితి మీరు చదివే ఉంటారు. ఇక్కడ ఆత్మసాక్షాత్కారానికి, శక్తిపాతానికి అర్థం వారికే తెలియాలి.

కేవలము ధనార్జన కోసమే కొన్ని పీఠాలు ఏర్పాటవుతున్నాయి. వారివల్లనే సన్యాసాశ్రమానికి చెడ్డపేరు వస్తోంది. సన్యాసానికి వీరు వక్రభాష్యం కూడా చెబుతున్నారు.

అందుకే వ్యాసభగవానుడు బ్రహ్మసూత్రాలలోని మూడవ అధ్యాయం నాల్గవ పాదంలోని 9,10,11,12 అధికరణలలో సన్యాసం మీద కొన్ని విషయాలకు స్పష్టత ఇస్తున్నారు.

పీఠాధిపత్యము : ఆశ్రమ స్వీకారం చేసిన వారిలో కొందరు ఆ ఆశ్రమానికి లేదా పీటానికి ఆధిపత్యం వహించాల్సి ఉంటుంది. పీఠాధిపతికి ఆశ్రమ ఆస్థిపాస్థుల మీద పూర్తి అధికారం ఉంటుంది. ఆశ్రమంలో అన్ని సౌకర్యాలు ఉంటాయి. కాబట్టి పీఠాధిపతికి సచ్ఛీలత లేకపోతే ప్రక్కదారులు పట్టే ప్రమాదం ఉంది. గతంలో ఇలాంటి సంఘటనలు కొన్ని జరిగాయని చెబుతున్నారు అనుభవజ్ఞులైన పెద్దవాళ్ళు. అక్కడ సిరిసంపదలు పుష్కలంగా ఉంటాయి కాబట్టి వాటిని అపహరించటానికి, దుర్వినియోగం చెయ్యటానికి కొంతమంది ఆషాఢభూతులు చేరతారు. వీరి నుంచి ఆశ్రమాన్ని రక్షించటం పీఠాధిపతి బాధ్యత. ఈ రకంగా అనుకోని బాధ్యతలు చుట్టుకుంటాయి. **పీఠాధిపత్యం ముళ్ళపాన్పు. కాబట్టి పీఠాధిపతులూ తస్మాత్ జాగ్రత్త అంటున్నారు పరమానందనాథులు.**

మరణించినవాడు తిరిగి జీవించటం ఎంత నిజమో, సన్యాసం రద్దు కావటం కూడా అంతే నిజం. ఒకవేళ సన్యాసం రద్దు చేశాము అంటే అది దొంగ సన్యాసం అన్నమాట. కాబట్టి సన్యాసం రద్దుకాదు. సన్యాసి తిరిగి పూర్వాశ్రమంలోకి రాకూడదు.

***సూత్రం-465 "తద్భూతస్య నాతద్భావో జైమినేరపి నియమాతద్రూపాభావేభ్యః"***

సన్యాసాశ్రమంలో ఉన్నవాడు మళ్ళీ వచ్చి గృహస్థాశ్రమం స్వీకరించరాదు. ఆశ్రమ భ్రంశం పనికి రాదు. గురువు అనుజ్ఞ పొందిన నాలుగు ఆశ్రమాలలో ఏదో ఒకదానిని గ్రహించి, మరణకాలం వరకు ధర్మపరుడై ఆ ఆశ్రమాన్నే ఆశ్రయించి ఉండాలి.

బ్రహ్మచర్యం నుండి గృహస్థాశ్రమానికి రావాలి అని శ్రుతులు చెబుతుండగా, బ్రహ్మచర్యం నుండి ఒక్కసారిగా సన్యాసాశ్రమం స్వీకరించవచ్చని కొన్ని శ్రుతులు చెబుతున్నాయి. అంతేకాని సన్యాసాశ్రమం నుంచి క్రిందికి రావచ్చని ఎక్కడా చెప్పడంలేదు.

చతురాశ్రమాల్లోను ఒకదాన్నుంచి ఒకటిపైకి వెళ్ళాలి. బ్రహ్మచర్యం నుండి గృహస్థాశ్రమం, దాన్నుంచి వానప్రస్థం, దాన్నుంచి సన్యాసము. ఇలా ఒక్కొక్క మెట్టే

పైకి ఎదగాలి. అర్హత ఉంటే బ్రహ్మచర్యం నుంచి సరాసరి సన్యాసం స్వీకరించవచ్చు. అంతేకాని క్రిందికి దిగటం ఉండదు. గృహస్థు భార్యని వదిలేశాడు. లేదా ఆమె మరనించింది. అప్పుడు అతడు ఇంకొక వివాహం చేసుకోవచ్చు. అంతేకాని భార్య లేనంత మాత్రంచేత బ్రహ్మచారి మాత్రం కాడు. కొన్ని సందర్భాలలో గృహస్తు కూడా విద్యని అభ్యసించవచ్చు. అంత మాత్రంచేత అతను బ్రహ్మచారి కాడు. ఒక్క సన్యాసమే కాదు. ఏ ఆశ్రమం నుంచీ కూడా వెనక్కి రావటమనేది ఉండదు అని నొక్కి వక్కాణిస్తున్నారు **పరమానందనాథులు.**

శిష్యులైన వారెవ్వరూ అలా చెయ్యలేదు. సన్యాసాశ్రమాన్నే అంగీకరించని జైమిని కూడా ఇందుకు ఒప్పుకోలేదు.

అందుకనే వివాహం చేసుకుని, కోరికలన్నీ తీరిన తరువాతనే సన్యాసం స్వీకరించాలి. ఒకవేళ సన్యాసిగనకపతనమైతే, అథోగతిపాలవుతాడని **ఈశావాస్యోపనిషత్తు**లో చెప్పబడింది. అలాగే శుకమహర్షికి జనకమహారాజు కూడా బోధించాడు.

ఉత్సాహం కొద్దీ సన్యసించాక, ఇంటి దగ్గర వాళ్ళు ఒప్పుకోకపోతే ఆ సన్యాసం రద్దు చేసుకోవచ్చా? సన్యసించటం అంటే ఈ జీవితాన్ని ఇక్కడ పూర్తిచెయ్యటం, మళ్ళీ కొత్తజన్మ ఎత్తటం. మరణించినవాడు పునర్జీవితుడు కావటం మనం చూడం కదా? మరి అలాంటప్పుడు వచ్చినవాడు మళ్ళీ ఎలా బ్రతికి వస్తాడు? సన్యాసం ఎలా రద్దు చేసుకుంటాడు? ఇక చతురాశ్రమాలలోను ఒకదాన్నుంచి రెండవ దానికి వెళ్ళటమే కాని వెనక్కి రావటం ఉండదు. గృహస్థాశ్రమము లేదా వానప్రస్థం నుంచి సన్యాసానికి వెళ్ళావు. మళ్ళీ వెనక్కి రావటం ఎలా జరుగుతుంది? అక్కడకి వెళ్ళిన తరువాత నాకు సన్యాసం నచ్చలేదు అనటానికి లేదు. ఇటువంటి పరిస్థితులు వస్తాయనే **'జ్ఞానవైరాగ్యాలు రానిదే సన్యాసాశ్రమం తీసుకోవద్దు'** అని చెప్పేది.

ఆతుర సన్యాసం తీసుకున్న వారు కొంతమంది మళ్ళీ గృహస్థులుగానే ఉన్నారు కదా ? దీనికి సమాధానం మనం చెప్పలేం. ఇది శాస్త్రసమ్మతం కాదు. ఆధునిక యుగంలో అనే పద్ధతులున్నాయి. ఉదాహరణకి వేదంలోను, స్మార్తంలోను వివాహానికి మంత్రాలున్నాయి. విడాకులకు లేవు. కాని ఆధునిక చట్టం విడాకులను ఒప్పుకుంటోంది. అలాగే శాస్త్రానికి ఏమైనా మార్పులు చేర్పులు జరిగాయేమో

తెలియదు. నాకు తెలిసినంతవరకు ఏ రకమైన సన్యాసమైనా తీసుకున్న తరువాత శాస్త్రప్రకారం రద్దుచెయ్యటం జరగదు. మీకు ఇష్టమయితేనే సన్యసించండి. ఇదేమీ చిన్నపిల్లల ఆటకాదు. **చచ్చిపోయినవాడు మళ్ళీ బ్రతకటం ఎంత నిజమో, సన్యాసం రద్దు చెయ్యవచ్చు అనేది కూడా అంతే నిజం. విపరీత వ్యాఖ్యానాలు చేసి శాస్త్రాన్ని భ్రష్టు పట్టించకండి. వ్యవస్థను పాడు చెయ్యకండి. సంప్రదాయాన్ని తగులపెట్టకండి. అని చేతులు జోడించి ప్రార్థిస్తున్నారు పరమానందనాథులు.**

## 11. అధికారాధికరణము (సన్యాసభ్రష్టులకు ప్రాయశ్చిత్తం)

ఈ విషయం పదకొండవదైన **అధికారాధికరణము**లో వివరించారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

సాధారణ బ్రహ్మచారిని 'ఉపకుర్వాణులు' అంటారు. జీవితాంతం బ్రహ్మచర్యం వహించేవాడు నైష్ఠిక బ్రహ్మచారి. నైష్ఠిక బ్రహ్మచారి, వానప్రస్తుడు, సన్యాసి వీరు ఊర్ధ్వరేతస్కులు వీరికి ఆశ్రమభ్రంశం పనికిరాదు. భ్రష్టులైనవారు చేసే కర్మలు విద్యాహేతువులు కావు. మరి ఇలా భ్రష్టులైన వారికి ప్రాయశ్చిత్తము ఏదైనా ఉన్నదా?

మొన్నటిరోజున ఒకాయన నా దగ్గరకు వచ్చి "ఓంకారాన్ని ఉపాసన చేస్తే బ్రహ్మలోకప్రాప్తి జరుగుతుంది అన్నారు నిజమేనా?" అని అడిగాడు. 'బ్రహ్మలోకప్రాప్తి' అంటే మోక్షమన్నమాట. ఇది ఆర్యోక్తి. ఇలాటి మాటలు చాలా ఉన్నాయి. "ఉత్తరాయణంలో ఉరేసుకుని చచ్చినా పుణ్యమే" అన్నారు. ఉత్తరాయణం అంటే ? సంవత్సరాన్ని రెండు భాగాలుగా చేశారు. ఒకటి ఉత్తరాయణం. రెండవది దక్షిణాయనం. అయనము అంటే మార్గము అని అర్థం. సూర్యుడు ఉత్తరదిశగా ఆరు నెలలు, దక్షిణ దిశగా ఆరు నెలలు ప్రయాణం చేస్తాడు. వీటినే ఉత్తరాయణము, దక్షిణాయనము అంటారు. ఉత్తరాయణం జనవరి 14 నుంచి జులై 13 వరకు, దక్షిణాయనం జులై 14 నుంచి జనవరి 13 దాకా ఉంటాయి. ఉత్తరాయణంలో అంటే జనవరి 14 నుంచి జులై 13 వరకు పరమపుణ్యకాలమని ఆ కాలంలో మరణించిన వారు స్వర్గలోకానికి పోతారని చెబుతుంటారు. కాని నిజంగా చెప్పాలంటే ఇవి దేవయాన పిత్రుయానాలు. వీటిలో దేవయానాన్నే ఉత్తరాయణము అంటారు. ఈ మార్గంగుండా పోయిన వారు బ్రహ్మలోకం చేరతారు. వారికి పునర్జన్మ ఉండదు.

పిత్రుయానం గుండా వెళ్ళినవారు స్వర్గసుఖాలనుభవించి కర్మశేషం అనుభవించటానికి మళ్ళీ భూలోకంలో జన్మిస్తారు. అయితే రెండుచోట్లా 'ఉత్తరాయణ'ము అనే పేరు వచ్చింది. కాబట్టి, ఉత్తరాయణ మార్గంలో ప్రయాణించిన వారు తిరిగి జన్మించరు కాబట్టి, ఈ రెండింటినీ కలిపి 'ఉత్తరాయణంలో ఉరేసుకుని చచ్చినా పుణ్యమేను' అన్నారు. ఎందుకంటే ఉత్తరాయణ మార్గంలో ప్రయాణించటం చాలా కష్టం కాబట్టి, ఆ మార్గంలో ప్రయాణించటమే అదృష్టంగా భావించి ఈ మాట చెబుతారు. అలాగే ఓంకారోపాసన చేసినవాడు మోక్షం పొందుతాడు అనే మాటకూడా.

ఇక్కడ ఇంకొక విషయం ఏమంటే సన్యాసాశ్రమానికి ఫలితం – మోక్షం. అంతే కాని **సన్యాసం తీసుకుంటే మోక్షం వస్తుందని ఎక్కడా చెప్పలేదు.** ఒకవేళ అదే నిజమయితే మోక్షం పొందాలనుకునే వారందరూ సన్యాసం స్వీకరిస్తే సరిపోతుంది. భౌతిక సన్యాసంవల్ల మోక్షంరాదు. కాషాయబట్ట కట్టినంత మాత్రంచేత సన్యాసికాడు. కాశీలో మరణించిన వారందరికీ ముక్తి లభిస్తుందా? అంటే లభించదు అని ఖచ్చితంగా చెప్పాలి. ఒకవేళ ఇదే నిజమైతే కాశీనగరంలో మనం నుంచోటానికి కూడా చోటుండదు. దేశం మొత్తం మీద తొంభైశాతం మరణాలు కాశీలోనే ఉంటాయి. నేతిబీరకాయలో నెయ్యి ఎంత ఉన్నదో, ఈ మాటలలో నిజంకూడా అంతే. మానసిక సన్యాసము అంటే **జ్ఞానవైరాగ్యాలు. ఈ రెండూ ఉన్నవాడు కాషాయం కట్టకపోయినా, ఆశ్రమస్వీకారం చెయ్యకపోయినా ముక్తిపొందుతాడు.** ఆత్మజ్ఞానం కోసం అన్వేషించిన వాడే బ్రాహ్మణుడు. అతడే ముక్తి పొందుతాడు. యజ్ఞయాగాది కర్మలు, పూజలు, వ్రతాలు, స్తోత్రాలు, పారాయణలు అన్నీ పామరుల కోసం. ఇవి స్వర్గానికి తీసుకుపోతాయి.

ఈ జగత్తులో ఈషణత్రయంకన్న సంసారము వేరేలేదు. 1. ధనేషణ 2. దారేషణ 3. పుత్రేషణ. వీటిని ఈషణత్రయము అంటారు. ఈషణ అంటే కోరిక, ఆశ అని అర్థం. కోరికలు మూడు రకాలు.

1. పుత్రులను పొందటం ద్వారా ఉత్తమలోకాలకు పోవాలి అనుకోవటం. ఇదే **పుత్రేషణ.**

**కొడుకుల్ పుట్టరటంచు ఏడ్తురు అవివేకుల్ జీవన భ్రాంతులై**
**కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రునకనేకుల్ వారిచే ఏ గతుల్**
**బడసెన్? పుత్రులు లేని ఆశుకునకున్ వాటిల్లెనే దుర్గతుల్**
**చెడునే మోక్షపదంబు అపుత్రునకున్ శ్రీకాళహస్తీశ్వరా ?**

అంటాడు ధూర్జటి **శ్రీకాళహస్తీశ్వర మహత్యం**లో పుత్రులు లేకపోతే పున్నామ నరకం వస్తుందని, ఉత్తమ గతులు ప్రాప్తించవని చెబుతుంటారు. అసలు సంతానమే లేని శుకుడు మోక్షం పొందలేదా? నూర్గురు కొడుకులున్న ధృతరాష్ట్రుని గతి ఏమయింది? పుత్రసంతానం కావాలనుకోవటం కేవలము వంశాభివృద్ధి కోసమే. ఈ విషయాన్ని గుర్తించాలి అంటున్నారు **పరమానంద నాథులు**.

2. వివాహం చేసుకుని భార్యద్వారా సంతానం పొందాలి అనుకోవటం. ఇదే **దారేషణ.**

3. భార్యాబిడ్డలని పోషించటానికి ధనం కావాలి. కాబట్టి ధనం సంపాదించాలనే కోరిక. ఇది **ధనేషణ.** కర్మ చెయ్యటానికి కూడా ధనం కావాలి.

ఈ కోరికలు తీర్చుకోవటానికే మానవుడు సంసారి అవుతున్నాడు. **'కౌపీన సంరక్షణార్థం'** అన్నట్లుగా. కాబట్టి మోక్షం పొందాలనుకున్నవాడు అమితమైన సాధన చేసి జ్ఞానవైరాగ్యాలు అలవరచుకోవాలి. ఆత్మవిచారణ ద్వారా తాను బ్రహ్మ కావాలి. పరబ్రహ్మతత్వాన్ని పూర్తిగాతెలుసుకున్న వాడే బ్రహ్మఅవుతాడు. **బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి.** అయితే బ్రహ్మవిచారణ చెయ్యటానికి ఈషణ అంటే కోరిక ప్రతిబంధకమవుతుంది. కాబట్టి ముందుగా ఈషణలను (కోరికలను) చంపాలి. వాటినుంచి విముక్తిపొందాలి. ఈకోరికలను జయించాలంటే ఆత్మవిచారణ చెయ్యాలి. దీనికి అభ్యాసము, సాధన ముఖ్యము. వేదాంతవిచారణ వల్లనే ముక్తి లభిస్తుంది. ఆత్మవిచారణ చెయ్యాలంటే కోరికలునశించాలి. ఇలా కోరికలు నశించినవాడు సాక్షాత్తు బ్రహ్మఅవుతాడు.

మనం ఏ పనిచేసినా దానివల్ల ఫలితం వస్తుంది. ఆ ఫలితం కొంత కాలమే ఉంటుంది. ఆ తరువాత క్షీణించి పోతుంది. కర్మలు చెయ్యటంవల్ల పుణ్యఫలం వస్తుంది. ఆ పుణ్యఫలం కొంత కాలం తరువాత ఉండదు. అప్పుడు ఆ జీవి తిరిగి భూలోకంలో జన్మిస్తుంది. కాని బ్రహ్మవిద్య విచారణఫలం అలాకాదు. అది క్షీణించదు. అమృతం వంటిది. దీనివల్లనే మానవుడు ముక్తిపొందుతాడు.

ఇక్కడ అనుమానం ఏమంటే ఈ పనులన్నీ గృహస్థాశ్రమంలో లేదా వానప్రస్థంలో ఉండి చెయ్యవచ్చు కదా ? సన్యసించటం ఎందుకు?

మనం చాలా జాగ్రత్తగా గుర్తించాల్సిన విషయం ఏమంటే ప్రతిఆశ్రమంలోను కొన్ని ధర్మాలుంటాయి. వాటిని తప్పనిసరిగా పాటించాలి. సన్యాసాశ్రమానికి కూడా కొన్ని నియమాలు ఉన్నాయి. సన్యసించినవాడు ఆ నియమాలు, ధర్మాలు తప్పనిసరిగా పాటించితీరాలి. వాటిలో చాలా ముఖ్యమైనవి.

1. జ్ఞానవైరాగ్యాలు కలిగి ఉండటం.
2. ఎవరితోను ముఖ్యంగా కుటుంబ సభ్యులతో సంబంధ బాంధవ్యాలు లేకుండా ఉండటం.

ఒక పెద్ద పీఠంలో కార్యనిర్వహణాధికారి ఆ పీఠాధిపతి తమ్ముడే. ఇంకొక చోట పీఠాధిపతి బంధువులే పీఠ నిర్వహణ చూస్తుంటారు. ఇంకొక చోట పీఠాధిపతి మేనల్లుడే ఉత్తరాధికారి. ఇంకొక చోట పీఠాధిపతి కుటుంబ సభ్యులే పీఠనిర్వాహకులు.

పీఠాధిపతులకు ఈ రకమైన బాంధవ్యాలు ఉండరాదు. కాని నిర్వహణలో ఇతరులను నమ్మలేము కాబట్టి ఇలాంటివి తప్పవు.

3. కేవలం పొట్టనింపుకోటానికే బిక్షాటన చెయ్యటం.
4. దేహాభిమానం లేకుండా, శరీరాన్ని శవంలాగా చూడటం.
5. ఉన్నచోట ఉండకుండా, నిరంతరము పరిభ్రమిస్తూ సత్యాన్వేషణలోనే కాలం గడపటం.

ఈ మధ్యన ఒక సన్యాసిని కలిశాను. బాగాచదువుకున్నవాడు. పూర్వాశ్రమంలో వేదపండితుడు. అంతే కాకుండా వేదాంతంకూడా బాగాతెలిసినవాడు. ఉపనిషత్తుల గురించి అనర్గళంగా మాట్లాడగలడు. బ్రహ్మవిద్యగురించి బాగాతెలిసినవాడు. చాలా మంచిసన్యాసి. అయితే భార్యాపిల్లలతో సత్సంబంధాలున్నాయి. ఈ మాట తెలిసి అవాక్కైయ్యాను. ఇది ఏ రకమైన సన్యాసం? అసలు సన్యాస ధర్మాలకే విరుద్ధం కదా? ఇంకో విషయం ఏమంటే ఆయనపేర బ్యాంకుఎకౌంటు కూడా ఉంది. అందులో కొన్ని లక్షలు డబ్బుకూడా ఉంది. వీటిని గురించి అడిగినప్పుడు ఆయన చెప్పిన సమాధానం ఇంకా ఆశ్చర్యం గొలిపింది.

"జీవితంలో ఏదైనా తప్పు చేస్తే, దానికి ప్రాయశ్చిత్తం చెప్పింది శాస్త్రం. ప్రాయశ్చిత్తం చేసుకున్న వాడికి పాపం ప్రక్షాళనమై పోతుందని గతంలో మనం చెప్పుకున్నాం. కూశ్మాండ హోమం చేస్తే, పాపాలన్నీ పోతాయి. గతంలో విదేశాలకు

పోయిన వారిని, తినరాని పదార్థాలు తిన్నవారిని పీకలోతు పేడగోతిలో పాతిపెట్టి, మంత్రాలు చెబుతూ దర్భపుల్ల కాల్చి నాలుకమీద వాతపెట్టేవారు. ఈ రకమైన ప్రాయశ్చిత్తం మా తాతగారు జొన్నవిత్తుల పద్మనాభంగారికి చేశారట కూడా. కాబట్టి సన్యాసికి కూడా ఏవైనా పొరపాట్లు చేస్తే ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చు అని ఆయన వాదన. అంతేకాదు నిరంతరం ఉపనిషత్తులు పారాయణ చేసేవారికి పాపాలు అంటవు. బ్రహ్మవిద్య విచారణ చేసేవాడు పాపాలు చేసినా అవి నిప్పులో పడిన దూదిలాగా భస్మమై పోతాయి. కాబట్టి తాను పాపాలు, తప్పులు చేసినా పవిత్రుడే" ఇది సమాధానం.

ఇదంతా పచ్చి అబద్ధం. ఆత్మవంచన, ఏ ఆశ్రమంలో తప్పులు చేసినా ప్రాయశ్చిత్తం ఉన్న మాట నిజమే. కాని అది సన్యాసాశ్రమానికి వర్తించదు. సన్యాసికి ప్రాయశ్చిత్తం లేదు. అసలునిన్ను సన్యాసంతీసుకోమని ఎవరూబలవంతం చెయ్యలేదు. సన్యసించకుండా కుటుంబంతో కలిసి ఉంటూనే బ్రహ్మవిద్యా విచారణ చెయ్యవచ్చు. నిరంతరం ఉపనిషత్తులు చదువుకోవచ్చు. ఈపని చెయ్యటానికి సన్యాసం అవసరం లేదు. ఈషణత్రయాన్ని జయించినవాడే సన్యసించాలి. నీకు ధనంమీద కోరికఉంది. కుటుంబంమీద అభిమానంఉంది. అలాంటప్పుడు సన్యాసం ఎందుకు? ఎవరికోసం? సన్యాసమంటేనే జ్ఞానవైరాగ్యాలు. అవి లేనివారికి సన్యాసం దేనికి? కాషాయం మీద మోజు ఉంటే ప్రతిరోజుఇంట్లో అవేబట్టలు కట్టుకోండి. మీగృహంలో ఉంటూనే సన్యాసిలాజీవించండి. మీరు ఉన్నతమైన స్థితిలో ఉన్నారని అందరూ మెచ్చుకుంటారుకూడా. అంతేకాని బలవంతపుబ్రాహ్మణార్థంవద్దు. ధర్మాలు, నియమాలు పాటించగలిగితేనే సన్యసించండి. అంతేకాని **సన్యసించిన తరువాత, సన్యాసిధర్మాలకు విరుద్ధంగా ప్రవర్తించి సన్యాసానికి చెడ్డపేరుతేవద్దు అని వినమ్రంగా ప్రార్థిస్తూ సంప్రదాయం నాశనం చెయ్యద్దు. సన్యాసికి ప్రాయశ్చిత్తం లేదు. తప్పులు చేసిన సన్యాసి రౌరవాది నరకాలు పట్టిపోతాడు. లోకంలో అవమానం కూడా పొందుతాడు. కాబట్టి తస్మాత్ జాగ్రత్త. అనికూడా హెచ్చరిస్తున్నారు పరమానందనాథులు.**

సన్యాసి అనగానే అతనికి ఏవో గొప్ప సిద్ధులు ఉంటాయని, గుప్పెటమూసి తెరవగానే చేతులోంచి బంగారుగొలుసులు, ఉంగరాలు వస్తాయని చాలా నమ్మకాలుంటాయి. ఇవన్నీ సిద్ధులు అంటారు. ఇవి అనేక విధాలుగా సంక్రమిస్తాయి.

1. పూర్వజన్మకృతం 2. తపశ్శక్తి 3. దేవతల వరాలు 4. ఓషధులు, మణులు, మంత్రాలు. వీటిలో దేనివల్లనైనా ఈ శక్తి సంక్రమించవచ్చు. ఈ శక్తి మనం బ్యాంకులో డిపాజిట్ చేసిన ధనంలాటిది. తీసి వాడేసుకుంటే అయిపోతుంది. అందుకే ఎవరూ కూడా తమకున్న శక్తుల్ని అల్పప్రయోజనాల కోసం వాడరు. ఆ రోజున విశ్వామిత్రుడు త్రిశంకుణ్ణి సశరీరంగా కైలాసానికి పంపినందుకు పదివేల సంవత్సరాలు చేసిన తపశ్శక్తి నాశనమైపోయింది. ఒక ఋషీశ్వరుడు వరం ఇచ్చాడన్నా శాపంపెట్టాడన్నా అతని తపశ్శక్తి కాస్తా కరిగిపోతుంది. పాము మనిషిని గాని, ఇతర జీవులను గాని కాటు వేసిందంటే దానిలోని విషం తగ్గిపోయి ఆహార సముపార్జన శక్తిని కోల్పోతుంది. అలాగే ఋషీశ్వరుడికి కూడా తపఃశక్తి తగ్గిపోతుంది. మేనక విషయంలో విశ్వామిత్రుడికి అలాగే జరిగింది. కాబట్టి ఉపాసకులు అవేశాన్ని అదుపులో పెట్టుకోవాలి అంటున్నారు **పరమానందనాథులు.** అయితే ఇవన్నీ 'చిన్న చిట్కాలు, హస్తలాఘవ ప్రదర్శన' అంటారు, ఆధునికులు, నాస్తికులు. అయితే ఎవరికితెలిసింది వాళ్ళుచెబుతారు. లక్ష్యం చేరుకోవటానికి భిన్నమైన మార్గాలుంటాయి. ఎవరికి నచ్చిన మార్గాన్ని వారు ఎన్నుకుంటారు. అన్నింటికీ ఒకటే మార్గం కాదు.

### ***సూత్రం - 466 "స చాధికారికమపి పతనాను మానాత్తదయోగాత్"***

నైష్ఠిక బ్రహ్మచారి గనక ఆశ్రమచ్యుతి పొందితే, అతడికి ప్రాయశ్చిత్తం లేదు. అలాగే సన్యాసాశ్రమం నుంచి చ్యుతుడైన వాడికి కూడా ప్రాయశ్చిత్తం లేదు. ఈ రకంగా ప్రాయశ్చిత్తం అనేది ఏదైనా ఉంటే, అది మామూలు బ్రహ్మచారికి మాత్రమే అంతేకాని సన్యాసికి మాత్రం కాదు అని వీరివాదన.

### ***సూత్రం - 467 "ఉపపూర్వమపి త్వేకే భావమశన వత్తదుక్తమ్"***

మామూలు బ్రహ్మచారి మధు మాంసాలు సేవిస్తే అతనికి ప్రాయశ్చిత్తమున్నది. అలాగే నైష్ఠిక బ్రహ్మచారికి కూడా ప్రాయశ్చిత్తమున్నది. ఈ విషయం పూర్వమీమాంసలో చెప్పబడ్డది.

ఒకవేళ సంభోగిస్తే దానికి ప్రాయశ్చిత్తమున్నది. గురుదారాగమనం మాత్రం మహాపాపం. దానికి ప్రాయశ్చిత్తం లేదు. పైన చెప్పినట్లుగా ప్రాయశ్చిత్తం జరిగినా, వారితో సత్పురుషులు కలిసి ఉండరు. అంటే వారిని వెలివేస్తారు.

వానప్రస్త, పరివ్రాజకులకు కూడా ప్రాయశ్చిత్తమున్నది అంటాడు జైమిని. దీక్షాలోపం గనక చేస్తే వానప్రస్తుడికి, సన్యాసికి కూడా ప్రాయశ్చిత్తమున్నది. వారు 'కృచ్ఛ్రవ్రతం' చెయ్యాలి. అంటే సోమలతమినహా, మిగిలిన చెట్లు, చేమలకు నీరు పోసిపెంచాలి. శాస్త్రవిహితమైన ప్రాణాయామాదులు కూడ చెయ్యాలి. ఈ రకంగా ఊర్ధ్వరేతస్కులకు (సన్యాసి, వానప్రస్తుడు) కూడా ప్రాయశ్చిత్తం ఉన్నది.

## 12. బహిరధికరణము (భ్రష్టుడైన నైష్టికుడికి సంఘ బహిష్కారము)

ఇటువంటి వాడికి ప్రాయశ్చిత్తం ఏమిటనే విషయం పన్నెండవదైన **బహిరధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో ఒకటే సూత్రమున్నది.

ఈ రకంగా భ్రష్టుడైనటువంటి నైష్ఠికునికి సంఘ బహిష్కారమున్నదా? వారికి ప్రాయశ్చిత్తం జరిగింది కదా?

***సూత్రం - 468 "బహిస్తూభయథాపి స్మృతేరా చారాచ్చ"***

ఊర్ధ్వరేతస్కులు పతనం కావటం రెండు రకాలుగా జరుగుతుంది. 1.ఉపపాతకము 2. మహాపాతకము. కాని వారు ఏ రకంగా పతనమైనప్పటికీ బహిష్కరింపతగిన వారే.

పతనమైన యతీశ్వరులు ప్రాయశ్చిత్తం పొందినప్పటికీ సదాచారులు వారితో కలవరు. అంటే వారు బహిష్కృతులు. ఉత్తమాశ్రమం నుంచి పతనమైన వారు అంటే తన సంఘాన్ని విడిచి పరజాతితో కలిసినవాడు, ఉరి వేసుకున్నవాడు, ఇలాంటి వారికి రెండు రకాల పాపాలు కలుగుతాయి. 1. ఈ లోకంలో అశుద్ధి 2. పరలోకంలో అశుద్ధి వీరు చాంద్రాయణాది వ్రతాలు చేసినందువల్ల, రెండవ దోషం పోతుంది. కాని మొదటిది పోదు. అందువల్ల వీరు శిష్టులతో ఆహార వ్యవహారములకు పనికి రారు.

## 13. స్వామ్యధికరణము (ఉద్గీథాది ఉపాసనలకు కర్త ఋత్విక్కే)

ఈ విషయం పదమూడవదైన **స్వామ్యధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

కర్మాంగ ఉపాసనలను ఆచరించవలసినది ఋత్విక్కా? లేక యజమానా?

***సూత్రం - 469 "స్వామినః ఫలశ్రుతేరిత్యాత్రేయః"***

కర్మాంగోపాసనల కర్త యజమానే అని ఆత్రేయుని వాదము. ఉద్గీథాది కర్మాంగోపాసనలలో కర్త యజమానే. ఉపనిషత్తులలో చెప్పిన దానిని బట్టి కర్తకే ఫలం లభిస్తుంది. కాబట్టి ఉపాసనలకు కూడా కర్తే యజమాని అని వీరి వాదన.

***సూత్రం - 470 "ఆర్త్విజ్యమిత్యౌడులోమిస్తస్మైహి పరిక్రీయతే"***

ఈ ఉపాసనలకు కర్తే యజమాని అని ఔడులోమి అనే ఆచార్యుడు కూడా అంటున్నాడు.

యజమానికి ఫలం సంపాదించి పెట్టటం కోసం దక్షిణ ఇచ్చి ఋత్విక్కును కొన్నాడు. అక్కడ చేసేది ఋత్విక్కే కాని ఆ ఫలితాన్ని అతడు యజమానికి సంక్రమింప చేస్తాడు అంటాడు ఔడులోమి.

***సూత్రం - 471 "శ్రుతేశ్చ"***

శ్రుతులలో ఋత్విక్కు చేసిన ఉపాసన ఫలం యజమానికి చెందటం గురించి వివరించారు.

యజ్ఞం చేసేటప్పుడు ఋత్విక్కు కోరే కోరికలన్నీ యజమాని కోసమే. కాని దీనివల్ల వచ్చే ఫలితం యజమానిది. కాబట్టి ఉపాసనలకు కర్త ఋత్విక్కే.

## 14. సహకార్యంతర విద్యాధికరణము (మౌనము విధి)

పాండిత్యంతోపాటు మౌనం కూడా విధే అంటున్నారు. పద్నాల్గవదైన **సహకార్యంతరవిద్యాధికరణము**లో. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

సన్యాసి, యతీశ్వరుడు, మోక్షగామి ఎప్పుడూ మౌనంగానే ఉంటారు. ఎవరితోను మాట్లాడటానికి ఇష్టపడరు. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపం. తాను పరమేశ్వరుడు. ఎదుటి వ్యక్తి పరమేశ్వరుడే. అందుచేత తాను ఎవరితో మాట్లాడినా తనతో తాను మాట్లాడుకున్నట్లే. ఈ కారణం చేతనే అతడు ఎవరితోను మాట్లాడడు.

సన్యాసి ఎప్పుడూ ఒంటరిగానే ఉండాలి. ఇద్దరుంటే కబుర్లాడుకుంటారు. ముగ్గురయితే ఊళ్ళో విషయాలు, ముచ్చట్లు చెప్పుకుంటారు. అంతకన్న ఎక్కువ మంది ఉంటే వారి మధ్య రాగద్వేషాలు పెరుగుతాయి. బంధాలు పెరుగుతాయి.

ఎట్టి పరిస్థితిలోను సన్యాసి స్త్రీని దగ్గరకు రానివ్వరాదు. స్త్రీల గురించి ఆలోచించరాదు. అది పతన హేతువు. స్త్రీ విషయంలో సన్యాసికి వయసుతో నిమిత్తం లేదు. ఎంత వయోవృద్ధుడినైనా స్త్రీ సమూలంగా కదలించి వేస్తుంది. కాబట్టి సన్యాసులూ స్త్రీలపట్ల జాగ్రత్త వహించండి. అని హెచ్చరిస్తున్నారు పరమానందనాథులు. అందుకే సన్యాసి మౌనంగా ఒంటరిగా ఉంటూ నిరంతరము పరమాత్మ ధ్యానంలోనే కాలం గడపాలి. ఒకవేళ ఎప్పుడైనా నోరు తెరిస్తే **నారాయణ నారాయణ** అనే శబ్దం మాత్రమే రావాలి.

"బృహదారణ్యకంలో" పరబ్రహ్మను తెలుసుకున్నవాడు పరమసుఖాన్ని, బ్రహ్మభావాన్ని పొందుతాడు. కాబట్టి బ్రాహ్మణుడైనవాడు, బ్రహ్మను గురించి తెలుసుకోవాలనుకునేవాడు మొదటగా శాస్త్రపరిజ్ఞానం సంపాదించాలి. తరువాత దాన్ని దృఢపరచుకోటానికి మననం చెయ్యాలి. ఆ తరువాత మౌనంగా ధ్యానం చెయ్యాలి. అప్పుడు అతడు బ్రహ్మవేత్త అవుతాడు" అని చెప్పబడింది.

ఇక్కడ శాస్త్రజ్ఞానంతోపాటు మౌనం కూడా చెప్పబడింది. కాబట్టి మౌనము కూడా విధేనా?

***సూత్రం - 472 "సహకార్యన్తరవిధిః పక్షేణ తృతీయం తద్వతో విద్యాదివత్"***

విద్యకు సహకారి మౌనం. శ్రవణాది సాధనంలో మూడవవిధి ధ్యానం. ఇది మౌనంగా జరగాలి. అది విధి అని చెప్పబడింది.

ఇక్కడ పాండిత్యం అంటే శ్రవణం. బాల్యమంటే మననం. అత్యంత సూక్ష్మమైన బ్రహ్మతత్త్వ సాధనకు బ్రహ్మధ్యానం కావాలి. ఆ ధ్యానానికి నియమాలు అవసరం లేదు. భిక్షాటనలో కూడా చెయ్యవచ్చు అయితే ప్రధానమైన బ్రహ్మవిద్యకు ఈ మౌనమే సహకారి.

ఈ రకంగా సన్యాసాశ్రమం ఉత్తమోత్తమమైనది కాగా **ఛాందోగ్యోపనిషత్తు**లో గృహస్థాశ్రమ ధర్మాన్ని చెప్పి "ఈ విధంగా జీవితాంతం ఆచరించిన వారికి బ్రహ్మలోకం కలుగుతుంది" అని చెప్పారు. ఇలా చెప్పటంవల్ల గృహస్థాశ్రమానికి మించి ఇంక ఏ ఇతర ఆశ్రమమూ లేదు. అని వారి వాదన.

***సూత్రం - 473 "కృత్స్నభావాత్తు గృహిణోపసంహారః"***

గృహస్థాశ్రమం చెప్పటంవల్ల ఇబ్బంది ఏదీ లేదు. గృహస్థుకు యజ్ఞయాగాదులే కాదు. శమదమాదులు కూడా కావాలి. అతడికి స్వర్గసుఖాలు కావాలనుకుంటే

యజ్ఞయాగాదులు చేసి వాటిని పొందవచ్చు. మోక్షం కావాలనుకుంటే బ్రహ్మజ్ఞాన సిద్ధి పొందవచ్చు. కాబట్టి గృహస్థాశ్రమము శ్రేష్ఠము. అంత మాత్రం చేత సన్యాసాశ్రమం లేదని మాత్రం కాదు.

***సూత్రం - 474 "మౌనవదితరేషామప్యుపదేశాత్"***

గృహస్థ, సన్యాసాశ్రమాలు శ్రుతి సమ్మతాలు అలాగే వానప్రస్థ సన్యాసాశ్రమాలు కూడా సమ్మతాలే మొత్తంమీద నాలుగు ఆశ్రమధర్మాలు అనుష్ఠింపదగినవే. ఈ రకంగా పాండిత్య బాల్యాలతోపాటు మౌనం కూడా విధే.

## 15. అనావిష్కారాధికరణము

## (బాల్యమంటే రాగద్వేషాలు లేని నిర్మల భావన)

ఈ విషయం పదిహేనవదైన **అనావిష్కారాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో ఒకే సూత్రమున్నది.

బాల్యము అంటే చిన్నతనము అనా? చిన్నపిల్లలు చేసే పనులు అనా? దంభము, దర్పము తెలియని స్థితా? వీటిలో ఏ అర్థాన్ని తీసుకోవాలి?

***సూత్రం - 475 "అనావిష్కుర్వన్నన్వయాత్"***

బాల్యము అంటే తన జ్ఞానాదుల్ని ప్రజలకు వ్యక్తం చెయ్యకుండా కేవలము పవిత్రభావం కలిగిఉండటము అంటే బాలకుడు ఇంద్రియ ప్రాబల్యం లేనివాడు. దంభము దర్పము లేకుండా నిర్మల స్వభావం కలవాడు.

## 16. ఐహికాధికరణము (జ్ఞానం ఈ జన్మలోనే కలుగుతుంది)

సాధకుడికి జ్ఞానం ఈ జన్మలోనే కలుగుతుందా? అనే విషయాన్ని వివరిస్తున్నారు పదహారవదైన **ఐహికాధికరణ**లో ఇందులో ఒకే సూత్రమున్నది.

జ్ఞానమనేది జన్మలోనే కలుగుతుందా?

***సూత్రం - 476 "ఐహికమప్యప్రస్తుతప్రతిషేధే తదర్శనాత్"***

శ్రవణమననాది సాధనాలకు కర్మశేషం అడ్డం కానపుడు ఈ జన్మలోనే జ్ఞానోత్పత్తి కలుగుతుంది. ఒకవేళ కర్మ ప్రతిబంధకం ఏదైనా ఉంటే మరుజన్మలో జ్ఞానం

కలుగుతుంది. వాయుదేవుడికి గర్భంలో ఉండగానే, జన్మాంతర శ్రవణం వల్ల జ్ఞానం కలిగింది. కాబట్టి ఏ అడ్డంకీ లేకపోతే ఈ జన్మలోనే జ్ఞానోత్పత్తి జరుగుతుంది.

పూర్వకాలంలో భరతుడు అనే రాజు వేదవేదాంగవిదుడు. ప్రజారంజకంగా రాజ్యపాలన చేశాడు. చివరకు రాజ్యాన్ని కుమారుడికి అప్పగించి వానప్రస్థానికి వెళ్ళాడు. అక్కడ కూడా నియమ నిష్ఠలతో భగవధ్యానంలోనే కాలం గడుపుతున్నాడు. ఒక రోజున స్నానానికి నదీ తీరానికి వెళ్ళాడు. ఆ సమయంలో ఆకాశం మేఘావృతమైంది. పెద్ద పెద్దగాలులు, ఉరుములు, మెరుపులు వస్తున్నాయి. ఎక్కడి నుంచో ఒక లేడి పరుగెత్తుకుంటూ నదీ తీరానికి వచ్చింది. అది గర్భవతి. ఆ సమయంలో ఆకాశం పెద్దగా భయంకరంగా ఉరిమింది. ఆ శబ్దానికి భయపడిన లేడి ఒక బిడ్డను ప్రసవించి మరణించింది. అది చూసిన రాజు 'అయ్యో పాపం' అనుకున్నాడు. ఆ లేడి పిల్లను వళ్ళోకి తీసుకున్నాడు. ఆశ్రమానికి తెచ్చాడు. దానికి పాలుపోసి పెంచాడు. కంటికి రెప్పలాగా కాపాడాడు. అదికూడా ఎల్లవేళలా రాజు వెనకే తిరిగేది. ఆయన ఎక్కడికి వెడితే అక్కడికి వెళ్ళేది. కూర్చుంటే ఆయన వళ్ళో తల పెట్టుకుని పడుకునేది.

సంసార బంధాలు వద్దు అని, రాజ్యాన్ని వదిలి వచ్చిన రాజుకు ఇప్పుడు మళ్ళీ రాగద్వేషాలు మొదలైనాయి.లేడి పిల్ల అంటే విపరీతమైన ప్రేమ ఏర్పడింది. కాలం గడిచిన కొద్దీ బంధాలు పెరిగాయి. రాజు పెద్దవాడవుతున్నాడు. ఒకవేళతను మరణిస్తే, ఈ లేడిపిల్ల సంగతి ఏమిటి? దీన్నే ఆలోచిస్తున్నాడు. ఇంతవరకు ఉన్న వైరాగ్యం క్రమక్రమంగా కనుమరుగైంది. దాని స్థానంలో రాగద్వేషాలు వచ్చినాయి. రాజుకు మరణకాలం ఆసన్నమైంది. ఆ సమయంలో కూడా ఈ లేడిని గురించే ఆలోచన. **మానవుడు మరణ కాలంలో దేన్ని గురించి ఆలోచిస్తే, దాన్నే పొందుతాడు.** మరుజన్మలో రాజు లేడి అయి జన్మించాడు.

రాజుకు ఈ జన్మలోనే జ్ఞానం కలగాలి. కాని అతని సాధనకు కర్మశేషం లేడి రూపంలో అడ్డమయింది. మరుజన్మలో లేడిగా జన్మించాడు. మరి ఇంతవరకు ఆయన చేసిన సాధన, సాధించిన జ్ఞానము ఏమయినాయి? అవి ఎక్కడికీ పోవు. నివురు కప్పిన నిప్పులాగా ఆయనలోనే దాగి ఉన్నాయి.

సాధన పూర్తి కాకుండా మధ్యలో మరణిస్తే, ఇంతవరకు అతడు చేసిన సాధన ఏమవుతుంది? అతనితోపాటే ఉంటుంది. ఎక్కడికీ పోదు. సమయం వచ్చినప్పుడు

బయట పడుతుంది. గురువు దగ్గర విద్య నేర్చుకుంటున్నప్పుడు, గత జన్మలో తాను సాధించినదంతా అతనికి అలవోకగా సిద్ధిస్తుంది. ఆ తరువాతనే అతడు సాధన చెయ్యాలి. భరతుడి విషయంలో కూడా అదే జరిగింది. లేడిగా జన్మించినప్పటికీ అతడికి గతజన్మలో సాధించిన జ్ఞానం ఉంది. మరుజన్మలో ఒక బ్రాహ్మణ బాలకుడిగా పుట్టాడు. అతడి పేరు భరతుడు. తలదువ్వుకునే వాడు కాదు. జుట్టంతా జడలు కట్టి పోయింది. అందుకే అందరూ అతణ్ణి జడభరతుడు అనే వాళ్ళు ఈ జన్మలో అతడికి జ్ఞానం కలిగింది.

**కాబట్టి సాధకుడు రాగద్వేషాల నుంచి బయట పడితే అతడికి ఈ జన్మలోనే జ్ఞానం కలుగుతుంది. ఒకవేళ రాగద్వేషాలు ప్రతిబంధకాలయితే, అవి నశించిన తరువాత మరుజన్మలో గాని, ఆ తరువాత గాని జ్ఞానం కలుగుతుంది.**

## 17. ముక్తిఫలాధికరణము (మోక్షం అందరికీ ఒక్కటే)

ఈ విషయం పదిహేడవదయిన **ముక్తిఫలాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో ఒకే సూత్రమున్నది.

చతుర్విధ పురుషార్థా (ధర్మార్థ కామ మోక్షాలు)లలో ఆఖరుది మోక్షము. అసలు పురుషార్థము అంటే మోక్షమే. ధర్మార్థ కామాలు మూడు, నాల్గవదైన మోక్షసాధనకు సోపానాలు. మానవుడి ధ్యేయం మోక్షమే.

జ్ఞానానికి ఫలితం ముక్తి కదా! మరి ఆ ముక్తి అందరికీ కలుగుతుందా? లేక అందులో తారతమ్యమున్నదా?

ముక్తి, మోక్షము ఇవన్నీ పర్యాయపదాలు. ముక్తి అంటే విముక్తి. సంసార బంధనాల నుంచి విడివడటం. నేను నాది అనే అహంకార మమకారాలు, రాగద్వేషాలు, అన్నింటి నుంచి బయట పడటం. వీటినుంచి విముక్తి పొందిన వారే ముక్తులవుతారు. వీరే ముక్తి పొందుతారు వీరు ముక్తి పొందరు అని ఏమీ లేదు. మరణముఅనేది అందరికీ ఎంత సమానమో, ముక్తి కూడా అందరికీ అంతే సమానం. అయితే మరణానికి అర్హత అనేది లేదు. అందరికీ వస్తుంది. కాని ముక్తి మాత్రం అర్హులకే వస్తుంది. అయితే అర్హులైన వారందరికీ స్త్రీ, పురుష భేదం లేకుండా పశువులు, పక్షులు, క్రిమికీటకాలు అన్నీ ముక్తి పొందుతాయి. **ముక్తి పొందటానికి కావలసిన అర్హత నిరాకారంలో అయితే జ్ఞానం. సాకారంలో అయితే భక్తి.** ఆ

భక్తిలో తాదాత్మ్యత, తత్పరత అనేవి ఉండాలి. వీటిలో చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే అనే భావన నిండి ఉంటుంది.

**అధ్యాత్మ రామాయణం**లో రాముడు శబరి దగ్గరకు వెళ్ళి, ఆమె ఆతిధ్యం స్వీకరిస్తాడు. అప్పుడు శబరి "ఓ రామా! ఇంత కాలంగా నేను నీకోసం ఎదురు చూస్తున్నాను. ఇప్పటికి నా గురువాక్యాలు సఫలం అయినాయి. నీ దర్శనం నా గురువులకు కూడా కలగలేదు. నేను స్త్రీని. అజ్ఞానిని. హీనజాతిలో పుట్టినదానను. నీ దాసుల, దాసుల వరుసలో నూరవతరం పొందటానికి కూడా అర్హత లేనిదాన్ని అటువంటి నేను నిన్ను దర్శించగలిగాను. రామా! మనోవాక్కులకు అందని నిన్ను ఏ రకంగా దర్శించగలిగానో కదా? దేవదేవా! నిన్ను స్తోత్రం చెయ్యటం కూడా తెలియనిదానను. నన్ను అనుగ్రహించవలసింది" అంటుంది ఆ మాటలు విన్న రాముడు.

**పుంస్త్వే స్త్రీ స్త్వేవా జాతి నామాశ్రమాదయః ।**
**నకారణం మద్భజనే భక్తిరేవహి కారణం ॥**

"ఓ శబరీ ! నన్ను భజించటానికి స్త్రీయా? పురుషుడా? వారి కులము, జాతి, మతము, పుట్టుక, ఆశ్రమము అనే భేదాలు లేవు. కావలసినది భక్తి మాత్రమే.

**యజ్ఞదాన తపోభిర్వా వేదాధ్యయన కర్మభిః**
**నైవద్రష్ట మహంశక్యో మద్భక్తి విముఖైః సదా ॥**

నా యందు భక్తి లేకుండా యజ్ఞ, దాన, తపస్సుల చేతగాని, వేదాధ్యయనము వల్ల గాని నన్ను దర్శించలేరు" అంటాడు. ఇక్కడ శబరి ముక్తిపొందింది.

**వ్యాధస్య ఆచరణం । ధృవస్య వయో । విద్యాగజేంద్రస్య కా**
**కాజాతిర్విదురస్య । యాదవపతేః ఉగ్రస్య కిం పౌరుషమ్**
**కుబ్జయాకమనీయ రూపమధికం । కింతత్సుధామ్నో ధనం**
**భక్త్యాతుష్టతి కేవలం న చ గుణైర్భక్తి ప్రియో మాధవః ॥**

ధర్మవ్యాధుడు కసాయివాడు. అతనికి ఉత్తమ ఆచరణ ఏముంది? ధృవుడి వయసెంత? గజేంద్రుడు ఏం చదువుకున్నాడు? విదురుని జాతి ఏది? దాసీపుత్రుడు కదా. యాదవరాజు ఉగ్రసేనుడికి పురుషార్థం ఏముంది? కంసుని దాసి కుబ్జకు

రూప సౌందర్యమున్నదా? కుచేలుడు భగవానుడికి సమర్పించినవి కేవలం గుప్పెడటుకులు. వీరందరికీ మాధవుడు వశమైనాడు. అంటే భగవంతుడు కేవలము భక్తికి మాత్రమే వసుడౌతాడు.

భక్తి ఉన్న వారికి ప్రత్యేకంగా ఆచారాలు, సంప్రదాయాలు అవసరం లేదు. భక్తి ఉన్నచోట మనకి తెలియకుండా సదాచారాలు సంప్రదాయాలు వచ్చి చేరతాయి. వాటికోసం ప్రత్యేకంగా ప్రయత్నం చెయ్యవలసిన అవసరం లేదు. వాల్మీకి క్రూరమైన బోయవాడు. అజామీళుడు మహాక్రూరుడు. దత్తాత్రేయుడు గురువుగా చెప్పుకునే 'పింగళ'వేశ్య. వీరంతా దుష్టస్వభావులే. కాని భక్తులయ్యేసరికి సద్గుణాలు ఆవరించి ముక్తులై పోయారు.

మనం ఇష్టంగా తినే మామిడిపండు తియ్యగా చాలా రుచిగా ఉంటుంది. అది పిందెగా ఉన్నప్పుడు–వగరుగా ఉంటుంది. కాయ అయిన తరువాత – పుల్లగా ఉంటుంది. పూర్తిగా పండిన తరువాతే దానికి తియ్యదనము, మంచి రుచి వచ్చాయి. వేపకాయ అయినా సరే పండితే తియ్యగానే ఉంటుంది. ఒకవేళ తియ్యగా రుచిగా లేదు అంటే అది సరిగా పండలేదని అర్థం. అలాగే ఎంత దుర్మార్గుడైనా పరిపూర్ణమైన భక్తి భావం ఉంటే మోక్షం పొందుతాడు.

భగవంతుని కరుణ ఉంటే జరగనిది ఏదీలేదు. అయితే మంచి గుణాలు ఉన్నవారి ప్రార్థనలు త్వరగా సిద్ధిస్తాయి.

**మూకం కరోతు వాచాలం పంగుం లంఘయతే గిరిం**

**యత్కృపదా మహం వందే**

**దేవదేవనీదు మహిమ పరుగు తీయుకుంటివాడు**

**మాత యౌను గోద్రాలే.**

కాయ పండితే అందులో గతంలో ఉన్న పులుపు, చేదు, వగరు అన్నీ పోయి తియ్యదనం వస్తుంది. అలాగే దుర్మార్గుడు సన్మార్గుడవుతాడు. ముక్తి పొందుతాడు. కాబట్టి ముక్తి ప్రత్యేకంగా కొందరికే వస్తుందనటానికి లేదు. ముక్తి పొందటానికి అందరూ అర్హులే.

**భక్తి గనక ఉన్నట్లైతే ఎవరైనా ముక్తి పొందుతారు.**

**ఏ వేదంబు పఠించెలూత, భుజగంబే శాస్త్రముల్ చదివె**

**ఏ విద్యాభ్యాసన మొనర్చె కరి, చెంచుడే మంత్రమూహించె**

కాళహస్తీశ్వరుణ్ణి అర్చించిన సాలెపురుగు ఏ వేదాలు చదవలేదు. పాము ఏ శాస్త్రాలు చదవలేదు ఏనుగు ఏం చదువుకున్నది? కన్నప్ప ఏ మంత్ర జపము చెయ్యలేదు. కాని వారందరూ ముక్తి పొందారు. కాబట్టి ముక్తి పొందటానికి స్త్రీలు, పురుషులు, పశువులు, పక్షులు, క్రిమికీటకాలు అందరూ అర్హులే. ఈ విషయం 477వ సూత్రంలో చెబుతున్నారు.

***సూత్రం-477 "ఏవం ముక్తిఫలానియమస్తదవ స్థావధృతేస్త దవస్థావధృతేః"***

బ్రహ్మసాక్షాత్కారంలో లాగానే ముక్తిఫలంలో కూడా తారతమ్యం లేదు. అన్ని ఉపనిషత్తులలోనూ మోక్షము ఒకటే.

**ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా **బ్రహ్మవేత్త సాక్షాత్తూ బ్రహ్మమే అవుతాడు.** ముక్తికి స్వరూపము పరమేశ్వరుడే. ఇతడు నిరాకారుడు, నిర్గుణుడు. బేధరహితుడు. కాబట్టి ముక్తిలో కూడా భేదాలుండవు. ముక్తి అందరికీ ఒక్కటే.

***దీంతో బ్రహ్మసూత్రాలలో మూడవ అధ్యాయం పూర్తయింది.***

# నాల్గవ అధ్యాయం

## మొదటి పాదం

ఈ అధ్యాయంలో ముక్తిని వివరిస్తున్నారు. ఇందులో పద్నాలుగు అధికరణలు. పంధొనిమిది సూత్రాలు ఉన్నాయి.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | అవృత్యధికరణము | ఆత్మధ్యానానికి ఆవృత్తి ఉంది | 2 |
| 2. | ఆత్మతత్త్వోపాసనాధికరణము | బ్రహ్మని తన ఆత్మగా భావించాలి | 1 |
| 3. | ప్రతీకాధికరణము | ప్రతీకములందు ఆత్మ బుద్ధి పనికిరాదు | 1 |
| 4. | బ్రహ్మదృష్ట్యధికరణము | కర్మాంగములందు దేవతా భావన ఉండాలి | 1 |
| 5. | ఆదిత్యాదిమత్యధికరణము | కర్మాంగము లందు దేవతా భావన ఉండాలి | 1 |
| 6. | ఆసీనాధికరణము | కూచునే ధ్యానం చెయ్యాలి | 4 |
| 7. | ఏకాగ్రతాధికరణము | మనసుకు ఏకాగ్రతే ప్రధానము | 1 |
| 8. | అప్రాయాధికరణము | మరణ పర్యంతము ధ్యానం చెయ్యాలి | 1 |
| 9. | తదధిగమాధికరణము | జ్ఞానికి గతంలో చేసిన పాపాలు అంటవు | 1 |
| 10. | ఇతర సంశ్లేషాధికరణము | జ్ఞానికి పుణ్యము అంటదు | 1 |
| 11. | అనారబ్ధాధికరణము | జీవన్ముక్తుడు | 1 |
| 12. | అగ్నిహోత్రాద్యధికరణము | నిత్యాగ్ని హోత్ర కర్మ కూడా బ్రహ్మజ్ఞానంతో నశిస్తుందా? | 2 |

| | | | |
|---|---|---|---|
| 13. | విద్యాజ్ఞానసాధనత్వాది అధికరణము | చేసిన కర్మలు జ్ఞానోత్పత్తికి ఉపయోగిస్తాయి | 1 |
| 14. | ఇతర క్షపణాధికరణము | కర్మక్షయం కాగానే బ్రహ్మవేత్త బ్రహ్మతో ఐక్యం పొందుతాడు | 1 |

మొత్తం అధికరణలు 14 సూత్రాలు 19

పరమాత్మను గురించిన జ్ఞానం కావాలంటే ముందుగా అవస్థాత్రయాన్ని తెలుసుకోవాలి. **జాగ్రస్వప్న సుషుప్తీనాం సాక్షిభూత్యై నమోనమః** అంటోంది లలితా అష్టోత్తరం. ఈ మూడు అవస్థలకు సాక్షి ఆ పరమేశ్వరియే. మూడవ అధ్యాయం, రెండవ పాదం ప్రారంభంలో అవస్థాత్రయం చెప్పటం జరిగింది.

## 1. ఆవృత్యధికరణము (ఆత్మధ్యానానికి ఆవృత్తి ఉంది)

శ్రవణమననాదులు ఒకసారి చేస్తే చాలా? మళ్ళీ మళ్ళీ చెయ్యాలా? అనే దానికి సమాధానం చెబుతున్నారు మొదటి అధికరణమైన **ఆవృత్యధికరణము**లో. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

బ్రహ్మసాక్షాత్కారానికి శ్రవణ మననాదులు చెప్పారుకదా! అంటే పరబ్రహ్మను గురించే వినాలి. ఆ విన్నదాన్ని మననం చెయ్యాలి. ఇది ఒకసారి చేస్తే చాలా? మళ్ళీ, మళ్ళీ చెయ్యాలా?

***సూత్రం - 478 "ఆవృత్తిరసకృదుపదేశాత్"***

జ్ఞానాన్ని ఆవృత్తి చెయ్యాలి. అంటే విన్న దానిని మరచిపోతాముకాబట్టి మళ్ళీ గుర్తు చేసుకోవాలి. మనసుకు పట్టించుకోవాలి. అందుకే మననం చెయ్యాలి. అదే విషయాన్ని మళ్ళీ మళ్ళీ గుర్తు చేసుకుంటూ ఉండాలి. ఇలా ఎంత కాలం చెయ్యాలి? అంటే ఫలితం వచ్చేదాకా, బ్రహ్మసాక్షాత్కారమయ్యేదాకా, ఆత్మసాక్షాత్కారమయ్యేదాకా చెయ్యాలి. వడ్లు ఎంతసేపు దంపాలి అంటే? బియ్యం వచ్చేదాకా దంపాల్సిందే. అలాగే ఆత్మసాక్షాత్కారమయ్యేదాకా వాటిని మననం చేస్తూనే ఉండాలి.

**ఆత్మ సాక్షాత్కారము** అంటే ఏమిటి ? అది ఎలా సిద్ధిస్తుంది ? ఈ విషయాలు **మహోపనిషత్తు**లో చెప్పబడ్డాయి.

| | | | |
|---|---|---|---|
| 8. | కళావిభాగాధికరణము | బ్రహ్మవేత్త ఇంద్రియాలు, భూతసూక్ష్మాలు నిరవశేషంగా బ్రహ్మలో లయమవుతాయి | 1 |
| 9. | తదోకోధికరణము | సగుణ బ్రహ్మవేత్త యొక్క ఆత్మ సుషుమ్నా నాడి ద్వారా వెడుతుంది | 1 |
| 10. | రశ్మ్యధికరణము | ఉత్క్రమించే జీవుడు సూర్యరస్మిని అనుసరిస్తాడు | 2 |
| 11. | దక్షిణాయనాధికరణము | జ్ఞాని దక్షిణాయనంలో మృతి చెందినా బ్రహ్మలోకానికే పోతాడు | 2 |

మొత్తం అధికరణలు 11 సూత్రాలు 21

## 1. వాగాధికరణము

### (మరణకాలంలో ఇంద్రియ వృత్తులన్నీ మనసులో లీనమవుతాయి)

ఇది మొదటి అధికరణ. దీనిపేరు **వాగాధికరణము**. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

మానవుడు జ్ఞానికాని అజ్ఞానికాని మరణించి తీరాల్సిందే. మృత్యువుకు జ్ఞాని, అజ్ఞాని, ధనికుడు, దరిద్రుడు, అనే తేడాలుండవు. పుట్టిన ప్రతిజీవి మరణించి తీరాల్సిందే. ఇందులో సందేహంలేదు. మరణించిన తరువాత జీవుడు ప్రయాణించటానికి ముఖ్యంగా రెండు మార్గాలున్నాయి. ఉపాసనాపరుడు నివృత్తి మార్గం ద్వారా ప్రయాణించి బ్రహ్మలోకం చేరతాడు. అతడికి పునర్జన్మ ఉండదు. దీన్నే దేవయానము లేదా ఉత్తరాయణ మార్గము అంటారు. ఇక రెండవది ప్రవృత్తి మార్గము. దీన్నే పిత్రుయానము లేదా దక్షిణాయనము అంటారు. పుణ్యకర్మలు చేసిన వారు ఈ మార్గం గుండా చంద్రలోకం చేరి స్వర్గసుఖాలనుభవిస్తారు. పుణ్యఫలం పూర్తయిన తరువాత కర్మశేషం అనుభవించటానికి మళ్ళీ భూలోకంలో జన్మిస్తారు. పాపపు పనులు చేసినవారు యమలోకానికి పోయి, శిక్షలు అనుభవిస్తారు. నీచమైన పనులు చేసినవారు క్రిమికీటాదులుగా పుడుతూ ఛస్తూ ఉంటారు.

మరణ కాలంలో శరీరంనుంచి జీవుడు బయటకు వచ్చేవరకు జ్ఞాని, అజ్ఞాని, పాపి, మహాపాపి అందరి పరిస్థితి ఒకలాగే ఉంటుంది.

అవసాన దశలో శరీరంలో కర్మేంద్రియాలు పని చెయ్యటం మానేస్తాయి. అంటే కాలు, చెయ్యి, మాట, పాయు, ఉపస్థల మీద మానవుడు పట్టుకోల్పోతాడు. ఈ సమయంలో అతడు చేసిన పాపపుణ్యాలన్నీ గుర్తు రావటం మొదలవుతుంది. కర్మేంద్రియాలన్నీ జ్ఞానేంద్రియాలలో లీనమవుతాయి.

అతనికి తరువాత జన్మకూడా కళ్ళ ఎదురుగా కనిపిస్తుంది. పాపకర్మలు పశువులు, పక్షులు, కుక్కలు పందులు, క్రిమికీటకాలుగా జన్మిస్తారు. వాటి మరణం వాటి కళ్ళకు కనిపిస్తూనే ఉంటుంది. మేకలు, గొర్రెలు, కోళ్ళు, పందులు వంటి జీవుల్ని చూడండి. మేకలు, గొర్రెలను మందగా కబేళాకి తోలుకు వెడతారు. అక్కడ కొన్ని తీసుకుని మిగిలిన వాటిని త్రిప్పి పంపుతారు. తమతో కబేళాకు వచ్చిన మేకలలో కొన్నింటిని చంపేస్తున్నారనే సంగతి వాటికి తెలుసు. అలాగే కోళ్ళు, పందులు వీటిని కూడా. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ. ఒకరోజు ఉదయం నడకకు వెళ్ళాను. త్రోవలో ఒకడు రెండు పందులను తీసుకువచ్చి రోడ్డు ప్రక్కనే ఒకదాన్ని చంపేసి కాలుస్తున్నాడు. రెండవదానికి అరవకుండా నోరు, కదలకుండా కాళ్ళు కట్టేశాడు. తనతో వచ్చిన పంది ఏమౌతోందో రెండవది చూస్తూనే ఉంది. తనకు కూడా అదే గతి కసేపట్లో పట్టబోతోందని దానికి తెలుసు. కాని ఏమీ చెయ్యలేని స్థితి.

ఒకసారి అడవిలో సింహాలు ఒకదున్నను వెంటాడుతున్నాయి. వాటి బారి నుంచి తప్పించుకోవటానికి దున్న ప్రక్కనే ఉన్న నీటి మడుగులోకి దిగింది. సింహాలు వెనుదిరిగాయి. కాని ఆమడుగులోని ఊబిలో దిగిపోయింది దున్న. బయటకు రాలేక అలాగే దిక్కులు చూస్తోంది. ఇంతలో హైనాల మంద వచ్చి ఆ దున్నను బ్రతికి ఉండగానే పీక్కు తిన్నది. క్రిమికీటకాలను జీవించి ఉండగానే పక్షులు తినేస్తాయి. ఆ సమయంలో ఆ జీవి పరిస్థితి ఆలోచించండి. పాపకర్ముల మరణం చాలా దారుణంగా ఉంటుంది. అందుకే రాబోయే జన్మ తలచుకుని జీవి చాలా బాధ పడతాడు. తన పరిస్థితిగురించి తనవాళ్ళకు చెప్పాలనుకుంటాడు. కాని చెప్పలేడు. కళ్ళ వెంబడి నీరు కారుతుంటుంది. అప్పుడు ఏడ్చి, బాధపడి ఉపయోగం లేదు.

శరీరం తన అధీనంలో ఉన్నప్పుడే మంచి పనులు చెయ్యాలి. పదిమందికీ ఉపయోగించే పనులు చేసినప్పుడు పొందే ఆనందం ఊహించలేనిది. ఇక్కడ ఒకచిన్న ఉదాహరణ. పెద్ద ఉద్యోగంలో ఉన్న వ్యక్తి ముందు వెనక లేకుండా, తరతమ భేదాలు లేకుండా అక్రమ మార్గంలో విపరీతంగా సంపాదించాడు. జీవితంలో అతనికి విచిత్రమైన అనుభవం ఎదురైంది. అదేమిటో ఆయన మాటల్లోనే చూడండి.

"ఒకరోజు విమానంలో వస్తున్నాను. ఇంకొక పదిహేను నిమిషాల్లో విమానం దిగుతుంది. ఈలోగా యంత్రం పాడైపోయింది. పని చేయటం లేదు. ఏ క్షణాన్నైనా విమానం పేలిపోవచ్చు అన్నారు. విమానంలో ఉన్నవారందరూ హాహాకారాలు చేస్తున్నారు. ఏడుపులు, పెడబొబ్బలు. అందరికీ జీవితం మీద ఆశలు ఆవిరై పోయాయి. ఆ క్షణంలో నేనుకూడా భయపడి పోయాను. గుండెలు అరచేతిలో పెట్టుకుని కూర్చున్నాను. ఆ సమయంలో నేను చేసిన పాపాలు, ఘోరాలు గుర్తు వచ్చినాయి. "ఓ భగవంతుడా నన్ను బ్రతికించు ఒక్క అవకాశం ఇవ్వు. నేను గనక బ్రతికితే అన్నీ మంచి పనులే చేస్తాను. దయచేసి ఒక్క అవకాశం ఇవ్వు." మనసులోనే భగవంతుణ్ణి ప్రార్థించాను. పరిపరివిధాల వేడుకున్నాను. చివరకు భగవంతుడు నా మొర ఆలకించాడు. విమానం సురక్షితంగా దిగింది. బ్రతికి బయట పడ్డాను. చావుకు బ్రతుకు మధ్య ఉన్న దూరం అర్థమైంది. అక్రమంగా సంపాదించిన డబ్బుతో అనాథ బాలలకు వైద్యసౌకర్యాలందిస్తున్నాను. ఇందులో ఉన్న ఆనందం వర్ణనాతీతము" అంటాడు. **జీవితంలో అవకాశం రావటం ముఖ్యం కాదు. వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలి.** క్రమంగా జ్ఞానేంద్రియాలు పనిచెయ్యటం మానేస్తాయి. కర్మేంద్రియాలతో కూడిన జ్ఞానేంద్రియాలు మనసులో లీనమవుతాయి. ఆ సమయంలో కేవలము మనసు ఒక్కటే పని చేస్తుంది. తరువాత మనసు ప్రాణంలోను, ప్రాణం తేజస్సు నందు లీనమవుతాయి. ఉపనిషత్తులు కూడా ఇదే విషయం చెబుతున్నాయి.

'అవసానదశలో వాక్కు మనసునందు, మనసు ప్రాణమందు, ప్రాణం తేజస్సు నందు లీనమవుతాయి' అని **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పబడింది. ఇదే ఉత్క్రాంతి క్రమము. అయితే వాక్కు మనస్సునందు లయమవుతోంది అన్నారు. ఇక్కడ వాక్కు లయమవుతోందా? లేక వాగింద్రియ వ్యాపారం లయం అవుతోందా?

***సూత్రం - 497 "వాఙ్మనపి దర్శనాచ్ఛబ్దాచ్చ"***

వాగింద్రియ వ్యాపారం మనసులో లయమవుతుంది. అప్పటికి మనసు పనిచేస్తూనే ఉంటుంది. వాక్కు లయమవటమంటే వాగింద్రియ వ్యాపారం లయమవటమే. ఇక వాక్కు పుట్టకుండా ఉండటమే లయం కావటం. అంటే జీవి ఇక మాటాడలేడు. అతనికి వాక్కురాదు.

ఇక్కడ లయమయ్యేది వాగింద్రియం కాదు. వాగింద్రియ వ్యాపారమే.

***సూత్రం - 498 "అత ఏవ చ సర్వాణ్యను"***

వాక్కుకు మల్లేనే కళ్ళు మొదలైన ఇంద్రియాల వృత్తులు కూడా మనసులో లయం అవుతాయి.

ఇందాక చెప్పినట్లే లయం అంటే వృత్తి లయమే తప్ప స్వరూపలయం కాదు. ఈ రకంగా ఇంద్రియాల వృత్తులన్నీ, మనసులో లీనమవుతాయి.

## 2. మనోధికరణము (మనస్సు ప్రాణంతో లీనమవుతుంది)

ఈ విషయం రెండవదైన **మనోధికరణము**లో వివరించారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

వాక్కు అనే పదానికి వాగ్వృత్తి అని అర్థం చెప్పారు. మరి మనస్సు అంటే మనోవృత్తా? లేక మనస్సే అని అర్థమా?

***సూత్రం - 499 "తన్మనః ప్రాణ ఉత్తరాత్"***

అన్ని ఇంద్రియాలను తనలో లయం చేసుకున్న తరువాత మనస్సు ప్రాణంలో లీనమవుతున్నది. అంటే మనోవ్యాపారాలన్నీ ప్రాణంలో లయమవుతాయని గుర్తించాలి.

## 3. అధ్యక్షాధికరణము (ప్రాణం జీవునిలో లీనమవుతుంది)

ఈ విషయం మూడవదైన **అధ్యక్షాధికరణము**లో వివరిస్తున్నారు ఇందులో మూడు సూత్రాలున్నాయి.

ప్రాణం దేనిలో లీనమవుతుంది?

**సూత్రం - 500 "సోఽ ధ్యక్షే తదుపగమాదిభ్యః"**

ప్రాణం జీవునిలో లయమవుతుంది. ప్రాణం జీవాత్మను పొందుతుంది అంటే దేహానికి, ఇంద్రియాలకు అధ్యక్షుడైన జీవుని యందు లయమవుతుంది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో "చెప్పినట్లుగా" ఇంద్రియాలతో కూడినట్టి, అవిద్యాజన్యమైనట్టి ఈ శరీరము వృద్ధాప్యం కారణంగా కృశించిపోతుంది. అప్పుడు చెట్టు నుండి పండు రాలిపోయినట్లుగా శరీరంలోని పురుషుడు ఈ అవయవాలను వదలించుకుని కర్మానుసారము మరియొక యోనిలో జన్మించటం కోసం వెళ్ళిపోతాడు. ప్రాణము అవయవాలు ఉంటేనే గాని కర్మఫలాన్ని అనుభవించలేడు. అందుకని ఇంకొక శరీరంలో చేరతాడు. ఈ రకంగా ముఖ్యప్రాణం బయటకు వెళ్ళేటప్పుడు దానితోపాటుగా ఇంద్రియ వ్యాపారాలన్నీ కూడా నిష్క్రమిస్తాయి.

**సూత్రం - 501 "భేతేష్వతః శ్రుతేః"**

అవసాన కాలంలో తేజస్సుతో కూడిన చరించే భూతసూక్ష్మాలతో, ప్రాణంతో సహాకూడి జీవుడు ఉంటాడు. తేజస్సు అంటే అగ్ని అనిఅర్థం. ఇక్కడ తేజస్సు అనటం చేత అగ్ని మొదలైన అన్ని భూతాలు అని గ్రహించాలి. మరణ కాలంలో జీవుడు భూతసూక్ష్మాలతో కూడి ఉంటాడు. ఆ భూతాలే జీవుడికి ఉపాధులు కాబట్టి జీవునిలో లయం అయినప్పటికీ, ప్రాణం ఆ ఉపాధులైన భూతాలను పొందినట్లే అని గుర్తుంచుకోవాలి. ఈ రకంగా ప్రాణాలు జీవునియందే లయమవుతాయి.

**సూత్రం - 502 "నైకస్మిన్ దర్శయతో హి"**

పైన చెప్పిన దానిలో తేజస్సుతో కూడి అన్నారు. కాబట్టి పురుషుడు తేజస్సులోనే ఉంటాడు అనే వాదన అది సరికాదు. ఎందుచేతనంటే అంత్యకాలంలో తేజస్సు ఒకటే ఉండదు. సమస్తభూతాలు ఉంటాయి. కాబట్టి మరణసమయంలో ఈ శరీరాన్ని విడిచి, ఇంకొక శరీరాన్ని ధరించేటప్పుడు అన్ని భూతాల సూక్ష్మాంశల యందు, సూక్ష్మశరీరంతో ఉంటాడు. శరీరానికి భూతాలన్నీఅవసరమే. కాబట్టి ఇలా జరుగుతుంది. ఈరకంగా అంత్యకాలంలో ప్రాణం జీవునియందు లయమవుతుంది.

# 4. అస్మృత్యుపక్రమాధికరణము

## (నాడీమండలం చేరేదాకా జ్ఞానికి, అజ్ఞానికి ఉత్క్రాంతి సమానమే)

ఈ విషయం నాల్గవదైన **అస్మృత్యుపక్రమాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో ఒకే సూత్రం ఉంది.

ఉత్క్రమణ అన్నారు కదా ! ఉత్క్రమణ అనేది ఉపాసకుడికి, ఉపాసకుడు కాని వారికి సమానమేనా? కాదా?

ఉత్క్రమణము అంటే – పైకి పోవటము. ఉత్క్రాంతి అంటే మరణము. మరణ సమయంలో జ్ఞానికి అజ్ఞానికి శరీరంలోని నాడీ స్పందన, ఇంద్రియాల స్థితి ఒకటిగానే ఉంటుంది. ఇంద్రియాలన్నీ మనసులోను, మనసు ఆత్మలోను లీనమవుతుంది. ఇక్కడ నుంచే దేవయాన పిత్రుయానాలు ప్రారంభమవుతాయి.

***సూత్రం – 503 "సమానా చాసృత్యుపక్రమాద మృతత్వం చానుపోష్య"***

దేవయానం ప్రారంభానికి ముందు జ్ఞానికి, అజ్ఞానికి ఉత్క్రమణ అనేది ఒకే రకంగా ఉంటుంది.

జ్ఞానంలేనివాడికి నాడుల్లో ప్రవేశం కలుగుతుంది. అతని ప్రాణాలు దక్షిణ మార్గాన పోతాయి. ఆయామార్గాల వరకు ఉపాసకుడైనజ్ఞానికి, ఉపాసకుడుకాని అజ్ఞానికి కూడా భూతసూక్ష్మావయం సమానమే. దేవయానంద్వారా వెళ్ళనివాళ్ళకి బ్రహ్మలోక ప్రాప్తి కలగదు. కాబట్టి ఉత్క్రమణ దాకా అంటే ఇంద్రియాలు మనసులో లీనంకావటం, మనసు ప్రాణంలోలీనంకావటం, ప్రాణాలు జీవంలోలీనం కావటం ఇవన్నీ ఇద్దరికీసమానమే. ఊరికి ప్రయాణం కావాలనుకున్నవాడు సాధారణ తరగతి లేదా మొదటి తరగతి ఎలా ప్రయాణం చేసినా, ప్లాట్‌ఫాం చేరేదాకా వారిద్దరి ప్రయాణవిధానము ఒకటిగానేఉంటుంది. అలాగే మరణసమయంలో జ్ఞానికి, అజ్ఞానికి ఉత్క్రాంతి సమానంగానేఉంటుంది.

# 5. సంసారవ్యపదేశాధికరణము

## (దేహంలో వేడి సూక్ష్మశరీరం వల్లనే ఉంటుంది)

అసలు సూక్ష్మశరీరం ఎంతవరకు ఉంటుంది అనే విషయాన్ని ఐదవదైన **సంసారవ్యపదేశాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో నాలుగు సూత్రాలున్నాయి.

సూక్ష్మశరీరం ఎంతవరకు ఉంటుంది? బ్రహ్మలో ఐక్యమయ్యే వరకు ఉంటుందా? ఈ లోపులో అంతరిస్తుందా?

***సూత్రం - 504 "తదపీతేః సంసారవ్యపదేశాత్"***

తేజస్సు మొదలైన భూతాలు మోక్షపర్యంతము ఉంటాయి.

అజ్ఞానులు తాము చేసిన కర్మఫలాన్ని అనుభవించటానికి వేరొక యోనిని ప్రవేశిస్తారు. పుణ్యకర్ములు ఉత్తమయోనులు పొందుతారు. అలా కాని వారు నీచయోనులు పొందుతారు. నీచులు క్రిమికీటకాలుగా పుడుతారు. అధమాధములు రాళ్ళు, రప్పలు, చెట్లుచేమలుగా పుడతారు. కాబట్టి తేజస్సు మొదలైన సూక్ష్మ, భూతసూక్ష్మాలకు పరమాత్మయందు లయముమాత్రమే మిగిలిఉందని తెలుసుకోవాలి.

***సూత్రం - 505 "సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః"***

శరీరం నుండి పోతున్న జీవుడికి ఆశ్రయభూతమైన తేజస్సు ప్రమాణాన్ని బట్టి, స్వరూపాన్నిబట్టి చాలా సూక్ష్మంగా ఉంటుంది.

జీవుడికి ఆధారభూతంగా ఉంటూ, ఈ శరీరంలో నుండి వేరే శరీరంలోకిగాని, బ్రహ్మలోకానికి వెళ్ళే తేజస్సు, భూతసూక్ష్మాలతో కూడిన తేజస్సు, చాలా సూక్ష్మమై నటువంటి నాడీమండలం గుండా పోతుంది అని చెప్పబడింది.

***సూత్రం - 506 "నోపమర్దేనాతః"***

సూక్ష్మశరీరమనేది అత్యంతసూక్ష్మమైనది. కాబట్టే స్థూలశరీరానికి ఏదైనా బాధకలిగినా అది సూక్ష్మశరీరానికి అంటదు. ఒకవేళ స్థూలశరీరాన్నిదహనం చేసినా, సూక్ష్మశరీరం దహించబడదు.

***సూత్రం - 507 "అస్యైవ చోపపత్తేరేష ఊష్మా"***

స్థూలశరీరంలో మనకు లభించే ఆవిరి, ఈ సూక్ష్మశరీరానికి సంబంధించినదే. సూక్ష్మశరీరం ఉన్నప్పుడే ఆ ఆవిరిఉంటుంది. అదే దేహంలోనివేడి. మృతదేహానికి ఆ వేడి ఉండదు. అవసానదశలో కాళ్ళు చేతులు చల్లబడిపోయాయి అంటారు. అంటే దేహంలో నుంచి సూక్ష్మశరీరం వెళ్ళిపోవటంవల్ల శరీరం చల్లబడిపోతుంది.

## 6. ప్రతిషేధాధికరణము (జ్ఞానిప్రాణాలు ఉత్క్రమించవు)

ఈ విషయం ఆరవదైన **ప్రతిషేధాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

అవసానదశలో ప్రాణాలు ఉత్క్రమిస్తాయి అన్నారు. ఉత్క్రమించటము అంటే ప్రాణాలు శరీరం నుంచి బయటకు పోవటం. మరి బ్రహ్మవేత్తయొక్క ప్రాణాలుకూడా ఉత్క్రమిస్తాయా?

అజ్ఞాని యొక్క ప్రాణాలు ఉత్క్రమిస్తాయి. ఉత్క్రమించటము అంటే నవరంధ్రాలలోను ఏదో ఒక రంధ్రం గుండా బయటకు పోవటం. ఇలాంటి వారందరికీ మరుజన్మ ఉంటుంది. కాని బ్రహ్మవేత్త అతడే మహాజ్ఞాని అనబడతాడు. అతని ప్రాణాలు ఉత్క్రమించవు. అంటే నవరంధ్రాలలోను దేనిగుండా అతని ప్రాణాలు బయటకుపోవు. వచ్చినదారిగుండానే బయటకుపోతాయి.

**ఐతరేయోపనిషత్తులో** చెప్పినట్లుగా పరమేశ్వరుడు మానవశరీరాన్ని సృష్టించిన తరువాత బ్రహ్మరంధ్రంగుండా మానవశరీరంలో ప్రవేశించాడు. ఇంద్రియాలతో తాదాత్మ్యం చెంది. ఈ శరీరంతో అన్ని సుఖాలు అనుభవిస్తూ తానువచ్చిన త్రోవను కూడా మరిచిపోయాడు. జన్మరాహిత్యం కావాలంటే వచ్చిన త్రోవనే అంటే బ్రహ్మరంధ్రంగుండానే బయటకుపోవాలి. బ్రహ్మవేత్తకు మరుజన్మఉండదు. కాబట్టి అతడిప్రాణాలు ఉత్క్రమించవు, అంటే నవరంధ్రాలద్వారా బయటకు పోవు. బ్రహ్మరంధ్రంగుండా బయటకుపోతాయి. ఈ విషయాన్నే ఈ అధికరణలో వివరించారు.

***సూత్రం – 508 "ప్రతిషేధాదితి చేన్న శారీరాత్"***

సగుణారాధన చేసేవాడి ప్రాణాలు ఉత్క్రమిస్తాయి. కాని బ్రహ్మవేత్త ప్రాణాలు ఉత్క్రమించవు. అనిఅనటం సరికాదు. ఉత్క్రమణం అనేది జీవుని నుండి లేదు. అంతేకాని శరీరం నుండి లేదని కాదు.

*సూత్రం - 509 "స్పష్టో హ్యేకేషామ్"*

కొంతమంది సూత్రాకారుల ప్రకారం బ్రహ్మవిదుడికి ఉత్క్రాంతి లేదు. **బృహదారణ్యకోపనిషత్తు**లో "మానవుడు చనిపోయినప్పుడు, బ్రహ్మవేత్త యొక్క ప్రాణాలు శరీరంనుంచి ఉత్క్రమిస్తాయా? లేదా? అన్నాడు ఆర్తభాగుడు.

ఉత్క్రమింపవు తత్త్వజ్ఞానియొక్కప్రాణాలు పరమాత్మలో లీనమవుతాయి. సామాన్య మానవుడిలాగానే బ్రహ్మవేత్తకూడా మరణిస్తాడు. కాని అతడికి పునర్జన్మ ఉండదు అన్నాడు యాజ్ఞవల్క్యుడు

మరి ప్రాణాలు ఉత్క్రమించకపోతే మరణించడు కదా? అని అనుమానం. ప్రాణాలు పోగానే శరీరం ఉబ్బిపోతుంది. వళ్ళు చల్లబడిపోతుంది. జీవి మరణిస్తాడు. అతని ప్రాణాలు ఉత్క్రమించవు. పరమేశ్వరుడిలో లీనమయిపోతాయి. అని వేదాలు చెబుతున్నాయి.

*సూత్రం - 510 "స్మర్యతే చ"*

బ్రహ్మసాక్షాత్కారం పొందినవాడికి ప్రాణాలు ఉత్క్రమించటంగాని, దేవయానాది మార్గాలుగాని లేవని పురాణాలుచెబుతున్నాయి. కాబట్టి బ్రహ్మవేత్త ప్రాణాలు ఉత్క్రమించవు. బ్రహ్మరంధ్రంగుండా పోతాయి.

## 7. కళాప్రళయాధికరణము

### (జ్ఞాని ఇంద్రియాలు పరబ్రహ్మలో లీనమవుతాయి.)

జ్ఞాని యొక్క ప్రాణాలు పరబ్రహ్మలో లీనమవుతాయంటున్నారు. ఏడవదైన **కళాప్రళయాధికరణము**లో. ఇందులో ఒకటే సూత్రముంది.

అవసాన దశలో బ్రహ్మవేత్త యొక్క ప్రాణాలు ఉత్క్రమించవు అంటే నవరంధ్రాలలోను ఏదో ఒక రంధ్రం గుండా బయటకు పోవు. బ్రహ్మరంధ్రంగుండా మాత్రమే పోతాయి. సగుణోపాసకుడు నిర్గుణోపాసకుడు ఇద్దరి ప్రాణాలు బ్రహ్మరంధ్రం గుండానే బయటకు పోతాయి. కాని సగుణోపాసకుడు అర్చిరాదిమార్గం ద్వారా బ్రహ్మలోకంచేరి, అక్కడ కర్మబ్రహ్మతోపాటుగా మహదైశ్వర్యాన్ని అనుభవిస్తాడు. అయితే నిర్గుణోపాసకుడికి మార్గము అనేదిలేదు. బ్రహ్మరంధ్రంగుండా బయటకు

రాగానే అతనిజీవాత్మ పరమాత్మలోలీనమవుతుంది. అతని ఇంద్రియాలు, భూతాలు కూడా పూర్తిగా పరమాత్మలోలీనమవుతాయి. అదే విషయాన్ని ఈఅధికరణలో వివరిస్తున్నారు.

బ్రహ్మవేత్తప్రాణాలు ఉత్క్రమింపవు అన్నారు మరి అతని ఇంద్రియాలూ, భూతాలూ పరమాత్మలో లయమవుతాయా? లేక తమతమ ప్రకృతులందు లయమవుతాయా?

***సూత్రం - 511 "తాని పరే తథా హ్యాహ అవిభాగో వచనాత్"***

జ్ఞానికి మోక్షం కలిగేటప్పుడు పదిహేను కళలు వాటివాటి ఉత్పత్తి స్థానాన్ని పొందుతాయి. అని **ముండకోపనిషత్తు**లో చెప్పబడ్డది. అలాగే **ప్రశ్నోపనిషత్తు**లో పదహారుకళలకు పరమేశ్వరుడేఆధారము. కాబట్టి అతనియందే లీనమవుతాయి. అని చెప్పబడ్డది.

బ్రహ్మవేత్త యొక్క ప్రాణాలు (ఇంద్రియాలు) భూతాలు పరమాత్మలోనే లయమవుతాయి.

వర్షంకురిసినప్పుడు ఆ నీరంతా వాగులుగా ప్రవహించి నదులుగా ఏర్పడుతుంది. ఆ నదులకు ప్రత్యేకమైన పేర్లుంటాయి. ఈనదులన్నీ సముద్రంలోకలుస్తాయి. అప్పుడువాటికి ప్రత్యేకమైనపేర్లుండవు. అంతాసముద్రమే. అలాగే పదహారు కళలు పరమేశ్వరుని యందేఉంటాయి. అవి ఎప్పుడైతే అతన్నిచేరాయో అప్పుడు వాటికి నామరూపాలుండవు. దాన్ని పురుషుడనిమాత్రమే అంటారు. సమాధిస్థితిలో ఉన్నప్పుడు ఈ కళలన్నీ ఆత్మలోలీనమవుతాయి. బండిచక్రానికి ఉండే ఆకులన్నీ దాని ఇరుసుమీదఆధారపడి ఉన్నట్లుగానే ఈకళలన్నీ పురుషుడి మీద ఆధారపడి ఉంటాయి. పదహారుకళలు పురుషునిభాగాలు కావు. అతడు కల్పించినవే.

ఈరకంగా నిర్గుణబ్రహ్మవేత్త ఇంద్రియాలు (ప్రాణాలు) బ్రహ్మలో లీనమవుతాయి.

## 8. కళావిభాగాధికరణము

### (జ్ఞానియొక్క ఇంద్రియాలు భూతసూక్ష్మాలు నిరవశేషంగా బ్రహ్మలో లీనమవుతాయి)

ఈ విషయం ఎనిమిదవదైన **కళావిభాగాధికరణ**లో వివరిస్తున్నారు. ఇందులో ఒకటే సూత్రం ఉంది.

బ్రహ్మవేత్త యొక్క ఇంద్రియాలు, భూతసూక్ష్మాలు, నిరవశేషంగా బ్రహ్మలో లయమవుతాయా?

*సూత్రం - 512 "తదోకోగ్రజ్వలనం తత్ప్రకాశిత ద్వారో విద్యాసామర్థ్యాత్తచ్ఛే పగత్యను స్మృతియోగాచ్చ"*

జ్ఞానియొక్కఇంద్రియాలు బ్రహ్మతో పూర్తిగాలయమవుతాయి.

ఆకళలు అంటే ఇంద్రియాలు, ప్రాణాలయొక్క నామరూపాలు నశిస్తాయి. అన్నీ కలసిపోయి పురుషుడని వ్యవహరించబడతాడు. ఈరకంగా బ్రహ్మైక్య రూపమైనట్టి లయంపొందినప్పుడు సాధకుడు కళలు లేనివాడవుతాడు. అంటే ముక్తుడవుతాడు.

ఈ రకంగా బ్రహ్మవేత్త యొక్క ఇంద్రియాలు, భూతసూక్ష్మాలు నిరవశేషంగా బ్రహ్మలో లయమవుతాయి. లేకపోతే అతడికి మరుజన్మ ఉంటుంది.

## 9. తదోకోధికరణము

## (సగుణ బ్రహ్మారాధకుడయిన బ్రహ్మవేత్తఆత్మ సుషుమ్నా నాడి ద్వారా బయటకు పోతుంది)

ఈ విషయం తొమ్మిదవదయిన **తదోకోధికరణము**లో వివరించారు. ఇందులో ఒకే సూత్రం ఉంది.

సగుణోపాసకుడు, అజ్ఞాని యొక్క ఆత్మ ఏవిధంగా నిష్క్రమిస్తుంది? అనే ప్రశ్నకు సమాధానం చెబుతున్నారు.

*సూత్రం - 513 "హార్దానుగృహీతః శతాధికయా"*

సగుణోపాసకునిఆత్మ శరీరంనుంచి బయటకువచ్చేటప్పుడు జీవునికి వాసస్థానమైన హృదయంయొక్క చివరిభాగంలో ఒకవిధమైన జ్వలన కలుగుతుంది. దానిచేత ప్రకాశింపచేయబడిన మార్గంకలవాడై, హృదయంలో అధిష్టించి ఉన్న బ్రహ్మచేత అనుగ్రహించబడినవాడై, బ్రహ్మవిద్యాసామర్థ్యంవల్ల, బ్రహ్మవిద్యకు అంగముగా చెప్పబడిన గతిని ధ్యానించటం వల్ల, నూటఒకటవదైన సుషుమ్నా నాడీమార్గాన నిష్క్రమిస్తాడు.

వాక్కు మొదలైన ఇంద్రియాలు పనిచెయ్యకుండా మానివెయ్యటము, జీవుడు హృదయాన్ని ప్రవేశించటము, హృదయము యొక్క పైభాగము ప్రకాశించటము

ఇవన్నీ జ్ఞానికీ, అజ్ఞానికీ సమానమే. అయితే జ్ఞాని బ్రహ్మరంధ్రం ద్వారా నిష్క్రమిస్తాడు. అజ్ఞాని నవరంధ్రాలలో ఏదో ఒక మార్గంద్వారా నిష్క్రమిస్తాడు.

హృదయంలో నూటొక్క నాడీమండలమున్నది. అందులో సుషుమ్నానాడి మాత్రమే మోక్షమార్గం వైపుపోతుంది. మిగిలిననాడులు ఏదోఒక ఇంద్రియాన్ని కలుపుతాయి. సుషుమ్నామార్గంగుండా పోయినవాడు అమృతత్త్వం పొందుతాడు. అంటే బ్రహ్మలోకానికిపోయి సగుణబ్రహ్మను చేరి మహదైశ్వర్యము పొందుతాడు. మిగిలిన నాడులగుండా పోయిన వారికి బ్రహ్మలోక ప్రాప్తిలేదు.

# 10. రశ్మ్యధికరణము

## (ఉత్క్రమించే జీవుడు సూర్యరస్మిని అనుసరిస్తాడు)

ఈ విషయం పదవదయిన **రశ్మ్యధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

బ్రహ్మరంధ్రంగుండా పోయేమానవుడికి తేజోరశ్మి సంబంధం ఉన్నదా? ఉపాసకుడు శరీరంనుంచి నిష్క్రమించేటప్పుడు ఈకిరణాల ద్వారానే పైకిపోతాడు. అని వేదంచెబుతున్నది. ఈతేజోసంబంధము పగలు, రాత్రి, ఎప్పుడు మరణించినా ఉంటుందా?

***సూత్రాలు 514 "రశ్మ్యనుసారీ"***

సుషుమ్నద్వారా ఈదేహం నుండి ఉత్క్రమించిన ఉపాసకుడు ఆ నాడితో సంబంధంఉన్న సూర్యకిరణాలను అనుసరించి బ్రహ్మలోకంచేరతాడు.

ఇక ఈతేజోసంబంధం పగలురాత్రి అనే భేదంలేకుండా ఎప్పుడైనా ఉంటుంది.

***సూత్రాలు 515 "నిశి నేతి చేన్న సంబన్ధస్య యావద్దేహభావిత్వాద్దర్శయతి చ"***

ఇక్కడ గమనించవలసినవిషయం ఏమంటే, నాడులకు సూర్యరశ్మికి దేహం ఉన్నంతవరకు సంబంధం ఉంటుంది. అందుచేత రాత్రులందు జీవుడు కిరణాలను అనుసరించడు అనిచెప్పటంలో అర్థంలేదు. వేదంకూడా ఈ విషయాన్నే చెబుతున్నది.

వీరి అనుమానంఏమంటే రాత్రులందు సూర్యుడుండడుగదా. మరి రాత్రులందు మరణించిన వారికి సూర్యరశ్మిసంబంధం ఉండదు అని. అది నిజం కాదు. నాడులకు,

సూర్యరశ్మికి ఉన్నసంబంధం వస్తూపోతూ ఉండేదికాదు. శరీరం ఉన్నంతవరకు ఇదిఉంటుంది. అందుచేతనే సూర్యరశ్మి సంబంధానికి రాత్రిపగలు తేడాలేదు. అన్ని నాడులలో వ్యాపించిఉండే పిత్తరసమే సూర్యునితేజస్సు. కాబట్టి జీవి పగలు మరణించినా, రాత్రివేళ మరణించినా, ఆ సమయంలో సూర్యరశ్మి ఉన్నా, లేకపోయినా, మృతిచెందిన వెంటనే సూర్యరశ్మిప్రాప్తి కలుగుతుంది.

## 11. దక్షిణాయనాధికరణము

### (దక్షిణాయనంలో మృతి చెందినా జ్ఞాని బ్రహ్మలోకానికే పోతాడు)

ఈ విషయం పదకొండవదైన **దక్షిణాయనాధికరణము**లో వివరించారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

ఉత్తరాయణము, దక్షిణాయనము అనేవి కాలగమనంలో తేడాలు. జనవరి 14 నుంచి జులై 13 వరకు ఉత్తరాయణం. ఈ సమయంలో సూర్యుడు ఉత్తరదిక్కుకు వంగి ఉంటాడు. దక్షిణాయనం జులై 14 నుంచి జనవరి 13 వరకు ఈ సమయంలో సూర్యుడు దక్షిణ దిక్కుకు వంగి ఉంటాడు. ఇవి సూర్యుడు సంచరించే మార్గాలు. కాగా వేదాంత పరిభాషలో చెప్పినవి జీవి ప్రయాణించే దేవయాన పిత్రుయానాలు. వీటిని కూడా ఉత్తరాయణము, దక్షిణాయనము అనే అంటారు. కాని వాటికి, వీటికీ ఏ సంబంధము లేదు. కేవలము పేర్లు మాత్రమే ఒకటి, సూర్యగమనంలోని ఉత్తరాయణం ఆరోగ్యప్రదమైన కాలం. అందుకే దాన్ని పుణ్యకాలము అంటారు.

ఉత్తరాయణపుణ్యకాలంలో స్వర్గద్వారాలు తెరిచి ఉంటాయి. కాబట్టి ఉత్తరాయణంలో మరణించిన వారు బ్రహ్మలోకానికి పోతారు. దక్షిణాయనంలో మరణించిన వారికి బ్రహ్మలోక ప్రాప్తిలేదు అంటారు ఇది నిజమేనా?

పుత్రులులేనివారికి ఊర్ధ్వలోకాలకుపోయే అర్హతలేదు అంటారు. వివాహమే చేసుకోని శుకమహర్షి మోక్షాన్ని పొందాడుకదా? వంశం విస్తరించాలంటే పుత్రులు కావాలి. ఈవిషయం చెప్పటానికే అలాచెబుతారు. అలాగే ఇదికూడా.

***సూత్రం - 516 “అతశ్చాయనే-పిహి దక్షిణే”***

ఉత్తరాయణము, దక్షిణాయనము అనేవి మనం చెప్పుకుంటునట్లుగా సూర్యగమనంవల్ల కలిగేవికాదు. అవి దేవయాన, పితృయానాలు. ఈ జ్ఞానమనేది ఎప్పుడూ ఉండేది. కాబట్టి దక్షిణాయనంలోచనిపోయినప్పటికీ బ్రహ్మలోకప్రాప్తి జరుగుతుంది. అలాగే అజ్ఞానులు ఏసమయంలోమరణించినా, వారికి బ్రహ్మలోకం లభించదు.

**ఉత్తరాయణంలో ఉరివేసుకునిచచ్చినా బ్రహ్మలోకంపొందుతారు అనేది కేవలము ఉత్తరాయణంపుణ్యకాలము అనటానికి చెప్పేమాట.**

***సూత్రం - 517 "యోగినః ప్రతిచ స్మర్యతే స్మార్తే చైతే"***

యోగుల కోసం చెప్పేస్మృతిలో కాలవిశేషాన్ని వివరించారు. ఈ యోగము, సాంఖ్యము అనేవి పురాణాలలో చెప్పబడ్డాయి. అంతేకాని వేదంలో కాదు.

గీతలో చెప్పబడిన అర్చిరాదిమార్గము, ధూమమార్గము యోగుల నుద్దేశించి చెప్పబడినది. సాంఖ్య, యోగశాస్త్రాలు పురాణాల్లోనే చెప్పబడ్డాయి. అవి వేదప్రమాణాలు కావు. అయితే వేదాలలోచెప్పబడ్డ దేవయాన పితృయానాలు, పురాణాలలోచెప్పబడ్డ అర్చిరాది, ధూమాది మార్గాలు ఒకటే అని చెప్పవచ్చు.

క్రమముక్తికి కాలనియమంలేదు. జ్ఞానియైనవాడు దక్షిణాయానంలో మరణించినా బ్రహ్మలోకంచేరతాడు. మరి భీష్ముడు ఉత్తరాయణం వచ్చేదాకా ఆగాడు కదా! అంటారు. భీష్ముడికి స్వచ్ఛంద మరణంఉంది. దానిశక్తిని అందరికీ తెలియచెయ్యాలనే ఆ విధంగాచేశాడు.

***దీంతో బ్రహ్మసూత్రాలు నాల్గవ అధ్యాయంలో***
***రెండవ పాదం పూర్తయింది.***

# నాల్గవ అధ్యాయం

## మూడవ పాదం

ఈ పాదంలో దేవయానాన్ని వివరిస్తున్నారు. ఇందులో ఆరు అధికరణలు, పదహారు సూత్రాలు ఉన్నాయి.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | అర్చిరాద్యధికరణము | అర్చిరాది మార్గమే బ్రహ్మలోక మార్గము | 1 |
| 2. | వాయవ్యాధికరణము | ఉత్క్రమించే జీవుడు సంవత్సర దేవత తరువాత వాయువును పొందుతాడు | 1 |
| 3. | వరుణాధికరణము | విద్యుద్దేవత తరువాత జీవుడు వరుణలోకం చేరతాడు | 1 |
| 4. | అతివాహికాధికరణము | అర్చిరాదులంతా అతివాహికలే | 3 |
| 5. | కార్యాధికరణము | దేవయానం ద్వారా సగుణ (కర్మ) బ్రహ్మను పొందుతారు | 8 |
| 6. | అప్రతీకాలంబనాధికరణము | అప్రతీకోపాసకులు బ్రహ్మత్వం పొందుతారు | 2 |

మొత్తం అధికరణలు 6. సూత్రాలు 16.

# 1. అర్చిరాద్యధికరణము

## (అర్చిరాది మార్గమే బ్రహ్మలోక మార్గము)

బ్రహ్మలోకానికి పోయే మార్గం గురించి మొదటిదైన **అర్చిరాద్యధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో ఒక సూత్రం ఉంది.

సగుణోపాసకులు అందరూ అర్చిరాదిమార్గం ద్వారానే సగుణబ్రహ్మను చేరతారు అని శ్రుతులుచెబుతున్నాయి. మరణసమయంలో బ్రహ్మవేత్త అయిన జీవుడు హృత్పద్మంలో పరమాత్మఅనుగ్రహంతో సుషుమ్నానాడిద్వారా బయటకు వెడతాడు. జీవుడువెళ్ళే మార్గాన్ని శ్రుతులలో అనేకరకాలుగా చెప్పటం జరిగింది.

బ్రహ్మవిద్యోపాసకులు మరణించినతరువాత, వారికి అంత్యక్రియలు శాస్త్రోక్తంగాజరిగినా, జరగకపోయినా వారు అర్చిరాదిమార్గంగుండానే వెడతారు. ముందుగా అర్చిస్సును పొంది, తరువాత అహస్సు, అపూర్వమాణ పక్షము, ఉత్తరాయణము, సంవత్సరము, ఆదిత్యుడు, చంద్రుడు, విద్యుత్తు లోకాలు పొందుతారు. ఆ తరువాత వీరిని బ్రహ్మ దగ్గరకు తీసుకుపోతారు. ఆ మార్గాన్నే బ్రహ్మపథము, దేవపథము అంటారు. ఈ మార్గంలో పోయిన వారు తిరిగి రారు. అని చెబుతోంది **ఛాందోగ్యోపనిషత్తు.** ఛాందోగ్యోపనిషత్తులోనే ఇంకొక చోట మరణ సమయంలో జీవుడు శరీరంనుంచి బయటకువచ్చి సూర్మరశ్మల ద్వారా ఊర్ధ్వలోకాలుపొందుతాడు అని చెప్పబడింది. **వాజసనేయ సంహిత**లో పరబ్రహ్మను ఉపాసించేవారు ముందుగా అర్చిస్సునుపొందుతారు. ఆ తరువాత అహస్సు, అపూర్వమాణ పక్షము, ఉత్తరాయణము, దేవలోకము, ఆదిత్యుడు, విద్యుత్తులోకాలు పొంది విద్యులోకము నుంచి బ్రహ్మలోకానికి తీసుకునిపోబడతాడు. అని చెప్పారు. **బృహదారణ్యకం**లో బ్రహ్మవేత్త ముందు వాయువునుపొంది, దాని యందు రథచక్రపు బెజ్జమంత అవకాశంపొందినవాడై, వాయువుతోకలిసి పైకిపోయి ఆదిత్యుని పొంది అక్కడ మృగరంధ్రమంత అవకాశాన్నిపొంది, దాని నుంచి పైకిపోయి చంద్రునిపొంది, అక్కడ భేరీరంధ్రమంత అవకాశాన్ని పొంది, దానిగుండా పైకి వెడతాడు అన్నారు. **ముండకోపనిషత్తు**లో వారు పాపరహితులై సూర్యునిద్వారా ఉత్తరాయణమార్గాన బ్రహ్మలోకం వెడతారు అన్నారు.

వీటన్నింటి బట్టి చూస్తే అర్చిరాదిమార్గము ఒకటేనా? లేక వేరువేరు మార్గాలున్నాయా? అని అనుమానంవస్తుంది.

ముందుగా **కౌషీతకీ బ్రాహ్మణం**లో అర్చిరాదిమార్గాన్ని గురించి ఏంచెప్పారో చూద్దాం.

***సూత్రం – 518 "అర్చిరాదినా తత్ప్రథితేః"***

బ్రహ్మలోకానికి మార్గము 'అర్చిరాది మార్గమే' ఈ మార్గం గుండానే బ్రహ్మ లోకానికి వెడతారు. అన్నిచోట్ల ఎక్కువగా అర్చిరాది మార్గమే చెప్పబడింది. **కౌషీతకీబ్రాహ్మణం**లో దీన్ని గురించి వివరించటం జరిగింది.

**అర్చిరాదిమార్గము :** అర్చిషము అంటే – వెలుగునిచ్చేది. కాంతినిచ్చేది. అగ్ని, మంట అని అర్థం.

పూర్వకాలంలో చిత్ర అనే పేరుగల గార్గ్యాయణిముని ఒకయాగం చెయ్య సంకల్పించినవాడై ఉద్దాలకఅరుణి వద్దకు వచ్చి ఆ యాగము పూర్తి చేయించమని అడిగాడు. అప్పుడు ఉద్దాలకుడు తనకుమారుడైన శ్వేతకేతువుకు ఆ యాగము బాధ్యతలు అప్పగించాడు. శ్వేతకేతువును వెంటపెట్టుకుని బయలుదేరాడు గార్గ్యాయణి ముని. త్రోవలో గార్గ్యాయణి శ్వేతకేతువుకు నమస్కరించి "శ్వేతకేతూ ! నన్ను ఊర్ధ్వలోకాలకుపంపగలవా? లేకపోతే ఊర్ధ్వలోకాలకు వెళ్ళేమార్గము చెప్పగలవా?" అని అత్యంతవినయంతో అడిగాడు. దానికి శ్వేతకేతువు "నాకు ఆవిద్య తెలియదు. నాతండ్రిని అడిగిచెబుతాను." అని ఆశ్రమానికి వెళ్ళి తండ్రియైన ఉద్దాలకు ఈ విషయము అడిగాడు. ఉద్దాలకుడు తనకుకూడా ఆ విషయము తెలియదు అని చెప్పి, దర్భలు చేత్తోపట్టుకుని తండ్రీకొడుకులిద్దరూ కలిసి గార్గ్యాయణి దగ్గరకు వెళ్ళి అతడు అడిగినవిషయాన్ని వివరించమని ప్రార్థించారు. ఆ ప్రార్థన ఆలకించిన గార్గ్యాయణి ఈ విధంగా చెప్పటం ప్రారంభించాడు.

దక్షిణాయనంలో ప్రయాణం చేసినవారు చంద్రలోకం చేరతారు. చంద్రలోకము స్వర్గానికిద్వారముగా ఉన్నది. చంద్రలోకం చేరినవారు తిరిగి భూలోకంలో జన్మించాలి. ఏజీవులైతే తాముచేసిన పుణ్యకర్మలకు సమాధానంచెప్పగలరో, వారే స్వర్గానికిపోగలరు. వీరు తమపుణ్యఫలము స్వర్గంలో అనుభవించిన తరువాత,

కర్మశేషముఅనుభవించటానికి వర్షముద్వారా భూలోకానికివస్తారు. ఆ తరువాత వారి కర్మఫలాన్నిబట్టి క్రిమికీటకాలుగానో, పశుపక్ష్యాదులు, మృగాలు ఈ రకంగా జన్మిస్తారు.

నివృత్తిమార్గం అదే దేవయానము. దీనిగుండా ప్రయాణించిన జీవుడు ముందుగా అగ్నిలోకం చేరుకుంటాడు. ఆతరువాత వాయులోకము, వరుణలోకము, ఆదిత్యలోకము, ఇంద్రలోకము, ప్రజాపతిలోకాలకు వెళ్ళి చివరకు బ్రహ్మలోకము చేరతాడు. బ్రహ్మలోకంలో 'అరః' అనే సరస్సుఉన్నది. అక్కడ 'యేష్టిహా' ముహూర్తములు గడుపుతాడు. 'విరజానది' ఉన్నది. 'ఈల్య' అనేవృక్షము 'సాయుజ్యము' అనేపట్టణము ఉన్నాయి. 'అపరాజితము' అనేసౌధమున్నది. ఆ సౌధములో ఇంద్రుడు, ప్రజాపతి ద్వారపాలకులుగా ఉంటారు. అందులో 'విభు' అనేపేరుగల సభావేదిక ఉన్నది. దానిమీద 'విచక్షణా' అనే తేజోవంతమైన సింహాసనమున్నది. 'అమితేజః' అనే గొప్పవాహనమున్నది. మానసీ, చాక్షుషీ అనే పేర్లుగల ఇద్దరుదేవకాంతలు పుష్పములు చేత్తో పట్టుకుని జగత్తులను చూపుతుంటారు. అప్సరసలు, మాతృదేవతలు, నదీమతల్లులు, దాసీజనము అక్కడ సహకరిస్తారు. ఇక్కడికి చేరినవారు బ్రహ్మలోక సుఖమనుభవిస్తారు. బ్రహ్మ స్వయంగా వచ్చి వారితో "నా ఐశ్వర్యాన్ని దర్శించండి. అనుభవించండి. విరజానదిలో స్నానం చెయ్యండి మీకు ముసలితనము రాదు" అని చెబుతాడు.

బ్రహ్మలోకము చేరిన జీవుడి దగ్గరకు ఐదు వందల మంది అప్సరసలు వస్తారు. ఇందులో

వందమంది – మధురమైన పళ్ళు తెస్తారు.

వందమంది – సుగంధలేపనము తెస్తారు.

వందమంది – పూలమాలలు తెస్తారు

వందమంది – సుగంధద్రవ్యాలు తెస్తారు

మిగిలినవారు అక్కడకుచేరినవారిని బ్రహ్మలాగా అందంగాఅలంకరిస్తారు. అలంకరణ పూర్తిఅయిన తరువాత బ్రహ్మదగ్గరకు బయలుదేరతాడు జీవుడు. త్రోవలో అరఅనేసరస్సులో మనస్సుతోనేస్నానంచేస్తాడు. యేష్టిహా అనే ముహూర్తాలు

గడుపుతాడు. అక్కడనుండి విరజానదికి బయలుదేరతారు. ఈనది జీవులను అమరులుగా చేస్తుంది. అందులో కూడా మనస్సుతోనే స్నానం చేస్తారు. అక్కడ పాపపుణ్యాలన్నీ వదిలేస్తారు. అలా వదలిపెట్టబడిన పాపపుణ్యాలు తనవారిని చేరతాయి. అంటే ఆ జీవికి ప్రియమైన వారికి పుణ్యము, అప్రియమైన వారికి – పాపము చేరుతుంది. ఈ విధంగా పాపపుణ్యాలు, సుఖదుఃఖాలు వదలి జీవుడు బ్రహ్మను చేరటానికి వెడతాడు.

త్రోవలో 'ఈల్య' వృక్షముదగ్గరకు చేరతాడు. అప్పుడు బ్రహ్మయొక్క సుగంధ చైతన్యము ఇతడిలోచేరుతుంది. అక్కడ నుంచి సాయుజ్యము అనే పట్టణం చేరతాడు. అక్కడ బ్రహ్మచైతన్యము ఇతనిలోచేరుతుంది. అపరాజితఅనే సౌధాన్ని చేరతాడు. అక్కడ బ్రహ్మతేజస్సు ఇతనిలోచేరుతుంది. అప్పుడు ద్వారపాలకులైన ఇంద్రుడు, ప్రజాపతిల దగ్గరకు వస్తాడు. వారు అతిప్రేమతో జీవుడికి త్రోవనిస్తారు. తరువాత 'విభు' అనే సభావేదికచేరతాడు. బ్రహ్మతేజము ఇతనిలోచేరుతుంది. తరువాత 'విచక్షణ' అనే బ్రహ్మసింహాసనము చేరతాడు జీవి. అక్కడ బృహద్రధంతర సామగానములు సింహాసనము ముందుకాళ్ళలోను, దైత్యనౌధస గానములు వెనక కాళ్ళలోను వినిపిస్తాయి. వైరూప, వైరాజ, శాక్వర, రైవత ప్రజ్ఞలుప్రకాశిస్తాయి. వాటితో సంభాషణ జరుగుతుంది. అక్కడ 'అమితాజసనము' అనే వాహన ముంటుంది. అది ప్రాణవాయువు. భూతభవిష్యత్తులు దానిముందుకాళ్ళు. సంపదలు, ఆహారము వెనుకకాళ్ళు. భద్రయజ్ఞా యజ్ఞీయములు రెండుశిరస్సులు, బృహత్ రథంతర సామగానములు రెండుప్రక్క కర్రలు. యజస్సులు అడ్డంగా ఉండే చెక్కలు. సోమలతలు క్రిందఉన్న చాపలు. ఉద్గీతములు మొత్తనిదిండ్లు. అక్కడ బ్రహ్మ ఆసీనుడై ఉంటాడు. జీవుడు బ్రహ్మదగ్గరకు వెడతాడు. అక్కడ బ్రహ్మజీవుని కొన్ని ప్రశ్నలు అడుగుతాడు. వాటికి జీవుడు సమాధానం చెబుతాడు.

**బ్రహ్మ :** మీరెవరు ?

**జీవి :** నేను ఋతుదేవతను. ఋతుధర్మముతో నాకు సంబంధమున్నది. ఆకాశంనుంచి శుక్లరూపంలో స్త్రీగర్భంలో చేరాను. సంవత్సర తేజస్సుగా, అన్ని జీవాత్మలవలె ఉన్నాను. నీవు సర్వజీవాత్మలకు ఆత్మవై ఉన్నావు. నీకులానే నేనుకూడా ఆత్మనే.

**బ్రహ్మ :** నేను ఎవరు ?

**జీవి :** నీవుసర్వాత్మవు.

**బ్రహ్మ :** సర్వాత్మ ఎవరు ?

**జీవి :** ఇంద్రియదేవతలు కాదు, ప్రాణవాయువు కాదు, అదే సత్యము. అదే సమస్తజగత్తు. నువ్వు కూడా ఈ జగద్రూపమై ఉన్నావు.

**బ్రహ్మ :** తెలియరాని నా పురుష రూపములు నీవు ఏ విధంగా తెలుసుకున్నావు.

**జీవి :** ప్రాణవాయువు శ్వాసవల్ల తెలుసుకున్నాను.

**బ్రహ్మ :** స్త్రీ రూపాన్ని ఎలా తెలుసుకున్నావు ?

**జీవి :** వాక్కుద్వారా తెలుసుకున్నాను.

**బ్రహ్మ :** నపుంసక రూపము ఏ రకంగా తెలుసుకున్నావు ?

**జీవి :** మనస్సు ద్వారా

**బ్రహ్మ :** వాసనలు ఏ రకంగా తెలుసుకున్నావు ?

**జీవి :** ఘ్రాణేంద్రియము ద్వారా

**బ్రహ్మ :** రూపమును ఎలా తెలుసుకున్నావు?

**జీవి :** నేత్రములద్వారా

**బ్రహ్మ :** శబ్దమును ఎలా తెలుసుకుంటున్నావు ?

**జీవి :** శ్రోత్రేంద్రియములద్వారా

**బ్రహ్మ :** రసములనెలా తెలుసుకుంటున్నావు ?

**జీవి :** జిహ్వాద్వారా

**బ్రహ్మ :** నువ్వు చేసే కర్మలనెలా తెలుసుకున్నావు ?

**జీవి :** రెండు చేతులద్వారా

**బ్రహ్మ :** సుఖదుఃఖాలనెలా తెలుసుకున్నావు ?

**జీవి :** శరీరము ద్వారా

**బ్రహ్మ :** ఆనందము, రతిసౌఖ్యము, సంతానోత్పత్తి ఎలా తెలుసుకున్నావు ?

**జీవి :** ఉపస్థేంద్రియము ద్వారా

**బ్రహ్మ :** నడవటం ఎలా తెలుసుకున్నావు ?

**జీవి :** పాదాలద్వారా

**బ్రహ్మ :** సంకల్పములను, భావనలు, కోరికలు ఎలా తెలుసుకున్నావు ?

**జీవి :** బుద్ధిప్రజ్ఞతో. జలమయమైన ప్రపంచం అంతా నాదే. నీది కూడా సమస్త జగత్తు బ్రహ్మమయము. ఈ విషయం తెలిసినవాడు కూడా బ్రహ్మమే"

ఆ మాటలకు ఆనందించిన వాడై **"నేను అనుభవించే సుఖాలు మీరుకూడా అనుభవిస్తూ నాతోపాటు ఇక్కడే ఉండండి" అంటాడు పరమేశ్వరుడు.** పరమేశ్వరుని మాట తలదాల్చినవారై ఈ భక్తులు కూడా ఆ పరమపదంలోనే ఉంటారు. సాకారాన్ని ఉపాసించిన వారు ఈ మార్గం ద్వారానే పరమపదం చేరతారు. పరమపదం చేరినవారికి పునర్జన్మ ఉండదు. అని వారంటారు. ఇదే మహదైశ్వర్యము. బ్రహ్మానందము.

దీన్నే పరమపదము, కైవల్యము అంటారు. ఇక్కడకి చేరినవారు పరమేశ్వరుణ్ణి సేవిస్తూ, అక్కడ జరిగే నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాది వివిధ ఉత్సవాలు కళ్ళారాచూస్తూ ఉండిపోతారు. అక్కడ కష్టాలు, బాధలు, దుఃఖము అనేవి ఉండవు. అంతా ఆనందమేఉంటుంది. అదేబ్రహ్మానందం. ఇక్కడికి చేరిన వారికి పునర్జన్మఉండదు. అతడికి శాశ్వతమైన ఆనందంలభిస్తుంది. ఇందులో ఉపాసకులంతా అర్చిరాదిమార్గం ద్వారానే వెడతారు అనిచెప్పబడింది. వాయ్వాది మార్గాలన్నీ దీనిలోనే అన్వయించబడతాయి. ఎక్కడైనా మార్గంచెప్పకపోతే, అక్కడ కూడా అది అర్చిరాదిమార్గమే అనిగ్రహించాలి.

## ముక్తి

శుక్లయజుర్వేదానికి సంబంధించిన **ముక్తికోపనిషత్తు**లో ఆంజనేయుడు శ్రీరాముడితో అంటున్నాడు.

"రామచంద్రా! కొంతమంది మునీశ్వరులు ముక్తి ఒకే రకమని చెబుతున్నారు. అది 1. భగవన్నామ సంకీర్తనం ద్వారా పొందవచ్చు అని, 2. కాశీలో మరణించిన వారు తారకమంత్రోపదేశం పొంది ముక్తిని పొందుతారు అని 3. సాంఖ్యయోగంతో

ముక్తి పొందుతారని 4. భక్తియోగంతో ముక్తి పొందుతారని 5. వేదాంతవాక్య విచారణ వల్ల ముక్తి పొందుతారని 6. సాలోక్యము, సారూప్యము, సామీప్యము, సాయుజ్యము అని ముక్తి నాలుగు రకాలు అంటున్నారు. వీటిని గురించి నాకు వివరించవలసింది" అంటాడు. దానికి శ్రీరాముడు సమాధానం చెబుతున్నాడు. హనుమా!

**కైవలముక్తి రేకైవ పారమార్థిక రూపిణీ**

కైవల్యముక్తి ఒకటిగానే ఉన్నది. ఇదే పారమార్థిక రూపమయిన నిజమైన మోక్షము.

**దురాచారరతో వాపి మన్నామ భజనాత్కపే**

**సాలోక్యముక్తి మాప్నోతి నతులోకాంతరాదికమ్**

దురాచారుడైనా సరే నా నామ సంకీర్తన చేసినట్లైతే **సాలోక్యము** అనే ముక్తిని పొందుతాడు. అతడు ఇతర లోకాలకు వెళ్ళడు. వైకుంఠానికే వెడతాడు.

**కాశ్యాంతు బ్రహ్మనాళేస్మిన్ మృతోమత్తారమాపుయాత్**

**పునరావృత్తి రహితాం ముక్తిం ప్రాప్నోతి మానవః**

**సైవసాలోక్య సారూప్యముక్తిః ఇత్యభిధీయతే**

ఒకవేళ దురాచారుడైనా కాశీక్షేత్రంలో మరణించినట్లైతే, మరణసమయంలో ఈశ్వరుడు నాయొక్క తారకమంత్రాన్ని అతడి కుడిచెవిలోచెబుతాడు. కాబట్టి అతడు పునరావృత్తిలేని మోక్షంపొందుతాడు. ఈవిధంగా తారకమంత్రోపదేశం పొందినవాడు సమస్త పాపాలనుంచి విముక్తుడై మోక్షంపొందుతాడు. అందువల్ల అతడికి నా **సారూప్యముక్తి** లభిస్తుంది.

**సదాచార రతోభూత్వాద్విజోనిత్యమనన్యధీః**

**మయి సర్వాత్మకేభావో మత్సామీప్యం భజత్యయమ్**

**సైవ సాలోక్య సారూప్య సామీప్యాముక్తిరిష్యతే ॥**

సదాచారసంపన్నుడైనవాడు నిత్యము నాయందే మనసు లగ్నంచేసి **సామీప్యముక్తి** పొందుతాడు.

**గురూపదిష్టమార్గేణ ధ్యాయన్మద్రూప మవ్యయమ్**

**మత్సాయుజ్యం ద్విజస్సమ్యగ్భజేత్ భ్రమరకీటవతు ॥**

**సైవసాయుజ్యముక్తి స్స్యాత్ బ్రహ్మానందకరీ శివా**

**చతుర్విధా యచాముక్తిః మదుపాసనయా భవేత్ ॥**

గురూపదేశంపొంది నన్నే ధ్యానంచేసేవాడు నాసాయుజ్యం పొందుతాడు. దాన్నే మంగళకరము, ఆనందదాయకము అయిన సాయుజ్యము అంటారు. కాబట్టి హనుమా! నన్ను ధ్యానంచెయ్యటంవల్ల ఈరకంగా చతుర్విధముక్తులు పొందుతారు." అంటాడు. ఈ నాలుగు రకాలయిన పద్ధతులలోను **పునరావృత్తి రహితాం ముక్తిం ప్రాప్నోతి మానవః** పునరావృత్తి అంటే పునర్జన్మ లేని ముక్తి పొందుతాడు. శంకర భగవత్పాదుల వారు శివానందలహరిలోని 28వ శ్లోకంలో

**సారూప్యం తవపూజనే శివమహాదేవేతి సంకీర్తనే**

**సామీప్యం శివభక్తి ధుర్యజనతా సాంగత్య సంభాషణే**

**సాలోక్యం చరాచరాత్మక తనుధ్యానే భవానీపతే**

**సాయుజ్యం మమసిద్ధి మత్రభవతి స్వామిన్ కృతార్థో స్వహమ్ ॥**

ఓ భవానీ పతీ ! నేనునిన్ను భక్తితో పూజించటంవల్ల సారూప్యము, శివా ! మహాదేవా ! అని స్తుతించటం వల్ల సామీప్యము, నీ భక్తులతో సహవాసం చెయ్యటం వల్ల సాలోక్యము, నీ స్వరూపధ్యానంవల్ల సాయుజ్యము నాకు కలుగచేశావు. నేను కృతార్థుడనైనాను." అంటున్నారు.

ఇక్కడ గమనించవలసిన విషయం ఏమంటే – కైవల్యముక్తి ఒకటేగానే ఉంటుంది. కాని దాన్ని పొందే విధానాన్ని బట్టి పేరు మాత్రం మారుతుంది. **ముక్తికోపనిషత్తు**లో చెప్పిన ప్రకారం

1. నామ సంకీర్తనతో పొందేది – సాలోక్యముక్తి
2. తారక మంత్రోపదేశంతో పొందేది – సారూప్యముక్తి
3. సదాచార సంపన్నుడు పొందేది – సామీప్యముక్తి
4. గురూపదేశం ద్వారా పొందేది – సాయుజ్యము

శివానందలహరిలో శంకర భగవత్పాదుల వారు చెప్పిన ప్రకారం

1. భక్తితో పూజించటం వల్ల - సారూప్యముక్తి
2. స్తుతి చేయటం వల్ల - సామీప్యముక్తి
3. సత్సాంగత్యము వల్ల - సాలోక్యముక్తి
4. స్వరూప ధ్యానం వల్ల - సాయుజ్యము లభిస్తాయి.

ముక్తికోపనిషత్తులో నాలుగు విధాలయిన ముక్తుల యందు పునరావృత్తి లేదు అన్నారు. అంటే అదే కైవల్యము. కాని శంకర భగవత్పాదుల వారు శివానందలహరిలో చెప్పింది క్రమముక్తి. నాలుగు రకాల ముక్తులు ఒకటి కాదు. వీరందరికీ జన్మరాహిత్యం జరగదు. వీరికి జ్ఞానసముపార్జన జరిగితేనే కైవల్యప్రాప్తిజరుగుతుంది. అంటే సారూప్యముక్తి పొందినవారు జ్ఞానసముపార్జనతో ఒక్కొక్క మెట్టే పైకి ఎక్కి చివరకు సాయుజ్యం పొందాలి. అలాగే సామీప్య, సాలోక్య ముక్తులు కూడా.

**విష్ణుసహస్రం**లో 768వ నామం **చతుర్గతిః** నాలుగు గతులు గలవాడు. **చతురస్రః ప్రాప్తమో యస్మిన్ భక్తానాం స చతుర్గతిః** ఇంద్ర పదవి, బ్రహ్మపదవి, కైవల్యము, మోక్షము అనే నాలుగు రకాలైన పదవులను అధికారులైన భక్తుల కిచ్చేవాడు. **చతురస్రః గతయః ప్రాప్తయః యస్మిన్సః చతుర్గతిః** ఉపాసకుల శక్తి సామర్థ్యాలను బట్టి వారికి పదవులు ఇచ్చేవాడు. కాబట్టి పరమపదం చేరిన వారందరికి జన్మరాహిత్యం ఉండదు.

వైద్యవిద్యలో సీట్లు కేటాయించేటప్పుడు కొన్ని పద్ధతులు అనుసరిస్తాడు.

1. ఎన్.సి.సి. కోటా 2. స్పోర్ట్సు కోటా 3. రిజర్వేషన్లు 4. మెరిట్. వీటిలో దేని ద్వారా నైనా సీటు పొందవచ్చు. ప్రవేశం లభించిన తరువాత అందరూ ఒకే క్లాసులో ఉంటారు. కాని వారందరూ ప్రథమశ్రేణిలోనే ఉత్తీర్ణులు కారు. అలాగే ఏ మార్గం ద్వారానైనా పరమపదం చేరవచ్చు. పరమపదం చేరినవారందరూ జన్మరాహిత్యం పొందరు. వీరిలో జ్ఞానులు మాత్రమే సాయుజ్యం పొందుతారు. వారికి మాత్రమే పునర్జన్మ ఉండదు **జ్ఞానాదేవతుకైవల్యం** అంటున్నారు **పరమానందనాథులు.**

కాని శ్రీవిద్యలో క్రమముక్తినే చెప్పటం జరిగింది.

ఆధార స్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. ఇక్కడ దేవిని అర్చించేవారు కామ్యవాదులు. వీరికి ముక్తితో పనిలేదు. అందుకే మణిపూరచక్రం నుంచి ముక్తి చెప్పబడింది.

1. మణిపూరంలో దేవిని అర్చించిన వారికి **సార్షిరూపముక్తి**

2. అనాహతంలో దేవిని అర్చించిన వారికి **సాలోక్యముక్తి**

3. విశుద్ధి చక్రంలో దేవిని అర్చించిన వారికి **సామీప్యముక్తి**

4. ఆజ్ఞా చక్రంలో దేవిని అర్చించిన వారికి **సారూప్యముక్తి**

5. సహస్రారంలో పరమేశ్వరిని అర్చించిన వారికి **సాయుజ్యము** లభిస్తాయి. ఇది క్రమముక్తి. అందుకే పంచబ్రహ్మలు ఆ పరమేశ్వరిని అతిదగ్గరగా ఉండి అర్చించాలనే కోరికతో విశుద్ధిచక్రంలో దేవిని అర్చించి బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు దేవి కూర్చునే ఆసనానికి నాలుగు కాళ్ళుగా సదాశివుడు కప్పుకునే దుప్పటి అయినాడు. అని శంకర భగవత్పాదుల వారు సౌందర్యలహరిలోని 92 వ శ్లోకంలో చెప్పారు.

**గతా స్తే మఞ్చత్వం ద్రుహిణహరిరుద్రేశ్వరభృతః**
**శివ స్స్వచ్ఛచ్ఛాయాకపటఘటిత ప్రచ్ఛదపటః ।**
**త్వదీయానాం భాసాం ప్రతిఫలనరాగారుణతయా**
**శరీరీ శృఙ్గారో రస ఇవ దృశాం దోగ్ధి కుతుకమ్॥**

ఓదేవీ ! బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు అనే వారు నీమంచానికి కోళ్ళుకాగా, సదాశివుడు నీవు కప్పుకునే దుప్పటి అయినాడు.

ఈశ్లోకంలో పరమేశ్వరిసింహాసనానికిఉన్నకోళ్ళను వివరిస్తున్నారు. ముక్తి ఐదు విధాలుగా ఉంటుంది. వీటినే **పంచవిధముక్తులు** అంటారు. షట్చక్రాలలోను ఒక్కొక్క చక్రంలో పరమేశ్వరిని ఆరాధించే వారికి ఒక్కొక్క రకమైన ముక్తిలభిస్తుంది. ముక్తి అంటే విముక్తి. భవబంధాల నుండి విముక్తిపొందటమే ముక్తి.

ఆధార స్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. వాటిలో పరమేశ్వరిని కౌళులు ఉపాసిస్తారు. వీరికి ఇహమేకాని పరంఉండదు. ఇక్కడ సమయాచారులు పరమేశ్వరిని అర్చించరు. బాహ్యపూజ చేసేవారికి కేవలము ఐహికమైనకోరికలుమాత్రమే తీరతాయి. వీరికి ముక్తితోపనిలేదు. అంతరారాధన చేసేవారికి మాత్రమే సాయుజ్యం లభిస్తుంది.

**1. సార్షిరూపముక్తి:** మణిపూరంలో పరమేశ్వరిని అర్చించేవారు దేవిపురానికి దగ్గరగా ఇంకొకపురము నిర్మించుకుని ఉండగలుగుతారు.

**2. సాలోక్యముక్తి :** అనాహతంలో భగవతిని అర్చించేవారు దేవి ఉండే పురంలోనే ఒకమూల ఉండగలుగుతారు.

**3. సామీప్యముక్తి:** విశుద్ధిచక్రంలో దేవినిఅర్చించేవారు దేవికిఅతిదగ్గరగా ఉండి ఆమెనుసేవించగలుగుతారు.

**4. సారూప్యముక్తి :** ఆజ్ఞాచక్రంలో దేవినిఅర్చించేవారు ఆమెతోపాటుగా సమానమైన రూపంధరించి భక్తుల కోరికలుతీరుస్తుంటారు.

**5. సాయుజ్యము :** సహస్రారంలో పరమేశ్వరిని అర్చించేవారు పరమేశ్వరిలో లీనమవుతారు. వారికి మరుజన్మఉండదు.

బ్రహ్మ విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు ఐదుగురు పరమేశ్వరికి అతిదగ్గరగాఉండి సేవించాలనే తలంపుతో విశుద్ధిచక్రంలో ఆమెను ఉపాసించి, సామీప్య ముక్తి పొంది, పరమేశ్వరి సింహాసనానికి కాళ్ళు అయినారు. వీరు తమయొక్క శక్తికోల్పోయి అచేతనులైనారు. అందుకే అచేతనులైన వీరు ప్రేతములతోసమానము. కాబట్టి వీరిని పంచప్రేతములు అంటారు. వీరిలో మొదటినలుగురు పరమేశ్వరి సింహాసనానికికాళ్ళు కాగా సదాశివుడు కప్పుకునేదుప్పటి అయినాడు. ఈ రకంగా సగుణోపాసకులకు క్రమముక్తి, నిర్గుణోపాసకులకు సాయుజ్యము సిద్ధిస్తాయి. ముక్తి అంటే బ్రహ్మలోకం చేరటం. సాయుజ్యము అంటే జీవాత్మ పరమాత్మలో లీనం కావటం.

**రుద్రయామళంలో**

**బ్రహ్మవిష్ణుశ్చరుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః**
**ఏతే పంచ మహాప్రేతా భూతాధి పతయో మాతాః ॥**

దేవీ భాగవతంలో మణిద్వీపాన్ని వర్ణిస్తూ

**చింతామణి గృహేరాజన్ శక్తి తత్త్వాత్మకైః పరైః**
**సోపానైః దశభిర్యుక్తో మంచకోప్యధిరాజితే**
**బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః**
**ఏతే పంచఖురాః ప్రోక్తాః ఫలకశ్చ సదా శివః ॥**

చింతామణి గృహంలో శక్తితత్త్వాత్మకమైన పదిమెట్లవరుసతో దివ్యకాంతులు వెదజల్లే ఆసనమున్నది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు దానికి పాదాలు (కోళ్ళు) కాగా, సదాశివుడు దానిపై పలకగా ఉన్నాడు.

లలితాసహస్రంలోని 249,250 నామాలలో ఈ విషయం చెప్పబడింది.

**249. పంచప్రేతాసనాసీనా** పంచప్రేతములే ఆసనముగా గలది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు వీరు ప్రేతాలయినారు. వీరు ఎప్పుడైతే తమశక్తినికోల్పోయారో, అప్పుడు ప్రేతములవుతున్నారు. దేవీభాగవతంలో చిన్నకథ ఉంది. మధుకైటభులను సంహరించిన తరువాత పరమేశ్వరి తనఅంశలైన శక్తులను వీరికి తోడుగా ఇచ్చి, వీరిని ఎప్పుడూ అవమానించకండి. వీరు లేకపోతే మీరు అశక్తులు, శక్తిహీనులవుతారు అని చెప్పింది. కాలాంతరంలో ఆ శక్తులు అవమానింపబడి వెళ్ళిపోతాయి. అప్పుడు వీరంతా అశక్తులై పంచప్రేతములైనారు

**250. పంచబ్రహ్మ స్వరూపిణీ** పంచబ్రహ్మలయందు ఐక్యముగలది. **త్రిపురా సిద్ధాంతము**లో పరమేశ్వరుడు తన మాయావిలాసంవల్ల పంచబ్రహ్మలుగా పిలువబడుతున్నాడు. సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములు పంచబ్రహ్మల స్వరూపం గలది ఆ పరాశక్తి.

**లింగపురాణం**లో జీవ, ప్రకృతి, బుద్ధి, అహంకారము, మనస్సులను పంచబ్రహ్మలు అంటారు. వీటియొక్క స్వరూపమే పరమేశ్వరి.

**గరుడపురాణం**లో దుష్టశిక్షణ కోసం శ్రీమహావిష్ణువు 1. నారాయణ 2. సంకర్షణ 3. వాసుదేవ 4. ప్రద్యుమ్న 5. అనిరుద్ధులు అయినాడని చెప్పబడింది. పరమేశ్వరియొక్క లీలలు పంచపురుషులైనారు. వారే పంచబ్రహ్మలు. వారి స్వరూపమే దేవి. అందుకే ఆమె పంచబ్రహ్మస్వరూపిణి.

లలితా సహస్రంలోని 947వ నామం **పంచప్రేతమంచాధిశాయినీ** ఐదు ప్రేతములను ఆసనంగాకలిగినది.

| | | |
|---|---|---|
| ఆధార స్వాధిష్ఠానాల తరువాత | – | బ్రహ్మగ్రంధి |
| మణిపూర, అనాహతాల తరువాత | – | విష్ణుగ్రంధి |
| విశుద్ధి ఆజ్ఞాచక్రాల తరువాత | – | రుద్రగ్రంధి |
| లలాటంపైన | – | ఈశ్వరగ్రంధి |
| సహస్రారంలో | – | సదాశివగ్రంధి |

ఇవే పంచప్రేతాసనాలు. వీటిపైన బైందవస్థానంలో మహాకామేశ్వరుడు, అతని వామాంకముమీద మహాకామేశ్వరి ఉంటారు.

58వ నామం పంచబ్రహ్మాసనస్థితా. పంచబ్రహ్మలచేత చేయబడిన ఆసనం మీద కూర్చున్నది. పంచబ్రహ్మలనే కోళ్ళుగాగల ఆసనంమీద కూర్చున్నది. ఆమెయే ముక్తినిచ్చే దేవత.

అంటే పరమేశ్వరిని ఒక్కొక్క ప్రదేశంలో అర్చించిన వారికి ఒక్కో రకమైన ఫలితం వస్తుంది. దీన్నే క్రమముక్తి అంటారు. ఇందులో 'సాయుజ్యం' పొందిన వారికి పునర్జన్మ లేదు. మిగిలిన వారికి పునర్జన్మ ఉన్నది. ఇది అద్వైత సిద్ధాంతం. శ్రీవిద్యా సాంప్రదాయం. ఇక్కడ జ్ఞానంలేని **సగుణోపాసకుల జీవాత్మ పరమాత్మలో లీనం కాదు అనే మాట ఘంటాపథంగా చెబుతున్నారు పరమానందనాథులు.**

## 2. వాయువ్యాధికరణము

### (ఉత్క్రమించే జీవుడు సంవత్సరదేవత తరువాత వాయువును పొందుతాడు)

ఉత్క్రమించే సమయంలో జీవుడు ముందు సంవత్సర దేవతను పొంది, ఆ తరువాత వాయుదేవతను పొందుతాడు అని రెండవదైన **వాయ్వధికరణము**లో చెబుతున్నారు. ఇందులో ఒక సూత్రం ఉంది.

మోక్షాధికారులు అర్చిరాదిమార్గం గుండా వెడతారు అన్నారు. ఆ మార్గము యొక్క క్రమము.

1. **కౌశీతకీ ఉపనిషత్తు**లో "ఉపాసకుడు ముందుగా అగ్నిలోకానికి పోతాడు. అక్కడ నుంచి వరుసగా వాయు, వరుణ, ఇంద్ర, ప్రజాపతి లోకాలకు పోయి ఆ తరువాత బ్రహ్మలోకం చేరతాడు."

2. **ఛాందోగ్యోపనిషత్తు**లో "ఉపాసకుడు అర్చిరభిమాన దేవతను పొందుతాడు. అక్కడి నుండి దినాభిమాన దేవతను, అక్కడ నుండి శుక్లపక్ష అభిమానదేవత, ఉత్తరాయణ దేవత, సంవత్సరదేవత, సూర్యలోకము, చంద్రలోకము, విద్యుత్తు లోకము ఆ తరువాత బ్రహ్మలోకము పొందుతాడు."

3. **బృహదారణ్యకోపనిషత్తు**లో "ఈ లోకం నుండి నిష్క్రమించే పురుషుడు వాయువును పొందుతాడు. ఆకాశంలో ఘనీభవించిన ఆ వాయువు పగిలిపోయి మార్గం ఇస్తుంది. ఆమార్గంగుండా ఉపాసకుడు సూర్యలోకం చేరతాడు.

ఈ రకంగా అర్చిరాది మార్గవర్ణనలో తేడా వున్నది. **కౌశీతకం**లో దేవయానంలో వాయుమార్గం రెండవది. ఛాందోగ్యంలో వాయు మార్గం లేదు. ఈ రకంగా తేడాలున్నాయి. మరి వాయుమార్గం ఎక్కడ ఉంది?

***సూత్రం - 519 "వాయుమబ్దాదవిశేషవిశేషాభ్యామ్"***

వాయువును సంవత్సరానికి తరువాత, ఆదిత్యునికి ముందు చేర్చాలి.

బృహదారణ్యకంలో ఆదిత్యలోకానికి ముందు, సంవత్సర లోకానికి తరువాత వాయులోకం చెప్పారు. ఈ వాయులోకంద్వారానే సూర్యలోకం పొందుతాడు. ఉపాసకుడు అర్చిరాదిమార్గాన ప్రవేశించి వరుసగా పగటిపూట దేవత, శుక్లపక్షదేవత, మాసదేవత, సంవత్సరదేవతలను పొంది అక్కడనుండి దేవలోకానికి, వాయులోకానికి చేరి, ఆ వాయువుచేత కల్పించబడ్డ రంధ్రంద్వారా ఆదిత్యలోకం చేరి, అక్కడ నుండి బ్రహ్మలోకం చేరతాడు. అని చెప్పబడింది. కాబట్టి వాయులోకము ఆదిత్య లోకానికి ముందు, సంవత్సరలోకం తరువాత ఉంటుంది.

## 3. వరుణాధికరణము

### (విద్యుద్దేవత తరువాత జీవుడు వరుణలోకం చేరతాడు)

ఈ విషయం మూడవదైన **వరుణాధికరణము**లో చెప్పబడింది. ఇందులో ఒక సూత్రం ఉంది.

**కౌశీతకీ ఉపనిషత్తు**లో, అర్చిరాదిమార్గంలో వరుణలోకం ఉందన్నారుకదా! అది ఎక్కడఉన్నదో చెబుతున్నారు.

***సూత్రం - 520 "తడితోధి వరుణః సంబన్ధాత్"***

వరుణుడికి విద్యుత్తుతో సంబంధం ఉన్నది. కాబట్టి విద్యుల్లోకానికి పైన వరుణ లోకమున్నది.

విద్యుత్తు తరువాత వరుణుడికి స్థానముంటుంది. ఎందుచేతనంటే వరుణుడికి విద్యుత్తుతో, అంటే మెరుపుతో సంబంధమున్నది. అందుచేత విద్యుల్లోకానికి పైన వరుణలోకమున్నది. మెరుపు వచ్చిన తరువాతే వర్షం వస్తుంది.

# 4. అతివాహికాధికరణము

## (అర్చిరాదులందరూ అతివాహిక దేవతలే)

అర్చిరాదిమార్గంలో ఉండేదేవతలంతా అతివాహక దేవతలేను అని వివరిస్తున్నారు నాల్గవదైన **అతివాహికాధికరణములో**. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

అర్చిరాది మార్గంలో అనేకమైన లోకాలను వరుసగా చెప్పారుకదా. ఇవన్నీ గుర్తు కోసమా? త్రోవలో విశ్రాంతి తీసుకోవటానికి స్థానాలా? లేక ఉపాసకుణ్ణి బ్రహ్మలోకానికి తీసుకుపోయే దేవతలా?

***సూత్రం - 521 "అతివాహికాస్తల్లిఙ్గాత్"***

బ్రహ్మలోకానికి ప్రయాణమయ్యేవాడికి ఇవన్నీ అతివాహికలు. ఈ అర్చిరాదులన్నీ ఉపాసకుణ్ణి వెంటపెట్టుకుని బ్రహ్మలోకానికి తీసుకువెడతాయి. "విద్యులోకమునుంచి దివ్యపురుషుడొకడు బ్రహ్మలోకానికి తీసుకొనివెడతాడు." ఈరకంగా ప్రతిలోకంలోను ఆయాదేవతలు ఉపాసకుని జాగ్రత్తగా తరువాత లోకానికి చేరుస్తారు. కాబట్టి వారంతా అతివాహికలే.

***సూత్రం - 522 "ఉభయవ్యామోహాత్తత్సిద్ధేః"***

ఉపాసకుడు వెళ్ళే మార్గాలన్నీ జడాలు. అచేతనాలు. అందుచేత అవి వ్యామోహితాలు. జడాలు కాబట్టి వాటికి సంకల్పం ఉండదు. ఉపాసకుణ్ణి భరించే సామర్థ్యంఉండదు. ఉపాసకుడుశరీరహీనుడు. అతడికి మార్గజ్ఞానం ఉండదు. కాబట్టి బ్రహ్మలోకంచేరలేడు. అందుకని ఆయాలోకాలలోని దేవతలు అతణ్ణి తరువాత లోకానికి మోసుకొనిపోతారు.

ఈ దేవతలు అన్నికాలాలయందు, అన్నిసమయాలయందు ఉంటారు. ఉత్తరాయణం, దక్షిణాయణం, రాత్రి, పగలు, ఎప్పుడైనా వారుంటారు. కాబట్టి ఉపాసకుడు బ్రహ్మలోకం చేరటానికి ఆటంకం ఏమీఉండదు.

***సూత్రం - 523 "వైద్యుతేనైవ తతస్తచ్ఛ్రుతేః"***

విద్యులోకం తరువాత ఒకపురుషుడు ఉపాసకుణ్ణి బ్రహ్మలోకంచేరుస్తాడు. ఆ విధంగా ప్రతిలోకం నుండి దివ్యపురుషుడు ఉపాసకుణ్ణి ఇంకొకలోకం చేరుస్తూ ఉంటారు. ఆ రకంగా ఉపాసకుడు బ్రహ్మలోకంచేరతాడు. ఈ లోకాలలోని దేవతలంతా అతివాహికలే.

## 5. కార్యాధికరణము (దేవయానం ద్వారా సగుణ బ్రహ్మను పొందుతారు)

ఈ విషయం ఐదవదయిన **కార్యాధికరణము**లో చెబుతున్నారు. ఇందులో ఎనిమిది సూత్రాలున్నాయి.

దేవయానంద్వారా ఉపాసకుడు బ్రహ్మలోకం చేర్చబడతాడు. అని చెప్పారు. అక్కడ బ్రహ్మఅంటే పరబ్రహ్మ లేక కార్యబ్రహ్మ. (కార్యబ్రహ్మ అంటే సాకారబ్రహ్మ ఇతడే అపరబ్రహ్మ)

***సూత్రం – 524 "కార్యం బాదరిరస్య గత్యుపపత్తేః"***

దేవయానంద్వారా వెళ్ళిన ఉపాసకుడు ముందుగా కార్యబ్రహ్మను చేరతాడు. కార్యబ్రహ్మ అంటే సాకార బ్రహ్మ. పరబ్రహ్మ సర్వాంతర్యామి. అందుచేత ఉపాసకుడు ముందుగా సగుణబ్రహ్మ అంటే కార్యబ్రహ్మను చేరతాడు.

***సూత్రం – 525 "విశేషితత్వాచ్చ"***

ఇంకొకశ్రుతిలో కూడా ముందుగా సగుణబ్రహ్మను చేరతాడు అని చెప్పబడింది. కాబట్టి బ్రహ్మలోకముఅంటే కార్యబ్రహ్మమే అని గుర్తించాలి.

***సూత్రం – 526 "సామీప్యాత్తు తద్వ్యపదేశః"***

పరబ్రహ్మకు అతి సమీపంగా ఉంటాడు కార్యబ్రహ్మ. అతడే అపరబ్రహ్మ కాబట్టి అపరబ్రహ్మను కూడా బ్రహ్మమనే అంటాడు.

ఉపాసన కోసము మనోమయత్వాది గుణాలతో కూడినదిగా చెప్పబడే నిర్వికార బ్రహ్మమే కార్యబ్రహ్మము. అందుచేతనే సగుణబ్రహ్మను కూడా బ్రహ్మమనే అంటారు. అద్దంలో కనుపించేది ప్రతిబింబమే అయినా దాన్ని కూడా ముఖము అనే అంటాము. అలాగే కార్యబ్రహ్మకూడా పరబ్రహ్మ లాంటివాడే. పరబ్రహ్మకు ప్రతిరూపం. అపరబ్రహ్మ.

***సూత్రం – 527 "కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్"***

కార్యబ్రహ్మకు ప్రళయం సంభవించినప్పుడు అంటే కల్పాంతమునందు, బ్రహ్మ యొక్క ఆయుర్దాయము పూర్తిఅయినతరువాత, ఈకార్యబ్రహ్మ, పరబ్రహ్మలో లీనమవుతాడు. బ్రహ్మతోపాటే బ్రహ్మలోకంచేరిన జ్ఞానులుకూడా పరబ్రహ్మలో లీనమవుతారు. ఇదే క్రమముక్తి.

**ఉపాసకుడు ఏ దేవతను పరబ్రహ్మగా ఉపాసిస్తున్నాడో అతడే కార్యబ్రహ్మ. వైష్ణవులకు – విష్ణువు, శైవులకు – ఈశ్వరుడు. శ్రీవిద్యాపరులకు – పరాశక్తి.**

**కార్యబ్రహ్మ అవుతారు. అందుకే మరణానంతరము ఉపాసకుడు వైకుంఠము, కైలాసము, మణిద్వీపము మొదలైనవి చేరతాడు.**

***సూత్రం – 528 "స్మృతేశ్చ"***

బ్రహ్మలోకం చేరినవారు కల్పాంతం వరకు బ్రహ్మలోకంలో, బ్రహ్మవద్దనే ఉండి, కల్పాంతాన కార్యబ్రహ్మతో కలిసి పరబ్రహ్మలో లీనమవుతారు.

***సూత్రం – 529 "పరం జైమినిర్ముఖ్యత్వాత్"***

బ్రహ్మశబ్దానికి ముఖ్యమైన ఆలంబనం పరబ్రహ్మే కాబట్టి ఇక్కడ గతి పరబ్రహ్మే అని జైమిని ఉద్దేశ్యం.

***సూత్రం – 530 "దర్శనాచ్చ"***

బ్రహ్మనాడీ మార్గాన వెళ్ళినవారు ముక్తిని అంటే అమృతత్త్వాన్ని పొందుతారు. అని వేదం చెబుతోంది. అమృతత్వమనేది పరబ్రహ్మ వల్లనే సంభవం. కార్యబ్రహ్మకు అమృతత్త్వాన్నిచ్చే శక్తి లేదు. కాబట్టి ఇక్కడ బ్రహ్మ అంటే పరబ్రహ్మే అని గుర్తించాలి.

***సూత్రం – 531 "న చ కార్యే ప్రతిపత్త్యభిసన్ధిః"***

ఉపాసకులకు బ్రహ్మలోకమే ప్రాప్తి. అంటే ఇక్కడ కార్యబ్రహ్మమే కాదు. పరబ్రహ్మమే అనిఅర్థము అంటారు. కాని **సగుణోపాసకులకు కార్యబ్రహ్మ, నిర్గుణోపాసకులకు పరబ్రహ్మ.**

## 6. అప్రతీకాలంబనాధికరణము

### (అప్రతీకోపాసకులు బ్రహ్మత్వం పొందుతారు)

ప్రతీకోపాసన చేసేవారు బ్రహ్మలోకం చేరతారు. అప్రతీకోపాసన చేసేవారు బ్రహ్మత్వం పొందుతారు. ఈ విషయాన్ని ఆరవదైన **అప్రతీకాలంబనాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

ఉపాసకులంతా బ్రహ్మలోకం చేరతారా? లేక వారిలో కొందరు మాత్రమే చేరతారా? అనే ప్రశ్నకు సమాధానం చెబుతున్నారు.

ప్రతీకము – అవయవాలు గలది. విగ్రహము.

ప్రతీకోపాసన – విగ్రహారాధన. సగుణారాధన.

అప్రతీకోపాసన – నిర్గుణోపాసన. బ్రహ్మోపాసన.

**_సూత్రం - 532 "అప్రతీకాలమ్బనాన్నయతీతి బాదరాయణ ఉభయథాఽ దోషాత్తత్క్రతుశ్చ"_**

ప్రతీకోపాసకులకు బ్రహ్మత్వం సిద్ధిస్తుందా?

ఈ విషయం మీద భిన్నాభిప్రాయాలున్నాయి. అయితే జ్ఞానులు మాత్రమే సాయుజ్యం పొందుతారు. అని వ్యాసుని అభిప్రాయము. ఎవరు ఏ ఉపాసన చేస్తే ఆ ఫలం పొందుతారు అంటోంది శ్రుతి. విష్ణువును అర్చించిన వారు వైకుంఠం, ఈశ్వరుణ్ణి అర్చించినవారు కైలాసము చేరతారు.

పంచాగ్నివిద్య, దహరవిద్య, పర్యంతకవిద్య, వైశ్వానరవిద్య మొదలైనవి ఉపాసించే వారు మోక్షం పొందుతారు. ఇవన్నీ బ్రహ్మ విద్యలే. ప్రతీకోపాసకులు కాకుండా మిగిలిన వారంతా బ్రహ్మోపాసకులే. వీరంతా బ్రహ్మత్వం పొందుతారు. ప్రతీకోపాసనలో భక్తి ఉన్నది అంతేకాని జ్ఞానంలేదు. అందుకే ప్రతీకోపాసకులకు బ్రహ్మత్వం సిద్ధించదు. వీరు నామరూపాలను ఉపాసిస్తారు. అందుచేత నామరూపాలున్నంత వరకే వీరు చరించగలుగుతారు.

**_సూత్రం - 533 "విశేషం చ దర్శయతి"_**

ప్రతీకోపాసకులు అంటే సగుణారాధకులు. వీరు బ్రహ్మలోకానికి పోతారు. అక్కడ ఉండేది కార్యబ్రహ్మ. పరబ్రహ్మకు ప్రతిరూపం. అతడే అపరబ్రహ్మ. నామరూపాలను ఉపాసించేవారు అవి వ్యాపించినంత వరకు స్వేచ్ఛగా సంచరిస్తారు.

అందుచేత ప్రతీకోపాసకులకు బ్రహ్మత్వం సిద్ధించదు. అప్రతీకోపాసకులు అంటే నిర్గుణోపాసకులు, వీరినే బ్రహ్మోపాసకులు అంటారు. వీరు మాత్రమే బ్రహ్మత్వం పొందుతారు. బ్రహ్మత్వము అంటే సాయుజ్యము, మోక్షము. వీరి జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. కాబట్టి వీరికి పునర్జన్మ ఉండదు.

ప్రతీకోపాసకులు అంటే సగుణారాధకులు బ్రహ్మలోకం చేరతారు. వీరంతా భక్తులు. వీరిలో జ్ఞానమున్న వారు మాత్రమే సాయుజ్యం పొందుతారు.

**ఈ రకంగా ప్రతీకోపాసకులు బ్రహ్మలోకం చేరతారు. అప్రతీకోపాసకులు బ్రహ్మత్వం పొందుతారు.**

**_దీంతో బ్రహ్మసూత్రాలలోని నాల్గవ అధ్యాయంలో మూడవపాదం పూర్తయింది._**

# నాల్గవ అధ్యాయం

## నాల్గవ పాదం

ఈ పాదంలో బ్రహ్మవేత్తలకు కలిగే సాక్షాన్ముక్తి, సగుణోపాసకులకు కలిగే బ్రహ్మసమాన ఐశ్వర్యము వివరిస్తున్నారు. ఇందులో ఏడు అధికరణలు, ఇరవై రెండు సూత్రాలున్నాయి.

| వ. నెం. | అధికరణము | విషయము | సూత్రాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | సంపద్యావిర్భావాధికరణము | ముక్తపురుషుడు స్వస్వరూపంలో ఉంటాడు | 3 |
| 2. | అవిభాగేన దృష్టత్వాధికరణము | ముక్తునికి పరమాత్మకు తేడాలేదు | 1 |
| 3. | బ్రహ్మాధికరణము | ముక్తాత్ముని లక్షణాలు | 3 |
| 4. | సంకల్పాధికరణము | కోరినంతనే ముక్తాత్ముని కోరికలు సిద్ధిస్తాయి | 2 |
| 5. | అభావాధికరణము | ముక్తాత్ములకు శరీరం ఉండటం, లేకపోవటం వారి సంకల్పాధీనం | 5 |
| 6. | ప్రదీపాధికరణము | ముక్తుడు ఒకే కాలంలో అనేక శరీరాల్లో ప్రవేశించగలడు | 2 |
| 7. | జగద్వ్యాపారాధికరణము | ముక్తుడికి జగస్సృష్టి తప్ప మిగిలిన ఐశ్వర్యాలన్నీ ఉంటాయి | 6 |

మొత్తం అధికరణలు 7 సూత్రాలు 22.

అసలు ముక్తి అంటే ఏమిటి? విముక్తి. ఐహిక సంబంధాల నుంచి విముక్తి. మానవుడు **'మమ'** అనుకుంటే బంధం. **నమమ** అనుకుంటే మోక్షం. బంధ మోక్షాలకు మధ్య ఉన్న మాట ఒక్కటే **నాది**. మోక్షం కావాలి అంటే అది ఎక్కడి నుంచో రాదు. దాన్ని ఎవరూ తెచ్చి నీకివ్వరు. అది నీలోనే ఉంది. ముందుగా ఆ విషయం

తెలుసుకోవాలి. నేను నాది అనే అహంకార మమకారాలను, రాగద్వేషాలను వదిలేసి నిస్వార్ధబుద్ధితో, నిరంతరము పరమేశ్వరధ్యానంతో జీవించేవారికి మోక్షం సిద్ధిస్తుంది. దీన్నే ముక్తి, సాయుజ్యము, మోక్షము, జన్మరాహిత్యము మొదలైన పేర్లతో పిలుస్తారు. ముక్తి రెండు రకాలుగా ఉంటుంది. 1. జీవన్ముక్తి 2. విదేహముక్తి బ్రహ్మసూత్రాలలో ఈ విషయాలను ప్రత్యేకంగా చెప్పకపోయినప్పటికీ పాఠకులకు తెలియటం కోసం వాటిని ఇక్కడ వివరిస్తున్నాను.

## జీవన్ముక్తి, విదేహముక్తి

మనం జీవన్ముక్తి, విదేహముక్తి అని రెండు పదాలు వాడతాం. వాటిని గురించి **'మహోపనిషత్తు'**లో వివరించబడింది.

జీవించిఉండగానే ముక్తిపొందటం జీవన్ముక్తి. అటువంటివాడు ఆయుష్షు ఉన్నంతవరకు జీవించి ఆతరువాత ఈదేహాన్ని విడిచి పరబ్రహ్మలో ఐక్యము పొందుతాడు. ఈరకంగా దేహాన్నివిడిచి పరమాత్మలోలీనంకావటాన్నే విదేహముక్తి అంటారు.

ఆత్మఅనేది అణువుకన్నచిన్నది, ఆకాశంకన్నపెద్దది. ఈ చిద్వస్తువునందు అనంతకోటి బ్రహ్మాండ రేణువులు ఉత్పత్తి స్థితిలయము పొందుతుంటాయి. బయటకు శూన్యంగా కనిపిస్తుంది కాబట్టి పరబ్రహ్మఆకాశము అని చెప్పబడుతున్నది. చిత్స్వరూపముగా ఉన్నది కాబట్టి బ్రహ్మము ఆకాశముకన్న విలక్షణమైనది. అయితే బ్రహ్మము ఆకాశంకాదు. ఆకాశములేనిది. అదియే సత్తు చిత్తు. ఆత్మవస్తువు స్వయంప్రకాశ స్వరూపము. విజ్ఞాన ఘనమైన శిలాసదృశమైనది. ఆకాశంలాగా స్వస్వరూపంలో తదధిష్ఠానముగా అనుభూతమైఉన్నది. చిత్రవిచిత్రముగా ఉన్న ఈజగత్తుయొక్క వికాసాన్ని భేదిస్తున్నది. ఈవిశ్వము తత్పద లక్షణముగా ఉన్న పరమాత్మయొక్క ప్రకాశమాత్రము. అందువల్ల ఈవిశ్వము ఆత్మకన్న ప్రత్యేకమగు సత్తుగలది. ఈజగత్తు యొక్క భేదభావముకూడా ఆత్మయందే ప్రకాశిస్తుంది. ఈ భేదమంతా ఆత్మమయమైనది. అధిష్ఠానరూపంలో ఈఆత్మ అన్నింటితోనూ సంబంధం కలిగి ఉన్నది. జాతి గుణ క్రియాదులు ఆత్మకులేవు. ఆత్మ త్రికాలభాద్యమై సత్యమై

ఉన్నది. అదే విజ్ఞానానందస్వరూపమగు పరబ్రహ్మ. త్యాగమూర్తులకు అది పరమగతి. సర్వసంకల్పాలను వదలివేసి శుద్ధమనస్సుతో ఆఆత్మను గ్రహించాలి. జాగ్రదావస్థలో ఉన్నప్పుడు ఎవరికి దృశ్యజ్ఞానము నశిస్తుందో, అతనియొక్క స్థితినే 'జ్ఞానము' అంటారు. వృత్తిజ్ఞానము లేకపోవుటయే జ్ఞానము. ఈ విషయాలను తెలుసుకున్నవాడు జీవన్ముక్తుడు. దృశ్యములేదు అనేఆత్మజ్ఞానంతో, మనసులోఉన్న దృశ్యభావాలను తుడిచివేసినట్లైతే తక్షణమే మహోన్నతమైన నిర్వాణసుఖము ఉత్పన్నమవుతుంది. వాసనలను అంటే రాగద్వేషాలను సంపూర్ణంగా త్యజించటమే మోక్షము. ఎవరైతే పరిశుద్ధవాసనలతో నిండిఉన్నారో, వారుతిరిగి జనన మరణాలు పొందరు. వాళ్ళు యదార్థాన్ని తెలుసుకోగలుగుతారు. వారే జీవన్ముక్తులు. దృఢమైన విషయ చింతనయే బంధము. వాసనాక్షయమే మోక్షము. దేహ, లోక, శాస్త్రవాసనలే సర్వవాసనలు.

తపస్సు మొదలైన సాధనలు చేయకుండానే సహజముగా ఎవరికి భోగాలు ఇష్టం ఉండవో, వారు జీవన్ముక్తులు. కాలానుగుణంగా సుఖదుఃఖాలు అనుభవిస్తున్నప్పటికీ, సంతోషము, విషాదము పొందనివాడు జీవన్ముక్తుడు. హర్షము (సంతోషము) అమర్షము (ఓర్వలేనితనము), భయము, క్రోధము, కామము, కార్పణ్యము వంటివి లేనివాడు జీవన్ముక్తుడు. అహంకారాన్నివదిలి, దృశ్యమునుకూడా త్యాగంచేసినవాడు జీవన్ముక్తుడు. అంతర్ముఖుడై ఇష్టాయిష్టములు లేకుండా ఉండేవాడు, సుషుప్తావస్తలో ఉన్నవాడులాగా సంచరించేవాడు. జీవన్ముక్తుడు. ఎప్పుడూ ఆత్మానందంపొందేవాడు, మనసును పవిత్రంగా ఉంచుకునేవాడు, జీవన్ముక్తుడు. ఏ కోరికలు లేకుండా ఉండేవాడు జీవన్ముక్తుడు.

ఆకాశంలాగా ఎవరిహృదయము దృశ్యవిషయముల యందు సంగమము కాకుండా ఉంటుందో, ఎవరిబుద్ధి జడముకాదో, ఎవడు చైతన్యవంతుడో వాడు జీవన్ముక్తుడు. రాగద్వేషాలను, సుఖదుఃఖాలను, లక్ష్యం చెయ్యకుండా, కోరికలు లేకుండా, నిష్కామ్యభావనతో సత్కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. మౌనమే దీక్షగా గలవాడు, అహంభావం లేనివాడు, సంకల్పాలు, ఉద్వేగాలు లేకుండా కర్తవ్య కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. సర్వత్ర విగతస్నేహితుడై సాక్షీభావముతో ఉండేవాడు, ఇచ్ఛారహితుడై సత్కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. మనసునందు ధర్మాధర్మాలను,

సమస్తసంకల్పాలను, ఇష్టాఇష్టాలను అన్నింటినీ వదలివేసినవాడు జీవన్ముక్తుడు. కంటికి కనిపిస్తున్న ఈదృశ్యప్రపంచాన్ని సమ్యక్‌దృష్టితో పరిత్యజించినవాడు జీవన్ముక్తుడు. కారము, పులుపు, ఉప్పు, చేదు, రుచి, అరుచి వీటన్నింటినీ సమభావంతో భుజించేవాడు జీవన్ముక్తుడు. వార్ధక్యము, మరణము, ఆపద, రాజ్యము, దరిద్రము వీటన్నింటినీ సమభావంతో అనుభవించేవాడు జీవన్ముక్తుడు.

ధర్మాధర్మాలు, సుఖదుఃఖాలు, జరామరణాలు, సంపూర్ణంగా, బుద్ధిపూర్వకంగా త్యాగంచేసినవాడు జీవన్ముక్తుడు. ఉద్వేగము, ఆనందము లేకుండా స్వచ్ఛమైన సమత్వబుద్ధిగలిగి, పొంగిపోవటము, క్రుంగిపోవటము, లేకుండాఉన్నవాడు జీవన్ముక్తుడు. సర్వేచ్ఛలను, సంశయాలను, ప్రయత్నాలను, నిశ్చయాలను జ్ఞానబుద్ధితో పరిత్యజించినవాడు జీవన్ముక్తుడు. సృష్టిస్థితిలయాలయందు ఉదయాస్తమయాదు లందు, భావాభావములందు, సమభావంతోఉండేవాడు జీవన్ముక్తుడు. కొంచెము కూడా ద్వేషించకుండా, కాంక్షించకుండా, రాగద్వేషాలులేనివాడు, ప్రారబ్ధకర్మలు అనుభవించనివాడు జీవన్ముక్తుడు. సంసారసంకులములో శాంతుడైఉండేవాడు, కళాయుక్తుడైకూడా నిష్కళుడై ఉండేవాడు, మనసుఉండికూడా అమనస్కుడైఉండేవాడు జీవన్ముక్తుడు. సమస్తసంపదలయందు, సమస్తవ్యవహారములయందు ఉండికూడా వాటి స్పృహలేనివాడు జీవన్ముక్తుడు.

జీవన్ముక్తుడు తనశరీరం పడిపోయినసమయంలో, శ్వాస ఆగిపోయిన వెంటనే జీవన్ముక్తపదవిని దాటి విదేహముక్తపదవిని చేరతాడు. విదేహముక్తుడికి జనన మరణాలుండవు. అతడు నిర్వికారుడు, సత్తుకాడు అసత్తుకాడు. దూరముకాడు, దగ్గరాకాడు. అహముకాదు, తదితరము కాదు.

జీవన్ముక్తుని పరిస్థితి ఎలాఉంటుందంటే, అత్యంతనిశ్చలము, మహాగంభీరము. అది ప్రకాశముకాదు, చీకటికాదు. మహావ్యాపకమై సర్వత్ర నిండిఉంటుంది. అనాఖ్యముగా, అనభివ్యక్తముగా, అతీతముగా ఉంటుంది. అది శూన్యము కాదు. సాకారము కాదు. దృశ్యము కాదు, దర్శనము కాదు. భూతపదార్ధ సముదాయము కాదు. కేవలసత్తా మాత్రము. అనంతరూపంలో కలిసిఉంటుంది. ఇదమిద్ధమని చెప్పటానికి వీలుండదు. పరిపూర్ణముకన్న అధికపరిపూర్ణముగా ఉంటుంది. సత్తు

కాదు అసత్తుకాదు సదసత్తు కాదు. భావనకాదు భావముకాదు. కేవల చిత్ పదార్థము. మహాచైతన్యము. అనంతమై, అజరమై, శివమై, ఆదిమధ్యాంతరహితమై, నిరామయమై ఉన్నది. అది అనాదిగా ఉన్న సత్యపదార్థము. ద్రష్ట, దర్శనము, దృశ్యము అనే త్రిపుటి మధ్యభాగంలో కేవల దర్శనము ఏదైతేఉన్నదో అది. దీనికన్న గొప్పది ఉత్తమమైనది ఏదీలేదు. జీవన్ముక్తి పొందినవాడు పరమార్థస్థితి పొందుతాడు.

## పరమార్థ స్థితి

ఆత్మజ్ఞానం పొందిన వారికి జగత్తంతాఒకటిలాగానే కనిపిస్తుంది. జగత్తులో ఉన్నది పరబ్రహ్మఒక్కటే. అదే తను. మిగిలినవి ఏవీలేవు. అనిభావిస్తాడు. చరాచరజగత్తులో తనుతప్ప ఇంకేదీలేదు అని నిశ్చయించుకుంటాడు. **అష్టావక్రగీత** లోని ఆఖరుఅధ్యాయంలో జనకమహారాజు పరమార్థస్థితిని చెబుతున్నాడు.

**క్వ భూతాని క్వదేహో వా క్వేంద్రియాణి క్వ వామనః ।**
**క్వ శూన్యం క్వచనైరాశ్యం మత్స్వరూపే నిరంజనే ॥**

స్వభావతః నేను నిరంజనుడను. అటువంటి నాలో పంచభూతాలెక్కడ? వాటితో తయారైన శరీరమెక్కడ? ఇంద్రియాలెక్కడ? మనస్సెక్కడ? శూన్యమెక్కడ? నిరాశ ఎక్కడ?

**క్వ శాస్త్రం క్వాత్మవిజ్ఞానం క్వవానిర్విషయం మనః ।**
**క్వ తృప్తిః క్వవితృష్ణత్వం గతద్వంద్వస్య మే సదా ॥**

అన్ని ద్వంద్వాలకు అతీతంగాఉన్న నాలో శాస్త్రాలెక్కడ? ఆత్మజ్ఞాన మెక్కడ? తృప్తి అంటే ఏమిటి? విషయరాహిత్యంఏది? కోరికలేకపోవటం అంటేఏమిటి?

**క్వ విద్యా క్వచవా అవిద్యా క్వాహం క్వేదం మమక్వవా ।**
**క్వ బంధః క్వ చ వామోక్షః స్వస్వరూపస్య క్వ రూపితా ॥**

జ్ఞానమెక్కడ ? అజ్ఞానమెక్కడ? నేనుఎక్కడ? ఏదినాది? బంధంఏది? మోక్షంఏది? అనంతమైన నా స్వరూపానికి రూపమేది?

**క్వ ప్రారబ్ధాని కర్మాణి జీవన్ముక్తి రపిక్వవా ।**
**క్వ తద్విదేహ కైవల్యం నిర్విశేషస్య సర్వదా ॥**

ఎప్పుడూ ఏకంగాఉండే నాలో ప్రారబ్ధంఏమిటి? జీవన్ముక్తిఏమిటి? విదేహ ముక్తిఏమిటి?

**క్వకర్తాక్వచవా భోక్తా నిష్క్రియం స్ఫురణం క్వవా ।**
**క్వా పరోక్ష ఫలం వాక్వ నిస్స్వభావస్య మే సదా ॥**

కర్త ఎవరు? భోక్తఎవరు? ఆలోచనలురావటమేమిటి? వాటిని నిరోధించట మేమిటి? పరోక్షజ్ఞానమేమిటి? అపరోక్షజ్ఞానమేమిటి? నిత్యము స్వభావ రహితంగా నేనుమాత్రమే ఉన్నాను.

**క్వ లోకః క్వ ముముక్షుర్వాక్వ యోగీజ్ఞానవాన్క్వవా ।**
**క్వ బద్ధః క్వచవా ముక్తః స్వస్వరూపేఽహమద్వయే ॥**

ఆత్మరూపమైన నాలో ప్రపంచంఎక్కడుంది? ధ్యానంచేసేదిఎవరు? ముక్తిని కోరేదిఎవరు? బద్ధుడెవరు. ముక్తుడెవరు?

**క్వ సృష్టిః క్వచ సంహారః క్వసాధ్యం క్వచసాధనం ।**
**క్వ సాధకః క సిద్ధిర్వా స్వస్వరూపేఽహమద్వయే ।**

అద్వయము, ఆత్మరూపము అయిన నాలో సృష్టిఎక్కడ? సంహారమెక్కడ? సాధనఏది? సాధకుడుఎవరు? సాధించాల్సిందిఏది? సిద్ధించాల్సిందిఏది?

ఈరకంగా చరాచర జగత్తులో ఉన్నది ఆత్మఒక్కటే. అది తప్ప ఇంకేమీ లేదు. అదేనేను అని భావిస్తాడు ముక్తపురుషుడు.

**మాండూక్యోపనిషత్తు** కారికలతో గౌడపాదులవారు చెప్పినట్లుగా

**ననిరోధో నచోత్పత్తిః న బద్ధో నచ సాధకః ।**
**న ముముక్షుః న వైముక్త ఇత్యేషా పరమార్థతా ॥**

ఉత్పత్తిలేదు, లయములేదు. సాధకులులేరు. ఎవరూబద్ధులు కాదు, ముక్తులు కాదు. ముముక్షువులు లేనేలేరు. పారమార్థికంలో ఇవేవీ లేనేలేవు. ఇదే పరమసత్యం.

**ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా

**సమోహవైతత్ పరమం బ్రహ్మవేద బ్రహ్మైవభవతి**

పరబ్రహ్మ స్వరూపాన్ని తెలుసుకున్నవాడు పరబ్రహ్మమే అవుతాడు.

**బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి**

# ఆత్మసాక్షాత్కారము

ఆత్మ సాక్షాత్కారము అంటే ఏమిటి ? అది ఎలాసిద్ధిస్తుంది ? అనే విషయాలు **మహోపనిషత్తు**లో చెప్పబడ్డాయి.

సాధకుడు తననుతానుతెలుసుకోవటాన్నే స్వరూపజ్ఞానము అంటారు. సాధకుడు జగత్తంతా నాలోనేఉన్నది. నేనే సాక్షాత్తూ పరబ్రహ్మను. సృష్టి స్థితి లయాలకు కారకుడనునేనే. ఈ జగత్తులో నేనుతప్ప వేరేఏదీలేదు. ఉన్నది ఒక్కటే అదేపరబ్రహ్మ. నేనే ఆపరబ్రహ్మస్వరూపాన్ని జగత్తుఅంతా నానుండే సృష్టించబడుతోంది. తిరిగి నాలోనేలయమవుతున్నది. **నేనే పరమేశ్వరుడను అనే విషయాన్ని తెలుసుకోవటమే ఆత్మసాక్షాత్కారము అంటారు.** ఈ విషయాన్ని అనుభవం ద్వారా తెలుసుకోవాలి.

ఆత్మసాక్షాత్కారముకావాలంటే మనోమాలిన్యముతొలగిపోవాలి. భ్రమలు నశించిపోవాలి. మోక్షద్వారానికి 1. శమము 2. విచారణ 3. సంతుష్టి 4. సజ్జన సాంగత్యము అనబడే నలుగురుద్వారపాలకులు. వీరిలో ఏఒక్కరిని గట్టిగా పట్టుకున్నాసరే, మిగిలినముగ్గురూ వశమవుతారు. అందుకని వీరిలో ఏ ఒక్కరినైనా సర్వప్రయత్నాలచేత, సమస్తాన్నిత్యజించి అయినాసరే గట్టిగా ఆశ్రయించాలి. శాస్త్రాభ్యాసము, సజ్జనసంపర్కము, అనే తపస్సుచేత, దమముచేత ముందుగా సంసారబంధ విముక్తి కోసం ప్రజ్ఞను గట్టిగాఅభివృద్ధిచెయ్యాలి. అభ్యాసమువల్ల శాస్త్రవాక్యము, స్వానుభవము, సద్గురువాక్యము అనేమూడూ సమన్వయముతో ఎవరిఆత్మలో నిరంతరమూదర్శనమిస్తాయో అతనికి పరమాత్మ దర్శనమిస్తాడు.

ప్రతిక్షణము సంకల్పము, ఆశ, విషయములు అనే ఈ మూడింటినీ పరిత్యజిస్తూ ఉన్నట్లైతే పరమపావనమైన అమనస్కస్థితి సాధించినవాడవుతాడు. మనస్సు అకర్తగా ఉండే తూష్ణీంస్థితియే సమాధి.

అదే కేవలభావస్థితి. అది శుభప్రదమైనఉత్తమనిర్వాణము. మనస్సుతో సంకల్పాలనుపరిత్యజించి, మూగవాడిలాగా, అంధుడిలాగా, జడునిలాగా సంచరించాలి. ఈసర్వమూ ప్రశాంతము, అజము, ఏకము, ఆదిమధ్యాంత రహితము. ప్రకాశస్వరూపము, దృశ్యభావములేని అనుభవరూపము. సమస్తము

ఓంకారరూపము అనిచెప్పటంకూడా భ్రాంతియే. ఈసకల దృశ్య ప్రపంచమంతా చిద్వస్తువే. ఇక్కడ చైతన్యముతప్ప ఇంకొకటిలేదు అనే భావన చెయ్యాలి.

ఈ రకంగా సర్వదా జాగరూకతతో, నిండు మనసుతో, ఆత్మ అద్వితీయము అని తెలుసుకుని, జగత్కార్యాన్ని ఆరాధిస్తూ, తరంగాలు లేనిసముద్రంలాగా నిశ్చలుడై ఉండాలి. వాసనలన్నింటికీ తృణానికి అగ్నివంటిదైన ఆత్మతత్త్వబోధయే సమాధి. అంతేకాని సమాధిఅంటే తూష్ణీంస్థితి (మౌనస్థితి) కాదు. జాతిరత్నము ఇచ్ఛా శూన్యమైనప్పటికీ దానినుంచి కాంతులు వెదజల్లునట్లుగా, పరబ్రహ్మ తత్త్వము సత్తా మాత్రమైనప్పటికీ, బ్రహ్మభావముగా ఈజగత్తు సర్వము ప్రకటితమవుతున్నది. ఆత్మయందు కర్తృత్వమున్నది. అయితే ఇచ్ఛ లేకుండాఉంది కాబట్టి అకర్త, సన్నిధాన మాత్రమున కర్తకూడా అయిఉన్నది. ఈ రకంగా పరస్పర విరోధంగల కర్తృత్వ రూపంలో ఉన్న ఈచమత్కారము ఏపరబ్రహ్మములో ఉన్నదో తెలుసుకుని, ఆ బ్రహ్మమునే ఆశ్రయించి, ఆబ్రహ్మలోకంలోనే స్థిరంగాఉండాలి. 'నేను నిత్యము అకర్తనై ఉన్నాను' అనేభావంతో ఒప్పునది, పరమామృతముఅనబడేది, అయిన సమత్వమే జ్ఞానికి శేషించి మిగిలేది. సత్తా మాత్రస్థితిలో ఉన్నవారే మహాగుణవంతులు. వారిస్థితి శాశ్వతమైనది. మహోన్నతమైనది. అటువంటివాడు ఆకాశంలో పూర్ణచంద్రునిలాగా ప్రసన్నవదనముతో ఉంటాడు. అతడే శాంతి, సుఖము, సమభావము సిద్ధించిన మహాత్ముడు. వారు రాత్రిపూటపద్మంలాగా ఆపదలందు కృశించిపోరు. శిష్టాచారులుపోయే మార్గంలో సత్ప్రవర్తనతో సంతోషంగా ఉంటారు. అటువంటివారిదేహములు మైత్రి మొదలైన సద్గుణాలతో శోభిల్లుతుంటాయి. వారు సమత్వభావం గలవారై, సర్వదా సాధువృత్తి గలవారై, సమరసులై మార్పులేకుండా ఉంటారు. నిర్మలాత్ములైన మహాత్ములు సముద్రంలాగా మర్యాదను అతిక్రమించకుండా ఉంటారు. సూర్యునిలాగా నియమాలను విడిచిపెట్టకుండాఉంటారు. నేను ఎవరిని? ఈ సంసార మాలిన్యము ఏరకంగా వ్యాపించిఉన్నది ? అని ప్రాజ్ఞుడు, సాధువు అయినమహాత్మునిసన్నిధిలో చక్కగా విచారణచెయ్యాలి. నిషిద్ధకర్మలు చేయరాదు. ఆచార్యులతో కలిసి నివసించరాదు సర్వసంహారసంహర్త అయిన మృత్యువును హేళన చేయరాదు. ఈదేహము ఎముకలు, మాంసము, రక్తము మొదలైన అశోభన పదార్థాల సమూహమే అనిగ్రహించి, దేహంమీద మమకారాన్ని విడిచిపెట్టి, సకల జీవులను ముత్యాల హారములోనిదారములాగా చిన్మాత్ర పరమాత్మగా దర్శించాలి.

ఇదికావాలి అనుకోవటం, ఇదివద్దు అని ద్వేషించటం ఇదే మనసుయొక్క స్వరూపము. ఆత్మ అటువంటి మనసుకన్న వేరుగా ఉన్నది. సద్గురువులు, శాస్త్రాలు చూపిన మార్గాన్ని అనుసరిస్తూ, స్వానుభవంలో "నేను చిద్ఘనుడైన బ్రహ్మనే అయి ఉన్నాను" అని తెలుసుకుని, శోకము లేనివాడు అశోకుడు కావాలి. జీవన్ముక్తుని దుఃఖాతీతశక్తి అద్భుతమైనది. పదునైనకత్తితో నరుకుతున్నప్పటికీ కలువపూలు పైన చల్లినరీతిగా భావిస్తాడు. అగ్నితోకాల్చేటప్పుడు మంచుబిందువులు మీద చల్లుతున్నట్లుగా భావిస్తాడు. నిప్పులలోత్రిప్పుతున్నప్పుడు మంచిగంధపు చల్లదనాన్ని అనుభవిస్తాడు. బాణవర్షముకురిపించినప్పుడు ఎండలో నిర్మించిన జలయంత్రం నీళ్ళుజల్లుతున్నది అనుకుంటాడు. శిరచ్ఛేదనచేసినప్పుడు సుఖముగా నిద్రిస్తాడు. వాగ్బంధనముచేస్తే మౌనముద్రగా భావిస్తాడు. శ్రోత్రాన్ని బంధిస్తే నిశ్శబ్దస్థితి అనుభవిస్తాడు. అటువంటి మహోన్నతమైనస్థితి ఉపేక్షతో ప్రాప్తించదు. దృఢవైరాగ్య సాధనతో అట్టిస్థితి సిద్ధిస్తుంది. గురువాక్యంచేత, వచ్చిన స్వానుభవముతో, పరిశుద్ధ బుద్ధితో నిరంతరము అభ్యాసంచెయ్యటంచేత ఆత్మను చక్కగాదర్శించవచ్చు. ఆత్మసాక్షాత్కారం పొందవచ్చు.

దిగ్భ్రమ పూర్తిగాపోయినప్పటికీ, గతంలో లాగానే దిక్కులయొక్క జ్ఞానము ఉంటుంది. అలాగే బ్రహ్మజ్ఞానంవల్ల ఈ జగత్తులేదు అనితెలిసినా కూడా, జగత్తు కనిపిస్తూనే ఉంటుంది. అలా కనిపించినప్పటికీ జగత్తులేదనే భావించాలి. ఆత్మసాక్షాత్కారానికి సిరిసంపదలుసాయంచెయ్యలేవు. స్నేహితులు, బంధువులు, శరీరకష్టము, తీర్థాలుసేవించటము, సాయపడవు. కేవలము పరమాత్మలో తన్మయత్వం పొందే మనసుకలవాడే ఆత్మసాక్షాత్కారం పొందగలడు. దుఃఖాలు, తృష్ణ, భరించలేనిచింతలు, అన్నీ మహాత్ములకు సూర్యకిరణములవల్ల అంధకారం నశించినట్లుగా నశిస్తాయి. క్రూరజంతువులు, సౌమ్యజంతువులు అన్నీ శమముగల మహాత్ముని కన్నతల్లినిచేరునట్లుగా, విశ్వాసముతో సమీపిస్తాయి. మానవుడు శమమువల్ల పరమసుఖము అనుభవిస్తాడు. అటువంటి పరమసుఖము అమృతపానం వల్లకూడా సిద్ధించదు. లక్ష్మీదేవి అనుగ్రహంతోలభించదు. శుభాశుభాలను విని, అనుభవించి, దర్శించి, తెలుసుకొని, సంతోషము, దుఃఖము పొందనివాడు శాంతస్వరూపుడు.

ఎవరిమనసైతే మరణకాలమందు, ఉత్సవసమయమందు, యుద్ధమందు కూడా వ్యాకులత చెందకుండా స్వచ్ఛంగాఉంటుందో, అటువంటివాడు శాంతుడు. తపస్సంపన్నులయందు, బుద్ధిశాలులయందు, యజ్ఞములుచేసిన వారియందు, చక్రవర్తులయందు, బలవంతులయందు, సద్గుణ సంపన్నులయందు, శమము (అంతరింద్రియ నిగ్రహము) కలిగి ఉండేవాడే ప్రశస్తిని పొందుతాడు. సంతోషామృత పానంతో ఎవరుశాంతచిత్తులవుతారో, అట్టివారే పరమపదమును పొందుతారు. ప్రాప్తించని వాటికోసందుఃఖించనివాడు, ప్రాప్తించినవాటితో తృప్తి చెందేవాడు, భేదభావాలు లేనివాడు, సంతుష్టుడు. అంతఃపురంలో నివసించే సాధ్వి ఏ రకంగా లభించినవాటితో తృప్తిచెంది ఆనందంగా ఉంటుందో, అలాగే ప్రాప్తమైనవాటితో సంతృప్తి చెందేవాడు జీవన్ముక్తునిస్థితి పొందుతాడు. అదే స్వస్వరూపానందము.

ప్రాజ్ఞుడు శాస్త్రాలను, దేశకాలమానాలను అనుసరించి, ఏదిసుఖమో, అది ఎలా దొరుకుతుందో, విచారిస్తుంటాడు. ఈ రకంగా ఆత్మలో విశ్రాంతిదొరికేదాకా మోక్షపదానికి దారివెతుకుతూ ఉండాలి. సంసారార్ణవమునుండిబయటపడి, తురీయస్థితిలో విశ్రాంతిపొందేవాడు గృహస్తుగాని, సన్యాసిగాని, జీవించిఉన్నా, మరణించినా అతడు కృతకృత్యుడు. అటువంటిజీవన్ముక్తుడు కర్మలుచేసినందువల్ల ప్రయోజనంలేదు. చెయ్యకపోతేఅపకారంలేదు. మందరపర్వత రహితుడు, క్షోభిరహితుడు అయిన క్షీరసాగరంలాగా ఆత్మస్థితుడు ఆనందంగానే ఉంటాడు. దృశ్యపదార్థాలన్నీ పరమాత్మగానే దర్శించే జ్ఞానము కలిగినప్పుడు, దేశకాలవస్తు పరిచ్ఛేద, శూన్యము, శుద్ధచిద్రూపము అయిన స్వస్వరూపము ప్రకాశిస్తుంది. అదే ఆత్మసాక్షాత్కారము. ఈ రకంగా నువ్వు భావించిన రూపంలో ఆత్మ ప్రత్యక్షమవుతుంది. స్థావరజంగమాత్మకమైన సమస్త దృశ్యప్రపంచము, గాఢనిద్రలో స్వప్నంలాగా, ప్రళయకాలంలో నశించిపోతుంది. ఆత్మ, ఋతము, సత్యము, పరబ్రహ్మము అనే పదాలు పరబ్రహ్మకు వ్యవహారసంజ్ఞలు.

కంకణము అంటే బంగారమేకాని ఇంకొకటికాదు. కడియము అన్నా బంగారమే. అలాగే ఈజగత్తు అంటే పరమాత్మయే అవుతుంది. జగత్తే బ్రహ్మ, బ్రహ్మయే జగత్తు. ఆ చిత్ బ్రహ్మనుండే ఈ జగత్తుగా కనిపించే ఇంద్రజాలము విస్తారముగా ఉన్నది. దృశ్యముయొక్క స్థితే ద్రష్ట అయిన ఆత్మకు బంధము. ద్రష్ట (చూసేవాడు)

దృశ్యపదార్ధములవలన బద్ధుడవుతున్నాడు. దృశ్యముయొక్క అభావముతో జీవన్ముక్తుడవుతున్నాడు. నేను, నీవు అనే బాధలతో ఉన్నదే జగత్తు. మనస్సు వల్లనే జగత్తు అనే ఇంద్రజాలము విస్తరించి ఉన్నది. ఈ మనస్సు అనే కల్పితభావము ఎంతకాలంఉంటుందో, అంతకాలంమోక్షంరాదు. స్వయంభువయిన పరమేశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు. అతనియొక్క మానసికసృష్టియే ఈ జగత్తు. అందుచేతనే నామరూపాలుగల దృశ్యమానజగత్తంతా మనస్సే అయి ఉన్నది. మనస్సులేనప్పుడు ఈజగత్తులేదు. మనస్సు అనేది హృదయంయొక్క లోపలగాని, బయటగాని, ఇంకోచోటగాని లేదు. దానికి సత్యమైన ఉనికిలేదు. విషయసంకల్పమే మనస్సు. సంకల్పమేమనస్సుయొక్క రూపము. ఎక్కడ మనస్సుంటుందో అక్కడ సంకల్పముంటుంది. సంకల్పము, మనసూ రెండూ వేరుకాదు. సంకల్పాలన్నీ నశించినప్పుడు పరమాత్మస్వరూపమే మిగులుతుంది.

నేను, నువ్వు, జగత్తు మొదలైన దృశ్యభ్రమ శమింపగా, దృశ్యమంతా అసత్తు కాగా, మిగిలినస్థితే కైవల్యము. అదే ఆత్మస్థితి. మహాప్రళయం సమయంలో సకల దృశ్యజగత్తు సత్తాశూన్యమై పోతుంది. అప్పుడు సృష్టికి పూర్వములో ఉన్న శాంతి రూపమైన అద్వితీయ పరమాత్మే మిగులుతుంది. ఈ సృష్టికి పూర్వము ఏదిఉన్నదోఅదే ప్రళయము. అటువంటి ఆత్మభానుడు ఎప్పుడూ అస్తమించడు. సర్వదా తేజోవంతుడై ఉంటాడు. ఆ పరమాత్మ అజుడు (జన్మలేనివాడు) దేవుడు, సమస్తదోషరహితుడు. అతడే సర్వకర్త. సర్వస్వరూపుడు. ఎక్కడినుండి వాక్కులు వెనక్కి తిరిగి వస్తుంటాయో, దేనిని ముక్తపురుషులు తెలుసుకుంటున్నారో, దాన్నే ఆత్మఅంటారు. ఆకాశములు మూడున్నాయి. 1. చిత్తాకాశము 2. చిదాకాశము 3. దహరాకాశము. వీటిలో చిదాకాశము అత్యంత సూక్ష్మమైనది. మనసు ఒకచోటినుండి ఇంకొక చోటికి పోయేటప్పుడు, ఆ మధ్య సమయంలో రెప్పపాటు కాలంలో అనుభవమయ్యే ఆనందమే చిదాకాశము. రెండు దృశ్యముల మధ్యనున్న ఉనికియే చిదాకాశము.

సర్వసంకల్పాలు త్రోసిపుచ్చినస్థితిలో స్థిరముగా ఉన్నప్పుడు సర్వాత్మక శాంతపదము పొందగలడు. ఔదార్యము, సౌందర్యము, వైరాగ్యములతో కూడిన పరమపద ఆనందస్థితియే సమాధి. దృశ్యములేనేలేదు అనే భావనతో రాగద్వేషాలు నశిస్తాయి. ఆ సమయంలో మహత్తరమైన స్వరూపానందం కలుగుతుంది. అటువంటి

స్థితియే సమాధి. దృశ్యములేదనే భావనే నిజమైనజ్ఞానము. అదే కేవలభావము. చిదాత్మక విజ్ఞేయము. అదే కైవల్యస్థితి. అంతకన్న మిగిలినదంతా మిథ్య, మదించిన ఏనుగు ఆవగింజలో బంధింపబడినది. చిన్నదైన చెట్టుతొర్రలో ఒకదోమ సింహాల గుంపుతో యుద్ధంచేసింది. తామరపూసలో మేరుపర్వతము పెట్టబడినది. ఆ తామరపూసను తుమ్మెదమ్రింగివేసింది. ఇవన్నీ అసంభవాలు. భ్రమతో కూడిన వాక్యాలు. ఈజగత్తుకూడా అలాంటిదే. ఈ జగత్తుకు అస్థిత్వము లేదు. రాగద్వేషాలతో దూషితమైన చిత్తమే సంసారము. ఆ చిత్తము ఎప్పుడు రాగద్వేషరహితం అవుతుందో, అప్పుడు సంసారనివృత్తి జరిగి మోక్షంసిద్ధిస్తుంది.

మనసుతో భావింపబడినవాడై జీవుడు దేహవాసన కలిగి ఉంటాడు. దేహవాసన పోయిన తరువాత, అతడు దేహధర్మాలకు అంటుకోడు. మనస్సుకు గొప్పశక్తి ఉన్నది. అది ఒకకల్పము కాలాన్ని ఒకక్షణంగా చేస్తుంది. అలాగే ఒక్కక్షణకాలాన్ని కల్పంగా చేస్తుంది. ఈ సంసారమంతా మనోవిలాసం మాత్రమే. దుష్ప్రవర్తన విడిచి పెట్టనివాడు, అశాంతుడు, కేవలము ప్రజ్ఞాబలంతో ఆత్మసాక్షాత్కారము పొందలేడు. ద్వంద్వరహితమై, నిర్గుణమై, సత్యమై, చిద్ఘనమైనట్టి బ్రహ్మానందాన్ని తన ఆత్మరూపంగా తెలుసుకున్నవాడు ఎన్నటికీ భయపడడు. ఉత్తమోత్తమమైనది, మహత్తరమైనది, తేజోమయమైనది, కళ్యాణకారకమైనది, శాశ్వతమైనది, సర్వజ్ఞము, పురాణము, సనాతనము, సకల దేవతలచేత ఆరాధింపబడునది అయిన సర్వేశ్వరరూపాన్ని గురించి తెలుసుకున్నవాడు దేనికీ భయపడడు. అతడికి భయంలేదు.

'మమ', 'నమమ', ఈ రెండు పదాలే బంధమోక్షాలకు హేతువులు. మమ అనుకొన్న జీవుడు బద్ధుడవుతాడు. నమమ అనుకున్నవాడు ముక్తుడవుతాడు. చేతనాచేతనాత్మకమగు ఈ జగత్తు జీవేశ్వరాది రూపంలో ప్రకాశిస్తున్నది. ఈ సృష్టి అంతా పరమేశ్వర సంకల్పమైనది. జాగ్రదవస్థ నుండి మోక్షము వచ్చేదాకా, సంసారము జీవకల్పితమై ఉన్నది. నాచికేతాగ్ని మొదలు యోగమువరకు ఉన్న మతాలన్నీ ఈశ్వరుని విషయంలో భ్రాంతిని ఆశ్రయించి ఉన్నాయి. పొరపాటు పడుతున్నాయి. చార్వాకులనుండి, సాంఖ్యులదాకా జీవభ్రాంతిని ఆశ్రయించి ఉన్నాయి. అందువల్ల ముముక్షువులు జీవేశ్వరసిద్ధాంతంలో బుద్ధిని ప్రవేశింప నీయరాదు. నిశ్చలబుద్ధితో బ్రహ్మతత్త్వవిచారణ చెయ్యాలి. అన్వయ వ్యతిరేక

సిద్ధాంతాలద్వారా ఈతడు సాక్షాత్తు జ్ఞాని. అతడేశివుడు. అతడేహరి, అతడే బ్రహ్మ. సద్గురువు యొక్క కరుణ లేకపోతే విషయత్యాగం చాలాకష్టం. తత్త్వదర్శనము దుర్లభము. సహజావస్థ మరీ దుర్లభము.

ఈశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు అనే జ్ఞానంగలవాడు, సర్వకర్మలను త్యాగం చేసినవాడు, అయిన యోగికి ఆత్మస్థితి సహజంగానే కలుగుతుంది. మానవుడు ఈ జగత్తులో భేదభావంగనక దర్శించినట్లైతే, అతడికి భయం కలుగుతుంది. సచ్చిదానందమనే జ్ఞాననేత్రము సర్వవ్యాపకమైనది. ప్రకాశించే సూర్యుణ్ణి గ్రుడ్డివాడు చూడలేడు. అలాగే అజ్ఞాని సచ్చిదానందాన్ని దర్శించలేడు. ప్రజ్ఞానమే బ్రహ్మ. ఆ బ్రహ్మము సత్యజ్ఞానాది లక్షణాలుగలది. అటువంటి బ్రహ్మను గూర్చిన జ్ఞానంవల్లనే మానవుడు అమృతుడవుతున్నాడు. పరాపర రూపమైన పరబ్రహ్మసాక్షాత్కారమైన తరువాత, మానవుని యొక్క హృదయగ్రంథులు విడిపోతాయి. సర్వసంశయాలు నశించిపోతాయి. అన్నికర్మలు క్షీణిస్తాయి. కాబట్టి అనాత్మ అనే సంకల్పాన్ని పరిత్యజించాలి. జగత్తు విషయంలో నిర్వికారుడై ఉండాలి. అంతర్ముఖుడై కేవలము సంవిన్మాత్రపరుడై (అన్నీ తెలిసినవాడవై) ఉండాలి. భ్రమవల్ల ఎడారులలో నీటిగుంటలు కనిపిస్తాయి. కాని అవి మృగతృష్ణలు. అలాగే జాగ్రస్వప్నసుషుప్తులకు సంబంధించిన జగత్తంతా ఆత్మస్వరూపం దక్కవేరుకాదు.

లక్ష్యా లక్ష్యబుద్ధులను త్యజించి కేవలము ఆత్మమాత్రుడుగా ఎవడు ఉంటాడో, అతడు సాక్షాత్తూ ఈశ్వరుడే అయిఉన్నాడు. అతడే ఉత్తముడైన బ్రహ్మజ్ఞాని. సర్వానికీ అధిష్ఠానము పరబ్రహ్మయే. ఉపమానము లేనిది, అవాఙ్మానసగోచరము, నిత్యము, సర్వగతము, సూక్ష్మాతిసూక్ష్మము, అవ్యయము అయిఉన్నది. ఈజగత్తు సర్వశక్తి మయుడగు పరమేశ్వరుని విలాసముగా ఉన్నది. సంశయము, అసంశయాలతో, ఈ సంసారము శాంతి పొందుతున్నది. మనోవ్యాధికి చికిత్స కోసం ఒక్కటే ఉపాయం ఉన్నది. ఏ వస్తువుమీద ప్రీతిఎక్కువ ఉంటుందో, దాన్ని త్యజిస్తూ వెళ్ళాలి. అప్పుడే మోక్షం సిద్ధిస్తుంది. స్వాధీనములో ఉన్నది. ఏకాంతహితమైనది, అయిన ఇష్టమైన వస్తువును పరిత్యజించటానికి ఇష్టపడనివాడు కీటకంతో సమానము.

అసంకల్పము అనే శస్త్రంతో ఈ చిత్తాన్ని ఛేదించాలి. అప్పుడే స్వరూపము, సర్వగతము, శాంతము, అయిన పరబ్రహ్మ ప్రాప్తిస్తుంది. లోకవిషయభావనను

పూర్తిగా విడిచిపెట్టెయ్యాలి. పరబ్రహ్మను గురించే ఆలోచించాలి. మనోనిగ్రహము కలిగి ఉండాలి. శాంతమనస్కుడై ఉండాలి. మనస్సు మ్రింగివేయబడినస్థితి అదే అమనస్క స్థితి. అదే బ్రహ్మపదము. పరమమయిన పురుషయత్నాన్ని ఆశ్రయించి, చిత్తాన్ని అచిత్తముగా చేసి, హృదయాకాశంలో ఆత్మను ధ్యానించాలి. జ్ఞానము అనే చక్రాయుధంతో మనస్సును సంకోచంలేకుండా ఛేదించాలి. అప్పుడు కోరికల రూపంలో ఉన్న శత్రువులు నిన్ను బంధించలేరు. నేనునాది అనే సంకల్పమే మనస్సు. అటువంటిసంకల్పాలు లేకుండాచేసి, నిస్సంకల్పము అనే కొడవలితో మనస్సును ఛేదించాలి. శరత్కాలంలో ఆకాశంలో పట్టిన మేఘాలు, వేగంగా వీచిన గాలులవల్ల చిన్నాభిన్నమై పోయినట్లుగా, చక్కని ఆత్మవిచారంతో మనస్సు అమనస్సు కావాలి. అదే మనస్సు అంతర్ధానమైన స్థితి. అమనస్కము.

ప్రళయకాల పవనాలు వీచినప్పటికీ, సముద్రాలన్నీ ఏకమైనప్పటికీ, ద్వాదశాదిత్యులు ఒక్కసారే ప్రకాశించినప్పటికీ, మనోనాశనమైన వారికి ఏ విధమైన చింత ఉండదు. మోక్షసామ్రాజ్యము సంకల్పరాహిత్యం చేతనే సిద్ధిస్తుంది. మనసు ఎప్పుడూ చలనం లేకుండా ఉండదు. అగ్నికిఉష్ణము లాగానే మనసుకు చంచలత్త్వముధర్మము. చిత్తాన్ని ఆధారంగా చేసుకుని ఉన్నది, చంచలముగా ఉన్నది, అయిన స్పందనశక్తియే మనోసంబంధమైన చిత్తశక్తి. ఈ జగదాడంబరము అంతా మనసుకు సంబంధించినదే. చలనరహితమైన మనస్సు అమృతమయము. అది తపస్సు, దాన్నే మోక్షము అంటారు. మనస్సుయొక్క చంచలత్వమే వాసనారూప మయిన అవిద్య. దీన్నివిచారణద్వారా నశించిపచెయ్యాలి.

పురుష ప్రయత్నాన్ని ఆశ్రయించి, శుద్ధచిత్తముతో మలినచిత్తాన్ని జయించాలి. మనసును నిగ్రహించాలంటే దానికి మనస్సే సమర్ధవంతమైనది. రాజును జయించటానికి రాజేసమర్థుడు. ఇంకొకడు సమర్థుడు కాదు. సంసారమనే సాగరంలో చిక్కి, ఆశఅనే గ్రహంతో పట్టుకోబడిన వాడికి అతనియొక్క శుద్ధ మనస్సే నావగా ఉన్నది. వివేకమైన మనస్సుతో బంధరూపంలో ఉన్నపాశాన్ని ఖండించి, సంసార సాగరం నుంచి నిన్నునువ్వే రక్షించుకోవాలి. సాధకుడు తనను తానే ఉద్ధరించుకోవాలి. ఇతరులెవరూ కాపాడలేరు. తనలోపల జనించిన ఇష్టాన్ని ప్రాజ్ఞుడు నశింపచేసుకోవాలి. దానితో అవిద్య నశిస్తుంది. భోగవాసనను విడిచి, భేదవాసనను

త్యజించి, భావాభావములను పరిత్యజించి, నిర్వికల్పుడైనవాడు సుఖిస్తాడు. అనుభవానికివచ్చేవేటికీ నీలోపల అవకాశమియ్యవద్దు. ఇదే మనోనాశనము. అవిద్యానాశనము.

**దృశ్యములందు విశ్వాసము ప్రీతి విడిచిపెట్టి ఉండటమే మోక్షము. దృశ్యములందు విశ్వాసముప్రీతి కలిగి ఉండటమే దుఃఖము.** అవిద్య అనేది లేనేలేదు. అయినప్పటికీ అష్టప్రజ్ఞలయందు అవిద్య కనిపిస్తోంది. నామమాత్రంగా ఉన్న ఈ అవిద్య సమ్యక్‌ప్రజ్ఞగలవారియందు అసలుండదు. సమ్యక్‌ప్రజ్ఞ సిద్ధించేదాకా ఈ అవిద్య అమాయకుడైన జీవిని తనవెంట తీసుకుపోయి దుఃఖాలనే ముళ్ళపొదలలో పడవేస్తుంది. సమ్యక్‌ప్రజ్ఞ గలవారిని ఈఅవిద్య ఏమీచెయ్యలేదు. మోహకారకమైన కోరికలున్నంతవరకూ, ఈఅవిద్య వెంటాడుతూనే ఉంటుంది. పరతత్త్వాన్ని అవలోకించినవెంటనే ఈఅవిద్య నాశనమవుతుంది. సర్వగతమైన జ్ఞానాన్ని దర్శించినట్లైతే అవిద్య తనకు తానే నశించిపోతుంది. అవిద్య నశిస్తే ఆత్మసాక్షాత్కారము జరుగుతుంది. ఆస్థితిరావాలంటే సంకల్పాలు పూర్తిగా నశించాలి.

చిత్తాకాశములో వాసనారూపంలో ఉన్న రాత్రి నశించిన తరువాత, చిదాదిత్య ప్రకాశమువల్ల చంద్రకళ (జీవభావము) వెలవెలపోతున్నది. విషయములు అనే దృశ్యసంబంధాలు లేనట్టిది, సామాన్యరూపంలో సర్వవ్యాపకము, అనిర్వచనీయము అయిన చైతన్యమే ఆత్మ. అదే పరమేశ్వరుడు. ఈ సమస్తము నిత్యమై, సత్యమై, అక్షయమైన బ్రహ్మమే అయి ఉన్నది. మనస్సు అనే పేరుగల కల్పన ఇంకొకటి ఏదీలేదు. ఈ జగత్తులో ఏదీ జన్మించటంలేదు. మరణించటంలేదు. అందువల్ల షడ్భావవికారాలు కనిపిస్తున్న వీటన్నింటికీ అస్థిత్వము కొంచెముకూడా లేదు. ఏకముగా ఉన్నది, తేజోరూపము, స్వరూపము, సర్వసామ్రాజ్యము, అవ్యయము, చైతన్యానుపాతరహితము, చిన్మాత్రము అయిన బ్రహ్మమే ఇక్కడ ఉన్నది. అటువంటి నిత్యమైన వ్యాపకముగాఉన్న, శుద్ధమైన, చిన్మాత్రముగాఉన్న, నిరుపద్రవమైన శాంత శమ పూర్ణ నిర్వికారమైన చిదాత్మయందు మనసు విహరిస్తుంది. మనసు తన స్వభావానికి అనుగుణ్యమైన దానిని కల్పించుకుని, అన్ని దిక్కులకు పరుగుపెడుతుంది. ఎప్పుడూ మననము చేస్తుంది కాబట్టే దీన్ని మనస్సు అంటారు. ఈమనస్సు సంకల్పముచేతనే సిద్ధిస్తుంది.

'నేను బ్రహ్మముకాదు' అనే ఆలోచనతో మనసు బంధింపబడుతున్నది. సర్వమూ బ్రహ్మమయమే అనే దృఢసంకల్పంతో మనస్సు విముక్తమవుతుంది. నేను కృశించినవాడను. దుఃఖించినవాడను. కోరికలతో బంధింపబడినవాడను, కాలు చేతులు గలవాడను అనే భావంతో వ్యవహరిస్తూ జీవుడు బద్ధుడవుతున్నాడు. నేను దుఃఖినికాదు. నాకు దేహములేదు. బంధములేదు. అనే భావాలతో జీవి విముక్తుడవుతున్నాడు. నేను మాంసమును కాను. ఎముకలు కాను. దేహముకన్న వేరైనవాడను, నేను పరతత్త్వమును అని అంతరంగంలో నిశ్చయించుకున్నవాడు అవిద్యారహితుడై ఆత్మసాక్షాత్కారము పొందుతాడు. అనాత్మయందు ఆత్మభావన చెయ్యటంచేత అవిద్య కల్పించబడింది. పురుషప్రయత్నం తీవ్రం చేసి, భోగేచ్ఛను దూరంగా వదలి, నిర్వికల్పుడై, సుఖవంతుడు కావాలి. ఈ రకంగా **అమనస్కుడైన జ్ఞానికే ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది.**

తానే పరబ్రహ్మ స్వరూపము అని తెలుసుకున్నవాడు, చరాచర జగత్తంతా పరబ్రహ్మస్వరూప నిగ్రహించినవాడు, పరమాత్మతో ఐక్యం పొందుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు. అతడు స్వస్వరూపాన్ని పొందుతాడు. స్వస్వరూపం అంటే ఏమిటి? ఐతరేయోపనిషత్తులో చెప్పినట్లుగా సృష్టి చేసిన తరువాత పరమాత్మ బ్రహ్మరంధ్రం గుండా మానవ దేహంలో ప్రవేశించి జీవాత్మ అయింది. ఇప్పుడు అజ్ఞానంతో కూరుకుపోయి తాను వేరు, పరబ్రహ్మ వేరు అని భావిస్తోంది. ఈ అజ్ఞానం వదిలిపోతే, తానే పరబ్రహ్మ అవుతుంది. అదే స్వరూపస్థితి. అదే సాయుజ్యము, ముక్తి, మోక్షము, జన్మరాహిత్యము.

మానవుడు ఎంత ప్రయత్నం చేసినా పరమేశ్వరిఅనుగ్రహంలేనిదే సాయుజ్యంపొందలేడు. అతడు చేసిన కర్మలను బట్టి, మానవుడికి ముక్తిని ప్రసాదించేదిపరమేశ్వరి. అదే పరాశక్తి. ఆవిడే జ్ఞానవిద్య, మోక్షవిద్య.

## జ్ఞానవిద్య

విద్య అంటే జ్ఞానము. మానవుడు తను పుట్టక ముందు ఎక్కడ ఉన్నాడు? మరణానంతరము ఎక్కడికి పోతాడు? పునర్జన్మ ఉన్నదా, లేదా? భగవంతుడు అనే వాడున్నాడా? చరాచర జగత్తు ఏ విధంగా వచ్చింది? సృష్టి స్థితి లయాలు ఏ విధంగా జరుగుతున్నాయి? దానికి కారణం ఎవరు? సైన్సు ప్రకారం స్త్రీ పురుషకణాలు

కలిస్తే పిండోత్పత్తి జరుగుతుంది. కాని అలా ప్రతిచోటా జరగటంలేదు కదా? ఏరకమైన లోపాలు లేకపోయినా పిల్లలు లేని భార్యాభర్తలు చాలామంది ఉన్నారు. దీనికి కారణం ఏమిటి? అసలు జగత్తు ఏ విధంగా సృష్టించబడుతోంది? ఈ ప్రశ్నలకు సమాధానమే జ్ఞానము.

ఏ వస్తువు గురించి తెలుసుకుంటే అన్నింటి గురించి పూర్తిగా తెలుస్తుందో, ఆ వస్తువే ఆత్మ. ఆత్మ గురించిన విషయాలను తెలుసుకోవటమే ఆత్మజ్ఞానము. ఆత్మ అన్ని జీవులలోనూ ఉన్నది. తనస్వరూపము అంటే తనఆత్మ. తన ఆత్మను గురించి తెలుసుకునేదే స్వరూప జ్ఞానము. అదే ఆత్మ జ్ఞానము. అయితే తన ఆత్మ, ప్రక్కవాడి ఆత్మ అని వేరే లేవు. ఉన్నదంతా ఒక్కటే. అదే పరమాత్మ ఆ జీవిలో ఉన్న ఆ పరమాత్మ స్వరూపాన్నే ఆత్మ అంటున్నారు. ఇది జీవాత్మ. అది పరమాత్మ. ఈ రెండూ వేరు కాదు.

ఒకే చెట్టు మీద రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి ఒకటి ఏ విధమైన ఆహారం తినకుండా హాయిగా ఉన్నది. రెండవది దొరికిన ఆహారం తింటూ విచారంగా ఉన్నది. ఆ పక్షులు రెండూ ఒకే జాతికి చెందినవి. ఒకే రంగు, ఒకే రూపం గలవి. అవే జీవాత్మ, పరమాత్మ. జీవాత్మ కర్మఫలాలు అనుభవిస్తోంది. పరమాత్మకు కర్మఫలం లేదు కాబట్టి హాయిగా కూర్చుని ఉన్నది. అయితే అజ్ఞానంవల్ల తానే పరమాత్మను అని తెలుసుకోలేకపోతోంది జీవాత్మ. కాని అజ్ఞానపు పొరలు వీడిపోయి, ఎప్పుడైతే తాను పరమాత్మ స్వరూపమే అని తెలుసుకోగలిగిందో అప్పుడు జీవాత్మ పరమాత్మలో లీనమైపోతుంది. అంటే రెండు పక్షులూ ఒక్కటే అయిపోతాయి. ఇదే జ్ఞానము.

చరాచర జగత్తంతా పరమేశ్వరమయం. ఈ జగత్తులో కంటికి కనిపించేది, కనిపించనది అంతా పరమేశ్వరమయమే. పరమేశ్వరుడు సర్వశక్తి సమన్వితుడు. నిత్యతృప్తుడు. అతడు తన భక్తుల హృదయారవిందాలలో ఉంటాడు. హంస అంటే శ్వాస, మునులయొక్క మానసమనే సరోవరంలో హంసలా విహరిస్తూ ఉంటాడు. అతడు సత్యస్వరూపుడు సత్యవ్రతుడు. సర్వాంతర్యామి. అన్నిచోట్లా ఉంటాడు. పంచభూతాలలో అంతర్యామిగా ఉంటాడు. సాక్షాత్తూ సృష్టికారకుడైన కర్మబ్రహ్మను కూడా అతడే సృష్టించాడు. అనేక రూపాలలో ఉంటాడు. జ్ఞానులందరూ అతణ్ణి చేరటం కోసమే ఆరాటపడుతుంటారు. అతడే ఈ లోకాలను సృష్టించాడు. అతడు

ఉన్నాడన్న భయంతోనే గాలి సక్రమంగా వీస్తోంది. దేవతలు వారి విధులను సక్రమంగా నిర్వర్తిస్తున్నారు. అతడే సకల జగత్తుకూ అధిష్ఠానము. ప్రాణులందరికీ ఆరాధ్యము. ప్రాణాలకు ముఖ్యప్రాణము. జీవులకు ప్రాణాలు పోసేవాడు. లోకంలో భక్తజనుల కోసం 51 పీఠాలయందున్నాడు. అతన్ని అదుపు చేసే వారెవరూ లేరు. అందరికన్నా అతడే అధికుడు. నిర్జన ప్రదేశంలో, పవిత్ర ప్రదేశంలో ఉంటాడు. ఇంద్రాది మహావీరులను సృష్టించినది ఆయనే. పంచభూతాలలో మొదటిది అయిన ఆకాశాన్ని సృష్టించినది ఆవిడే. జీవులకు వారివారి అర్హతలను బట్టి ముక్తిని ప్రసాదిస్తుంది.

అతన్ని కేవలము భావనా మాత్రంచేతనే తెలుసుకోవచ్చు. తన భక్తులయొక్క భవబంధాలకు విమోచనం కల్పిస్తాడు. సంసారచక్రాన్ని త్రిప్పేది అతడే. అతడు వేదస్వరూపం శాస్త్రస్వరూపం. మంత్రరూపం, ప్రళయకాలంలో బ్రహ్మాండాలను తన ఉదరంలో దాచుకునేవాడు అతడే. లోకాలను ప్రవర్తింప చేయటం కోసం చతుర్వర్ణాలను అతడే సృష్టించాడు. ఉపనిషత్తులసారం అంతా అతడే. శాంతికల, ధృవకల, నిత్యాకల, బ్రహ్మకల అతడే.

అనంతమైనవాడు. ఆకాశమే అతని నివాసస్థానము. కల్పనలు, ప్రాపంచిక వాసనలు లేనివాడు. కాలస్వరూపుడు. భక్తులయొక్క దుఃఖాన్ని నాశనం చేస్తాడు. అతడే అర్ధనారీశ్వరుడు. స్త్రీ పురుష బేధములు లేనివాడు. కార్యము కారణము మొదలైనవి లేనివాడు జనన మరణాలు లేనివాడు. భక్తసులభుడు. అంతఃపూజ చేసేవారికి దర్శనమిస్తాడు. బాహ్యపూజలు చేసే లౌకికులకు దుర్లభుడు. అతడే వేదవిద్య అకార, ఉకార మకార స్వరూపుడు. త్రిపుటి.

ఆ పరబ్రహ్మకు జన్మ, మృత్యు, జరా, వ్యాధులు ఏ మాత్రమూలేవు. అతడు నిరాధారుడు. అందరికి అతడే ఆధారము. అతడికి ఆధారం ఎవరూలేరు. జగత్తంతా అతని శరీరమే. అతడు తన ఆత్మలోనే క్రీడిస్తాడు. స్త్రీపురుషులుగా ఏర్పడి క్రీడిస్తాడు. భక్తులదహరాకాశంలో క్రీడిస్తుంటాడు. మునీశ్వరుల హృదయాలలో విహరిస్తాడు.

అటువంటి పరబ్రహ్మను ఆరాధిస్తే సాధకుడి జీవాత్మ పరమాత్మను చేరుతుంది. అంటే కుండలినీశక్తి సహస్రారం చేరి అక్కడున్న చంద్రమండలాన్ని తన నోటితో కరిచిపట్టుకుంటుంది. అప్పుడు అక్కడి నుంచి అమృతపుధారలు స్రవించి యోగి

శరీరంలోని 72 వేల నాడీమండలాన్ని తడుపుతాయి. ఆ పరబ్రహ్మే పరాశక్తి, పరమేశ్వరి అనబడుతుంది.

ఈ రకంగా జ్ఞానజ్యోతి అయిన పరమేశ్వరి లక్షణాలను, జ్ఞానరూపిణి అయిన ఆమె ఉపాసనా ఫలితాన్ని లలితాసహస్రనామాలలో వివరించబడింది.

## 813. 814. మూర్తా, అమూర్తా

**రూపవ ద్వస్తు మూర్తం. వాయ్వాకాశాదికం అమూర్తం**

రూపము ఉన్నటువంటి వస్తువు మూర్తము. భూమి, నీరు, అగ్ని మొదలైనవి. వాయువు, ఆకాశము వంటి రూపం లేని వస్తువులు అమూర్తము. పంచీకృతములైన పంచమహాభూతాలు మూర్తాలు. అపంచీకృతములైన భూతసూక్ష్మాలు అమూర్తాలు. ఇంకాచెప్పాలి అంటే కంటికికనిపించేది మూర్తం. ఒకఆకారంగలది మూర్తము. అలాగే కంటికికనిపించనిది, ఒకఆకారములేనిది అమూర్తము.

దేవి స్థూలరూపం మూర్తము సూక్ష్మరూపం అమూర్తము కంటికి కనిపించే పదార్థాలన్నింటిలోనూ కూడా కంటికి కనిపించనటువంటి పదార్థమొకటి ఉంటుంది. అది అమూర్తము. **విష్ణుపురాణంలో**

**ద్వే రూపే బ్రహ్మణ స్తస్య మూర్తం చా మూర్త మేవ చ**

పరబ్రహ్మకు మూర్తము అమూర్తము అని రెండు రూపాలున్నాయి.

**క్షరాక్షరాస్వరూపే, తే సర్వభూతే ష్వవస్థితే**

**అక్షరం బ్రహ్మ కూటస్థం క్షరం సర్వమిదం జగత్ ॥**

బ్రహ్మకు మూర్తము అమూర్తము అని రెండు రూపాలున్నాయి. 1. క్షరము 2. అక్షరము.

| | | | |
|---|---|---|---|
| 1. | క్షరము | – | నామరూపాత్మకమైన ప్రపంచము |
| 2. | అక్షరము | – | కంటికి కనిపించని పరమాత్మ |

వీటిని గురించి బృహదారణ్యకోపనిషత్తులో ఈ విధంగా ఉంది. “ఇంద్రియాలకు శరీరానికి కారణభూతమైన పంచభూతాలను సత్యం అంటారు. విజ్ఞులు నేతి, నేతి ఇది కాదు, ఇది కాదు అంటూ బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తారు.

బ్రహ్మకు రెండు రూపాలున్నాయి. 1. మూర్తము 2. అమూర్తము. అవే స్థూలము, సూక్ష్మము మర్త్యరూపము, అమృతరూపము. అంటే నశించేది, నశించనిది. మరణము ఉన్నది, మరణము లేనిది నిర్వచించటానికి వీలైనది, నిర్వచించటానికి వీలుకానిది.

పంచభూతాలలో మొదటి మూడు పృథివి, జలము, అగ్ని ఈమూడూ మూర్తాలు. స్థూలమైనవి. కంటికి కనిపిస్తాయి. వీటికి ఒక ఆకారము ఉన్నది. వీటిని నిర్వచించటానికి వీలవుతుంది. ఇవినశిస్తాయి. మిగిలిన రెండూ అమూర్తాలు. అవి వాయువు, ఆకాశం. వీటికి నాశనం లేదు. కంటికి కనపడవు. వీటికి ఆకారం లేదు. వీటిని నిర్వచించటానికి వీలు లేదు.

ప్రాణంకన్న భిన్నమైనది. దేహంలోఉన్న ఆకాశంకన్న భిన్నమైనది. మొదటి మూడు భూతాలచేత నిర్మించబడింది ఈశరీరం. ఇదిమూర్తము, మర్త్యము నాశనమైపోతుంది.

ప్రాణాలు, శరీరంలోఉన్న ఆకాశం. ఈ రెండూ అమూర్తాలు. ఇవి నాశనం లేనివి.

లింగశరీరరూపమైన పురుషుని వాసనామయరూపం పసుపులో ముంచిన వస్త్రం లాగా, తెల్లనిగుడ్డలాగా, వర్షాకాలంలో కనిపించే ఆర్ద్రపురుగులాగా, అగ్నిజ్వాలలాగా, తెల్లనిపద్మంలాగా, మెరుపుకాంతిలాగా ఉంటుంది. ఈ విషయంతెలుసుకున్న వాడి సంపద విద్యుత్ప్రకాశంలాగా ఒక్కసారిగా అంతటా వ్యాపించి ఉంటుంది.

బ్రహ్మను గురించి ఇంతకన్న చెప్పటం కష్టం. నేతినేతి అనుకుంటూ, మనకు లభించింది బ్రహ్మమేనా? అనిప్రశ్నించుకుంటూ, ఇదికాదుఅని తెలుసుకుంటూ, ఇలా పోగాపోగా, చివరకు మిగిలేదే బ్రహ్మము. కనిపించే విషయాలను నిషేధిస్తూపోతే, మిగిలేదే బ్రహ్మము. అది సత్యానికి సత్యం, ప్రాణానికి ప్రాణం.

ఈ రకంగా కంటికి కనిపించే స్థూలరూపం మూర్తము, కనిపించని సూక్ష్మరూపం అమూర్తము. రెండూ ఆ పరాశక్తి రూపాలే. కాబట్టే ఆమె మూర్తామూర్తా అనబడింది. సాకారంలో త్రిపురసుందరిగా మహదైశ్వర్యము నిరాకారంలో పరాశక్తిగా అర్హులకు సాయుజ్యము ప్రసాదిస్తుంది.

# 764. స్వర్గాపవర్గదా

**య న్న దుఃఖేన సంభన్నం న చ గ్రస్త మనంతరం**

**అభిలాషోపనీతం య త్తత్సుఖం స్వః పదాస్పదమ్**

ఏదైతే దుఃఖముచేత ఇప్పుడుగాని తరువాతగాని చెడదో, అభిలాషచే ఏది పొందదగినదో అది 'స్వః' అనే పదంతో చెప్పబడుతోంది అంటోది వేదం.

ఈ రకంగా శ్రుతి ప్రసిద్ధమైనది–స్వర్గము నిత్యసుఖము అపవర్గము – మోక్షము. ఈ రెండు సుఖాలను ఇచ్చేది పరమేశ్వరి.

పరమేశ్వరి భోగాలను, మోక్షాన్ని రెండింటినీ ఇస్తుంది అని గతంలోనే చెప్పుకున్నాం. ఐహికసుఖాలు కావాలంటే మోక్షం వదలుకోవాలి. అలాగే మోక్షం కావాలంటే ఐహికవాంఛలు కూడదు. కాని పరమేశ్వరి అర్చించిన వారికి ఇహపరాలు రెండూ ఒనగూడుతాయి.

దేవతల శక్తితక్కువ. వారు భోగభాగ్యాలు, సిరిసంపదలు ఇవ్వగలరు. అంతేగాని మోక్షాన్ని మాత్రం ఇవ్వలేరు. అది వారిపరిధికి మించినది. అనేకమంది రాక్షసులు బ్రహ్మను గురించి తపస్సుచేసి చావులేకుండా వరంకావాలి అన్నారు కాదన్నాడు బ్రహ్మ. ఎందుకని? ఇక్కడ తపస్సు చేసింది కర్మబ్రహ్మను గురించి అతని ఆయువు బ్రహ్మకల్పం. కల్పాంతంకాగానే అతను పరబ్రహ్మలో లీనమవుతాడు. అతనికే శాశ్వతత్త్వంలేదు. అలాంటప్పుడు అతను తనకులేని శాశ్వతత్త్వాన్ని మనకు ఎలాప్రసాదించగలుగుతాడు? అలాగే మిగిలిన దేవతలు కూడా. మోక్షమివ్వగలిగిన శక్తి ఆ పరమేశ్వరికి ఒకర్తెకే ఉన్నది.

కర్మలు చేస్తే పుణ్యం వస్తుంది. సంకల్పం నెరవేరుతుంది. కాని మోక్షం మాత్రంరాదు. నిష్కామ్యకర్మ చేస్తే ఫలితం రాదు. అది మోక్షమార్గం. ఈ రకంగా స్వర్గము, అపవర్గము రెండింటినిచ్చేదీ ఆ పరాశక్తియే. అందుచేత స్వర్గాపవర్గదా అనబడుతోంది.

ఆమెను సాకారంగా అర్చించిన వారికి ఈ లోకంలో సిరిసంపదలు, భోగభాగ్యాలు ప్రసాదిస్తుంది. మరణానంతరము వారికర్మ ఫలాన్ననుసరించి స్వర్గసుఖాలు, మణిద్వీపంలో మహదైశ్వర్యము, అంతరారాధనాపరులకు సాయుజ్యము ప్రసాదిస్తుంది.

# 402. విద్యావిద్యాస్వరూపిణీ

విద్య అవిద్య ఈ రెండింటి స్వరూపము ఆ దేవి. **ఈశావాస్యోపనిషత్తులో** విద్య అవిద్యల గురించి చెప్పబడింది. అవిద్యను ఆరాధించేవారు అంటే ఆత్మజ్ఞానం లేకుండా కర్మలను ఉపాసించేవారు గాడాంధకారంలో పడిపోతారు. కర్మలను వదిలిపెట్టి కేవలం ఉపాసనలో పడ్డవారు ఇంకా అంధకారంలో పడిపోతారు. అందుచేత జ్ఞానరహితమైన ఉపాసనవల్లగాని, ఉపాసనరహితమైన జ్ఞానంవల్లగాని సద్గతికలుగదు. వీటిని విడివిడిగా అనుష్టించేవారు ఆత్మజ్ఞానానికిదూరమై తామసలోకాలకుపోతారు. ఆత్మజ్ఞానానికి ఉపాసన, కర్మాచరణ రెండూ ముఖ్యమే. అప్పుడే సత్ఫలితం ఉంటుంది. విద్యను ఉపాసించటంవల్ల దేవలోకము, అవిద్యను ఉపాసించటంవల్ల పిత్రులోకము వస్తాయి. వీటినే ఉత్తరదక్షిణాలు అంటారు. ఈరెండూ తెలిసినవారు అవిద్య అంటే కర్మలచే మృత్యువునుజయించి, విద్యతో దైవత్వంపొందుతారు. విద్య అవిద్య రెండూ పరమేశ్వర స్వరూపాలే.

ఈ రెండింటినీ సమానంగానే ఉపాసించాలి. “అవిద్యవల్ల శరీరాన్ని వదలి, విద్యతో జన్మరాహిత్యం పొందాలి. జగత్తును దాటటానికి కర్మాచరణ, జన్మరాహిత్యానికి ఉపాసన రెండూ అవసరమే. ఇది తెలిసి ఆచరించినవాడు కర్మలవల్ల సంచితకర్మలను నాశనంచేసి, ఉపాసనవల్ల దైవత్వం పొందుతాడు” అని చెప్పబడింది.

విద్య, అవిద్య రెండూ కూడా ఆ పరమేశ్వరి స్వరూపాలే. అయితే సాధకుడు ఈ విషయాలను తెలుసుకుని ఉపాసనచేసినట్లైతే అతడికి మోక్షం ప్రసాదిస్తుంది ఆ పరాశక్తి. అందుచేతనే ఆమె విద్యావిద్యస్వరూపిణి అనబడింది.

# 399. వ్యక్తావ్యక్తస్వరూపిణీ

వ్యక్తము అంటే మహతత్త్వము. ఇది అవ్యక్తము నుంచి వచ్చినది. అంతటా వ్యాపించినది. సృష్టిలో మొదటగా అవ్యక్తము నుంచి మహతత్త్వము, మహతత్త్వము నుంచి అహంకారము పుట్టినాయి. ఈ రకంగా అవ్యక్తమైనది ఆ పరమేశ్వరియే. వ్యక్తమైనది కూడా ఆ పరమేశ్వరియే. అందుకే ఆమె వ్యక్తావ్యక్తస్వరూపిణి అనబడుతుంది. జగత్తులో ఉన్నటు వంటి తత్త్వముల రూపంలో ఉంటుంది. కాబట్టి

పరమేశ్వరివ్యక్తరూపిణి. బ్రహ్మవైవర్త పురాణంలో 1.వ్యక్తము 2. అవ్యక్తము 3. వ్యక్తావ్యక్తము అని మూడు లింగాలు ఉన్నాయి. అవే క్రమంగా 1. స్వాయంభువము 2. బాణలింగము 3. శైలలింగము. స్వాయంభువ లింగము–తనంత తాను పుట్టినది. బాణలింగము నదిలో పుట్టినది. శైలలింగము రాతితో చేయబడినది. వీటిలో అవ్యక్తలింగము మోక్షమిస్తుంది. వ్యక్తలింగము ఇహపరసుఖాలనిస్తుంది.

జగత్తులోని అన్ని ఆకారాలు ఈవ్యక్తరూపము నుంచే ఉద్భవించినాయి. ఇదే మహతత్త్వస్వరూపము. వ్యక్తము కార్యరూపంలోను, అవ్యక్తము కారణరూపంలోను ఉంటాయి. ఈ రకంగా వ్యక్తము అవ్యక్తము కూడా పరమేశ్వరియే కాబట్టి ఆ దేవి వ్యక్తావ్యక్తస్వరూపిణి అనబడుతుంది. అవ్యక్తం–పరాశక్తి, వ్యక్తం – లలితా త్రిపుర సుందరి. ఇవే నిర్గుణ, సగుణ రూపాలు.

## 403. మహాకామేశనయనకుముదాహ్లాదకౌముదీ

మహా అంటే గొప్పవాడైన కామేశుడు. మహాకామేశుని యొక్క కనులు అనే కలువలకు వెన్నెలవంటిది. కౌముదము అంటే – కైరవము, రక్తపంకజము, కుముదము, కార్తీకపున్నమినాటి వెన్నెల అని అర్ధం. కాబట్టి మహాకామేశుని కనులు అనే కలువలకు కార్తీకపున్నమినాటి వెన్నెల వంటిది.

కుముదులు అంటే నీచులైనవారు లౌకికసుఖాలు కోరతారు. కాని ఆసుఖాలన్నీ దుఃఖకారకాలు. అందుచేత వారి కోరికలను మళ్ళించి వారికి ఆహ్లాదము కలిగించునది.

మహాకామేశుని కనులనబడే కలువలను వెలిగించేది ఆ పరమేశ్వరి. అలా ప్రకాశిస్తున్న కామేశ్వరుని కనులు చంద్రసూర్యాగ్నులను పోలుతూ తెలుపు ఎరుపు నీలపురంగులలో ప్రకాశిస్తున్నాయి.

ఉపాసకులకు పరమేశ్వరి జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. కాబట్టి వారందరూ అనిర్వచనీయమైన ఆనందం పొందుతారు. జ్ఞానజ్యోతులతో ప్రకాశించే పరమేశ్వరి ముఖం చూడాలంటే కామేశ్వరసమానులే కావాలి. అంతేకాని అన్యులకు సాధ్యం కాదు.

పరమేశ్వరి స్వరూపాన్ని చూడటంచేత మహాకామేశునికి ఆహ్లాదం కలుగుతుంది.

# 428. పంచకోశాంతరస్థితా

పంచకోశముల మధ్యన ఉండునది. పంచకోశములు పంచికా పూజలోని ప్రసిద్ధిచెందిన దేవతలు. వారు శ్రీవిద్య, పరంజ్యోతి, పరా, నిష్కళా, శాంభవి. ఆ మంత్రములందుండునది. శ్రీచక్రంలో శ్రీవిద్య మధ్యలో ఉండగా మిగిలిన నాలుగు దేవతలు నాలుగువైపులా ఉంటారు. కాబట్టి పరమేశ్వరి పంచకోశాంతరస్థితా అనబడుతుంది.

శరీరంలో ఉండే అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, కోశముల నడుమ ఆనందమయకోశమందు ఆదేవిఉంటుంది. ఆవిడే మోక్షానిచ్చే దేవత.

వ్యాససూత్రాలలో ఆనందమయుడే బ్రహ్మ అని చెప్పారు.

**<u>తైత్తిరీయోపనిషత్తు</u>**లోని భృగువల్లిలో

వరుణ మహర్షికుమారుడు భృగుమహర్షి. విద్యాభ్యాసం పూర్తిచేసి బ్రహ్మజ్ఞానం సంపాదించాలనే కోరికతో తన తండ్రి దగ్గరకు వెళ్ళి బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశం చెయ్యమని అడిగాడు. దానికి తండ్రి "కుమారా ! అన్నము, ప్రాణము, నేత్రము, శోత్రము, మనస్సు, వాక్కు ఇవన్నీ పరబ్రహ్మ సాధనకు మార్గలే. వీటన్నింటిలోనూ బ్రహ్మతత్త్వం ఇమిడి ఉన్నది. అది దేనిలోనుంచి ఉత్పన్నమైనదో, దేనితో పోషింపబడుతున్నదో, దేనియందులయమవుతున్నదో అన్నిటికీ మూలవస్తువేదో తెలుసుకోవాలి. దాన్ని తపస్సు ద్వారానే సాధించాలి. కాబట్టి వెళ్ళి తపస్సు చెయ్యి" అన్నాడు.

తండ్రి ఆదేశాన్ననుసరించి దీక్ష తీసుకుని నియమనిష్టలతో తపస్సు చెయ్యటం ప్రారంభించాడు భృగువు. కొంతకాలం గడిచింది. ఆ తరువాత అన్నమే పరబ్రహ్మ స్వరూపము అని తెలిసింది. అన్నం మూలంగానే అన్ని ప్రాణులు ఉత్పత్తి అవుతున్నాయి. ప్రాణులన్నీ అన్నంవల్లనే పోషింపబడుతున్నాయి. కాబట్టి అన్నమే పరబ్రహ్మ స్వరూపము. ఈ విషయం తన తండ్రికి చెప్పాడు. దానికి వరుణమహర్షి "నాయనా ! తత్త్వసాధనలో నువ్వు మొదటిమెట్టు మీదనే ఉన్నావు. ఇంకా సాధనచెయ్యి. అన్నం పరబ్రహ్మ స్వరూపమే. కాని అన్నమే పరబ్రహ్మ స్వరూపంకాదు.

వెళ్ళితపస్సుచెయ్యి" అన్నాడు. మళ్ళీ తపస్సు చెయ్యటం మొదలుపెట్టాడు భృగువు. కొంతకాలం గడిచింది. ప్రాణమేబ్రహ్మ అనే విషయాన్ని తెలుసుకున్నాడు. లోకంలోని సమస్త జీవరాశులు ప్రాణంవల్లనే జీవిస్తున్నాయి. ప్రాణంపోయినప్పుడు మృత్యువుతో లయమవుతున్నాయి. అందుచేత ప్రాణమే సర్వ సృష్టికి మూలాధారంఅనిభావించాడు. అదేవిషయం తండ్రికిచెప్పాడు.

నాయనా ! ఇదివరకటికన్న కొంచెంముందుకు వెళ్ళావు. అంతేకాని ప్రాణమే పరబ్రహ్మకాదు. వెళ్ళి మళ్ళీతపస్సుచెయ్యి అన్నాడు వరుణమహర్షి.

మళ్ళీ తపస్సుచెయ్యటం ఆరంభించాడు భృగువు. కొంతకాలంజరిగింది. మనస్సు వల్లనే ప్రాణులు ఉత్పత్తిఅవుతున్నాయి. స్త్రీ పురుషులు మనసుచేతనే ఆకర్షితులౌతున్నారు. అందువల్లనే ప్రాణులు ఉద్భవిస్తున్నాయి. జన్మించిన తరువాత కూడా ఇంద్రియాల సాయం తోనే జీవనం సాగుతున్నది. అదేవిధంగా చనిపోయిన తరువాతకూడా ఇంద్రియాలకు జ్ఞానంప్రసాదించే శక్తిపోతుంది. ఇంద్రియాలన్నీ మనస్సులో లీనమవుతాయి. కాబట్టి మనస్సేబ్రహ్మ అనుకున్నాడు భృగువు. ఇదే విషయాన్ని తండ్రికి తెలియచేశాడు. కాదన్నాడు తండ్రి ఇంకా తపస్సుచెయ్యమన్నాడు.

మళ్ళీకొంతకాలం తపస్సుచేశాడు భృగువు. అప్పుడు అతడికి అర్ధమయింది విజ్ఞానమే బ్రహ్మ. అదే విషయాన్ని తండ్రికిచెప్పాడు. కాదన్నాడుతండ్రి. మళ్ళీ తపస్సు చెయ్యమన్నాడు. తండ్రి మాటప్రకారం మళ్ళీతపస్సుచేశాడు భృగువు. అప్పుడు తెలిసింది ఆనందమేబ్రహ్మ అని సర్వమూ ఆనందం నుంచే జనిస్తుంది. ఆనందంలోనే లయమవుతుంది. ఈవిషయం తండ్రికితెలియచేశాడు. మహదానందంచెందాడు వరుణమహర్షి అప్పుడు చెప్పాడు.

"కుమారా ! అన్నింటికన్నా ఉత్తమంగా పరమాత్మనువ్యక్తంచేసేతత్త్వం ఆనందం. అన్నము ప్రాణము, మనస్సు, విజ్ఞానము కూడా పరబ్రహ్మ రూపాలే. ఇవన్నీ ఒక దానికన్న మరొకటి సూక్ష్మమైనది. అన్నింటికీ మించినది ఆనందం. ఈ ఆనందం క్షణికమైనదికాదు. శాశ్వతమైనది. పరబ్రహ్మోపాసన క్రమంగా జరగాలి. ఆహారాన్ని వదలకుండాతింటూ ప్రాణాన్నినిలుపుకుని, మనసునువికసింపచేసుకుని, దానివల్ల విజ్ఞానంపొంది తద్వారా బ్రహ్మసాక్షాత్కారం పొందాలి" అన్నాడు.

కాబట్టి పరబ్రహ్మస్వరూపము పంచకోశములందు ఉంటుంది. కోశము అంటే – పర అని అర్థం.

మానవశరీరంలో ఐదుకోశాలున్నాయి. అవే

1. అన్నమయకోశము
2. ప్రాణమయకోశము
3. మనోమయకోశము
4. విజ్ఞానమయకోశము
5. ఆనందమయకోశము

మొదటి నాలుగుకోశాలనడుమ ఆనందమయకోశముంటుంది. అందులోనే పరబ్రహ్మ ఉంటాడు.

మానవశరీరం మూడురకాలయిన దేహాలుగా విభజించబడుతుంది.

1. స్థూలదేహము 2. సూక్ష్మదేహము 3. కారణదేహము

1. స్థూలదేహము – అన్నమయ కోశము
2. సూక్ష్మదేహము – ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశాలు
3. కారణదేహము – ఆనందమయకోశము

ఈకోశాలుఐదు ఒకదానిలోఒకటి ఉంటాయి. అమ్మవారి బొమ్మవేసినప్పుడు ఆమె చేతిలో ఐదుపూలు వేస్తారు. అవి పంచతన్మాత్రలు. కొన్నిచోట్ల ఆ పూలు విడివిడిగా కాకుండా ఒక దానిలో ఒకటిగా ఉంటాయి. అవి పంచకోశాలు.

1. అన్నమయకోశంలో – ప్రాణమయకోశం ఉంటుంది.
2. ప్రాణమయకోశంలో – మనోమయకోశముంటుంది.
3. మనోమయకోశంలో – విజ్ఞానమయకోశముంటుంది.
4. విజ్ఞానమయకోశంలో – ఆనందమయకోశముంటుంది.

ఆనందమయకోశంలో ఉండేవాడేపరబ్రహ్మ.

పరాశక్తియే పరబ్రహ్మ కాబట్టి ఆమె ఆనందమయకోశమందుంటుంది. అందుచేతనే పంచకోశాంతరస్థితా అనబడుతుంది.

ఆవిడ మోక్షానిచ్చే దేవత, సాధకుడి అర్హతనుబట్టి అతడికి ముక్తిని ప్రసాదిస్తుంది. ఈ ముక్తి ఐదురకాలుగాఉంటుంది. లలితా సహస్రంలోని 58వ నామంలో ఈ విషయం చెప్పబడింది.

## 58. పంచబ్రహ్మాసనస్థితా

పంచబ్రహ్మలచేత చేయబడిన అసనముమీద కూర్చున్నది.

**పంచభిః బ్రహ్మభిః నిర్మితం ఆసనం మంచరూపకం తత్ర స్థితా**

పంచబ్రహ్మలనే కోళ్ళుగా ఉంచి తయారుచేసిన ఆసనము వీద కూర్చున్నటువంటిది. రుద్రయామళంలో

**బిందుస్థానం సుధాసింధుః పంచయోన్య స్సుర ద్రుమాః ।**
**తత్రైవ నీపశ్రేణీ చ తన్మధ్యే మణి మంటపం ॥**

**తత్ర చింతామణికృతం దేవ్యా మందిర ముత్తమం ।**
**శివాత్మకే మహామంచే మహేశానోపబర్హణే ॥**

**అతిరమ్యతరే తత్ర కశిపుశ్చ సదాశివః ।**
**భృతకా శ్చ చ్చతుష్పాదా మహేంద్ర శ్చవ తద్గ్రహః ॥**
**తత్రాస్తే పరమేశానీ మహాత్రిపురసుందరీ ।**
**శివార్కమండలం భిత్వా ద్రావయం తీందుమండలమ్ ॥**

బిందుస్థానమే పాలసముద్రము. పంచయోనులే కల్పవృక్షాలు. అక్కడ కదంబవనం మధ్యలో మణిమండపం. ఆమణులు చింతామణులు. శక్తిరూపమైన మంచెయందు పరమేశ్వరుడు తలగడ, బ్రహ్మాదులు సేవకులు. ఇంద్రుడు తమ్మిపడిగ, అట్టిసింహాసనం మీద దేవి ఆసీనయైఉంటుంది.

ఐదుగురు బ్రహ్మలతో నిర్మించబడినఆసనాన్ని పంచబ్రహ్మాసనము అంటారు. దానిమీద పరమేశ్వరి కూర్చునిఉంటుంది. అందుకే ఆమెను పంచబ్రహ్మాసనస్థితా అంటారు.

బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు. వీరిని పంచబ్రహ్మలు అంటారు. సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములు వీరి మంత్రాలు. షట్చక్రాలలోను పరమేశ్వరిని అర్చించే వారికి వివిధ రకాలయిన ఫలితము ఉంటుంది. అంటే వారందరికీ ముక్తిలభిస్తుంది. కాని అదిజీవాత్మపరమాత్మల విలీనం కాదు.

అయితే ఆధారస్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. ఇక్కడ పరమేశ్వరిని అర్చించే వారికి మోక్షముండదు. ఇక

1. మణిపూరంలో దేవిని అర్చించేవారు దేవిదగ్గరగా ఇంకొక పురము నిర్మించుకుని ఉంటారు. దీన్ని **సార్షిరూపముక్తి** అంటారు.

2. అనాహతంలో దేవిని అర్చించేవారు దేవిపట్టణంలోనే నివసించగలుగుతారు. దీన్ని **సాలోక్యముక్తి** అంటారు.

3. విశుద్ధిచక్రంలో దేవిని అర్చించేవారు దేవికి అతిదగ్గరగా సేవకులుగా ఉంటారు. ఇది **సామీప్యముక్తి.**

4. ఆజ్ఞాచక్రంలో దేవిని అర్చించేవారు వేరేదేహంధరించి దేవితో సమానమైన రూపంలో ఉంటారు. ఇది **సారూప్యముక్తి.**

5. సహస్రారంలో దేవిని అర్చించేవారు జన్మరాహిత్యం పొందుతారు. వీరికి మరుజన్మ ఉండదు. ఇది శాశ్వతమైనముక్తి. ఇదే **సాయుజ్యం.**

ఈ విధంగా సాధకుడు చేసే అర్చనా విధానాన్ని బట్టి అతడికి ముక్తి లభిస్తుంది. పంచబ్రహ్మలు దేవికి అతి సమీపంలో ఉండి ఆమెను సేవించాలి అనుకున్నటువంటివారై, బాగా ఆలోచించి సామీప్యముక్తి పొందినట్లైతే దేవికి అతిసమీపంగా ఉండి ఆమెను సేవించవచ్చు అని తలపోసి, విశుద్ధిచక్రంలో ఆమెను ఉపాసించారు. అందువల్ల దేవికి సేవకులుగా, అత్యంతదగ్గరగా ఆమెయొక్క సింహాసనానికి కోళ్ళుగా ఉండగలిగారు. ఈ విషయాన్ని శంకరభగవత్పాదుల వారు తమ సౌందర్య లహరిలోని 92వ శ్లోకంలో వర్ణిస్తూ

**గతా స్తే మంచత్వం ద్రుహిణహరిరుద్రేశ్వరభృతః**
**శివస్స్వచ్ఛచ్ఛాయా కపట ఘటిత ప్రచ్ఛదపటః ।**
**త్వదీయానాం భాసాం ప్రతిఫలన రాగారుణతయా**
**శరీరీ శృంగారో రస ఇవ దృశాం దోగ్ధి కుతకమ్ ॥**

ఓ భగవతీ ! బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు అనే నలుగురు నీవు కూర్చునే సింహాసనానికి కోళ్ళుకాగా సదాశివుడు నువ్వు కప్పుకునే దుప్పటి అయినాడు.

శ్రీచక్రంలో 5శక్తిచక్రాలు, 4 శివచక్రాలు ఉన్నాయి. ఇందులోని శక్తిచక్రాలే పంచబ్రహ్మలు. ఈ శక్తిచక్రాలకు పైన దేవి ఉంటుంది. కాబట్టి ఆమె పంచబ్రహ్మాసన స్థితా అనబడుతోంది.

మానవశరీరంలో షట్చక్రాలున్నాయి. ఆ చక్రాలలో ప్రతిదానికీ అధిదేవతలున్నారు.

| | | |
|---|---|---|
| ఆధారచక్రానికి అధిదేవత | – | గణపతి |
| స్వాధిష్ఠానానికి అధిదేవత | – | బ్రహ్మ |
| మణిపూరానికి అధిదేవత | – | విష్ణువు |
| అనాహతానికి అధిదేవత | – | రుద్రుడు |
| విశుద్ధిచక్రానికి అధిదేవత | – | మహేశ్వరుడు |
| ఆజ్ఞాచక్రానికి అధిదేవత | – | సదాశివుడు |

వీటన్నింటికీపైన సహస్రారంలో ఆ లలితాపరమేశ్వరి ఉంటుంది. కాబట్టి ఆమె పంచబ్రహ్మాసనస్థితా అని చెప్పబడుతోంది.

పంచబ్రహ్మలు – పంచభూతాలు. ఈ పంచభూతాలమీద అధికారం కలిగినటు వంటిది; వాటిని తన అధీనంలో ఉంచుకున్నటువంటిది పరమేశ్వరి. అందుచేతనే ఆమె పంచబ్రహ్మాసనస్థితా అనబడుతుంది.

దేవీభాగవతంలో ఈ విషయాన్ని వర్ణిస్తూ

**చింతామణిగృహే రాజన్ । శక్తితత్త్వాత్మకైః పరైః ।**
**సోపానైః దశభిర్యుక్తో । మంచకోఽప్యధిరాజితే ॥**
**బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ । ఈశ్వరశ్చ సదాశివః**
**ఏతే పంచ ఖురాః ప్రోక్తాః ఫలకస్తు సదాశివః ॥**

రాజా ! చింతామణి గృహంలో శక్తితత్త్వాత్మకమైన పదిమెట్ల వరుసతో దివ్య కాంతులతో ప్రకాశించే మంచమున్నది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు దానికి నాలుగుపాదాలు కాగా సదాశివుడు దానిపై పలకగా ఉంటాడు.

**తస్యోపరి మహాదేవో భువనేశో విరాజితే**

**యాదేవీ నిజలీలార్థం ద్విధాభూతా బభూవహ ॥**

**వామాంకే సన్నిషణ్ణా స్వదేవీ శ్రీభువనేశ్వరీ ॥**

దానిమీద త్రిభువనేశ్వరుడు, మహాదేవుడు అయిన కామేశ్వరుడు ఉంటాడు. పరమేశ్వరి అంటే నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మకదా ! మరి ఇక్కడ భువనేశ్వరుడు ఎవరు ? అనుకుంటావేమో ? ఆ పరమేశ్వరియే తనలీలావిలాసార్థము రెండురూపాలు ధరిస్తున్నది.

సృష్టి ప్రారంభానికి ముందు అంటే కృతయుగానికి పూర్వము బిందురూపంలో ఉన్న పరాశక్తి అంతకు ముందు ప్రళయం జరిగినప్పుడు కర్మ పరిపక్వం చెందకుండా తనలో లీనమైన జీవులకు కర్మక్షయం కలిగించాలనే ఉద్దేశ్యంతో సృష్టి చెయ్యాలనుకున్నటువంటిదై తనను తాను రెండుగా విభజించుకున్నది. అంటే తనలో నుంచి కొంత శక్తిని బయటకు పంపింది. అతడే సదాశివుడు. త్రిపుర సుందరుడు అనబడతాడు. తాను లలితాత్రిపురసుందరి.

వారే శివశక్తులు. పరమేశ్వరి పరమేశ్వరులు. కామేశ్వరి కామేశ్వరులు. భువనేశ్వరి భువనేశ్వరులు. కాబట్టి ఇక్కడ రెండురూపాలు ఆమెవే. అటువంటి భువనేశ్వరుడి వామాంకముమీద ఆ దేవిఆసీనమై ఉంటుంది. ఆపరమేశ్వరియే మోక్షాన్నిచ్చేదేవత.

ఆధారచక్రంలోని నిద్రావస్థలో ఉన్న కుండలినీ శక్తిని జాగృతం చేసినట్లైతే, అది సుషుమ్నానాడిగుండా ప్రయాణించి గ్రంధిభేదనంచేసి, సహస్రారంచేరి పరమేశ్వరునితో కలిసి సుఖిస్తుంది. ఆసమయంలో యోగి అనిర్వచనీయమైనఆనందాన్ని పొందుతాడు.

సహస్రారంలోఉన్నది పరమాత్మ. ఆధారచక్రంలోని కుండలినీశక్తి జీవాత్మ. ఈ రెండింటి కలయికయే సుఖస్వరూపం. ఈ విషయం లలితాసహస్రంలోని 90వ నామంలో వివరించారు.

# 90. కులామృతైకరసికా

ఈ నామం దగ్గర నుంచీ కుండలినీ శక్తిని వివరిస్తున్నారు. కులము అంటే వంశము ఇది రెండురకాలు. 1. పైతృకవంశము 2. విద్యావంశము. పరమేశ్వరి అమృత స్వరూపిణి. ఆమె అమృతాన్నే ఆస్వాదిస్తుంది. ఉపాసకుడు తాను అమృతతుల్యుడను అనే భావంతో తాను సంపాదించిన యాగద్రవ్యాలు కూడా అమృతసమానమే అని భావించి జపహోమాదులు నిర్వహించాలి. ఈ రకంగా అమృతము నందు ఆసక్తికలదిదేవి. ఆ అమృతము కులము అంటే సహస్రారము నుంచి ఉద్భవించింది. కులామృతైకరసికా అని పిలువబడుతోంది. అంటే మూలాధారంలోని నిద్రావస్థలో ఉన్న ఆ కుండలినీ శక్తి సహస్రారం చేరుతుంది. అప్పుడు అక్కడి అమృతంతో సాధకుని శరీరంలోని నాడీమండలం అంతా పూర్తిగా తడుస్తుంది. ఈ విషయాన్ని **వామకేశ్వరతంత్రం**లో వివరిస్తూ

**భుజంగాకారరూపేణ మూలాధారం సమాశ్రితా ।**
**శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాఽశుభా ॥** 1

**మూలకందం ఫణాగ్రేణ దష్ట్వా కమలకందవత్ ।**
**ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమాశ్రితా ॥** 2

**వజ్రాసనగతో స్వస్థో గుద మాకుంచ్య సాధకః ।**
**వాయుమూర్ధగతిం కుర్వన్ కుంభకావిష్టమానసః ॥** 3

**వాయ్వాఘాతవశా దగ్నిః స్వాధిష్ఠానగతో జ్వలన్ ।**
**జ్వలనాఘాత పవనాఘాతై రున్నిద్రితో విరాట్ ॥** 4

**రుద్రగ్రంథిం తతో భిత్త్వా విష్ణుగ్రంథిం భిన త్త్యతః ।**
**బ్రహ్మగ్రంథిం చ భిత్త్వైవ కమలాని భినత్తి షట్ ॥** 5

**సహస్రకమలే శక్తిః శివేన సహ మోదతే**
**సా చావస్థా పరా జ్ఞేయా సైవ నిర్వృతి కారణమ్ ॥** 6

1. భుజంగాకారము ధరించి తామరతూడులోని దారమువలె సన్నగా మెరుపు తీగలాగా ప్రకాశిస్తూ ఆ కుండలినీశక్తి మూలాధారాన్ని ఆశ్రయించిఉన్నది.

2. ఆశక్తి ఆధారచక్రము యొక్క మూలకందమును తామరదుద్దువలె నోటితో కరచిపట్టుకుని బ్రహ్మరంధ్రాన్ని ఆశ్రయించి ఉన్నది.

3. సాధకుడు వజ్రాసనంలోకూర్చుని, శ్వాసను పైకివదులుతూ కుంభకము చెయ్యాలి. అంటే గాలిని లోపలికిపీల్చి అట్టిపెట్టాలి.

4. ఆ వాయువు యొక్క తాకిడికి స్వాధిష్ఠానంలోఉన్న అగ్నిప్రజ్వరిల్లి కుండలినీ శక్తిమేల్కొంటుంది.

5,6. ఆతరువాత ఆశక్తి గ్రంధిత్రయాన్ని భేదించుకుని సహస్రారము చేరి సదాశివునితో సుఖిస్తుంది. అట్టిస్థితిలో ఉన్నఆమెయే పరాశక్తి. నిత్యసుఖకారిణి.

గ్రంధిత్రయాన్ని భేదించిన తరువాత ఆ కుండలినీ శక్తి కోట్లకొలది సూర్యచంద్రుల కాంతులతో సహస్రారం చేరుతుంది. అప్పుడు తన యొక్క నోటితో అధోముఖంగా ఉన్న సహస్రదళపద్మాన్ని కరచిపట్టుకుంటుంది. సహస్రదళపద్మము చంద్రమండలము ఎప్పుడైతే కుండలినీశక్తి తననోటితో ఆపద్మాన్ని కరచిపట్టుకున్నదో, అప్పుడు అక్కడ ఉన్నటువంటి అమృతము, ఆరంధ్రాలద్వారా క్రిందికిజాలువారి సాధకుని యొక్క శరీరంలోని 72000 నాడీమండలాన్నీ తడుపుతుంది. అప్పుడు సాధకుడు అవ్యాజమైన, అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందుతాడు. ఈరకంగా పరమేశ్వరియైనకుండలినీ శక్తి అమృతపానమునందు ఆసక్తిగలది. ఆ అమృతము కులపద్మము అంటే సహస్రారము నుంచి ఆవిర్భవించింది. అందుకే కుండలినీశక్తిని కులామృతైకరసికా అన్నారు.

ఆ దేవి సహస్రారంలో ఉంటుంది. లలితాసహస్రంలో 529 నుంచి 535 నామాల వరకు ఈ విషయం చెప్పబడింది.

## 529. సహస్రదళపద్మస్థా

షట్చక్రాలకు పైన బ్రహ్మరంధ్రం దగ్గర సహస్రదళపద్మమున్నది. ఇందులో ఎనిమిది దిక్కులకు ఎనిమిది దళాలుంటాయి. ఒక్కొక్క దళంలోనూ 125 చిన్నచిన్న దళాలుంటాయి. ఈరకంగా మొత్తం వేయిదళాలుంటాయి. అందుకే దీన్ని

సహస్రదళపద్మము అంటారు. ఇక్కడ ఉండేవాడు పరమేశ్వరుడు. ఈ చక్రానికి అధిదేవతగా ఉండేవాడు పరమేశ్వరుడు. ఈ చక్రానికి అధిదేవత యశస్విని. ఇక్కడ సహస్రదళాలలోను అన్ని రంగులు, అన్ని అక్షరాలు ఉంటాయి. ఇది పరమాత్మస్థానము. సహస్రదళంలో వేలకొలది సూర్యకాంతులు ప్రసరిస్తూ ఉంటాయి. యోగీశ్వరులకు ఇక్కడే ఆత్మదర్శనమవుతుంది. అంటే స్వస్వరూపజ్ఞానం కలుగుతుంది. ఇది జీవాత్మపరమాత్మల సంగమస్థానం.

## 530. సర్వవర్ణోపశోభితా

సహస్రారంలో యశస్విని అనే ఈ దేవత అన్ని వర్ణములు అంటే రంగులతోనూ ప్రకాశిస్తుంటుంది. అన్ని అక్షరములతోనూ ప్రకాశిస్తుంటుంది. పైన చెప్పిన షట్చక్రాలలోను అక్షరాలు విడివిడిగా ఉంటాయి అని చెప్పాం. కాని ఇక్కడ అ నుంచి క్ష వరకు అన్ని అక్షరాలు ఉంటాయి.

**సర్వవర్ణే మహాదేవీ సంధ్యావిద్యేసరస్వతీ**

## 531. సర్వాయుధధరా

ఇంతవరకు చెప్పిన చక్రాలలో దేవతలు తమ నాలుగుచేతులయందు ఆయుధాలు ధరించి ఉంటారు. కాని ఇక్కడ ఉండేది పరమేశ్వరి. ఆవిడకు అనేక చేతులు ఉంటాయి. **సహస్రాణిసహస్రధా బాహువోస్తవమేతయః** కాబట్టి అన్ని చేతులయందు అన్నిరకాల ఆయుధాలు ధరించిఉంటుంది. ఆమెచేతిలోలేనిఆయుధం లోకంలో లేనేలేదు.

## 532. శుక్లసంస్థితా

ఈ దేవత సర్వధాతుసారమైన శుక్లమందుంటుంది. ఇది శరీరమంతా వ్యాపించి ఉండే ధాతువు. కాబట్టి ఈ దేవత జీవకోటి శరీరమంతా వ్యాపించి ఉంటుంది.

ధాతుపుష్టి లేని వాళ్ళు **ఓంశుక్లసంస్థితాయైనమః** అని జపం చేస్తే ధాతువృద్ధి కలుగుతుంది.

ఇప్పటి దాకా

1. ఓం త్వక్కుస్థాయై నమః  5. ఓం అస్తి సంస్థితాయై నమః

2. ఓం రుధిరసంస్థితాయై నమః  6. ఓం మజ్జా సంస్థాయై నమః

3. ఓం మాంసనిష్ఠాయై నమః  7. ఓం శుక్ల సంస్థితాయై నమః

4. ఓం మేధోనిష్ఠాయై నమః

అని మంత్రాలు చెప్పటం జరిగింది. వీటికి

**వశిన్యాది వాగ్దేవతాఋషిః । అనుష్టుప్ఛ్ఛందః । శ్రీ లలితాత్రిపురసుందరీ దేవతా । ఐం బీజం । సౌం శక్తిః । క్లీం కీలకం । జపే వినియోగః**

**న్యాసము : ఐం । క్లీం । సౌః । సౌః । క్లీం ః । ఐం**

**ధ్యానము : సకుంకుమవిలేపనా.........**

## 533. సర్వతోముఖీ

ఈ దేవతకు అన్నివైపులా ముఖాలుంటాయి. **సహస్రశీర్షాపురుషః సహస్రాక్షస్స హస్రపాత్** పరమేశ్వరుడికి కొన్నివేల తలలు ఉంటాయి. అంటే ప్రపంచంలోని జీవరాశి అంతా పరమేశ్వరి స్వరూపమే. అందుకే అన్ని జీవుల యొక్క శిరస్సులూ ఆ దేవతకుంటాయి. ఇదే విశ్వరూపము. విశ్వుడు ప్రపంచంలోని జీవరాశికంతటికీ ప్రతీక. అకారాది క్షకారాంతము సర్వదేవతలు ఇక్కడ పరమేశ్వరిరూపంలో ఉంటారు. అందుకే ఈ దేవి అన్నివైపులకూ ముఖాలుంటాయి. కాబట్టే ఈమె సర్వతోముఖీ అనబడింది.

## 534. సర్వౌదనప్రీతచిత్తా

అన్నిరకాలయిన ఆహారములందు ఈమెకు ప్రీతి ఉంటుంది. ప్రపంచంలోని సకల జీవరాశి రూపము ఈ పరమేశ్వరియే. అందుకే అన్ని జీవుల తలలు ఈమెకు ఉన్నాయి. అలాగే అన్నిరకాల ఆహారపదార్థాలను కూడా ఈ దేవి ప్రేమగానే స్వీకరిస్తుంది. విరాట్ప్రాణానికి విరాట్ అన్నమే ఆహారము. అనేది ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడింది.

మనం కూడా అన్నాన్ని ఎప్పుడూ ఉపేక్షించరాదు. **అన్నంననింద్యాత్** అన్నాన్ని నిందించరాదు. అన్నము పరబ్రహ్మస్వరూపము అని అందుకే చెబుతారు.

## 535. యాకిన్యంబాస్వరూపిణీ

యశస్వినీ అనబడే ఈ దేవత యొక్క బీజము, శక్తి, కీలకము అన్నీ యకార సంకేతముగానే ఉంటాయి. అందుకే ఆమెను యాకినీ అంటారు.

యోగినీన్యాసంలో

**ముండవ్యోమస్థపద్మే దశశతదళకే కర్ణికా చంద్ర సంస్థాం**
**రేతోనిష్ఠాం సమస్తాయుధకలితకరాం సర్వతోవక్త్ర పద్మాం**
**ఆదిక్షాంతార్ణశక్తి ప్రకటపరివృతాం సర్వవర్ణాం భవానీం**
**సర్వాన్నాసక్తచిత్తాం పరశివరసికాం యాకినీం భావయామః ॥**

బ్రహ్మరంధ్రం దగ్గర సహస్రదళపద్మమున్నది. దాని కర్ణికలో అన్నిరకాల ఆయుధాలు ధరించి అన్నివైపులకు ముఖములు కలిగి, సర్వవర్ణములతోను ప్రకాశించునది, అన్నిరకాలైన ఆహారములందు ప్రీతి కలది, శుక్లమునందు ఉండునది అయిన యాకినీ అనే దేవత ఉన్నది.

**యోఽహమస్మి బ్రహ్మోహమస్మి । అహమస్మి బ్రహ్మోహమస్మి ।**
**తత్త్వమసి । బ్రహ్మోహమస్మి । సోహం బ్రహ్మోహమస్మి । ఓం**
**బ్రహ్మ హ మస్మి । ఆత్మైవేదగ్ం సర్వం । బ్రహ్మై వేదగ్ం**
**సర్వం । సర్వమేతద్బ్రహ్మ । సర్వం ఖిల్విదం బ్రహ్మ ।**
**బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి ॥**

షట్చక్రనిరూపణంలో "ఆజ్ఞాచక్రం దాటిన తరువాత యోగి మహానాదాన్ని దర్శిస్తాడు. అతడికి వాక్సిద్ధి కలుగుతుంది. సహస్రదళము పూర్ణచంద్రునిలాగా ప్రకాశిస్తుంటుంది. దానికిరణాలు సూర్యకిరణాలవలె కాంతివంతంగా, చంద్రకిరణాల వలె చల్లగా ఉంటాయి. ఇక్కడ అకారాది సర్వవర్ణములు ఉంటాయి. ఇది కేవలము ఆనందరూపమైనది. ఇది చంద్రమండలము. ఇక్కడ వృద్ధిక్షయాలు లేనివాడు,

కళంకరహితుడు అయిన చంద్రుడుంటాడు. ఈ చంద్రమండలము మధ్యన మహాశూన్యమున్నది.

**తదంతః శూన్యం తత్సకల సురగణైః సేవితంచాతిగుప్తం**

ఆ మహాశూన్యాన్ని దేవతలు రహస్యంగా సేవిస్తుంటారు. ఆ శూన్యము చాలా రహస్యమైనది. అతి ప్రయత్నము మీదగాని దాన్ని పొందలేరు. అక్కడే పరమేశ్వరుడుంటాడు. ఆయన సర్వాత్మరూపి. అజ్ఞానము మోహము పోగొట్టి సాధకుడికి సుధాధారలచే ఆత్మజ్ఞానం కలిగిస్తాడు. అప్పుడు సాధకుడు జీవాత్మ పరమాత్మల సమైక్యము సాధించి పరమహంస అవుతాడు.

**శివస్థానంశైవాః పరమపురుషం వైష్ణవగణాః**
**లపంతీతీప్రాయో హరిహరపదం కేచిదపరే ।**
**పదం దేవ్యా దేవీచరణయుగళాం భోజరసికా**
**మునీనా మప్యంతే ప్రకృతి పురుషస్థాన మమలం ॥**

ఈ ప్రదేశాన్ని శివస్థానమని శైవులు, పరమపురుషస్థానమని వైష్ణవులు, దేవీస్థానమని శాక్తేయులు, హరిహరస్థానమని కొందరు, ప్రకృతి పురుష స్థానమని మరికొందరు అంటారు.

**ఇదం స్థానంజ్ఞాత్వా నియత నిజచిత్తో నరవరో**
**న భూయత్ సంసారే పునరపి న బుద్ధస్త్రిభువనే**
**సమగ్రాశక్తః స్వాన్నియమ మనసస్తస్వకృతినః**
**సదాకర్తుం ఖగతిరపి వాణీసువిమలా ॥**

ఈ స్థానాన్ని తెలుసుకున్న సాధకుడికి పునర్జన్మలేదు. ఈ లోకంలో బంధం ఉండదు. పాపపుణ్యాలుండవు. సంసారబంధనాలుండవు. ఇష్టార్థసిద్ధి కలుగుతుంది. **ఇక్కడకు చేరిన యోగికి సాయుజ్యం లభిస్తుంది.** ఆ పరాశక్తి ముక్తిప్రదాయిని.

**సమయమతం :**

**యత్రాపిభోగోనచ తత్రమోక్షః యత్రాపి మోక్షోనచతత్రభోగః**
**శ్రీసుందరీసేవనతత్పరాణాం భోగశ్చ మోక్షశ్చకరస్థయేవ ॥**

లోకంలో ఇహం కావాలంటే పరం ఉండదు. పరం కావాలంటే ఇహం ఉండదు. కాని ఆ పరమేశ్వరిని అర్చించిన వారికి ఇహపరాలు రెండూ సిద్ధిస్తాయి. ఇహంకావలసిన వారు కౌళాచారంలోను, పరం అంటే మోక్షంకావలసినవారు సమయాచారంలోను ఆ దేవిని అర్చిస్తారు.

## సమయాచారము

సమయమతంలో ప్రధానమైనది కైవల్యము. వీరిది పారమార్థికదృష్టి. కర్మకాండవల్ల మోక్షము లభించదు, అనివీరునమ్ముతారు. జీవాత్మ, పరమాత్మల ఏకీభావమే వీరి సిద్ధాంతము. వీరికి శుభాగపంచకము అని పిలువబడే సనక, సనందన, సనత్కుమార, వసిష్ఠ శుకసంహితలు ప్రమాణాలు. సమయాచారులకు బాహ్యపూజ లేదు. అంటే వారు శ్రీచక్రాన్ని వేరుగా పూజించరు. **సనత్కుమార సంహితలో**

**బాహ్యపూజా న కర్తవ్యా కర్తవ్యా బాహ్యజాతిభిః**

వైదికవాదులు, మోక్షవాదులు బాహ్యపూజలు చెయ్యరు. వీటిని బాహ్యజాతుల వారు మాత్రమే చేస్తారు. బాహ్యజాతులవారు అంటే ఐహికమైన సుఖాలను కోరుకునేవారు.

**అంతరారాధనపరా వైదికా బ్రహ్మవాదినః**
**జీవన్ముక్తా శ్చరం త్యేతే త్రిషు లోకేషు సర్వదా ॥**

వైదికులు, బ్రహ్మవాదులు అందరూ అంతరారాధన మాత్రమే చేస్తారు. వీరు జీవన్ముక్తులై ముల్లోకాలలోనూ సదా సంచరిస్తుంటారు.

సమయాచారులలో కూడా ఒక తెగవారికి బాహ్యపూజ ఉన్నది. వారు శ్రీచక్రాన్ని విడిగా పూజిస్తారు. అంతరారాధనలో మూలమంత్రానికి ఋషి ఛందస్సు అవసరం లేదు. అవి కేవలం బాహ్యపూజలోనే కావాలి.

సమయాచారులు శివశక్తులను సమయుడు సమయ అంటారు. సమయ అంటే శివునితో సామ్యము అనగా పోలిక గలిగినశక్తి అని అర్థము. ఈ రకంగా శివశక్తులకు సామ్యము ఉన్నదని నమ్ముతారు కాబట్టే వీరిని సమయాచారులు అంటారు. ఈ సామ్యము 5 రకాలుగా ఉంటుంది.

1. అధిష్టాన సామ్యము - శివశక్తులిద్దరూ ఒకేస్థానాన్ని అధిష్టించి ఉండటము
2. అనుష్ఠానసామ్యము - ఇద్దరూ ఒకే పనిలో నిమగ్నమై ఉండటము.
3. అవస్థాసామ్యము - ఇద్దరూ ఒకే అవస్థలో ఉండటము
4. రూపసామ్యము - ఇద్దరూ ఒకే రూపంలో ఉండటము
5. నామసామ్యము - ఇద్దరి పేర్లు ఒకే రకంగా ఉండటము

షట్చక్రాలలోని ప్రతి చక్రంలోను వీరికి ఈ రకంగా సామ్యం చెప్పబడింది.

**ఆధారచక్రంలో :**

1. శివాశివులిద్దరికీ ఆధారచక్రమే అధిష్టానము. అందుచేత వీరికి అధిష్టాసామ్యము చెప్పబడింది.
2. ఇద్దరూ అక్కడ నాట్యం చేస్తుంటారు. ఇది అవస్థాసామ్యము
3. ఇద్దరూ జగత్తును సృష్టించే కార్యక్రమంలో నిమగ్నమై ఉంటారు. ఇది అనుష్టాన సామ్యము.
4. ఇద్దరూ ఎర్రని రంగులో ఉంటారు. ఇది రూపసామ్యము
5. ఇద్దరికీ భైరవి భైరవుడు, లేదా నవాత్మ నవాత్మకుడు అని పేర్లు. ఇది నామసామ్యము.

**స్వాధిష్ఠాన చక్రంలో :**

1. శివాశివులిద్దరూ స్వాధిష్ఠానంలో ఉంటారు కాబట్టి అధిష్ఠాన సామ్యము.
2. లోకాలను దహిస్తున్నారు అనటం అనుష్టాన సామ్యము
3. మహాసంవర్తాగ్ని, జ్వాలాశక్తి రూపంలో ఉన్నారు అనటం అవస్తాసామ్యము
4. మహాసంవర్తాగ్నులు అనటంలో రూప, నామసామ్యాలు చెప్పబడ్డాయి.

**మణిపూరక చక్రంలో**

1. శివాశివులిద్దరూ మణిపూరంలో ఉంటారు కాబట్టి అధిష్ఠాన సామ్యము
2. స్ఫురన్నానారత్నాభరణ ఫణిరద్దేందు ధనుషమ్ అనటంతో అనుష్ఠాన సామ్యము
3. కారుమేఘాల వలె ఉన్నారు అనటంతో అవస్థాసామ్యము
4. మేఘము, విద్యుల్లతల వలె ఉన్నారు అనటం రూపసామ్యము
5. తటిత్వంతుడు, తటిత్వతి అనటంతో నామసామ్యము చెప్పబడ్డాయి.

**అనాహత చక్రము :**

1. శివాశివులిద్దరూ అనాహతంలో ఉంటారు. ఇది అధిష్ఠాన సామ్యము.
2. వాయుతత్త్వాన్నుత్పాదించటం అనుష్ఠాన సామ్యము
3. గాలి లేని దీపమువలె అనటంచేత అవస్థాసామ్యము
4. అగ్నికణికలు అనటంతో రూపనామ సామ్యాలు చెప్పబడ్డాయి.

**విశుద్ధి చక్రం :**

1. ఇద్దరూ విశుద్ధి చక్రంలో ఉన్నారు. అధిష్ఠాన సామ్యము
2. ఇద్దరూ ఆకాశతత్త్వాన్నుత్పాదిస్తున్నారు అనటం అనుష్టానసామ్యము
3. చంద్రకిరణములతో సమానమైన కాంతి గలవారు అనటం అవస్తాసామ్యం
4. ఇద్దరూ శుద్ధ స్పటికంలా ఉన్నారు అనటం రూపసామ్యము
5. శివాశివులు అనటంవల్ల నామసామ్యము చెప్పబడుతున్నాయి.

**ఆజ్ఞాచక్రము :**

1. శివాశివులకు అధిష్ఠానము – ఆజ్ఞాచక్రము
2. ముక్తిప్రదిత్వము అనుష్ఠానసామ్యము
3. పర అనే చిచ్ఛక్తితో కూడిన సదాశివుడు అనటం అవస్థాసామ్యము.
4. కోట్లకొలది సూర్యచంద్రుల కాంతులతో ప్రకాశిస్తున్నారు అవటం రూపసామ్యము.
5. పరం శంభుం పరుడు అనే పేరు గల శివుడు, పర అనే పేరుగల దేవి అనటంవల్ల నామసామ్యము చెప్పబడ్డాయి.

ఈ రకంగా ఒకే రూపము, నామము కలిగి, శివునితో కూడిన శక్తియే పరమేశ్వరి.ఆమెయే మోక్షదాయని. ఆమెయే లలితా త్రిపుర సుందరి.

అంతర్ముఖ సమారాధ్యా : ఆ పరమేశ్వరి అంతర్ముఖులైన యోగులచే మాత్రమే పొందబడుతుంది. లలితా సహస్రంలోని 868వ నామం చూడండి.

# 868. అంతర్ముఖసమారాధ్యా

ఆత్మాభిముఖమైన చిత్త ప్రవృత్తిగలవారిచే బాగుగా ఆరాధింపబడేది.

పూజ రెండు విధాలు 1. బాహ్యపూజ 2. అంతఃపూజ

1. బాహ్యపూజ అంటే షోడశ ఉపచారాలు, చతుష్షష్టి ఉపచారాలతో పరమేశ్వరిని పూజించటం.

2. అంతఃపూజ అంటే మన శరీరంలోనే దేవతని అర్చించటం. అంతఃపూజ **భావనోపనిషత్తు**లో వివరించబడింది.

**"సలిలమితి సౌహిత్యకరణగ్ం సత్త్వమ్"**

ఇక్కడ నుంచి అంతర్యాగము వివరించబడుతోంది. బాహ్యమైన వస్తువులన్నీ విషయ వాంఛలకు ప్రతీకలు. కాబట్టి వాటిని వదలిపెట్టెయ్యాలి. శరీరంలో ఉండే వస్తువులచేతనే పూజజరగాలి. పూజకుముఖ్యమైనది జలము. సాధకుని శరీరంలో సత్వరజస్తమో గుణాలున్నాయి. వీటిలో మొదటి దానిని పెంపొందించి, మిగిలిన రెండింటినీ తగ్గించాలి. **సత్వగుణమేజలము.**

**"కర్తవ్య మకర్తవ్య  మౌదాసీన్యమితి వివేక భావనాయుక్త ఉపచారః"**

**ఉపచారాలు :** బాహ్యపూజలో దేవికి రాజోపచారాలు, దేహోపచారాలు, మంత్రోపచారాలు అని వివిధరకాలైన ఉపచారాలున్నాయి. అయితే అంతఃపూజలో ఉపచారము అంటే నిత్యముకానివాటిని వదలివేయటము. బ్రహ్మపదార్థమే సత్యము కాబట్టి మిగిలినవి వదలివేయాలి. ఉదాసీనభావము తూష్ణీభావంగా రూపొందకూడదు. ఇదే అంతఃపూజలో ప్రధానమైన ఉపచారము.

**"అస్తి నాస్తీతి కర్తవ్యతా అనుపచారః"**

**అనుపచారాలు :** బ్రహ్మము ఒక్కటే సత్యము, నిత్యము. అది కనిపించనంత మాత్రము చేత లేదుఅనుకోరాదు. సర్వజీవరాశులయందు పరబ్రహ్మమున్నది. అంతేకాని బ్రహ్మము లేదనుకోవటము అపచారము తెలియనితనము. అపరాధము. ఇదే అనుపచారము చేయతగనిది.

**"బాహ్యాంతఃకరణానాం రూపగ్రహణ యోగ్యతాస్తీ త్యావాహనమ్"**

**ఆవాహన :** దేహంలో బాహ్యేంద్రియాలు, అంతరింద్రియాలు ఉన్నాయి. ఆత్మ అనేది ఈ ఇంద్రియాలద్వారానే ప్రకాశిస్తోంది. కాబట్టి వాటియొక్క దేవతారూపాన్ని ఆవాహన చెయ్యటమే దేవిని ఆవాహన చెయ్యటము.

**"తస్యబాహ్యాంతఃకరణానామేకరూప విషయ గ్రహణమాననమ్"**

**ఆసనము :** శరీరంలో ఉన్న జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే పద్నాలుగు విభిన్నమైన ధర్మాలు కలిగి ఉన్నాయి. ఆ ధర్మాలను అరికట్టి సర్వము బ్రహ్మపదార్ధము అని భావించటమే ఆసన సమర్పణ.

**"రక్త శుక్ల పదైకీకరణం పాద్యమ్"**

**పాద్యము :** అంటే కాళ్ళు కడుక్కునే నీరు ఆ దేవి సాధకుడి శరీరంలో ద్వాదశాంతంలో ఉన్నది. బ్రహ్మము (ప్రకాశశక్తి) ఆత్మశక్తిలో ప్రవేశించి శుక్లబిందువయింది. విమర్శశక్తి శుక్లబిందువులో ప్రవేశించి రక్తబిందువయింది. ఈ రెండింటి కలయిక వలన మిశ్రమ బిందువు ఏర్పడింది. ఇప్పుడు

| | | |
|---|---|---|
| రక్తబిందువు | – | చంద్రుడు |
| శుక్లబిందువు | – | అగ్ని |
| మిశ్రమబిందువు | – | సూర్యుడు |

మిశ్రమ బిందువు నుంచి నాదము, దాని నుంచి కళలు ఆవిర్భవిస్తాయి. ఇప్పుడు మిశ్రమ బిందుస్వరూపమైన కామేశ్వరీద్వంద్వము యొక్క

| | | |
|---|---|---|
| కుడికాలు | – | శుక్లవర్ణమైన ప్రకాశాంశము |
| ఎడమకాలు | – | రక్తవర్ణమైన విమర్శాంశము |

ఈ రెండు పాదాలనూ ధ్యానిస్తూ, వాటికి భేదము లేదు అనుకోవటమే పాద్యము

**"ఉజ్జ్వల దామోదానుసంధానమర్ఘ్యమ్"**

**అర్ఘ్యము :** అంటే చేతులు కడుక్కునే నీరు. శ్రమతీరటానికి ఇచ్చే అల్పాహారం అంటే త్రాగేందుకు ఇచ్చేనీరు. అంతఃపూజలో ఆత్మయే శ్రీదేవి అని గ్రహించి బ్రహ్మానందాను సంధానము చెయ్యటమే అర్ఘ్యప్రదానము

"స్వచ్ఛం స్వతస్సిద్ధ మిత్యాచమనీయమ్"

**ఆచమనము :** ఆచమనము అంటే మంత్రపూర్వకంగా నోటిలోకి తీసుకునే నీరు ఆత్మ స్వరూపమైన దేవి స్వచ్ఛమైనది. ఆస్వచ్ఛత స్వయంసిద్ధమైనది అని గ్రహించుట.

"చిచ్ఛంద్రమయీ సర్వాంగప్రవణగ్ంస్నానమ్"

**స్నానము :** బాహ్యపూజలో దేవతకు పంచామృత స్నానము చేయిస్తారు. కాని అంతఃపూజలో అది లేదు. కుండలినీశక్తి ఆధారచక్రంలో నిద్రిస్తూ ఉంటుంది. సాధకుడు ప్రాణాయామంచేసి కుండలినీ శక్తిని గనక నిద్రలేపినట్లైతే, అది షట్చక్రాలగుండా ప్రయాణించి గ్రంథిత్రయాన్ని భేదించి సహస్రారంచేరి తననోటితో సహస్రదళ పద్మాన్ని కరిచి పట్టుకుంటుంది. అప్పుడు సహస్రారము అనే చంద్రమండలం నుండి అమృతధారలు స్రవించి శరీరంలోని డెబ్భైరెండువేల నాడీమండలాన్నీ తడుపుతాయి. ఈ రకంగా అమృతవర్షము కురిపించటమే ఆత్మదేవత (పరదేవత)కు స్నానము. ఈ అమృతవర్షము వలన శరీరము సమశీతోష్ణమవుతుంది.

"చిదగ్ని స్వరూప పరమానందశక్తిస్ఫురణం వస్త్రం"

వస్త్రము అంటే శరీరాచ్ఛాదనకు ఉపయోగించేది. సాధకుని శరీరంలోని కాంతి అంతా ఆ పరాశక్తి యొక్క తేజస్సే. ఈ విషయం తెలిసి బ్రహ్మానందము పొందుటమే వస్త్రప్రదానము

"ప్రత్యేకగ్ం సప్తవింశతిథా భిన్నత్వేనేచ్ఛాజ్ఞాన క్రియాత్మక బ్రహ్మ గ్రంథి మద్రసతంతు బ్రహ్మనాడీ బ్రహ్మసూత్రమ్"

**యజ్ఞోపవీతము :** దీన్నే బ్రహ్మసూత్రము అంటారు. జగత్తు అంతా బ్రహ్మమయమని సూత్రము కాబట్టి ఇది బ్రహ్మసూత్రము. దేహంలో ఉండేనాడులలో సుషుమ్నానాడి ముఖ్యమైనది దీన్నే బ్రహ్మనాడి అంటారు. అంతఃపూజలో ఈ సుషుమ్నానాడినే బ్రహ్మసూత్రము అని భావించాలి.

గాయత్రీ మంత్రానికి ప్రతీక యజ్ఞోపవీతము. తొంభైఆరుబెత్తలు ప్రమాణంకల సూత్రము (దారము) తయారుచేసి దాన్ని మూడుచుట్లు చుట్టాలి. ఇప్పుడు రెండు

చివరలుకలిపి ముడివెయ్యాలి. ఇందులోని సూత్రములో మూడుపోగులుంటాయి. అంటే మొత్తం ఇరవై ఏడు పోగులు ఉంటాయి. తొంభైఆరుబెత్తలు ప్రమాణము తత్త్వములు.

| | | |
|---|---|---|
| మూడు ఆవృతులు | – | త్రిగుణములు |
| మూడు ముడులు | – | మూడుగ్రంథులు |
| మూడు గ్రంథులు | – | బ్రహ్మముడి |
| ఇరవైఏడు పోగులు | – | ఇరవై ఏడు భేదములు కల జగత్తు |

బ్రాహ్మణులు యజ్ఞోపవీతాన్ని ధరించి కర్మలుచేస్తారు. యజ్ఞోపవీతాన్ని తీసివేయట మంటే సన్యాసం స్వీకరించటము. అట్టి సన్యాసి బ్రహ్మకాండను చేసేవాడు. సర్వకర్మ విముక్తుడు జీవన్ముక్తుడు.

సుషుమ్నానాడిలో సూక్ష్మనాడులు కలిసే చోటును గ్రంథి అంటారు. అది ఇరవై ఏడు సూక్ష్మనాడుల సమూహము. అందుకనే సుషుమ్నానాడి యజ్ఞోపవీతము కంటె సత్యమైనది. సహజమైనది. ఇదే కంఠసూత్రము.

**"స్వవ్యతిరిక్తవస్తు సంగరహిత స్మరణం విభూషణమ్"**

**ఆభరణాలు :** దేవతకు కంఠసూత్రంతో పాటుగా వివిధ ఆభరణాలు సమర్పించాలి. సాధకుడు తానుకూడా పరబ్రహ్మస్వరూపమే అని,మాయా మోహంచేత తాను మనిషిగా ఉన్నానని గ్రహించి మాయాది వస్తువులతో తనకు సంబంధము లేదు అని వాటిని పరిత్యజించటమే దేవికి ఆభరణాలు అర్పించటము.

**"సత్వంగపరిపూతా మన్మరణంగంధః"**

**గంధము :** దేహానికి గంధము రాసుకోవటంచేత సువాసన రావటమే కాకుండా పవిత్రత కూడా వస్తుంది. సాధకుడి సహస్రారంలో ఆ పరాశక్తి ఉన్నది, దాని కాంతిచేతనే అతని శరీరము తేజస్సుతో ప్రకాశిస్తుందని ముందే చెప్పటం జరిగింది. ఈ రకంగా జరగటంచేత సాధకుడు తాను ఎప్పుడూ పవిత్రుడనే అనే భావం కలిగి ఉంటాడు. ఇదే దేవికి శ్రీచందనం సమర్పణ.

**"సమస్త విషయాణాం మననం స్థైర్యేణానుసంధానం కుసుమమ్"**

**పూజ :** భగవంతుణ్ణి భక్తుడు నానావిధ పుష్పాలతో పూజిస్తాడు. ఇంద్రియవాంఛలకు లోనుగాకుండా, మనసును పరబ్రహ్మమందు లయం చేసి, సర్వము బ్రహ్మమయమని తెలుసుకోవటమే పుష్పపూజ.

**"అహింసా ప్రథమం పుష్పం, పుష్ప మింద్రియ నిగ్రహః**
**దయాక్షమాజ్ఞానపుష్పం పంచపుష్పం తతఃపరం"**

అహింస, ఇంద్రియనిగ్రహము, దయ, క్షమ, జ్ఞానము అనేవి పంచపుష్పాలు. సాధకుడు అరిషడ్వర్గాలు జయించి, అహంకారమనే పుష్పంతో దేవిని పూజించాలి. అంటే ఈ స్థితిలో నేనుఅనే అహంకారాన్ని, నాదిఅనే భ్రాంతిని వదలివెయ్యాలి.

**"తేషా మేవ సర్వదాస్వీకరణం ధూపః"**

**ధూపం :** సాధకుడు ఇంద్రియచాపల్యానికి లోనుగాకుండా, ఇంద్రియాలను తన స్వాధీనంలో ఉంచుకోవటమే ధూపము.

**"పవనావచ్ఛిన్నోర్ధ్వజ్వాలన వచ్ఛిదుల్కాకాశదేహో దీపః"**

**దీపం :** బ్రహ్మతేజస్సు వాయువుతో కలసి జ్వాలగా ప్రకాశిస్తుంది. అది విశ్వమంతా వ్యాపించి ఉంది. సాధకుడిశరీరము పరబ్రహ్మముయొక్క కాంతిపుంజములతో ప్రకాశిస్తోంది. ఇప్పుడు సాధకుడు ఆకాశాన్నే తనశరీరంగా భావించి, తన శరీరంలో ఉన్న ఆ పరాశక్తిని చిత్కలను దీపముగా భావించటమే దేవికి దీపసమర్పణ.

**"సమస్తయాతాయాత వర్జనం నైవేద్యమ్"**

**నైవేద్యము :** పూజానంతరము నైవేద్యము చెయ్యాలి. ఇంద్రియ చాంచల్యము లేకుండా అంటే ఇంద్రియాలను జయించి బ్రహ్మాకారవృత్తితో ఉండటమే నైవేద్యము. ఇది బ్రహ్మానందానుభవము.

**"అవస్థాత్రయైకీకరణం తాంబూలమ్"**

**తాంబూలము :** ఆకు వక్క సున్నము కలిస్తే తాంబూలము అవుతుంది. అవే జాగ్ర స్వప్న సుషుప్తి అనే మూడు అవస్థలు. ఆ మూడు అవస్థలను తురీయావస్థలో విలీనం చెయ్యటమే తాంబూల సమర్పణ.

**మూలాధారాది బ్రహ్మబిల పర్యంతం, బ్రహ్మరంధ్రాదిమూలాధార పర్యంతం గతాగత రూపేణ ప్రాదక్షిణ్యమ్"**

**ప్రదక్షిణము :** శరీరంలో ప్రాణవాయువు ఆధారచక్రం నుండి సహస్రారము వరకు, సహస్రారం నుంచి ఆధారచక్రం వరకుసుషుమ్నా మార్గంగుండా తిరుగుతూ ఉంటుంది. ఈ రకంగా ప్రాణవాయువు సంచారము చెయ్యటమే ఆత్మరూపంలో ఉన్న దేవతకు ప్రదక్షణము. దీనికే అజపారూప హంస అని పేరు.

హకారసంజ్ఞ గల పరమాత్మ సకార సంజ్ఞగల ప్రకృతితో కలసి హంసరూపమైన శబల బ్రహ్మము అవుతాడు. ఈ శబలబ్రహ్మము తొమ్మిదిద్వారాలు గల మానవశరీరము అనే పట్టణంలో ప్రవేశించి ఇంద్రియములు, ప్రాణములు, మనస్సుతో కూడిన వాడై పంజరంలో బంధించబడిన పక్షిలాగా బయటకు వచ్చే ఉపాయం తెలియక ప్రాపంచిక బంధనాలతో కొట్టుమిట్టాడుతున్నాడు. అటువంటి హంస అనబడే జీవుడికి.

| | | |
|---|---|---|
| అగ్ని, చంద్రమండలాలు | – | రెక్కలు |
| ఓంకారము | – | శిరస్సు |
| జ్ఞాననేత్రము | – | ముఖము |
| హకారసకారములు | – | పాదాలు |

(హకారము రుద్రబీజము సకారము శక్తి బీజము)

ఈ రకంగా ఉన్న హంస అనే జీవుడు పాలలో ఉన్న నెయ్యిలాగా సమస్త ప్రాణికోటినీ ఆశ్రయించి ఉన్నాడు.

సహస్రారముఅనేది ఎనిమిదిదళాలు కలిగినపద్మము. ఇందులోని ఒక్కొక్క దళంలోనూ చిన్నచిన్న రేకులు నూటఇరవై అయిదు చొప్పున ఉంటాయి. ఈ రకంగా మొత్తం వెయ్యి దళాలుంటాయి. అందుకే దాన్ని సహస్రదళకమలం అంటారు. ఎనిమిది దళాలు ఎనిమిదిదిక్కులకు తిరిగి ఉంటాయి.

ఎనిమిదిదళాల వివరాలు ఈ విధంగా ఉంటాయి.

| | | |
|---|---|---|
| తూర్పు దిక్కు | - | సద్బుద్ధి |
| ఆగ్నేయం | - | నిద్ర, దప్పిక, ఆలస్యము |
| దక్షిణము | - | క్రూరబుద్ధి |
| నైరుతి | - | తాపబుద్ధి |
| పడమర | - | విలాసము |
| వాయువ్యము | - | నడచుట మొ॥ విషయములందు బుద్ధి |
| ఉత్తరము | - | సురతము నందు ఆసక్తి |
| ఈశాన్యము | - | ద్రవ్యము దానంచేసే తలంపు |
| పద్మాంతరాళంలో | - | ఇహపరలోక విముక్తి |
| కింజల్కము (తామరపువ్వులోని కేసరములు) | - | మెలకువ |
| తామరదుద్దు | - | కల |
| దుంప | - | నిద్ర |

ఆత్మఏక్షణానైతే సహస్రారాన్నివదులుతుందో ఆక్షణంలోనే పరబ్రహ్మాలో ఐక్యమవుతుంది.

**"తురీయావస్థా నమస్కారః"**

**నమస్కారము :** దేవికి నమస్కారము చెయ్యటమంటే సాధకుడు తురీయావస్థ చేరటమే.

**"దేహశూన్య ప్రమాతృతా నిమజ్జనం బలిహరణమ్"**

**బలిహరణము :** సాధకుడి స్థూలశరీరము మాయతోకూడుకున్నది. సూక్ష్మశరీరము జ్ఞానస్వరూపము తాను జ్ఞానస్వరూపుడు కాబట్టి జీవాత్మను పరమాత్మయందు విలీనం చేసినట్లు భావించటమే బలిసమర్పణ.

**"సత్యమస్తికర్తవ్య మకర్తవ్య మౌదాసీన్య విత్యాత్మ విలాపనగ్ం హోమః"**

**హోమము :** పూజ, జపము అయిన తరువాత హోమము చేయటం విధి.సాధకుడి అహంభావము, జీవభావము, పరబ్రహ్మా స్వరూపం ఉంది, లేదు అనే ద్వైదీభావము మొదలైనవన్నీ పరబ్రహ్మామనే అగ్నిలో విలీనము అనే ఆహుతి చేయటమే హోమము.

**"స్వయం తత్పాదుకా నిమజ్జనం పరిపూర్ణధ్యానమ్"**

**ధ్యానము :** సాధకుడు తాను ఆ దేవి యొక్క పాదముల నుండి వచ్చే తేజస్సులో విలీనమయినట్లుగా తలచి, తానుకూడా ఆ తేజస్సులో ఒక భాగమేనని, సర్వము పరబ్రహ్మ మమయని భావించటమే పరిపూర్ణ ధ్యానము.

**"ఏవం ముహూర్తత్రయం భావనయా యుక్తో భవతి, తస్య దేవతాత్మైక్యసిద్ధిః**

**బ్రహ్మత్వసిద్ధి :** ఈ విధంగా తననుతాను పరబ్రహ్మ స్వరూపంగా భావించి మూడు ముహూర్తముల కాలము దేవియందు మనసును లగ్నం చేసినవాడు ఆ దేవితో ఐక్యత పొందుతాడు. దీనినే బ్రహ్మత్వం సిద్ధించటం అంటారు.

**"చించితకార్యాణ్యయత్నేన సిధ్యంతి స ఏవ శివయోగీతి కథ్యత ఇత్యుపనిషత్"**

**ఫలము :** ఈ విధంగా అంతఃపూజచేసి సిద్ధుడైన సాధకుడికి కోరిన కోరికలు అప్రయత్నంగా నెరవేరతాయి. అతడినే శివయోగిఅంటారు అని ఈ ఉపనిషత్తులో చెప్పబడింది.

బాహ్యవిషయముల యందు ఆసక్తి గల వారికి దుర్లభమైనది. తనలోని ఆత్మే పరమేశ్వరస్వరూపమని తెలుసుకోలేని వారికి లభ్యముకానిది. ఆవిడ మోక్షానిచ్చే పరమేశ్వరి.

దేవీ భాగవతంలో ఆ దేవి పంచబ్రహ్మాసనస్థితా అని చెబుతూ

**చింతామణి గృహే రాజన్ శక్తి తత్త్వాత్మకై పరైః**
**సోపానైః దశభిర్యుక్తో మంచకోప్యధిరాజితే ॥**
**బ్రహ్మావిష్ణుశ్చరుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః**
**ఏతే పంచఖురాః ప్రోక్తాః ఫలకస్తు సదాశివః ॥**

రాజా ! చింతామణి గృహంలో శక్తి తత్త్వాత్మకమైన పదిమెట్ల వరుసలో దివ్యమైన కాంతులతో ప్రకాశించే ఆసనం ఉంది. దానికి బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు, నాలుగు పాదాలు కాగా సదాశివుడు దానిపై పలకగాఉన్నాడు.

**తస్యోపరిమహాదేవో భువనేశోవిరాజితే**

**యాదేవీ నిజలీలార్థం ద్విదాభూతాబభూవహ ॥**

**వామాంకేషన్నిషణ్ణా స్వదేవీ శ్రీభువనేశ్వరీ**

దానిమీద త్రిభువనేశ్వరుడు, మహాదేవుడు అయిన కామేశ్వరుడున్నాడు. పరమేశ్వరి అంటే నిరాకారము, నిర్గుణము కదా? మరి ఈ భువనేశ్వరుడు ఎవరు. అంటే – ఆ పరమేశ్వరియే తన లీలా వినోదం కోసం రెండు రూపాలు ధరించింది. ఇలా శివశక్తి స్వరూపిణి అయిన ఆ పరమేశ్వరియే తన భక్తులకు వారి అర్హతలను బట్టి మోక్షాన్ని ప్రసాదిస్తుంది.

సగుణోపాసకులు అంటే సాకారాన్ని అర్చించిన వారు ఆ పరమేశ్వరికి ఒక రూపం ఆపాదించి అర్చించిన వారు మరణానంతరము మణిద్వీపం చేరి వారి యొక్క కర్మానుసారము 1.సార్షిరూపముక్తి 2. సాలోక్యముక్తి 3. సామీప్యముక్తి 4. సారూప్యముక్తి పొందుతారు. వీరందరూ తమ కర్మ ఫలితం క్షయం కాగానే మళ్ళీ భూలోకంలో జన్మిస్తారు. కాని ఆ పరమేశ్వరిని నిరాకార నిర్గుణస్వరూపంగా సహస్రదళపద్మంలో అర్చించిన వారు మాత్రం సాయుజ్యంపొందుతారు. ఇది శాశ్వతమైనముక్తి. వీరికి పునర్జన్మ ఉండదు. వీరినే ముక్తులు అంటారు. వీరే బ్రహ్మవేత్తలు వీరికి కలిగేది సాక్షాన్ముక్తి.

**సగుణోపాసకులు ముక్తి పొందరు. బ్రహ్మసమాన ఐశ్వర్యాన్ని పొందుతారు. కౌషీతకీబ్రాహ్మణంలో** ఈ విషయాన్ని వివరిస్తూ చివరలో సగుణబ్రహ్మ సాధకులతో "నేను అనుభవించే సుఖాలు మీరు కూడా అనుభవిస్తూ ఇక్కడే ఉండండి" అంటాడు ఆయన మాటలు తలదాల్చి భక్తులు కూడా పరమపదంలోనే ఉంటారు. కొన్ని బట్టి సగుణోపాసకులు బ్రహ్మసమాన ఐశ్వర్యము అంటే కార్యబ్రహ్మను చేరి, ఆయనను పరిపరివిధాల సేవిస్తూ అక్కడ జరిగే నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాలు తిలకిస్తూ అలానే ఉండిపోతారు. వారికి ఆకలి దప్పికలు, కష్టాలు, కన్నీళ్ళు ఏవీ ఉండవు. అంతా ఆనందమే. అదే బ్రహ్మానందము.

వీరికి పునర్జన్మ ఉండదు. ఇదే మోక్షము, కైవల్యము సాయుజ్యము అని కొంతమంది చెబుతారు. వీరికి పునర్జన్మ లేదు అని వీరి నమ్మకం.

కాని బ్రహ్మలోకం చేరినవారిలో కూడా కేవలము జ్ఞానులు మాత్రమే సాయుజ్యం పొందుతారు. మిగిలినవారు కర్మఫలం క్షయమయ్యేదాకా అక్కడే ఉండి, కర్మశేషం అనుభవించటానికి ఈలోకంలో జన్మిస్తారు.

దేహంమీద మమకారంలేని యోగులు, మహాజ్ఞానులు బ్రహ్మానందందాన్ని ఈ లోకంలో జీవించి ఉండగానే పొందుతారు.

పరమేశ్వరిని సహస్రదళంలో అర్చించిన వారు అంటే నిర్గుణోపాసకులు బ్రహ్మలోకం చేరటానికి ఏ మార్గం ఉండదు. వారికి ఆయుష్యుతీరగానే శరీరపతనం అవుతుంది. వెంటనే వీరిజీవాత్మ పరమాత్మలోలీనమవుతుంది. వీరికి పునర్జన్మ ఉండదు.

అలా ముక్తి పొందిన పురుషుడు ఏ రకంగా ఉంటాడు? అతడి లక్షణాలు ఏవి? ముక్తపురుషుడికి శరీరం ఉంటుందా? అతడు ఏ ఏ పనులు చెయ్యగలుగుతాడు? అనే విషయాలను నాల్గవఅధ్యాయంలోని నాల్గవపాదంలో వివరిస్తున్నారు.

## 1. సంపద్యావిర్భావాధికరణము

### (ముక్తపురుషుడు స్వస్వరూపంలో ఉంటాడు)

ఈ విషయాన్ని మొదటిదైన **సంపద్యావిర్భావాధికరణ**లో వివరిస్తున్నారు. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

జీవుడు శరీరంనుండిలేచి అంటే శరీరాన్నివదిలి పరబ్రహ్మను పొంది స్వరూపంతో నిలుస్తున్నాడు. అని **ఛాందోగ్యోపనిషత్తు** చెబుతోంది. ఇందులో చెప్పిన ముక్తిఅనేది స్వర్గములాగాఉంటుందా? స్వర్గము పొందినవాడు సుఖాలనుభవించి, ఉత్తరజన్మలు ఎత్తుతాడు. అలాగే ఈ ముక్తుడు కూడా ఏదైనా అధిఖ్యాన్ని పొందుతాడా? లేక స్వస్వరూపంతోనే ఉంటాడా?

జీవిలో ఉండేది జీవాత్మ. దాని అసలు స్వరూపం ఏమిటి అంటే పరమాత్మ. ఐతరేయోపనిషత్తులో చెప్పినట్లుగా. పరమాత్మ ఈ దేహాన్ని సృష్టించిన తరువాత నేను ఈ దేహంలో లేకపోతే ఎలా అనుకున్నాడు. అప్పుడు హకార సంజ్ఞగల పరమేశ్వరుడు సకారసంజ్ఞ గల ప్రకృతితో కలిసి శబళబ్రహ్మమై బ్రహ్మరంధ్రం గుండా ఈ దేహంలో ప్రవేశించి నవరంధ్రాల ద్వారా అన్ని రకాలైన లౌకిక సుఖాలు

అనుభవిస్తూ వచ్చిన త్రోవనుకూడా మరచిపోయి తానే దేహము అనే అజ్ఞానంతో కూడిన భావనతో నిండిపోయి పంజరలో బంధించబడిన పక్షిలాగా బయటకు వెళ్ళే మార్గం తెలియక కొట్టుమిట్టాడుతున్నాడు. జీవాత్మ పరమాత్మ రెండూ వేరువేరని భావన చేస్తున్నాడు. అజ్ఞానం గనక తొలగిపోతే జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అనే విషయం తెలుస్తుంది. ఈ దేహం నుంచి బయటకు పోయే మార్గం కూడా కనిపిస్తుంది. అప్పుడు జీవుడు బ్రహ్మరంధ్రం గుండా బయటకు వెళ్ళి స్వస్వరూపాన్ని పొందుతాడు. సంసారదశలో అవిద్య, అజ్ఞానంలో కూరుకుపోయిన జీవుడు అజ్ఞానం వదలిపోయి ఆత్మజ్ఞానం కలిగిన తరువాత శుద్ధుడు, ముక్తుడు అవుతున్నాడు. అటువంటి జీవుడికి ప్రియము అప్రియము అనేవి ఉండవు. ఆ జీవుడే దేవుడు. పురుషుడి అసలు స్వరూపం పరమాత్మే. అందుచేతనే ముక్తపురుషుడు స్వస్వరూపంలోనే ఉంటాడు.

ఈ విషయాన్నే ఈ అధికరణలో వివరిస్తున్నారు.

***సూత్రం - 534 "సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్"***

ప్రకాశ రూపమైన ఆత్మసాక్షాత్కారాన్ని పొంది, ఆ ఆత్మరూపంలో విద్వాంసుడు ఆవిర్భూతుడౌతాడు. జీవుడు తానైన రూపంలో ఉండటమే ముక్తి. అదే స్వరూప స్థితి. అజ్ఞానం వదిలిపోగానే స్వస్వరూపం తెలుస్తుంది. కాబట్టి ముక్తి అనేది క్రొత్తగా పుట్టదు.

***సూత్రం - 535 "ముక్తః ప్రతిజ్ఞానాత్"***

ముక్తి పొందిన పురుషుడు పూర్ణానందస్వరూపంలో ఉండిపోతాడు. సంసార దశలో అవిద్యతో బంధించబడిన ఆత్మజ్ఞానం కలిగిన తరువాత శుద్ధుడు, ముక్తుడు అవుతున్నాడు. శరీరంలేనటువంటిఆత్మకు ప్రియము, అప్రియము ఉండవు.

***సూత్రం - 536 "ఆత్మా ప్రకరణాత్"***

ప్రకరణాన్ని బట్టి జ్యోతి అంటే 'ఆత్మ' అని అర్థం. అంతేకాని వెలుగుకాదు. ఇది ఆత్మను గురించి చెప్పే ప్రకరణము. అందుకని ఇక్కడ జ్యోతి అంటే ఆత్మ అనే అర్థం. "దానిని దేవతలు జ్యోతికి జ్యోతిగా చూస్తారు" అని చెప్పబడింది. కాబట్టి ముక్తపురుషుడు స్వస్వరూపంలో అంటే ఆత్మరూపంలోనే ఉంటాడు.

## 2. అవిభాగేన దృష్టత్వాధికరణము

## (ముక్తుడికి పరబ్రహ్మకు తేడాలేదు)

ముక్తిపొందినవాడు తానుకూడా సాక్షాత్తూ పరబ్రహ్మే అవుతాడు అని వివరిస్తున్నారు రెండవదైన **అవిభాగేనదృష్టత్వాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో ఒక సూత్రమే ఉంది.

ముక్తపురుషుడు పరమాత్మకన్న భిన్నమైన రూపంలో ఉంటాడా? ఏకరూపంలోనే ఉంటాడా?

***సూత్రం - 537 "అవిభాగేన దృష్టత్వాత్"***

ముక్తస్వరూపుడు బ్రహ్మతో అవిభక్తమైన రూపంలో ఉంటాడు. బ్రహ్మకు, అతడికీ తేడా ఉండదు. తానుబ్రహ్మఅయి ఆ పరబ్రహ్మనే పొందుతాడు. వేదం ముక్తపురుషుడికి, బ్రహ్మకు భేదంలేదు అని చెబుతోంది. ముక్తపురుషుడు విడదీయటానికి వీలులేని విధంగా నిరతిశయానంద స్వరూపంగా ఉంటాడు. ముక్తపురుషుడు సాక్షాత్తు పరమాత్మే.

## 3. బ్రహ్మాధికరణము (ముక్తాత్ముని లక్షణాలు)

ముక్తుడైనవాడు ఎలా ఉంటాడో వివరిస్తున్నారు. మూడవదైన **బ్రహ్మాధికరణము**లో. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

ముక్తపురుషుడు సత్యసంకల్ప, సర్వజ్ఞత్వాది లక్షణాలు కలవాడై ఉంటాడా? అతడి లక్షణాలేమిటి?

***సూత్రం - 538 "బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః"***

**జైమిని అభిప్రాయం** ప్రకారం సర్వజ్ఞత, సర్వేశ్వరత్వము, అనే లక్షణాలు కలిగి ఉంటాడు ముక్తపురుషుడు. **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఆత్మపాపరహితుడు, ముసలితనము, చావు, శోకము, ఆకలి, దప్పిక లేనివాడు. సత్యకాముడు, సత్యసంకల్పుడు.

***సూత్రం - 539 "చితి తన్మాత్రేణ తదాత్మకత్వాది త్యౌడులోమిః"***

జీవుడు చైతన్య స్వరూపుడు కాబట్టి ముక్తపురుషుడు కూడా చైతన్యరూపంలోనే ఉంటాడని 'ఔడులోమి' అభిప్రాయం.

**తైత్తిరీయోపనిషత్తు**లో సత్యము జ్ఞానము అనంతమయినది పరబ్రహ్మ అని చెప్పబడింది. **బృహదారణ్యకోపనిషత్తు**లో ఆత్మబాహ్యాభ్యంతరాలు లేనిది. సంపూర్ణమైనది. ప్రజ్ఞాన ఘనమైనది ఆత్మజ్ఞానికి శోకము, మోహము, దుఃఖము ఉండవు. బ్రహ్మచైతన్య రూపుడు అన్నాడు. అందుచేతనే బ్రహ్మను పొందే ముక్తపురుషుడు కూడా చైతన్యరూపుడే అయి ఉంటాడు. ఇది **ఔడులోమి అభిప్రాయం.**

***సూత్రం – 540 "ఏవమప్యుపన్యాసాత్పూర్వభా వాద విరోధం బాదరాయణః"***

ముక్తుడు చైతన్య స్వరూపుడు అని చెప్పినప్పటికీ, బ్రహ్మకుండే సత్యసంకల్పం, సర్వజ్ఞత మొదలైన గుణాలు ముక్తుని యందు కూడా సంభవిస్తాయి అంటాడు **వ్యాసమహర్షి.** కాబట్టి ఈ రకంగా పరబ్రహ్మకుండే లక్షణాలన్నీ ముక్తునికి కూడా ఉంటాయి.

## 4. సంకల్పాధికరణము

## (ముక్తాత్ముని కోరికలు వెంటనే సిద్ధిస్తాయి)

ముక్తుడైనవాడు కోరినంతనే దేవతలు ప్రత్యక్షమవుతారు. అతని కోరికలు సిద్ధిస్తాయి అని నాల్గవదైన **సంకల్పాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

అర్చిరాదిమార్గాన బ్రహ్మలోకం చేరిన ఉపాసకుడికి, భోగ్యవస్తువుల్ని సృష్టించటం అనేది సంకల్పమాత్రం చేత సాధ్యమా? లేక ప్రయత్నంచేత సాధ్యమా? అనే విషయాన్ని వివరిస్తున్నారు.

***సూత్రం – 541 "సంకల్పాదేవ తు తచ్ఛ్రుతేః"***

ముక్తుడైనవాడు కోరినంతనే అంటే సంకల్పమాత్రం చేతనే పితృదేవతలు మొదలైన వారు ప్రత్యక్షమవుతారు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా "త్రానే బ్రహ్మ" అని తెలుసుకున్నవాడు. సమస్త లోకాల్లోనూ విహరించగలుగుతాడు.

సత్యకాముడై దహరాకాశంలో బ్రహ్మను సేవించినవాడు మరణానంతరము పితృలోకాన్ని కోరితే పితృగణం ప్రత్యక్షమవుతుంది. వారితో పితృలోకాలకు పోయి పితృలోక అనుభవాలతో సంపన్నుడై మహిమాన్వితుడౌతాడు.

అతడు మాతృలోకాలు కోరితే, మాతృగణాలతో మాతృలోకాలకుపోయి అక్కడి సుఖాలనుభవిస్తాడు.

భ్రాతృలోకాలు కోరితే, భ్రాతృగణాలతో భ్రాతృలోకాలకు పోయి అక్కడి సుఖం అనుభవిస్తాడు.

భగినీలోకాలు (సోదరి) కోరితే భగినీలోకాలకు పోయి సుఖిస్తాడు.

మిత్రలోకాలు కోరితే, మిత్రులంతా ప్రత్యక్షమవుతారు. వారితో ఆ లోకాలు పోయి సుఖిస్తాడు.

గంధమాల్యలోకాలు (పూలదండలు, సుగంధ ద్రవ్యాలు పుష్కలంగా గల లోకం) కోరితే ఆ లోకవాసులు ప్రత్యక్షమవుతారు. వారితో కలిసి ఆ లోకంలో సుఖిస్తాడు.

అన్నపాన లోకాలు కోరితే ఆ లోకవాసులు ప్రత్యక్షమవుతారు. వారితో కలసి ఆ లోకంలో సుఖిస్తాడు.

గీతావాద్య సంబంధమైన లోకాలు కోరితే ఆ లోకవాసులు ప్రత్యక్షమవుతారు. వారితో కలసి అక్కడ సుఖాలను అనుభవిస్తాడు.

స్త్రీలోకాన్ని కోరితే ఆ లోకవాసులైన స్త్రీలు ప్రత్యక్షమవుతారు. వారితో కలసి ఆ లోకంలో సుఖిస్తాడు.

ఈ రకంగా అతడు ఏ లోకాలు కోరితే ఆలోకవాసులు ప్రత్యక్షమవుతారు. వారితోకలిసి ఆలోకాలలో సుఖిస్తాడు. అంటూ అతడు సమస్త లోకాలు చేరగలుగుతాడని చెప్పబడింది. కాబట్టి బ్రహ్మలోకంచేరినజ్ఞాని సంకల్పమాత్రం చేతనే సర్వమూ పొందగలుగుతాడు.

***సూత్రం – 542 "అత ఏవ చానన్యాధిపతిః"***

ఇటువంటి తిరుగులేని సంకల్పంవల్లనే విద్వాంసుడు అనన్యాధిపతి అవుతున్నాడు. అతడికి వేరొక ప్రభువు అంటూ ఎవరూ ఉండరు. అతడికి చక్రవర్తి లాగా అన్ని లోకాలలోనూ సంచారముంటుంది. అతడు కోరినంత మాత్రంచేతనే అన్ని లోకాలు పొందగలుగుతాడు. ఇది సగుణారాధకులకు మాత్రమే వర్తిస్తుంది.

## 5. అభావాదికరణము (ముక్తాత్మలకు శరీరం ఉంటుందా?)

ముక్తి పొందిన వారికి శరీరం ఉంటుందా అనే విషయాన్ని ఐదవదైన **అభావాధికరణ**లో వివరిస్తున్నారు. ఇందులో ఐదుసూత్రాలున్నాయి.

మనం తరచుగా రెండు పదాలు వాడుతుంటాం. 1.ముక్తి 2.మోక్షము. 2 రెండు పదాలకు అర్థం ఒకటే అనుకుంటారు. నిఘంటువు కూడా ముక్తి అంటే మోక్షము అనే చెబుతోంది. కాని ఇవి పర్యాయపదాలు కాదు. వీటిమధ్య చిన్నతేడా ఉంది. మరణానంతరము సగుణోపాసకుడు అర్చిరాదిమార్గం ద్వారా ప్రయాణం చేసి బ్రహ్మలోకం చేరతాడు. అది ముక్తి. దేహపాతం జరిగిన తరువాత నిర్గుణోపాసకుడి ఆత్మపరమాత్మలో లీనమవుతుంది. అది మోక్షము. **జీవుడు బ్రహ్మలోకం చేరటం ముక్తి. పరబ్రహ్మలో లీనం కావటం మోక్షం.** దీన్నే సాయుజ్యం అంటారు. సాయుజ్యం పొందిన వారికి శరీరాదులుండవు.

బ్రహ్మలోకంలో కార్యబ్రహ్మ ఉంటాడు. ఇతణ్ణే సగుణబ్రహ్మ, అపరబ్రహ్మ అంటారు. ఇతడు పరబ్రహ్మకు ప్రతిరూపం. అంతేకాని పరబ్రహ్మ కాదు.

| | | |
|---|---|---|
| వైష్ణవులకు | – | శ్రీమహావిష్ణువు, శ్రీమన్నారాయణుడు, రాముడు, కృష్ణుడు. |
| శైవులకు | – | ఈశ్వరుడు |
| శ్రీవిద్యాపరులకు | – | పరాశక్తి అపరబ్రహ్మలు. మరణానంతరము |
| వైష్ణవులు | – | వైకుంఠం చేరతారు |
| శైవులు | – | కైలాసం చేరతారు |
| శ్రీవిద్యోపాసకులు | – | మణిద్వీపం చేరతారు |
| వైకుంఠంలో | – | లక్ష్మీదేవి, నారదుడు, గరుడుడు, ఆదిశేషుడు |
| కైలాసంలో | – | పార్వతీదేవి, నంది, భృంగి, శృంగి |
| మణిద్వీపంలో | – | కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలిని |

వంటివారు నిత్యముక్తులు అని పురాణాలు చెబుతున్నాయి. నిత్యము అపరబ్రహ్మ సన్నిధిలో ఉండేవారు నిత్యముక్తులు.

ఇప్పుడు బ్రహ్మలోకం చేరిన ముక్తపురుషుడికి శరీరం ఉంటుందా? ఇదంతా సగుణోపాసకుల గురించే చెప్పబడుతోంది. నిర్గుణోపాసకులకు అస్తిత్వం ఉండదు. వారు పరమాత్మలో లీనమవుతారు కాబట్టి వారికి శరీరధారణ అనేది ఉండదు.

ముక్తపురుషులు సంకల్ప మాత్రం చేతనే, కోరినలోకాలు పొందుతారు అన్నారు. సంకల్పం ఉందన్నారు. సంకల్పం కావాలంటే మనస్సుకావాలి. అంటే ముక్తపురుషుడికి మనస్సు, ఇంద్రియాలు అన్నీ ఉంటాయా?

***సూత్రం - 543 "అభావం బాదరిరాహ హ్యేవమ్"***

విద్వాంసుడు అంటే జ్ఞానియైనవాడికి మరణానంతరము శరీరముండదు.

ముక్తపురుషుడు మనసుతోనే అన్నీ అనుభవిస్తాడు అంటోంది ఛాందోగ్యోపనిషత్తు. కాబట్టి ముక్తపురుషుడికి ఇంద్రియాలు శరీరముఉండవు అంటాడు బాదరి. విద్వాంసుడికి మనస్సుకన్న భిన్నమైన శరీరము, ఇంద్రియాలు ఏవీ బ్రహ్మలోకంలో లేవు.

సగుణోపాసకుడికి సూక్ష్మశరీరము ఉంటుంది. నిర్గుణోపాసకుడు సాయుజ్యం పొందుతాడు. అతని జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. కాబట్టి అతడికి శరీరము, ఇంద్రియాలు ఉండవు అంటారు **పరమానంద నాథులు.**

***సూత్రం - 544 "భావం జైమినిర్వికల్పామననాత్"***

జైమిని అభిప్రాయం ప్రకారం ముక్తపురుషుడికి శరీరాదులున్నాయి.

***సూత్రం - 545 "ద్వాదశాహవ దుభయవిధం బాదరాయణో తః"***

ఇక్కడ రెండు విధాలైన శ్రుతులు కనిపిస్తున్నాయి. బ్రహ్మలోకాన్ని పొందినవారు స్వతంత్రులు. వారి సంకల్పం తిరుగులేనిది. అందుచేత శరీరం కావాలనుకుంటే శరీరం ధరిస్తారు. అక్కరలేదు అనుకుంటే శరీరం ఉండదు. అని వ్యాసుడు అంటున్నాడు.

సగుణారాధన చేసి ముక్తి పొంది బ్రహ్మలోకం చేరినవారు, లోకాలను ఉద్ధరించాలనే తలంపుతో ముల్లోకాల యందు తిరుగుతుంటారు. ఒకవేళ ధర్మరక్షణ కోసం అవసరమైతే వీరుకూడా శరీరాన్ని ధరిస్తారు. ఈ ముక్తులు అలా శరీరాన్ని ధరిస్తే ఆ శరీరంతో చేసే పాపపుణ్యాలు వారే అనుభవించాలి.

వైకుంఠంలో లక్ష్మీదేవి, గరుడుడు, ఆదిశేషుడు, నారదుడు మొదలైన వారంతా శాశ్వత ముక్తులు. శ్రీమహావిష్ణువు సాక్షాత్తు పరమేశ్వరుడు అని వైష్ణవం చెబుతోంది. నారదుడి శాపంవల్లనే శ్రీమహావిష్ణువు రాముడిగా జన్మించాడు. వాలిని చెట్టుచాటు నుంచి చంపినందుకే ద్వాపరయుగంలో కృష్ణుడిగా జన్మించాడు. కురుక్షేత్ర సంగ్రామంలో కౌరవులంతా మరణించారనే శోకంతోనే యాదవవంశం నాశనం కావాలని శ్రీకృష్ణుడికి శాపం పెట్టింది గాంధారి.

లక్ష్మీదేవిశాపం వల్లనే శ్రీమహావిష్ణువు తలతెగిపడింది. ఆ తరువాతే విష్ణుమూర్తి హయగ్రీవుడయినాడు.

ఇలాఅనేక ఉదాహరణలున్నాయి. కాబట్టి ముక్తపురుషులు శరీరాన్ని ధరిస్తే, ఆ శరీరంతో చేసే కర్మలఫలితాన్ని వారే అనుభవించాలి. ఇది సగుణోపాసనలోనే జరుగుతుంది. **నిర్గుణోపాసనలో సాధకుని జీవాత్మ పరమాత్మలో లీనమై పోతుంది కాబట్టి వారు మళ్ళీ శరీరం ధరించటమనేది జరగదు అంటున్నారు పరమానందనాథులు.**

***సూత్రం – 546 "తన్వభావే సంధ్యవదుపపత్తేః"***

ఒకవేళ బ్రహ్మలోకంలో ఇంద్రియాలతో కూడిన దేహం లేకపోయినప్పటికీ, స్వప్నంలో లాగా మానసికంగా విషయాలు పొందుతారు. ఇది సగుణోపాసకులకు సంబంధించిన విషయం.

స్వప్నంలో అనేక విషయలు చూస్తాము. పదార్థాలు తింటాము. భోగాలు అనుభవిస్తాము. కాని శరీరము ఇంద్రియాలు ఏవీ ఉండవు.

అవన్నీ స్వప్నంలో యధార్థమే. అలాగే బ్రహ్మలోకంలో భోగాలు మనసు ద్వారానే అనుభవిస్తారు. ఈ విషయం **కౌషీతకీ బ్రాహ్మణం**లోని అర్చిరాదిమార్గంలో చెప్పబడింది.

***సూత్రం – 547 "భావే జాగ్రద్వత్"***

శరీరం ఉన్నప్పుడు జాగ్రదావస్థలో లాగా అనుభవిస్తాడు. శరీరం లేనప్పుడు మనసుతో అనుభవిస్తాడు. కాబట్టి **ముక్తపురుషునికి శరీరం ఉండటం లేకపోవటం అనేది అతని సంకల్పం వల్లనే జరుగుతుంది.**

రావణాసురుడి బాధలు పడలేకుండా ఉన్నాము. అని దేవతలు, మునులు ప్రార్థించినప్పుడు సాక్షాత్తు పరమేశ్వర స్వరూపమైన శ్రీమన్నారాయణుడు తాను భూలోకంలో కౌసల్యగర్భాన రాముడిగా జన్మిస్తాను అని చెప్పాడు. అలాగే గీతలో

**యధా యధాహి ధర్మశ్చగ్లానిర్భవతి భారత ।**

**అభ్యుత్థాన మధర్మశ్చ తదాత్మానం సృజామ్యహం ॥**

లోకంలో ధర్మానికి హాని ఎప్పుడైతే కలుగుతుందో, అప్పుడు నేను అవతరిస్తాను అని చెప్పాడు పరమాత్ముడు.

భండాసురుడు, మహిషాసురుడు వంటి రాక్షసులను సంహరించటానికి ఒక శరీరాన్ని ధరించి ఈ లోకంలో అవతరించింది ఆదిశక్తి.

ముక్తపురుషుడు అంటే సాక్షాత్తు పరమాత్మే. అతనికి శరీరం ఉండటం లేకపోవటమనేది ఐచ్ఛికం. అతని ఇష్టం తను కావాలనుకుంటే శరీరాన్ని ధరిస్తాడు. కాని **శరీరాన్ని ధరించిన తరువాత గతంలో చెప్పినట్లుగా ఆ శరీరంతో చేసిన కర్మలకు అతడే బాధ్యుడు** అంటున్నారు పరమానంద నాథులు.

## 6. ప్రదీపాధికరణము (ఒకే కాలంలో అనేక శరీరాలు)

ముక్తుడు ఒకే కాలంలో అనేక శరీరాలు ధరించగలడు. అంటున్నారు ఆరవదైన **ప్రదీపాధికరణము**లో. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

ముక్తుడు కావాలనుకుంటే ఒక శరీరమే పొందుతాడా? లేక ఒకే కాలంలో అనేక శరీరాలు పొందుతాడా?

***సూత్రం – 548 "ప్రదీపవదావేశస్తథా హి దర్శయతి"***

విద్వాంసుని చేత నిర్మించబడిన అనేక శరీరాల్లో విద్వాంసుడు ప్రదీపంలాగా ఆవేసిస్తాడు.

ముక్తుడు ఆత్మభోగం కావాలనుకున్నప్పుడు అనేక శరీరాలు కలుగుతాయి. ఒకే ఆత్మ, ఒకే మనస్సుతో అనేక శరీరాల్లో భోగము అసంభవం. కాబట్టి అనేక ఆత్మలు, మనసులు కల్పించబడాలి. అలా జరుగుతుందా? అంటే జరగదు. కాని ప్రదీపం లాగా ఆవేసిస్తాడు. అంటే దీపం ఒకటే కాని వత్తులను అంటుకుని అనేక

దీపాలవుతుంది. అలాగే ముక్తుడు, తానొక్కడే అయినా అనేక రూపాలు పొందుతాడు. అనేక శరీరాలను ఆవేశిస్తాడు.

'నారీనారీ నడుమ మురారి' శ్రీకృష్ణుడు తాను ఒక్కడే అయికూడా 16 వేల మంది గోపికలతో ఏకకాలంలో విహరించాడు. భాగవతంలో ఈ విషయం చెప్పబడింది. అక్కడ శ్రీకృష్ణుడే పరమాత్మ, పరబ్రహ్మ అన్నారు.

భాగవతంలో బలరామకృష్ణులను సంహరించే ఉద్దేశ్యంతో వారిద్దరినీ ధనుర్యాగానికి తీసుకురమ్మని అక్రూరుణ్ణి పంపిస్తాడు కంసుడు. అక్రూరుడు ద్వారకానగరానికి వచ్చి యశోదానందులను ఒప్పించి బలరామకృష్ణులను తీసుకుని రథంమీద మధురానగరానికి బయలుదేరతాడు. త్రోవలో యమునానది దగ్గరకు వచ్చారు. అక్కడ రథాన్ని ఆపి, బలరామకృష్ణులను కాలు చేతులు కడుక్కుని, దాహం తీర్చుకుని రమ్మంటాడు అక్రూరుడు. వారు అలాగే చేశారు. వారిని రథంలో కూర్చోమని అక్రూరుడు నది దగ్గరకు వెళ్ళి అర్ఘ్యప్రదానం చేసి, నదిలో నుంచి వంచిన తలపై కెత్తుతాడు. ఆ క్షణంలో బలరామకృష్ణులిద్దరూ నదిలో కనుపిస్తారు. అక్రూరుడు రథం త్రోలుతున్నా, అర్ఘ్యప్రదానం చేస్తున్నా బలరామకృష్ణులను గురించే ఆలోచిస్తున్నాడు. వీరు పదమూడు, పద్నాలుగు సంవత్సరాల పిల్లలు. కంసుణ్ణి చూడబోతే మహాబలవంతుడు. అందులోను రాక్షసుడు. పై పెచ్చు రాజు. అంతః పురంలో ఉండగా అక్రూరుణ్ణి పిలిచి బలరామకృష్ణులను తీసుకు రమ్మన్నాడు. 'వారు చిన్నపిల్లలు. వారిని చంపవద్దు' అని బ్రతిమిలాడాడు అక్రూరుడు. వినలేదు కంసుడు. చివరకు 'నేను వెళ్ళను' అన్నాడు అక్రూరుడు. అప్పుడు కంస మహారాజు "రాజు ఏ పరిస్థితిలో ఉన్నప్పటికీ, అతని నోటి నుంచి వచ్చిన మాట రాజశాసనం. దానికి తిరుగులేదు. మీరటానికి లేదు" అంటూ హెచ్చరించాడు. చేసేది లేక బయలుదేరి వచ్చాడు అక్రూరుడు. ఇప్పుడు వారిని తీసుకుని వెడుతున్నాడు. త్రోవలో వీరి గురించే ఆలోచిస్తున్నాడు. విచారిస్తున్నాడు. మనసులో వ్యాకులత చెందుతున్నాడు. వారి గురించే ఆలోచన. ఈ స్థితిలో నదిలోనుంచి తలపైకి ఎత్తాడు అక్రూరుడు. నది నీటిలో బాలురు ఇద్దరూ కనుపించారు. వీరిని రథంలో కూచోబెట్టి తను నదిలోకి వచ్చాడు. ఇప్పుడు వారిద్దరూ నీటిలో కనుపిస్తున్నారు. ఆశ్చర్యపోయాడు.

**స్నానము చేసి నది చల్లనినీటను రామకృష్ణులన్**
**మానుగ జూచి వారు రథమధ్యము పై వశించి ఉన్నవారు**
**ఈ నది నీటిలోకి ఎప్పుడు వచ్చిరటంచు లేచి మే**
**ధానిధిజాచెవారలను రథస్థుల భక్త మనోరథస్తులన్ ॥**

**కంటిని మున్ను రథంబుపై జలములో గంటిన్ తుదిన్ గ్రమ్మరన్**
**గంటిన్ దొంటి రథంబు మీద ఇదె కళ్యాణచారిత్రులు ఏ**
**వెంటన్ దోచిరి రెండు దిక్కుల మనోవిభ్రాంతి యో నీటిలో**
**నుంటాశ్చర్యము చూతునంచు మరిన్నూహించె భగ్నాంగుడై॥**

ఈ రకంగా ఒకే సమయంలో రథంమీద, నీటిలోను కూడా అక్రూరుడికి కనుపించాడు భగవానుడు. మళ్ళీ అనుమానం వచ్చింది అక్రూరుడికి. తనకేమైనా చిత్తభ్రమ కలిగిందా. మళ్ళీ ఒకసారి పరికించి చూద్దాం. అని మళ్ళీ చూశాడు. ఇప్పుడు

**పోషిత బాంధవుండు యదుపుంగవుడు ఆ జలమందు గాంచె**
**సద్భాషు సహస్రమస్తక విభాషిత భూషు నహీశు భూమి భృ**
**ద్వేషు గృపాభిలాషు ప్రతివీరచమూవిగీషునిత్య సం**
**తోషు నరోషు నిర్దళిత దోషు అనేక వివేషు శేషునిన్ ॥**

రథంలో ఉన్నాడు. నీటిలో ఉన్నాడు. ప్రక్కన ఉన్నాడు. పైన క్రింద అన్నివైపులా ఉన్నాడు. ఆదిశేషుని రూపంలో ఉన్నాడు. సాక్షాత్తు అతడే వాసుదేవుడని అర్థమయింది. నమస్కారం చేశాడు. ఈ విధంగా ఒకే సమయంలో అనేక చోట్ల దర్శనమిస్తాడు ముక్తపురుషుడు.

**'ఒక యోగి ఆత్మకథ'**లో బాబా కూడా ఇలాగే ఒకే సమయంలో అనేకచోట్ల ఒకేసారి కనుపిస్తాడు. కాబట్టి ముక్తపురుషుడు ఒకే కాలంలో అనేకచోట్ల దర్శనమిస్తాడు.

***సూత్రం – 549 "స్వాప్యయసంపత్త్యోరన్యత రాపేక్షమావిష్కృతం"***

ఈ రకంగా ముక్తపురుషుడు తాను ఒకే కాలంలో అనేక శరీరాల్లో ప్రవేశించ గలడు.

# 7. జగద్వ్యాపారాధికరణము

## (ముక్తుడు జగసృష్టి తప్ప అన్నీ చేయగలడు)

ముక్తిపొందినవాడు ఒక్క సృష్టికార్యక్రమంతప్ప మిగిలినపనులన్నీ పరమేశ్వరునిలాగానే చేయగలడు అంటున్నారు ఏడవదైన **జగద్వ్యాపారాధి కరణము**లో. ఇందులో ఆరు సూత్రాలున్నాయి.

సగుణోపాసనచేసి అర్చిరాది మార్గంద్వారా బ్రహ్మలోకం చేరినవారిగురించి చెబుతున్నారు. వారు కార్యబ్రహ్మతో పాటుగా సమానమైన మహదైశ్వర్యము పొందుతారు. అయితే - ముక్తపురుషుడు సంకల్ప మాత్రంచేత జగత్తును సృష్టించగలడా?

***సూత్రం - 550 "జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసం నిహితత్వాచ్చ"***

సాధకుడు పరమేశ్వరుణ్ణి ధ్యానం చేస్తున్నప్పుడు తాను ఉన్న స్థితినుంచి ఒక్కొక్క మెట్టే పైకి వెడతాడు. అంటే భగవంతుడికి దగ్గరవుతున్నాడన్న మాట. ఈ స్థితిలో భగవంతుడికి ఉన్న శక్తులు కొన్ని అతడికి కూడా వస్తాయి. ఆక్రమంలోనే అతడికి అణిమాది అష్టసిద్ధులన్నీ లభిస్తాయి. కాని జగత్తును సృష్టించే శక్తి మాత్రం ఉండదు. ఆ పని పరమేశ్వరుని వల్లనే జరుగుతుంది.

సృష్టి సమయంలో పరమేశ్వరుడు ఒక్కడే ఉంటాడు. అతనికి సన్నిహితులు గాని, అతనితో సమానమైన వారుగాని ఎవరూ ఉండరు.

**ఏకాకీ భూమరూపా నిర్ద్వైతాద్వైత వర్జితా**

***సూత్రం - 551 "ప్రత్యక్షోపదేశాదితి చేన్నాధికారిక మణ్డలస్థోక్తేః"***

విద్వాంసుడికి ఈశ్వరునితోపాటు సమానమైన ఐశ్వర్యంకలుగుతోంది. అంతమాత్రంచేత జగద్వ్యాపారము, జగత్కర్తృత్వము కలగవు. వీరంతా బ్రహ్మలోకంలోనే ఉంటారు. కాబట్టి వీరిశక్తి అక్కడి వరకే పరిమితము. వీరంతా పరబ్రహ్మకు లోబడేఉంటారు. లోకాలనుసృష్టించే అధికారం వీరికిలేదు.

***సూత్రం - 552 "వికారావర్తి చ తథా హి స్థితిమాహ"***

పరమేశ్వరుని రూపం వికారమందు మాత్రమే ఉండేదికాదు. నిత్యమైనది కూడా. ఇది సగుణము, నిర్గుణము అని రెండు రకాలుగా ఉన్నది అని వేదంలో చెప్పబడింది.

ఈ వికారమంతా పరమేశ్వరుని వ్యాప్తి. ఆయన మాత్రం వికారానికి ఆవల ఉన్నాడు. నిర్వికారుడై ఉన్నాడు. ఈసమస్తభూతాలు పరమేశ్వరునికి యొక్క ఒక పాదముమాత్రమే. మిగిలిన మూడుపాదాలు స్వర్గంలోఉన్నాయి. ఈశ్వరుడికి సగుణ, నిర్గుణ రూపాలు రెండూఉన్నాయి. నిర్గుణరూపాన్ని సగుణోపాసకులు పొందలేరు. సగుణోపాసకులు సూక్ష్మదేహంతో బ్రహ్మలోకంచేరి, బ్రహ్మతోపాటు మహదైశ్వర్యము పొందుతూ అక్కడేఉంటారు. ఇదేముక్తి అనిద్వైతులంటారు. వీరికి సాయుజ్యంలేదు. వీరిజీవాత్మ పరమాత్మలో లీనంకాదు.

***సూత్రం - 553 "దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే"***

ప్రత్యక్షం అంటే వేదం. అనుమానం అంటే స్మృతి పురాణాలు.

**న తత్ర సూర్యోభాతి, న తత్ర చంద్రతారకం.**

జ్యోతి రూపుడైన పరబ్రహ్మ యందు లోకాలను ప్రకాశింపచేసే సూర్యుడు ప్రకాశింపడు. చంద్రుడు కాంతులివ్వడు. తారకలు ప్రకాశింపవు. అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. ఇవి వేదంలో భాగాలు. పరబ్రహ్మ నుంచి వచ్చే కాంతులవల్ల సూర్యచంద్రాగ్నులు ప్రకాశిస్తున్నారు.

ఇదే విషయాన్ని పురాణాలు కూడా చెబుతున్నాయి. స్వయం ప్రకాశమానుడైన పరమాత్మను సూర్యచంద్రాగ్నులు ప్రకాశింపచేయలేవు అంటోంది భగవద్గీత.

పరమాత్మది తేజస్సులకన్నా అధికమైన తేజస్సు. కాబట్టి సగుణ, నిర్గుణరూపాలు రెండూ ఆయనకు ఉన్నాయి.

***సూత్రం - 554 "భోగమాత్రసామ్యలిఙ్గాచ్చ"***

ఉపాసకులకు ఈశ్వరునితోపాటుగా భోగమాత్రమైన సామ్యమే ఉన్నదని వేదాలు చెబుతున్నాయి. అందుచేత వారికి జగత్తునుసృష్టించే శక్తి, అధికారములేవు.

సమస్తప్రాణులు హిరణ్యగర్భుని పూజించినట్లే ఉపాసకులను కూడా పూజిస్తాయి. అంటే హిరణ్యగర్భునికి మల్లేనే ఉపాసకునికి కూడా భోగసాధనా లవుతాయి.

బ్రహ్మలోకం చేరిన ఉపాసకులతో బ్రహ్మ "ఓ ఉపాసకులారా! ఇక్కడ అమృత రూపమైనభోగాలను నేనుఉపయోగిస్తున్నట్లే, మీరుకూడా ఉపయోగిస్తారు" అంటాడు. అంటే సగుణోపాసకులు బ్రహ్మలోకంచేరి, బ్రహ్మతోపాటే వీరుకూడా అక్కడ ఉన్న సమస్తభోగాలు అనుభవిస్తారు. వీరికి భోగసామ్యమేతప్ప జగద్వ్యాపారం లేదు.

నిర్గుణోపాసకునిఆత్మ పరబ్రహ్మలో లీనమైపోతుంది. కాబట్టి అదిప్రత్యేకంగా జగద్వ్యాపారం చెయ్యలేదు.

అయితే ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. **'యోగవాసిష్ఠం'**లో ఋషి కుమారులుఆరుగురు జగత్తును ఆరురకాలుగా సృష్టించారు. అలాగే **త్రిపురా రహస్యం**లో 'తంగణపుత్రుడు' అనే ముని కుమారుడు ఒకకొండలో జగత్తును సృష్టించి దాన్ని మహారాజుకు చూపిస్తాడు. ఇలాటి సందర్భాలలో పరబ్రహ్మ కాకుండా ఇతరులుకూడా ఈసృష్టి చేశారు కదా ? అని అనుమానం వస్తుంది.

సృష్టిఅనేది రెండురకాలుగా ఉంటుంది. 1.వ్యష్టి 2.సమిష్టి.

వ్యష్టి సృష్టిలో అతడు చేసిన సృష్టి అతడికి, మహా అయితే ఇంకా ఒకరిద్దరికీ మాత్రమే కనిపిస్తుంది. ఇది గారడీవాడు చేసే సృష్టి. పూర్వకాలంలో అంటే నా చిన్నప్పుడు **'విప్రతినోదివాళ్ళు'** అనే యాచకులు వచ్చేవాళ్ళు. వాళ్ళు చేత్తో వేపాకు తీసుకుని నేలమీద వేస్తే అది కాస్తా తేళ్ళుగా మారిపోయేది. మేమంతా చూసేవాళ్ళం. ఆ తరువాత ఆ తేళ్లను చేతులోకి తీసుకుని చిలకగా మార్చేసేవాడు. ఇదంతా కనికట్టు. గారడీవిద్య. ఈ రకమైన సృష్టి ఎక్కువసేపు నిలవదు. కలలాగా క్షణాల్లో కరిగిపోతుంది. విశ్వామిత్రుడు సృష్టించిన త్రిశంకుస్వర్గం కూడా ఇలాంటిదే.

2. సమిష్టిసృష్టి అనేది పరమేశ్వరుడుచేసేది. ఈసృష్టి అందరికీ ఒకేలా కనిపిస్తుంది. ఇక్కడ పులి అందరికీ పులిలాగానే కనిపిస్తుంది. ఈసృష్టి ఎక్కువ కాలంనిలుస్తుంది. ఇది బ్రహ్మచేసేసృష్టి.

కాబట్టి గతంలో పరబ్రహ్మతప్ప ఎవరైనా సృష్టిచేశారు అంటే అదివ్యష్టి సృష్టి. గారడీవిద్య లాంటిది. జగద్వ్యాపారము పరమేశ్వరుడి వల్లే జరుగుతుంది. అది కూడా సృష్టి చెయ్యాలంటే సగుణబ్రహ్మకు మాత్రమేసాధ్యం. నిర్గుణబ్రహ్మ సృష్టిచెయ్యదు. అందుకే **'సృష్టికర్త్రీ బ్రహ్మరూపా'.** చతుర్ముఖ బ్రహ్మరూపంలోనే ఆ పరమేశ్వరి జగత్తును సృష్టిస్తుంది.

***సూత్రం - 555 "అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్"***

అర్చిరాది మార్గం గుండా బ్రహ్మలోకం చేరిన వారికి కూడా పునరావృత్తి లేదు.

**కఠోపనిషత్తు**లో చెప్పినట్లుగా బ్రహ్మనాడి గుండా పైకి పోయిన వారు అమృతత్త్వం పొందుతారు. **బృహదారణ్యకం**లో చెప్పినట్లుగా దేవయానం ద్వారా పోయేవారు మానవలోకానికి తిరిగిరారు. అంటే నిరాకారాన్ని ఉపాసించిన వారు వెంటనే అమృతత్త్వం పొందుతారు. కాని సాకారోపాసన చేసినవారు దేవయానం ద్వారా పైకి పోయి, కల్పాంతం వరకు బ్రహ్మలోకంలో ఉండి, కల్పాంతాన పరబ్రహ్మలో లీనమవుతారు. వీరికి మరుజన్మ లేదు. అంటే బ్రహలోకం చేరిన జ్ఞానులకు మాత్రమే మరుజన్మ లేదు. అంతేగాని బ్రహ్మలోకం చేరిన వారందరికీ మరుజన్మ లేదని మాత్రం కాదు. మరుజన్మ లేకపోవటం అంటే మోక్షం పొందటం.

## మోక్షము

ముక్తి, మోక్షము, జన్మరాహిత్యము, సాయుజ్యము ఇవన్నీ పర్యాయపదాలు ఐహిక బంధాల నుంచి విముక్తి పొందటమే ముక్తి. అదే మోక్షము. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. జగత్తేపరమేశ్వరుడు, పరమేశ్వరుడేజగత్తు. ఈ విషయం తెలిసినవాడు మహాజ్ఞాని. అతనిజీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. అతనికి పునర్జన్మఉండదు. అయితే ఇక్కడ చిన్నఅనుమానంవస్తుంది. ఇప్పుడు చెప్పిన విషయం మనకందరికీ తెలుసుకదా? పుస్తకాలుచదివి, ఉపన్యాసాలువిని తెలుసుకోవచ్చు. అదిచాలదు. మనసావాచాకర్మణా తెలుసుకోవాలి. అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలి. అటువంటివాడే మహాజ్ఞాని. అతడే ముక్తపురుషుడు. ఇతడికి పిపీలికాదిబ్రహ్మపర్యంతము తనలానే కనిపిస్తుంది. ప్రతి వస్తువునందు, ప్రతిజీవియందు ఇతడు పరమాత్మనిచూడగలుగుతాడు.

అయితే పూర్వకాలంలోలాగా ఈరోజుల్లో ఎక్కువమంది ఈజ్ఞానాన్ని పొందలేక పోతున్నారు. ముక్తులు కాలేకపోతున్నారు. కొందరైతే అనుకోని పొరపాట్లు, చేయకూడని పనులుచేసి అవమానాలుకూడా పొందుతున్నారు. దీనికి కారణం

ఏమిటి? నిశితంగాఆలోచిస్తే భవబంధాలే కారణము అనిపిస్తోంది. మమ అనుకుంటే బంధము. నమమ అనుకుంటే మోక్షము. మోక్షంకావాలనుకున్నవాడు రాగద్వేషాలు, అహంకారమమకారాలు, అరిషడ్వర్గాలు అన్నీ జయించాలి. వీటిని జయించకుండానే సన్యసించటం, మోక్షంకావాలనుకోవటం జరుగుతోంది. అగ్ని చాలా గొప్పగా, బ్రహ్మాండంగా మండుతోంది. అయినప్పటికి మణి, మంత్ర, ఔషధాదులచేత కట్టడిచేయబడినట్లైతే, ఆఅగ్ని గడ్డిపోచనుకూడా దహించలేదు. అలాగే ఆత్మజ్ఞానము ఉన్నప్పటికీ బంధాలను వదలించుకోకపోయినట్లైతే అతడికి మోక్షం సిద్ధించదు.

**ప్రతిబంధో వర్తమానో విషయాసక్తి లక్షణః**
**ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ విపర్యయ దురాగ్రహః ॥**

1. **విషయాసక్తి** – విషయముల యందు ఆసక్తి, కోరిక
2. **ప్రజ్ఞామాంద్యం** – బుద్ధి పరిశుద్ధం కాకపోవటం
3. **కుతర్కము** – ప్రతిదానికి విపరీతార్థాలు చెప్పటం
4. **విపర్యము** – అనాత్మ పదార్థాల యందు ఆత్మబుద్ధి కలిగి ఉండటం.
5. **దురాగ్రహము** – అనవసరంగా కోపం తెచ్చుకోవటం.

ఇవన్నీ రజోగుణ, తమోగుణ లక్షణాలు. మోక్షానికి ప్రతిబంధకాలు. ఇవి పోవాలంటే విపరీతమైన తపస్సు చెయ్యాలి. అగ్నిలో కట్టెలుదహించబడినట్లే, ఈ గుణాలు తపస్సువల్ల దహించబడతాయి.

ఈ విషయాల గురించి అనేకసార్లువినచ్చు. వినటంచాలదు. విన్నదాన్ని మననంచెయ్యాలి. విచారణచెయ్యాలి. ధ్యానంచెయ్యాలి. అప్పుడే విషయం గట్టి పడుతుంది. ఈ కారణంచేతనే నిరంతరము ధ్యానం చెయ్యాలి. ఇలా ధ్యానం చెయ్యగా చెయ్యగా, సముపార్జించిన జ్ఞానం బలపడుతుంది. ఒకచెట్టుకు పూలు, పిందలు, కాయలు, పండ్లు ఉన్నాయి. ఇప్పుడు మనకు కనిపిస్తున్న పండు కొన్ని రోజుల క్రితం కాయ, ఇంకొన్ని రోజుల క్రితం పింద, ఇంకొన్ని రోజుల క్రితం పూవు. అంత క్రితం మొగ్గ. ఆ మొగ్గే ఇప్పుడు పండు అయింది. ఇదే ముక్తావస్థ. పండుకు పులుపు, వగరు, చేదు అనేవి ఉండవు. అందులోని దోషాలు అన్నీ నశించిపోయి వేపకాయ అయినా సరే పండితే తియ్యగా ఉంటుంది. అలాగే **మానవుడిలో** ఎన్ని

**దోషాలు ఉన్నా నిరంతర ధ్యానం వల్ల అవన్నీ నశించి ముక్తుడవుతాడు.** ఒకవేళ పండు ఇంకా పుల్లగా ఉన్నది అంటే, అది ఇంకా బాగా పండలేదు అని అర్థం. అలాగే మానవుడిలో ఎంత ధ్యానం చేసినా ఇంకా గుణదోషాలున్నాయి అంటే అతడికి ఇంకాపరిపక్వత సిద్ధించలేదని అర్థం.

మోక్షాన్ని వెతుక్కుంటూ మనం పరుగులు పెట్టవలసిన అవసరం లేదు. మోక్షార్హత సాధించిన వారిని అదే వెతుక్కుంటూ వస్తుంది. కావలసిందల్లా అర్హత సాధించటమే. కలెక్టరుకావాలి అంటే దానికికావలసిన అర్హత మనంసాధించాలి. ఐఎఎస్ ప్యాసయినప్రతివారు కలెక్టరుఅవుతారు. ఇందులో సందేహంలేదు. ఐఎఎస్ ప్యాసవకపోతే ఎన్ని ప్రయత్నాలు చేసినా కలెక్టరు కాలేరు. అలాగే మోక్షానికి కావలసిన అర్హతఏమంటే బంధవిముక్తి. ఐహికబంధాల నుంచి విముక్తి పొందినవాడు, చరాచరజగత్తంతా పరమేశ్వరమయమనే జ్ఞానాన్ని అనుభవ పూర్వకంగా పొందినవాడు మోక్షం పొందుతాడు. అతడికి మాత్రమే పునర్జన్మ ఉండదు అంటున్నారు పరమానంద నాథులు.

## జన్మరాహిత్యం

పుట్టుకతోనే ఎవరూ గొప్పవాళ్ళు కాదు. గొప్ప వారింట్లో పుట్టినంత మాత్రంచేత గొప్పదనం రాదు. గట్టి పట్టుదల, విశేషమైన ప్రయత్నం, కార్యదీక్ష మనిషిని గొప్పవాడుగా చేస్తాయి. గొప్ప వంశంలో పుట్టిన వారికి జన్మతః కొన్ని లక్షణాలు, సంస్కారాలు అబ్బుతాయి. **అజామిళుడు** ఉన్నతమైన కుటుంబంలో బ్రాహ్మణునిగా జన్మించాడు. వేదవేదాంగాలు చదువుకున్నాడు. కాని భ్రష్టుడై పోయాడు. భాగవతంలో అంగరాజు చాలా గొప్పవాడు. పిల్లలకోసం పుత్రకామేష్టి చేసి ఒక కుమారుణ్ణి కన్నాడు. అతడే **వేనరాజు**. మహా దుర్మార్గుడు. చివరకు ఋషీశ్వరులు, మునీశ్వరులు అతన్ని సంహరించారు. కాబట్టి పుట్టుకతోనే ఎవరూ గొప్పవారు కాదు. విపరీతమైన సాధన చేసినవారే గొప్పవారవుతారు. ఆలయంలో భగవద్దర్శనానికి ఎక్కి వెళ్ళే గడప, భగవంతుడి విగ్రహం రెండూ శిలలే. అయినా విగ్రహంగా ఉన్న శిల పూజలందుకుంటోంది. గడప అందరిచేత త్రొక్కబడుతోంది. కారణం. విగ్రహం కావటానికిఆ శిల ఎన్నివేల సుత్తిదెబ్బలు తిన్నదో లెక్కలేదు.

అలాగే జన్మరాహిత్యం పొందాలంటే కేవలము కోరికే కాదు. విపరీతమైన పట్టుదల కావాలి. ఐహిక భోగాలు, లౌకికవాంఛలు అన్నీ వదిలెయ్యాలి. సాధించవలసిన విషయంమీదనే దృష్టి నిలపాలి. ఇంకొక ఆలోచన మనసులోకి రాకూడదు. **లింగపురాణం**లో మోక్షం పొందాలంటే ఏం చెయ్యాలి? అని శివుణ్ణి అడుగుతారు. దానికి శివుడు. "మోక్షం పొందాలనే విపరీతమైన పట్టుదల ఉండాలి" అంటాడు. అలా పట్టుదల ఉన్నవాళ్ళు దానికి కావలసిన సాధనచేసి జన్మరాహిత్యం పొందుతారు.

ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఇంకోటుంది. సామాన్యంగా అందరూ "నాకు ఇదే ఆఖరు జన్మ కావాలి. నాకు మోక్షం రావాలి' అంటుంటారు. **మోక్షం అనేది బస్సులోనో, రైల్లోనో, విమానంలోనో ఎక్కడినుంచో రాదు. అది మన దగ్గరే ఉంది. దాన్ని గుర్తించటమే మోక్షం.**

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా మానవదేహాన్ని సృష్టించిన తరువాత ఆత్మపురుషుడు ఈ దేహంలో బ్రహ్మరంధ్రం గుండా ప్రవేశించి, నవరంధ్రాలతోను అన్ని సుఖాలు అనుభవిస్తూ, తానువేరు, దేహంవేరు అనే మాట మర్చిపోయి, వచ్చిన దారికూడా గుర్తులేక, తానేదేహము అనే అజ్ఞానంలో కూరుకుపోయి జీవాత్మవేరు, పరమాత్మవేరు అనుకుంటున్నాడు. అజ్ఞానంగనక వదలిపోతేజీవాత్మ పరమాత్మ రెండూఒకటే అనేవిషయం తెలుస్తుంది. తానే పరమేశ్వర స్వరూపం అని తెలుసు కుంటాడు. అదేమోక్షస్థితి. కాబట్టి మోక్షమనేది ఎక్కడినుంచో రాదు. తనను తాను తెలుసుకోవటమే మోక్షము. స్వస్వరూపజ్ఞానమే మోక్షము.

కాబట్టి ఓ సాధకుడా! **మోక్షమనేది క్రొత్తగా ఎక్కడినుంచోరాదు. అది నీ దగ్గరే ఉన్నది. నిన్ను నువ్వు తెలుసుకోవటమే మోక్షము అంటున్నారు పరమానందనాథులు.**

మొత్తం మీద సాకారోపాసన గాని నిరాకారోపాసన గాని చేసిన వారందరూ పరబ్రహ్మలో లీనమవుతారు. వీరికి మరుజన్మలేదు ముక్తుడు జగసృష్టి తప్ప అన్నీ చేయగలడు అని చెబుతున్నాయి బ్రహ్మసూత్రాలు.

సాకారోపాసన చేసిన వారు బ్రహ్మలోకం చేరతారు. ఎక్కడైతే అరము, ణ్యము అని రెండు సముద్రాలుంటాయో, ఎక్కడైతే ఇరం మదీయమనే సరస్సు ఉంటుందో,

ఎక్కడైతే విరజానది ఉంటుందో, ఎక్కడైతే ఈల్య అనే వృక్షము, సాయుజ్యము అనే పట్టణము, అపరాజిత అనే సౌధము ఉంటాయో అదే బ్రహ్మలోకము. అని చెబుతోంది **కౌశీతకీ బ్రాహ్మణము.** అక్కడికి చేరిన వారిలో కూడా చరాచర జగత్తంతా పరమేశ్వరి స్వరూపమే. ఆమె తప్ప ఈ జగత్తులో ఇంకేదీ లేదు. అని తెలిసిన వారికి మాత్రమే పునరావృత్తి లేదు. సాకారోపాసనలో సాధకుడు బ్రహ్మలోకంలో పొందే మహదైశ్వర్యమే బ్రహ్మానందం.

పరమేశ్వరిని మంత్రంచేతగాని, చక్రార్చనచేతగాని, యజ్ఞాలు, యాగాలు, జపాలు, తపస్సు, యోగం చేతగాని పరమమైన భక్తిశ్రద్ధలతో అర్చించిన వారు మరణానంతరము మణిద్వీపం చేరతారు. వారు చేసిన సాధనను బట్టి వారికి ఐదు రకాల ముక్తి లభిస్తుంది.

1. సార్ష్టిరూపముక్తి 2. సాలోక్యముక్తి 3. సామీప్యముక్తి 4. సారూప్యముక్తి 5.సాయుజ్యం

1. సార్ష్టిరూపముక్తి పొందిన వారు దేవి పురానికి దగ్గరగా ఇంకొక పురము నిర్మించుకుని ఉంటారు.

2. సాలోక్యముక్తి పొందిన వారు దేవి పట్టణంలోనే నివసించగలుగుతారు.

3. సామీప్యముక్తి పొందిన వారు దేవికి అతిదగ్గరగా సేవకులుగా ఉంటారు. పంచబ్రహ్మలు దేవికి అతిసమీపంగా ఉండి ఆమెను సేవించాలనే కోరికతో ఆమెను విశుద్ధి చక్రంలో అర్చించి, మొదటి నలుగురు ఆమె కూర్చునే ఆసనానికి కోళ్ళు కాగా, సదాశివుడు దేవి కప్పుకునే దుప్పటి అయినాడు అని శంకర భగవత్పాదుల వారు సౌందర్యలహరిలోని 92వ శ్లోకంలో వ్రాశారు. అలాగే ఇంద్రుడు తమ్మిపడగ (ఉమ్మిపాత్ర) అయినాడు.

4. సారూప్యముక్తి పొందినవారు దేవితో సమానమైన రూపం ధరించి, ఆవిడ చేసే కొన్ని పనులు చేస్తుంటారు. భక్తుల యొక్క కోరికలు చాలావరకు తీరుస్తారు. మనం ఏవైనా మంచిపనులు చెయ్యాలని సంకల్పించినప్పుడు వారు దగ్గర ఉండి ఆపని పూర్తిచేయిస్తారు. నేను ఈ పుస్తకంవ్రాస్తున్నాను అంటే దీనికికారణం ఆ పవిత్రాత్మలే. వీరంతా మణిద్వీపంలో ఉంటూ మహదైశ్వర్యాన్ని అనుభవిస్తారు.

5. సాయుజ్యం : పైనచెప్పిన నాలుగురకాలవారు తమ కర్మఫలంఉన్నంత వరకు అక్కడఉండి ఆతరువాత కర్మశేషం అనుభవించటానికి ఈలోకంలో ఉత్తమ యోనులయందు జన్మిస్తారు. పరమేశ్వరిని అంతర్ముఖంగా ఆరాధించేవారు, తామే పరమేశ్వరిస్వరూపమని త్రికరణశుద్ధిగానమ్మేవారు, జగత్తులో పరమేశ్వరి తప్ప ఇంకెవరూ లేరు. జగత్తేపరమేశ్వరి, పరమేశ్వరియేజగత్తు అని తెలుసుకుని రాగద్వేషాలు, అహంకారమమకారాలు వదలి నిస్వార్థమైన జీవితం గడుపుతూ సర్వకాలసర్వావస్థలయందు ఆపరాశక్తినే ఉపాసించేవారు మాత్రమే సాయుజ్యం పొందుతారు. వీరికి పునర్జన్మలేదు. వ్యాసభగవానుడు చెప్పిన 555వ సూత్రం వీరి గురించే అంటున్నారు పరమానంద నాథులు. వీరు సాకారోపాసకులైనాసరే, నిరాకారోపాసకులైనా సరే సాయుజ్యం పొందుతారు. పైన చెప్పిన నాలుగు రకాల ముక్తులు పొందినవారికి జగత్తును సృష్టించే అధికారంలేదు. శక్తికూడా లేదు. సాయుజ్యం పొందిన వారు పరాశక్తిలో లీనమవుతారు. వారికి ప్రత్యేకమైన అస్తిత్వం లేదు. కాబట్టి వారు జగస్సృష్టి చెయ్యలేరు. ఈరకంగా పరమేశ్వరితప్ప ఎవరూ జగస్సృష్టి చెయ్యలేరు.

**అర్చిరాది మార్గం :** అర్చిరాది మార్గం ద్వారా బ్రహ్మలోకం చేరిన వారికి పునరావృత్తి లేదు అని చెబుతోంది కౌషీతకీ బ్రాహ్మణం. సగుణోపాసకులంతా ఈ మార్గం ద్వారానే వెడతారు. వైష్ణవులు, శైవులు, శాక్తేయులు, అమ్మవారిని అర్చించే వారు వీరందరూ సగుణోపాసకులే. అందరూ ఇదేమార్గంద్వారా బ్రహ్మలోకం చేరతారు. అక్కడ కార్యబ్రహ్మ (ఇతడే సగుణబ్రహ్మ) తాను అనుభవించే ఐశ్వర్యాన్నే అనుభవిస్తూ వారినికూడా అక్కడేఉండమంటాడు. ఆయనమాటలు తలదాల్చి వారంతా అక్కడేఉంటూ, అక్కడజరిగే నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాది వివిధోత్సవాలు తిలకిస్తూ, పరమానందాన్ని పొందుతారు. అదే బ్రహ్మానందం. ఇదే కైవల్యము అని, వీరికి పునరావృత్తి లేదని అంటారు. కాని అది నిజం కాదు. ఎందుకని అంటే?

పరబ్రహ్మను గూర్చిన భయంతోనే గాలి వీస్తోంది. సూర్యుడు ఉదయిస్తున్నాడు ఇంద్రాదిదేవతలు తమ విధులను సక్రమంగా నిర్వహిస్తున్నారు. దేవతలు కూడా సక్రమంగా తమ విధులు నిర్వర్తించటానికి కారణం బ్రహ్మ ఉండటమే. బ్రహ్మమే ఆనందము. ఇది క్షణికానందం కాదు. శాశ్వతానందం. విషయవాంఛలవల్ల కలిగేది

లౌకికానందం. ఇది క్షణికం. అనుభవించగానే ఆ ఆనందం తగ్గిపోతుంది. అవిద్య అంటే అజ్ఞానము, విషయ వాంఛలు తగ్గిన కొద్దీ ఆ ఆనందం పెరుగుతుంది. అదే మానవుల, మనుష్య గంధర్వుల, దేవగంధర్వుల ఆనందంగా అభివృద్ధి చెంది స్వాభావికమైన పరిపూర్ణానందంగా మారుతుంది. అదే అద్వైతానందం.

ఈ ఆనందం శ్రోత్రియుడు, (వేద కర్మలనాచరించువాడు) సదాచార సంపన్నుడు, నిష్కాముడు అయిన బ్రహ్మవేత్తయే అనుభవించతగ్గది. ఈ మూడు గుణాలు లేనివాడికి ఈ ఆనందం లభించదు.

ఈ లోకంలోని సంపద అంతా యువకుడు, సదాచార సంపన్నుడు, వేదాధ్యాయి, బలమైనవాడు అనుభవించటానికే ఉన్నది. దీన్ని అనుభవించటం వల్ల కలిగే ఆనందము మానుషానందము. మానుషానందునికి నూర్రెట్లు మనుష్య గంధర్వానందము. మనుష్య గంధర్వులంటే మానవులై ఉండి పుణ్యకర్మలచేత గంధరత్వం పొందినవారు.

మనుష్య గంధర్వానందానికి నూరురెట్లు దేవగంధర్వానందం. సృష్టికాలంలో దేవలోకంలో గంధర్వుడుగా పుట్టినవాడు దేవగంధర్వుడు. దేవగంధర్వానందానికి నూరురెట్లు చిరలోక పితరానందము. చిరకాలం ఉండే లోకంలో ఉన్న పితృదేవతలు చిరలోక పితరులు.

దానికి నూరురెట్లు అజానజదేవానందము. ఈ లోకము దేవలోకానికి పైన ఉన్నది. అక్కడి వారు అజానజ దేవతలు, దానికి నూరురెట్లు కర్మ దేవానందము. వైదిక కర్మలు చేసి దైవత్వం పొందిన వారు కర్మదేవలు.

దానికి నూరురెట్లు దేవానందము. యజ్ఞంలో హవిర్భాగము తీసుకునే 33 మంది దేవతలు.

దానికి నూరు రెట్లు ఇంద్రానందము

దానికి నూరు రెట్లు బృహస్పతి ఆనందము.

దానికి నూరురెట్లు ప్రజాపతి ఆనందము (విరాట్పురుషుడు)

దానికి నూరు రెట్లు బ్రహ్మానందం. అతడే మానవులందరిలోనూ ఉన్నాడు.

బ్రహ్మలోకంలో ఈ ఆనందాన్ని పొందేది సగుణోపాసకుడే. అతడు మరణానంతరము బ్రహ్మలోకం చేరి మహదైశ్వర్యాన్ని అనుభవిస్తాడు. అక్కడ కష్టాలు, దుఃఖాలు, రాగద్వేషాలు, అహంకార మమకారాలు ఏవీ ఉండవు. అంతా ఆనందమే. అది అనిర్వచనీయము అనుభవైకవేద్యము. అదే బ్రహ్మానందము.

నిర్గుణోపాసకుడికి దేహపాతం కలగగానే ఘటాకాశం మహదాకాశంలో లీనమైనట్లుగా సాధకుని జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. అతడు ప్రత్యేకంగా ఏ లోకానికి పోడు కాబట్టి అతడికి ఈ ఆనంద స్థితి ఉండదు. కాని దేహాభిమానం లేని జ్ఞాని తానే పరబ్రహ్మ స్వరూపము అని భావిస్తాడు కాబట్టి జీవించి ఉండగానే బ్రహ్మానందాన్ని ఈ లోకంలోనే పొందుతాడు.

ముక్తి నాలుగు విధాలు అని చెప్పింది ముక్తికోపనిషత్తు. ఈ ముక్తిలో తేడా ఉంది.

1. సాలోక్యము 2. సామీప్యము 3. సారూప్యము 4. సాయుజ్యము.

ఇది క్రమముక్తి. పరమపదం చేరటానికి అర్హత సంపాదించినవారంతా అర్చిరాది మార్గం గుండా అక్కడికి వెడతారు. వారిలో పూర్తిగా జ్ఞానంఉన్నవారికి అంటే **'నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని'** అని భావించిన వారికి మాత్రమే సాయుజ్యంసిద్ధిస్తుంది. అటువంటి వారు పరబ్రహ్మలో లీనమవుతారు. మిగిలినవారు అలా లీనం కావటానికి అవసరమయ్యే జ్ఞానంవచ్చేదాకా వేచిఉండి, జ్ఞానసముపార్జన చేసి, ఆ తరువాతనే సాయుజ్యం పొందుతారు.

దేవీభాగవతంలోని సప్తమ స్కందంలో పరాశక్తిని దర్శించి కృతార్థుడైన హిమవంతుడు, పరాశక్తిని అడుగుతాడు. "అమ్మా! పూర్తిగా విరాగి కానటువంటి మధ్యమపురుషుడుకి మోక్షం పొందటానికి తేలికయిన మార్గాన్ని వివరించవలసింది." అని ఆ మాటలు విన్న ఆ పరమేశ్వరి "ఓరాజా! మోక్షంపొందాలంటే జ్ఞానము, భక్తి, కర్మ అని మూడు మార్గాలున్నాయి. వీటిలో ఏమాత్రం కష్టంలేకుండా, అతితేలికగా ఉండేది భక్తిమార్గము. మానవులగుణభేదాల ననుసరించి భక్తి మూడు రకాలు. అవే తామస, రాజస, సాత్త్విక భక్తులు. వీటిలో తామస, రాజస భక్తిమార్గాలు పరాభక్తికి దోహదంచెయ్యవు. పరాభక్తిఅంటే నిత్యము నాయందు చిత్తము నిలిపి,

తైలధారలాగా నన్నే ధ్యానంచెయ్యటంచేత సార్షిరూప, సాలోక్య, సామీప్య సారూప్య, సాయుజ్య ముక్తులు పొందుతారు.

ఫలాపేక్ష లేకుండా, కేవలము సేవాభావంతో, తనకు దేవతకు భేదము లేదని భావించి, జితేంద్రియుడై ఆ దేవిని నిరంతము ధ్యానముచేసేవాడు సార్షిరూపముక్తి పొందుతాడు. అన్ని జీవుల యందు పరమేశ్వరి స్వరూపాన్ని దర్శించటం, తనయందున్న ప్రేమనే ఇతరులయందు కూడాచూపటం, ప్రాణులందరి లోను జీవచైతన్యమున్నది కాబట్టి జీవుడికి, దేవుడికి భేదములేదు అనిచెప్పటము, ఎవరియందు భేదబుద్ధి, ద్రోహబుద్ధి లేకుండా, ఛండాలునిమొదలు ఈశ్వరునిదాకా అందరినీ గౌరవించటం, దివ్యక్షేత్రాలు, పుణ్యక్షేత్రాలు దర్శించటం, మంత్రతంత్రాలు, శాస్త్రాల యందు భక్తి శ్రద్ధ కలిగిఉండటము, పరమేశ్వరి భక్తియందు ఓలలాడటము, ఆనందపారవశ్యంలో మునిగితేలటము, సర్వకాల సర్వావస్థల యందు పరాశక్తిని అర్చించటము, వ్రతాలు, దేవీఉత్సవాలు చెయ్యటము, దేహాభిమానము, అహంకారము లేకుండా దివ్యనామ సంకీర్తన చెయ్యటము పరాభక్తి అనబడుతుంది. కేవలము జ్ఞానిఅయినవాడికే ముక్తిలభిస్తుంది. ఇంకా దేనివల్లా ముక్తికలగదు. జ్ఞానిఅయినవాడు బ్రహ్మవిదుడు కాబట్టి బ్రహ్మమేఅవుతున్నాడు. ఓరాజా ! కంటికి కనిపించే వస్తువులకన్న, కనిపించని మాయకన్న నా రూపము వేరైనది. అతీతమైనది. వైరాగ్యముకలిగినప్పటికీ జ్ఞానము లేనివాడు మరణానంతరము ప్రళయంవరకు బ్రహ్మలోకంలోఉండి, తరువాత కర్మఫలాన్ననుసరించి పుణ్యవంతుల ఇళ్ళల్లో జన్మిస్తాడు. ఆతరువాత సాధనతో బ్రహ్మజ్ఞానము పొందుతాడు. కోట్లకొలది జన్మలెత్తితే గాని జ్ఞానముకలగదు. జ్ఞానమనేది ఒకేజన్మలో వచ్చేదికాదు. కాబట్టి సాధకుడు తనకు వీలయినంత వరకు జ్ఞానసముపార్జన చెయ్యాలి.

మానవజన్మ పొందటం దుర్లభం. అందులోను బ్రాహ్మణత్వము, వేదప్రాప్తి ఇంకాదుర్లభం. శమదమాది గుణసంపద, యోగసిద్ధి, ఉత్తమగురుప్రాప్తి ఇవన్నీ కడుదుర్లభము. ఇవన్నీఉన్నా పూర్వజన్మకృతంలేనిదే మోక్షేచ్ఛకలగదు. ఇవన్నీ ఉండి కూడా జ్ఞానసముపార్జనకు ప్రయత్నించని వాని జన్మ వ్యర్థము. పాలయందు నేయిలాగా ప్రతిమానవుడియందు జ్ఞానముంటుంది. దాన్ని బయటకుతియ్యాలి.

ఓ రాజా! ఎంత వైరాగ్యం ఉన్నా, ఇతర లక్షణాలున్నా, **"జ్ఞానంలేనిదేమోక్షం రాదు."** అని చెబుతుంది.

**భక్తిలో తత్పరత, తాదాత్మ్యత అనేవి తప్పనిసరి.**

పరమేశ్వరిని అర్చించిన వారికి ఐదు రకాల ముక్తి వస్తుంది.

1. సార్ష్టిరూపముక్తి : వీరు పరమేశ్వరి ఉండే పురానికి దగ్గరగా వేరొక పురం నిర్మించుకొని అక్కడ ఉంటారు.

2. సాలోక్యముక్తి : వీరు పరమేశ్వరి ఉండే పట్టణంలోనే వారి కర్మను బట్టి ఏదో ఒకచోట ఉంటారు. పరమేశ్వరి మణిద్వీపంలో ఉంటుంది. దానికి 25 ప్రాకారాలున్నాయి. సాలోక్యముక్తి పొందినవారు వారి కర్మానుసారము, వీటిలో ఏదో ఒక ప్రాకారంలో ఉండగలుగుతారు.

3. సామీప్యముక్తి : వీరు అమ్మవారికి అతిదగ్గరగా సేవకులుగా ఉంటారు.

4. సారూప్యముక్తి : వీరు అమ్మవారితో సమానమైన వేరే దేహం ధరించి భక్తుల కోరికలు తీరుస్తుంటారు. సృష్టి, స్థితి, లయాలు తప్ప పరమేశ్వరి చేసే పనులన్నీ చెయ్యగల శక్తిసంపన్నులు. మరణానంతరము బాబాలుగా, మహాత్ములుగా పూజించబడుతున్న వారంతా ఇలాంటివారే. ఈ నాలుగురకాలవారికి పునర్జన్మ ఉన్నది. పూర్తిగా జ్ఞానసముపార్జనజరిగేదాకా వీరికి మోక్షంరాదు.

దుర్ముఖి నామ సం॥ విజయదశమి మరునాడు అంటే 12-10-2016న మాతాకరుణామయిని దర్శించటం కోసం పెనుశిలకోన వెళ్ళాను. అక్కడ ఒకాయన వచ్చి "స్వామీ! నేను రమణ మహర్షి అభిమానిని. ఆయన సాహిత్యమన్నా, సిద్ధాంతాలన్నా నాకు చాలా ఇష్టం. ఆయన మహాజ్ఞాని. అయితే తలచుకున్నప్పుడల్లా స్వప్నంలో సాక్షాత్కరిస్తుంటారు. ఇప్పుడు నాది ఒక చిన్న అనుమానం. ఆయన మహాజ్ఞాని. మోక్షం పొంది ఉంటాడని నా నమ్మకం. అయితే మోక్షం పొందినవారు మనకి దర్శనమివ్వరు అని చదివాను. మరి ఇప్పుడు రమణమహర్షి మోక్షం పొందారా? లేదా? చెప్పండి" అన్నాడు.

ఇది చాలా ఇబ్బందికరమైన ప్రశ్న. 'ఆయన మహాజ్ఞాని. మోక్షం పొందాడు' అని నీ నమ్మకం. మళ్ళీ ఆయన నీకు దర్శనమిచ్చాడు. కాబట్టి మోక్షం పొందలేదని

అనుమానం. నువ్వే సందిగ్ధంలో ఉన్నావు. నన్ను అడుగుతున్నావు. నేను ఏ సమాధానం చెప్పినా, నీ నమ్మకం చెదిరి పోతుంది. నామీద విపరీతమైన కోసం వస్తుంది.

5. సాయుజ్యం : సహస్రదళ పద్మంలో పరమేశ్వరిని అర్చించిన వారు, చరాచర జగత్తంతా పరమేశ్వరస్వరూపమే అని త్రికరణశుద్ధిగా నమ్మినవారు, పరమేశ్వరియే జగత్తు, జగత్తే పరమేశ్వరి అని నమ్మినవారు, నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని ఈ జగత్తులో ఇంతకు మించినది ఏదీలేదు అని తెలుసుకున్నవారు, వీరందరూ సాయుజ్యం పొందుతారు. **వీరికిమాత్రమే మరుజన్మ లేదు.** పరమేశ్వరిని అర్చించిన వారికి ముక్తి ఎలా వస్తుందో చూద్దాం. **ముక్తి పొందాలంటే భగవంతుని యందు అత్యంత భక్తి, శ్రద్ధ, తాదాత్మ్యత, తత్పరత ఉండాలి.**

1. సార్షిరూపముక్తి : త్రికాలముల యందు అత్యంత భక్తి శ్రద్ధలతో పరమేశ్వరిని అర్చించేవారు సార్షిరూపముక్తి పొందుతారు.

2. సాలోక్యముక్తి : అమ్మవారు ఉండే మణిద్వీపానికి 25 ప్రాకారాలున్నాయి. ఆమెను వివిద రకాలుగా అర్చించేవారు వివిధ ప్రాకారలలో నివాసం ఏర్పరచుకుంటారు.

1. మూడుపూటలా పరమేశ్వరిని సహస్రనామాలతో అర్చించే వారు మణిద్వీపంలోని మొదటిప్రాకారంలో ఉంటారు.

2. మూడుపూటలా వేయిసంఖ్యకు తక్కువకాకుండా జపంచేసేవారు మణిద్వీపంలోని రెండవప్రాకారంలో ఉంటారు.

3. ప్రతినిత్యము సప్తశతిపారాయణ చేసేవారు మణిద్వీపంలోని మూడవ ప్రాకారంలో ఉంటారు.

4. ప్రతినిత్యము క్రమంతప్పకుండా వనదుర్గామహావిద్య పారాయణ చేసేవారు మణిద్వీపంలోని నాల్గవప్రాకారంలో ఉంటారు.

5. ప్రతిరోజు చక్రార్చనచేసేవారు మణిద్వీపంలోని ఐదవప్రాకారంలో ఉంటారు.

6. ప్రతిరోజూ పూజ, జపం చేసేవారు మణిద్వీపంలోని ఆరవప్రాకారంలో ఉంటారు.

7. ప్రతిరోజు త్రిసంధ్యలయందు అమ్మవారినిపూజిస్తూ, సప్తశతిపారాయణ చేసేవారు మణిద్వీపంలోని ఏడవప్రాకారంలో ఉంటారు.

8. ప్రతిరోజూ త్రిసంధ్యలయందు అమ్మవారిని పూజిస్తూ మహావిద్య పారాయణ చేసేవారు మణిద్వీపంలోని ఎనిమిదవప్రాకారంలో ఉంటారు.

9. ప్రతిరోజూ త్రిసంధ్యలయందు అమ్మవారిని పూజిస్తూ చక్రార్చన చేసేవారు మణిద్వీపంలోని తొమ్మిదవప్రాకారంలో ఉంటారు.

10. ప్రతిరోజు త్రిసంధ్యలయందు అమ్మవారి జపంచేస్తూ, సప్తశతిపారాయణ చేసేవారు మణిద్వీపంలోని పదవప్రాకారంలో ఉంటారు.

11. ప్రతిరోజూ త్రిసంధ్యలయందు అమ్మవారి జపంచేస్తూ మహావిద్య పారాయణచేసేవారు మణిద్వీపంలోని పదకొండవప్రాకారంలో ఉంటారు.

12. ప్రతిరోజు త్రిసంధ్యలయందు అమ్మవారి జపంచేస్తూ చక్రార్చన కూడా చేసేవారు మణిద్వీపంలోని పన్నెండవప్రాకారంలో ఉంటారు.

13. ప్రతిరోజూ త్రిసంధ్యలయందు లలితాసహస్రంతో అమ్మవారిని పూజిస్తూ చక్రార్చనచేసేవారు మణిద్వీపంలోని పదమూడవప్రాకారంలో ఉంటారు.

14. ప్రతిదినము లలితాసహస్రంతో అమ్మవారిని పూజిస్తూ చండీహోమం చేసేవారు మణిద్వీపంలోని పధ్నాల్గవప్రాకారంలో ఉంటారు.

15. ప్రతిరోజూ లలితాసహస్రంతో అమ్మవారిని అర్చిస్తూ మహావిద్య హోమం చేసేవారు మణిద్వీపంలోని పదిహేనవప్రాకారంలో ఉంటారు.

16. ప్రతిరోజూ త్రిసంధ్యలయందు అమ్మవారిని అర్చిస్తూ చండీహోమం చేసేవారు మణిద్వీపంలోని పదహారవప్రాకారంలో ఉంటారు.

17. ప్రతిరోజూ త్రిసంధ్యలయందు అమ్మవారిని అర్చిస్తూ మహావిద్యహోమం చేసేవారు మణిద్వీపంలోని పదిహేడవప్రాకారంలో ఉంటారు.

18. ప్రతిరోజూ చక్రార్చన, చండీహోమం చేసేవారు మణిద్వీపంలోని పద్దెనిమిదవప్రాకారంలో ఉంటారు.

19. ప్రతిరోజూ చక్రార్చన, మహావిద్యహోమం చేసేవారు మణిద్వీపంలోని పంథొనిమిదవప్రాకారంలో ఉంటారు.

20. ప్రతిరోజూ త్రిసంధ్యలయందు సహస్రనామపారాయణ చేస్తూ చండీ హోమం లేదా మహావిద్యహోమం చేసేవారు మణిద్వీపంలోని ఇరవైయవ ప్రాకారంలో ఉంటారు.

21. పైపనులు చేస్తూ వసంతనవరాత్రులు యధావిధిగా చేసేవారు మణిద్వీపంలోని ఇరవై ఒకటవ ప్రాకారంలో ఉంటారు.

22. పై పనులు చేస్తూ యథావిధిగా శరన్నవరాత్రులు నిర్వహించేవారు మణిద్వీపంలోని ఇరవైరెండవప్రాకారంలో ఉంటారు.

23. పై పనులు చేస్తూ వసంతనవరాత్రులు, శరన్నవరాత్రులు నిర్వహించేవారు మణిద్వీపంలోని ఇరవైమూడవప్రాకారంలో ఉంటారు.

24. ప్రతిరోజూ దేవిని అర్చనచేస్తూ, నవరాత్రులయందు, ఇతర పరవడి పర్వ దినాలయందు సునాసినీఅర్చన చేసేవారు మణిద్వీపంలోని ఇరవైనాల్గవ ప్రాకారంలో ఉంటారు.

25. ప్రతిరోజూ పరమేశ్వరిని అర్చిస్తూ హోమం, సువాసినీఅర్చన చేసి భోజనాలు పెట్టేవారు మణిద్వీపంలోని ఇరవైఐదవ ప్రాకారంలో ఉంటారు.

ఈ ప్రాకారాలలో భక్తులందరు దేవ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్యులరూపాలలో ఉంటారు.

3. సామీప్యముక్తి : ప్రతిరోజూ పరమేశ్వరిని అర్చిస్తూ, రెండు నవరాత్రుల యందు విధిగా హోమం, అర్చన, భోజనాలు, వస్త్రదానం, బాలాపూజ, సువాసినీ అర్చన చేసేవారు సామీప్యముక్తి పొందుతారు.

4. సారూప్యముక్తి : వేయి చండీహోమాలు, వేయి మహావిద్యహోమాలు, అతిరుద్రము హోమము, చేసి ప్రతిరోజూ పూజ, హోమాలు నిర్వహిస్తూ, సహస్రనామ పారాయణ చేస్తూ, సువాసినులకు అన్నదానం, వస్త్రదానం చేసేవారు సారూప్యముక్తి పొందుతారు.

5. జగత్తంతా పరమేశ్వరి స్వరూపమని నమ్మి, సర్వకాల సర్వావస్థల యందు ఆ పరమేశ్వరినే ధ్యానం చేస్తూ, నాకు ఆమెకూ తేడాలేదు. నేనే పరబ్రహ్మస్వరూపాన్ని, అని త్రికరణశుద్ధిగా నమ్మేజ్ఞానులు మాత్రమే సాయుజ్యం పొందుతారు.

మొత్తం మీద చూస్తే, సగుణోపాసకులు అర్చిరాదిమార్గం ద్వారా బ్రహ్మలోకం చేరి మహదైశ్వర్యాన్నిఅనుభవిస్తారు. వారికి సాయుజ్యంలేదు. వీరిలో ఎవరైనా జ్ఞానసముపార్జన చేస్తే, వారు కల్పాంతంవరకు మహదైశ్వర్యాన్ని అనుభవించి, కల్పాంతాన కార్యబ్రహ్మతోపాటుగా పరబ్రహ్మలోలీనమవుతారు. వారికి పునర్జన్మ లేదు. అలాగే నిర్గుణోపాసన చేసినవారు దేహపాతం జరగగానే పరబ్రహ్మలో లీనమవుతారు. వీరికి మరుజన్మ లేదు అంటున్నాడు వ్యాసభగవానుడు. మొత్తం మీద **జ్ఞానసముపార్జన చేసిన వారికి మాత్రమే పునర్జన్మ లేదు అంటున్నాడు వ్యాసభగవానుడు.**

ఈ సూత్రంలో **"అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్"** పునరావృత్తి లేదు పునరావృత్తి లేదు అని రెండుసార్లు చెబుతున్నారు. అంటే బ్రహ్మలోకం చేరినవారు తిరిగిజన్మించరు అంటూ **ఈ గ్రంథం ఇక్కడితో పూర్తయిందని చెబుతున్నాడు వ్యాసభగవానుడు.**

*హరితస గోత్రీకుడు, శ్రీమతి క్రోవి లక్ష్మీనరసమ్మ*

*శ్రీ పురుషోత్తమశర్మ గార్ల మనుమడు*

*శ్రీమతి సత్యపర్వతవర్ధనమ్మ, శ్రీకృష్ణమూర్తి గార్ల జ్యేష్ఠ పుత్రుడు*

*ప్రముఖ శ్రీవిద్యాప్రచారకుడు, చతుర్వేద భాష్యకారుడు*

*స్వామి పరమానందనాథులు వ్రాసిన*

*శ్రీవిద్యా బ్రహ్మసూత్ర భాష్యము సమాప్తము*

*సర్వేజనాః సుఖినోభవంతు*

*సమస్త సన్మంగళాని భవంతు*

*ఓం తత్సత్*